చుందురు. ఒక నూతన శక్తి వారిని ముందుకు నడిపించును. పూర్వమెన్నడు వారు ఊహించని భావపరంపరలు ఊపు చున్నట్లుండును. అప్పటి స్వభావము, వ్యవహారము, భాష, భావములు వేరుగానుండును. అదియు దినముల తరబడి ఉండుననదికాదు. మోహినీ వేషమున అమృతపానము చేయించి మాయమగును.

అట్టి అనుభవములు మనకు పరిచితములే. కాని అవి ఎప్పుడో అరుదుగా జన్మించి, అప్పుడే రాలిపోవుచుండును. దివ్యత్వములోని ఒక అణువు మనకు చేరినపుడే, అట్టి ఆనందానుభవముల మనము చూచుచుందుము. దివ్యత్వమునే మనము చేరగలిగిన, మన జీవితము ఎంత ఉన్నతితో తుల తూగునో మనము ఊహించుకొనవచ్చును.

అట్టి శాశ్వత ఉత్తేజమును, నిరంతర ఆనందమును పొందుటకు మానవుడు అర్హుడైనవాడని, అట్టి ఆనందధామమునకు ప్రయాణము సల్పుచున్నాడని శ్రీ అరవిందుని విశ్వాసము. కేవలము వ్యక్తులుమాత్రము కాదు, మానవకోటియే అట్టి పరిణామమును పొందనున్నదని వారి మతము. కాని వేల సంవత్సరములో, లక్షల సంవత్సరములో పట్టవచ్చును ఆ గమ్యస్థానమును చేరుటకు. చేరినప్పుడు, సుఖ దుఃఖములకు, పాపపుణ్యములకు అతీతుడు కాగలడు మానవుడు ప్రస్తుతము పశువునకు మానవునకు ఎంత వ్యత్యాసమున్నదో, వర్తమానమందలి మానవునకు భావి దివ్యమానవునకు అంత వ్యత్యాసముండును. దానినే వారు దివ్య జీవితము Life divine అని పిలిచిరి.

కాని యీ దివ్యత్వము కాల పరిణామముతో, పరిపక్వముతో రావలసినదేనా, మానవుని యత్నమును అవసరమా అని శ్రీ అరవిందు చర్చించిరి. మానవుని యత్నముచే ఆ దివ్యత్వపు అవతరణను త్వరితపరచగలమనియు, ఆ యత్నము ఆత్మసమర్పణ Self serrender ద్వారా యోగముద్వారా కావలసియున్నదనియు వారి మతము. అట్టి నిరంతర సాధనను నలుబదివత్సరములుగ కావించి, వారి శిష్యులకు ఆ మార్గమును చూపించి డిసెంబరు 4-5 తేదుల రాత్రి యీ జన్మమును విడనాడి, శాశ్వత ఆనందపు దివ్యజీవితములో చేరపోయిరి శ్రీ అరవిందు. శ్రీవారి యత్నము సఫలమగు గాక!



# 'అమ్మ'

భాషాప్రవీణ అరవెల్లి లక్ష్మీనారాయణాచార్య.

ఏమి వాంఛించిరో నన్ను నిన్నినాళ్లు
కడుపు లోనుంచి కడు ప్రేమ గడుపుకొనగ
గర్భవేదన సహియించి కడకు రక్ష
సేసి కన్నది అమ్మయై పసిపెడుటకె?

గడియ కనుమూయ గాటించు గాములకును
జుట్టుకొని వచ్చుసేగికి జోడునీక
కనుగలిగి రక్షసేసెడి కన్నతల్లి
కష్టపాటున కేమని గలదె ఫలము?

గడపె మూడేడుదినములు కిన్ననిసువు
చెంగటనే తల్లి, ముమ్మడి సేసలయ్యె
భర్తకున్ బంధుజనముల కార్తులరును
ఏమి గోరెనొ వాయకు యిట్లు సేత?

ఒత్తిగిల నొత్తునో యను నుత్తలమున
మెత్త మెత్తని పొత్తిళ్లి పొత్తుగలిపి,
హత్తి కౌగిట, ముద్దాడి హాయిపాడి
ఊయల న్నూపు మాతకు నుద్దిగలదె?

నిముస మెడయమ్యె నేనియా నిదురబోక
కింకసేసెడి నిసువిటు, గీటుదాటు
రాని భర్త్రాజ్ఞయటు తను బెంచుకొనగ
నోర్పునేర్పున వారల కోసర 'బుద్ధి'
తుమ్మలితు మాత్ప మూర్తికి దోయిలింతు.





జననం 31-10-1878 — మరణం 15-12-1950

భారత స్వాతంత్ర్య సమరయోధుడు, సమైక్య సంఘటన శిల్పి,
ఇండియా ఉపప్రధాని, దివికేగిన సర్దార్ వల్లభాయి పటేల్.

* * *

## ఆంధ్ర మహిళా సభలో సంతాప సభ

ది 16-12-1950 న ఆంధ్ర మహిళాసభలో అమరజీవి సర్దార్ వల్లభాయి పటేలు స్మృతిని గూర్చి, శ్రీ బులుసు సాంబమూర్తిగారి అధ్యక్షతక్రింద సంతాప సభజరిగెను. న్యాయమూర్తి చింతగుంట రాఘవరావుగారు, శ్రీ మోహన లాల్ మెహతాగారు, శ్రీమతి కామేశ్వరమ్మగారు, తది తరులు, సర్దార్ పటేల్ యొక్క ప్రతిభా విశేషములను, దేశక్షేమమునకై వారొనరించిన స్వార్థత్యాగము, ఘనకార్య ములను, స్మృతికి తెచ్చిరి. [illegible] శ్రీమతి [illegible] సర్దార్ గారు మహిళా సభకు [illegible] సందర్భాన్ని స్మరించి, ఆయన స్మృతిని గూర్చి సంతాపమును, ఆయన కుటుంబమునకు సానుభూతిని తెల్పుచూ తీర్మాన మును ప్రతిపాదించగా సభికులు నిశ్శబ్దముగా నిలువబడి ఆమోదించిరి. జనగణమన గానములతో సభ ముగిసెను.

—వా. లక్ష్మి.

# మన సర్దార్ జీ

శ్రీమతి ఆప్పుల జయప్రదా దేవి

సర్దార్ అనే పదంలోనే కన్పిస్తోంది ఆయన ప్రతిభ. ప్రపంచంలో ఎందరెందరో పుడుతూ ఉంటారు. కాని అందరూ ప్రజానీకానికి ఉపకారం చేయలేరు. కొందరైనా కారణజన్ములు ఉద్భవిస్తారు. లేకపోతే మన రాజకీయాలూ, సమాజాలూ న్యాయ బద్ధంగానూ, నియమ బద్ధంగానూ నడవలేవు. వారి అస్తమయం ప్రపంచానికే తీరని నష్టంగా కన్పిస్తుంది. వారు చూపించే మార్గాలు ప్రజోపయోగాలుగా ఉంటాయి. ఈ ప్రపంచంలో ఎప్పటికప్పుడు కారణజీవులు ఉద్భవించి, మార్గదర్శకులై మానవ కర్తవ్యాన్ని సూచిస్తూ ఉంటారు. అట్టివారిలో మన సర్దార్ జీ ఒకరు.

ఈయన రాజకీయంగా చేసినసేవ మరువరానిది. భారతదేశ స్వాతంత్ర్యము కొరకు తన జీవితాన్నే అంకితం చేశారు. తన చిన్నతనంలోనుండే ఎంతో ధైర్యంగాతన కర్తవ్యాన్ని నిర్వర్తిస్తూ ఉండేవారు. ఎటువంటి జటిల సమస్యలైనా ఎదుర్కోటానికి వెనుకంజలు వేసేవారు కారు. చిన్నతనంలోనే ఆయనకు ఒక గడ్డ లేచిందట. అక్కడ ఉండే నాటువైద్యుడు ఇనుపగుండును కాల్చి అంటించితేగాని నయంకాదని చెప్పాడట. తీరా అలాచెయ్యవలసి వచ్చేటప్పటికి పసివాడైన వల్లభాయిని చూచి అంటించలేక తటపటాయిస్తున్నాడట. కాని వల్లభాయి "అయ్యో గుండు చల్లబడిపోతుంది" అని తానేస్వయంగా సందేహిస్తున్న వైద్యుని చేతిలోనుండి గుండుతీసుకొని అంటించుకున్నాడట. అబ్బ! ఎంత సాహసం! అంత పసితనంలో !!!

ఇదేకాదు; ఓమాటుస్కూల్లో కూడా ఇలాగే జరిగింది. సంస్కృత పక్షపాతి అయిన గుజరాతీ పండితుడు వల్లభాయిని "నీవు సంస్కృతం చదువక గుజరాతీ ఎందుకు చదువుచున్నావు?" అని అడిగాడట. "అందరూ సంస్కృతమే చదివితే మీరెవరిచే గుజరాతీ చదివిస్తారు మాష్టారూ" అని చతురతగా జవాబిచ్చాడట. దానికి పండితుడు కోపగించుకుని ఏదో ఒకరకంగా సర్దార్‌ని శిక్షించాలని ఎక్కాలు వేసుకురమ్మన్నాడట. స్కూల్‌ఫైనల్ విద్యార్థి అయిన వల్లభాయి ఎంతో అవమానంగా భావించి ఎక్కాలు వేసుకురాలేదట. మరనాడు క్లాసులోనికి రాగానే పండితుడు "పాడేలాయే" అని అడిగాడట. పాడే అంటే గుజరాతీలో ఎక్కములని అర్థం. దానికి రెండవ అర్థం మాడలు అని కూడా ఉంది. దానికి "సమ్మంధా! తినుకొనివచ్చాను, ఒకటి వెనుకకు వచ్చింది, దాని వెనకా అన్నీ పారిపోయాయండీ" అని సమాధాన మిచ్చాడట. పండితుడు తెల్లపోయి ఏమీ చేయ్యలేక ప్రధానోపాధ్యాయుని వద్దకు రిపోర్టువ్రాసి పంపించాడట. ఆయన దగ్గ కూడా వల్లభాయి "అర్థంలేని, నిరుపయోగమైన శిక్షనడు నివ్వటం మూలంగా ఇలాచెప్పవలసి వచ్చింద"ని సమాధాన మిచ్చాడట. ఆ ప్రధానోపాధ్యాయుడు ఆశ్చర్యంతో "ఇలాంటి పిల్లవాడిని నే నెక్కడా చూడలేద"న్నాడట. దీని మూలంగా తనకు మంచిది కాదని తోచిన దానిని నిరాకరించుటకు ఏమాత్రం సందేహించడని తెలుస్తోంది.

ఇదే విధంగా చివరివరకు తన జీవితయాత్రను సాగించారు సర్దార్ పటేల్. పట్టుదలతో దేశక్షేమం కోరకుడు 600 స్వదేశ సంస్థానాలను ప్రభుత్వంలో కలపి ఒడుదుడు కులు లేకుండా ఐకమత్యం ఏర్పరచిన ప్రతిభావంతుడు. టు అవసాన సమయంవరకు తన కర్తవ్యాన్ని అతినిపుణతతో కల నెరవేర్చిన ప్రజ్ఞావంతుడు. ఈయన తన కర్తవ్యాన్ని నెరవేల వేర్చుటంలో ఎటువంటి ఆపదను సయితము సహించేవాడు. ని న్యాయవాదిగా పనిచేసేటప్పుడు కోర్టులో వాదిస్తున్న త సమయంలో భార్య మరణవార్తతో టెలిగ్రాంవస్తే చూచి ం కూడా చలించక తన పనిపూర్తి అయ్యేవరకు తొణక క లుండా కేసుపూర్తి చేసాడట.

స్వయంగా ఆయనే బార్డోలీ కిసాను ఉద్యమంలో "నాకు యుద్ధము, విప్లవము చాలాఇష్టం. అందుకు జంకని వారే కార్యక్షేత్రంలోకి రావాలి" అని అన్నారు. ఒకమారు గాంధీ మహాత్ముడు కూడా "సర్దార్, ఒక నిజమైన యోధుడు. మంచుతో కప్పబడిన అగ్ని పర్వతంలాంటివాడు" అని అన్నారు. అటువంటి మహనీయుని అస్తమయం మనకు తీరనిలోటు. మన భారతదేశం ఎదుర్కొనుచున్న ఒక్కొక్క జటిల సమస్యను అవలీలగా తేల్చగలిగిన ఆమహా మేధావి మృతి యావద్భారత దేశానికి భరింపలేని బాధ. ఆ మహానాయకుడు మన ఎదుట లేకున్నను ఆ మహనీయుని ఉపదేశాల ననుసరించి మన భారతీయులు తమ మాతృ భూమిని రక్షించుకోగలరని కాంక్షిస్తున్నాను.

ఓం. శ్శాంతి శ్శాంతిః.



# ప్రస్తుత పరిస్థితులు

※ శ్రీమతి అచ్యుతుని గిరిజ ※

**ఇంటా బయటా :**

నవంబరు 26వ తేదీన చెన్నపురి ఆంధ్ర మహాసభవారి యాజమాన్యాన 'విశాల ఆంధ్ర దినము' జరిగింది. ఆ సమావేశములో ఆంధ్ర రాష్ట్రమేకాక త్వరలోనే తెలుగు వారికి విశాలాంధ్ర రాష్ట్రమే ఏర్పడగలదని దానికి తగిన ప్రయత్నాలు జరుగుతున్నవని విశదపరచారు. ఏర్పడబోయే విశాల ఆంధ్ర రాష్ట్రానికి కాబోయే రాజధానిని గురించి కొంత సంవాదము మామూలు ఫక్కీలోనే వినోద ధోరణిలో నడిచిందనుకోండి. ఐనా రాష్ట్రం అందులోను విశాల రాష్ట్రం సిద్ధించబోతున్నదంటే చాలా తృప్తే కలిగింది. కాని శ్రీ సాంబమూర్తిగారు యిట్లా అన్నారు— భాషా ప్రయుక్త రాష్ట్రాలు వచ్చే ఎన్నికలప్పుడుకాని తగిన రూపుపొంది వాద వివాద స్థితిదాటి మనకు సాక్షాత్కరించవు. ప్రస్తుత పరిస్థితులను పట్టి అతిత్వరలో ఎన్నికలు ముగించటానికి ప్రభుత్వానికి సాధ్యపడకపోవచ్చు. ప్రభుత్వం రోజు రోజుకు ఎన్నెన్నో కొత్త విషమ సమస్యలను ఎదుర్కొనవలసి వస్తున్నది. తీవ్ర సమస్యా పరిష్కారంలో నిమగ్నులు కావలసి వుండటాన ప్రభుత్వం ఇప్పట్లో ఎన్నికలు జరిపించకపోవచ్చు. దానితోపాటు మన రాష్ట్ర నిర్మాణంకూడ వెనక్కు జరిగితే ఆశ్చర్యపడ నవసరముగాని ఆవేదనపడ నవసరముగాని లేదు — ఆహార సమస్య, కాందిశీకుల సమస్య, ఆర్థిక సమస్య, కాశ్మీర్ సమస్య మొదలయిన పాతవే యింకా అంతుపట్టలేదు. ఎప్పటికప్పుడు కొత్త రూపంతో, కొత్త పోకడతో సాక్షాత్కరిస్తున్నయ్.

ఇవి ఇట్లా వుండగా ఇరుగుపొరుగువారి బెడదలు కూడ వచ్చి చుట్టుకుంటున్నయ్. నేపాల్, టిబెట్టు, చైనాలు, కొంత అలజడిచేసి భారత ప్రభుత్వ దృష్టిని తమ వైపు తిప్పుకుంటున్నయ్. మాకేపూచీ వద్దనుకొన్నా వూరుకో నివ్వటంలేదు. ఇంట్లో పరిస్థితులు, యిరుగు పొరుగు పరిస్థితులు యిట్లా వుండగా బయట మహాకల్లోలంగా వుంటున్నది. నవంబరు 30వ తేదీ విడుదలయిన తాజా వార్తలను పట్టి కొరియాలో అమెరికా ఏటంబాంబు వుపయోగించటానికి ఆలోచనలు జరుగుతున్నవని తెలుస్తున్నది. ఈవార్త విని బ్రిటిష్‌వారు ఆశ్చర్యపడటమేకాక సంతాపపడుతున్నారు. అమెరికాతో చేతులు కలిపి నడిచినందుకు వాపోతున్నారు మా గతి ఏమి కాబోతుందోనని కొరియాకు దగ్గరలో వుండే ఫిలిప్పీనులు విరగ తొక్కుకుంటున్నారు. ఐక్యరాజ్య సమితి యింతకాలం కొరియా యుద్ధాన్ని ముగింపుకు తేలేకపోయింది. నయానగాని, భయానగాని శాంతి సమకూర్చలేక పోయింది. చివరకు ఏటంబాంబులతో ప్రజానాశనం చేయటం మా సంకల్పము కాదన్న అమెరికావారు ఆ ఆయుధమే పట్టుకు తయారయినారు. "బాంబు చేయించే హక్కు అధికారం ప్రెసిడెంటు ట్రూమన్ చేతిలో వున్నవి కాబట్టి గంటలమీద రాగల భయంలేదు. కొన్ని రోజుల వ్యవధి వుంటుంది. ఈలోపల పరిస్థితులు మారి శాంత వాతావరణం ఏర్పడవచ్చున"ని ఐక్యరాజ్యసమితి రాజకీయవేత్తలు, బ్రిటిష్‌వారు కొంత వూరట చెందుతున్నారు. బాంబులు వేసే ఆలోచనలు జరుగుతున్నవని ట్రూమన్ పత్రికా విలేఖరుల సమావేశములో చెప్తుండగా ఒక విలేఖరి "మెకార్థరు మీ ఆజ్ఞ పొందకుండానే బాంబు వుపయోగిస్తాడా" అని అడిగాడు. "అబ్బే, ఛా అట్లా వీలులేదు" అని ట్రూమన్ అన్నాడనుకోండి. కాని ట్రూమన్ ప్రకటనచేత ఎన్నో అపోహాలు కలిగినందువల్ల పరిస్థితులను వివరిస్తూ మళ్లీ అధికారులు ఇంకో ప్రకటన చేయవలసివచ్చింది. అది కేవలం మజ్జిగలో చల్లపోసినట్లుగా వున్నది.

ఏటంబాంబు చైనాలోపడితే ఆ మర్నాడు లండన్ పారిస్‌లకు తగిలేదెబ్బను గురించిన భయం ఇంగ్లండు, ఫ్రాన్సులకు బాగా పట్టుకున్నది. అమెరికా బాంబు ప్రయోగించే పక్షంలో బ్రిటన్ అమెరికాలో తెగతెంపులు చేసుకోవాలని కూడ నిశ్చయించుకున్నారు. బ్రిటిష్, ఫ్రెంచి ప్రధాన




## నవమ గుచ్ఛము

౧

"కంచిలో నాయనాపిల్ల, పుదుక్కోటలో దక్షిణామూర్తిపిళ్లె, తిరుచునాపల్లి గోవిందస్వామిపిల్ల, అలహానంబి, కోయంబత్తూరు తాయి, బెంగుళూరు నాగరత్నం, వీణధనం కంచి ధనకోటి వీరందరు కొద్ది సంవత్సరాల క్రితంవరకూ సర్వదక్షిణా పథమూ రసహాహాసులతో నింపిన మహాగాయకులు. ఆంధ్రంలో సంగమేశ్వరుడు, వడ్డాది ఆదిభట్ల నారాయణదాసు" అని శ్రీమతి తిరుచునాపల్లిలో విఘ్నేశ్వరుని కొండ ఎక్కుతూ పద్మావతికి చెప్పింది.

"ఓహో ఆనాటివారి అదృష్టం అక్కా! ఈనాడు అరియకుడి, శెంబంగుడి, మధురమణి, పాపా వెంకట్రామయ్య, బాలసుబ్రహ్మణ్య మొదలయిన వారున్నా ఉన్నారు. ద్వారంవారు జగత్ప్రాజ్ఞులు."

"మనం ఎప్పుడూ ఏవిద్య విషయంలోనన్నా విద్యార్థులుగా ఉండాలి చెల్లీ! ఈవిశ్వ రహస్యము, మన నిత్య విద్యార్థిత్వంలో కొంచెం కొంచెంగా, తెరవీడుతూ దర్శనమిస్తుంది. ఆ ప్రత్యక్షమే మనకు ఆనందం సమకూరుస్తూ ఉంటుంది.

"ఆనందమేనా ఈ ప్రపంచానికి కావలసిన వస్తువు అక్కా?"

"అవును! సేవ ఇతరులకు ఆనందం సమకూర్చడానికి, జ్ఞానం ఆనందం కోసం. సర్వకృషీ ఆనందం కోసం. కళలు ఆనందం కోసం!"

"వైద్యమూ, వ్యవసాయమూ, చేపలు పట్టడమూ ఆనందం కోసమా ఏమిటి అక్కా!"

"ఆ! ఇతరులు జబ్బుతో బాధపడుతూ ఉంటే, వైద్యంవల్ల జబ్బుకుదిర్చి ఆనందం సమకూరుస్తాము కదా! వ్యవసాయం తిండిగింజలు వస్త్రాలవల్ల ఆకలితీరితే ఆనందం. అందుకే చేపలు పట్టడమూనూ!"

ఈలా అనేక విషయాలు చర్చించుకుంటూ పద్మావతీ, శ్రీమతీ తీర్థయాత్ర సాగిస్తూన్నారు. అనేక మానవ ప్రకృతులు ఈ యాత్రలో పద్మావతికి శ్రీమతి బోధవల్లనైతేనేమి, తాను గాఢంగా పరిశీలించడంవల్లనైతేనేమి అవగతం కాసాగినవి.

మనుష్యుడు తనవులోనైన శక్తి, సంపదా, ఇతరులలో ఉంటే చూచి ఓర్వలేడు. ఆ ఓర్వలేనితనం జగత్సంక్షోభానికి కారణం అవుతుంది. దక్షిణాది సంగీతనిధులు కర్ణాటవాణిని అద్భుతంగా కాపాడుకుంటూవస్తే, నీరసులై పరిశ్రమచేయక తపస్సు చెడగొట్టుకొని తెలుగువారు అరవడం ఎందుకు? ద్రావిడకీ కషగం అని బ్రాహ్మణద్వేషంతో దక్షిణాది బ్రాహ్మణేతరులు అరవదేశానికి స్వాతంత్ర్యం కావాలనడానికి కారణమూ ఈ ఓర్వలేనితనమే!

శ్రీమతి :—'కషగం'-'సంఘం' అన్న సంస్కృత మాటకు తద్భవం 'వేశం'. 'భాష' అన్న పదానికి తద్భవం. ఇంకిమణి మేఖలై, శిలప్పాధికారం సంస్కృతసమాలే. వారి తొలికావ్యంలో 'కాప్యం' అన్నమాట 'కావ్యం' అన్నమాటకు తద్భవం.

పద్మావతి :—మనకు ఏదిమంచో ఏదిచెడ్డో ఎల్లా తెలుస్తుంది అక్కా?

శ్రీమతి :—మన జీవితంలోని సామ్యశక్తే అది నిర్ణయించగలదు.

అన్ని క్షేత్రాలలోని గుళ్లూగోపురాలు చూపిస్తూ, వానిలోని శిల్పసౌందర్యం వర్ణిస్తూ, మధుర రామేశ్వరమూ మొదలయిన క్షేత్రయాత్ర సంపూర్ణం కావించి తిరువనంతపురం చేరుకున్నారు మన ఇద్దరుయాత్రికులు.

తిరువనంతపురంలో అనంత పద్మనాభుణ్ణి దర్శనం చేసుకుని, కన్యాకుమారి అగ్రం చేరుకున్నారు వారు.

౨

కన్యాకుమారి అగ్రం దగ్గర ఎదుట ఆకాశంలోనికి పోయిపోయి విశ్వానితో లీనమైపోయిన మహాసముద్ర గంభీర భావం దర్శించి పులకరించి పోయినారు మన యాత్రికులిద్దరూ!

" ఈ సముద్రము కలియు
ఏ విశ్వరూపాన!
ఈ జీవితము మెలయు
ఏ దివ్య భావాన
నిత్యయాత్రాంకిత ప్ర
నీతమవు ఈతరగ "

అంటూ తీయగా పాడుకొన్నది శ్రీమతి.

" ఈ దృశ్యానికి, ఈ పాటకూ సంబంధం ఏమిటి అక్కా?"

" ఓసి వెర్రిదానా! ఒక పవిత్రదృశ్యం సంఘాతమై ఒక మహాభావం ఉదయిస్తుంది. అది కావ్యరూపంగా వచ్చినప్పుడు ఆ దృశ్యానికీ, ఆ కావ్యానికీ ప్రత్యక్ష సంబంధమేమీ కనబడదు నిజమే! కాని ప్రతి కావ్యానికీ విశ్వమే హంగవుతుంది."

ఆ పాట ఎంత అర్థమైనదో, ఆ మాటలూ అంతే అర్థమయ్యాయి పద్మావతికి. అయినా పద్మావతి శ్రీమతి ఆలోచనా పథం కొంచెం కొంచెం అవగతం చేసుకొంటున్నకొలదీ ఆమెకూ ఏవేవో నూతనమైన పొలిమేరలు గోచరిస్తున్నాయి. మానవజీవిత వైచిత్రి సర్వశ్రుతియుక్తమై ఆమెకు దర్శన మిస్తున్నది. సామ్యతలు ఉండవు. ఒక్కొక్కప్పుడు తాళం తప్పుతుంది. గమకము మాయమౌతుంది.

ఈ నిత్య యాత్రలో మనష్యుడొకక్కప్పుడు అటునిటు పడిపోతాడు. జీవితం దుర్భగమౌతుంది. కాలం అప్పుడు చాకంగా ప్రసరిస్తుంది. సంతోష సమయాలు ధృతంగా ప్రవహించి పోతాయి. అందుకనే నా పనాలలోని విరహబాధ విలంబిత మౌతుంది? కవులు బాధాపూర్ణమైన క్షణాలను యుగాలుగా వర్ణిస్తారు. ఆనంద స్పందితమైన సంవత్సరాలు క్షణికాలై గడచిపోయినాయంటారు.

కాల గర్భంలోనుండి ఉద్భవించి కాలాతీతమౌతుంది రాగం. మానవ కాంక్షారూపమైన రాగమే సంగీతంలో రాగమైనది. కాబట్టే అనంతమైన సంపూర్ణ, ఔడవ, షాడవరాగాలు అనురాగ, కరుణ, క్రోధాది రాగాల రూపాలు కాబోలు. ఆమెకు తల తిరిగినది. ఆమెలో నుండి బరువైన నిట్టూర్పు వెలువడింది.

ఆ నిట్టూర్పు విని శ్రీమతి ఆమెవైపు తిరిగింది. " ఎందుకు తల్లీ నీకు నిట్టూర్పు?"

"ఎందుకేమిటి ? ఈ సముద్రం ఎంతవరకు ? ఏ తీరాలు చేరుస్తుంది ? ఆ తీరాల భూమి ఎంతవరకు, ఏ సముద్రాల వరకూ ? ఆ సముద్రాలు ?"

"అలాగే ఆలోచనలు సముద్రంలోని కెరటాలవుతాయి. స్వప్నాలు లోతులు !"

"ఎంత లోతులు ?"

"మనం మునగలేనివి !"

"అప్పుడా లోతులకు సార్థకత ?"

"తెలుసుకో గలిగిన వారికి ?"

"ప్రతి విషయమూ సముద్రమేనా ?"

"కాక !"

"ఆకాశమంత అనంతమా సముద్రంలోతు ?"

"ఆ లోతూ అనంతంలోనే లీనమవుతుంది !"

"అంటే ?"

"పసిఫిక్కు మహాసముద్రం ఆరుమైళ్లే లోతు అనుకో ! అక్కడ భూమి. ఆ భూమి తవ్వుకుంటూపోతే, కొన్ని వేల మైళ్లావతల, ఆవలిప్రక్క సముద్రం. ఆ సముద్రం పైఅంచు ఆకాశంలో !"

ఇద్దరూ మౌనం వహించారు.

అలా వారు రెండురోజు లాగినారు.

మూడవదినం ఉదయం ఆ అగ్రసముద్రంలో స్నానం చేసి, కన్యాకుమారి గుడిలో పూజలుచేసి, వచ్చి భోజనానికి ఇంకా రెండుగంటలు వ్యవధి ఉండడంవల్ల సముద్రం ఒడ్డునే వచ్చికూర్చున్నారు. ఇంకా యాత్రికులు స్నానాలు చేస్తూనే ఉన్నారు. కుడివేపుగా సూర్యుడు ఆకాశంలోనికి చొచ్చుకు పైకి సాగిపోతున్నాడు. చల్లనిగాలి వీస్తూఉంది. ఆకాశంలో మేఘాలు లేవు. సముద్రం కెరటాలు ఎక్కడ ఉద్భవించాయో, వస్తూ ఒడ్డున విరుగబోయే రేకలుతాల్చి వయ్యారంగా తలలువంచి నురుగులతో బుడగలతో విరుగు తున్నాయి. ఆ విరుగుడులోనుండి చిన్న తరంగాలు ఉద్భవించి ఒడ్డుకు గుసగుసలతో నివేదిస్తున్నవి.

3

అప్పుడు పద్మావతి సముద్రంహోరుకు తన కంఠం శ్రుతి కలిపి, తోడి రాగంలో, ఆది తాళంలో

"కోటి నదులు ధనుష్కోటిలో నుండగ
ఏటికి తిరిగెదవే ? ఓ మనసా ? ॥కోటి॥

సూటిగ శ్యామ సుందరమూర్తిని
నాటిమాటికి జూచుమహారాజులకు,
॥కోటి॥...

గంగనూ పుష్కరంబునను జనియించెను
రంగనిగని కావేరి రాజిల్లెను
పొంగుచు శ్రీరఘునాథుని, ప్రేమతో
బొగడు త్యాగరాజు మనవి వినవే! ॥కోటి॥"

అన్న త్యాగరాజకీర్తన పాడింది.

"కోటినదులు అనగానే గంగా, యమునా, గోదావరీ, కృష్ణా, మహానది, సింధు, నర్మదా, తపతీ, కావేరీ మొదలయిన భారతీయ నదీనదాలు, వివిధ దేశాలలో మిస్సోరీ, అమెజాన్, నీల్, వోల్గా, ఒరోనికో, జాంబెసీ, వోల్గాది నదులు అన్నీ వివిధరాగాలు పాడుకుంటూ శ్రీరామచంద్రుని పాదాల కడకు ప్రవహించి వస్తూన్నట్లు ప్రత్యక్షమైనది శ్రీమతికి. శ్రీమతి తన్మయురాలయినది.

తాము దర్శించిన ధనుష్కోటేనా రామాయణకాలపు ధనుష్కోటి ! అక్కడ నుండేనా శ్రీరామప్రభువు లంకకు వారధి నిర్మించినది ? ఈనాటి సింహళమేనా ఆనాటి లంక ?

"ఈ కన్యాకుమారీ అగ్రమూ ఈ సముద్రమూ చూచేనా ఆ కీర్తన జ్ఞాపకం వచ్చింది నీకు గీతా దేవీ !"

"అదేమిటక్కా నన్ను అలా పిలుస్తున్నావు ?"

"నిజంగా నువ్వు గీతాదేవివే ! ఈ పాట నాచిన్ననాడు నాయనాపిళ్లె పరమ గాంధర్వస్వరూపంగా పాడినాడు."

"నాయనాపిళ్లె అనే పేరేమిటి ?"

"అసలుపేరు సుబ్రహ్మణ్యపిళ్లె. నలుగురు అక్కచెల్లెళ్లు ధనకోటి సోదరీమణులు. ధనకోటి, కామాక్షమ్మ, అమ్మాపొన్నమ్మ, చినకుట్టెమ్మ. కామాక్షమ్మ కుమారుడు నాయనాపిళ్లె. పేరు సుబ్రహ్మణ్యం అయినా తల్లులు నలుగురూ 'నాయనా'! అని పిలవడంచేత 'నాయనాపిళ్లె' అయినాడు."

"పిల్లలు గొల్లవారా?"

"ఈ పిల్లలు భోగంవారు. అందులో పేరు తెలుసు భోగంవారు. ధనకోటి మహోన్నత సంగీత విద్వాంసురాలు. ఆకుటుంబంలో ఈయన పుట్టాడు."

"చిన్న తనాన్నుంచీ సంగీతంలో లయమైపోయి ఉంటారు"

"ప్చ్! కట్టిమాట. ముప్పై ఏళ్లవరకు రౌడీ! అల్లారు ముద్దుగా పెరిగిన బాలుడు! ఇంకేమి ఏకృషీ పట్టు బడలేదు. రౌడీల సావాసం. సాయంకాకసరత్తూ, ఓ జట్కాబండీ ఉండేది. ఆయనకు ముప్పై ఏళ్లు వచ్చినప్పుడు, కంచికి ఒక మహాయోగి విచ్చేసినాడు. ఆయన 'కైలాస నాధాలయం' లోవిడిది చేశారు. ఆయన తేజస్సు చూచి నగరమంతా ఆయన్ను దర్శించి పునీతులయ్యారు. ధనకోటి చెల్లెళ్లతో ఆయనదర్శనం చేసింది. తన చెల్లెలికుమారుని సంగతి చెప్పుకొన్నది. "రేపు ఉదయం నేను రమ్మన్నానని చెప్పి ఆ యువకుని తీసుకొనిరండి" అని స్వామిజీ ఆదేశించారు.

ధనకోటి :—వాడు ఎంత బ్రతిమాలినా రాడండీ!

స్వామి :—నేను రమ్మన్నాను అంటే వెంటనేవస్తాడు.

నిజంగా స్వామిజీ చెప్పినట్లే అన్నీ జరిగినవి. నాయనా పిళ్ల స్వామిజీ పాదాలకడవాలినాడు.

౪

స్వామివారు ఏదో మంత్రముపదేశించి తామేస్వయంగా ఆయువకునకు సంగీతం చెప్పినారు. ఎవరీస్వామి? నారదుని అపరావతారమా అని ధనకోటి వారూ అనుకున్నారు.

ఒకరోజున ఆస్వామి మాయమైపోయినాడు. నాయనా పిళ్ల దుఃఖం ఏడు సముద్రాలైనది. గురువుగారిని స్మరిస్తూ త్యాగరాజు అపరావతారం, ఆనాడు భారతీయ గాయకులలో నాయకమణి అయినారు. మహాభక్తుడు ధనానికి ఆశించలేదు, నిత్య నాదబిందు కళారాధనమే!

"ఆయన తన నలభైరెండవ ఏట గానతేజస్సులో లీనమైపోయినారు చెల్లీ! ఆయన శిష్యుడే చిదంబరపిళ్లగారు. నా చిన్నతనంలో కాకినాడ గానసభలలో ఆయన కచ్చేరి విన్నప్పుడు నా ఆత్మ నన్నువీడి ఆయన పాదాలకడ వాలింది."

"అక్కా— ఆయన రికార్డులు ఏమీ కనబడవే?"

"ఆయన రికార్డులే ఇవ్వలేదు. లక్షలు ఇస్తామన్నారు ఒప్పుకోలేదు. ఇంతకన్న ఛాందసుడు తుమరాడ సంగమేశ్వర శాస్త్రిగారు, ఈ యుగంలో వీణా పరమేశ్వరుడు. ధనాన్ని రోసి, తన జీవితం నాదబిందుకళారాధనకు అర్పించినాడు. ఇద్దరూ బీదవారుగానే పోయినారు."

"ఎంత చక్కనికథ చెప్పావు అక్కా?"

"ఇది కథకాదు చెల్లీ! చరిత్ర!"

"ఆ చరిత్రలో నువ్వూ భాగస్వామివే. ఎంత అదృష్టవంతురాలవు!"

"తల్లీ! నీజీవితం సంగీతాంకితం చేయి. సుబ్బలక్ష్మి పట్టమ్మాళులను మరపింపచేయి. ఇదే నీతపస్సు. నీభర్త ఉత్తముడు. అతని హృదయం నలిపివేయకు. భగవంతుని పూజా పుష్పంలా చూచుకో!"

ఈ మాటలు అంటూఉంటే అక్కడకు నరసింహమూర్తి మేష్టారు నడిచి వచ్చారు.



సంస్కృతి అంతర్వాహినులు

# పారశీక సంస్కృతి

డాక్టరు వారణాశి యశోదాదేవి

పారశీక సంస్కృతి బహుప్రాచీనమైనది; ప్రాచ్య పాశ్చాత్య సంస్కృతుల పరిణామమున కనేక విధముల తోడ్పడినది. భారతీయ పారశీక సంస్కృతుల సమ్మిళిత ఛాయలు అనేక విషయములలో నేటికిని గానవగుచున్నవి.

పర్షియా యనుపేరు పర్సిస్ అనుజిల్లానుండి వచ్చినది. ఇరాను, పారశీకము, పర్షియాను నామాంతరములు. పర్షియా, ఇండియాలు భౌగోళికముగకూడ సన్నిహిత దేశములే. హిందూకుష్, సులేమాను పర్వతము లీరెండు దేశములను విభజించుచున్నవి. క్రీ. పూ. 9 వ శ॥ ప్రాంతమున పర్షియాలో ఆర్యులు నాగరకపద్ధతుల వృద్ధి చేయుచుండిరి. ఇరేనియనుల జండ్ అవెస్టాయను ప్రాచీనగ్రంథము భారతీయుల ఋగ్వేదమును బోలియుండును. హిందూదేశమను పేరు పారశీకాదులు సింధునదిని జూచి పెట్టినదే.

పారశీక రాజ్యము ప్రాచీన నాగరికస్థానములందును, ఆర్యుల నూతన సామ్రాజ్యములలో మొదటిది. అప్పటి ప్రపంచ సామ్రాజ్యములలో గొప్పది. ఆసియామైనరు, సిరియా, ప్రాచీన అస్సీరియా, బాబిలను సామ్రాజ్యము, ఈజిప్టు, కాకసస్, కాస్పియను ప్రాంతములు, హిందూదేశములో సింధునదివరకు పారశీక సామ్రాజ్యములో కలిసెను. పర్షియను సార్వభౌములు తమ సామ్రాజ్యరక్షణకై పెద్ద బాటలనిర్మించి, రాయబారులకు యాత్రికులకు ప్రతి మజిలీయందు అంచెగుఱ్ఱముల సిద్ధముగనుంచువారు. ఈ సామ్రాజ్యపు రాజధాని సుసాపురి; ముఖ్య పట్నములు పెర్సిపోలిస్, ఎక్బటనాలు.

పారశీక సామ్రాజ్యమున పారసీ రాజభాషగ నుండెను. వర్తకము, ఆర్థిక విషయములు సెమిటిక పద్ధతులపై నడచుచుండెను. తర్వాత పర్షియను సామ్రాజ్యము విచ్ఛిన్నమయ్యెను. మీదు పారశీక రాజులు బాబిలను నాగరికతలో నిమగ్నులై రాజరాజ బిరుదువహించి దేవాలయాధిపత్యమును, గురుత్వమును తలదాల్చిరి. పారశీకుల మిత్ర మతము సెరపిస్ మతమునకు పోటీగ యుండెను. ఇది సెరపిస్, ఐసస్ మతములకన్న పురాతనమైనది; మానవ సంస్కృతిలో వుదయ శిలాయుగపు కాలపుదని తోచును. మిత్రుడు పవిత్ర వృషభమును బలినిచ్చినట్లు ఒక విస్మృత రహస్యగాథ యీ మతమునకు మూలాధారము. మిత్ర విగ్రహపు పవిత్ర వృషభమునకు గాయమై నిరంతరము రక్తము స్రవించ, దానినుండి నవజీవనము గల్గునట. మిత్ర దేవభక్తుడు ఆ రక్తములో స్నాతుడగును. వేదములందు మిత్రదేవుడు అనేక ఋక్కులలో స్తుతింపబడెను. ఈమిత్ర ప్రశంస పారశీక జండ్ అవెస్టాగ్రంథములో గలదు.

ప్రాచీన పారశీకమున జొరాస్టరు ఒక మతమును స్థాపించెను. ఈ మతములో యజ్ఞవేదికపై ప్రతిదినమును పవిత్రాగ్నిని వుపాసించుట, దేవాలయపద్ధతి ముఖ్యములు. సస్సనిడు సార్వభౌము లీమతమును తమ ప్రభుత్వమతముగ జేసికొనిరి. క్రైస్తవ భావములు జొరాస్టరు మతపు పరిశుద్ధతను చెరుప సాగెను.

పర్షియాలో అరబ్బుల పాలనకాలములో వేదాంతము, తత్వశాస్త్రములందలి అనేక ముఖ్య విషయములను, సాంఖ్య సిద్ధాంతములను భారతీయులనుండి పారశీకులు గ్రహించి తమ గ్రంథములందు జేర్చి చర్చించిరి. సంస్కృత ప్రాకృతము లందలి సామాన్య విషయములను, పంచ తంత్రాదులందలి నీతికథలను, భారత దేశమునుండి పారశీకులు, అరబ్బులు గ్రహించిరి.

పారశీక వాస్తుశిల్పము అస్సీరియను వాస్తుపురీతిని పోలియుండును. అస్సీరియను కట్టడములు ఎండిన యిటుకలతో కట్టబడినవి. గోడలక్రింది భాగమున శిల్పసమన్విత

Alabastar పలకలుండును. ఈ కట్టడములు చాలవరకు భవనరూపమైన దేవాలయములు, వానిపై శిల్పములు రాజుల విజయముల దెల్పును. Pasarjadaeలో సైరసు, Carbysusel అద్భుతభవనముల శిథిలములుగలవు. Persapolis లో చావడులు ఇరువైపుల స్తంభములుగలిగి చదరముగనున్నవి. పైకప్పు చదునుగనుండి వెలుతురు వచ్చుటకు కొంతస్థలము వదలబడినది. ఆస్థలముపై మరొక కప్పుకలదు, దాని 72 స్తంభముల భాగములు ఇప్పటికినిగలవు. హాలులో 36 స్తంభములుగలవు. దీని పైభాగమున వృషభములు లేక గుఱ్ఱముల తలలు, భుజములుగలవు. వీనిసందులలో కప్పుకమ్మీలు అని యున్నవి. కొన్ని స్తంభములు గ్రీకు అయోనియను పద్ధతిలో నలంకరింపబడి యున్నవి. ఈహాలు కొలతలు 350 అడుగులు పొడవు, 300 అడుగుల వెడల్పు. మిలాను గుడి తర్వాత ప్రాచీన కట్టడములలో నిదియేగొప్పది.

పెర్సెపోలిస్‌లో భవనములు పెద్ద చదును ప్రదేశములపై సైక్లోపియను పద్ధతిలో కట్టబడినవి. సోపానములు అస్సీరియను వాస్తువును బోలియుండును. లోపలిభాగములు వర్ణ చిత్రాలంకృతములు. కోర్సాబాద్ ద్వారముల ఆర్చిలు శిల్పరూప వృషభములనుండి యావిర్భవించి మెరుపుపూత పూసిన యిటుకలతో శోభిల్లుచున్నవి. Loure లో అత్యద్భుతమైన రంగుల యిటుకల శిల్పముల వరుసలుగలవు. వీనిలో మొదటి డేరయసు భవనము మీది మనుష్యుల యెత్తు వీరుల బొమ్మలు, Artaxerxes భవనము మీద సింహముల ప్రతిమలుగలవు.

ఆధునిక పారశీక శిల్పము సారసనిక్ లేక అరేబియను పద్ధతిలో నున్నది. కాని ఆధునిక పారశీక చిత్రకళ ప్రాచీన పర్షియను చిత్రకళపై ఆధారపడియున్నది. బహుశః ఈజిప్టు పద్ధతినిగల సారసనిక్ శిల్పము ముస్లిములక్రిందపనిచేయు పారశీక బైజాన్టను శిల్పులచే వృద్ధిపొందినదే. ముస్లిముల నాటి పారశీక శిల్పము యీజిప్టు బాగ్దాద్ శిల్పముతో తుల తూగుచు, కైరోతో సాటియై, నినెవా బాబిలనులలోని ప్రాచీన భవనముల ప్రతిబింబించు చున్నది. మసీదులలో యిటుకలగోడల మీద ధగధగ మెరయు వర్ణచిత్రములు గలవు.

పర్షియను భాష మునుపు పర్షియా, పర్షియాక్రింద నున్న యితర దేశములందును వ్యాపించినది. జండ్ భాష వేదము లందలి సంస్కృతమును బోలియుండును. ఇదిచాలవరకు వుత్తర పర్షియాలో వృద్ధినందెను. ఈ భాష కుడినుండి యెడమకు వ్రాయబడును. ఇదిగాక ప్రాచీన పారశీక భాష Achacmenides శాసనములలో గన్పడుచున్నది. దేవతలు, మనుష్యులు, దుస్తులు, పాత్రిలపేర్లు పురాతన గ్రంథముల లోను, బైబిలులోను గలవు. పహ్లావిభాష సస్సనిడుల కాలంలో (3 వ శ॥నుండి 9 వ శ॥వరకు) వృద్ధిపొందెను. ఇందులో సెమిటికు మాటలుగలవు. ఈ భాషలో జొరాస్ట్రి యను మతగాథలు, నాణెములు, శాసనములు గలవు. సనాతన గ్రంథములకు వ్యాఖ్యలు రచింపబడినవి. పాజెండు భాష ప్రాచీన పారశీక భాష ఆధునిక పారశీక భాషగ మారుటను సూచించును. పార్సీ లేక పారసీ భాష క్రీ॥ శ॥ 700 నుండి 1100 వరకు వాడుకయందుండెను. ఇందులో అరబిక్ మాటలు చాలగలవు. ఈ పార్సీ భాషకు వ్యాకరణము లేదు. దీని సువర్ణయుగము ఫిరదౌసి కాలము.

పర్షియను సాహిత్యములోనికి ముస్లిముల కాలంలో అరబిక్ పదములు, కొరాను బోధలువచ్చి చేరాయి. రచయితలందరు ముస్లిములే. పురాతన పారశీక భాష, శాస్త్రము ముస్లిములచే నాశనము చేయబడెను. అల్లాకు తల యొగ్గని కవులు, పండితులు పలాయనమైరి. తలయొగ్గినవారు తమ పూర్వాచారముల విడచిరి. క్రీ. శ. 9 వ శ॥ ప్రాంతమున పర్షియనులలో జాతీయ భావములు రేకెత్తి వేయిమంది పద్యగద్య రచయితలు బయలుదేరిరి. ఇప్పటి నుండి 5 శతాబ్దములు పారశీక సాహిత్యజీవనమభివృద్ధి గాంచెను. అన్ని విషయములందును మంచిరచనలు రచితమయ్యెను. 952 ప్రాంతమున అబుల్‌హాసన్ ఋుడిగి యను అంధకవి రాజాభిమానమంది 1300,000 పద్యములను రచించి Bidpai కథలను అనువదించెను. రెండు వందలమంది కాని సలితని చేతిక్రింద నుండిరి.

గజనీ సుల్తానుల కాలంలో మహమ్మదు గజనీయొద్ద నాల్గు వందలమంది ఆస్థానకవులుండిరి. సుప్రసిద్ధకవులగు అన్సారీ (1039), ఫెరూసీ, ఇసాడీ, షానామా రచయిత ఫిర్దౌసీలు

(తరువాయి 24 వ పేజీలో)

# నేడు — రేపు

బదరీనాద్

పాలవంటి తెల్లటి వెన్నెలలో ఆలోచిస్తూ నడచిపోతు న్నాడు నాగిరెడ్డి. సముద్రపుకెరటాలు పాదాలదాకా వచ్చి ఆగిపోతున్నాయి. సముద్రం హోరు మంటోంది. దగ్గరలో ఉండే సిమ్మెంటు కుర్చీలో కూర్చుని మరునాటి కార్యక్రమం ఆలోచిస్తున్నాడు సముద్రపు ఒడ్డుని. టైము సుమారు 10 గం॥ అయింది. మరునాడు తాను ఆపకరి తలలు మొండెంనుంచి వేరుచేయాలి. అందుకు తనకి 600 రూ. వస్తాయి. ఈ డబ్బు అంతా ఎలా ఖర్చు చేయాలా అని నాగిరెడ్డి ఆలోచన. నాగిరెడ్డికి ఒక్కసారి తన పూర్వపు జీవితం స్ఫురించింది.

నాగిరెడ్డి ఒకనాడు చిన్న పోలీసు జవాను. ఆ రోజుల లోనే ఒక యువతితో పరిచయం కల్గింది. ఆ పరిచయం కొద్దిగా శృతిమించింది. ఆ యువతి పెళ్లి చేసుకోమంది. పరిస్థితులుకూడా నాగిరెడ్డికి ఎదురు తిరిగాయి కాబట్టి వివాహం తప్పనిసరి అయింది. కాని తన జీవితం వివాహం చేసుకున్నాక బానిసత్వంలో పడిందని నాగిరెడ్డికి రూఢి అయింది. భార్య రోజూ గుడ్డలకనీ, వాటికనీ వీటికనీ డబ్బు తెమ్మనేది. నాగిరెడ్డి జీతం అతని సారాకి, టీ ఖర్చుకి సరి పోయేది. అలాంటప్పుడు చాలా చిక్కుల్లో పడేవాడు సతీ మణిని తప్పించుకు తిరగడానికి. ఒకనాడు కొందరు ఖైదీలు తప్పించుకు పారిపోతుంటే అడ్డి ఆపాడు. ఆవాళ ఒళ్లు దెబ్బలు కాయవలసి వచ్చింది. ఇంటికొస్తే ఆనాడే సతీమణి డబ్బు కావాలని కూర్చుంది. శాంతంగా తప్పించుకుందామని వీధిలోకి పోబోయాడు. కాని భార్య డబ్బు చేతిలో పెట్ట కుండా అడుగువేస్తే వల్లకాదని నిలవేసింది. కోపంతో వున్న నాగిరెడ్డి చెళ్లుమని చెంపపెట్టాడు. వెంటనే అనుకో కుండా ఇంతకపూర్వం ఖైదీలను ఆపడానికి దెబ్బతిన్నదవడ మళ్లీ సమాధనం చెప్పవలసి వచ్చింది.

అసలే నొప్పితో బాధపడుతున్న నాగిరెడ్డి కోపాన్ని ఆపుకోలేక పోయాడు. ఎదురుగుండా ఉన్న రివాల్వరు తీసి కాల్చేశాడు. సతీమణి నిలువున కాలిపోయింది. ప్రభు త్వపు ఉద్యోగి కాబట్టి మనిషి మానసిక స్వాస్థ్య పరిస్థితి అలా చేసిన నేరం కనుక 12 ఏళ్లు కఠిన శిక్ష విధించారు.

కాని రెండేళ్లు తిరగకుండానే విముక్తి పొందాడు. అప్పుడు అక్కడవుండే ఉరిశిక్షల అధికారిని దారుణంగా దొంగలు చంపేశారు. మళ్ళీ ఆ పదవికి ఎవరూ రామన్నారు. నాగిరెడ్డి నేను ఆ పదవి నిర్వహించగలనన్నాడు. విముక్తి పొందాడు. నేడు నాగిరెడ్డి ఉరిశిక్షలువేసే అధికారి. ఇప్పటికి చాలామంది తలలు నాగిరెడ్డి చేతిమీదుగా ఎగిరి పోయాయి. చాల నిబ్బరం అయిన మనిషి. ధైర్య స్థైర్యా లకు కొదువలేదు. ప్రభుత్వపు విధి అంటే తన ప్రాణాన్ని అడ్డేసి విధి నిర్వర్తిస్తాడు.

ఈ ఆలోచనలతో నాగిరెడ్డి తిరిగి ఇంటికి చేరాడు. తెల్లవారగట్ల 5 గం॥లకల్లా ఉరితీయాలి మళ్లీ ఆరుగుర్ని. అందుకని కొద్దిగా కునుకు తీద్దామని 11 గంటలకు ఇల్లు చేరి నడుం వాల్చాడు. ఇప్పుడేగాని సతీమణి ఉంటే తన నిలవ సొమ్ము అంతా దాని మొహానికి పారేద్దునుగదా అను కున్నాడు. 3 గంటలకు అలారం పెట్టి మరీ నిద్రపోయాడు.

3 గంటలకు అలారం కొట్టింది. లేచి ఉదయాన కాల కృత్యాలు తీర్చుకుని నాగిరెడ్డి ఇల్లు తాళంవేసి ఇవతలకి వచ్చాడు. తన కుక్కలను పిలిచాడు. అవి పలుకలేదు. ఏమిటా సంగతీ అనుకొంటూ కాంపౌండు దాటి ఇరవై గజాలు వెళ్లాడు. ఎదురుగా ఉరితీసేచోట దీపాలు వెలు గుతూ కనిపించాయి. 300 గజాలు వెళ్లాడంటే చేరు కుంటాడు. అనుకొంటూ రెండడుగులు వేసాడు. కాలికేదో మెత్తగా తగిలింది. వంగి తడిమిచూసాడు. మసక మసక వెన్నెల్లో తన కుక్క ఒకటి చచ్చిపడివుంది. ఉక్కులాంటి మనిషి స్థభించిపోయాడు. వెంటనే వెనుకటి ఆఫీసరు హత్య కళ్లకు కట్టినట్లయింది. వెనక్కు తిరిగితే చావు తప్పదు అని తోచింది. ఎందుకంటే వాళ్లెప్పుడూకత్తి వెన్నులోగాని పొట్టలోగాని పొడిచి చంపుతారు కాబట్టి అనుకుని చెట్ల చాటుగా మరి ఒక 100 గజాలు నడిచాడు రెండోవకుక్క

(22 వ పేజీ తరువాయి)

లుమా కాలప్రవారే. అనుబేకో రాజ్య కాలంలో జీవించిన అన్వారీ భావకవి విహారయించెరి. సూఫీస్టుకవులలో ప్రసిద్ధులు ఒమర్ ఖయ్యాం, ఫరీదుద్దీన్ అత్తర్ అనువారలు. అత్తర్ పెంద్ నామా, అనునీతి గ్రంథము రచించెను. దీనిపై అనేక వ్యాఖ్యలు వెలువడెను. జలాలుద్దీను రుమియాను కవి 'జీవిత సమస్య', మరియితర ప్రేమగేయములను రచించెను. సాదీ గొప్పకవి. హాఫిజ్, మధుపానము, ప్రేమ, కోయిలలు, కుసుమములగూర్చి మృదు మధురముగ నాలాపించెను. ఇతని తర్వాత పారసీక కవిత్వముయొక్క విశిష్టత క్రమముగ తగ్గెను. తర్వాతి కవులలో జమి (1419-93) గొప్ప భావకవి. వచనర చనలలో ముఖ్యమైనవి సూఫీల చరిత్రము, ఆదర్శలేఖా సంపు టములు, హాతీఫ్ చక్కని గేయముల రచించెను.

ఆధునిక పారసీక కవులలో క్వామీ ముఖ్యుడు. 1850 తర్వాత బచేలు, బహాయిలు తీవ్రమైన భావములను సుందర మైన కవిత్వములో జొప్పించి అలిలైమైన చక్కని వచనరచ నలజేసిరి. పారసీక నాటక సాహిత్యము ఎక్కువ విలువగలది.

పారసీక వచనరచనలలో ముఖ్యమైనవి ఫిర్దౌసీ యొక్క ఎపోస్ రషీదుద్దీనుయొక్క మహమ్మదీయులసంక్షిప్త చరిత్రము. వాసఫ్ అలంకారయుత రచనజేశాడు. 15 వ [illegible] గాలో ప్రసిద్ధిచెందిన [illegible] మిర్ ఖోండ్ ప్రపంచచరిత్ర రచించి యున్నారు. పత్రికలలో రచించిన భారతీయ చరిత్రకారు లలో సుప్రసిద్ధులు మహమ్మదుకాసిం ఫెరిష్టా (1640), మహమ్మదు హాషిం, అబుల్ ఫజల్, [illegible] గారు.

జీవితకథలు, పురాణకథలు పత్రికలలో మిక్కుటముగ కలవు. భూగోళశాస్త్ర రచయితలలో ముస్తఫీ అమ్మీన్, అహ్మదరసీ, ఐర్త్ సాన్ని ముఖ్యులు. మత గ్రంథములు, కొరాను అనువాదములు, వ్యాఖ్యలుగలవు. న్యాయశాస్త్ర ములో హిదయాసా, ఇమాద్‌షా, ఫతూహా అలంగిరి అనునవి ముఖ్య గ్రంథములు. వైద్యశాస్త్రము, శస్త్రచికిత్స, విజ్ఞాన విషయములపై అరబిక్ నుండి పారసీలోనికి గ్రంథములు అనువదింపబడినవి. గణితము, ఖగోళశాస్త్రము, వేదాంత, అలంకార శాస్త్రములు, లేఖారచనాది గ్రంథములుగలవు. వ్యాకరణము భాషాకోశముపై రచనలు మనదేశములోగలవు. గ్రీకు, భారతీయ, అరబిక్, టర్కీ భాషలనుండి అనువాద ములు పారసీ భాషలోగలవు.

[ఆలిండియా రేడియోవారి సౌజన్యముతో]



---

కాలికి తగిలింది. ఈ దెబ్బతో నాగిరెడ్డి ప్రాణాలు పైకి పోయాయి. ఇంక అడుగు కదల్లలేక పోయాడు. అరుద్దా మంటే నోరు పెగలలేదు. ఇంతట్లోకే తనచుట్టూ మనుష్యులు కదులుతున్న అలికిడి అయింది. ముందుకు అడుగు వేశాడు. ఎవరో తాకారు. నిలు అన్నాడు ఆ గంతకుడు. కాని నాగిరెడ్డి తోసేసి పారిపోబోయాడు. ప్రభుత్వ కర్తవ్యం అంటే అలాంటిది. కాని లాభంలేకపోయింది. ఎవరో తన మీద తాడు విసిరారు. దానితోనే దగ్గరగానున్న చెట్టుకు చుట్టబెట్టారు. నాగిరెడ్డి ఇప్పుడు బంధితుడు. ఎవరో టార్చి లైటు మొహంమీద వేసారు. వెంటనే ఎవరో కొట్టు అన్నారు. అంతే కత్తి ఒకటి నాగిరెడ్డి కంఠంలో గుచ్చు కుంది. వాళ్లెవరూ నాగిరెడ్డికి కనపడలేదు. నాగిరెడ్డి తల వాలిపోయింది. నేటి నాగిరెడ్డి రేపు అనేదాన్ని చూడకుండా ప్రాణాలు వదిలేశాడు ప్రభుత్వ కర్తవ్యానికి.



# అరేబియను నిశీథాలు....

(ఐసిసు : జరిగి పోయిన దాన్ని జరుగుతున్న దాన్ని జరుగబోవు దాన్ని—సమస్తమూ నేనే! నా ముసుగు ఎవ్వరూ ఎన్నడూ తీసివేయలేరు.)

*    *    *    *    *

మ(హాజాదు : నీవు అర్థం చేసుకోవాలని తహతహ పడ్తున్న రహస్యాల్ని భౌతిక శాస్త్రాలు మంత్రవిద్యలు కూడా విప్పి చెప్ప లేక పోయినవా ?

మ(హియారు : ఊరుకో—నన్ను మాట్లాడించకు—

మదు : నేను అంత బాధ కల్గిస్తున్నానా ?

మరు : నీకు పుణ్యముంటుంది—నన్ను వొంటరిగా వుండ నివ్వవా ?

మదు : ఇదే అవుతుంది—మంత్రగాళ్లతో శాస్త్రజ్ఞులతో కలిసి తిరుగుతే—ఇటువంటి దయారహితమైన పరివర్తనల్లో పడిపోతారు.

మరు : నీతో చాలా చిక్కు వచ్చింది—నేనేమి చేయగలనూ ?

మదు : ఏ ముందీ—నన్ను పూర్తిగా నీకు అవగాహనమయ్యేలా మారి పోమంటావు—ఇప్పటికీ—అంతే గదూ ?

మరు : మ(హాజాదు......

మదు : నన్నలా కొత్తగా చూస్తావే ?

మరు : నన్ను పరిహాసించకు.

మదు : (కోపంగా చూసి మెల్లిగా—) అవును—నీవు పరిహాసించ డానికైనా పనికిరావు !

మరు : నీవన్న దేమిటీ ?

మదు : నా వైనం తెలుసు కోవాలి గదూ ?

మరు : నాకేది కావాలో నీకు తెలుసును.

మదు : నే నెవ్వరినో—నీకు నిరూపించాలి గదూ ?

మరు : అవును—

మదు : (మందహాసంతో) నేను—ఒక సుందర శరీరాన్ని! నేను నిజంగా—అందమైన దాన్ని కదూ ?

మరు : (బిగ్గరగా) ఆ సుందర శరీరాన్ని నశించి పోనియ్యి

మదు : అయితే—నేను—గొప్ప హృదయం కలదాన్నవు తేనో ! నా హృదయం అటువంటిదే కదూ ?

మరు : ఆ ఉన్నత హృదయాన్ని తగుల పడి పోనియ్యి !

మదు : ఆశరీరాన్ని—ఆహృదయాన్ని—ఎంతగా (పేమించే వాడవో—జ్ఞాపకం లేదా !

మరు : నిజమే—అయితే అదంతా జరిగి పోయినది ! నేడు నేను విచార(గస్తుడిని !

మదు : (అతని వైపునకు వెస్తూ—) అంత నిరాశా ? మ(హియారు—నా (ప్రియా......

మరు : దూరంగా పో—నీవు మోసగత్తెవు...అవును—నీకు 'నీవు' తప్ప మరేవీ అక్కరలేదు !

మదు : నిజమేనా ?

మరు : నీవు మోసగత్తెవు—

మదు : (చిఱునవ్వుతో—) మరెందుకిక నన్ను (బతక నివ్వడం ?

మరు : అబ్బ—నిన్నేదో భూతం తీసుకొవచ్చింది భూమి మీదికి !

మదు : నేనెవ్వరో తెలియక పోవడంచేత నన్ను (బతక నివ్వడం—అంతేనా ?

మరు : (విసుగ్గా ముఖాన్ని తిప్పేసుకొని—) నాకు నీవన్నా—ఏదన్నా లక్ష్యంలేదు.

మదు : అటువైపునకు తిరిగావు—అంత (గుడ్డివాడి వనుకో లేదు. ఇంకొక్క క్షణం నావైపునకు చూసి వుంటేనో— ఆహా !

అనువాదం : కొత్తపల్లి లలిత

మరు : నేను కోరుకుంటున్నా ఎంతో ఎక్కువ చూశాను. సాహసిక కాలం అదే!

మదు : అందుకని అన్నిటినీ చూడకుండానే దాటి పోయావు...అతిగా చూడాలనే తొందర పాటులో సమస్తాన్ని విడిచి పోయావు...నీవు చేసిన పెద్ద పొర పాటదే మహాప్రియా!

మరు : (దిగులుగా—) నేను ఒక్కటే కోరుతున్నాను—

మదు : ఏకీభావమా? అదేమిటి?

మరు : మృత్యువు!

మదు : అంత విచార మెందుకూ?

మరు : జీవితంలో 'కొత్తదీ' అని మిగిలినది లేదు—నేను అంతా అనుభవించాను!

మదు : ఊహూ—నిన్ను దగ్గరగా రమ్మని ఆకర్షిస్తున్న ప్రకృతి సొగసు నిన్ను జీవంతో వుండ మనడం లేదా?

మరు : కాదు—ప్రకృతి కూడా బందీయే! దాని మెడపై ఉరిత్రాడు అనుక్షణం మరింత బిగింపబడుతూ ఉంటుంది!

మదు : నీకు పిచ్చెత్తుతోంది...ఆలోచనలతో మెదడ్ని కదిపి వేసావు! పిచ్చివాడివి—ఏ రహస్యాల్ని తెలుసుకో వాలని బాధ? కుతర్క పూర్ణమైన దానిలో ఏదో గొప్ప రహస్యం వుందని బాధపడ్తూ నీ శేష జీవితాన్ని గడుపుతావా?

మరు : ఇక బ్రతికి విలువ ఏ మాత్రం లేదు—నేను ప్రయత్నించాను! అన్నిటిని అతిగా అనుభవించాను.

మదు : నీవు తెలుసు కోవాలను కొన్న దానికోసం సరైన దారిలో వెళ్లా వనుకొంటున్నావా? ఆ వెతుకుతున్న దసలు వున్నదని నీ కెవ్వరైనా మాటిచ్చినారా? చూడూ—ఈ నీళ్లల్లోకి...ఏమి కనబడ్తోందో చెప్ప గలవా? అందులో వున్నది స్వచ్ఛత! నీవు పరికించి చూస్తే అదే నాకళ్లలోతుల్లో చూడగలవు...అందులో నీకు కావలసిన కొన్ని లోతైన రహస్యాల్ని అవగా హన చేసుకోగలవు!

మరు : స్వచ్ఛత! అది మలినమై పోనియ్యి...ఇంత తేట దన మంటే నాకుభయం—ఈ తేట దనంలో మునిగే నాడు అభాగ్యుడు!

మదు : నిర్భాగ్యుడవు నీవేనా?

మరు : స్వచ్ఛత! స్వచ్ఛత! అదే ఆమె, మేలి ముసుగు!

మదు : ఎవరిదీ?

మరు : ఆమెది...ఆమెది...ఆమెది—

మదు : నిన్ను చూస్తే భయం వేస్తోంది...

మరు : ఆమె మేలి ముసుగు నైర్మల్యంతో నేయబడింది!!! నిర్మలా కాశం—నిర్మల నేత్రాలు—నిర్మలో దకం—నిర్మల వాయువు—నిర్మల శూన్యం—వీటి పోగులతో నేయబడింది!!! దాని వెనుక ఏ ముందీ? స్వచ్ఛత కన్నా పలుచనివి—అవి ఇనప తెరలు!!

మదు : మహాప్రియా—ప్రియా...నీతో వచ్చిన బాధ ఇదే—నీవొక విషాద చక్రవర్తివి...మానవత్వాన్ని కోల్పోయావు...హృదయాన్ని దేనికోసమని తాకట్టు పెట్టావూ?

మరు : మానవత్వంతో నాకిక ఉపయోగం లేదు. హృద యంతో అసలే పని లేదు. ఏదో వుండి వుంటుంది అవి సమన్వయ పర్చుకో లేను...నిజాన్ని తెలుసుకోవాలి...నాకు జీవితంలో ఇదే ముఖ్యం—ఇదే కావాలి!

మదు : అసలు తెలుసు కోడానికి ఏముందీ?

మరు : అది నిజంకాదు. అది అన్యాయం. నేనెన్నాళ్ల నుంచో అడుగుతున్న దానికి జవాబు ఇవ్వ వెందుకూ? ఒక్క కోరికను మన్నించ లేవా?

మదు : ఆ కోరికే మిటీ?

మరు : నీ వెవ్వరూ?

మదు : (చిన్న నవ్వుతో) నేను—మహాజాదు!

మరు : అవును—అదే జవాబు...ఎప్పుడూ అదే జవాబు. నిన్ను మహాజాదు అంటారు. మహజాదు ఎవ్వరూ?

మదు : మహాప్రియారు మాజీ మంత్రి కూతురు!

మహ : అవును. అదీ తెలుసును. మహారాజావునకు నా మాజీ మంత్రి పితృత్వాన్ని వహించాను. లోకం ఆను మానిస్తుందని ఈ పవిత్రభారాన్ని ధరించాను... ఈ జవాబు నాకు అక్కర లేదు.

మదు : ఆ దంపతులకు సర్వసాధారణంగా జన్మించిన దానిలా నన్ను అంగీకరించ లేరెందుకూ?

మహ : నీవు అందరి వంటి దానివి కావు...నీ వసలు 'స్త్రీ' వి కావేమో అని పిస్తుంది!

మదు : నీ ఉన్మాదావస్థ ఎంత మితిమీరుతోందో చూసావా?

మహ : ఆమె 'స్త్రీ' కాక పోవచ్చును...ఎలా అవుతుంది? మళ్లీ ప్రశ్నిస్తున్నాను. ఆమె ఎవరూ? అంతః పుర ఘోషాల్లో అర్థజీవితాన్ని గడిపిన ఆమెకు—ఈ జిప్టు చీనా, ఇండియాలను పాలించినట్లుగా రాజకీయాలు తెలుసును......కన్యవలె కాలక్షేపం చేసినను వివాహిత వలె స్త్రీ పురుష సాంగత్య విషయములను పూర్తిగా గ్రహించినది—మగవాళ్ల మంచిదనం తప్పం అన్నీ రుచి చూసినట్లు చెప్తుంది...అప్సరల పెంపుడు పిల్లవలె గగన రహస్యాల్ని విప్పి చెప్తుంది...చిన్న దైన ఆమె నిశిత జ్ఞానానికి భూగోళ సంపత్తి చాలక, రెక్కలు వచ్చి ఆకాశంలోకి ఎగిరి అప్సరసల జీవితాలు చూచి వచ్చినదా? పాతాళ రాణిని వలె భైరవుల విశేషాల్ని విశద పరుస్తుంది...ఆమె ఎవరూ? ఇరువై సంవత్సరాలు బయటు సూర్యుని వెలుతుర్ని చూడని చీకటి గదుల్లో గడిపినా—ఇంత జ్ఞానాన్ని ఎట్లా సంపాదించుకొన్నదీ? ఆమె ఎవరూ? ఆమెకు ఇరువై సంవత్సరాలా? ఆమె అనాదరూపిణియా? ఆమె స్వప్నలమేదై వుంటుందీ? అన్నీ ఆమె వేనా? ఇన్ని అనుమానాలతో నామనస్సు వేడెక్కి పోయింది. ఈ సమస్యల్ని పూరించమని ఆవేదన పెడ్తోంది...ఆమె స్త్రీ కాగలదా? ప్రకృతి లోని వివిధ వర్ణముల నామె యేధరించి ప్రకృతి వలె నటిస్తోందా?

మదు : మహారాయారు. ఇక వూరుకో...నీచేతులు వణుకు తున్నవి...నీ ముఖం శక్తిహీనకంగా మాసి పోతోంది—

మహ : నాకు శక్తి లేదు...నామనస్సు వూరుకోదు. అది తెలుసుకోవాల్సిందే—తప్పదు!

మదు : అవన్నీ ఆలోచించక వూరుకో మహారాయారు...

మహ : నీవు నాభార్యవు...నిన్ను ప్రేమించాను...ఎంతో కాలం. మనిద్దరికీ మధ్య ఈ పత్రి సీర నుంచలేవు... నేను భరించలేను—

మదు : (లోలోపల—)అది తెలిస్తే నీవొక్క క్షణమైనా నన్ను చూడ గలవా?

మహ : ఏదో అంటున్నా వేమిటీ?

మదు : ఏమీలేదు—నీకువిశ్రాంతి కావాలి...పడుకోవూ—

మహ : (పెద్దగా—) ఆహా—నేను వెళ్లను... నే నిప్పుడే తెలుసుకోవాలి. తప్పదింక—ఊఁ—

మదు : మహారాయారు...ఇంత పసిపిల్ల వానివలె అల్లరి పెట్టకు... ఈ విధంగా ఇరువై యుగాలు ప్రవర్తించినా జవాబు రాదు...అది విప్పి చెప్పలేను...అది 'నాది' కాదు నీవు అసంభవాన్ని కోరుతున్నావు...ఎంత అనారోగ్యంగా వున్నావో ఆలోచించుకో—

మహ : నీకు తెలుసును—అన్నీ తెలుసును! నీవేపని ఆలోచించనిదే చేయవు...అనుకోకుండా ఉత్సాహ పూరితంగా నీనుండి ఏదీ పైకి రానివ్వవు! స్వహస్తాలతో పదును చేసుకొన్న దారినే వెళ్తావు...ఒక్క అడుగు ఇటుగానీ అటుగానీ ప్రమాదాన్నైనా వేయవు...సూర్య చంద్ర నక్షత్రాదుల వలెనే నీదీ తప్పని దారి!!! అబ్బ—నీవు ఊహాకందని జ్ఞాన సమూహానివి...మహా సముద్రానివి!!!

మదు : (చిన్న నవ్వుతోడ) నీ దృష్టి సరిహద్దులలో నన్ను బంధిస్తున్నావు మహారాయారు!

మహ : నేను సత్యం చూపాను.

మదు : (ఊహిస్తూ—) అంత సత్య వాదమా?

మహ : నాకు 'సత్యం' కావాలి...అది చెప్పవూ?

మదు : అబ్బ—వెళ్లిపడుకో, లేకపోతే నీ స్నేహితులైన మంత్రగాళ్లు, శాస్త్రజ్ఞులతో కలిసి ఉన్మాది వైపో!

మరు : (పరధ్యానంగా తీక్ష్ణంగా చూస్తాడు—) ఇది దేవతల శాపం !!

మదు : నన్నలా కొత్తగా చూస్తున్నావేమిటి ?

మరు : ఇక్కడికిరా—

మదు : ఎందుకూ ?

మరు : నిన్ను ముద్దు పెట్టుకోవాలి.

(ఆమె శిరస్సుని చేతుల్లోకి లాక్కొని, నల్లని కాటుక చీకటివంటి జుత్తుని మెడ మీదనుంచి తప్పించి వేసి—కత్తి తీస్తాడు)

మదు : అదేమి పని ?

మరు : (అమానుష కంఠస్వరంతో.) నా కళ్లకొక తెల్లని వెంట్రుక వెక్కిరిస్తూ కనబడ్తోంది...అది అందమైన నల్లని రాత్రి ననుసరించి వచ్చిన తొలి ప్రభాతంలా మెఱుస్తోంది...

మదు : (మెల్లిగా వదుల్చుకొని వంగి నీళ్లల్లోకి చూస్తుంది... ఆ ప్రతిబింబములోని మేఘము వంటి జుట్టుని సరిచేసుకొంటూ—) ఇదేకదూ ? (అని తీసివేస్తుంది.)

మరు : దాన్నెందుకు తీసేసావు ?

మదు : (దగ్గరగా వస్తూ—) మరెందుకో విధంగా ప్రవర్తించావు ? నీ ఉన్మాదం ప్రమాదంగా వుంది...నాకు భయం వేస్తోంది...నేను చచ్చిపోతే భరించ గలవా ? (జుట్టుని సరి దిద్దుకొంటూ మధుర మందహాసంతో ఆకర్షవంతగా చూస్తుంది—)

మరు : (చలనం తప్పి దీర్ఘంగా చూస్తాడు—)...

మదు : నన్నలా చూస్తావే ? ఎప్పుడూ నన్ను చూడలేదా ?

మరు : ఊహూ. నిన్ను చూడను. నిన్ను చూడడం నాకిష్టం లేదు.

మదు : ఎందుకూ ?

మరు : ఆమె కూడా అలాగే చేస్తుంది...ఎప్పుడూ శరీరంతో ఆకర్షించి రహస్యాన్ని దాచివేస్తుంది—

మదు : ఆమె ఎవరూ ?

మరు : ప్రకృతి ! ప్రకృతి ?

మదు : (జాలిగా—) పిచ్చివాడా !

మరు : నీవు కూడగత్తెవు—

మదు : .........(అతని శిరస్సుని రెండు చేతుల్లోకి తీసికొని—) ఈ పిచ్చితలను—వివర్ణమైన ఫాలభాగాన్ని—ఈ కొంపులు తిరిగిన పెదవుల్ని—చూస్తే జాలి వేస్తోంది...

మరు : నాముఖం విగత జీవునివలె వివర్ణమై పోతోందికదూ ?

మదు : అటువంటి మాటలనవద్దు—

మరు : అవును. మహ్రాజాదు—నేను చచ్చి పోతాను !

మదు : ఊహూ—ఈ వైరాగ్యం, విషాదం నిన్ను పోదు చేయనివ్వను కాదు—మహ్రాయారు...నీవు చచ్చిపోవు !

మరు : నాకు జీవించాలని లేదు—

మదు : చచ్చిపోవడానికి నీవేమైనా ముసలి వాడివా ? (కొంపులు జుట్టుకొని వేళ్లతో కదుపుతూ—) చూడు—మహ్రాయారు...నీజుత్తు ఎంత నల్లగా రాత్రిలావుందో !

మరు : అబ్బా—ఎప్పటికీ నీచేతుల్లో ఇలాగే అంటూ వుండు...నీవెంత అందంగా వుంటావో మహ్రాజాదు... నీజుట్టు—చూడూ—నాచేతుల్లో ద్రాక్షగుత్తుల్లా నిల్చి పోయిందో...

మదు : నిద్రపో...నీదేహాన్ని శ్రమ పెట్టకు.

మరు : పసి పాపవలె నాతలను నీవొళ్లో వుంచుకోనియ్యి... నీ ప్రియునివలె ఇంకా దగ్గరగా తీసుకో...నీభర్తనని గట్టిగా నిజమనిపించు...నీ చేతుల్ని నా మెడకు తీగల్లా చుట్టి వేసెయ్యి...అవి బంగారుచేతులు మహ్రాజాదు... ఈ అలంకారాలన్నీ నావేనని పూర్తిగా నమ్మకం కల్గించవూ...నీకు నామీద వున్న ప్రేమ విషయాన్ని చెప్పు...నేనంటే నీకెట్లా వుంటుందీ మదూ ?

మదు : (అల్లరిగా నవ్వుతూ—) ప్రేమకు శరీరానికి దగ్గరగా వస్తున్నావేమిటీ ?

మరు : (నిద్ర మత్తులో—) ...మహ్రాజాదు...ఇప్పుడని పిస్తోంది—నేను సంతోషంగా వున్నానని !! నీ వ్యాద

యంలో నే నెక్కడుంటానో చెప్పగలవా?...అప్పుడప్పుడు ఎంతో ఆదుర్దాగా వుంటుంది...నీవు చాలా గొప్పదానివి—ఇంత తక్కువైన నాతో ప్రేమకు ఆకాశాలు దిగివస్తావా అని అనుమానిస్తాను...

మధు: (పరిహాసంగా—) నే నెవరో తెలుసుకోవాలని లేదా?

మరు: ఊహూ—నీ స్వర్ణ దేహాన్ని ముద్దు పెట్టుకోవాలని వుంది.

మధు: దేహం వైపునకు తిరిగా రన్నమాట! (కిలకిల నవ్వుతుంది.)

మరు: (నిద్రలో పొట్లాడుతూ) మహారాజు...ఒక పాట పాడు...ఒక కథ చెప్తావా?......

మధు: (ద్వారం వైపు చూపి—) ఏ—ఎవరక్కడ...మంచి సంగీతం వినిపించాలి—త్వరగా.

మరు: (నిద్రలో) ఊ........

మధు: మహారాజు........

మరు: ...............

మధు: నీకోసం పాట పాడనా?

మరు: .................

మధు: నిద్ర...అటల్లో అలసిపోయిన పాపాయి నిద్రపోతాడు అవును...మహారాజు—ప్రియా...నిద్రపో!



# పరిష్కారం

ఘట్టి కృష్ణమూర్తి

[దేశమంతా అక్రమంతో నిండిపోయింది. నల్ల మార్కెట్టు పిశాచానికి వసులై వర్తకులు దయాదాక్షిణ్యాలు, న్యాయధర్మములు బొత్తిగా విస్మరించారు. వర్తక సంఘంలో ఈ దుర్నీతి పెరిగిపోకపోతే దేశంలో యింత కరువే వుండదు. నోరెరుగని కసిగందులు, దరిద్రులైన స్త్రీలు, పురుషులు, ఎంతమంది ఈ అక్రమానికి ఆహుతి యగుచున్నారో! నల్ల మార్కెట్టును, ముఖ్యంగా ఆహార పదార్థములలో నల్లమార్కెట్టును, అరికట్టిననాఁడు, ప్రభుత్వము ఇటు దరిద్రాన్నీ, అటు కమ్యూనిజమ్‌నూ ఒకేసారి నిర్మూలించినవారగుతారు. సం॥]

"శాంతా!...శాంతా!!..."

"..............."

"ఎక్కడికి పోయిందో...పిల్లాడు యిట్టా పోరుపెట్టి ఏడుస్తున్నా తీసుకోవండా?—శాంతా!!"

"వోయ్ వోయ్—వొస్తున్నా—"

"ఆఁ...ఏం రావడం పిల్లాడు చూడు, అలా గుక్కపట్టి యేడుస్తుంటే వదిలిపెట్టి వూరుకుని...గడపలు దిగివచ్చేస్తున్నాడు...ఇంకా నయం అలా వీధిలోకి వచ్చేస్తే యే గేదెలన్నా తొక్కేసును..."

"ఆదంతా యేడుపనుకున్నారా యేమిటి? నాన్న బజార్నుంచి వస్తారని యెదురురావడం—ఇంకేం—వచ్చారుగా యెత్తుకు ఆడించండి! ఏంపెట్టి వూరుకోబెడతారో చూస్తాను."

"ఇదుగో...అట్టా దులపరించుకు పోబోకు, ఇంతలోనే నేను యేం తెచ్చానని, వాడికి పెట్టడానికి? కాసిన్ని పాలన్నా కలిపి పొయ్యి. వూరుకుంటాడేమో...పొట్ట యేడుస్తోంది వెధవకి... మధ్యాహ్నంనించీ పాలు పొయ్యలేదా యేం?"

"..........."

"ఏమిటే? అలా చూస్తూ నుంచుంటావేం? కాసిన్ని పాలు కలిపి తీసుకురా అంతవరకు యెత్తుకుంటాను. ఇదుగో యీ సంచీ యింట్లో పడెయ్యి!"

"మొన్న పొద్దుననగా పాలడబ్బా తేవాలని చెబితే ఎందుకు అట్టా నన్ను యేడిపిస్తారు?"

"నిన్ను ఏడిపించడమా? అదేమిటి శాంతా అలా మాట్లాడతావ్?"

"కాదు మరీ, ఏమీ యెరగనివారులాగా...ఇంట్లో పాలుడబ్బావుంటే మధ్యాహ్నంనించీ పాలు పొయ్యకుండా పిల్లణ్ణి యేడిపిస్తానా?"

"పాలడబ్బా తేవాలన్నావ్‌గాని అయిపోయింది ఒక్కపూటకికూడా లేదని నాతో చెప్పలేదుకదూ?"

"ఇంతకంటే యింకా వెంటపడి వేపుకు తినాలంటారు—అంతేనా?—అయినా యింత మరిపిక్షి మనిషికి..."

"అయితే నిజంగా నేనే మర్చిపోయానంటావా?"

"గుర్తు తెచ్చుకోండి! మొన్నరాత్రి మీరేగా...బజారులో పాలడబ్బా దొరకడం లేదు. దొరికినా రూపాయి బేడా అమ్మేది రెండు రూపాయలన్నర అయింది. ఇక

మనం కొనడం కష్టం, అందుకని పిల్లడికి మామూలుప్రాతిలా అన్నం పెట్టడమే అలవాటు చెయ్యమన్నాను?"

"అయితే అన్నం పెడుతున్నావా యేమిటి?"

"నిన్నా, యివ్వాళా అలా పెట్టడం మొదలెట్టేసరికి మామూలుగా తినే మెతుకన్నా మింగడం లేదు. మధ్యాహ్నం మీరు వెళ్ళిన తరువాత రెండు గంటలకి కాస్త చారుపోసి పల్చగా కలిపి మింగుతాడేమోనని నోట్లో పెడితే బళ్లున కక్కేశాడు. అప్పట్నించి యిదే వరస—ఏడవ డానికి—"

"ఇవ్వాళ సాయంత్రం మాధవరావూ నేనూ బజారంతా గాలించినా ఒక్కటుంటే ఒక్కటి మంచి డబ్బా దొరక లేదు. ఏనాడో వచ్చిన నక్షత్రం మార్కు డబ్బా ఒకడి దగ్గిర వున్నది. అదయినా యెర్రపడి గడ్డకట్టిపోయింది. పద్నాలుగణాలు అమ్మేది రెండురూపాయల పావలాకి కొనుక్కు వెళ్లాడు. అసలు లేనిదానికంటే నయంగదా అని"

"నయమే—అతనికేం? నూటయాభై రూపాయిల జీతం. అది పనికిరాదన్నా రేపు మరోటి కొనుక్కు పోతాడు. మరి మంచిది దొరికినా మనకిక్కడ..."

"డబ్బాలేదు—ఇప్పుడు బొత్తిగా లేదంటావా? అయితే వీడు యేడుపు మానే విధానం?"

"అబ్బా...ఎన్నిసార్లు నాచేత అనిపిస్తారు లేదని. వాడు అలా యేడుస్తుంటే మీకే కావున్న కడుపు తరుక్కు పోయేది?"

"ఎవరికై తేనేం? మనమీద పంచ ప్రాణాలూ పెట్టుకు బతుకుతున్న పసికూనల్ని మనతోపాటు మాడ్చిచంపడం—వాడికేం తెలుసునని?—ఇటుచూడు! ఒక్కసారి... ఏమన్నా గొంతు తడిస్తే వూరుకుంటాడేమో...తరువాత కాస్త పల్చగా కలిపి పెట్టుదువుగాని. రేపుకూడా ప్రయత్నించి చూస్తాను—మాధవుడుకూడా వూళ్లో లేడు, రెండు రూపాయలన్నా అడుగుదామంటే..."

* * *

"ఇంకా యిలాగే కూచున్నారేం లేవండి అన్నానికి! పిల్లాడు పడుకున్నాడు ఇప్పుడే...మళ్లీ లేచాడంటే మనిషన్నికూడా అన్నం తిన్నియడు. తరువాత రాసుకోవచ్చు లేవండి! అన్నానికి—రోజూ లేనిరాత ఇవ్వాళ యే మొచ్చిందో..."

"విస్తట్లో అన్నం పెట్టేయిగా. కొంచెంసేపు ఆగు ఇది పోస్టులో పడేసి ఇప్పుడే చక్కా వస్తాను. లేకపోతే ఇంతలోకే నువ్వు తిను. తరువాత నాకు పెడుదువుగాని—"

"అంత తొందరేం? నాలుగింటిలోగా పోస్టు చెయ్య లేరూ? అన్నానికి పదండి! పన్నెండు గంటలు దాటింది కూడా—"

"నిన్ను ముందర తినమంటున్నానుగా!"

"ఎంత తేలిగ్గా అంటారు తినెయ్యమని? గిన్నెలో అన్నమన్నా పెట్టుకుతినడం చేతకాదు మళ్లీ..."

"నా జేబులో కవరుండాలి ఏమయింది?"

"ఏమవుతుందీ?—ప్రతిదానికీ మతిమరుపేనా? అప్పుడే పైత్యాన పడుతున్నట్టున్నది ప్రాణం. నిన్న మధ్యాహ్నం మేగా కాకినాడ వుత్తరం రాశారు నరశింహానికి?"

"ఆఁ...హాఁ...అయితే పద అన్నం పెట్టు."

"ఏమిటో వుత్తరం అంత అర్జంటుగా పోస్టు చెయ్యాల్సి నదీ?"

"ఏదోలే...పద! అన్నం పెట్టమంటున్నానుగా..."

"ఇంత సేపట్నించీ ఆలస్యం చెయ్యొచ్చుగాని ఒక్క మాట చెప్పేసరికే అంతా మించిపోతుంది కావున్ను"

"నేను చెప్పను—ఇదుగో! కావాలంటే చూసుకో!"

"ఏం నాకు తెలియదనేగా మీ ఆక్షేపణ! ఇలా ఇవ్వండి చూస్తాను."

"అయ్యో నీకు తెలియకపోవడ మేమిటి? థర్డ్‌ఫారం చదివినదానవు—"

"—ఏమిటిదీ?"

"ఏం నీకూ కనబడుతోందీ?"

"మరి ! !—"

"తొందరపడకు—నాకు తెలుసు—నేనూ ఆలోచించాను—చివరికి తోచింది—అంత్య నిష్ఠూరంకంటె ఆది నిష్ఠూర్యమే మేలని. అందుకే యిలాగని చేశాను"

"అమ్మయ్యో...—"

"మరేం గాభరాపడకు—పద—అన్నం పెట్టు—"

*　　*　　*

"నన్ను హాయిగా చచ్చిపొమ్మంటూరా ?"

"ఇహెహె...పిచ్చిదానా! నువ్వూ నేనూ చచ్చిపోయినంత మాత్రాన సమస్యకాదు. ఇది జాతినంతనీ పట్టి పీక్కుతింటుంది పిశాచంలాగ"

"అందుకని—నిండుజీవమే ?—చేతులారా..."

"చేతులారా... నేనే ?"

"అవును. మీరే—"

"కాదుకాంతా పొరబడుతున్నావ్. నన్ను యేనాడో దరిద్ర దేవత బలిగొన్నది. అదే నన్నీ అకార్య కరణాలకి ప్రేరేపిస్తోంది నిజం చెప్పు—నీకు...ఇప్పుడు..."

"అవును మూణ్ణెల్లయింది"

"ఈ పసిగుడ్డు పాలన్నా వదల్లేదే...మళ్లీ..."

"అవును, అయినా ఈ అకార్యమే ? అమ్మయ్యో!..."

"కాంతా ! అలా పడిపోకు పడిపోకు"

*　　*　　*

"నిజంగా తప్పంతా నాదేనంటావా కాంతా ?"

"నన్నేం జెయ్యమంటూరు ? వేళకి యింత అన్నం వండిపెట్టి మీ యిష్టం వచ్చినట్టు మెలుగుతూవుండడమేగా నేను చేస్తున్నదల్లా. అంతకంటె నాకేమన్నా తెలుసునంటూరా ?"

"నిజమే—నీకేమీ తెలియదు. నిన్ను అనవసరంగా ప్రసవించిపెట్టాను. ఈ పుట్టిన బిడ్డకంటె యింక పుట్టబోయేవాడి భవిష్యత్తు తల్చుకుంటే పేగులు కోసుకుపోతున్నాయి ...అబ్బ...నన్నేం చెయ్యమంటావు చెప్పు !—తల పగిలిపోతోంది—ఈ బిడ్డన్ని బతికించడం ఏలా ?—అదుగో—నా బిడ్డకి చెప్పాడు పాలు లేకుండా పాలడబ్బా లన్నీ దాచేశారు—నిలువునా ఈ పసికందుల ప్రాణం తీస్తున్నారు—జాతిలో ఇంత అక్రమం ఏర్పడ్డది ? వాళ్లని ఏమి చేసినా పాపంలేదు కాంతా—అబ్బా నా మతిపోతున్నా వుంది."

"కాసేపు యీ మంచంమీద కూచోండి ! మీరంతి హైరాన పడితే నాకు యెవరు ధైర్యం చెబుతారు ? ఇవిగో గుక్కెడు మంచినీళ్లు తాగండి ! ఎల్లకాలమూ మీరూ వుద్యోగంపోయే కూచుంటూరా ?—నా కోసినవాడు నీ కొయ్యడూ ?"

"కాంతా ! !"

"లేవకండి ! ఓ క్షణం స్తిమితంగా కూర్చోండి ! !"

*　　*　　*

"అలా పిచ్చివారులా కూచుంటే మనకి యెవరు చెబుతారు చెప్పండి ? నాలుగు మెతుకులు తిని ఆ రామ్మూర్తిగారు రమ్మన్న సంగతేమిటో కనుక్కురండి—చూడండి—పెండ్లికోసమైనా..."

"లేస్తాను మనకి బిడ్డ అయి పుట్టిన యీ దౌర్భాగ్యుడి బ్రతుకు యేమాతుందా అని—"

"అలా నీళ్లుగారిపోతే యేమైనట్టు ? నా బిడ్డని బ్రతికించుకోడానికి నేనుకూడా యేమన్నా చెయ్యగలనేమో ఆలోచించాను. ఈ రోజునే పార్వతీబాయమ్మగారి దగ్గిరకి వెళ్లి అడుగుదా మనుకుంటున్నాను"

"ఏమని ?"

"నేను చేయగలిగిన పని ఏమైనా చూపించమని—"



యందు లేదు! (ప్రవేశము. ఛన్నుడు వస్తువుల మూటతో.)

శు:—(ఆత్రముతో) ఛన్నా! యువరాజును జూచితివా? ఆ చేతనున్న దేమి?

ఛ:—(నమస్కరించి గుటకలు మింగుచు) మహాప్రభూ! నోరు రాకున్నది! ఏమి చెప్పవాడ? యువరాజు; సన్య—సన్యసించెను!

శు: య:—(ఒక్కసారిగా) ఆఁ! అయ్యో!!—

శు:—(దుఃఖముతో) అయ్యో! నాజీవధనమా!—(మూర్ఛ)

య:—(విచారముతో) అహా! ప్రాణేశ్వరా!—(మూర్ఛ)

ఛ:—ఎంత కష్టమెంతకష్టము! (తెరలో: విషాదగీతము.)

అనాథా ఏలనీకీ ఆశా!
విధాతానుదుట వ్రాసినవ్రాతా ॥అ॥
కన్నులా నీర్గార్పగ మేలా!
కాలమేఘారంబరమె బేలా
నీస్వామియే నిను వీడగనేలా
కాలిపోకీ లీలా ॥అ॥

పోయేవారు పోవకపోరూ!
పోయేవారితో పోవగలేరూ!
మనసు ఒకేలా నిలుపగజూడూ!
మరపును జెందగమేలూ!
లిఖితము గలిగిన కలువగ గలవు!
లెమ్మికభేదము విడువూ! ॥అనాథా॥

శు:—(లేచి ఛన్నునితో) యెట్లు సన్యసించెను మమ్మం దరవీడి?!—ఛన్నా! సంగతి నంతయు సవిస్తరముగ జెప్పుము.

య:—(లేచి వినుచుండును.)

ఛ:—అర్థరాత్రి సమయమున నాగృహమునకు వచ్చి—నన్ను మేల్కొల్పి—'ఛన్నా! నాకొక గుఱ్ఱము కావలెనని' అడిగెను!—విషయములు విషసమానము లనియు, యిట్టి విషయ ప్రపంచమును తాను సన్యసించుచుసత్యాన్వేషణార్థమై—తపోభూముల కేగుచున్నాననియు జెప్పెను! తాను ధరించియున్న ఈ దుస్తులు మొదలగునవి (చూపి) పరిత్యజించి—చినుగు వస్త్రముల ధరించెను! పొడవైన తలజుత్తును—మొదలంట తెగగోసికొనెను!

శు:—ఛన్నా! నీవైన తగదని జెప్పకపోతివా?

ఛ:—ప్రభూ! నేను—'యువరాజా! ఇది సాహస' మంటిని! 'తండ్రిగారును, భార్యాపుత్రులు నెట్లు దుఃఖింతురో యోజింపు' మంటిని!!—కా—నీ తన మార్గము ఒప్పిదమైనదేయని నాకు బోధించెను!—నేను నిశ్చేష్టుడనై పోతిని! అప్పటికప్పుడే గుఱ్ఱము నెక్కి తివ్వున పోయెను!

శు:—అయ్యో! ఛన్నా!—(ఆగి) మాగురించి యేమేమి చెప్పెను?

ఛ:—తండ్రిగారికి వందనములనియు, తాను మహత్తర కార్యార్థమై పోవుచున్నాననియు, విచారము వలదనియు, తన్ను వెదకించుటయు తగదనియు,—భార్యాపుత్రులకాశీర్వాదములనియు, తనప్రయాణమునకై వారిని విచారింపవలదనియు—తాను చెప్పినట్లుగా చెప్పవలసినదిగా—నాకు చెప్పెను!

శు:—అయ్యో! వెదకింపరాదనికూడ జెప్పెనా!—అకటకటా!

య:—హా! ప్రాణపతీ!

శు:—బిడ్డా! యశోధరా! దైవవిధి కెవరేమి సేయగలవారు! మన చిరంజీవిని—రాహులుని జూచుకొనుచు—త్వరలో సిద్ధార్థుడు—సిద్ధుడై—బుద్ధుడై—మనల జేరు గాక యని దైవమును ప్రార్థింపుచు—వానిరాకకు నిరీక్షించుచుందును గాక!

య:—(మహాదుఃఖముతో) అయ్యో! ప్రాణేశ్వరా! నిన్ను బాసి ఈ శరీరమును నేనెట్లు నిలుపనేర్తును!—అకటకటా! ఇట్లు జరుగునని నేను కలనైనను దలంచితిని గాదే! అట్లు కలనైనను గాంచియున్న పక్షమున నేను

# పిల్లల శిక్షణ శాస్త్రీయ దృక్పథం

శ్రీమతి దరిసి సుభద్రమ్మ

## సుశిక్షణ :

శిక్షణ అనగా, బిడ్డకు నిర్బంధముతో నేర్పుట, విషయ పరిజ్ఞానమును మాటల మూలకముగ బిడ్డ బుఱ్ఱలో కూరుట అని పెక్కుమంది భావించుతారు. ఇట్టి అభిప్రాయము లెంత అనర్థదాయకమో వారెరుగరు. బలాత్కారన పరచటం అనేది బిడ్డను శిక్షించటం అన్న మాటే. అది ఎన్నటికీ సుశిక్షణ అనిపించుకోదు. బిడ్డకు మూడేండ్లు నిండువరకు దానికి బోధించటం, నేర్పటం అనేది సాధ్యమైన విషయం కాదు. కారణమేమంటే, బిడ్డకు మూడేళ్లు నిండకముందు దానిలో స్పష్టచైతన్యం పూర్తిగా, వికాశమై యుండదు. అంతవరకు అవ్యక్తచైతన్యంతో పరిసర పరిస్థితులను ఆకర్షించుకొంటుంది. కాబట్టే, బిడ్డకు మూడేళ్లు నిండుదాక సుశిక్షణ ఇవ్వటం అంటే :—బిడ్డ సాధించవలసిన ప్రతి లక్ష్యమున కనుగుణంగా ఎట్టి అవరోధము కల్పించకుండ, ఆవశ్యకములైన సదుపాయమును కల్పించుట; అవసర సందర్భ మేర్పడినపుడు మాత్రమే తెలివి తేటలతో తోడ్పడుట అని అవగాహనం చేసుకోవాలి.

## స్వతంత్రము, స్వయంకృషి :

స్వతంత్రము బిడ్డకు జన్మతో పుట్టింది. తల్లి గర్భమనే చీకటి చెఱసాలనుండి విముక్తిచెంది బాహ్య ప్రపంచంలో ప్రవేశించగానే, బిడ్డ స్వయంగా, స్వేచ్ఛగా ఉచ్ఛ్వాస .నిశ్వాసములను జరుపుకొనుట, ఆహారం పుచ్చుకొని జీర్ణించుకొనుట మున్నగు శరీర ధర్మములను చేసుకోటానికి కృషి సల్పుతుంది. అంతకుముందు శిశువుకు మానసికంగా ఎట్టి వ్యాపారము లుండలేదుకదా! అయితే, పుట్టిన కొన్ని ఘడియలనుండియే అంతర్గత ప్రేరేపణ మూలకంగా బాహ్య ప్రపంచ సానుభూతి, పరిసర పరిస్థితుల పరిజ్ఞానములను ఆకర్షించుకొంటు, స్వేచ్ఛగా, స్వయం కృషితో మానవ సహజగుణములను నిర్మించుకొంటుంది. అనగా—శారీరకంగా అభివృద్ధిపొందుతూ మనః ప్రవృత్తులను, బుద్ధిని నిర్మించుకొంటుంది. బాలలీలలు, క్రీడద్వారా, అనగా—ఆటలు అన్వేషణ, అనుకరణ, పరిశీలన, వినోదములు మూలకంగా—జ్ఞాన కర్మేంద్రియముల పాటవము, శారీరకంగా పెరుగుదల, మానసిక వికాశము పొందుతుంది. ఇంతేకాదు, స్వతంత్రము, స్వయంకృషి అనేవి ప్రతిప్రాణికి ప్రకృతియే ప్రసాదించిన ప్రథమ సూత్రమన్నమాట. ప్రాణులలో సర్వశ్రేష్ఠుడు మానవుడు. స్వతంత్రము స్వయంకృషుల వలననే మానవార్హమైన పెక్కు లక్ష్యములను సాధించుచూ, అభివృద్ధి శ్రేణి నారోహించుతాడు; చివరి లక్ష్యసిద్ధికోసం తన గమ్యస్థానమునందుకొనుటకు అహర్నిశలు కృషి సల్పుతాడు. సంక్షిప్తంగా: తను జన్మించిన దేశకాల సంఘ కుటుంబములయొక్క పరిసర పరిస్థితుల కనుగుణంగా ఆచార వ్యవహార సంప్రదాయములను అలవర్చుకొంటూ, వివేక వికాసమును పొందుతూ ఆనందమయ జీవితమును జీవించుటకు ప్రయత్నించుతాడు.

బిడ్డ ఏ ఏ వయస్సులో ప్రాకటం, దోగాడటం, కూర్చోటం, నిలవటం, నడవటం, మాట్లాడటం మున్నగు లక్ష్యములను సాధించుతుందను విషయాన్ని (అనగా—వయోనుగుణ్య పరిమాణము) మన మిదివరకే కొంత చర్చించుకొన్నాము. ప్రతిఒక్క లక్ష్యసిద్ధికై బిడ్డ సల్పు స్వయంకృషికీ, స్వేచ్ఛకూ అడ్డుతగులుటచేత లేక అపక్వదశలో—అనగా తగిన వయస్సురాక, శరీర నిర్మాణము పూర్తికానప్పుడు—బలాత్కారపఱచి బిడ్డకు పైజెప్పిన వాటిని నేర్పుటకు ప్రయత్నించుటచేత, బిడ్డకు తీరనిలోటు శారీరకంగా, మానసికంగా—ఏర్పడుతుంది. కొంత విపులంగా పరిశీలించుదాము.

బిడ్డ నడవటం అనే లక్ష్యాన్ని సాధించటమనేది అత్యంత అమోఘమైన విజయం. నిజస్థితిలో, బిడ్డ రెండవ పర్యాయము

రించుటకు ప్రారంభించగానే, అది ఏవో అవ్యక్త ధ్వనులు చేయటం, అస్పష్టముగ శబ్దముల నుచ్చరించటం, ఒకటి రెండు శబ్దములు చేరిన పదములను పలకటం, రెండు, మూడు పదముల చేర్చి మాట్లాడటం ఈ విధంగా చక్కగా మాట్లాడుటను సాధించుటకు అమోఘమైన, అవిరామమైన కృషి సల్పుతుంది! పొద్దస్తమానం వాగుతూ వుంటుంది. అట్టి తరుణములో తల్లి బిడ్డ కవరోధం కల్పించక, స్వేచ్ఛగా వాగటాని కవకాశమివ్వాలి. తల్లులు కొందఱు విసుగుతో, బిడ్డ వాగకుండ ఆపటానికి ప్రయత్నించుతారు. అసలు ఆపటమనేది అంత సులభసాధ్యంకాదు. పైగా, భయపెట్టి, అభ్యంతర పెట్టుటచేత బిడ్డ ఉచ్చారణలో, భాషలో లోపము ఏర్పడుతుంది. బిడ్డ వెలిబుచ్చు వాంఛలకు, భావములకు అవరోధము ఏర్పడుటచేత, కొన్ని సమయాల్లో 'నత్తి' కూడ ఏర్పడుటకు వీలున్నది. అంతేకాదు బిడ్డ అనుభూతికీ, పరిజ్ఞాన సంపాదనకూ కొద్దో గొప్పో అవరోధం కలుగుటకు అవకాశమేర్పడుతుంది.

సాధారణంగా, బిడ్డకు రెండేళ్లు నిండుకాలంలో అది తల్లి మీద ఆధారపడకుండా స్వయంగా తన పనులను చేసికొనుటకు అభిలాష, ఆసక్తులను వెలిబుచ్చుతుంది. ఎవరి సహాయ మపేక్షించకుండ దుస్తులను తొడుగుకొనటానికి, విప్పటానికి, అన్నము తన చేతితో తీసుకొని నోటపెట్టుకోటానికీ, ఇంకను పెక్కు పనులను స్వయంగా చేయటానికి కృషి చేస్తుంది. ఇట్టి స్వయంకృషిలో పెక్కు పర్యాయములు తప్పిపోయినప్పటికీ, తుదకు సాధించి తీరుతుంది. ఈ విధమైన బిడ్డ స్వయంకృషి స్వేచ్ఛలకు ప్రతిబంధకములు కల్పించినయెడల బిడ్డ అత్యంత పట్టుదలతో ప్రతిఘటించుతుంది: కాని, కొందఱు బిడ్డలు మాత్రము తమ స్వేచ్ఛ స్వయం కృషులను అవరోధించు పరిస్థితులను (అనగా— తల్లి లేక మరెవరుగాని బిడ్డకు సర్వము తామే చేయటం, లేక ఏదోవిధంగా అడ్డు తగలటం) ప్రారంభదశలో పట్టుదలతో ప్రతిఘటించినను, క్రమక్రమంగా వారి పట్టుదల సడలిపోతూ తుదకు అట్టి నిర్బంధ పరిస్థితులకు లొంగిపోవుట కలదు. ఈ రీతిగ లొంగిపోయిన బిడ్డలు అత్యంత వినయ విధేయతలుగల బిడ్డలని అనేకులు భావించుటకలదు. ఇది గొప్ప పొరపాటు. (కొందఱు ఈ విధంగా లొంగిపోవుటకు కారణము లనేకములు. వాటిలో కొన్ని కారణాలు: అనారోగ్యము, వయోనుగుణ్య పరిమాణం లేకపోవుట. వాతావరణం పరిస్థితుల ప్రభావం మున్నగునవి.) ఈ విధముగ లొంగిపోయి తూచా తప్పకుండ తల్లి ఆజ్ఞానుసారం మెలగునట్టి బిడ్డ స్వతంత్రించి స్వయంగా ఏ కార్యమునుగాని చేయజాలదు. అనుక్షణం తల్లిమీద ఆధారపడి యుంటుంది. తత్ఫలితముగ, అనుభూతికి లోటు ఏర్పడి బుద్ధి వికాశం పొందదు. శక్తి సామర్థ్యములు, నైపుణ్యం మున్నగునవి వయస్సుకు తగినట్టుగ వికాసము పొందవు. కొన్ని సందర్భములలో—(తల్లి అజ్ఞానంవలన) ఇట్టి బిడ్డలు పెరిగి పెద్దవారైనపుడు మందమతులగుటకు కూడ అవకాశమేర్పడుతుంది. మఱికొందఱు బిడ్డలు, ప్రారంభంలోనేగాక చాలకాలము వఱకు ప్రతిబంధకములను అనేక పర్యాయములు ప్రతిఘటించుతారు. ఇంకను కొందఱు ఎప్పటికీ ప్రతిఘటించుట కలదు; ఆ విధంగా అనేక పర్యాయములు ప్రతిఘటించిన ఫలితముగా, తమ సహజవాంఛలు నెరవేరనందున, మానసిక సంబంధ వ్యాధులకు బిడ్డలు గుఱి అవుతారు. (అనగా నరములకు సంబంధించిన వ్యాధులు సంభవించుతవి) పైగా, ఇట్టి బిడ్డలకు మంకు పట్టు, మంద బుద్ధి, చిలిపితనము పట్టుపడుతాయి. కాబట్టి, తల్లి ఏ విధంగా బిడ్డ స్వయంకృషికి అవరోధము కల్పించకుండా దాని అభ్యుసిద్ధికై సహాయపడాలో ఆలోచించుదాము.

ఎంత చుఱుకుదనము, సూక్ష్మ బుద్ధి గల బిడ్డయైనాసరే— సాధారణంగా రెండున్నర సంవత్సరములు ఈడు వచ్చేవఱకు ఇతరుల సహాయము లేకుండ స్వయంగా దుస్తులను తొడుక్కొనుట కష్టసాధ్యమైన విషయమే! కాబట్టి, బిడ్డచేయు స్వయంకృషికి అడ్డు తగులకుండ మొదటి నుండియే, చొక్కా తొడుగుట కనువుగానుండునట్లు బిడ్డ చేతులను చాచులాగున ప్రోత్సహించినట్లైతే బిడ్డ అలా చేస్తుంది. అదేరీతిగ లాగును తొడగుటకు కాళ్లనందిస్తుంది; క్రమేణ, స్వయంగా తొడుక్కొనుటకు ప్రయత్నిస్తుంది. తల్లి అతి మెళకువతో బిడ్డయే స్వయంగా దుస్తులను తొడుక్కొనేటట్లు తోడ్పడుతూ, తన సహాయ

నా ది
నా ది
నా ది




నా ది
నా ది
నా ది

# అమృతాంజనము

గాని,

“ యథాయథా................ కాళీధవళత్వ శంకయా.”

అమృతాంజనమా ! నీ కీర్తి ముల్లోకములను దెల్పుఁజేయు పూనికతో పెరుఁగు చున్నప్పుడెల్లను, నా నల్లని ముంగురులు, దెల్లబడునేమోయను భయముచే నా హృదయము మిక్కిలి పరితాపమొందుచున్నది సుమా !!!

స్త్రీలలో భావోద్రేకశక్తి లేదనియే చెప్పవలసివచ్చును. కారణము నేను స్త్రీల వ్రాతమూలమున ప్రచారము చేయుచున్నది స్వల్పాతిస్వల్పము. నా వ్యాసమున పేర్కొనినటులు భావములు విశ్వవిద్యాలయములలో విద్య నార్జించిన విద్యావతుల సొత్తుగాదు. భావములు స్త్రీలందఱకు గలవు. ప్రచారము లేకపోవుటకు కారణము సోమరితనమే. బహుశః విమర్శకురాలి యభిప్రాయము భావములే లేవని గావచ్చును! నేను ఏకీభవించను.

దౌర్బల్య కారణములు వ్రాసి 'నిన్ను నీవే వెనుద్రోచి కొనుచున్నావు కనుక నీవే తీవ్రకృషి జరుపుము' అని ప్రబోధనతో ముగించితినని విమర్శ. నిజము. నిబిడీకృతమైన మహత్తరశక్తి స్త్రీ జాతిలో నున్నదని నా గాఢ విశ్వాసము. అదిలేనినాడు ప్రబోధములు ప్రచారములు చెవిటివానియెడ శంఖూదినట్లు నిరుపయోగములు. ప్రబోధము జాగ్రదవస్థగల్గి స్వశక్తిని గుర్తించి శృంఖలముల విముక్తిచెంది పురోభివృద్ధి చెందుమనియే ఉద్దేశింపబడినది. శక్తి బాహ్యమునుండి ప్రవేశింపదు. అంతర్గతమైయున్న శక్తి మహత్తరమైనది యని గ్రహించిన వ్యక్తి మహత్తర కార్యము లొనర్ప సమర్థుడగును.

"సిల్కుచీరలు..." లోను గాగిల వాక్యములను విమర్శించుతరి విమర్శకురాలు మొదట యపోహలకు లోనయ్యి తుదకు నావాదమును బలపరచిరి. విశాలదృష్టితో పరిశీలించిన యందలి విశేషములివి. ఆడంబరములకులోనై విషయ పరిజ్ఞానమునకు కృషిసల్పుటలేదు. కనీస మా వస్తువులగూర్చి యైనను యాలోచించిన బాగుండుగదా. చేతి గడియారమును ధరించి కాలమును గుర్తించుటకు అందలి యంత్ర శాస్త్రమునుగూర్చి యాలోచింప నక్కరలేకపోవచ్చును. ఆలోచించినచో దానియందు గూడ జన సామాన్యమున నొక మహత్తర సందేశ మున్నదని గ్రహింప వీలగును. గంభీరముగను, మృదువుగను ప్రవహించునది కొండలను కరిగించుచున్నది. జన సామాన్యమున కిది మహత్తర సందేశము కాదా? అట్టి తరి 'ఆలోచించిన విజ్ఞానం లభించునా' యను ప్రశ్నకు విమర్శకురాలే సమాధానము చెప్పుకొనుట మంచిది. దీని విషయమై తుదకు వ్రాసిన విమర్శా వాక్యములు ఆచరణీయములు. అన్ని వస్తువుల గురించియు ఆలోచింపవలెను. కాని యుక్తాయుక్తజ్ఞాన విహీనులై గాదు. ఉన్మాదులవలెనుగాదు.

ఆదర్శమహిళలు లేరా? అన్న విమర్శకు నా వ్యాసమున స్థానములేదు. ఆదర్శ మహిళలు పూర్వముండిరి. నేడున్నారు. రేపుకూడ ఉందురు. ఇది వాస్తవము. అట్టి ఆదర్శకత్వము సంపాదింపుమనియే వ్యాసమునొక్క ఉద్దేశ్యము. గాంధీగారు భారతీయులగుటచే భారతీయులందరు సత్యస్వరూపులు అహింసాపరులనుట అపోహ. గాంధీగారు మానవులు. 'ఒక మానవుడు ఆదర్శప్రాయుడైన తక్కిన మానవులు గూడ అట్టి ఉన్నత స్థితికి రాగలర'ని మాత్రమే ఋజువగుచున్నది. అట్లే కొందరు మహిళలు ఆదర్శప్రాయులగుట నారీలోకము ఆదర్శప్రాయమైన దనుట అపోహ. ఇదికాక మొదట వ్రాసినట్లు లోపములనే పేర్కొని విమర్శించితిని. యీ లోపములున్నవారియందున గూడ ఉత్తమములైన యనేక సల్లక్షణములుండవచ్చును. అవి యప్రస్తుతము.

ఆలోచనకు నే నొసగిన నిర్వచనము గ్రహించినచో సంఘములో స్త్రీ ప్రస్తుత ప్రవర్తనకు కారణము ఆలోచనలేమి కాదని విమర్శకురాలనరు. మరియొక విషయము. స్త్రీకి స్వేచ్ఛా ప్రవర్తనకై సంఘానుమతి లేదనిరి. నిజమే కాని, హక్కుకై పోరలేనివారు హక్కును పొందనర్హులు గనుక పోరి హక్కు బడయవలయు లేనిచో అనుమతి పొందిన పిదప ప్రవర్తన మొదలిడుచున్నచో అది ఫ్రాన్సులో స్వేచ్ఛమాదిరి యగును. వారికి స్వేచ్ఛకై హక్కు గలదు కాని స్వేచ్ఛకై హక్కు వ్రాయబడియుండని ఇంగ్లాండు దేశములో, వారికంటె ఎక్కువ స్వేచ్ఛ కలదు. ఇంగ్లాండు ప్రజలు క్రమ పద్ధతిని సంఘమునట్లు సంస్కరించుకొనిరి. విమర్శకురాలు కోరిన యనుమతి రాజ్యాంగములో వచ్చినది. తీవ్రకృషి లేనిదే యవి నామమాత్రములగునని చెప్పుటకు సాహసింతును. తీవ్రకృషి 'యాలోచన' మీద యాధారపడును. సంస్కరణ పూర్వకమైన కార్యాచరణ దానిమీదనే యాధారపడును. కాన నే పేర్కొనిన ప్రవర్తనకు కారణ 'మాలోచన' లేకపోవుటయే, యను

(తరువాయి 4రవ పేజీలో)

# "నాటి బండ — నేటి దేవుడు"

* శ్రీ జగపెల్లి సింహాచలం *

అది ఉజ్జయినీ నగరములో మహారాజా విక్రమాదిత్యుని విశాల భవనం. భవనంలో దైవ మందిర నిర్మాణం జరుగుతోంది. నిత్యం అనేక మంది కళారాధకులు, చిత్రకారులు, ఆ ఉజ్జయిని గ్రామానికి తమ తమ గ్రామాలనుండి వెళ్లు తున్నారు.

చాలాకాలమై ఉజ్జయినీ నగర మార్గములో ఒక పెద్ద బండరాయి పడివుంది. ప్రతిరోజూ దారిపోయేవారి కాలి తన్నులు, తిట్లు భరించ లేక పోయింది. తనకు యిటువంటి జన్మ యిచ్చి నందుకు ఆ ఈశ్వరుని ప్రార్థిస్తూ ప్రార్థనలో తన మనస్సు లీనంచేసుకొంది. పగలంతా గడిచింది. బండరాయిమాత్రం శంకరుని స్తుతిలో లీనమై ఉంది. రాత్రి అయింది బండరాయికి మమత క్రమ్మింది. మమతలోనే కలగంది. కలలో ఉమాశంకరుల సాక్షాత్కారం కలిగింది ఆ బండకు. ఏవో కొన్ని మాటలు వినిపించాయి.

"విక్రమాదిత్య మహారాజావారి దైవమందిర నిర్మాణం జరుగుతోంది. ప్రతిదినం శిల్పు లనేక మంది నీ ప్రక్కనుండి పోతున్నారు. వారిలో బసవయ్య పరమ భక్తుడు. అతడితో మొర పెట్టుకో, నిన్ను ఉద్ధరిస్తాడు" అని

ఇంతలోనే స్వప్నానికి భంగం కలిగింది. నాల్గవ ఝాము పూర్తికావచ్చింది. మరికొంత సేపటికి బళ్లున తెల్లవారిపోయింది. యథాప్రకారంగా కళా నిర్మాతలు ఉజ్జయినీ నగరానికి పోతు న్నారు. ఈ పెద్దబండరాయి వాళ్లందరిని చూడ గానే నాయనా బసవయ్యా! అని కేక వేసింది. ఆ కేకలు విని బసవయ్యొచ్చి "సమయమా ఏం కావాలి?" అని ప్రశ్నించాడు.

"బసవయ్య బాబూ, ఒక చిన్న మాట చెప్తా విను. నేను నాజీవితంలో యింతవరకూ దెబ్బలు, తిట్లూ, నిందలూ అవమానాలు తింటూవచ్చాను. ఇంక మరి భరించలేను. నన్ను ఉద్ధరించే పూచీ నీపై వుంది. నీవు మహా శిల్పివి. బసవయ్యావు. ఈశ్వర భక్తుడవు. నీకు సాధ్యంకాని పని యేం మున్దినాయనా! ప్రజలు నన్ను అవమానించ కుండాను, అందరూ నన్ను పూజించేటట్లు చెయ్యాలి. ఇది మీవంటి కళారాధకులకు అతి సహజమైన పని. ఈమాత్రం నాయందు కరుణ చూపి నన్ను ఉద్ధరించవా?"

బసవయ్య నవ్వుతూ అన్నాడు. "సరేఅంతా బాగనే వుంది. నిన్నొక మంచి విగ్రహంగా చేస్తాను. సదా నువ్వు అందరచేత పూజింపబడ తావు. నిన్ను అంతా భక్తి శ్రద్ధలతో పూజ చేస్తారు. ముత్యాలహారతులతో తులతూగు తావు. తాళభావరాగములతో లీనమైపోతావు. అంతా నీ పాదాలమీదవచ్చి పడతారు." బండ రాయి ప్రసన్నమై "బసవయ్యా! నువ్వు ధన్యు డవు."

బసవయ్య బండరాయిమీద ఉలిదెబ్బలు ప్రయోగించాడు. "అయ్యో అంగ శిథిలం చేస్తున్నావా? చాల బాధ కలుగుతోంది." అని బండ మొరపెట్టుకుంది.

## నాటి బండ నేటి దేవుడు

బసవయ్య అన్నాడు "ఇలా చూడు — నువ్వు! అధికం మాట్లాడకు. నేను విననుకూడా. నువ్వు అందరిచేత పూజింపబడాలంటే మొదట ఈ కష్టం అనుభవించాల్సి యుంటుంది. కష్టాలు అనుభవిస్తేనేగాని నీకు ముక్తి, మోక్షం రెండూ లేవు. నీ వికృతరూపాన్ని మార్చాలంటే నీ శరీర భాగంలో కొంత భాగాన్ని నువ్వు త్యాగం చెయ్యాలి. అప్పుడే నీకు రత్నఖచిత సింహాసనం మీద కూర్చోడానికి అర్హత యేర్పడుతుంది. చెప్పు ఏమంటావు."

"అలాగే నాయనా బసవా ఉలిదెబ్బలు వెయ్యి" అన్నది బండరాయి.

నాటి బండ నేటి భగవంతుడు.

## మహిళా ప్రబోధం

([illegible]-వ పేజీ తరువాయి)

వాదన నంగీకరించుటకు నిమ్నకులాలి కర్తవ్యంలేక ముండో కూడదు.

పురుషులనుగూర్చి వ్రాయనంతమాత్రమున వారు పరిపూర్ణులని గాని పవిత్రులనిగాని నా యభిప్రాయముగాదు. స్త్రీలనుగూర్చి నే వ్రాసినంతమాత్రమున సుగుణములుగాని దుర్గుణములుగాని లేవనియుగాదు. ప్రస్తుత పరిస్థితులలో నా బుద్ధికి తోచిన ప్రబల కారణములను చర్చించితి. విజ్ఞానమొకరి సొత్తుగాదు. అభిప్రాయభేదముండుట తప్పుగాదు.

నేటికిని నా సమాధానమందలి విషయములు గ్రహించి నిర్మాలిన్యమైన మనస్సులో నా వ్యాసమును చదివిన గేలిసేసితినని గాని, అపహసించితినని గాని, నిందించితినని గాని నిరుత్సాహ పరచితినని గాని భ్రమపడ లేనుగాక మహిళాభ్యుదయ మాశించియే రచన మొదలిడి పూర్తిచేసితినని తెలిసికొనుటకు ఎక్కువకాలము పట్టదు.



## బాలలకు

### క్రొత్త సంవత్సరపు శుభాశీస్సులు

ఈ క్రింద కొన్ని ప్రశ్నలు, ఒక్కొక్క ప్రశ్నకు మూడేసి జవాబులు ప్రచురించి యున్నాము. ఆ జవాబులలో సరియైనదేదో తెలిసికొని, 10 సం॥ వయసుకు మించని బాలలంతా తమ ఉత్తరవులను మా కార్యాలయానికి, జనవరి 20-వ తేదీలోగా పంపిస్తే అన్నీ సరిగా వ్రాసిన వారి పేర్లు ఫిబ్రవరి నెలలో ప్రచురిస్తాము.

1. ప్రథమంగా భూగోళాన్ని ఓడపై చుట్టివచ్చినవారెవరు ?

   (కొలంబస్, మజిల్లాన్, వాస్కోడిగామా)

2. దక్షిణ ధృవమును మొట్టమొదట పరిశోధించినది ఎవరు ?

   (స్కాట్, అమండ్‌సేన్, జేమ్సుకుక్)

3. మాంగనీస్ ఏ దేశంలో అధికంగా లభిస్తుంది ?

   (ఇండియా, బ్రెజిల్, రష్యా)

4. మొట్టమొదట ఎలెక్ట్రిక్ బ్యాటరీ తయారుచేసినది ఎవరు ?

   (గాల్వనీ, వోల్టా, ఎడిసన్)

5. మహాభారతయుద్ధం జరిగిన స్థలమేది ?

   (కాశ్మీరు, సింహళము, కురుక్షేత్రము)

# పెద్ద పండుగ

కవితిలక, కవితావిశారద కాంచనపల్లి కనకాంబగారు

పెద్ద పండుగ పండుగలకెల్ల పెద్దది. పిన్నలకు పెద్దలకు కూడ నిది పెద్దపండుగ. మేడలకు మిద్దెలకు పెంకుటిండ్లకు, పూరిండ్లకు, తోటలకు, దొడ్లకు, బండ్లకు, పశువులకు, గోడలకు, గొబ్బిళకు కూడనిది పెద్దపండుగ. పాత వాసనలు వదలిపోయి క్రొత్తవాసన, క్రొత్త కాంతి, పెద్ద పండుగనాడు వింతవింతలుగా దేశమంతట వెలుంగుచుండును కదా! బూజు, బుగ్గి, దుమ్ము, దూగర దులిపి, సున్నములు, జేగురులుపెట్టి గోడసంచులుకట్టి, మాసిన బొమ్మలకు మరలరంగులువేసి సమస్తమునకు నూత్నశోభ కలిగింతురు కదా యీ పండుగకు. ఇల్లలుకుటయే పండుగకు లక్షణము. ఈ పండుగ కట్లుగాక యెల్లదిశలు సల్లలితముగా ప్రకాశింప జేయుట లక్షణము.

పెద్దపండుగ కన్నులపండుగ చెవులపండుగ. పశువుల మోముల పసుపుకుంకుమలు, కొమ్ములకు వెండి బంగారు పూతలు, కుచ్చులు, క్రొత్తపలుపులు, సిగమోరలు, గజ్జలు, మువ్వలు, గంటలతో కన్నబిడ్డలకన్న గారాబముగ జెంతురు గదా కాపుబిడ్డలు తమగోరాజములను.

పొలములలో కనక శలాకలవలె పచ్చగాపండి నిలువున పొలుపుగాంచు బంగరుగిలకి పండ్లన నొప్పారు కంకులతో నలంకరింపబడిన జొన్నచేలు కన్నులపండువ, ఆకులు పచ్చలు వోలుమిరపచేలు, గోమేధికములబోలు బంతిపూలు, కెంపులబోలు పండుమిరపపండ్లు, ఇంద్రనీలములవంటివి వంగ పిందెలు, ముత్యములబోలు మంచుబిందువులు, రత్నకాంతుల వింతవింతలగు కుసుమములతో విరాజిల్లుతోటలు కన్నుల పండువ,

రససిద్ధులు, హేమ విద్యాధురంధరులు మాధలోకమున కదృశ్యులయ్యు, తమ విద్యా ప్రౌఢినిరూఢిగఁదెలుప గోరి వారై, తెలసెవ్వరెఱుంగకుండ నిర్మించిపోయిన పాదరసపు గుండ్లాయివి, బంగారు గుండ్లాయివి యన్నట్లు తెల్లగా పచ్చగా నెడనెడగాన్పించు బూడిద గుమ్మడిపండ్లు, మంచి గుమ్మడిపండ్లు కన్నుల పండువకదా! రంగురంగులపిట్టలు చుక్కచుక్కలపక్షులు, వన్నెవన్నెలచిలుకలు, బారులుగట్టి మింటబారుచు చేలపై వ్రాలుచుండ మంచుపై నారోగ్య సౌందర్యముల నొసగ్గారుచు పిడకిట నడదెను నసుము లని యాడబహునాశముల గోళముల బూనిన వడిసేల త్రాళ్లరాళ్ల బూన్చి బరబరద్రిప్పుచు కేకలువేయుచు మూకలజెందు త్రిపురసుందరులో యనంజాలు కాపు జవరాండ్ర విలోకించుట కన్నులపండువ కాదా! కిన్నరాంగనలట్లు సన్నని యెలుంగుతో జట్టుగట్టిపాడుచు మాతంగకన్యలు కొడవళ్లు చేతబట్టి, సంగుదాలేమను, వరిచేలలో గోతలబట్టుట చూడ కన్నులపండువ కదా! తామర పుష్పాళ్లతో పచ్చనైన మానస సరోవరమున పిండుకట్టి వినోదముగా చక్రభ్రమణంబున విహరించుహంసలట్లు పచ్చగా విస్తరించిన వరికళ్లములలో తెల్లని యెద్దులు కంకులధాన్యము రాల్చుటకై గుండ్రముగా గుంపుగా దిరుగుట కన్నులపండువ కదా! మేరు సగ్యోత్ర శిఖరములపై విహరించు దేవతలు భూలోక విహారము సలుపనిచ్ఛ గలిగినవారై తమ వినోదమునకై నగరములోని గుంపులుకంపులు భరింపలేక కమ్మనిపయ్యెర గాలి విసరు పల్లె పొలములలో నిలుపుకొన్న బంగరుతిప్పలాయన్నట్లు కొమరుమిగుల పరిగడ్డివాములు కన్నులపండువు కదా!

పూత మెఱుంగులతో సున్నము, సుద్ద, జేగురు నెత్తి మన్నులతో సన్ననున్నని గోడలు, అలుకులు ముగ్గులతో నున్న యరుగులు, పసుపు కుంకుమలతో కలకలలాడు గుమ్మములు, నిరుక్రేవల విలసిల్లుచుండ విశాలమై శుభ్రమైన వీధులు కన్నులపండువు కదా!

---

[పెద్ద పండుగయొక్క సంపచ్ఛోభా వైఖరులు యీ వ్యాసపు పూర్వభాగములో వర్ణించబడ్డాయి. వర్తమానంలో, ఆ శోభ క్షీణించటానికి గల కారణాలు సూచింపబడ్డాయి. స్వధర్మాచరణయందు మానవుఁడు చూపే ఉపేక్షయే ప్రపంచంలో చెలరేగుతున్న అశాంతికి, అసమృద్ధికి, అల్లకల్లోలాలకూ కారణాలని రచయిత్రి నొక్కి చెప్పుచున్నారు.]

# పెద్దపండుగ

వీధులలో వింతవింత ముగ్గులు, ముగ్గులలో తీరుతీరుల గొబ్బెళ్లు, గొబ్బెళ్లలో రంగురంగుల పువ్వులు చూడవేడుక. చిట్టిపొట్టి పదుచులు గుజగుజలాడుచు, గుంపులుకట్టి గొబ్బెళ్ల చుట్టు మూగుచు, బుడిబుడి మంత్రములు చెప్పుచు, గుమ్మడి పప్పులు, పాదములపరిడీలు నైవేద్యములు పెట్టుచు, పాటలు పాడుచుండుట చూడముచ్చట కదా!

వేకువజామునలేచి ధనుర్మాసస్నానములు కావించి, పట్టుబట్టలుకట్టి, తిలకములు దీర్చి, చిట్టితాళముల జేతబూని మంగళగీతములు పాడుచు భగవత్సంకీర్తనము చేయుచు వీధుల వెంటబోవు భజన పరుల పాటలు వీనుల విందు. రేగి పండ్లబుట్టలు, నారింజపండ్లగంపలు, చెఱకుగడల మోపులు వీధులలో వాలలాడి పోవుచున్నవి. కొండపల్లి బొమ్మలు నక్కపల్లి లక్కపిడతలు, పుదుచేర్చి బొమ్మలు, జాతి బొమ్మలు, తాటియాకు బొమ్మలు, తిరుపతి చందనపు బొమ్మలు, ఇంటింట నున్నతమగు వేదికలపై తీర్చబడి యున్నవి చూడసొంపు. క్రొత్త పెండ్లికొడుకులు, క్రొత్త మాయనియల్లుండ్రు, క్రొత్తబట్టలు, క్రొత్తవడ్లు, క్రొత్తగిత్తలు క్రొత్తక్రొత్త వేడుకలతోనంతయు క్రొత్తగా గానంబడు చుండును.

ఇప్పుడట్టి శోభతగ్గుటకు కారణమేమి? పెద్దలయందు గౌరవములేదు. దేవతారాధనములేదు. సత్యదయా శౌచ ములులేవు. హద్దులేదు. అజ్ఞలేదు. అహంకరించి యర్థ కామములలో దగుల్కొని, ఈశ్వరానుగ్రహమునందు విశ్వా సములేనివాడై, తన ప్రకృతిజయమునందు నమ్మిమానవుడు చెడిపోవుచున్నాడు. ప్రకృతి శాస్త్రమున గనిపెట్టిన క్రొత్త సాధనములన్నియు, మానవుని యహంకారమును పెంచు చున్నవేకాని యాపదమాన్పుటలేదు.

ఎంతయోజేసి యార్జించిన దంతయు యుద్ధములకు నాయుధములకు బోసి విశ్రాంతిలేక, ధర్మమోక్షములులేక యల్లాడుచున్నారు పాశ్చాత్యులు. వారి నాగరికతలోవారు దేవునిమఱచి వారనుభవించుచున్న సుఖమేమియు గానరారు. మనకట్టి సంపదలు సంగ్రామములు, సమ్మెలు లేకున్నను "ఒకప్పుడు దఱుగదింటం బాడియుంబంటయుఁ" అన్నట్టుగా మనము తినుటకు ఒకరికి పెట్టుటకు లోపము లేనివారమై భారతవర్షమున సుఖింపలేకున్నాము. ధర్మ నాశనమువలన యుద్ధములతో వారికి, ఉపవాసములతో అతి వృష్టితో, అనావృష్టితో, రోగములతో, భూకంపము లతో మనకు వినాశనము సిద్ధించుచున్నది.

పిడుగు యంత్రములు భూకంపములను తప్పింపలేక పోయినవి. శాస్త్రజ్ఞానము తుపాను నాపజాలక పోయినది. వార్తా పత్రికలు, రైళ్లు, తంతులు, విద్యుద్దీప ములు, మరలు, సినిమాలు, రేడియోలు మంచి వానలు కురియునట్లు తోడ్పడలేక పోయినవి.

మానవులకింత యహంకారము? గ్రామశాంతికై రాష్ట్ర శాంతికై మన పెద్దలు చేసెడి దేవతా రాధనములందు శాంతిక, పౌష్టిక కర్మములందు విశ్వాసము చెడగొట్టుకొని, యాధుని కులము మనయార్జించుకున్న విశేషమేమి?

భరతఖండము కర్మభూమి. కర్మమును వదలిదేవతా విశ్వాసము ధర్మమువదలి మనము నిష్కృత్యులమగుదుము. అధర్మమున నీతిబాధలు వృద్ధియగునని శాస్త్రము. ఈతి బాధలు ఆఱు; వాన, వఱపు, ఎలుక, చిలుక, మిడుత, చేరువరాజులనునవి.

ఆరాధనలచే మానవుడు దేవతలను దృప్తిపఱచినచో దేవతలు సువృష్టిచే మానవుల ననుగ్రహింతురు.మనము దేవతల కన్న బ్రాహ్మియధర్మ ప్రవృత్తులమగుదుమేని దేవతలును మన కన్నులంయూని యాపదలను ంతురు.

ఏ మహామహుని ప్రతాపంబున సముద్రము లింకిపోయి పట్టణములు పారావారములగు, దుమ్ము మేరువై, మేరువు దుమ్మైపోవునో, వరిగడ్డిపోచ వజ్రాయుధమై, వజ్రాయుధము తృణప్రాయమైపోవునో అట్టి పరమేశ్వరునుపాసించి సర్వశుభ ములు బడసి మనము సుఖపడుదుముగాక!

ఏటేట సంక్రాంతులు, సరస్వతీపూజలు, సారస్వతో పాసనములు, శాస్త్రపరిశోధనములు, వేదపారాయణలు, చతుష్షష్టి కళావిలసనములతో భరతఖండము కళకళలాడుచు, ప్రపంచమున కాదర్శ ప్రాయమగు గాత!



# మీరు మెక్లీన్‌తో
# నేడు పళ్లు తోముతున్నారా?



నేను ఎన్నో టూత్
పేస్టులు వాడినాను.
కాని, మెక్లీన్స్ అంత
మంచిది ఎక్కడా నాకు
కనిపించలేదు. నా
మిత్రులందరూ నా దంత
మాళికనో ప్రశంసిస్తారు.

నోటిని పరిమళభరిత మొనర్చి
దుర్వాసనను
నివారిస్తుంది

ఆమ్లాలను విరిచివేసి
మీ ఇగుళ్లను
సంరక్షిస్తుంది

పళ్లమీది మరకలను తొలగించి
వాటిని ధవళతర
మొనర్చుతుంది

మీరు మెక్లీన్స్ పెరాక్సైడ్ టూత్ పేస్టును వాడినప్పుడు మీ దంతాలకు, ఇగుళ్లకు అధిక రక్షణ నొసగడంతో పాటు ముఖాన్ని పరిమళ భరిత మొనర్చుకోవచ్చు. అందుకే కోట్ల కొలది ప్రజలు మెక్లీన్స తప్ప మరి దేనినీ వాడరు.

నేడే మెక్లీన్స్
కొనండి!




MTMS.TG.

అఖిల భారత మహిళా మహాసభ

# ఆంధ్ర రాష్ట్ర శాఖ

ఆంధ్ర రాష్ట్ర మహిళాసభ వార్షిక సమావేశము డిసెంబరు 29, 30 తేదీలలో నెల్లూరు పట్టణంలో శ్రీమతి సుమిత్రీదల దుర్గాబాయి ఎం.ఏ., బి.యల్., ఇండియా పార్లమెంటు సభ్యురాలుగారి అధ్యక్షత క్రింద జరిగినది—ఆహ్వాన సంఘాధ్యక్షురాలు శ్రీమతి పోణకా కనకమ్మగారు. ఈ మహాసభలకు వివిధ ఆంధ్ర జిల్లాలనుండి ప్రతినిధులు, శ్రీమతి కామేశ్వరమ్మగారు, అమ్మన్నరాజాగారు, రామసుబ్బమ్మగారు, చుక్కమ్మగారు, బుచ్చికృష్ణమ్మగారు మొదలైన ప్రముఖ ఆంధ్ర మహిళలుగూడ విచ్చేసియున్నారు. వీరికి విడిది కస్తూరిబా ఉన్నత బాలికా పాఠశాలలోను, మహాసభలు, వినోద కార్యక్రమములు పురమందిరములోను జరిగినవి. సభ ప్రారంభోత్సవము జరుపవలసిన శ్రీమతి పద్మజా నాయుడుగారు అనారోగ్యమువల్ల సమావేశమునకు రాలేకపోయిరి. అది సరిగా సర్దార్ పటేలుగారి శ్రాద్ధదినము కావటమువల్ల పతాకోత్సవము నిలుపబడినది.

శ్రీమతి ద్రోణంరాజు లక్ష్మీబాయమ్మగారు సభాధ్యక్షురాలికి, అతిథివర్గానికి స్వాగత వచనాలు పలికారు. ఆహ్వాన సంఘాధ్యక్షురాలైన శ్రీమతి పోణకా కనకమ్మగారు, ప్రస్తుతపు స్వదేశీవిదేశీ అంతర్జాతీయ సమస్యలనుగూర్చి విపులంగా ప్రసంగిస్తూ, "స్వరాజ్య సంపాదనకంటె స్వరాజ్యసంరక్షణ కష్టతరం. యుగయుగాలు మరపురాని, చెరుపలేని మహోజ్జ్వలమైన ప్రశస్తినిగడించి, విశ్వవిఖ్యాతమైన ప్రతిభతో ప్రభుత నెరపి, అజేయులై, సత్యాశ్రయులై సమస్తరంగాలలో అప్రతిమానంగా వెలుగొందారు ఆంధ్రవీరులు. విజయతిలకాలు దిద్దిన ఆంధ్ర స్త్రీలు తమకీర్తి నిలపాలి" అని ఉద్బోధించారు. ఇంకా "ఇండియా నేడు ఆసియాఖండానికి మకుటాయమానమై ప్రపంచ దృష్టిని తనవైపుకు ఆకర్షించుకుంటున్నది. జగత్తు ఒక ప్రక్క మృత్యుకేళిలో ఉన్మత్తంగా విలయ తాండవంచేస్తున్నా, ఒక వంక ఆశాదృక్కులతో భారత జననిని శాంతిభిక్షలు అర్థిస్తున్నది. ఈ జీవన మరణ సమస్యలో భారతజాతి కర్తవ్యము అమోఘము, భారతభూమి ఉజ్వల భవిష్యత్తులో స్త్రీలుసమ భాగినులు. స్త్రీల ఉన్నతిపై సమస్తజాతి అభ్యుదయము నిలచియున్నది. శాంతి, స్వేచ్ఛ, అభ్యుదయము ఈ మాతృపీఠమునుండియే ప్రబోధము కావాలి" అని ఉద్ఘాటించారు.

శ్రీమతి దుర్గాబాయిగారు తమ అధ్యక్షోపన్యాసములో, "అంతర్జాతీయ ఆకాశంలో ఆవరించియున్న కారుమేఘాల వల్ల, ఈక్షణమో, మరుక్షణమో, మనం చరిత్రలో కని విని ఎరుగని భీకరయుద్ధ జ్వాలలో చిక్కుకొనవచ్చు. ముఖ్యంగా శాంతి ఉద్యమమైన మహిళా ఉద్యమం, మనదేశంలోనే గాక ప్రపంచమంతటా దుర్బలంగా ఉండటమే ఈ అంతర్జాతీయరంగాలలో గోచరించే నిత్యసంఘర్షణకు మూలకారణం. ప్రభుత్వ శాశ్వత వ్యవహారాలలో మాతృదేవతలకివ్వవలసిన న్యాయమైన భాగం ఇవ్వనంతవరకు, శాంతికంటే అధికారాన్నే ఎక్కువగా ప్రేమించే రాజకీయవేత్తలే శాంతిని ఆదేశిస్తున్నారు.

"శాంతి సహకారాలను సుస్థిరంగా సంరక్షించగల్గునది, సుదృఢమైన స్త్రీ ఉద్యమం ఒక్కటే. చారిత్రాత్మక పోరాటంలో మనకు నాయకత్వం నెరపి దేశంకోసం ఎంతటి త్యాగానికైనా వెనుదీయక ఆనందంతోముందు ఉరికిన ఆ వందలాది దేశసేవికలు, వీరవనితలు, నేటికీ మన చెంత నున్నారు. మన సంఘాన్ని బలిష్ఠం చేసుకోడానికి వారిసేవను వినియోగించుకో లేకపోవడం మన దౌర్బల్యం. ఆదర్శయుతమైన, స్వార్థరహితమైన సేవాత్యాగములతో వృద్ధులై నిర్మాణాత్మకంగా మహత్తరమైన స్త్రీ సంస్థలను నెలకొల్పిన ధీరవనితలు తిరిగి మనకు నాయికలుగా మన సంఘబలమును పెంపొందిచుకొని ప్రభుత్వదృష్టిని, మహిళాభ్యుదయకృషి వైపుమరలునట్లు చేయాలి. దేశంలోని స్త్రీ సంఘాలన్ని ఒక సమాఖ్యగాచేరాలి. ఈ సమాఖ్య స్త్రీ సంఘాలయొక్క ఫెడరేషన్‌గావుండి ఒక దృఢమైన కార్యనిర్వాహకవర్గాన్ని ఎన్నుకోవాలి. ఇట్టి సంఘబలం సంపాదించినగాని, మన

మహా సభలలో చేసే తీర్మానాలకు అర్థంగాని, శక్తిగాని యుండబోదు," అని చెప్పుతూ యింకా

"పార్లమెంటులో వ్యాపించియున్న అభ్యుదయనిరోధక తత్వం హిందూ ధర్మ శాస్త్ర క్రోడీకరణ బిల్లు ఈనాటికి అమలు జరుగకుండుటకు కారణమైనది. నిన్నటి అభ్యుదయగాములు, అతివాదులు, సాంఘికచట్టాల విషయంలో అభ్యుదయ నిరోధకులుగా మారిపోవడం అతి విచారకరమైన విషయం. స్త్రీల వ్యక్తిత్వాభివృద్ధికి అవసరమైన కనీసపుహక్కులు కలిగించే మధ్యేకపుచట్టం మాత్రమే ఈ బిల్లు. రాజ్యాంగనియమాల ననుసరించి ప్రాథమిక హక్కులను స్త్రీలకు కూడా ప్రసాదించేది ఈ హిందూ కోడ్ బిల్లు. హిందూకోడంటే విడాకులబిల్లని, హిందూ మతానికే ముప్పుకలిగించునదని అభ్యుదయ నిరోధకులుచేసే నీతినినాదాలు పునాదిరహితమైనవని తెలిసికోలేని మూర్ఖులు కారు మన పార్లమెంటు సభ్యులు. ఇటువంటి సాంఘిక చట్టం చేస్తే వచ్చే ఎన్నికలలో తమ అభిమానులతో వారికి తంటావస్తుందన్న భయమేగాని, మహిళలు తమ సహజమైన శక్తితో బ్రహ్మాండమైన వ్యతిరేక పక్షంగాఎదురు నిలుస్తారేమోననే ఆలోచన తట్టకపోవడం వారి దురదృష్టం. ఈ స్త్రీ స్వామ్య పత్రం త్వరితంగా ఆమోదింపబడకపోతే పురుషులకు మరపురాని పాఠం చెప్పడం ఏలాగో అసంతృప్తులైన మహిళలకు చక్కగా తెలుసునని హెచ్చరిద్దాం." ప్రసంగమును ముగిస్తూ ఆమె "మనకు సంఘబలంలోపించడం వలననే ప్రభుత్వం మనలను నిరాదరణతో చూస్తున్నది. స్త్రీ విద్యా సమస్యముఖ్యంగా వయోజన విద్యాసమస్య. మహిళా సంఘాలన్నీ ఏదో ఒక విధమైన వయోజన విద్యాకేంద్రాలే. మనకే సంఘబలంవుంటే ఈ సంఘాల సేవను స్త్రీ విద్యా వ్యాప్తికీ, సమాజశ్రేయస్సుకు సద్వినియోగం చేసుకునేటట్లు వివిధ రాష్ట్ర ప్రభుత్వాలపై వొత్తిడి తేగల్గియుండే వారం. ఇంక మీదనైనా కుటీరపరిశ్రమల విషయంలో, మిడ్‌వైఫరీ నరిసింగులలో ప్రభుత్వం యివ్వబోయే సహాయం, పెట్టబోయే స్వల్పకాలపు కోర్సులయొక్క యుపయోగాన్ని ప్రతిపల్లెలో ప్రతిపట్టణములో వుండే స్త్రీలు పొందేటట్లుగా, అచ్చటచ్చటనున్న మహిళా సంఘాలు పరిశ్రమ శిక్షణకేంద్రాలు కాగలందులకుదారి చూపుట మన సాంఘికసేవావుద్యమంలోని ప్రధాన కర్తవ్యంగా భావించి పాటుపడాలి. ఇంకా, మన రాజ్యాంగం యిచ్చిన వయోజన ఓటింగు హక్కుయొక్క ప్రయోజనాన్ని చక్కగా పొంది స్త్రీలకు శాసన సభలలోను, పార్లమెంట్లలోను అధికంగా స్త్రీ ప్రాతినిధ్యం సంపాదించుకోడానికి ఆందోళన యిప్పటి నుండేసల్పాలి." అని ప్రసంగించారు.

ప్రసంగానంతరం క్రమబద్ధంలో కొన్ని సానుభూతి తీర్మానాలు, కొన్ని అభినందన తీర్మానాలు, హిందూకోడ్, ప్రాథమిక హక్కులు, వరకట్నములు మున్నగు విషయములపై తీర్మానములు పెక్కురు సోదరీమణులచే ఉపన్యాసములు 29, 30 తారీఖులలో జరిగినవి. క్రొత్త కార్యనిర్వాహక సంఘ సభ్యురాండ్ర ఎన్నికలు జరిగినవి. శ్రీమతి కడప రామసుబ్బమ్మగారు అధ్యక్షులుగను, శ్రీమతులు, వెంకటలక్ష్మి, రమలు, కార్య దర్శులుగ ఎన్నుకొనబడిరి.

29, 30, తేదీలు సాయంకాలం 6 గం, నుండి 8-30 వరకు కస్తూరిబా పాఠశాల విద్యార్థినులు, ఆహ్వాన సంఘ సభ్యురాండ్రుకలసి చక్కటి నృత్యనాటక ప్రదర్శనములచే సభ్యురాండ్రకు వినోదమును కలిగించుటయేగాక, అహింస, శాంతులను ప్రచారం చేస్తూవరకట్నాది దురాచారములను ఆక్షేపిస్తూ తమ ప్రదర్శనముల మూలంగా సభాసదులకు అద్భు ప్రబోధమును కలిగించిరి. మహాసభలు విజయవంతముగా ముగిసినవి. ఉపన్యాసములందలి ఉద్ఘాటనలు, తీర్మానములందలి ఆదర్శములు అమలు జరుపవలసిన మహత్తర భాధ్యత మహాసభపై నిలిచియున్నది.



# ఆస్థానకవికి ఆంధ్ర మహిళాసభలో సన్మానం

❋ శ్రీమతి గోళ్లమూడి రాజ్యలక్ష్మమ్మ ❋

డిసెంబరు 8వ తేదీ సాయంత్రం మద్రాసు ఆంధ్ర మహిళా సభవారు తమ సభామందిరంలో మద్రాసు ప్రభుత్వ ఆస్థాన ఆంధ్ర కవి మహామహోపాధ్యాయ కళాప్రపూర్ణ కవి సార్వభౌమ ఇత్యాది బిరుదాంకితులు, బ్రహ్మశ్రీ శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రిగారికి సన్మాన గౌరవ సత్కారములు



ఆస్థానకవిగార్కి ఆంధ్ర మహిళాసభా విద్యార్థినులు స్వాగతము.

జరిపిరి. రెవిన్యూశాఖా మంత్రి శ్రీ హాలహర్వి సీతారామ రెడ్డిగారి అధ్యక్షతను జరిపిన ఈ సన్మానసభకు ప్రముఖులైన పురుషులు, స్త్రీలు అనేకమంది విచ్చేసిరి. సభాభవన మంతయు నిండి కళకళలాడుచు, లక్ష్మీ సరస్వతుల కలయిక ఆనందమును గూర్చినది. కవిగారు భార్యా పుత్రికలతో సభనలంకరించిరి. విద్యాలయ విద్యార్థినులు మధుర కంఠములతో శ్రావ్యముగా చేసిన ప్రార్థనతో సభ ప్రారంభమైనది. శ్రీ బులుసు సాంబమూర్తిగారు కవిగారిని సభకు పరిచయముచేసిరి. న్యాయమూర్తి చింతగుంట రాఘవరావుగారు ఉపన్యసించుచు, కవిగారి అసంఖ్యాక రచనలను గురించి, వారికిదివరలో ఆంధ్రులు చేసిన సత్కారములను గురించి విశదపరచిరి. శ్రీ ఈదర వెంకట్రావుగారు కవిగారి జీవితములోని ముఖ్య ఘట్టములను వివరించుచు, తాము వ్రాసి అచ్చువేయించిన వినతి పత్రమును కవిగారికి సమర్పించిరి. శ్రీ బాలాంత్రపు వెంకట్రావుగారు, శ్రీ కల్లూరి వీరభద్ర శాస్త్రిగారు కవిగారి కవితను ప్రశంసిస్తూ, కవిగారు వ్రాసిన సందేశములనుండి కొన్ని పద్యములను చదివిరి. శ్రీమతి కవితిలక కాంచనపల్లి కనకమ్మగారు ఈ సందర్భమున వ్రాసిన పద్యములు చదువబడెను. ప్రసిద్ధ చిత్రకారిణి శ్రీమతి రత్నాల కమలాబాయిచే ముత్యాల కోవలవలె కూర్చి వ్రాయబడిన సన్మానపత్రమును శ్రీమతి చన్నఘంటమ్మగారు చదివి కవిగారికి సమర్పించిరి. సభావిద్యార్థినులచే లతలు పువ్వులు కుట్టబడిన ఉన్ని శాలువ, సభ పారిశ్రామిక సభలో నేయబడిన ధోవతి కవిగారికిని, హిందూ స్త్రీ సంప్రదాయము



ఆస్థానకవిగారి కుటుంబము. భార్య వెంకటరత్నమ్మగారు. పెద్ద కుమార్తె కవయిత్రి విశాలాక్ష్మమ్మగారు, చిన్న కుమార్తె, మనుమరాలు.

ననుసరించి వారి సతీమణికి పసుపు కుంకమలు, ఫలపుష్పములు, చందనతాంబూలములతో చీర రవికెలను సమర్పించిరి. సన్మానానంతరం కవిగారు మహిళలు చేసిన ఈ సన్మానసభ తమకు మిక్కిలి ముదావహముగా నున్నదనిరి.

## ఆస్థానకవికి ఆంధ్ర మహిళాసభలో సన్మానం

భారత స్త్రీలకు అనాదిసిద్ధముగా నున్న ప్రాధాన్యమును మరువ రాదనియు, గార్గి, మైత్రేయి సులభలనుపోలి అధునిక స్త్రీలుకూడ కవితా వైదుష్యములు కల్గి వర్ధిల్లవలెనని ఆశీర్వ దించిరి. శ్రీ శంకర వెంకట్రావుగారు మహిళాసభకు 116 రూపాయలు విరాళము నొసంగిరి. జాతీయ గీతములో సభ ముగిసినది.

మహామహోపాధ్యాయ, కళా ప్రపూర్ణ, కవిసార్వభౌమ,
మదరాసు ప్రభుత్వ ఆస్థాన ఆంధ్ర కవి

శ్రీ శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రిలువారికి
ఆంధ్ర మహిళాసభ సమర్పించిన

# సన్మాన పత్రము

కవిసార్వభౌమా !

ఆంధ్ర కవితా సామ్రాజ్యమందు, ఇదివరకే సంపాదించు కొన్న మీ సార్వభౌమత్వమునకు, చిరకాలముగా, తెలుగు నాడు ఆస్థానమైనది. మీ రచించిన శతాధిక గ్రంథములు తెలుగునాట నలుమూలల అజరామరములైన వెలుగులను ప్రసరింపజేయుచున్నవి. ఆ నీడలలో మా ఆంధ్రమహిళా లోకము తమ కవితా వైభవమును మిక్కిలిగా ప్రశంసించు కొనుచున్నది.

ఆంధ్రవ్యాసా !

మీ రనువదించిన శ్రీ కృష్ణ మహాభారతము అనేక ధర్మ ములకు ఆలవాలమై, ప్రాచీన భారత సంస్కృతికి ప్రతి బింబమై, అలరారుచున్నది. ఒక్క కలములో యింతటి మహోజ్జ్వల జ్ఞానభాండారమును ప్రసాదించిన తమకు యావదాంధ్ర దేశమూ ఋణపడియున్నది.

ప్రభుత్వ ఆస్థానకవీ !

ప్రజా పరిషత్తుయొక్క సంపూర్ణ గౌరవమునకు పాత్రులై, ఇతోధికముగా ఆంధ్ర భాషా సరస్వతికి అలంకారములను సమకూర్పగల తాము మా సభకు విచ్చేసి, మా కాశీస్సుల నొసంగినందులకు, ధన్యవాద పూర్వకముగా నమస్కారముల నర్పించుచున్నాము.

| | |
|---|---|
| మైలాపూరు, <br> మదరాసు. | ఆంధ్ర మహిళాసభ <br> 8—12—1950 |

## ఆంధ్రాస్థానకవి

(శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రిగారి సన్మాన సభయందు చదువబడిన కొంచనపల్లి కనకాంబా రచిత పద్యములు)

చ॥ గురుడనుచున్ మహాకవులకున్ గని నేటికి
గుర్తెంచి నిన్
గురుడనుచున్ మహామహులకున్ ఘను
డో కవి సార్వభౌమ యు
చ్చరము నిజంబు తెల్పిరిక భూపతు
లెవ్వరికైన నీదు శ్రీ
చరణము కృష్ణమూర్తి కవిచంద్రమ వంద్యము
తెలుగుసీమలోన్

శా॥ స్వాధ్యాయంబది శ్లోకరూపమున
వ్యాసప్రోక్తమై యుండిన
య్యధ్యాయంబులు రెండుతొమ్మిదులు
హృద్యంబైన పద్యంబులన్
విధ్యుల్లంఘన లేక వ్రాసి తన ప్రావీణ్యంబు
జూపన్ మహో
పాధ్యాయాఖ్యను గృష్ణమూర్తి కవిసం
పాదించె సామాన్యమే.

మ॥ వీసముకలగాదది కవిప్రవరేణ్యుడు
కృష్ణమూర్తి తా
వ్యాసుడుగా జనించి యిసుమంతయు
వీడక తెల్గుబాసలో
వ్రాసెను భారతంబు మఱి భాగవతంబును
నంతబోక తా
వ్రాసెను నాటకుండయి రామచరిత్ర
బుధాళిమెచ్చగన్.

శా॥ స్వస్థానంబున వేషభాషలన నుత్సాహంబు
తగ్గించునే
ప్రస్థానంబులవేల చాల్, సుకవితారాజ్యంబు
పాలించి నాం
ధ్రాస్థానకవీశ శ్రీపదుడు కృష్ణాభిఖ్య
చెల్వొంది తా
స్వస్థాయిన్ విడకేయొనర్చె శతములై
సద్గ్రంథముల్ లీలమై

కం॥ నన్నయ భట్టారకుడవు
డెన్నిక గన్నట్టి రాజమహేంద్రపురిని నే
డున్నతిని వెలుగు కృష్ణక
విన్నవయుగకర్త యెన్న విబుధులవిందే.



ఆస్థానకవిగార్కి సన్మాన సందర్భములో ఆయన కుమార్తెయు, కవయిత్రియునైన
శ్రీమతి కల్లూరి విశాలాక్షమ్మగారు వ్రాసిన పద్యములు

# శ్రీ మహిళా సభాభినందనములు

క॥ శ్రీ మదరాసుపురంబున
సేమంబెల్లరకుఁ గలుగఁ జేయునదై ని
త్యామోదం బొనరించిన
శ్రీ మహిళాసభను వినుతిఁజేయఁగఁదగమే ॥

తే॥ అలరు శ్రీయాంధ్ర మహిళాసభాధిపతులు
స్థాపకులును సంపాదకుల్ జ్ఞానసిధులు
పరమ విశ్వాసమేతులు భవ్యయశుల
కలరు దీర్ఘాయురారోగ్యములు ధరిత్రి ॥

క॥ శ్రీ దుర్గాబాయమ్మగారు
నాదరమున పలువురాంధ్రమహిళలు ఘనులై
యాదిని నియమించిరి తా
మతివలకై యాంధ్రమహిళ యనుదివ్యసభన్ ॥

సీ॥ మద్రాసు పురమున మైలాపురిని నాంధ్ర
మహిళా మహాసభ మనుగ నిల్పి
విద్యాలయంబొండు వెసనందు నెలకొల్పి
నృత్యగానాదుల నేర్పియందు
నింటరు మీడియట్ హిందీ పరీక్షలు
చదువు కాంతలకును సౌకరములు
నవలఁబరిశ్రామికాలయంబందున
నెంబ్రైడరీ పనులెన్నొ నేర్పి

తే॥ ఊలు అల్లికల్ కుట్టును నూలువడకు
టాది చేనేత యిత్యాది యగ్ర్యపరిశ్ర
మల గవర్నమెంటునఁ బరీక్షలకు శిక్ష
యొసఁగి మహిళాభ్యుదయము చేయుదురు సతము ॥

తే॥ బీద విద్యార్థినులఁ గడు నాదరించి
లలి గవర్నమెంటు పరీక్షలకును శిక్ష
యుచితముగ నేర్పరచియును యువిదలకయి
సకల సౌఖ్యముల్ గూర్తురు ప్రకటితముగ ॥

క॥ మహిళా మందిర మందున
మహిళలకును వసతులెన్నొ మరియుఁ గలుగగా
సహరహ మటుకృషిసల్పుచు
మహిళాభ్యుదయ మొనరింత్రు మక్కువతోడన్

ఆ॥ ఆంధ్రమహిళ యనఁగ నతివలకొరకు వి
ద్యాభివృద్ధికి నయియతులితముగ
నడుపఁబడుచునుండి కడుమేలుగల్గించు
పత్రికాభివృద్ధి ప్రబలుఁగాక ॥

తే॥ అరయ నిర్మలాదేవి గ్రంథాలయంబు
నతివలకు నుపయోగార్థ మచటనిలిపి
హిందితెనుగాంగ్ల గ్రంథములెన్నొ చేర్చి
వృద్ధియొనరించుటకుఁ గడువేడ్కకలిగె ॥

తే॥ ప్రబలు నాంధ్రమహిళకు సంపాదకులయి
యశముగాంచు దుర్గాబాయి యమలచరిత
చన్నఘంటమ్మలను గడుసన్నుతింతు
వారిలోకోపకృతికిని బ్రమదమొంది ॥

తే॥ అరయ మహిళా మహాసభయందు నేడు
సకల వైభవ మలరనాస్థాన కవిని
గౌరవించుట కెంతయు గడక కలిఁగె
దత్సభాస్తారు లగునట్టి ధన్యులార ॥

చ॥ అరయఁగ నాంధ్రదేశ మహిళాభ్యుదయంబును
గోరి యెంతయున్
స్థిరమగు పత్రికన్ నిలిపి చేయుచునుండిరి
దేశ సేవయున్
పరమగుణాల వాలరగు భవ్య చరిత్రల
చన్నఘంటమన్
వరమతి దుర్గమన్ జమున బాయిని శ్రీహరి
ప్రోచుఁగావుతన్ ॥



# మహిళా సేవా మండలి

## మచిలీపట్టణము

హిమాలయమునుండి విచ్చేసి, 2-7-44 న మహిళా సేవా మండలి సభ్యురాండ్రకు విభూతిని, వేరులను మంత్రించి ఇచ్చి, అభీష్ట సిద్ధికి యాశీర్వదించిన యోగానందస్వామి గారు

(మండలి కార్యదర్శిని శ్రీమతి దుర్గ వేంకటరమణమ్మ గారు 2-7-44న వేసిన వేషము చెప్పనంతవరకును నిజమును



యోగానందస్వామి.

సభ్యురాండ్రు గ్రహించనేలేదు. కానుకలు కురిసినవి. అంతటినుండియు ఈ వేషము వార్షిక వినోదమైనది. తెలిసినమీదట కూడ కానుకలు విరివిగ లభించుచునే యున్నవి.)

*　　　*　　　*

తెలుగు సంవత్సరాది 10-4-48న మండలి సభలో పంచాంగ శ్రవణముచేసి సభ్యురాండ్రను ఆశీర్వదించిన కుండల పండితులు సువర్ణహస్త కంకణాలంకారులు హరిరామ శర్మగారు.

ఈ వేషమునుచూచి ఆచంటి సత్యవతి దేవిగారు శాలువా బహూకరించి ఈ క్రింది పద్యమును చెప్పిరి.



హరిరామశర్మ.

సీ॥ నూతనోగాదివి । నోదవైభవశోభ
　　　విక్రుతి సంవత్సర వివరమును
పంచాంగ శ్రవణంబు । బహుచక్కగాదెల్పి
　　　సంభ్రమాశ్చర్యాది ॥ సరణిగూర్చి
దోవతి తలపాగ । సౌవర్ణకుండల
　　　కరకంకణీకృత్య । కళలతోడ
పండితవేషంబు । పాండిత్యయుతముగా
　　　శిష్యప్రబోధంబు । సేయుచుండి
సితోడి చెలులైన । నిజరూపు నెరుగని
　　　రీతినిర్వర్తించె । నాతిమిన్న
అన్ని విద్యలయందు । నారితేరిన, సతి
　　　బందరు మహిళలు । భాగ్యలక్ష్మి
దుర్గవంశాబ్ధి రమణాంబ । దుహితమణులు
　　　కన్నతల్లిని శ్రీహరికరుణతోడ
ఆయురారోగ్య భాగ్యంబు । లమరజేసి
　　　ప్రోచుగావు తవిజ్ఞాన । బుద్ధినొలగి ॥



# శ్రీ భగవద్గీతా సందేశ మహోత్సవము

## చెన్నపురి

శ్రీ విశిష్టాద్వైత ప్రచారక సంఘమువారి యాజమాన్యమున, చెన్నపురి ఉప్పుత్తూరు ఆళ్వార్ చెట్టి రామానుజ కూటములో, ది 1-12-50 నుండి, ది 20-12-50 వరకు భగవద్గీతా సందేశ మహోత్సవము జరిగినది.

ఈ వుత్సవము శ్రీ పార్థసారథి స్వామివారి కోవిలవద్ద ప్రార్థనా ఊరేగింపుతో ప్రారంభమయ్యెను. ప్రతి దినము గోష్ఠి భజనలతో గీతా పారాయణము, ఒక్కొక్క అధ్యాయము సమిష్టి జపము, 18వ అధ్యాయముల గీతా పారాయణము ఉ. 5 గం. నుండి 10 గం. వరకు జరిగినది—ఒక్కొక్క దినము ఒక్కొక్క అధ్యాయమునకు ఆంధ్ర, తమిళ భాషలలో అర్థము కూడ చెప్పబడినది.

మధ్యాహ్నము 2-30 నుండి ఒక్కొక్క రోజు ఒక్కొక్క అధ్యాయమునకు విశేషార్థ విమర్శనము, తరువాత 5-30 నుండి 8-30 వరకు ఆంధ్ర, ఆంగ్ల, అరవ, హిందీ, భాషలలో భగవద్గీతను గురించి ప్రముఖుల ఉపన్యాసాలు జరిగినవి.

ఈ 18 రోజులు గీతా ప్రదర్శనములుకూడ జరిగినవి. ఇందులో, తెలుగు, తమిళ, మలయాళ, కన్నడ, గుజరాతీ, హిందీ, వంగ భాషలలోను, ఆంగ్ల, ఫ్రెంచి, ఇటాలియన్, పారశీక భాషలలోను రచియింపబడ్డ గీతలు, గీతా విమర్శనలు, ఇంకా గీతలోని వివిధఘట్టముల అర్థమును ప్రకటించు చిత్తరవులు చూపబడినవి.

కడపటి 3 దినములు అవిరామగీతా పఠనము జరిగినది.

అన్ని రోజులు, ప్రదర్శనమునకు, పఠనకు, భజనలకు, ఉపన్యాసములకు, స్త్రీ పురుషుల వందలాదిగ విచ్చేసిరి. యింతటి కార్యక్రమము నిరాఘాటంగా జయప్రదంగా జరిపించిన ఆహ్వాన సంఘమువారు, విశిష్టాద్వైత ప్రచార సంఘమువారు మిక్కిలి అభినందనీయులు.

# అఖిల భారత మహిళా సభ

# చెన్నపురి శాఖ

ది 2-12-1950 న రాజాజీ హాలులో శ్రీ భవనగర్ రాణీగారి అధ్యక్షతక్రింద పై శాఖ వార్షిక సమావేశము జరిగినది. ఈ శాఖయొక్క ఉపశాఖలైన శ్రీనివాస గాంధీ నిలయం, తొండియార్ పేట మహిళా సంఘం, సరకువాకం మహిళా సంఘం, ట్రిప్లికేన్ శ్రీనివాస సంఘం, గోపాలపురం మహిళా సంఘములనుండి ప్రతినిధులు, సభ్యురాండ్రు, ఇంకా పట్టణమునందలి వివిధశాఖలనుండి సభ్యురాండ్రు, విద్యార్థినులు ఈ సమావేశమునకు వచ్చిరి. కార్యదర్శిని అయిన శ్రీమతి సరోజినిగారు పట్టణ కేంద్రశాఖయొక్కయు, ఇతర ఉపశాఖలయొక్కయు సంవత్సర కార్యక్రమ నివేదికను చదివిరి. అధ్యక్షురాలు ఈ వివిధశాఖలయొక్క కార్యక్రమములు ప్రశంసిస్తూ ముఖ్యంగా కాన్సర్ వైద్యశాల నిర్మాణమునకై ఈ సంఘమువారు చేయుచున్న కృషిని అభినందిస్తూ ఈ నిర్మాణంలో తోడ్పడవలసిన బాధ్యత ప్రజలకు, ప్రభుత్వమునకు కూడ ఎంతగా నున్నదో విశదీకరించారు.

తరువాత కార్యక్రమములో హిందూ ధర్మశాస్త్ర క్రోడీకరణ బిల్లును గూర్చి, వరకట్ననిషేధము, గ్రామాలలో వైద్య సహాయము, పాఠశాలలలో ఆరోగ్యవిషయమైన ప్రాథమిక విద్యాబోధన, ఉచిత వైద్య సహాయం యిత్యాది పెక్కు విషయములయొక్క ఆవశ్యకతయు వీనిలో ప్రభుత్వము ప్రజలు తీసికొనవలసిన శ్రద్ధను గూర్చియు పలువురు సోదరీమణులు ఆంధ్ర తమిళ, ఆంగ్ల భాషలయందు ఉపన్యసించిరి. ఈ విషయమునకు సంబంధించిన తీర్మానములు ఏకగ్రీవముగా ఆమోదించబడ్డవి.



(ముందు పాఠము తరువాయి).

సామాన్య భూతకాలము, ఆసన్న భూతకాలము, పూర్ణభూతకాలములలో క్రియ సకర్మక మైనపుడు కర్తకు 'ने' ప్రత్యయము వచ్చుననియు, క్రియ యొక్క లింగవచనములు కర్మ ననుసరించి యుండుననియు చదివియున్నాము.

**ला, बोल, भूल** అను క్రియలు అకర్మక క్రియలుగ పరిగణింపబడుననియు చదివియున్నాము. క్రియతో **सक** (పని చేయ గలిగియుండుట), **चुक** (ముగియుట), **लग** (ప్రారంభించుట) యను సహాయక క్రియలు వచ్చినపుడు కర్తకు '**ने**' ప్రత్యయము చేర్చకూడదు. అపుడు క్రియా రూపములు కర్త యొక్క లింగ, వచనములననుసరించియే యుండును.

ఉదా :—**मैं खुद यह काम कर सका** నేను స్వయముగా ఈ పని చేయగలిగితిని.

**मैं यह किताब पढ़ चुका** నేను ఈ పుస్తకము చదివి ముగించితిని.

**सीता कल से हिन्दी सीखने लगी है ।** సీత నిన్నటినుండి హిందీ నేర్చుకొన ప్రారంభించినది.

## పాఠము 16.

### అపూర్ణ భూతకాలము Past Imperfect Tense.

ఇది జరిగినకాలములో పని పూర్తికాలేదని తెలుపును. సామాన్య వర్తమానకాల క్రియా రూపము వ్రాసి, **हूँ, है, हैं, हो** లకు బదులుగా కర్త యొక్క లింగవచనములననుసరించి **था, थे, थी, थीं** చేర్చవలెను. కర్తతో '**ने**' ప్రత్యయము రాదు.

ఉదా :—**मैं पढ़ता था ।** నేను చదువుచుంటిని.

**रामराव दिल्ली में काम करते थे ।** రామారావు ఢిల్లీలో పని (ఉద్యోగము) చేయుచుండిరి.

### తాత్కాలిక భూతకాలము Past Continuous Tense.

ఇది గడచిన కాలములో పని యింకను జరుగుచునే యుండెనని తెలుపును.

తాత్కాలిక వర్తమాన కాలక్రియా రూపము వ్రాసి, **हूँ, है, हैं, हो** లకు బదులుగా **था, थे, थी, थीं** లను చేర్చవలెను. కర్తతో '**ने**' ప్రత్యయము రాదు. కర్తయొక్క లింగ వచనములననుసరించి క్రియ వ్రాయవలెను.

ఉదా :—**सीता पढ़ रही थी** సీత చదువుచుండెను.

హేతు హేతు మద్భూత కాలము.

ఇది కార్యకారణ సంబంధముచే రెండు పనులు జరుగలేదని తెలుపును. దీనిలో రెండు వాక్యములుండును. మొదటిది 'కారణ' వాక్యమనియు, రెండవది 'కార్య' వాక్యమనియు చెప్పబడును. రెండు వాక్యములలోను ధాతువునకు పుంలింగ ఏకవచనములో ता, పుంలింగ బహువచనములో ते, స్త్రీలింగ ఉభయవచనములలో ती యు చేర్చవలెను. కారణ వాక్యమునకు ముందు अगर లేక यदि యును, కార్యవాక్యమునకు ముందు तो యును చేర్చవలెను.

ఉదా :— **अगर तुम कहते तो मैं आता** మీరు చెప్పియుండిన నేను వచ్చియుండును.

కొన్ని సమయములలో **अगर** లోపించును-కాని तो మాత్రము లోపించదు.

**किराया** అద్దె (పుంలింగము).
**पानी बरसना** వర్షము కురియుట.
**साइकिल** సైకిలు. (స్త్రీలింగము)
**श्रद्धा** శ్రద్ధ (స్త్రీలింగము).
**पैदल चलना** నడచి వెళ్లుట.
**सीखना** నేర్చుకొనుట.
**समझना** అర్థము చేసికొనుట.

**हम पहले इस घर के लिये पचास रुपये किराया देते थे।** మేము మొదట (యిదివరకు) ఈ యింటికి యేబది రూపాయలు అద్దె యిచ్చుచుంటిమి.

**कल खूब पानी बरस रहा था, इसलिये मैं कहीं नहीं जा सका।** నిన్న చాల యెక్కువగా వర్షము కురియుచుండెను, కావున నేను యెచ్చటికిని వెళ్ల జాలక పోతిని.

**जब सभा समाप्त हो गई, लोग घर जाने लगे।** మీటింగు పూర్తికాగానే, జనులు యిండ్లకు వెళ్ల సాగిరి.

**मैं आपकी बात न समझ सका।** నేను మీ మాట అర్థము చేసికొనలేక పోతిని.

**आजकल सब लोग हिन्दुस्तानी सीखने लगे हैं।** ప్రస్తుతము అందరు హిందుస్తాని నేర్చుకొన ప్రారంభించియున్నారు.

**पहले मेरे पास साइकल नहीं थी।** మొదట (యిదివరకు) నా వద్ద సైకిలు వుండలేదు.

**तब मैं रोज पैदल जाता था।** అప్పుడు నేను రోజు నడచి వెళ్లుచుంటిని.

**जब गाँधीजी बोलते थे, लोग बड़ी श्रद्धा के साथ सुनते थे।** గాంధీగారు మాట్లాడునపుడు జనులు చాల శ్రద్ధతో వినుచుండిరి.

**तुम अपनी बात मुझे बताते तो अच्छा होता।** మీరు మీ విషయము నాతో చెప్పియుండిన బాగుండెడిది.



చిత్ర సమీక్ష:

# బీదల పాట్లు

విక్టర్ హ్యూగో రచించిన ప్రఖ్యాతనవల లేమిజరబ్లెను యిదివరకే ఇంగ్లీషులో ఫిల్ముగా తీశారు. ఇప్పుడు అనవలనే ఆధారముగా తీసుకుని పక్షిరాజా స్టూడియోస్‌వారు 'ఏళై పడుం పాడు' అనే పేరుతో తమిళములోను 'బీదలపాట్లు' అనే పేరుతో తెలుగులోను చిత్రాలు తీశారు.



కొండడుగా నాగయ్య.

కొండడనే బీద యువకుడు విధవరాలైన అక్క పసిబిడ్డల ఆకలి బాధను చూడలేక ఆహారం దొంగిలించి జైలు శిక్ష పొందుతాడు. బయటికి వచ్చిన తర్వాత, దిక్కులేక తన కుటుంబమంతా నశించిపోయిందని తెలిసి కుమిలిపోతాడు. సంఘం చూపుతున్న నిరసన అతనిని మరింత కుంగతీస్తుంది. చివరికి ఏవిధంగానైనాసరే డబ్బు సంపాదించి లోకములో సుఖము, ఆదర గౌరవాలు పొందాలని నిశ్చయించుకుంటాడు. ఆ ప్రయత్నములో దొంగతనము చేయటానికికూడ సిద్ధపడతాడు. కాని ఒక దయామయుడి ప్రేమ పూరిత వాక్కులు అతనిలో గొప్ప సంస్కారం, పరివర్తన, కలిగించుతవి. ఆ మహనీయుని సహకారముతో కొండడు వర్తకము చేసి కోటీశ్వరుడు అవుతాడు. కరుణ పరోపకారములను తన లక్ష్యముగా పెట్టుకుని తన ధన, మాన, ప్రాణాలకయినా వెరువక దీనులసేవ చేయ సంకల్పించుకుంటాడు. కొంతమంది స్వార్థపరుల కుట్రలవల్ల అనేక క్లిష్ట పరిస్థితులు, ఆపదలు కలిగినా కొండడు కృతకృత్యుడవుతాడు. ఇది కథా సారాంశము.

కొండడి పాత్ర నాగయ్య అత్యద్భుతముగా నిర్వహించాడు. ప్రతి రసము ప్రతిభావము చూపగలిగినంత విశదముగ చూపించాడు. అతని పాత్ర అంత సహజముగ అంత సజీవముగ వుండటాన ఎప్పుడు కళ్ళముందు కదులుతూనే



అంజలగా లలిత.

వుంటుంది. కొండడి ప్రతిద్వంది పోలీసుఇన్‌స్పెక్టరు జావరు. మొదటినుండి చివరివరకు జావరు కొండడిని ప్రతిఘటించుతూనే వున్నప్పటికి చివరికి ఆ కొండడి నోటిమీదుగానే 'జావరు పురుషరత్నం' అని అనిపించుకోగలిగిన విశిష్టవ్యక్తి. ఆ పురుషరత్నాన్ని రత్నంగానే ప్రకాశింప

చేయగలిగారు సీతారామన్. నిజం చెప్పాలంటే ఇంచు మించు నటీనటులందరు బాగానే పాత్రపోషణ చేశారు. సంగీతము ఇంపుగా హాయిగా వున్నది. పాటలు భావగర్భితంగా సమయానుకూలముగా వున్నవి. కోర్టు దృశ్యం వినోదంతోపాటు విజ్ఞానాన్నికూడ ప్రసాదించుతున్నది. విపత్తు కొండడిని ఆదరించటము బీదపిల్ల అంజల బీదరికం వల్ల తను ప్రేమించిన యువకుడిని పొందలేక పోయినానని చింతించటము, కొండడు మురుగునీళ్ల కాలవలో దిగి ఉమాకాంతుడిని రక్షించటము మొదలయిన దృశ్యాలు చెప్పతగి వున్నవి. డైరెక్షనులో చూపిన శ్రద్ధ చాలాచోట్ల చిత్రానికి సహాయపడింది. కొండడి మనసులో కలిగిన ఆందోళన, దౌర్బల్యం మొదలయినవి చూపించే సమయంలో దీపపు కదలికలతోను, పూజించే విపత్తు పటం కింద పడటముతోను, పారిపోతున్న సందర్భములో దీపస్తంభాలు ముసిరిపోవటముతోను కొండడి భావాలను చక్కగా వ్యక్తముచేశారు. సర్కసుదృశ్యాలు స్టేజిమీద నృత్యాలు అనవసరం. సంభాషణల్లో అరవయాస చాలా బాగా తెలుస్తున్నది. మరికొంత శ్రద్ధతీసుకొని వుండవలసినది.

చిత్రం చాలా దీర్ఘముగా వున్నది కాని కుదించటానికి వీలుపడదేమో. దేశకాలాలకు అతీతమైన యితివృత్తాన్ని తీసుకొని మానవ హృదయాలకు సమీపంలోకి రాగల పాత్రలు సృష్టించి తీసిన యిటువంటి సాంఘిక చిత్రాలు విరివిగా తయారయితే సంఘంలో మంచి ప్రబోధము జరుగుతుంది. తెరమీద పచ్చి శృంగారముతో రోసిపోయిన ప్రేక్షకులకు చక్కని సాంఘిక చిత్రం చూడగల అవకాశము కలిగించింది యీ బీదలపాట్లు.

—గిరిజ.






### సంఘర్షణ :

రచయిత : రెంటాల గోపాలకృష్ణ.

వెల పన్నెండు అణాలు.

ప్రతులకు : సాహితీ స్రవంతి, గాంధీనగర్, విజయవాడ.

మానవజీవితం అనేసరికి ఎన్నో విషయాలు చూడవలసి వస్తుంది. జీవితంలో ప్రతివారు ఈనాడు అనేక సమస్యలను ఎదుర్కొనవలసి ఉన్నది. ముఖ్యంగా సామాన్య మానవుని పరిస్థితిచూస్తే జీవిత సమస్యతో అతని పోరాటం, లేక సంఘర్షణ, ఏ విధంగా ఒక్కొక్క పరిస్థితిలో అతను అణగారి, కృశించి, నిరాధారమైపోయేదీ తెలుస్తుంది. ఆ సమస్యలు ప్రతివారి దృష్టిలో అతి తేలికగా, స్వల్పంగా కనిపించవచ్చు. కాని వాటిని పరిష్కరించే సమయంవస్తే వానిలోని గూఢమైన మహత్తు, వానిలోని దాగిఉన్న సత్యం తెలుస్తుంది.

సంఘర్షణ చదువుతుంటే ఒక్కొక్క మానవ జీవిత నాటకరంగంలో సృష్టింపబడి ఉన్న సమస్యలు తెలుసుకోకలుగుతాం. "సంఘర్షణ" రెండు భాగాలుగా రచింపబడింది. ఒకటి 'విద్యుద్వాహిని' అనేదానిలో పది గేయాలు, రెండవ భాగమైన "దశదిశలు" అనే దానిలో పదిగేయాలు. ఒక్కొక్క గేయం ఒక చక్కని సమస్యను సూచిస్తుంది. సమస్యలో చక్కని గూఢమైన భావం, ఆ భావం విశదంగా ఆలోచిస్తే వచ్చే అర్థం ఎంతో ఉన్నది. 'నవభారతం' అనే గేయంతో ప్రారంభించి, "ప్రతిజ్ఞ" అనే గేయంతో సంఘర్షణ పూర్తి చేశారు. నవభారతం అంటే విశ్వమానవ శాంతి స్థాపనం, సత్య దీక్షాకంకణ గ్రహణం, పీడిత ప్రజ బంధముక్తి అని నిర్వచించారు. ప్రతిజ్ఞ అనే గేయం చూస్తే, ఒకచోట ఈ విధంగా వ్రాశారు.

ఇది అనాది భారత సంస్కృతిలో
రేకెత్తించిన తళుకు రేఖ !

ఇది జనాధి నేతల హృదయంలో
జ్వలించిన మెరుపు తీగ !

ఇది శ్రమజీవుల సేదోద్భవ
స్వేచ్ఛావాణి
ఇది క్రమశిక్షిత యోధవరుల
ప్రియవాణి :—

ఇంకోచోట ప్రతిజ్ఞలోనే :

ప్రాకారప్రాంగణం నుండి
విస్తరాకులు విసరివేస్తే
ఎంగిలి మెతుకులు
దక్కించుకోడానికి
కొట్లాడుతుంటున్నవి
కొన్ని కుక్కలు
డొక్కలు పీక్కుపోయిన
మనుషులు భైరవునితో
పోట్లాడి ఎంకలు చీకుతున్నారు.
చివరికి
ఇది జనులకు పరీక్షాసమయం
అదిగో ! రక్ష కడుతున్నారు

ఇది ప్రజలకు దీక్షా సమయం

అదిగో ప్రతిజ్ఞ చేస్తున్నారు.

ప్రతి గేయంలో ఈ విధంగా చక్కని భావగర్భితమైన వాక్యాలు ఉన్నవి. అభ్యుదయ కవిత్వంలో ఉండే ఉద్రేకం చక్కగా స్పష్టీకరించారు.

—జి. ప్రభ

* * *

## ధర్మచక్రం

రచయిత: శ్రీ నందూరి రామకృష్ణమాచార్య.

వెల రూ. 2/-

ప్రతులకు: త్రివేణి పబ్లిషర్స్, మచిలీపట్టణము.

భారతదేశంలో అనేక మతాలు సృష్టింపబడ్డాయి. మతాల సృష్టికర్తలు తమ ఆశయాలను, ఆదర్శాలను అప్పుడు వారి కాలంలో పరిపాలించే చక్రవర్తుల సహాయం చేత ప్రజలకు జ్ఞానబోధనను చేయగలిగినారు. వారివారి మత వ్యాప్తికి ఏ ఏ విధాల సహాయం పొందాలో అన్ని విధాల సహాయం పొందారు. ప్రజలు తమ రాజులు స్వీకరించి అనుసరించిన మతానికి తల ఒగ్గారు. భారతచరిత్రను విశదంగా చూస్తే ఒక్కొక్క యుగానికి ఒక్కొక్క మతం తీవ్ర రూపం దాల్చింది. భారత దేశంలో ఎన్ని మతాలు వెలసినా సరిహద్దులుదాటి ఇతర దేశాలలో ప్రవేశించినది ఒక్క బౌద్ధ మతమే. ఈ బౌద్ధమతాన్ని ముఖ్యంగా మౌర్య చక్రవర్తులు పోషించారు. దాని వ్యాప్తికి వారు ఎన్నో విధాల శ్రమ పడ్డారు. వారిశ్రమల ఫలితమే ఈనాడు ఆ బౌద్ధమతం స్వదేశంలో చూడకపోయినా దాని రూపాన్ని ఇతర దేశాలలో చూడగలుగుచున్నాము.

"ధర్మచక్రం" గ్రంథకర్త అయిన రామకృష్ణమాచార్య చక్కని కథను సృష్టించి దానిని నాటకరూపంలో ఆంధ్ర నాటక కళా నిపుణులకు అందచేశారు.

"ధర్మచక్రం" మగధ సామ్రాజ్యంలో స్థాపింపబడటానికి మూలం బిందుసారుని ప్రణయిని ఉపాసుందరి. నాటకంలో నాయకీ నాయకులు, ప్రేయసీ ప్రియులు, ఉపాసుందరి, బిందుసారుడు. బిందుసారుడు ఉపాసుందరి ప్రేమలో లీనమైపోతాడు. ప్రజలలో కేవలం విశృంఖల విహారి, స్వేచ్ఛాపరుడు, భోగలాలసుడుగా పరిగణించబడతాడు. అట్టి వ్యక్తిని తిరిగి దేశంలో, ప్రజలలో వీరుణ్నిగా చేయాలంటే ఆ భారం ఒక్క ఉపాసుందరిమీదనే ఉంటుంది.

గ్రీకులు సింధునదిని దాటి దండెత్తి వస్తున్నారని బిందుసారుడు విని, మగధ సామ్రాజ్య సర్వ సేనాధిపతియై బయలుదేరుతాడు. వెళ్ళిపోయేముందు రాజదర్బారులో సర్వ సేనాధిపతికి గాని, సేనలకుగాని నాలుగు ఘడియలు అంతరాయం కల్పించిన వ్యక్తికి శిరచ్ఛేదమే సద్యః శిక్ష అని ప్రథమ శాసనం చేస్తాడు. కాని ఉపాసుందరివద్ద అతనే ఆలస్యం చేస్తాడు. చివరికి యుద్ధానికి వెళ్ళిపోతాడు. కాని ఆ శాసనాన్ని ఆధారంగా తీసికొని ఎంతో కాలంనుండి వేచిఉన్న చాణక్యుడు ఉపాసుందరికి ధర్మమూర్తిచే మరణ శిక్షను విధింపచేస్తాడు. కాని ఉపాసుందరి బౌద్ధసన్యాసి ప్రబోధనలచే మరణించటానికి ముందు బౌద్ధ దీక్ష స్వీకరిస్తుంది. చివరికి ప్రాణాలతో విడవబడి, యుద్ధంనుండి విజయుడై వచ్చి ఉపాసుందరి మరణశిక్షను విని కృంగిపోయిన బిందుసారునికి కన్పించి, రాజ్యచక్రమును శాసించు మహారాజుచే ధర్మ చక్రమును శిరసా వహింప జేస్తుంది. తాను సింహళ దేశానికి బయలుదేరుతుంది.

నాటకంలో మనం అన్ని రసాలను చూడకలుగుతాము. సున్నితమైన హాస్యరసం ఉన్నది. గండోదరుడు, దండు కేశ్వరుడు వీరిద్దరిచేత చక్కని హాస్యాన్ని ప్రవేశపెట్ట కలిగినారు. ముఖ్యంగా బిందుసారుని పాత్ర ధర్మమూర్తివద్దకు తన మిత్రులను విడిపించుటకు వచ్చినప్పుడు, పిదప రాజసభలో గ్రీకులపైకి దండెత్తి వెళ్ళిపోయే ముందు, యుద్ధానికి వెళ్లేముందు ఉపాసుందరిని కలసికొనే సమయాలలో చక్కగా సృష్టింపబడ్డది.

ప్రథమంలో ఉపాసుందరిని ప్రతివారు సామాన్యస్త్రీగా చూస్తారు. కాని చివరికి చంద్రగుప్త చక్రవర్తి అంటాడు "ఉపాసుందరీ నీ చరిత్ర సుందర పరిణామవిచిత్రం" అని గంగానదీ వననికుంజాల మధ్య వికసించిన సుందరపుష్పం పాటలీ పుత్రశ్మశాన వాటికలోవాడి బౌద్ధధర్మ జగత్తులో

ఫలించింది అంటాడు. ఆవిధంగా ధర్మచక్రం స్థాపింపబడుతుంది.

'ధర్మచక్రం' లో విచిత్రమైన వ్యక్తులను విచిత్రమైన స్వభావాలుకలిగిన హృదయాలను చుస్తాం. వివిధ పాత్రలు ఎంతో సహజంగా సృష్టింపబడ్డాయి.

—జి. ప్రభ.

* * *

జాబిల్లి :

పిల్లల బొమ్మల మాసపత్రిక.

నిర్వాహకులు : జి. వి. స్వామి, జి. ప్రభావతి.

వెల నాలుగు అణాలు.

ప్రతులకు : 71, పూనమల్లి హైరోడ్డు, మద్రాసు-10

"జాబిల్లి" తొలిసంచిక మాకు చేరింది. పత్రిక 1/8 క్రౌను సైజులో ప్రక్కనుండి తెరవడానికి వీలుగా తయారుచేయబడింది. పిల్లలు చదవటానికి వీలుగా 14వ పాయింటు స్వదేశిలో ముద్రించారు. మొత్తం 48 పేజీలు. ముఖచిత్రం "గాలిలో గీత" అనే త్రివర్ణచిత్రం. ప్రతినెల 15 తారీఖున ప్రచురించబడును.

దీనిలో అమెరికాలో రిప్లే వ్రాసిన "Believe it or not" యొక్క అనువాదం నమ్మ నమ్మకపో అనే పేరుతో ప్రచురించారు. జాబిల్లి పజిలు, అంకుల పజిలు మొదలైనవి కూడ ఉన్నాయి. దీనిలో తమాషాలేగాక '1000 విషయాలు' అనే విజ్ఞాన, వినోదములతో కూడిన శీర్షికకూడ ప్రచురించుతున్నారు. దానిలో అద్దాలచరిత్ర మొదలయిన విషయములు ఉండును. బాలలందరు చదివి ఆనందించండి.

—ఎ. ఎస్. నారాయణరావు.





కేరళ తలంటు సబ్బుయొక్క శ్రేష్ఠమైన నురుగు మీ చర్మములోనికి, లోతుగాయునికి శుభ్రపరచి, చర్మమునకు అధిక మృదుత్వమును కలుగచేయును. వీటియొక్క శ్వేతమైన, పరిశుద్ధతైలములు, సహజపరిమళములను, క్రిమి సంహారిణిని, చర్మపు క్రింది భాగమునకు లోతుగాకూడకొనిపోయి బాగుగ పనిచేయును. అయినను చన్నీళ్లతో కేరళ సబ్బునురుగును క్షణమాత్రములో కడిగివేసికొనవచ్చును. కేరళసబ్బుయొక్క శుద్ధమైన పరిమళము స్నానమైనతరువాత గంటలకొలది నిలచును.

# కేరళ సబ్బు

పరిశుద్ధమైన తైలమునుండి తయారైనది



వేపసబ్బులోని క్రిమిసంహారిణి, చల్లనైన, మరియూ, వేద్యైనగుణములుగల్గి వేపనూనె, ముఖ్యముగా వేసవిలో శరీరసౌఖ్యమునకు రక్షణ.

**కేరళా సోప్ ఇన్‌స్టిట్యూట్, కాలికట్**

పారిశ్రామిక, వాణిజ్య శాఖ

**మద్రాసు ప్రభుత్వము**

SISTA'S-KS-7B-TEL

# లక్షలమ్మ టెక్నికల్ ఇన్‌స్టిట్యూట్

టైపు, షార్ట్‌హాండు తరగతులు ప్రతిదినము

10 గంటలనుండి 6 గంటలవరకు జరుగుచున్నవి.

ఏప్రిల్ పరీక్షలకు శిక్షణ ప్రారంభమైనది.

చేరగోరువారు వెంటనే దరఖాస్తు పెట్టుకొనవలెను.

మాసపుసుము :—టైపు 3—0—0 షార్ట్‌హాండ్ 3—0—0

కరెస్పాండెంట్,
లక్షలమ్మ టెక్నికల్ ఇన్‌స్టిట్యూట్,
ఆంధ్ర మహిళాసభ.

# రాజ్యలక్ష్మి పారిశ్రామిక విద్యాలయము

## ఆంధ్ర మహిళాసభ

కుట్టు, ఎంబ్రాయిడరీ లోయర్, హయ్యర్ గ్రేడ్ పరీక్షలకు శిక్షణయున్ను, లేసు, ఉల్లు, అల్లికలలోను, ఏకులుచేయుట, నూలు వడకుట, తువాళ్లు, దుప్పట్లు, చీరెలు నేయుటలోను చక్కని శిక్షణకూడ ఇందు ఏర్పరుపబడినది.

గవర్నమెంటు డిప్లొమోలేగాక, పారిశ్రామిక విద్యాశాఖవారి సర్టిఫికెట్లు, క్రమ పద్ధతిలో శిక్షణబొందిన వారికి ఈయబడును.

శిక్షణ ఉచితము.

విద్యార్థినులకు తెలుగు, అరవము, లెక్కలు తగుమాత్రముగా బోధించుటకు, హిందీలో పరీక్షలకు పంపుటకు ఏర్పాట్లుగలవు.

1950 నవంబరు హయ్యర్ గ్రేడ్, లోయర్ గ్రేడ్ పరీక్షలకు 26గురు వెళ్లుచున్నారు.

తిరిగి జనవరి 1951, 2వ తేదీనుండి క్రొత్త తరగతులు ప్రారంభము. ఈ శాఖలో చేరగోరువారు వెంటనే దరఖాస్తు పెట్టుకొనవలెను.

రకరకముల దుస్తులు కుట్టుటయేగాక, చీరెలు, పంచలు, దుప్పట్లు, తువాళ్లు, నవారు, యింకా వివిధ రకములైన నేత బట్టలు ఇక్కడ పురమాయింపుపై తయారుచేయబడును.

కరెస్పాండెంటు.

# ఆంధ్రమహిళాసభ

## మైలాపూరు - మద్రాసు

మహిళా విద్యాలయము :— హిందీ, కాశీ-విశ్వవిద్యాలయపు ఎడ్మిషన్, ఇంటర్మీడియెట్ పరీక్షలు, నృత్యము, గానము.

పారిశ్రామిక విద్యాలయము :— కుట్టు, ఎంబ్రాయిడరీ, ఊలు అల్లికలు, నూలు (గవర్నమెంటువారిచే రికగ్నైజ్ చేయబడినది) నడకుట, చేనేత ఇత్యాది పరిశ్రమలలో గవర్నమెంటు పరీక్షలకు శిక్షణ బీద విద్యార్థినులకు ఉచితము.

టెక్నికల్ ఇన్‌స్టిట్యూట్ :— స్త్రీలకు టైపు, షార్టుహాండు - గవర్నమెంటు పరీక్షలకు శిక్షణ.

మహిళా మందిరము :— స్త్రీవిద్యార్థినులకు వసతిగృహము.

ఆంధ్రమహిళ :— స్త్రీలలో విద్యావ్యాప్తికై, స్త్రీలచే నడుప బడుచున్న సచిత్ర మాసపత్రిక.

నిర్మలాదేవి గ్రంథాలయము :— సభ్యురాండ్ర, విద్యార్థినుల ఉపయోగార్థము సేకరించిన తెలుగు, హిందీ, ఆంగ్ల గ్రంథ సముదాయము.

నర్సింగ్ హోమ్ :— స్త్రీ, శిశువుల సంరక్షణశాల, ఉచిత వైద్య శాల—అడయారులో నిర్మింపబడుచున్నది.

క్రీడా, క్లబ్బుశాఖలు.

సభ్యురాండ్రుగాచేరి, యీ జాతీయ సంస్థను పోషించండి.

Edited and published by G. Durgabai, M.A., B.L., at the Andhra Mahila Sabha, Mylapore, Madras.
Printed by M. Satyanarayana at the H. Prachar Press, 12, Thanikachalam Chetty Road, T'Nagar, Madras.




మహోజ్జ్వలముగా నిర్మించబడిన

శోభనాచల వారి

మహోత్తర జానపద చిత్రము

# తిలోత్తమ

అంజలీదేవి.... నాగేశ్వరరావు.... సూర్యప్రభ.... కనకం

CH. E. PRASAD

డైరెక్టర్... మీర్జాపురం రాజా వారు

Co-optex

కో-ఆప్టెక్స్ చేనేత వస్త్రాలు

విశేషంగా కొరుక్కొనటానికి కారణాలు :

* నాణ్యత
* డిజైను
* మన్నిక
* రంగు నిలకడ
* ధర

ధోవతులు - చీరెలు - షర్టింగులు - తుండుగుడ్డలు - అలంకరణ వస్త్రాలు - మేజాగుడ్డలు - దుప్పట్లు - రుమాళ్ళు మొదలైనవి.

రాష్ట్రంలో ఉన్న మా 63 ఎంపోరియంలలో దేనికైనా వెళ్ళి మీకు కావలసినవి ఎన్నుకొనండి.

**మద్రాస్ హాండ్‌లూం వీవర్స్ ప్రావిన్షియల్ కో-ఆపరేటివ్ సొసైటీ లిమిటెడ్**

" హాలోవేస్ గార్డెన్స్ "

34, పాంథియన్ రోడ్డు :: ఎగ్మూరు, మద్రాసు.



బిడ్డల లివరు అండు స్ప్లీను వ్యాధులకు

# పాత్రుడుగారి బాలసంజీవిని

డాక్టరు పిల్లా పాపయ్యపాత్రుడుగారి "బాలసంజీవిని" నిజముగ అమోఘమైనది. బిడ్డలకు సంభవించు లివరు అండు స్ప్లీను వ్యాధులలో ప్రథమ దశయందుగాని, కాంప్లికేటెడ్ స్థితియందుగాని తప్పకుండ గుణమిచ్చును. నా వైద్యవృత్తియందును నా స్నేహితులలోను, బంధుకోటిలోను అనేకులు ఉపయోగించుటవల్లను "బాలసంజీవిని" యొక్క గుణాతిశయములు పరీక్షించుటకు అవకాశమేర్పడినది. బజారులోగల యితర లివరు ఔషధములుగూడ యిది వరలో వాడి చూచితినిగాని "బాలసంజీవిని" వాడిన పిమ్మట పైవాటినెల్ల విసర్జించి దీనినే హెచ్చుగ వాడు చున్నాను. అమోఘమగు నిట్టి మహౌషధమును ప్రజోపయోగమునకు వినియోగించుచున్నందుకు పిల్లావారి వంశము స్తుతిపాత్రమైనది.

డాక్టర్ ఎన్. రామనాథన్‌గారు, L. M. P. కావేరిపాకం.

వివరములకు:

**డాక్టరు పిల్లా పాపయ్య పాత్రుడు & బ్రదర్సు,**

నెం. 11, దక్షిణమాడావీధి, మైలాపూరు, మద్రాసు 4.

| కుంభకోణం బ్రాంచి: | తిరుచినాపల్లి బ్రాంచి: |
|---|---|
| నెం 7, సారంగపాణి కోవిల్, | నెం 15, పుగళై పిళ్లై వీధి, |
| తూర్పువీధి. | తెప్పకోలం. |

అన్ని మందుల షాపులలోను దొరకును.

ప్రఖ్యాతిగాంచిన ప్రశస్తమైన

# మెహతావారి విశేష ఔషధములు

1. సుందరి ఎలిక్జిర్ :—సమస్త ఋతు దోషములను పోగొట్టును, గర్భాశయరోగ అనుపమ నివారిణి.
2. ఫాస్ఫరస్ ఆయిల్ :—బాధ నివారణకు సాటిలేని తైలము.
3. మస్తానాపిల్సు :—సాధారణబలహీనత, కీళ్లనొప్పులు జ్వరములన్నిటికి అమోఘముగా పనిచేయును.
4. ద్రాక్షాసవము :—(బంగారము, మకరధ్వజము కలిసినది) రక్తమును శుద్ధిపరచునటువంటి, అజీర్ణము రూపుమాపునటువంటి బలవర్ధకౌషధము.

కెమిస్టులందరివద్ద దొరకును.

తయారు చేయువారు:

**K. S. MEHTA & CO.**

***250, China Bazar, Madras.***



# ఆంధ్రమహిళ

సంపుటి 7 :: ఫిబ్రవరి '51 :: సంచిక 10



సంపాదకురాలు : శ్రీమతి దుర్గాబాయి, యం. యే., బి. యల్.

సహసంపాదకురాలు : శ్రీమతి చన్నఘంటమ్మ, యం. యే. యల్. టి.

ఆంధ్ర మహిళా సభ, మైలాపూర్

సంవత్సర చందా — అయిదు రూపాయలు



## కృతజ్ఞత

ఈ దిగువ పేర్కొనినవారు రూ. 100 చందా కట్టి ఆంధ్ర మహిళా సభలో యావజ్జీవ సభ్యురాండ్రుగ ఎన్నుకొనబడిరి. వీరికి మా కృతజ్ఞత.

శ్రీమతి. బులుసు కామాక్షమ్మగారు
,, పార్మా కమలాబాయిగారు
,, టి. జి హైమవతిగారు
,, బులుసు రాజరాజేశ్వరిగారు
,, టి. పి. సరళాదేవిగారు.




సంపుటి 7 | ఫిబ్రవరి 1951 | సంచిక 10

# వెనుక చూపు

యుగయుగములుగా మానవుఁడు తన ఉద్ధారణకై ప్రయత్నిస్తున్నాఁడు. ప్రతి రాజ్యము వారు, ప్రతి పక్షవాదము వారుకూడ, తమ రాజ్యప్రజలను, తమపక్ష ప్రజలను, ఉద్ధరించుటయే తమ ఉత్కృష్టమైన ఆదర్శముగా వల్లించు చున్నారు. స్వోద్ధరణ యనుమిషతో, పరపీడన తమ ధర్మమనే దురభిప్రాయానికి లోనై, ఈ భిన్నవాదములవారు ప్రవర్తించు చున్నారు. పరులను అణచివేయుటవల్ల తమ ఔన్నత్యాన్ని నిలబెట్టుకోవాలి, పరులను శోషింపజేసి తాము విజయము గాంచాలి అనే సిద్ధాంతము ప్రబలినన్నాళ్లు, ఏరాజైనాసరే, ఏరాజ్య వాదమైనాసరే, ఏపక్ష ప్రభుత్వమైనాసరే, ప్రజలను ఉద్ధరించలేదు. ఏరాజైతేనే పళ్లు ఊడగొట్టు కొనడానికి అనే స్వరూపంలోనే ఉంటుంది ప్రజలదృష్టిలో యీ దురహంకారానికి లోనైన ప్రభుత్వము. స్వప్రయోజనానికి పరపీడన ఒక అవసరమైన ఆయుధంగా ప్రయోగించే ఏవాదముగాని, ఏ సిద్ధాంతముగాని, ఏరాజనీతిగాని, అది సాంబ్రాజ్యవాదమే కానిండు, నియంతృత్వమే కానిండు, ప్రజాస్వామ్యమే కానిండు, మరియేదైన కానిండు, దాని నిలకడ పరిమితమైనదే అని చరిత్ర నిరూపిస్తూవుంది. పరపీడనలేని స్వప్రయోజనాన్ని ఏ సిద్ధాంతము సాధించగలుగుతుందో అదేచిరస్థాయిగా భూమియందు నిలచి, ప్రేమ స్వరూపమైన మానవ సామ్రాజ్యాన్ని నెలకొల్పగల్గుతుంది—అట్టిదే మహాత్ముని అహింసా సిద్ధాంతము—ఆయుధ రహితమైన, రక్తపాత మిసుమంతలేని శాంతివిప్లవాన్ని విజయవంతంగా నడిపింపజేసినది యీ సిద్ధాంతబలమే.

# ముందు చూపు

ఈ అహింసా సిద్ధాంతాన్ని భళిభళీ అని ఉగ్గడించే విదేశ నాయకులుగాని, అనుదినమూ ఉపన్యాస వేదికలనెక్కి అహింసను గూర్చిన ప్రసంగాలు జరుపుతూ, గాంధీగారి అనుంగు వార

సులము, అత్యంత ప్రియశిష్యులం అని చెప్పుకుంటూ ఉన్న మన దేశ నాయకులలో ఏ ఒక్కరుగాని, ప్రపంచశాంతి స్థాపనకిదియే పరమసాధనమని ఒప్పుకున్న ఐక్యరాజ్య సమితిగాని, ఈ సిద్ధాంతము యొక్క నిజతత్వాన్ని, ప్రాబల్యాన్నీ, గ్రహించ లేదనుట యదార్థమున కొంతమాత్రము వ్యతిరేకము కాదు. ఎల్లెడల దట్టముగా వ్యాపించి, అణుశక్తివర్షముచే భూగోళాన్ని ఒక మారుదగ్ధము చేయునేమో యన్నంత భీతిని గొల్పుచున్న యుద్ధ మేఘములను చెదరగొట్ట గలిగినది ఒక దేశముయొక్క ఆయుధ ప్రాబల్యమూకాదు, మరియొక దేశముయొక్క మూర్ఖపు పట్టుదలాకాదు, అర్థములేని రాయబారములూగావు, వ్యర్థములయ్యే సంప్రదింపులూగావు— ఏ సిద్ధాంతమైతే, ప్రేమ స్వరూపమైన మానవ సామ్రాజ్యాన్ని చిరస్థాయిగా నెలకొల్పగలదని మహాత్ముఁడు అనుచరణ పూర్వకముగా మనకు బోధించాడో, అట్టి సిద్ధాంతముయొక్క వాస్తవిక స్వరూపమును ప్రపంచనాయకులు గుర్తించిననాడే, ఆత్మనియమముచేత, తపస్సుచేత, ఆ సిద్ధాంతమును స్వయముగా నాయకులు అమలు జరిపి చూపిననాడే, ప్రపంచశాంతి నిజమైన కలకాగలదు. ప్రపంచ ఆకాశమున వ్యాపించియున్న యుద్ధ మేఘములు ఆనాడు కరిగిపోయి, శాంతి సుధాంశు శీతల కిరణములు చల్లగా ప్రసరించగలవు. అంతవరకు, శాంతి యనునది గగనకుసుమము, ఎండమావు అని, యుద్ధము సిద్ధము అని నమ్ముటలో తప్పులేదు. ఆయుధబలంతో, ప్రపంచాన్నంతా ఆక్రమించుకుందామనే అత్యాసతో ప్రవర్తిస్తూఉన్న అగ్రరాజ్యాలవారు ఇందలి సత్యాన్నిగ్రహించి, వెంటనే అస్త్ర సన్యాసానికి పూనుకోపోతే, మూడవ ప్రపంచ సంగ్రామమువల్ల ప్రపంచానికి కలుగబోయే ముప్పుకు వారే బాధ్యులు కాగలరు; ఐక్యరాజ్యసమితి తమ ఓటమిని ఒప్పుకుని, క్రియా సూన్యమైన తమ సమావేశములనుండి విరమించుకోవచ్చును కూడా.



# దివ్యస్మృతి



శ్రీ థక్కర్‌బాపా

| జననం. | మరణం. |
| --- | --- |
| 29-11-1869. | 19-1-1951. |

వయోవృద్ధులు, సేవావృద్ధులునైన శ్రీ థక్కర్‌బాపా జనవరి 19 వ. తే తమ ఎనుబది రెండవ ఏట జన్మస్థానమైన భవనగరులో పరమ పదించిరి. ఋషిపుంగవుడైన మహాత్ముడు దేశ అభ్యుదయమునకై ఆదేశించిన నిర్మాణ కార్య క్రమమునకు, ఒక స్వరూపమునిచ్చి, అస్పృశ్యతా నివారణ, నిమ్నజాతి ఉద్ధరణ, స్త్రీజన అభివృద్ధి, ఖద్దరు పరిశ్రమ యిత్యాది వుద్యమాలలో 5 దశాబ్దాలకుపైగా అనుక్షణం తన్నెదుర్కొంటున్న సంఘ పరిస్థితులను లెక్క సేయక, నిరాఘాటంగా నిశ్చలమైన దీక్షతో అతినిశ్శబ్దంగా కృషిసల్పిన మహానుభావులు థక్కర్‌బాపా. ఈనాడు అస్పృశ్యత చట్టపూర్వకంగా నిషేధించబడ్డదంటే, ఈనాడు హరిజనులు విద్యావంతులై రాచకీయంగాను, ప్రభుత్వంలోను వున్నత స్థానాలను ఆక్రమించుకొన్నారంటే, ప్రత్యేకమైన విద్యా, వుద్యోగ సౌకర్యాలు విరివిగా పొందుచూ పెక్కుమంది నిమ్నజాతులవారు దేశంలో తమ వ్యక్తిత్వాన్ని నిరూపించుకొను చున్నారంటే, గ్రామవాసులైన స్త్రీల విద్యా విజ్ఞాన ఆరోగ్య వైద్య సౌకర్యాల నిమిత్తమై మాతకస్తూర్బాస్మృతి చిహ్నంగా అన్ని రాష్ట్రాలలో వివిధ శిక్షణ కేంద్రాలు స్థాపించ బడ్డాయంటే, కుగ్రామాలలో, మారుమూలల, అటు గిరిజాల్లో ఉన్న అటవికులు, భిల్లులు, కొండజాతులవారు, ఏనాటికైనాని తమ జీవిత సౌభాగ్యాన్ని పెంపొందించుకో గలిగారంటే, ఇందులకు బాపాయొక్క అవిరామకృషియే కారణం. అధికార వ్యామోహముగాని, కీర్తి వ్యామోహముగాని, అర్థవ్యామోహంగా లేక, కేవలం మానవసేవయే మాధవసేవగా భావించి, తన సేవాఫలితములను తన జీవితకాలంలో చూడగలిగిన ధన్యజీవులైన థక్కరు బాపాయొక్క నిష్కళంక, మానవాతీతమైన సేవ ఎంత మనం స్మరించినా, చంద్రున కొక నూలుపోగన్న స్వరూపంలో, అపారవారాంబుధిలో ఒక నీటితుంపర పరిమాణంలోనే ఉంటుంది.

థక్కర్‌బాపా సందర్శించని సేవాసంస్థలు, అందూ స్త్రీ సేవాసంస్థలు లేవని చెప్పుటలో అతిశయోక్తి లేదేమో. మా ఆంధ్ర మహిళాసభ కూడా ఆభాగ్యానికి నోచుకొన్నది. పారిశ్రామిక విద్యాలయములోని ప్రదర్శనశాలకు పునాదివేసినది థక్కరు బాపాయే. వీరి ఆశీస్సులచే మా విద్యాలయం దిన దినాభివృద్ధి జెందుచున్నదని చెప్పుకొనుట అప్రస్తుతము కాదు!

స్వతంత్రంతోపాటు మనకు సంభవించిన వేలాదివేల క్లిష్టసమస్యలు పరిష్కరించు కోవలసిన ఘనతరబాధ్యత ఉన్న యీతరుణంలో, బాపూతో ప్రారంభమై, నేటి బాపావరకు, రాజకీయవేత్తలు, ఆధ్యాత్మికవేత్తలు, పలువురు పరలోక గతులౌటు, జాతి దురదృష్ట మనక తీరదు. ప్రకృతి నిబద్ధమైన పాంచభౌతిక శరీరమును విడచి వారు మనకు దూరమైనప్పటికీ, ప్రకృతి బద్ధముగాని, దేశకాలాతీతములైన వారి సేవను, ఆదర్శములను, ఆదేశములను మనము విస్మరించక, వారి అడుగుజాడలలో సంచరించుటకన్న వారికి కృతజ్ఞత చూపగల మార్గముగాని, వారికి ఆత్మశాంతి కల్గించు క్రియగాని ఉండబోదు.

—అ. చన్నఘంటమ్మ.



[30-1-1948—సాయంత్రపువార్త ఆకాశవాణిలో ప్రసారమైనప్పుడు—కలిగిన హృదయవేదనను పద్యరూపంగా వెల్లడించినారు శ్రీమతి నీలా బాయిగారు]

# అ శ్రు ధా ర

* శ్రీమతి పి. నీలాబాయి శ్రీశా *

ఘోరంబు, క్రూరమై కౌచికంబు,
సకలమానవ హృదయనిర్భేదకంబు
అశనిపాతంబు బోలు కఠోరవార్త
వినులంబడి యె నేడెట్టి దుర్దినంబొ ॥

రవి యస్తపర్వతమున కృంగుయనురవేళ
లోకమెల్ల తమోరాశి మునుంగువేళ
పలికె నభవాణి బాపు నస్తమయవార్త
జగమె స్తంభించి దిగ్భ్రాంతి నొందునట్లు ॥

గాంధిజీ మృతుడయ్యెనను నట్టి దుఃఖవార్త
వినియు విశ్వసింపగలేక తల్లడిల్లిరందు జనులు
హత్య గావింపబడెనన్న చెప్పనేల
దద్దరిల్లిరి ఉన్మత్తచిత్తులైరి. ॥

శోక, క్రోధ, విషాద సంక్షుభితమగుచు
భారతీయుల హృదయము తాల్లవయ్యలయ్యె
ఆర్తనాదములు నలుదెసల పిక్కటిల్లె
భరతమాతయే ఎలుగెత్తి ఏడ్చినట్లు ॥

అహింసావ్రతం బెపరమ ధర్మమనుచు
జగమునకు చాటినయట్టి అజాతశత్రు
దారుణంబుగ హింసింపబడియె నకట
నరరూపుడగు నొక్కరక్కసు నిచేత ॥

దివ్యతేజంబు ముఖమున వెలుగుచుండ
మనుమరాం డ్రిరు వంకలను చేయూతనొసగ
సభ్యులకు వెళ్లుచుడి వందనంబొసర్ప
మందహాసంబుతోడ నంజలి ఘటించి ॥

రాము భజియింప నేతెంచు భవ్యమూర్తి
విస్ఫులింగముల యెత్తిడి క్రౌర్యలేక
నేలకొరిగెను హేరామ రామయనుచు
పరమపదము నలంకరింపంగనేగ ॥

లభ్య మయ్యెనేగాని స్వతంత్రంబు దేశమునకు
శాంతి నెలకొనలేదు, దౌష్ట్యంబు లణగలేదు
మార్గదర్శకుడింతలో నస్తమింప
కొట్టుమిట్టాడ వలసె మన భరతభూమి ॥

కరకు తురకలుకూడ నౌఖాలియందు
పాదచారియై పల్లెలు తిరుగు బాపునకును
చేయ సాహసింపగ జాలనట్టి ఎగ్గు
ఒక్క బ్రాహ్మణాధము డొనర్చె నెంతసిగ్గు ॥

అవిశ్రాంతముగ దేశసేవల చేసిచేసి
త్యాగియై, విరాగియై కడకాత్మార్పణంబుచేసి
గాఢ విశ్రాంతినందె నాయమరజీవి
శాంతిగల్గును గాక మహ[illegible] యాత్మకు శాంతిశాంతి ॥

[మూడు సంవత్సరము లైపోయింది—బాపూ ఆత్మజ్యోతి విశ్వజ్యోతిలో లీనమైపోయి. ఆయన ఆచరణ పూర్వకంగా ఉపదేశించి, ఆదేశించిన, ఆదర్శము లన్నీ, ఆయన చితాభస్మముతో నిమజ్జనముచేసి, ఆయనసంపాదించిన స్వరాజ్య ఫలాన్ని అనుభవింపలేని అతిదుఃఖదశలో కొట్టుమిట్టాడు చున్నాము, దురదృష్ట వశులమైన మనము—సం॥]






## దశమ గుచ్ఛము

౧

నరసింహామూర్తి మేష్టారును చూడడంతోటే పద్మావతి తెల్లబోయింది. అపరిమితాశ్చర్యంతో నిశ్చేష్ట అయింది! మేష్టారూ! అంటూ గబగబా ఆయన దగ్గిరకు పరుగెత్తి పోయి పాదాలకు నమస్కరించింది. "ఎల్లా ఒచ్చారు? మేము ఇక్కడ ఉన్నామని తెలిసిందా? ఇన్నాళ్లూ ఎక్కడ ఉన్నారు? మీరు లేకపోవడం నాకు మతిపోయి నట్లే అయింది." ఇలా ఏవేవో మాటలు అంటూ మోము ప్రఫుల్లమైపోగా, బొమ్మలా నిలుచుండి పోయింది.

ఇది అంతా శ్రీమతి కరుణామయీదేవి చిరునవ్వుతో గమనిస్తూ ఆలా నిలుచుండినది.

నరసింహామూర్తిమేష్టారు ఆశ్చర్యంతో పద్మావతినిచూస్తూ ప్రూన్పడి ఆలాగే నిలుచుండి పోయినాడు. ఈమె పద్మావతేనా? అవును! అదిగో ఆమె వసతి గృహాధికారిణి శ్రీమతి కరుణామయి. పద్మావతి! పద్మావతే! అవును ఏలా వచ్చింది!

"మీ రిద్దరూ ఇక్కడకు ఏలా వచ్చారు?"

శ్రీమతి: అమ్మాయికి దక్షిణాదిలోని దివ్యక్షేత్రాలన్నీ చూడాలని బుద్ధి పుట్టింది. మేము ఇద్దరం కలిసి వచ్చాము. మీరు మమ్మల్ని ఇక్కడ కలుసుకోడం ఆశ్చర్యమే.

నర: అవును! నేనూదక్షిణాది యాత్ర చేస్తూ, అయిదారు రోజులు తిరువాంకూరులో ఉండి, కన్యాకుమారిదేవిని అర్చించడానికి వచ్చాను.

వారందరూ కలిసి బసకు వెళ్లారు. పద్మావతికి ఒకవైపు ఆనందమూ, ఇంకోవైపు ఏదో ఆవేదనా! ఆమె ఏమీ మాట్లాడలేకపోయింది. ఆ రాత్రి ఆ చీకట్లో ఆమె నిద్ర రాక పక్కపై కదలకుండా పడుకుని ఉన్నప్పుడు చటుక్కున సినీమా చిత్రం తెరపై ప్రత్యక్షమై కథ సాగినట్లు ఒక్కసారిగా ఆమెకు బుచ్చి వెంకట్రావు, తన ఊరు, తన సముద్రము, తన కథ, ప్రత్యక్షమై జరిగిపోసాగింది.

తాను తప్పుచేసిందా? తనకు తన భర్త అంటే ప్రేమే లేదా? తన సంగీతం ఏమయింది? ఎందుకు తనకీ చదువు? ఈ శ్రీమతిగారు నరసింహామూర్తి మేష్టారూ ఎవరు? ప్రపంచంలో తనకింక పని ఏమి ఉంది.

ఉన్నట్లుండి ఆమె కన్నీరులో కరిగిపోయి, నరసింహామూర్తి మేష్టారు పాదాలకడ వాలిపోయి, ఆయన పాదాల మీద మోముంచి వెక్కివెక్కి రోదించినది. నరసింహామూర్తి మేష్టారూ కూలబడి, పట్టలేని దుఃఖంలో మునిగి భుజాలు ఎగిరిపోతూ ఉండగా గొల్లుమని ఏడ్చినాడు.

శ్రీమతి కిది ఏమీ అర్థం కాలేదు.

"ఏమిటండీ ఎవరికీ మీ ఇద్దరికే మతిపోయిందా? లెండి." అని అంటూ వారిద్దరికీ ఆమె చేయి వేసింది.

నరసింహమూర్తి మేష్టారు త్వరగా సంబాళించుకొని, తానులేచి పద్మావతిని లేవదీసి, తన హృదయానికి అదుము కొన్నాడు.

"తల్లీ! నువ్వే నాకు కన్న కూతురువు. బిడ్డలులేని లోపం నీ భర్తా, నీ సహచర్యంవల్ల తీర్చుకొంటున్నాను. ఏదో మన దురదృష్టవశాత్తు ఈనాటికి ఏవేవో సంఘటనలు వచ్చాయి" అని ఆతడు శ్రీమతివైపు చూచి, "అమ్మా పదండి! అన్నాడు.

వారందరూ నెమ్మదిగా నడక సాగించారు.

శ్రీమతి "ఏమిటండి నరసింహమూర్తి మేష్టారు ఈ కన్యాకుమారి అగ్రాన్ని గూర్చి?" అని ప్రశ్నించింది. ఆమె తనలోని ఆవేదన ఉపశమనం అయ్యేందుకు ఈలా ఏదేని విషయాన్ని గూర్చి సంభాషణ ప్రారంభించిందని పద్మావతీ, నరసింహమూర్తి మేష్టారూ గ్రహించారు. పద్మావతి త్వరగా ఉపశమనం పొందలేక పోవచ్చును. తన విధి శ్రీమతిగారిని మద్దతు చేయడమేకదా! అమ్మాయి దుఃఖం చూచి, తానూ కరిగిపోయినాడు. కాని తాను ఈ లోకసంబంధం మానుకుని, భగవచ్చరణార విందాల లగ్నం చేసుకోడమే తనకు విధి.

"శ్రీమతిగారూ! ఈ అగ్రం ఎవేవో విచిత్ర భావాలను ఉద్భవింప చేస్తోన్నదండీ. ఇది భరతదేశానికి దక్షిణపు కొన. రవివర్మగారు ఈ అగ్రాన్ని-నిలుచున్న ఒక దివ్యమాత పాదాలుగా చిత్రించారు. సముద్ర హృదయాంతర దివ్య భావ మహాతరంగాలతో స్పందనమయ్యే భారత వీణ స్మృతి తీగలా కనబడింది నాకీ అగ్రం. కన్యాకుమారీ భావం సంపూర్ణంగా అర్థం కాలేకపోయినా, అనన్య పరమ భావా లేవోనన్ను కదిపి వేస్తున్నవి. విరిగిపోయిన శాంతి తిరిగి హృదయంలో చేరుకుంటున్నది."

"నరసింహమూర్తి మేష్టారూ! పద్మావతికి పరీక్షలు దగ్గిరకు వచ్చినాయి. ఇంతవరకు బాగానే చదివింది. కాని, ఇకముందు ఏమి చేస్తుందో అని కొంచెం భయంగానే ఉంది నాకు. అసలు పద్మావతికి పరీక్ష విజయం పొందవలసిన అవసరం ఉందని కాదు. ఆమెకు పరీక్ష నెగ్గడం గౌరవ సంబంధం మాత్రమే అని నాకు తెలుసు. అయినా చిహ్న మాత్రమైన పరీక్ష నెగ్గడం, నెగ్గకపోవడాలలో, ఈ రోజుల్లో మానవ మానసిక ప్రవృత్తి సంపూర్ణ సాంధవ్యం సంపాదించుకుంది."

"పద్మావతి నాలుగు కచ్చేరీలు చేసుకుంటే పదివేలు సంపాదించుకొంటుంది, అయినా మీరన్నట్లు, ఈనాడు ఈ పరీక్షలకు మానవ జీవితానికి ముఖ్యమైన సంబంధం ఉంది సుమండీ!"

"బాల సుబ్రహ్మణ్యంగారు ఎం. ఏ., అయన మొదటి శ్రేణి గాయకోత్తముడు అయినా ఆ ఎం.ఏ. డిగ్రీ ఆయనకు ఇంకో లక్ష గౌరవం తెచ్చిపెడుతూ ఉంది."

"అందుకనే కాదండీ కవిత్వంవల్ల ప్రసిద్ధనామం సంపాదించుకొన్న వారికి డిగ్రీ ఉంటే, లేనివారికన్న ఎక్కువ గౌరవం చేస్తాము. అలాగే సినీమాతారల విషయంలోనూ!"

"అయితే మీ ఉద్దేశం పద్మావతి పరీక్షలో కృతార్థ తను పొందడమే మంచిదని."

"కాదండీ మరి!"

"అయితే ఫిబ్రవరి వచ్చింది. ఈనెల అంతా గట్టిగా చదివితే చాలు. మార్చి రెండవవారంలో కాశీ వెడతారు. అప్పటికి అమ్మాయి పట్టుగా ప్యాసవడానికి సరియైన స్థితికి వస్తుంది."

"మీ రిద్దరూ అన్ని క్షేత్రాలూ చూచారుగా!"

"ఓ! ఇంక ఇంటికి మళ్ళడమే!"

అప్పటికి పద్మావతి హృదయం ఊరట చెందింది. వినీ వినబడని కంఠంతో.

"నరసింహమూర్తి మేష్టారూ! మీరుకూడా మీ యాత్రలు ఇంతటితో మానివేసి, మదరాసు రావాలి. మీరు రాకపోతే నేను మదరాసు వెళ్ళగానే ఎవరికీ కనబడకుండా ఎక్కడికైనా వెళ్ళిపోతాను. ఆ పాపపుణ్యాలు మీవే!" అన్నది.

నరసింహమూర్తి మేష్టారు పద్మావతిని తనపక్కకు నొక్కుకుని "తల్లీ! నీ కోర్కె నాకు రామాజ్ఞ. పద, అందరం కలిసే మదరాసు పోదాం" అన్నాడు.

[సశేషము]





# గౌతమ బుద్ధ

—: నాటిక :—

(అంకత్రయము)

రచన : కీ. శే. శ్రీ. కోనే వెంకటేశ్వరరావు

పాటలు. పద్యాలు : శ్రీ "జగం"

సంపాదన : కె. జగదాంబ

[యశోధర మేల్కాంచి తనభర్త శయనాగృహములో లేక పోవుట తెలిసికొని కలవరపడును. శుద్ధోదనుడు తన పుత్రుని జాడతెలియక విలపించుచుండగా ఛన్నుడువచ్చి సిద్ధార్థుడు సన్యసించెనని తెల్పును.]

## అంకము ౩

### రంగము ౧

(సిద్ధార్థుని తపోవన ప్రాంతము. ప్రవేశము నలుగురు గొల్లలు)

1 గొల్లవాడు : ఓరి కోటా! నువ్వేమి చేస్తావురా నీకొచ్చే డబ్బెట్టి?

2 గొల్ల : నేనా! నేను—బింబిసార మారాజులుంగారు నా వొంతు మేకలకిచ్చే డబ్బంతా తాగేస్తానురా!— మంచినీళ్లకు మల్లేనే తాగేసేస్తానురా!!—మరేం చేసేదిలేదు!

3 గొల్ల : ఓరి ఇంట్లో పెళ్లాం—పిల్లాజల్లా! అంతా తాగేస్తే యెలారా!

4 గొల్ల : (మేకల నదలించుచు) దుర్రు! దర్ర్!—ఓరి మీ కవుర్లూ—కథలూ కూల!—మందని సరిగ్గా మల పండిరా కవుర్లు తరువాతగాని...

(ప్రవేశము. సిద్ధార్థుడు, తపస్వి వేషమున)

సి : (కొంచెము ఆయాసమును జూపుచు) అబ్బా! ఎండ ఎంత తీక్షణముగా నున్నది! వృక్షములందలి పచ్చని యాకులే నల్లగా మాడి బూడిదలై పోవుచున్నవి! (గొల్లలజూచి) ఏమిది!—గొల్లలు! పాపము! ఇట్టి మండుటెండలో మేకలమందను జాలిగొనక తిట్టుచు, కొట్టుచు నడిపించుచున్నారు! (నిదానించి చూచి) ముద్దు వచ్చుచున్న ఆ చిన్ని మేకపిల్ల అట్లు నడచుచున్న దేమబ్బా!—

గీ॥ జీవయాత్రను పోలేక—త్రోవమధ్య
కాలువిరిగియు కుంటెడు—గతినియగియు
కుంటుచున్నది శ్రమచేత—కుందుచుండె
మూర్ఖునకు పాఠమును నేర్ప—నూహజేయ!

అకటకటా! ఆ ముందున్నది దాని తల్లియే కాబోలును! అది దీని వంకను—ఇది దానివంకను—ఒండొరులను పదేపదే జూచుకొనుచు నడచుచున్నవి! అయ్యో! ఈ దృశ్యమెంత జాలిగొలుపునదిగా నున్నది! (గొల్లలతో) నాయనలారా! ఎండ మండుచున్నదే! గాలియతివడ గాల్పుగానుండెనే! ఈ వేసవి మధ్యాహ్నమున నింటు చల్లగా గూర్చుండువారే శ్రమ జెందుచుండ—మీరు ఈ నిర్భాగ్యపు ప్రాణుల నిట్లు బాధపెట్టుచు— మీరును శ్రమ నొందుచు నెచ్చటికి ప్రయాణించుచున్నారు?—ఏ గొల్లలైన నిట్టి కానివేళ యిట్లు మందను నడిపింతురా? ఇది ఎవ్వరు నెరుంగని, వింత విషయముగా నున్నదే?!

1వ గొల్ల : లేదు, మునీశ్వరా! మేమీ కానివేళ మందను తోలడం—బింబిసారమారాజులుంగారి యాగానికోసం గాని—లేకుంటే—ఇలా తోలడానికి మాకేం పని సామీ!—ఆ ప్రభువుగారు చేసేది యెంతో మహా

యజ్ఞమట మరి అంతోటి సంతోషంగానుండాలి గేము
మండను తోలుకపోకుంటే ఎట్లాగ చెప్పండి మీరే?!

: (స్వగతము) ఘోరము! మహాఘోరము!! అక్కటా! ఎట్టి పిడుగువంటి వార్త వినవచ్చెను!—ఆ చిన్న మేకపిల్లయొక్క దుస్థితికే నేను వగచుచుండ—వీరే మనుచున్నారు! ఈ మందనంతను యజ్ఞమునకు—బలికై—గొనిపోవుచున్నామనియా! (హృదయముపై జేయినిడి) నా హృదయమిప్పుడు నిలుచునట్లు లేదే! ఈ వార్తచే ఛిన్నాభిన్నమై పోవుచున్నది!!—నేనిప్పుడేమి చేయదగియున్నది! (యోజించి) ఈ విధమున జేసెద గాక! వీరి వెంట నేనునుపోయి—ఆ యజ్ఞమండపమున నా ప్రాణము లొడ్డియైనను—యీ అభాగ్యజీవరాశి ప్రాణముల గాపాడెదగాక! (ప్రక్కకుజూచి) పాపము! ఈ మేకపిల్ల బొత్తిగా నడవజాలకున్నది!—దీనిని నా భుజముల నెత్తుకొని శ్రమవాపుచు, వీరిని, వెంబడించెద గాక! (ప్రకాశముగా) నాయనలారా! నడువుడు! నేనును యజ్ఞమును జూడవచ్చుచుంటిని!—(అందఱు నిష్క్రమింతురు.) తెర.

## రంగము ౨

(యజ్ఞశాల: సతీసమేతుడై బింబిసారుడును, తదితరులును—యజ్ఞమును నిర్వర్తించుచుందురు — సమయమున నొకడుంబలి, బలియని కేకవేయును.)

సి: (చివాలున ప్రవేశించి) ఓయీ! ఆగుమాగుము!—పాప మామేకపై కత్తినెత్తకుము! (రాజును, తదితరులను జూచి) మహారాజా! మహాత్ములారా!—సోదరులారా! శాంతచిత్తులైనా పలుకుల గొన్నింటి నాకర్ణింపుడు!—ఈ యజ్ఞమును మీరు పూర్వాచారమని మాత్రమే తలపెట్టుచున్నారు!—ఇట్టిదానికై యేమియు నెరుగని అభాగ్యజీవుల నసంఖ్యాకముల—గొంతుల గోయుచున్నారే!!—అట్టి ఘాతుక కార్యములచే నేమగుచున్నది?—సహజముగ కోమలములగు మీ (మనస్సులు) హృదయములు పాషాణతుల్యములుగ పరిణమించుచున్నవి—అయ్యలారా!! ఇంతకన్నను లోకమున వేరె అవివేకము గలదా?—అదియునుగాక—అట్లు చంపబడిన శవముల నతిప్రీతితో భుజింతురు గూడ!—మాంసభక్షణము!—ఈ లోకమున మానవుడు మాంసభక్షణము చేయుటకై సృష్టింపబడెనో లేక శాకాహారియై బ్రదుకుటకు మాత్రమేనా!—కొంచము విచారింపుడు!—సృష్టియందు మాంసాహారులుగా నేర్పడిన జంతువులు—మాంసమును చీల్చి చెండాడి తినుటకు వాడియైన కోరలను—మిక్కిలి గఱకుగల నాలుకను గలిగియున్నవి! మానవుడట్టి కోరలు మొదలైనవి కలిగియుండెనా?—లేదు—! ఇట్టి మానవుడు తామసస్వభావుడై తామసములైన నీచాహారములను అభిలషించుచున్నాడు! ఏమి! సృష్టియందు శాకాదులైన సాత్త్వికాహారములకు లోపము వాటిల్లెనా? అపరిమితముగనున్నవి!—ఏదియో యొక దేవతపేరుననో—మరే పేరుతోనో—నోరులేని — దిక్కుమాలిన—నిర్భాగ్య ప్రాణుల స్వోపభోగమునకై—హింసించుటకు—మానవుడుద్యుక్తుడగుచున్నాడు!—స్వోపభోగమునకై లోకమున మానవుడు కావింపని ఘాతుక కార్యము గలదే?! పరార్థమునే స్వార్థముగ జూచుకొనుడు! మీరే దేవతలు కాగలరు! 'అహింసా పరమ ధర్మము'ను—మనోవాక్కాయముల త్రికరణముల ననుష్ఠింపుడు! భూలోకము స్వర్గలోకమై పోగలదు! మహాశయులారా! ఈ నా వచనములను మన్నించి ఈ జంతువధ నాపి—ఇట్టి హింసాకార్యముల యికముందునను కలుగకుండునట్లు చేయగలమను వాగ్దత్తము నొసంగెదరా సరియే—లేకున్న—

గీ॥ ముందు మీ యజ్ఞపశువుగా—ముక్తికొరకు
నన్ను బలిజేసి పిదపనీ—చిన్ని పశుల
నరకి మీ స్వార్థపరతను—నరుగుడిదియె
మాట నేర్పినదానికి—బాటయను.

(చేతులుకట్టి, మెడనువంచి—దృఢముగా నిలచును.)

బింబి: (శీఘ్రముగా లేచివచ్చి సిద్ధార్థునికి నమస్కరించి) మహాపురుషా! నీ పవిత్రోపదేశము చే—మే మెల్లరము—పరమ పవిత్రులమైతిమి! మహాభాగా—

గీ॥ బలిపశువు ప్రాణరక్షకై—బాధ జెంది
స్వీయజీవనదానంబు—జేయదలచి
[illegible] త్యాగమూర్తి [illegible]
[illegible] !

[illegible]—[illegible] [illegible]—[illegible]—[illegible] నైన హింసయను శబ్దమే లేకుండ జేయుటకే—హింసయను పదమే వినబడకుండ జేయుటకే—ప్రతిజ్ఞ చేయుచున్నాను!—మేమెల్లరము [illegible] అహింసావాదుల ముగ నుండుటకు—ఈ క్షణముననే కంకణమును గట్టుకొనుచున్నాము! మహాత్మా! క్షమింకను కొలది దినములు నాయొద్ద నివశించి, తమ దివ్య బోధల వినిపించి—మమ్ముల కృతార్థుల గావింప, వినమ్రుడనై వేడుకొనుచున్నాను!

సి : మహారాజా! బింబిసారా! నేను నీయొద్ద రెండు దినములు మాత్రమే నివసించెదను. అటుపైని నేను తపోవనమున కేగవలసియున్నది!—మీ కెల్లరకు శుభమగు గాక!

బింబి : చిత్తము! అట్లే కానిండు!—

(అందఱుపోవ—తెర—)

## రంగము 3

(మహాబోధి వృక్షము. ప్రవేశము, సిద్ధార్థుడు.)

సిద్ధా :—(స్వగతము) ఔరా! ఇంతకాలముగ—యిన్ని న్ని విధముల ప్రయత్నించు చున్నను—నా కా సత్య జ్యోతి — దివ్య ప్రకాశము — పరమ బోధము — మనోగోచరము కాజాలక పోయేనే!—(యోజించి) ఇట్లు చేసెద గాక! ఆ పరమజ్యోతి—సిద్ధార్థా! నీ హృదయగతము కావలె! ఈ వృక్ష మూలమునుండి—నీ నిష్ఠనుండి—నీవు లేవవలె!—ఇదియే ప్రతిజ్ఞ!

గీ॥ ప్రకృతి తనరీతి విడచియు—పాడుగాని
నీవు మాత్రము నీదీక్ష—నెరవు కొరకు
మనసు చలియింపకుండంగ—మహిత శక్తి
బోధివృక్షము మొదలునే—వదలిచనకు!

(వృక్షమూలమున సుఖాసీనుడై నిష్ఠయందుండును.)
((ప్రవేశము, మారుడు.)

మా: —(పాట)

నా బాణములా పాలుబడక లోకమందునా!
[illegible] నిరాశలైన నాకెట్టునా! ॥నా॥
[illegible] మనుష్యులైనా [illegible] గుటగాని!
[illegible] విడుమువాడెట్లాని ॥నా॥
[illegible] దేవులైనగాని
వింటి [illegible] ఎల్లమాని ॥నా॥

(తనలో) ఓహో! ఇప్పుడీతడుగట్టి ప్రతిన నే బూని యున్నాడు! ఔరా నా శక్తి సామర్థ్యముల నీతడు కొంచమైనను గమనించుటలేదే! నా దృష్టియందెంత మాత్రపు వాడీతడు?! ఈ క్షణముననే వీరిని పదభ్రష్టుని గావించి విడచెదగాక (ప్రకాశముగా) సిద్ధార్థా! సిద్ధార్థా!! ఓయి సిద్ధార్థా!!! ఇటు చూడుము! నిరంతరోపవాసములచే మిక్కిలి కృశించినాడవు! పట్టి ఎముకల ప్రోగువైతివి! ఇంక భుజింపకున్న ప్రాణముల గోలుపోగలవు! ఇదిగో! ఈ పంచభక్ష్య పరమాన్నముల నారగించి ప్రాణముల నిలుపుకొనుము! నిష్కారణముగ నేలజచ్చెదవు!?

సి :—(కన్నులు దెరువకయే నిరసనగా) మారా! వచ్చితివా! దుర్మార్గా!—వినలేదా—నీవు—నాప్రతిన సంకల్పసిద్ధి నొందువరకు భుజింపయించునదిలేదు! రంగమున వెన్నిచ్చి పారిపోవుటమేలా? శక్య సాహసమునజూపి వీరస్వర్గమును గాంచుట మంచిదా?—పొమ్ము! మారా! పొమ్ము!!—విషపూరితమగు నీ హితము నెంతమాత్రము వినువాడుకాడే సిద్ధార్థుడు!

మా : సిద్ధార్థా! నాహితమును—వినువాడవుకావా?—పిచ్చివాడా! ఎందులకయ్యా! నీకీ తపములు! కూటికా—గుడ్డకా? నన్నాశ్రయింపుము!—నిన్ను యీ చతురంభోధి పరీత భూవలయమంతకును సామ్రాట్టు నొనర్తును!—సార్వభౌముడవై లోకమునకు నీవెంత మేలు చేయగలవో కొంచెము గుర్తింపుము!—ఏకఛత్రముగ

నీ భూమండలమును పరిపాలించువాడు నీకీర్తి చంద్రిక యా సేతు హిమాచలపర్యంతము నెట్లు ప్రసరించునో యోచింపుము.

సి : (కఠినముగ) మారా! నిన్ను నే నెఱింగినవాఁడనే! దుష్టుఁడా!. దుర్బోధకుఁడా!—నీవీ ప్రపంచమును నేక చ్ఛత్రముగ నేలుచున్నాఁడవు!—నీ వొసంగు భాగ్య భోగములన్నియు నస్థిరములైనవి!—నీ రాజ్యము పట్టి గర్వపూరితమైనట్టిది! నేనో! శాశ్వతమగు సత్యరాజ్య పట్టాభిషిక్తుఁడనగుటకు ప్రయత్నించువాఁడను!—నాతో నీకేటి పని!—పో! పొమ్ము!! ఇంక పొమ్ము!!!—

మా : (నమ్రుడై నమస్కరించి) మహానుభావా! నేను నీ యెదుట పూర్తిగ నోడితి! (పైకిజూచి) అదిగో దేవతలు నీపై పుష్ప వర్షమును గురియుచు—నిన్ను స్తుతించుచున్నారు! నీవింక బుద్ధుఁడవైతివి!

(పాట)

ధన్యుఁడవు నీవు సుమా మహాత్మా! ||ధ||

అన్యులునీ సమునౌటసున్న ||ధ||

బోధిక్రిందనే బుద్ధుఁడవైతివి! ||ధ||

సిద్ధిన్ గంటివి శీఘ్రకాలమున ||ధ||

(పాటపాడి నమస్కరించి పోవును.)

సి :—(మెల్ల మెల్లగా కనులు విప్పిజూచి బ్రహ్మానందముతో) లభించినది సత్యజ్యోతి! కాంచితిని పరమ ప్రకాశ మును!!—పొందితిని దివ్య బోధనమును!!!—

(పాట)

సుఖములోనే దుఃఖముగలదూ।

సుగతి నరగుటయే విధియౌ ||ప||

మమతలోనే మఱది సర్వము।

మాయజిక్కకుమా మనసా ||ప||

ఒకటే జగతి జీవికి బాటా

చావేనిజంబుగా।

భాగ్యము భోగ్యము పాడుకాలోకే

బాధయగున్ కనగా ||ప||

(పాడుచూ నిష్క్రమించును)

తెర.

(సర్గం సంపూర్ణము.)





# నిష్క్రమణ

మూలం :
ఓ గ్రో సీ

అనుసరణ :
శ్రీమతి జమ్మి వెంకట రమణమ్మ

డాక్టరుగారు చాలా విచారపడ్డారు శశి శూన్యంలోకే చూస్తూ బుజ్జ నొవ్వుతూ. "అతన్ని నీవు బాగా గుర్తించినట్టు నీకు తోచినప్పుడు అతనితో ఎందుకు మాట్లాడేవు కావు?" అని అడిగేరు. శశి కట్టుకున్న చీరమీద అద్దకం పువ్వులు చూస్తూ కూర్చుంది. అంతకు ఒకక్షణంముందు డాక్టరు గారికి, ఆజరిగిన సన్నివేశం పూర్తిగా చాలా జాగ్రత్తగా చెప్పింది......

"అలాగ చేదాం అనుక్కున్నాను కాని, భయంవేసింది మాట్లాడుదామని తెగించేటప్పటికి. యెలాగో నేను రైలులో వున్నట్టు తెలుసుకున్నాను, ఆయన ఆప్లాటుఫారం మీద వుండిపోయారు, ఏదో చెప్పారు కాని అదిగ్రహించుకో లేక పోయాను"

డాక్టరుగారు మళ్లీ బుజ్జ తటపటాయిస్తూ......"ప్లాటు ఫారము మీద అసలు ఆమనిషి లేనేలేడు. అదంతా నీయా తనలో ఒకభాగం; నీవేదన; ఆమనిషి నీ మనస్సులోనే వున్నాడు. నువ్వు నీమనోనాథుణ్ణి ఆప్లాటుఫారం మీద చూసినట్టు ఏదో అతనుమాట్లాడినట్టు, నీవు పూర్తిగా సమాధానం అయినసంగతి నాకు తెలుసు. ప్రియమైన శశీ దేవీ యిదంతా నీ మనోవ్యాధి! నువ్వు నన్నునమ్మాలి. నీలాంటి రోగుల్ని చాలామందిని చూసాను. మరొక్క రెండు మూడు నెలలు పోతే, నువ్వుస్వస్థత చెందాక నేను ఎందుకు యింత ఖండితంగా యున్నానో నీకు బోధపడు తుంది" అని డాక్టరుగారన్నారు.

శశి అధైర్యంగా దీర్ఘనిట్టూర్పు చాలా బరువుగా విడ చింది. చురుకైన ఆక్రితం గంటలో జరిగిన సంగతంతా మళ్లీతాను తాపీగా చెప్పదామని "డాక్టరు మధుసూదన రావుగారు...! మీరు అర్థం చేసుకోలేక పోతున్నారు, నేను గాలిలో మేడలు కట్టటంలేదు. ఆయనను నేను చూసేను. ఆయన ముఖము ఆయన భావాలు నాకు తెలుసు. మా వివాహాము జరుగవలసినది యీదినమే! మీరు కాస్తా జ్ఞాపకం తెచ్చుకుంటే............నేను ప్లాటుఫారము మీదకు వచ్చేసరికి ఆయనలేరు. నేను పచారు చేస్తున్నాను రైలు బండీరాకకు నిరీక్షిస్తూ......తరువాత అకస్మాత్తుగా కాళ్లదగ్గర మూటాముల్లెతో కూర్చొని వుండగా చూసాను, నేను వెనక్కి తిరిగియుండగా వచ్చివుంటారు......

"తెలుసమ్మా తెలుసు".........అని డాక్టరుగారు అడ్డుగావచ్చి "ఇది మూడోసారి నువ్వుచెప్పడం, నేను వినడం. నువ్వు అతనికళ్లలో వింతైన భీకరమైన చూపు చూసేవు. అది ఎంత భయంకరంగా వున్నానిన్ను ఆకర్షిం చింది. కాని నువ్వుమాట్లాడే ధైర్యం చిక్క బట్టుకునేం దుకు, అలాగే పచారు చేస్తున్నావు. నీకు అతని నిశితచూపు తెలుసు. అతని చూపు నిన్ను పిలుస్తూనే వుందికానీ...... నీవు భయపడ్డావు. ఇంతలో రైలు రావటంవల్ల ఎక్కి పోయేవు. ఆ రైలు కదలుతూ వుండగా అతని వాక్కు విన పడింది. కాని అర్థముచేసుకో లేకపోయావు. అంతేనా...? శశి అవునన్నట్టుగా తలవూపింది.

"అవునా శశి! కానీ నీబుద్ధికుశలత, యిదిపూర్తి అసం దర్భమని నీకు తోపించాలి. నీప్రియయువకుడు, ఆరు నెలల క్రిందట కీర్తిశేషుడయాడని తరుచుచెప్పుతూ వుండేదానివి. ఆరు నెలలయింది...! తెలివి తెచ్చుకో. ఆ కనుపించినవాడు, అతను ఎలాగవుతాడు."

......శశి డాక్టరుగారి వైపు తీక్షణంగా చూచి "యింకా, మీకు అర్థంకాలేదండీ యీరోజు మాకల్యాణం రోజు అవవలసింది. యీరోజు మేమిద్దరం వధూవరులం కావాలెనని పెద్దలచే నిర్ణయించబడింది... డాక్టరుగారూ! అందుచేత చూడండి అతనక్కడ వున్నారు. ఆహా! నాకు అతనితో మాట్లాడే ధైర్యం అప్పుడే కలిగివుంటే, ఇప్పుడు నేనేమి చేయవలసిందీ తెలుసుకొనివుందును. మీరు నాకేమీ చెప్పలేరండీ.....చెప్పలేరు."

......"అమ్మాయీ! నేను అనేకసంగతులు చెప్పగలను. నేను చెప్పినది నీవు నమ్మాలి. నీకున్న పరిస్థితులు నేను బాగా బోధపరచుకోగలను. అతడు చనిపోయాడని నీవు ఒప్పుకుంటావు, అవునా......? అతని అంత్యసమయంలో నువ్వు అతని దగ్గరేవున్నావు. ఇదంతా వాస్తవం అని నీకు తెలుసు. అందుచేత అతన్ని నువ్వు ప్లాటుఫారం మీద తిరిగి చూడలేక పోయావు. ఇదంతా నీ శ్రమచెందిన మనస్సులో తృష్ణ. నీవు చాలా అలిసావు. కళ్లు ఎఱ్ఱగావున్నాయి. ఆకళ్లు ఎఱ్ఱగావుండడం నేను చూసి సహించలేను. నీవు పూర్తిగా విశ్రాంతి తీసుకొని రేపు వుదయాన్నే లేచేసరికిగడిచిన రాత్రి గురించి నీవు అనుకోగలవు. నిజంగా నీకు పెళ్లికావలసిన యీరోజు ఆశాభంగం ఓర్వలేవు. నే చెప్పుతా...విను. అతిసరదాఅయిన స్నేహితుడు నిన్ను ఊరడించి, ఉబ్బించి ఖుషీ చేయగలిగిన ప్రియమైన స్నేహితుని యింటిలో విందనుభవించు. ఆతరువాత సినీమాకివెళ్లు. ఏదో నీ కానందంకలిగించే ప్రదర్శనం చూడు. సరదాగా గడపగలిగినంత రాత్రిగడుపు. బాగా అలసట చెందేవరకూ ఆనందించు. నిద్రవస్తుంది హాయిగా పండుకో......"

......శశి డాక్టరుగారి అతితెలివికి నవ్వుకుంది. మూడు నెలలు బట్టియిదే సలహాయిస్తున్నారు. ఏదో తనను మతి మార్చుకోమంటారు. డాక్టర్లు యింత తెలివి తక్కువవారు ఎంచేత అయారో. ఎలాగుయింత ఖచ్చితంగా ఉంటారో. ప్రతి సినీమాకథలో ఒకనాయకి, ఒకనాయకుడు ఉంటారు. ఒకయువతి యువకుడు, కౌగిలింతలూ, పరస్పర ప్రేమ వీక్షణాలూ సలుపుతారు. ఏక్లబ్బులోచూచినా, ఇండ్లలో చూచినా ప్రేమగీతాలు పాడేరేడియోలే!...తనూరామం, రామంతనూ. అన్నినవలలు ప్రేమతో కూడుకొన్నవే స్నేహితులా! రామం స్నేహితులుకాని స్నేహితులెవరు తనకు తెలిసినంతమట్టుకు? వీటివల్ల గోరుచుట్టుపై రోకలిపోటు అవుతుందని శశి తనలో అనుకున్నప్పటికీపైకి అది మంచి ఆలోచనే అంది డాక్టరుగారితో.

శశి నేనువుంటానని చెప్పినప్పుడు డాక్టరుగారు ఆమె వీపుతట్టేరు. అప్పటికాయన అట్టేశ్రమపడ్డట్టు కనపడలేదు. ఆయన చాలా ఉదాగహృదయులు. కాని నిజమైన విషయాలు కనిపెట్టలేనంత తెలివి తక్కువస్థితిలో వున్నారు.

శశి క్రితం వారంలో రాత్రులు ఎలాగ గడిపిందో ఈ రాత్రి అలాగే గడపటానికి ఉపక్రమించింది. టెలిఫోను గదిలోకి వెళ్లి, నెంబరు 3946 పిలచింది. జబాబు స్త్రీకంఠ ధ్వనితో వచ్చింది. శశి అలాగే వుండిపోయింది. ఆ స్త్రీ కంఠధ్వని రెండు మూడు సార్లు "హల్లో!! హల్లో!!" అని కోపంగా ఘోషదింపింది. మధ్య ఆపరేటరు అందుకున్నాడు.

"నాకు 3946 కావాలి" అని శశి అంది. టెలిఫోను ఆపరేటరు ఆ నెంబరుతో కలిపినట్టు చెప్పేడు. కాని నాకు కావలసిన రామం గొంతుక రాలేదని శశి అంది. తరువాత కొన్ని నిముషాలు పోయాక మళ్లీ ఆ నెంబరు ప్రస్తుతం ఆ పేరుతో టెలిఫోను లిస్టులో లేదని చెప్పేడు శశికి. అది నిజం అని తెలుసు. కాని పిలవగా ఎప్పటికయినా రామం గొంతుక వినవస్తుందని అనుకుంది. రామం తనూ సంతోషంగా కలసి కాలక్షేపం చేస్తూవుండే అన్ని క్లబ్బులూ, సినీమాలూ, పార్కులూ తిరిగింది ఎక్కడయినా రామం కనిపిస్తాడనే నమ్మకంతో. ఈ నమ్మకానికి అన్వయం వుండక్కరలేదు. ఎందుచేతంటే రామంలాంటి చలాకీ మనిషి ఆరోజు అంతసరదాగా అంతభావయుక్తంగా గడిపిన మనిషి ఊరికే బ్రతుకు చాలించలేడు. అని డాక్టరుగారు కనిపెట్టలేక పోయారు. ఈ విషయం నమ్మటానికి ఆ ఆవేదన వుండాలి. ఆ ఆవేదన తనకితప్పదు. అసలు తనకా నమ్మకం అటువంటిది. సులువుగా నిస్పృహ చెందవచ్చు.

తను నివసించుచున్న వీధికి చేరేటప్పటికి శశి నిస్పృహ చెందింది. తను ఆ వీధిలో ఒక భవనంలో మూడో అంతస్థు గదుల్లోవుంది. ఆ గదులు కళావిహీనంగా, ఈజుగోఅన్నట్లు కనుపిస్తున్నాయి. రెండు కిటికీలపైని తన మూడవకిటికీ చీకటిగావుంది. తన పనిమనిషి ఆ కిటికీలో లైటు పెట్టే తెలివితేటలు కల్గిన మనిషైవుంటే బాగుండేది అనుకుంది. అన్ని మెట్లు బరువుగాఎక్కి తనగది చేరుకుంది. వుత్తరాలడొక్కు చూసింది. అందులో రెండు కేటలాగులుతప్ప మరేమియూ లేవు. డ్రాయరుకూడ వెతికింది అందులో

రామం వ్రాసిన గీతం కనబడింది. తనకు కవిత్వంలో అభిరుచి, దానిని ప్రశంసించే భావం లేకపోయినప్పటికీ ఆ గీతం ఆకర్షణీయంగా వున్నట్లు ఆమెకు తోచింది. అది చంచలమైన చూపుతో చూస్తూ కూర్చుండిపోయినది. పరధ్యానంగా కళ్లుమూసి తెరచేలోగా రామం ప్రత్యక్షమయాడు. తన కెదురుగా నిండు నవ్వు మొఖంతో, మెరుస్తున్న పళ్లతో ఖుషీగా తనవైపు చూస్తూ

"ఏమి చేస్తున్నావు శశీ"...? అన్నాడు. ఆమె తీక్షణంగా చూసింది. "రామం! రామం! వచ్చేవా?"అంది.

"మరెవరినైనా ఎదురు చూస్తున్నావా శశీ?!......

"జ్ఞాపకం తెచ్చుకో" అని జ్ఞాపకం తెచ్చుకో పోతున్న పాతపాటలన్నీ జ్ఞాపకం వచ్చేటట్టు నవ్వాడు.

"రామం! నువ్వు రామానివని నేను నమ్మలేక పోతున్నాను. నిజంగా నమ్మలేక పోతున్నాను."

"సరే నేను మరెవరిని"...? "నువ్వు నారామానివి"

"మరి ఒక పిశాచిని చూసినట్టు వుండిపోయావేం? గ్రహించేవుకదా! నాకోసం నీదగ్గర ఏమీలేవు?"

వెంటనే శశిలేచి అతని దగ్గరగా వెళ్లింది.

"శశీ! ఎన్నోమాట్లు నిన్ను నా ప్రణయ బంధాల్లో చిక్కించుకుందామని వచ్చేను."

"నిజంగా నా రామం!"..."నిజం శశీ"

"స్టేషను దగ్గర చూసాను. నాతో ఒక నిముషం ఓపిక పట్టి మాట్లాడుతావని అనుకున్నాను."

"స్టేషనుదగ్గిర నీవేనా రామం?"..."అవును...నీ వెళ్లే మార్గంలో ఏమైనా తీసుకుంటాననా? అంత జోరుగా వెళ్తేకావు?—ఫోనులో నీ మాటలు నేను విన్నాను నేను మాట్లాడినపుడు నీవు వినుపించుకోలేదు. ఈ వీధి చివర చెయ్యి ఆడించాను...కాని నువ్వు పరధ్యానంగా వెళ్లిపోయావు"—

"రామం! ఆ డాక్టరుగారు అలా చెప్పారు. నేను మనోవ్యాధితో బాధపడుచున్నానని అన్నారు...

...నేను అలా కనిపెట్టుకొని వుంటే నీరాక తెలుసుకొని వుందును."

అంటూ శశి, రామం! దగ్గరగా చేరపోయింది. ఆమెను అలాగే అపి......

"శశీ! చాలకాలమై ప్రయత్నముచేసి, చాలా అలసేను. నీలో నువ్వు విషయం ఆలోచించి తేల్చాలి. నాబలవంతం ఏమీలేదు. నీకు యివాళ ఏదోలా తెలుసుకదూ, నాతో నువ్వు వెళ్లిపోరావాలి—నీకు నాతో రావాలని వుంటే వెంటనే యిప్పుడే రావాలి. నీకు భయం కలిగించవచ్చు. నువ్వు తరువాత విచారించవచ్చు. అయినప్పటికి నాకు మరి రావడానికి వీలులేదని నువ్వు తెలుసుకొని నిర్ణయం చేసుకోవాలి. నేను చాలాదూరం పోవాలి."

శశి! తన్మయత్వముతో, అతని మెడచుట్టూ తన బాహువుల్ని అల్లింది.

"కొన్ని వస్తువులు తీసుకొనివస్తాను. ఆగగలవా?... రామం"

"అయ్యో తెలివి తక్కువ పిల్లా...! నీకు ఏ వస్తువులు అవుసరము వుండదు. ఎలాగున్నావో అలా యిప్పుడే రావాలి" అన్నాడు, నవ్వుతూ రామం.

"అయితే పద రామం...పద...తొందరగా పద"

రామం లేచి "శశీ, ఏమీ భయపడనని నేను చెప్పినట్టే చేస్తానని నాకు వాగ్దానం యియ్యాలి," అంటూ పడకగది కిటికీ దగ్గరకు వెళ్లేడు. శశి! అలాగే తప్పకుండా అంటూ అతన్ని అనుసరించింది.

ఇద్దరూ ఆ కిటికీ ఎక్కుతుండగా, "నేను నీకు సైగ చెయ్యగనే నాచేయిపట్టుకొని వెళ్లిపోయినా, శశీ భయపడకు. కిటికీ ఎక్కి కళ్లు మూసుకో. మరి నీకేకాతరా వుండదు. మనకి యీ ఘోరమైన ఎడబాటు మరిలేదు."

ఆ కిటికీలోనుండి యిద్దరూ చూసారు. క్రింది అంతస్థులలో ఎవరి పనులలో వారు ఆ రాత్రివేళ నిమగ్నులై వున్నారు. అందుకు సంబంధించిన ధ్వనులు ఆ కిటికీలద్వారా వినబడుతున్నాయి. ఆ వీధికి ఆ యింటిముందు కాళీస్థలం నిర్మానుష్యంగా వుంది.

"ఇప్పుడు" అని రామం సైగచేశాడు.

# నూతన చైనా స్త్రీలు

మూలం :
ఉమన్ యిన్ న్యూచైనా

అనువాదం :
రామచంద్

1 అక్టోబర్ 1949 లో నూతనచైనా ఉద్భవించింది. చైనా ప్రజల మెలకువతో, ప్రజాచైనా రిపబ్లిక్ ఉదయించింది. దానికి అధ్యక్షుడు మా సిటుంగ్. యీ ప్రజా చైనా రిపబ్లిక్ ఉదయించడానికి కారణం ముఖ్యంగా స్త్రీలే. ఈ చైనా స్త్రీల ఉత్సాహం వల్లనే, ప్రపంచములో స్త్రీలు చేయలేనిపని ఏదీలేదని స్పష్టమైంది. చైనా స్త్రీలు ఆచరణలో ఆసియా స్త్రీలకు మేల్కొల్పారని చెప్పవచ్చును. 5000 సం॥ రాలనుండి ఫ్యూడల్ పద్ధతులలో, ఆచారాలంటూ, కట్టుబాటులంటూ చైనా స్త్రీలను నీచాతినీచంగా అణగద్రొక్కేశారు. వారుహీనమైనవారని, వారు ఎప్పుడూ పురుషులకు ఎదురు చెప్పకూడదని, శాసనాలు, అధికారాలు ప్రయోగించారు. వారిని బానిసలుగా కూడా పురుషులు అమ్మివేశేవారు. వారిని తన్నినా, ఆఖరుకు చంపినా, నోరు ఎత్తకుండా చేశారు. వారు మొదట తల్లిదండ్రులకు తరువాత భర్తలకు బానిసలు. బానిస కాబట్టి భార్యను భర్తలు డబ్బు కక్కుర్తికొరకు ఒకరి చేతులలో పెట్టినా పర్వాలేదు. దానికి మాత్రం శాసనాలు అడ్డురావు. భార్య అంటే బానిస అనే అర్థం వారు నిర్ణయించారు. స్త్రీ ఎదిరిస్తుంది, తన భర్తను తనే చూచుకొంటుంది, ఎవరినైనా ప్రేమించి పెండ్లి చేసుకొంటుంది, తనచెప్పు చేతలలో నడువదనే భయంతో తల్లిదండ్రులువారిని పసిపిల్లలుగా యున్నప్పుడే, పెండ్లిచేసి అత్తవారియింటికి పంపివేయడంకద్దు. భార్యబానిస కాబట్టి, ఆమెకు యింటి పనులేకాకుండా భర్త, తనుచేసేపనిని కూడ చెయ్యమని ఆర్డర్ యిచ్చేవాడు. అంతబరువును ఆమె మోయగలదో లేదో ఆలోచించే వాడుకాదు. శ్రమపడి, అలిసి, విశ్రాంతి తీసుకుంటే, వెనక్కు తిరిగివచ్చి, యిష్టం వచ్చినట్లు తిట్టి, తన్నడానికి కూడ అర్హతను కలుగజేసింది ఆచారం అనే శాసనం. (యీ పూర్వపు చరిత్రను Good earth అనే పుస్తకంలో అమెరికా రచయిత్రి "పెరల్ బక్" (వ్రాసింది.) గాని యీ పరిస్థితులు అన్నీ మొన్న మొన్న జరిగిన మార్పుల వల్లపోయాయి. యీ రోజున యీ మార్పును తీసుకొని రావడానికి కారణం ఆస్త్రీలే. పురుషునితో సమానహక్కు, గౌరవాలు సంపాదించారు. పురుషునితోపాటు స్త్రీ కూడ సమానపదవులను స్వీకరించడం మనం చూస్తూనేయున్నాం.

చైనాలో పుట్టి పెరిగిన ప్రతీ స్త్రీ పురుషునితో సమాన హోదాను కలిగియుంటుంది రాజకీయంగా, సాంఘికంగా, ఆర్థికంగా కూడా. పూర్వపు చాదస్తాలు, హద్దులు స్త్రీలకు లేకుండా, వివాహాది యితర కార్యక్రమాలల్లో కూడ, నూతన ప్రజా తంత్రచైనా తన రాజ్యాంగాన్ని సరిదిద్దింది. ఆ చూపిన మార్గంవల్ల వారి ఉపవాసాలు, ప్రార్థనలు, ఏడుపులుతగ్గాయి. వాళ్ల అభివృద్ధికిగాను నూతన ప్రభుత్వం చాలా శ్రద్ధ తీసుకొంది. వారి ఆరోగ్య సదుపాయాల గురించి, వారి రక్షణకు, స్త్రీ కార్మికులబాధలు పోగొట్టుటకు, గనులలో, పరిశ్రమలలో పనిచేసే స్త్రీలసుఖాలకు పూర్తిగా ప్రభుత్వం బాధ్యత తీసుకొంది. చాంకైషేక్ యొక్క పరిపాలన, ప్రజా పరిపాలననే ముసుగులోయుండేది. కుమింగ్‌టాంగ్ పరిపాలనలో స్త్రీలగురించి, పుస్తకాలలోను, ఉపన్యాసాలలోను, డాక్యుమెంటులలోను మాత్రమే ఉండేవి. ఆ పద్ధతి కాకుండా యీ నూతన ప్రజా పరిపాలనలో ఆచరణలో చూపించడంవల్లనే స్త్రీలు, యీ నూతన ప్రజా తంత్ర పరిపాలనను గౌరవిస్తూయున్నారు. ఎప్పుడు కనివిని ఎరుగని పెద్ద హోదాలను యిప్పుడు వారుపొందడం మనం చూస్తూయున్నాం. వారిలో ప్రథమురాలుగా సూంగ్ చింగ్‌లింగ్ (మదాం సన్‌యెట్‌సేన్) అత్యున్నతస్థానాన్ని స్వీకరించింది. కేంద్ర ప్రభుత్వములోని 6 గురు ఉపాధ్యక్షులలో యీమె ఒకర్తె. యిద్దరు కేంద్రప్రభుత్వ వ్యవహారాలను నడిపించే పెద్ద హోదాలలో యున్నారు. (స్త్రీలు ఎప్పుడూ ఆ పదవులను పొందలేదు) ప్రజా పరిపాలనకుగాను

పునాదులు వేసిన సన్‌యెట్‌సేన్‌తో సహచరులుగా వుండి, పోరాటం జరిపిన స్త్రీలు హోహ్సింగ్‌నింగ్ (మదాం లైచుంకే), సైచెంగ్ అనువారలు. వీరు కేంద్ర కమ్యూనిస్టు పార్టీ తరపున, కేంద్రప్రభుత్వ మంత్రిత్వములను స్వీకరించారు. 19 మంది స్త్రీలు, ప్రభుత్వకీలకస్థానాలను అలంకరించారు. మంత్రులుగా, ఉపమంత్రులుగా, కన్సల్టింగ్ మెంబర్లుగా, ప్రభుత్వ పరిపాలకులుగా అనేకమంది స్త్రీలు నియమించబడ్డారు. కేంద్ర ప్రభుత్వకౌన్సిల్ సభ్యులు 662 మందిలోను యీ రోజున స్త్రీలసంఖ్య 67 మంది అని గుర్తుంచుకోండి. యిదేవిధంగా రాష్ట్ర, జిల్లా, పట్టణ, గ్రామ ఎన్నికలలో స్త్రీలు ముందుకు వస్తూయున్నారు. యీ విధమైన ఉదాహరణలు మనం అనేకం చూపించవచ్చును. మొన్న జూలై నెలలో ఆఖరువారంలో ప్రజాప్రతినిధుల కాంగ్రెస్ దక్షిణ పెకింగ్‌లోని ముఖ్య రైల్వే కేంద్రం అయిన షిక్షేభున్‌లో జరిగినప్పుడు ప్రత్యేకంగా 20 మంది స్త్రీ డెలిగేట్లు, ప్రతినిధులు ఆహ్వానింపబడ్డారు. ఆ సమావేశములో 100 కి 12.4 మంది స్త్రీలే. అదేకాకుండా ఏనాడూ మునిసిపాలిటీలో కాలుమోపని స్త్రీలు, యీరోజున మునిసిపాలిటీలో ప్రవేశించారు. క్రొత్తలోనే షిక్షేభున్ పట్టణ మునిసిపల్ కౌన్సిల్ మెంబర్లు 25 గురిలో యిద్దరు స్త్రీలు. వారిలో యనకింగ్‌పింగ్ అనేయువ్వనవతి (ఆమె టాషిక్ మాదిమిల్లు పర్కరు మాత్రమే) కూడా ఒక సభ్యురాలు. యీ విషయాన్ని మనం గుర్తు ఉంచుకోవాలి. కార్మిక స్త్రీ కౌన్సిలర్ అయింది. ఆమె ఎట్లా కాగలిగింది? అనే సమస్య చర్చిస్తే, ఆమె చైనా విముక్తికొరకు, అందరిని సమీకరించి, గొప్ప త్యాగంచేసింది. ఆత్యాగం అతీతం. ఆకృషిలో ఆమె వ్యాధిగ్రస్తురాలైంది. ఆమెత్యాగం చిన్న కథరూపకంగా విముక్తి చైనా అంతటానూ ప్రతిధ్వనిస్తూ యుంటుంది. ఆమెతన స్థానానికి, చిరునవ్వునవ్వుతూ యుంటుంది. ఆమెనుస్మరించి పాడినపాటే వారి జాతీయ గీతంగా యుంటూంది.

యీ విధంగా నూతన చైనా యుగంలో స్త్రీలు పురుషులతోపాటు ముందుకు వస్తూయున్నాగని మేము గర్విస్తూయున్నాం.



# జనవరి — 26-1-1951

## శ్రీమతి గిడుగు లక్ష్మీకాంతమ్మ



సంపూర్ణస్వాతంత్ర్య సామ్రాజ్యమునుగాంచు
టీనాడె యీనాడె యీదినంబె
గాంధి నెహ్రూ పటేల్ కడగండ్లు తీరుట
యీనాడె యీనాడె యీదినంబె
భారతావనికెల్ల బంధముల్ సడలుట
యీనాడె యీనాడె యీదినంబె
భారతజనని సౌభాగ్యంబు పండుట
యీనాడె యీనాడె యీదినంబె

గీ॥ జయపతాకపు తోరణాలు జాలువారి
వీధివీధుల శుభకళల్ వెలయుచుంట
పుణ్యసుభ దినమీనాడె పూజ్యమాత
భరతజన యిత్రి గర్భమ్ము పండెననగ.
కలిమి సూచించు ధర్మ-చక్రంబు తిరిగి
కళల దిలకించు పలువన్నెల కాంతులలరి
మహిత స్వాతంత్ర్య గీతముల్ మంజురవళి
తరలగా వచ్చెమనకు స్వాతంత్ర్య దినము.






# తెలివిగల వైద్యుడు

వెంకటపతిరాజు

అనగనగా ఒక ఊరిలో ఒక రాజుండేవాడు. అతడు బహుక్రూరుడు, దయలేనివాడు. తన మాట నెదిరించినవారిని ఉరితీయించేవాడు. కొన్నాళ్లకు అతనికి జబ్బువచ్చినది. ఆజబ్బు బాగు చేయడానికి ఎంతోమంది వైద్యులు వచ్చిరి. కాని లాభము లేకపోయెను. ఆజబ్బు కుదర్చనివారి నందరిని చంపించెను. వైద్యులతని వద్దకు వచ్చుటకు భయపడిరి. రాజుకు జ్వరము ఎప్పటికి తగ్గలేదు. ఈ సంగతివిని ఇద్దరు వైద్యులు రాజుగారి దగ్గరకువచ్చిరి. అందులో ఒకడు అమాయకుడు. రెండవవాడు తెలివిగల వాడు. మొదట మొదటివాడు ఇచ్చినమందు వలన జబ్బు కుదరలేదు. అందుచే రాజు అతనిని చంపించెను. రెండవవాడీ సంగతి గ్రహించి కుయుక్తిగా రాజు సన్నిధికిపోయి రాజుగారితో ఇట్లనెను. "మహాప్రభూ మీజబ్బునకు ఒకటే మందున్నది. ఆమందు తెప్పించుకో గలిగితిరేని మీరు సుఖముగా నుండవచ్చును. విచారము లేని సంతోషపురుషుని చొక్కాను ధరించి ఒక రాత్రిగడిపిన మీజబ్బు మాయమగును." అది విని రాజు కొందరు భటులను పంపెను. వారు ఎంతదూరము వెళ్లినను, ఎన్ని ఇండ్లలో అడిగినను ఎక్కడ కష్టములు లేనివారు లేరు. భటులు విసిగివిసిగి ఎచ్చటను దుఃఖము లేని వారిని కానక తిరిగివస్తూండగా ఒక చెట్టుమీద కులాసాగా ఈలకొడుతూ ఆనందంగా ఉన్నాడొక బికారి. వానిని చూసి రాజభటులు దగ్గరకు పోయి అతడే ఆనందపురుషుడని అతనితో "ఒరే! నీవుగాని నీచొక్కాను ఒక్కరాత్రి మాకు ఇచ్చిన నీకు 500 రూపాయిలు ఇచ్చెద" మనిరి. వాడు వాని వీపు చూపి తనకు చొక్కా లేదని చెప్పెను. రాజభటులు దగ్గరకువచ్చి జరిగినదంత చెప్పిరి. వైద్యుడిట్లు పలికెను "ప్రభూ! దుఃఖము లెట్టివారికి తప్పవు. మీకర్మను ఇతర అమాయక ప్రజలను బలిచేసితిరి. అన్యాయము కాదా! నాకు తోచినది నేను చెప్పితిని. అటుపైన మీఇష్టము." రాజు సిగ్గుపడి వైద్యుని విడిచెను. కొన్నాళ్లకు రాజు జబ్బు సర్దుకొనెను. ఆనాటినుండి దుఃఖములందరికి సామాన్యమని ప్రజలను దయతో పరిపాలించుకొనెను.

★

గత సంచికలోని బాలానందం ప్రశ్నలకు జవాబులు :—

1. ప్రథమంగా భూగోళాన్ని ఓడపై చుట్టివచ్చినవారు

—మెజల్లాన్.

2. దక్షిణ ధృవమును మొట్టమొదట పరిశోధించినది

—అమండ్ సేన్.

3. మాంగనీస్ అధికముగా లభించు దేశము

—రష్యా.

4. మొట్ట మొదట ఎలెక్ట్రిక్ బ్యాటరీ తయారు చేసినది

—ఓల్టా.

3. మహాభారత యుద్ధము జరిగిన స్థలము

—కురుక్షేత్రము.

చాలామంది బాలలు ఈ ప్రశ్నలకు జవాబులు వ్రాసిపంపిరి. అయితే అన్నీ సరిగా వ్రాసి పంపినవారు :—

| చిరంజీవి డి. వి. రామలింగేశ్వరరావు | చిరంజీవి అయ్యగారి సుబ్రహ్మణ్యం |
|---|---|

మళ్లీ వచ్చే సంచికలో మరికొన్ని ప్రశ్నలు : ఇటువంటి ప్రశ్నలను జవాబులతోకూడ బాలలు కూర్చి పంపినట్లైన ప్రచురింపగలము.



# ఆవులింత అర్థం.

సామాన్యంగా మనం ఎప్పుడు ఆవులిస్తా మోగమనించారా? పని చేసి చేసి అలసి పోయినప్పుడు, పనితోగాని, పనిలేక ఊరికే కూర్చొనిగాని విసికి పోయినప్పుడు, ఇంకా, నిద్రవచ్చునప్పుడు, ఆవులిస్తాముకదూ! అలసట, విసుకు, నిద్రవచ్చేటప్పుడు మనం అవసరమైనంత గట్టిగా ఊపిరి పీల్చము. అందువలన ఊపిరి తిత్తులలో మన రక్తానికి ప్రాణవాయువునందించి, పరిశుభ్రము చేయగలంత క్రొత్తగాలి ప్రవేశించదు. మన ఉచ్ఛ్వాస నిశ్వాసములను అప్రమత్తతతో నియమించేటటువంటి మన మెదడులోని ఒక సునిశితమైన భాగం, రక్తము లోని ఈ ప్రాణవాయువు కొఱతను తక్షణం గ్రహించి, వెంటనే గట్టిగా ఊపిరి పీల్చమని ఆదేశిస్తుంది. మనం అనుకోకుండానే వెంటనే ఆవులిస్తాము.

ఆవులింతవల్ల ఎక్కువగాలి ఊపిరి తిత్తులలో ప్రవేశించి రక్తపరిశుభ్రతకు కావలసిన ప్రాణ వాయువును అందిస్తుంది. ఇలా, అనుకోకుండా, గభాలున చేసే ఉచ్ఛ్వాసమే ఆవులింత!



# నల్లులు — దోమలు

※ కె. వి. రమణరావు ※

పూర్వం రెండు పెద్ద పట్టణములుండెడివి. వాటికి మధ్య పెద్ద అడవికలదు. ఎప్పుడూ ఆ పట్టణంనుంచి ఈ పట్టణమునకు, ఈ పట్టణము నుంచి ఆ పట్టణమునకు ఎవరూ వెళ్లరు, పెద్ద అవసరమున్నప్పుడు తప్ప.

ఆ అడవిలో ఇల్వరుడు, వాతాపి అను ఇద్దరు రాక్షసులు కలరు, వారిద్దరు అన్న దమ్ములు. వారికి మనుష్య రక్తమంటే ఎంతో ఇష్టము. ఆ అడివిలోంచి వెళ్లేవారికి వీరు భోజనం పెట్టేవారు. ఇల్వరుడు వాతాపిని కత్తితో నరికి మాంసం తీసిదానితో వంట వండే వాడు. అది ఆ బాటసారికి పెట్టేవాడు. ఆ బాటసారి ఈ మాంసం తిన్న తర్వాత, ఇల్వరుడు 'వాతాపీ' అని పిల్చును. వెంటనే వాతాపి ఆ బాటసారి కడుపు చీల్చుకొని బయటికి వచ్చి వేయును. కడుపు చీల్చుకొని పోవుటచే బాటసారి మరణించును, వెంటనే ఆ రాక్షసులు ఇద్దరూ ఆ ప్రయాణీకుని తినివేయుదురు.

ఒక రోజున అగస్త్య మహాముని ఆ మార్గము గుండ పోవుచూ, భోజనమునకు వీరింటి దగ్గరా గెను. వీరు చేయు పనిని ఆయన దివ్యదృష్టి చే గ్రహించెను. ఇల్వరుడు మామూలుగ వంట చేసి అగస్త్యునికి భోజనము పెట్టెను. భోజన మైన వెంటనే అగస్త్యుడు "వాతాపి జీర్ణం" అని ఏహో మంత్రములు చదివి వానిని జీర్ణించుకొనెను. ఇల్వరుడు పూర్వమువలెనే "వాతాపీ"— "వాతాపీ" అని కేక వేసెను. కాని వాతాపి అగస్త్యుని పొట్టలో జీర్ణమై పోవుటచే పలుక లేదు. అప్పుడు ఇల్వరుడు అగస్త్యుని పాదముల మీదపడి బ్రతిమాలు కొనెను. అప్పుడు అగస్త్యుడు కరుణించి వాతాపిని బ్రతికించి, ఇల్వరుని నల్లిగాను, వాతాపిని దోమగాను చేసి మనుష్య రక్తము త్రాగి బ్రతుకుడని చెప్పెను. అవియే మనలను ఇప్పుడు పీడిస్తున్నవి.

★

# కోమటి యుక్తి

మల్లికార్జునరావు

శక్తికి మించినది యుక్తి, యని పెద్దలసూక్తి. దానికి సూచనగా ఒక కథ చెప్తా వినండి.

ఒక ఊరిలో ఒక కోమటి ఉన్నాడు. సంతానహీనుడు. యుక్తిపరుడు. అతనికి యినుప వర్తకము ఉన్నది. అమ్మకపు వస్తువులు చాల నందున తనవద్దనున్న వెయ్యి తులముల యినుము ఆ ఊరులో నేయున్న పుల్లయ్య అనే బ్రాహ్మ ణుని యొద్దనుంచి, వస్తువులు కొనుటకై పొరు గూరు వెళ్ళెను.

చౌకధరలో వస్తువులు దొరక నందున తిరిగి

రెండు రోజులలో సొంత ఊరు వచ్చెను. కోమటి, మర్నాడు పుల్లయ్యను తన వెయ్యి తులముల యినుము ఇమ్మని కోరెను. పుల్లయ్య విచారముతో ఎలుకలు తినెనని బదులు పలికెను. కోమటి బ్రాహ్మణుడు కొంతసేపు తగవులాడిరి. ఆఖరకు కోమటి బ్రాహ్మణునికి తగిన బుద్ధి చెప్పవలెననితలచెను.

మరునాడు కోమటి బ్రాహ్మణుని యింటికేగి బ్రాహ్మణుని కొడుకుని ఆడుకొనుటకు పిలచి ఆతనిని రహస్యముగా దాచివైచెను. బ్రాహ్మణుడు తన కొడుకు ఎచ్చట కనపడక పోవుట వలన కోమటింటి కేగి అడిగెను. కోమటి అందులకు వాని కొడుకు ఆడుకొనుచుండగా గ్రద్ద ఎత్తుకు పోయెనని బదులు బల్కెను. బ్రాహ్మణుడు కను లెఱ్ఱజేసి రాజుయొద్దకేగి చెప్పెను.

రాజు న్యాయాధికారులను పిలిపించి తీర్పు చెప్పమనెను. రాజుగారు కోమటిని పిలచి నిజము చెప్పమనిరి. కోమటి జరిగినదంతయు పూసగుచ్చినట్లు చెప్పెను. బ్రాహ్మణుడు సిగ్గుతో తలవంచుకొనెను. రాజ సభలోనున్న వారందరు కోమటి యుక్తికి మెచ్చి, బ్రాహ్మణుని హేళన చేసిరి. రాజుగారు కోమటికి వెయ్యివరహాలు బహుమతి యిచ్చి ఎవరివి వారికిప్పించిరి.



# ఎత్తుకు పై ఎత్తు

ఐ. వి. సుందరమ్మ

ఒకానొక ఊళ్లో ఒక పురోహితుడున్నాడు. ఆయనకు చాలామంది పిల్లలు. ఆబ్రాహ్మణునకు గుమ్మడికాయ కూరంటే చాలా యిష్టము. ఒక సంవత్సరము సంక్రాంతి పండుగనాడు మామూలుగా స్నానముచేసి "స్వామీ! ఈ రోజున నాకొక గుమ్మడికాయ దొరికిన ఎడల నీకు కొబ్బరికాయ కొట్టెద''నని దేవునకు దండము పెట్టుకొనెను. దేవుని దయవలన ఒక ధనవంతుడు ఆ బ్రాహ్మణునకు గుమ్మడి కాయ దానముచేసెను. దానిని యింటికి తీసుకు పోయిన అందరకు తలొక బద్దకన్న ఎక్కువరాదని పొరిగింటి ఆమె చేతికియిచ్చి వండించుకొని తనొక్కడే తిందామని ఆశతో పొరిగింటికి పోయి "అమ్మా! మీయింటికి ఈరోజున భోజనానికి వచ్చెదను. ఈ కాయకూరవండి పెట్టు"మనెను. ఆమె సరేనని కాయతీసుకొనెను. పురోహితుడు యింటికి పోయి స్నానముచేసి మడికట్టుకొని వచ్చేసరికి ఆవిడ గుమ్మడికాయను దాచి ఆనపకాయ కూరవండి విస్తటిలో వడ్డించెను. బ్రాహ్మణుడు గబగబా రెండుముద్దలుతిని గుమ్మడికాయ కూర ఏది అని అడిగెను. అందుకామె, "అయ్యో నాయనా గుమ్మడికాయ తరిగి పొయ్యిమీద పెట్టి అటుకి వెళ్లి వచ్చుసరికి గుమ్మడికాయ అదరిబెదరి ఆనపకాయగామారినది." అని అనెను.

బ్రాహ్మణుడు భోజనముచేసి వాకట్లోకి వచ్చేసరికి కడ ముంతొకటి కనబడినది. ఆముంత తీసు కొనిపోయి విస్తరిదగ్గర పెట్టి 5 రూపాయిలు ఖరీదుగల కంచుచెంబు తీసుకొన్నాడు. పొరిగింటామె దిగాలు పడి "ఏమయ్యా బ్రాహ్మణుడా చెంబు ఎత్తుకుపోతున్నావేమి," అని అన్నది. పురోహితుడు "అయ్యో! కంచుముదిరి కడ ముంత అయిం"దని చెంబుపట్టుకొని మాటాడకుండా పోయెను.



# ఆంధ్ర మహిళకు

※ శ్రీ. నాదెళ్ల జనార్ధనరావు ※

(ఇటీవల సంచికలో ఒకరొకగానాన్ని ప్రసారంచేసి చూపితే అది వేరొకస్థాయిలో నా హృదయాన్ని స్పందింప జేసింది. అంతమాత్రమే—కాదన్నవారికి క్షమార్పణలు. ...రచయిత.)

ఆంధ్ర మహిళా,
నమస్కార మమ్మా నీకు!
దీర్ఘాయుస్సుగ వర్ధిల్లూ!
పిల్లాపాపలతో
నందనవనమే నీయిల్లూ!!!

* * *

నీ ముఖతా పలికించారొకరు
అంతా యీమధ్యనే
ఏమనో తెలుసా?
చెప్తా వినుమరి!

* * *

"పమిటమాటున
పరవశమంది
నాట్యములాడే
కుచకుంభాల్
మెల్ల మెల్లగ వీచే
పిల్లగాలి తాపుకు
ఒళ్లు తెలియకజారే
జార్జెటు పమిటను
కన్నావా యెందైనా?
విన్నావా యెపుడైనా?"
అని యింకా యేమేమో!
అంత నిక్కచ్చిగా
సూటిగా ప్రశ్నిస్తే
చెప్పకపోతే యెట్లా?
మరినువ్వే చెప్పూ!
పమిటలోపల దాక్కొని
నాట్యాలాడేవి
కుచకుంభాలో!
కులగిరులో!
తెలియదుకానీ,
అక్కడినుండే పెరిగి
స్రవించిందినాలో రక్తం!
స్వార్థం యెఱుగని ప్రేమ ప్రవాహంలో
అమృతంకూడా వద్దనిపించే
మాధుర్యాన్నే దో రుచిచూస్తూ
త్రాగుతూ త్రాగుతూ దుగ్ధధారలు
బోసినవ్వులు వెల్లబోసా నెప్పుడో
మాతృశ్రీ మెత్తనియొడిలో.
ఆనాటి యాదుగ్ధధారలే
యీనాటి నా యునికి కాధారాలు!!

* * *

"గలగలగల లాడే
గాజుల మ్రోతలు
కూకువ కుహూకుహూ
కోకిల పాటలు"
విన్నానోలేదో—అథవా
విన్నా, పాటించానో లేదో

కానీ యొక్కటె మాత్రం
మరువగ లేదదొక్కటే మాత్రం !
గాజుల సవ్వడితో
వెండిగిన్నెలో గుజ్జులుకలిపి
కోకిలకంఠే మధురంగా
పాటలతో లాలించీ, మాటలతోనవ్వించీ
చందమామతో దోబూచులతో
గిలిగింతలు పెట్టి
ఆప్యాయంగా ఆరగించేదాకా
అలసట జెందని
అమృతహస్తాన్ని !

*　　*　　*

“ కన్పాపలు కదలీ
మనసుని రేపే
మదనపునయనాలో ”
సరిగా పరికించానో లేనో
ఆకనుపాపల్లో
కనుపిస్తా రెందరో
వచ్చేకాలంలోని చిఱుపాపలు !
ఆపాపల నెత్తుకమురిసే మురిపెంతో
మాతృత్వం రూపొందుచు
ఆతల్లి అధరారుణాల్లో
దీపిస్తుంది మనకా
జగజ్జననీ దివ్య విలాసం !!
ఆంధ్ర మహిళా
దీర్ఘాయుస్సుగ వర్ధిల్లూ !
పిల్లా పాపలతో
నందనవనమే నీయిల్లూ !!



## ఐశ్వర్యస్థానము

(రవీంద్రుని తోటమాలినుండి)

జగత్సభాస్థలిలో ఒక చిన్న గడ్డిపోచ భాస్వన్మయూఖ పాళితోను, నిశీథ తారకతోను సరిసమానముగా తివాసీపై ఆసీన మౌతుంది.

అటులే ఘోరారణ్య ఘనమేఘ గానాలతో నాగీతికలూ జగతీ హృదయాన తమ స్థానములను పొందుతాయి.

కాని ధనికుడా ! సూర్యుని హ్లాదైకమయ స్వర్ణస్వాచ్ఛంద శోభలో, ధ్యాన నిమగ్నతా సుధాంశు మంజుళ మంద ప్రభలో నీ యైశ్వర్యానికి తావులేదు.

విశ్వ వ్యాపియగు ఆకాశంయొక్క ఆశీర్వాదము కూడ నీ నిధికి లేదు !

మృత్యువు అవతరించినపుడు అది వెలవెలబోయి, వాడి, శ్రయ్యాలై దుమ్ములో మిళితమగును.

—ఆర్. సోమసుందర్.

శ్రీ కవికొండల వెంకటరావుగారి యీదిగువ వివచింరిన రచనలు ఆయా వెలలకు దొరక గలవు—

(1) పెనుమంచిలి జైనదేవుడు (కథలు) రూ. 1—4—0
(2) హరి వినోదము ,, రూ. 1—8—0
(3) ఇనుపకోట (నవల) ,, రూ. 2—8—0

తపాలఖర్చులు వేరు :—

పై పుస్తకములు పుస్తక భాండాగారముల కత్యంతోపయోగకరములు. ఇదే తరుణము వలసినచో :—

శ్రీ కవికొండల వెంకటరావు బి. ఎ., బి. ఎల్.
ఇన్నీసుపేట, రాజమంద్రి.



# దేశసౌభాగ్యము - మానవసౌఖ్యము

* శ్రీమతి పెన్నాటి రంగనాయకమ్మ *

ప్రతియొక్క దేశపు సౌభాగ్యమును, మానవుని వ్యక్తిగత సౌఖ్య-సభ్యతలపై నాధారపడి యుండును. మానవునికి ఆరోగ్యకరమగు భోజనము, కట్టుకొనుటకు శుభ్రమైన గుడ్డలు, నివసించుటకు గాలి వెలుతురులుగల సామాన్యమైన యిల్లు—ముఖ్యావసరములని చెప్పవలెను. పిదప నతని సుఖజీవనమునకు, ప్రయాణ సౌకర్యములు, విద్యా-సభ్యతలు, సరదా మొదలగునవి కూడ కొంతవరకు అవసరము.

ఏ దేశపు ప్రతివొక్క కుటుంబమునకు, పైన జెప్పిన ముఖ్యావసరములు మూడును లభించుచున్నవో, ఆదేశపు ఆర్థికస్థితి బాగున్నదని మన మెఱుంగగలము. ఇంతమాత్రపు సౌఖ్యముచేకూరిన పిదప, మానవుని నైజము మారి సభ్యుడగుటకు యెంతయు అవకాశముగలదు. ఎప్పుడైతే కడుపునిండ భోజనమున్నదో అప్పుడతనికి చోరబుద్ధి పుంటదు. మనసులో గుప్తతలంపులు చోటుబడవు. కనుక మనస్సు విద్యను గఱచుటయందు, పద్ధతులను చక్కగఱచుకొనుట యందును నిమగ్నమగును. క్రమముగా జనులలో సభ్యత యేర్పడును. దేశము సభ్య దేశమనబడును.

మఱియు మానవుడు స్వతంత్రప్రియుడు. కనుకనే ఎన్నైన కష్టముల నెదుర్కొని, బాధలనోర్చి, తమదేశమును స్వతంత్రపఱచి, తమస్వాతంత్ర్యమును కాపాడుకొని, సౌఖ్యమును వృద్ధి పఱచుకొనచూచును. కనుక మానవునిదైనందిన జీవితమునకును, దేశసౌభాగ్యమునకును అవినాభావ సంబంధము గలదనిన అతిశయోక్తిగానేరదు.

దేశములోని ప్రతి వొక్కరికి యిటువంటి సౌఖ్యము చేకూరవలెననిన దేశమెట్లుండవలెనో యోచింతము. తొలుదొల్త దేశము ఉత్పత్తికేంద్రము గావలెను. అన్ని విధములైన వస్తువుల ఉత్పత్తియు వృద్ధిగావలెను. మఱియు దేశములోని జనసంఖ్యకు తగినట్లు ఉత్పత్తిపఱచి, దానిని సామాన్యమానవుని కందు బాటులో నున్న ధరకు అమ్మవలెను. కొన్ని నైసర్గిక పరిస్థితులవలనను యింకను కొన్ని ఆటంకముల మూలముననను ప్రతియొక్కదేశము అన్ని విధములైన వస్తువులను ఉత్పత్తి చేయలేదు. అందుకొన్ని దేశములలో కొన్ని వస్తువులు మరియు యెక్కువగా పండును; కొన్ని దేశములలో మరికొన్ని వస్తువులు లభించును. కొన్ని ప్రదేశములలో ఖనిజములెక్కువగా నుండును; మరి కొన్ని ప్రదేశములలో "పెట్రోలు" "కిరసనాయిలు" మొదలగు నూనెలు అధికముగా లభించును. ఈ విధముగా నొక్కొక్కదేశము కొన్నికొన్నిటిని యెక్కువగా ఉత్పత్తి చేయగలుగును. ఈ కారణము చేత దేశదేశముల మధ్య యెగుమతి దిగుమతులు యేర్పడినవి. ఈ యెగుమతి దిగుమతుల మూలమున అన్ని దేశములు అన్ని విధములైన వస్తువులను పొంద గలుగుచున్నవి.

ఈ విధముగా వస్తువులను ఉత్పత్తిపఱచి, సరకులను తయారు చేయుదురు. సరకులను తయారు చేయుటకు పరిశ్రమల నిర్మాణము అవసరము. వీని ద్వారా తయారు చేయబడిన సరకుల ధర వాని ఉత్పత్తిపై ఆధారపడియుండును. ఉత్పత్తి తక్కువగా నున్న సరకుల వెలయెక్కువగా నుండును. ఉత్పత్తి అధికముగా నున్న సరకుల వెల తక్కువగా నుండును. ఇందులో గూడ కొన్ని యిబ్బందులున్నవి. ధరలు యెక్కువగా నుండి ప్రజల ఆదాయము తక్కువగానున్న యెవ్వరునూ కొనలేరు. ధరలు సామాన్యముగా నున్నప్పటికిని, జనసంఖ్యకు తగినంత ఉత్పత్తిలేనట్లైన అందరూ పొందలేరు. కనుక యీ రెండింటిని సమన్వయించుకొని, తమతమ దేశపరిస్థితులనుబట్టి తగిన యేర్పాటులను చేసుకొనవలెను.

సరకులు వెలయెక్కువగా నున్నయెడల జనులరాబడి పనివాండ్ర కూలికూడ పెరుగవలెను. అనగా జనసౌఖ్యమును పెంపొందించుటకు రెండు మార్గములున్నవి. అవియేవన: వస్తువుల ధరలను పెంచి దానికి తగినట్లు కూలి నిచ్చుట ఒకవిధము; ధరలనుతగ్గించి కూలిని కూడ సామాన్యముగా నుంచి, ఉత్పత్తిని వృద్ధిచేయుట మఱియొక విధము. జనసంఖ్యయెక్కువగల దేశములలో పై రెండవ పద్ధతియే బాగుగా పనిచేయును.

# దేశసౌభాగ్యము - మానవసౌఖ్యము

ఉత్పత్తిని వృద్ధిపరచి వాటితో సమముగా ధరలనుకూడ పెంచి, కూలిని హెచ్చుచేయుట కూడ మంచి మార్గము కాకపోదు. ఈ పద్ధతినవలంబించినట్లైన, సామాన్యమానవునికి కూడ సౌకర్యములు చేకూరును. అనగా వారి "Standard of Living" బాగుండును. ఈ మార్గము నవలంబించుటకు దేశపు ఆర్థికస్థితి వున్నత దశయందుండవలెను. దీని నిప్పుడు "అమెరికా" దేశము మాత్రము అవలంబించుచున్నది. ప్రస్తుతము అన్ని దేశములలోను "అమెరికా" ఆర్థికోన్నతి గలదేశము. ఇచ్చట జన సంఖ్యతోపాటు ఆహార పరికరములయొక్కయు, యితర పరికరముల యొక్కయు వుత్పత్తి కూడ సమముగా వృద్ధియగు చున్నది. ఇచ్చట వస్తువుల ధరలుయెక్కువ, జనుల జీతములూ యెక్కువే. ఇచ్చట సాధారణపు పనివానికి (అనగా కూలిచేసుకొను వానికి) గంటకు40 cts (2 రూపాయలు) దొరకును. అనగా రోజుకు 8 గంటలు పనిచేసిన యెడల 16 రూ॥ దొరకును. ఈ పద్ధతినిబట్టి చూచినట్లైన వానికి నెలకు రమారమి 400 రూ॥ గిట్టుచున్నవి. అచ్చట ప్రతి మూడవ మనిషికి "రేడియో" యున్నది. ప్రతి ఐదవ మనిషికి "కారు"న్నది. దీనినిబట్టి అచ్చటి సాధారణ మానవునికి కూడ యెట్టి సౌకర్యములు లభించుచున్నవో మనకు తెలియుచున్నది. అయినప్పటికిని అచ్చటి అధికారారులకు యిదే తక్కువగా కనబడుచున్నది. ప్రెసిడెంటు "ట్రూమెన్" గంటకు 40 cts గాక 70 cts కూలినిచ్చి, తమదేశపు వారి "Standard of Living" వృద్ధి చేయవలె ననుకొను చున్నాడు.

జన సౌఖ్యమును వృద్ధిచేయుటకు యీ వొక్కపద్ధతే మంచిదని చెప్పలేము. పై రెండవ పద్ధతికూడ అనుసరింపదగినదే. దీనిని "జపాను" దేశము అవలంబించినది. వారు సరకుల వుత్పత్తిని అమితముగా పెంచి ధరలను తగ్గించి జీతములను సాధారణముగా నుంచుకొనినారు. ఈ పద్ధతి వలన వారు తమ జీవితమును అతిచౌకగా గడుప గలుగు చున్నారు. మఱియు తమ సరకులను యితర దేశములలో చౌకగా అమ్మి, తద్వారా తమ వ్యాపారమును బాగుగా వృద్ధి చేసుకున్నారు. వ్యాపార వృద్ధివలన వారి ఆర్థికస్థితి గూడ బాగుపడినది.

కాని మన దేశమన్ననో :— వస్తువులధరలు అమితముగా పెరిగి పోయినవి. అందుకుగాను సాధారణపు మనిషి జీతమును కూలివాని కూలియు గూడ కొంతవఱకు పెంచబడినవి. కాని జన సంఖ్యతోపాటు ఆహార పరికరముల యితర వస్తువుల వుత్పత్తి వృద్ధిగాక పోవుటవలన యిది లాభకరము కాలేదు.

కొన్ని సం॥ క్రిందట 15 రూ॥ తెచ్చుకొను మనిషి యేస్థితి యందుండెనో, ఇప్పటి 75 రూ॥ జీతగాండ్రకు ఆస్థితి కూడలేదు. కడకు యిప్పుడు యెంతమందికో సరియైన ఆహారమునకు సరిపడు జీతము కూడ లభించుటలేదు. ఇక ప్రయాణ సదుపాయము, సాహిత్య సంస్కృతులు, సరదా మొదలగునవి 100 కి 95 మందికి కలలోని వార్త. ఎంతవఱకు మనదేశములోని ప్రజలకు జీవితములకు ముఖ్యావసరమగు మూడు వస్తువులు అమరి, వీనికితోడు కొంతవరకు ప్రయాణసౌకర్యము, సాహిత్య సంస్కృతులు, సరదా అన్నవి కూడ లభించవో అంతవఱకు మనదేశము గౌరవ స్థానమును పొందనేరదు. ఇందుకొఱకు అన్నిగకములైన వస్తువుల వుత్పత్తియు వృద్ధిచేయవలసిన బాధ్యత మనమీద యెంతైనా యున్నది. ప్రతి వొక్కరును వస్తు నిర్మాణమునకు పూనుకొనవలెను. పెద్దపెద్ద కార్ఖానాలేగాక, చేతిపరిశ్రమలు కూడ వృద్ధి చేయవలెను. ఇట్టి పరిశ్రమలద్వారా వుపయోగకరమగు వస్తువుల నెన్నిటినో తయారు చేయగలము. మఱియు అసంఖ్యాకములగు జనులకు జీవనోపాధి కూడ కలుగ జేయగలము.

మనదేశము నందుగూడ జన సంఖ్యకుతగిన వుత్పత్తిచేసి, దానితోపాటు సరకుల ధరలుపెంచి జీతముల నెక్కువ చేయవలెను. లేదా వుత్పత్తిని బాగుగా వృద్ధిపఱచి సరకుల ధరతగ్గించి, జీతములు సాధారణముగా నుంచవలెను. ప్రస్తుతపు వుత్పత్తికిని, జనసంఖ్యకును చాల వ్యత్యాసమున్నది గనుక, మనకు రెండవ పద్ధతినవలంబించుటే లాభదాయకము. ఈ ప్రకారము చేసినయెడల యితర దేశములలో కూడ మన వ్యాపారమును వృద్ధి చేసుకొనుటకు అవకాశముండును. దేశపు ఆర్థికస్థితియు బాగుపడును.

(తరువాయి 40 వ పేజీలో)

# గృహకల్లోలం

శ్రీమతి కేరాంటి రుక్మిణీదేవి.

### భార్య :

ఈయనతో కాపురం చేయటం బహు కష్టంగా వుంది. ప్రతిదానికీ వితండవాదనే. మా స్త్రీజాతి నంతా ఆగౌరవ పరుస్తారు. ఆయనకు నేను లోకువైనంత మాత్రాన మా స్త్రీజాతి నంతా తూలనాడటం ఎందుకో! స్త్రీలు అంద విహీనులట, పురుషులు అందగాళ్లట. తనురుజువు చేయ గలనని వాదిస్తారు. ప్రకృతిలో నుండి పాఠాలను గ్రహించాలట. ఏమైనా మాటాడితే సింహము చక్కనిదా లేక సివంగి చక్కనిదా అంటారు. 'కోళ్లలో చూడు. పుంజు ఎంత చక్కగా వుంటుందో. పెట్ట వెలాతెలా పోతూ వుంటుంది. మొగనెమిలి చూడూ. పింఛము భారీగా విప్పి ఎంత చక్కగా నృత్యం చేస్తుందో. ఆడనెమిలి అలాగ చేయగలదా? చక్కదనమంతా మగవారిలోనే మూర్తీభవించి వుంటుంది.' అని వాదిస్తారు. అయితేనే నొక్కటే ప్రశ్న వేయదలిచాను. దానికి ఆయన ఏమి సమాధానం యిస్తారో చూస్తాను. పూర్వకాలంలోనూ, ఆధునిక యుగంలో భావ కవులంతానూ, హేమాహేమీ లయిన వారంతా, పురుషుణ్ణి గురించి పద్యాలల్లి కవిత్వం చెప్ప లేదే! కన్నులు కలువరేకులనీ, మొగము చందమామ యనీ, హంసయాన, మందగమన అని ఇత్యాది వర్ణలను చేసింది పురుషుణ్ణి గూర్చేగాబోలు! ఆ కవులందరికీ మా ఆయన కున్నంత తెలివి తేటలు లేకపోయినాయిగాబోలు. రాజాధిరాజులు, తపస్సంపన్నులగు ఋష్యాదులు సహితము స్త్రీ దేవతకు పాదాక్రాంతులు గాలేదూ? ఈయన ఏదో ఒక క్రొత్త సిద్ధాంతాన్ని స్థాపించి స్త్రీలయొక్క ప్రాముఖ్య తను అణగ ద్రొక్కటానికి ప్రయత్నిస్తున్నట్లుంది. స్త్రీల కంటే పురుషులే సౌందర్య వంతులనే వితండ వాదనను విని ఎవరు మోసబోతారూ? ఇంకా ఏమేమిటో అంటారు. పురుషుడు స్వతస్సిద్ధంగా అందగాడు గనుకనే కృత్రిమమైన అలంకారాల్ని చేసికోనడట. స్త్రీ తనలోవుండే అంద విహీనాన్ని కప్పి పుచ్చటానికే సీతాకోక చిలుకమాదిరి రంగురంగుల చీరెలూ, అనేక రకములైన ఆభరణాలు ధరిస్తుం దట. ఆయన అనే మాటలు వింటూంటే తల నొప్పి వస్తోంది. పురుషుడు మాత్రం ధరించడం లేదూ? చేతికి వాచీ, కళ్లకుజోడూ, కాళ్లకు బూట్సూ, తలకుహేటూ ఇవన్నీ ఏమిటో? ఇవన్నీ కనలోపాన్ని కప్పి పుచ్చటానికి పురుషుడు పడేపాట్లుగాదు గాబోలు. అసలు ఇటువంటి వికటకవితో వాదనలోకి దిగటం నాదేతప్పు.

### భర్త :

ఈమెతో వివాహమైనప్పటి నుంచీ నా జీవితంలో సంతోష మనేదే లేకుండా పోయింది. 'ఔనం' న్నది కాదనటమే యీమె పని. ఈమె మాట్లాడే మాటలకు హద్దు లేకుండావుంది. ఏదో పుస్తకాలు చదివి సంపాదించిన జ్ఞానంలో పురుషులు స్త్రీలకంటే హీనులని రుజువు చేయ టానికి విశ్వ ప్రయత్నం చేస్తోంది. ఈమె మాటాడేమాటలు నవ్వు పుట్టిస్తున్నాయి. స్త్రీలకంటే పురుషులే అబలు లంటుంది ఇదెక్కడి అవస్థోగాని. ఎన్ని కష్టాలనైనా స్త్రీలు ఓర్చుకున్నట్లు పురుషుడు ఓర్చుకోలేడట. స్త్రీలు బలవంతులట. పురుషులు బలహీనులట. స్త్రీలు పనిమం తులట. పురుషులు సోమరిపోతులట. 'ఆడపిల్లలకు బర్రె పాలు అరుగుతవిగాని మొగపిల్లవాడికి అరుగతవా' అని మొగం మీద పట్టుకొని అడుగుతుంది. స్త్రీశక్తి స్వరూపిణట. సృష్టికర్తట. స్త్రీ తలుచుకుంటే ఏపనినైనా అవలీలగా చేయగలదట. ఎంత బాధనైనా. సహించగలదట. ఈ వితండ వాదన వింటూంటే చెవిలో సీసం కరిగి పోసినట్లుం టుంది. నామీద కోపంతో పురుషజాతినంత గడ్డిపోచ క్రింద తీసివేస్తే వూరుకుంటారా. ఏదో పుస్తకంలో చూచిందట—పురుషునికంటే స్త్రీకే జీవిత ప్రమాణం ఎక్కువని. ఇకనేం దీన్ని పట్టుకొని తన వాదానికి అను గుణ్యంగా వుపయోగించేసింది. స్త్రీ గులాబి పుష్పమట. పురుషుడు గులాబీముల్లట. ఏమిటో ఈ మాటలు. చాల కోపం గూడ వచ్చేస్తోంది. సంఘంలో స్త్రీకి వుండే

ప్రాముఖ్యత పురుషునికి లేదట. అందుకేముందు స్త్రీ పేరు చెప్పి తర్వాత పురుషుడి పేరు చెప్తారట. "తల్లిదండ్రులు, లక్ష్మీనారాయణులు, పార్వతీ పరమేశ్వరులూ అని అన్నారు గాని, తండ్రీతల్లి, నారాయణలక్ష్ములు, అని అనలేదు గదా" అని నొక్కి చెప్తుంది. స్త్రీ మాతృదేవతట. మహాకవి కాళిదాసు వ్రాసిన "కార్యేషుదాసీ........" అనే శ్లోకం అనుసరించి తనవాదనను బలపరుచుకోవటానికి వ్యర్థ ప్రయత్నం చేస్తుంది కాని ఆమె మాటలు విని మోసపోయేదెవరూ ?

## భార్య :

స్త్రీలు స్వాతంత్ర్యము అనుభవించటానికి హక్కు లేదంటారు. పురుషుడు తన రక్తమాంసాలను ధారబోసి సంపాదించితే స్త్రీ సోమరిగా యింట్లో కూర్చొని తినే సోమరిపోతట. పగలల్లా ఉద్యోగాలలోనూ, ఆఫీసులలోనూ కష్టపడ గలిగింది పురుషులేట. ఇప్పుడు మా స్త్రీలు మాత్రం గుమాస్తా గిరిలో చేరి వుద్యోగాలు చేయటం లేదూ! టైపిస్టులుగాను పనిచేయటం లేదూ. మగవారు మాకంటే ఏం అధికులని చూపించటానికే ఆఫీసులలో గుమాస్తాలుగా పని చేస్తున్నాం. మేము మాత్రం బస్సులలో కండక్టర్లగా పని చేయటం లేదూ! స్వలాభాపేక్షాపరులగు మగవారు మమ్మల్ని పోలీసులుగా తీసికోవటం లేదుగాని, మేము మాత్రం నాలుగురోడ్లూ కలిసేచోట్ల బొమ్మలలాగ నిలుచుని రహదారి పోలీసులుగా పనిచేయక పోయినామా! ఈ దేశంలో లేదుగాని, ఇతరదేశాల్లో స్త్రీలు మాత్రం లాగూలు ధరించి సిగరెట్లు కాల్చటం లేదూ. మాకంటే పురుషులకున్న ఆధిక్యత ఏమిటో! నిమ్న జాతులు వెనుకబడ్డ జాతులని వుద్యోగాలలో ప్రత్యేక సౌకర్యాలు కల్పించడం లేదూ ? స్త్రీలు మాత్రం వెనుకబడిన జాతిగా ఎందుకు పరిగణించకూడదమా. ఇప్పటివరకూ వుద్యోగాలన్నీ పురుషులే చేతుల్లో పెట్టుకున్నారు. ఇంతవరం భరించాం. ఇక నుంచీ కనీసం పదేళ్ల వరకూ వుద్యోగాలన్నీ స్త్రీలకే యిప్పించేటట్లు చేయాలి. ఇంతకాలం నుంచీ చేసిన అన్యాయాన్ని సర్దుబాటు చేయాలి.

## నేను :

వీళ్ల గొడవ వింటూంటే నాతల పట్టిపోతోంది. ఆమె వుత్తర ధృవము, అతడు దక్షిణ ధృవం. వీళ్లిద్దరికీ రాజీ కుదరుట కలలోని వార్త. మధ్యవర్తిగా పెట్టి యిందులోకి నన్ను యిరికించారు. ఇద్దరు చెప్పేదీ సబబుగానే వుంది. ఎటు చెప్పినా కష్టమే. ముందుకు పోతే నుయ్యి వెనుకకు పోతే గొయ్యి. వారిద్దరిలో ఎవరు అధికులైనా, నాకోరిది మాయింట్లో గూడ ఈ అగ్నిరగులు కోకుండా వుండాలనే. విడాకుల చట్టం వచ్చేసింది గూడ! ఒకవేళ మా ఆవిడ విడాకు లిస్తానంటేనో! నాకు సన్యాసమే శరణ్యం. రోజూ ఆఫీసుకు వెళ్లేటప్పుడు బస్సులలోనూ ట్రాములలోనూ జనం త్రోపిడిలో ఏకాలికో చేతికో దెబ్బలు తగిలి రక్తప్రవాహం కారుతూనే వుంటుంది. ఆఫీసులో కూర్చున్నంతసేపూ ఒకటే బాధ. మళ్లీమర్నాడు తగిలిన దెబ్బకే దెబ్బ తగులుతూనే వుంది. జనం వత్తిడివల్ల బస్సులలో మోచేతిపోట్లు తింటూవుంటే డొక్కలంతా ఒకటే బాధ. ఈ గోలంతా లేకుండా మా ఆవిడ వుద్యోగం చేసి నాలుగు రాళ్లు సంపాదించ గలిగితే నాకష్టాలు గట్టెక్కినట్లే. సుఖంగా యింటిపట్టున కూర్చొని పిల్లల్ని సముదాయించ నన్నా నా ? ఏమిటో, జరగని దానికి ఆలోచించి ప్రయోజనం ఏమిటీ వట్టి పిచ్చిగాని ! ! !



## భావార్థకము. (The Infinitive)

క్రియా ధాతువునకు చివర '**ना**' చేర్చిన (తెలుగులో 'ట' చేర్చినట్లు) భావార్థకమగును.

ఉదా:—**खा** తిను ; **खाना** తినుట.

**आ** వచ్చు ; **आना** వచ్చుట.

భావార్థకము రెండు విధములుగా నుపయోగించబడును.

(1) విధ్యర్థకము. (2) క్రియార్థక సంజ్ఞ.

విధ్యర్థకము భవిష్యత్కాలములో 'ఆజ్ఞ' తెలుపును.

ఉదా:—**तुम झूठ कभी मत बोलना** నీ వెప్పుడు అబద్ధములాడవద్దు.

(2) క్రియార్థకసంజ్ఞ. (నామవాచకము. క్రియార్థక సంజ్ఞ క్రియయైనను నామవాచకము వలె వాడబడును. ఇది ఎప్పుడును పుంలింగమందేయుండును.)

ఉదా:—**हिन्दी सीखना आसान है।** హిందీ నేర్చుకొనుట సులభము. ప్రత్యయము వచ్చినపుడు భావార్థకమునందలి కడపటి '**ना**' '**ने**' యగును.

ఉదా:—**उसके आने में अभी देर है।** అతడు వచ్చుటకు యింకను ఆలస్యమున్నది.

## పాఠము 18.

### కృదంతము (Participle)

#### వర్తమానకాలిక కృదంతము. (Present Participle)

ఒక పని చేయుచు, అదే సమయములో మరి యొక్క పనినిగూడ చేయుచున్నచో, మొదటి పనిని సూచించుటకు 'వర్తమానకాలిక కృదంతము' వాడుదురు.

కర్తయొక్క లింగవచనములననుసరించి '**ता**' లేక '**ता हुआ**' చేర్చిన వర్తమాన కాల కృదంతమగును.

ఉదా:—**वह हँसता (हुआ) आता है** అతడు నవ్వుచూ వచ్చుచున్నాడు.

వర్తమాన కాలిక కృదంతము విశేషణముగ కూడ వాడబడును.

ఉదా:—**जलता हुआ दिया बुझ गया** వెలుగుచున్నటువంటి దీపమారిపోయెను.

వర్తమానకాలిక కృదంతమును రెండు మార్లు **ए** కారముతో నుపయోగింతురు. కొన్ని సమయములలో నిది నిమగ్నతను తెలుపును.

ఉదా :—**बच्चा रोते रोते सो गया**
లేక **बच्चा रोते 2 सो गया** } బిడ్డ ఏడ్చుచు ఏడ్చుచు నిద్రపోయెను.

**यह कहानी पढ़ते पढ़ते सारा दिन बीत गया ।** ఈ కథ చదువుచూ చదువుచూ నుండగా దినమంతయు గడచిపోయెను.

దీనికి '**समय**', '**वक्त**' చేర్చినపుడు '**ता**, '**ते**' గను, '**बार**' చేర్చినపుడు '**ती**' గను మారును.

ఉదా :—**पढ़ते समय** చదువు నప్పుడు.

భూతకాలిక కృదంతము Past Participle.

సామాన్య భూతకాలమునకు **आ, ए, ई** నియమము ననుసరించి **हुआ** చేర్చిన భూతకాలిక కృదంతమగును. సాధారణముగా భూతకాలిక క్రియయే కృదంతముగ నుపయోగింతురు. దీనినే విశేషణముగా కూడ వాడవచ్చును.

**बीते हुए दिन** గడచిపోయిన రోజులు.
**पढ़ा-लिखा आदमी** చదివిన మనుష్యుడు.

పూర్వకాలిక కృదంతము

ధాతువునకు **कर** చేర్చిన పూర్వకాలిక క్రియయగును.

**सुन** విను. **सुनकर** విని.

ఒక కర్తకే సంబంధించిన రెండు క్రియలున్న, మొదటి క్రియ సాధారణముగా పూర్వకాలిక కృదంతముగ నుండును.

ఉదా :—**मैं सबेरे खाकर मदरसा जाता हूँ** నేను ప్రొద్దున భోజనము చేసి బడికి వెళ్లుదును.

సకర్మక క్రియల యొక్క పూర్వ కాలిక కృదంతమునకు తరువాత **आना, जाना** యను క్రియా రూపములు వచ్చిన, **कर** లోపించును.

ఉదా :—**खा जाओ** తిని వెళ్లుము.

**कर** ధాతువునకు **कर** చేర్చునపుడు ప్రత్యయమగు **कर** వచ్చుటకు బదులు **के** వచ్చును.

ఉదా :—**काम करके** పని చేసి.

## నిత్యత్వ బోధకము. (Habitual action)

ఒక పని నిరంతరము అభ్యాసము వలె చేయుచుండుటను తెలుపు క్రియ నిత్యత్వ బోధకమగును. సామాన్య భూతకాల క్రియకు '**कर**' చేర్చిన ఈ క్రియ ఏర్పడును.

ఉదా :—**वह रोज़ मेरे घर आया करती है ।** ఆమె రోజు నా యింటికి వచ్చుచున్నది.

సూచన :—(1) పోవుచూవుండు అనుటకు **जाया कर** అని వ్రాయవలెను.

(2) దీని కర్తతో ఏకాలములోను '**ने**' ప్రత్యయమురాదు.

ఉదా :—**राम बहुत दिनों तक पढ़ा किया** రాముడు చాల రోజులవరకు చదువుచూయుండెను.

**देर** ఆలస్యము (స్త్రీలింగము).
**आसान** సులభము.
**मुश्किल** కష్టము.
**नुक़सान** నష్టము. (పుంలింగము)
**नफ़ा** } (profit) లాభము.
**फ़ायदा** } use
**चेहरा** ముఖము. (పుంలింగము)
**थकावट** } అలసట. (స్త్రీలింగము).
**थकान** }
**ज़माना** కాలము. (పుంలింగము)
**जलना** మండుట. వెలుగుట.
**जलाना** కాల్చుట; వెలిగించుట.
**बुझना** ఆరిపోవుట. (మంట)
**बुझाना** ఆర్పుట.
**बीतना** (సమయము) గడచి పోవుట.
**बिताना** గడపుట.
**अच्छा लगना** అందముగా నగుపించుట; మనసుకు నచ్చుట.
**उतरना** దిగుట.
**उतारना** దింపుట.
**खिलना** వికసించుట.
**खिलाना** తిని పించుట.
**थक जाना** అలసి పోవుట.
**रुकना** ఆగుట.
**रोकना** ఆపుట.
**गुज़रना** కాలము గడచుట.
**गुज़ारना** గడపుట.
**याद दिलाना** జ్ఞాపకపరచుట.
**याद रखना** జ్ఞాపకముంచుకొనుట.
**याद करना** వల్లించుట; స్మరించుట.
**फटना** చినుగుట.
**फाड़ना** చింపుట.

### వాక్యములు.

**वह काम करते 2 थक गया ।** అతడు పని చేయుచు అలసిపోయెను.
**वह बोलते 2 रुक गया ।** అతడు మాట్లాడుచూ మాట్లాడుచు ఆగెను.

लिखते समय ध्यान रखो ।

వ్రాయునప్పుడు ధ్యానము (జ్ఞాపకము) పెట్టుకొనుము.

गुज़रा हुआ ज़माना फिर नहीं आता ।

గడచి పోయిన కాలము తిరిగి రాదు.

मेरी बात मान जाओ ।

నా మాట వినుము.

चिड़िया अपने बच्चों के लिये खाना लाया करती थी ।

పక్షి తన పిల్లలకొరకు ఆహారము తెచ్చుచుండెడిది.

भूली हुई बात याद न दिलाओ ।

మరచి పోయిన సంగతి జ్ఞాపకపరచవద్దు.

यह फटे कपड़े पहने हुए है ।

ఇతడు చినిగిన బట్టలు కట్టుకొని యున్నాడు.

मैंने उसको गाड़ी में जाते (हुए) देखा ।

నేనతనిని బండిలో వెళ్లుచుండగా చూచితిని.

बार बार काफ़ी पीना अच्छा नहीं है ।

తరచు (ఎక్కువగా) కాఫీ త్రాగుట మంచిది కాదు.

यह देखने में अच्छा लगता है ।

ఇది చూచుటకు అందముగా నున్నది.

यह काम करने से क्या नुक़सान है ?

ఈ పని చేయుట వలన (కలుగు) నష్టమేమి ?

मैं तमिल सीखना चाहता हूँ ।

నేను అరవము నేర్చుకొన గోరుచున్నాను.

तुम कल मुझ से मिलना ।

నీవు రేపు నన్ను కలుసుకో.

मैंने आपको आते देखा ।

నేను తమరిని వచ్చుచుండగా చూచితిని.

बच्चे अपनी बहन को देखकर ख़ुश हुए ।

పిల్లలు తమ సోదరిని చూచి సంతోషించిరి.

यह काम कर जाओ ।

ఈ పని చేసి వెళ్లుము.

शाम को मैदान में खेला करो ।

సాయంకాలము మైదానములో ఆడుచుండుము.

उसका चेहरा उतरा हुआ है ।

అతడు ముఖము వేల వేసుకొన్నాడు.

बाग़ में फूल खिले (हुए) थे ।

తోటలో పువ్వులు వికసించి యుండెను.



(34 వ పేజీ తరువాయి)

కాబట్టి అందరును దేశమును ప్రముఖ వుత్పత్తి కేంద్రము గావించుటకు ప్రయత్నపడవలెను. ఉత్పత్తిని వృద్ధి పొందుట వలన ముందట మనకు సమృద్ధి యేర్పడును. పిదప వ్యాపారము వృద్ధిపొందును, తద్వారా ఆర్థికస్థితి బాగు పడుటచే మానవుని జీవనము సుఖదాయకమగును. దేశము గౌరవ స్థానమును పొందును.



# శ్రీ సింహాచలము

ఎమ్. లక్ష్మి
(పాతవిద్యార్థిని.)

" సీ॥ ఇదియగాదె త్వష్టి యుదయించి నూకేశం
దైత్యు రాక్షసు నిర్జించినట్టిచోటు
ఇదియగా భవ్యమౌ యింద్ర శేఖరునుండి
జగతికి శ్రీగంగ దిగినచోటు
ఇదియగా కటకేశు నిభఘోటకశ్రేణి
ఆంధ్ర కృష్ణుని ధాటినడ్డుచోటు
ఇదియగా ఆంధ్రుల విదిత శిల్పకళాస
మర్థత రహిమించినట్టిచోటు

గీ. వకుళపుష్ప ఫలానేక భారనమ్ర
స్వాంతహర పూగపనసామ్ర పాదపౌఘ
మండితాఖిలగోత్రభృన్మండనంబ
యౌరె! తిలకించ దివ్య సింహాచలమ్ము ॥ "

ప్రియమైన ఉమకు,

ఏదేశపు సంస్కృతి ఐనా, ఆదేశపు ప్రజలకట్టు, బొట్టు, జుట్టు అనుమూడింటిమీద ఆధారపడి యుండునన్న మన ప్రాచీనుల పలుకులందలి ప్రభావము పాశ్చాత్య నాగరికతా సంబంధము హెచ్చినకొలది భారతీయులలో కాలక్రమేణ నశించుచున్నను, శిథిలములై జీర్ణము కాక మిగిలియున్న శిల్పములు, దేవాలయములు భారతీయత నింకను వేనోళ్లచాటుచు దేశదేశములనుండి యాత్రికుల నాకర్షించుచుండుట ముదావహముకదా! హిందువులనేక యుద్ధములు చేసినారు, కొన్ని ఓడినారు, కొన్ని గెలిచినారు. కాని, నేటికి రూపుమాయకమిగిలియున్న భారతీయ జీవితమునకు సాక్షులు దేవాలయములే అన్నమన నాయకుల వాక్యములు నిక్కము. దేవాలయముల సందర్శించుటే భారతీయులకు ప్రస్తుతము నిరుపయోగ కరమని తోచుచున్నది. కాని మహిళలలో పురుషులకన్న పాశ్చాత్య ప్రభావము తక్కువగుటచే హైందవ సాంప్రదాయములకు పురుషులంత స్త్రీలు ఎడముకాలేదు. అందుచేతనే కాబోలు దేవాలయసందర్శన కుతూహలమింకను మనలో వ్యర్థంకాలేదు.

మనదేశములోని పుణ్యక్షేత్రములలో సింహాచలక్షేత్రము ఒకటని నీవెరుగుదువుకదా! అది మావూరికి సరిగా 10 మైళ్ల దూరంలో విజయనగరం వెళ్లేత్రోవలో ఉన్నది. ఏరోజునైనాసరే, అక్కడకు వెళ్లేయాత్రికుల సంఖ్యవిపరీతంగానే ఉంటుంది. అక్కడకు వెళ్లి స్వామిదర్శనముచేసే భాగ్యము నాకున్న అబ్బినందుకు చాలసంతోషించుచున్నాను. అక్కడకు రైలుమీద వెళ్లినాసరే, లేక జట్కామీద వెళ్లినా వెళ్ల వచ్చును. రైలు ప్రయాణం అంత తేలికగాదు. అందుకనే మావాళ్లు జట్కాబండి కుదిర్చారు. నానుపోను ఎనిమిది రూకలు. మైలుగాని రెండుమైళ్లో ప్రయాణం జట్కాలో చెయ్యాలంటే భయంవేసేనాకు యిరవైమైళ్లు జట్కా ప్రయాణం అంటే ఎంతభయమో చెప్పాలా? కాని గమ్మత్తు రోడ్డు ఎంతచక్కగా ఉందంటే సాయంత్రం తిరిగి వచ్చేసరికి కష్టమేమి కలగలేదంటే నమ్ము. ఆదివారం ప్రొద్దున్నే 6 గంటలకు మేము నలుగురము జట్కాబండిలో వాల్తేరునుంచి బయలుదేరితిమి. బయలుదేరుటయే తడవుగ బండి చురుకుగ సాగనారంభించి వాల్తేరు రయిల్వేస్టేషనుకు ముప్పావు గంటలో చేరినది. సింహాచలమునకు వెళ్లుత్రోవ అక్కడనుంచియే చీలును. ఆరాజమార్గము గాంచగన్నుల పండువగాయుండెను. మంచి తారురోడ్డు త్రోవకాచివర యీచివర సిమెంటుతో రెండడుగుల వెడల్పున బాటవేయబడినది. దీనిమీద మనుజులు నడవ వలెను. త్రోవకు రెండువైపుల మనోహరముగ వృక్షములు నాటబడియున్నవి. వృక్షములవెనుక సైనిక నివహములకై ఏర్పాటు చేయబడిన గుడారములున్నవి. వైమానిక దళపు శాఖలు, నావికాదళ శాఖలు, పదాతిదళములు, సాయుధశకట చోదకదళశాఖలు, మున్నగున వెన్నోయున్నవి. వానికి నొకవైపు వెనుకవాల్తేరు రయిల్వేస్టేషనున్నది. విశాఖపట్నంనుంచి ఆరుమైళ్లవరకు త్రోవకిటునటుపైన చెప్పిన సైనిక శిబిరములు, వానికార్యాలయములు, వినోదస్థలములు, రక్షణ సామాగ్రి, నిధులు జూపరులకత్యాశ్చర్యము గొల్పకమానవు. నిజంగా జపాను

గాడే హిందూదేశము మీదికి దండెత్తి యీ ప్రాంతంలో
గితే వానికి మనతడాఖా చూపించేవాళ్లము. యుద్ధం
యింకా రెండు సంవత్సరాలక్రిందే ముగిసియుండే దని
ంచును. మామిత్రుల సంతోషనినాదాలతోను, మార్గ
రమణీయక దృశ్యాలతోను, గడియలు నిమేషములవలె నిట్టె
గడిచినవి. దాదా పెనిమిది గంటలకు సింహాచలము క్రిందకు
చేరితిమి. చుట్టూమంచి గ్రామమున్నది.

స్వామివారికి చేయించు భోగము విషయము కొండ క్రిందనున్న కార్యాలయములో విచారించి, తదుపరికొండ నెక్క మొదలిడితిమి. సింహాచలము కొండయెత్తైనది గాదనియు, సులభముగ నెక్కవచ్చుననియు, నంతకు ముందు పెక్కండ్రవల్ల విని యుంటిమి. నూరు గజముల వరకు బిచ్చగాండ్రెడ తెరపిలేకుండగూర్చొని ప్రేక్షకులను యాత్రికులను బాధించుచుండిరి. నిజంగా బీదలనాథుల రక్షించవలసిన బాధ్యత ప్రభుత్వపువారిదే. సామాన్యులవద్ద నుండి కాక ధనవంతులవద్దనుండి కప్పము లేక పన్ను క్రింద ప్రభుత్వము, ధనము గ్రహించి దానితోనే పనిపాటల జేయ లేనివారి పోషించవలెను. అటుగాకున్న దయార్ద్రహృదయులు నిస్సహాయులునగు సామాన్యజనుల మనస్సుల నొప్పించుటేగాని బిచ్చగాండ్రకు వేరే లాభముండదు.

మెట్లుమొదటలో తొందరగ నెక్కితిమి. రెండు మూడు వందల నెక్కునప్పటికి కొందరు మధ్యమార్గమున విశ్రాంతి దీసికొన మొదలిడిరి. మొత్తముమీద వెయ్యిమెట్లున్నవి. తూలుతూ, సోలుతూ తొమ్మిదింటికి స్వామియున్న ప్రదేశము వరకెక్కితిమి. అక్కడ సత్రమున్నది. పండ్ల దుకాణములు కాఫీ హోటలులు గలవు. ఎట్టకేలకు దేవాలయము ప్రవేశించితిమి. కాని పదియగువరకు యాత్రీకులకు దర్శనముండదట. శిఖరమందటునిటు తిరుగుచు నాగంట కాలక్షేపమొనర్చితిమి.

ఆకొండమీద పనసచెట్లు, జీడిమామిడి గున్నలు, అనాస వృక్షములు మెట్లకు రెండువైపుల నతిమనోహరముగ పెరిగి యున్నవి. ఫలపుష్పాదులచే నిండి అతిరమణీయముగ వృక్షములు కనబడినవి. భక్తాభీష్ట ప్రదాయుడగు శంకరుని జటాజూటమునుండి విష్ణుపాదోద్భవ నభో మార్గమున పడిపృథ్వికి దిగినదాయను నట్లాశిఖరోన్నత భాగంబునుండి సదాజలము ప్రవహించు చుండును. ఆజలమును గొట్టాలద్వారా తీసుకొనివెళ్లి ప్రజోపకారార్థము ప్రయోగించు చున్నారు. అక్కడక్కడ గొట్టాలనెత్తుచోట చెట్లయంచులో నుంచి నీటినిక్రిందకు బడనిచ్చి వానికి ధారలని పేరుబెట్టినారు. హనుమధార, పిచుకధార, ఏనుగధార, మాధవధార మొదలగునవందులో ఖ్యాతిగాంచినవి. వానిక్రింద జలకమాడిన పంచ మహాపాతకములు పటాపంచలగును. ఆమహాపాతక నివారణార్థమచ్చట స్నానమొనర్చుటకు కొంత రుసుముకలదు. మతము దేవుని పేరిట జరుగుధనార్జనములు గర్హనీయములు కదా! వేయేల కొండమీద కెక్కు నప్పుడటునిటుగల యద్భుతమనోహరదృశ్యములు దృశ్యములేగాని శ్రావ్యములు గావు.

సరే అవి యటుండనిండు ఇంతవరకు చెప్పిదేవాలయ మండపమును, గోపురముమీద శిల్పమును గూర్చి వ్రాయకుండుట పొరపాటు. నేను చాలదేవాలయముల నింత వరకు చూచియున్నాను కాని, ఇంత అద్భుత శిల్పనా చాతుర్యమచ్చట కనిపించలేదన్న అతిశయోక్తి కానేరదు. "ఇది యగా ఆంధ్రుల విదిత శిల్పకళాసమర్థత రహిమించినట్టి చోటు" అన్నకవి పలుకులు నిక్కమే. గోడలనిండ, గాలి గోపురమునిండ దశావతారములు, మానవుని భోగలాలసుడుగాకుండాచేయు బొమ్మలు అతివిచిత్రంగా చిత్రించబడినవి. గర్భగుడికి వెనుకాల బ్రహ్మాండమైన రాతిరథము, గుర్రాలు శిథిలావస్థలో నున్నవి. దేవాలయానికి క్రొత్తలో వాస్తుదోషము సంభవించితే దేవాలయాన్ని నిర్మించిన శిల్పి ఈ రాతిరథంతో దేవాలయాన్ని సవ్యంగా త్రిప్పినాడట ఇందలి నిజానిజాలు అప్రస్తుతము కాని దాని నిర్మాణములో మాత్రము అత్యద్భుతమైన నేర్పరితనము చూపినాడా శిల్పి. గర్భగుడికి ముందర ఒక మూలమంచి గుడ్డచుట్టిన స్తంభమున్నది. దాన్ని కప్ప స్తంభమంటారు. దీనిమహిమ అమోఘమైనదట. సర్వాభీష్ట ప్రదాయినట. భూత ప్రేత పిశాచ ఢాకినుల పోద్రోల సమర్థమైనదట. సంతాన సౌభాగ్య ప్రదాయినట. పిపీలికము మొదలు మత్తేభమువరకు ఆ స్తంభ ప్రయోజనము కావలిసిన ప్రాణిని త్రాడుతో దానికి బంధిం

తురు. పిశాచిలుపోవలెనన్న అపీడితులను స్తంభమునకు కట్టి బెత్తములతో కొట్టుదురట! సంతానము కావలసినచో దంపతులు ఆ స్తంభమును కౌగలించు కొనవలెనట. ఆకప్ప స్తంభముపయోగించుటకు రుసుముకలదు. ఉదాహరణకు ఏనుగును కట్టినరుసుము నూరు రూప్యములు, దంపతులు సత్సంతానార్థము కౌగలించుకొన్న ప్రతితడవకు నాలుగు రూకలు. ఆకప్ప స్తంభము యొక్క నిజానిజాలు పరిశీలించుటకు మాకెవరికి అవకాశము కనిపించనందునను, మేమచ్చట ఉన్నప్పుడింకెవరు దాని నుపయోగించనందునను, దీని విషయ మింతటితో ముగించెదను.

ఇంకొక విషయము: మండపములోని గోడలనిండ ప్రాచీన రాజుల శాసనము లెన్నియోగలవు. విజయనగర రాజులవి, గజపతులవి, అందులో ప్రాముఖ్యములైనవి. ఈ శాసనములు మనచరిత్ర వ్రాయుటకెంతేని దోహద మిచ్చినవనుటలో సందియముండదు. ఆంధ్ర భోజుడిక్కడకు పదిమైళ్ల దూరంలోనే కటకాధిపుడగు గజపతినోడించి జయస్థంభమునాటి తిరిగి స్వదేశోన్ముఖుడై వెళ్లినప్పుడు శ్రీ స్వామినిదర్శించి వెలలేనిజవాహారి భూములు సమర్పించి వెళ్లెనట. మన చక్రవర్తులు దేవాలయ నిర్మాణంలోగాని, పోషణలోని, రక్షణలోగాని చాలవ్యయ ప్రయాసలకోర్చి తంటాలుపడి మతమును రక్షించినట్లు చదువుతున్నాము. అటువంటి వారినిప్పుడు మతోన్మాదులని మనవారంటూంటే దేశమెంత అధోగతికి వెళ్లుతూన్నదో ఆలోచించు కోగలవు కదా? మతము, సంస్కృతి, దేశము ఈ మూడు అవినా భావ సంబంధము కలవని నామతము. వీటినిగురించి యింకెప్పుడైనా వీలున్నప్పుడు వివరంగా వ్రాస్తాను. మొత్తము మీద శ్రీ కృష్ణదేవరాయల పేరు చిరస్థాయిగా శ్రీ సింహాచల క్షేత్రమంటప కుడ్యములపై అలరారు చుండుట ఆంధ్రులు గర్వింప తగ్గది.

పదిగంటలైనది. భగవద్దర్శన మొనర్చుకొందమను కొంటిమి. కాని భగవంతుని దర్శించుటకు ప్రవేశరుసుము రెండణాలు. అక్కడ భగవత్ప్రసాదము స్వీకరించవలెనన్న డబ్బు కావలెను. నిలుచున్నపన్ను, కూర్చున్నడబ్బు, తింటానికి డబ్బు, మోక్షార్జనకు డబ్బు, చూడడానికి డబ్బు, వెళ్లడానికి డబ్బు లౌకికాధ్యాత్మిక విషయ సముపార్జనకు సరిసమానముగ డబ్బు, చాలాఘోరము. మాతోపాటు కొంతమంది కళాశాల విద్యార్థులు కూడ భగవద్దర్శనార్థము వేచియుండిరి. వారిలో కొందరు "దేవుని చూడడానికి డబ్బెందుకు? చూపితే చూపండి ఊరికే, లేకపోతే మాకు దేవుడక్కర్లే" దన్నారు. కాని దేవాలయాధికారులు వారికి లొంగకుంట వారు శిఖరమును, ప్రకృతిరామణీయక దృశ్యములను పరీక్షించుటకేగిరి. "చిలుము వదిలినను జన్మపావనమైతే చాలునన్న" మాబోటి సనాతనులతలకొక బేడ వెచ్చించి రసీదులు పుచ్చుకొని, ఒకరి వెనుక ఒకరుగా దేవాలయం గర్భగుడిలోనికి వెళ్లితిమి. స్వామి వరాహావతారమట. హిరణ్యాక్షునిచంపి భూమిని ఉద్ధరించిన పవిత్రస్థలమున స్వామికి ప్రతిదినము చందనము బూయుదురు. సంవత్సరమున కొక్కతూరి యీ చందనము తీయుదురు. అది వైశాఖ శుద్ధ ఏకాదశి. ఆదినము లక్షలకొలది యాత్రీకులు వచ్చిస్వామిని సందర్శించి ధన్యులగుచుందురు. చందనమెడ తెరపి లేకుండా రోజు పూయుటచే విగ్రహము శివలింగమువలె చూపరులకు కాన్పించును. దీనిని గురించి యొకవదంతి కూడకలదు. ప్రథమమున ఇది శైవక్షేత్రమై యుండగ విశిష్టాద్వైతస్థాపనా చార్యుండగు శ్రీ రామానుజాచార్యులవారు తమ మహిమవల్ల విష్ణుక్షేత్ర మొనర్చెననియు కథకలదట. భగవంతునికి మేము తెచ్చిన పళ్లు ఆరగింపుచేసిరి. పులిహోరనైవేద్య మొనర్చిరి. పిదప పెరుమాళ్లకు ధూపహారతినిచ్చిరి. ఆహారతి అందరముకళ్లకు అద్దుకొని ధన్యుల క్రిందపరిగణించు కొంటిమి. ఆతర్వాత తీర్థము శఠకోపము వగైరాపుచ్చుకొని గర్భగుడినించి బైటికి వచ్చితిమి. బయటస్వామికి పెట్టితీసివేసిన చందనము, పటములుంటే అవి కొనుక్కొని, దాదాపు ఒంటి గంటకు తిరిగి కొండదిగితిమి. నిజంగా ఈ క్షేత్రము చూడదగిన వానిలో ఒక్కటి. ఈ సంక్రాంతికి నీవు యిచ్చటకు వచ్చేటట్లైతే తప్పక చూడవచ్చును.



# ఏమో అనుకున్నాను

శ్రీమతి బాపట్ల సుశీల

"అమ్మా...అమ్మా!!..."

"మణీ! అమ్మ ఏదీ?"

"ఏం అన్నయ్యా! ఎక్కడనుంచి ఉత్తరం? అమ్మ భావిదగ్గర ఉంది అదిగో వస్తోంది. అమ్మా? అన్నయ్య పిలుస్తున్నాడే"

"ఏంరా? అబ్బాయి? ఎక్కడనుంచి? ఎవరు రాశారు?"

"శారద రాసిందమ్మా, ఈ ఉదయం మెయిల్లో వస్తోందట స్టేషనుకు రమ్మని రాసింది. వెళ్తున్నా" అని ప్రభాకర్ వీధి గుమ్మంవైపు తిరిగి వెడలబోతూ ఉండగా,

"ఏం! రైల్లో ఒక్కతే ప్రయాణంచేసి వచ్చినపిల్ల, ఒక్కతే ఇంటికి రాలేదు కాబోలు?"

"అదికాదమ్మా! రాలేక కాదు. అది మర్యాద. అన్నయ్య ఎదురుగుండా వెళ్తే వదినె కానందంగా ఉంటుంది."

"ఏం విపరీతం తల్లీ! ఆ దొరసానిగారు ఉత్తరం రాయడం ఈ మగరాయడు చిత్తం అంటూపోయి స్వాగత మనడం ఆ హా హా!! మా కాలంలో మే మెరుగమమ్మా ఈ మర్యాదాలు ఈ వేషాలు...రాను మెత్తనైతే గుఱ్ఱం మూడు కాళ్లతోనే నడుస్తుందట...సరే...నా కెందు కొచ్చిన గొడవ."

వెడలబోతూ ఉన్న ప్రభాకరం మరల తల్లివైపు తిరిగి "అమ్మా! ఏమేమో అనుకుంటున్నావు. నీకు శారద సంగతి బాగా తెలియదు ఇప్పుడు కొందరిలాగున చదువుకొన్నామని విఱ్ఱవీగే మనిషికాదు శారద. రెండు దినాలు చూస్తే నీకే తెలుస్తుందిగా? అని ప్రభాకర్ వెళ్లాడు."

ప్రభాకరం, శారద బందరు కాలేజీలో ఇంటర్ చదువుతూ ఉండగా ఒకరి పరిచయ మొకరు కలుగజేసుకొని మిత్రులయినారు. ఇద్దరూ సంపన్నుల కుటుంబములలో పుట్టి పెరిగినవారే. ప్రభాకరుకు తల్లీ చెల్లెలు తప్ప అంత దగ్గర బంధువులు మరి ఎవ్వరూ లేరు. శారదకు అన్నగారూ తల్లి తప్ప మరి యెవరూ లేరు. శారద అన్నగారికి స్త్రీ విద్య యెడల అభిమాన మెక్కువ అతని తల్లికూడా నవనాగరతకు కొద్దిగా అలవాటుపడిన మనిషే. కనుకనే శారదకు పెండ్లి తొందర కలిగించకుండా విద్య సాగనిచ్చారు. శారద చిన్నప్పటినుండీ చాలా చురుకైన పిల్ల. పరీక్షలలో మొదటి పిల్లగా నెగ్గుతూ వచ్చినది. ప్రభాకర్‌కూడా ప్రతి పరీక్షా మొదటి తరగతిలో ఉత్తీర్ణుడౌతూ వచ్చాడు. ఇద్దరూ ఇంటర్ ఫస్టుక్లాసులో ఉత్తీర్ణులైనారు. ఇద్దరికీ మార్కులు సమానంగానే రావడంచేత, ఇద్దరి పేర్లూ జోడించి ప్రకటించారు. అంతవరకును శారద ప్రభాకరు లిద్దరు పరస్పర ప్రేమతో ఉండినా ఆ ప్రేమ దాంపత్య ప్రేమగా మాత్రము పరిణమించలేదు. ఇప్పుడీ జంటగా పేర్లు ప్రకటితము కాగానే ఇద్దరి హృదయాల్లోను అంతర్గతంగా ఉన్న ప్రేమ దాంపత్యంకోసం ఒక్కసారిగా దాటువేసింది. ఇద్దరూ ఒక్కసారిగానే ఒకరినొకరు అభినందించుకొంటూ కలుసుకోవలెనన్న కోరిక గాఢంగా ఉన్నట్లు లేఖలు వ్రాసుకొన్నారు. అవి అందిన వెంటనే ఒకరి హృదయం ఒకరు నివేదించుకొన్నారు, శారద తన హృదయంలో ఉన్నకోరిక తన అన్నగారికి తెలియజేసినది. ఇద్దరూ కలిసి తల్లితో చెప్పారు. తల్లి సమ్మతించింది. ప్రభాకర్ తన తల్లికి తెలియజేశాడు ఆమెమాత్రం సమ్మతించలేదు. ఆమె పూర్వాచార పరాయణురాలు అతి చాదస్తం మనిషి. చదువుల్లోపడ్డ స్త్రీలంతా చెడిపోయినట్లే భావించే మూర్ఖురాలు. ఆవిడ సమ్మతించదని తెలుసు ప్రభాకరుకు. అయినా పెద్దదిగదా అని ఆమె చెవిని ఒకసారి వేశాడు తన ఉద్దేశము. ఆమె తమ్ముడికూతురొక అమ్మాయి 15 ఏండ్లది ఉన్నది. పల్లెటూరిలో, చదువులేదు, అంతగా అందమూ లేదు ఆ అమ్మాయికి. ఆ పిల్లను పెండ్లి చేసుకోరాదా అంటుంది తల్లి. ప్రభాకరు కిష్టములేదు. మేనకోడలైతే తన చెప్పుచేతలలో లొంగి ఉంటుందని తల్లి ఆలోచించింది. చదువురాని పెండ్లాముతో ఎట్లు కాపురముచేసి సుఖపడగలను? అని ప్రభాకర్ ఆలోచించాడు తలికి కోపం వచ్చినా సరే తన జీవిత సౌఖ్యం

చెడగొట్టుకోవడ మెందుకు ? అని శారదను పెండ్లి చేసుకోడానికే నిశ్చయించుకొన్నాడు.

అప్పుడు ప్రభాకర్ గుడివాడలో తన సొంత యింట్లోనే ఉండెను. తల్లి చెల్లెలుకూడా తనతోనే ఉండేవారు. వివాహ ముహూర్తం నిశ్చయమైనది. తల్లికి పట్టరానికోపం వచ్చింది. బందరులో పెండ్లి జరుపుటకు నిశ్చయించారు. ఆమె పెండ్లికి వెళ్లలేదు. సరికదా కూతురునైనా పంపలేదు. అంతేకాదు పెండ్లి అయిన తర్వాత ప్రభాకర్ తన పెండ్లాన్ని తీసుకొని గుడివాడ వస్తే వాళ్లతో కలిసి ఉండవలసి వస్తుందని ప్రభాకర్ బందరుకు వెళ్లుటకు పూర్వమే ఆమె తన కూతురుని తీసుకొని తెనాలియొద్ద ఒక పల్లెటూరిలోఉన్న తన తమ్ముడింటికి పోయినది. ఇంత జరిగినా ప్రభాకర్ మాత్రము పట్టినపట్టు విడవలేదు. ఒక్కడేపోయి బందరులో శారదను పెండ్లి చేసుకొని అక్కడనే ఒకమాసముండిపోయాడు.

శారద మెడికల్ కాలేజిలోను, ప్రభాకర్ ఇంజినీరింగ్ కాలేజిలోను, ప్రవేశించడానికి నిశ్చయించుకొని దరఖాస్తులు పంపుకొన్నారు. ఇద్దరికీ చెన్నపట్టణం కాలేజీలలోనే సీట్లు దొరికినవి. ప్రభాకర్ ముందుగా చెన్నపట్టణము వచ్చి రాయపేటలో ఒక ఇల్లు అద్దెకు తీసుకొన్నాడు. తల్లిపేర ఒక ఉత్తరం రమ్మని బ్రతిమాలుతూ రాశాడు. మేనమామ పేరకూడా ఒక ఉత్తరం రాశి తల్లిని, చెల్లెలిని, ఏలాగైనా నచ్చచెప్పి పంపించమని కోరాడు. జరగవలసిందేదో జరిగి పోయింది. కొడుకును విడిచి తమ్ముడింట ఆమెమాత్రమెన్నాళ్లుండగలదు ? ఏదో సమాధాన పరచుకొని ఆమె తన కూతురితో చెన్నపట్టణం వచ్చింది. ప్రభాకర్ సంతోషించాడు.

"శారద నిన్నూ చెల్లెలినీ ఆదరించి సుఖపెట్టగలదమ్మా! అన్నాడు."

"చూతాములే" అంది తల్లి.

"ఎప్పుడొస్తుంది అన్నయ్యా వదినె ?" అన్నది మణి.

"ఇక పది దినాలలో వస్తుందమ్మా" అన్నాడు ప్రభాకర్.

ప్రభాకర్ చెప్పినట్లె పది దినాలలో రాగల ప్రాసిన లేఖ వచ్చింది. ఆ లేఖ, పైని చెప్పిన లేఖ.

వదినను తీసుకొని అన్నయ్య ఎప్పుడు వస్తాడా అని మణి ఆతురతతో ఎదురుచూస్తూ ఉంది.

ఈ చదువుకొన్న కోడలితో ఈ యింట్లో ఎట్లా జీవించవలెనని తల్లి బెంగపెట్టుకొన్నది. చదువుకొన్న కోడళ్లు మగరాయళ్లు లాగున ఇంటిపనులు ఏమి చేయక విలాసాలలో విహరిస్తూ ఉంటారనీ, అత్తగారిమాట లక్ష్యపెట్టక, అధికారం చెలాయిస్తూ ఉంటారనీ, ఇంతకాలం కోడండ్రికి అత్తబాధ కోడళ్లకుండేదంటే, ఇకను కోడళ్లు పెట్టేబాధ అత్తలు పడే విపరీత కాలం వచ్చిందనీ, ఈలాగునే ఏవేవో పిచ్చిపిచ్చి ఆలోచనలన్నీ ఒక్కసారిగావచ్చి, ఆ తల్లి ఏదో మతిపోయిన దానివలె దిగులుపడి కూర్చున్నది. వంటచేసే పనిమనిషి ఆ దినము ఏదో ఆటంకమువచ్చి పనికిరాలేనని కబురు పంపినది.

తొమ్మిదిగంటలయినది. ఇంకా వంట ప్రయత్నమారంభించలేదు. ఉదయం కుంపటిమీద కాఫీ చేసుకొని త్రాగడం మాత్రం అయినది. వదినె రాగానే ఇద్దామని ఫ్లాస్కు నిండా కాఫీ పోసి ఉంచింది మణి. వంటచేయడానికి స్నానంచేసి మడికట్టుకొందామని తల్లి భావివద్దకు వెళ్లబోతూఉండగా మోటార్ కార్ వచ్చింది. శారదా ప్రభాకరులు దిగి సామాన్లు లోపల పెట్టిస్తున్నారు.

"అమ్మా ! అదిగో వదినె అన్నయ్యా వచ్చారు" అని సంతోషంతో కేకపెట్టి వారికెదురుగా పరుగెత్తిపోయి కలుసుకొంది.

శారద మణిని చేరదీసి బుగ్గలు నులిమి ముద్దుపెట్టుకొని లోపలికిపోయి అత్తగారి పాదాలకు వంగి నమస్కరించినది. శారద అట్లు వినయంచూపించి నమస్కరిస్తుందని అనుకోలేదు. అందుచేత ఆశ్చర్యంలోపడి ఏమని దీవించాలో తెలియక కంగారుపడి "శుభం" అని మాత్రము పలికి ఆమె బుజములమీద చేతులుపెట్టి లేవదీసి

"అందరూ క్షేమంగా ఉన్నారా అమ్మా" అన్నది.

"మీ దయవల్ల అందరూ క్షేమంగా ఉన్నాము అత్తా !" అన్నది శారద.

కోడలి మొగములో ఆకర్షణీయమైన కళ కాంతులు అత్తగారికి కనబడినవి. అత్తగారి మొగంలో ఒకవిధమైన బెదురూ అనుమానం, వెలవెలపోవడం కోడలికి గోచరించినవి. అంతలో మణి కాఫీ పట్టుకొనివచ్చి శారదకీయబోయినది.

"మీ అన్నయ్యగారికీయమ్మా నేను తరవాత త్రాగుతాను. పెరటిలో కాళ్లూ చేతులూ కడుగుకొని వచ్చి త్రాగుతాను" అన్నది శారద.

"అన్నయ్య కాఫీత్రాగే స్టేమనకు వచ్చాడు. ఐతే ఫ్లాస్కులో నేపోసి వేడిగా ఉంచుతాను. రావదినా పెరట్లోకి" అన్నది.

"వుండు మణీ సబ్బూ తువాలూ తెచ్చుకొని వస్తాను" అని శారద గదిలోనికి పోయినది.

"ఏం, వంటమనిషి రాలేదూ?" అన్నాడు ప్రభాకర్.

"ఏదో ఆటంకము. రాలేనని ఇప్పుడే కబురుచేసింది. వంటకు లేద్దామనుకొంటూ ఉండగా మీరూ వచ్చారు. ఇదిగో స్నానానికి వెళ్తున్నాను. మణీ పొయ్యిలో నిప్పు వేసి రాజ పెట్టు స్నానంచేసి వస్తాను" అన్నది తల్లి.

"ఉండండత్తా నేను వస్తున్నాను. నేనూ స్నానంచేసి మడి కట్టుకొంటాను. వంట నేనే చేస్తాను." అన్నది శారద.

"సరి. సరి. చదువుల్లో పడ్డవాళ్లకు మీకు వంట చేయడం చేతకాదు. ఏవో వేపడాలుచేతనా నేమో? మీ నాజూకు వేపడం ముక్కలూ, మడీ మైలా లేని వంటలూ నాకు సరిపడవు తల్లీ? వంటేదో నేను చేసుకొంటాను. నీ పనులేవో నీవు చూచుకో" అన్నది అత్త.

"మా యింటకూడా మా అమ్మకు చాలా ఆచారం నాకూ అలవాటయింది. నేనూ మడికట్టుకొనే వంటచేస్తాను. నాకూ వంటచేతనౌను. మా అమ్మకంటెకూడా నేను బాగా వంట చేయగలనని మాఅన్నయ్య మెచ్చుకొంటాడు" అన్నది శారద.

"అవునమ్మా! శారద అన్ని విధములైన కూరలూ వండగలదు. కమ్మని కట్టుచారు, సాంబారు పెట్టగలదు. మైసూర్ పాక్, జాంగ్రీ మొదలయిన పిండివంటలుకూడా చక్కగా చేయగలదు" అన్నాడు ప్రభాకర్.

"మంచిది నాయనా మంచిదీ" అంటూ తల్లి స్నానానికి వెళ్లింది.

శారద పెరట్లోకివెళ్లి అక్కడ పాత్రలన్నీ తోముకొని లోపల పెట్టినది. ఆతర్వాత స్నానముచేసి మడికట్టుకొని దేవునికి దీపము వెలిగించి వంటలన్నీ ఆశ్చర్యంతోచూస్తూ, చేతి కందినపని ఏదో చేస్తూఉన్నది. ప్రతి విషయములోను అడగవలసిన అవసరమున్నా లేకపోయినా ఇలా చేయనా, అలా చేయనా, అని శారద అత్తగారిని సలహా అడుగుతూ అతి వినయంతోను, కలుపుగోలుతనంతోను, మాటలాడుతూ ఉండడం చూడగా అత్తగారికి శారదయెడల నుండిన దురభిప్రాయం మారుతూ వచ్చింది. శారద చదువుకొని పెద్ద పరీక్షలలో నెగ్గుతూ ఉంటుందనీ వంట మొదలయిన ఇంటి పనులు ఏవీ చేతకావనీ, తనయెడల లక్ష్యం లేకుండా ధిక్కరిస్తూ ఉంటుందనీ—ఇల్లా ఏవేవో దురభిప్రాయాలతో ఉన్న ఆ అత్తగారికి కోడలి చర్యలన్నీ విపరీతంగా కనబడినవి.

"చదువులో పడిఉన్న దానవు ఈ పనులన్నీ నేర్చుకోటానికి నీకు అవకాశ మెక్కడ దొరికింది. ఈ శ్రద్ధ ఎట్లా కలిగింది!" అని అత్త అడిగింది కూడాను.

"నాకు చిన్నప్పుడే అలవాటు పడ్డాయి అత్తా! ఇంటి పనులు చేయడమంటే నాకు విపరీతమైన సరదా, అదిగాక మా అమ్మకూడా నాకు రాకపోతాయేమో అని అన్ని రకాల వంటలు నేర్పింది. ఆవిడకుకూడా మడీ తడీ ఆచారం పూజా పురస్కారం అన్నీ ఉన్నవి. నేను బడినుండిరాగానే కట్టుకున్న బట్టలు విప్పి వేరే ఉంచి వేరే దుస్తులు ధరించుకోమనేది" అన్నది శారద.

"నాకు చాలా సంతోషము" అన్నది అత్త.

వంట పూర్తికాగానే "మణీ, మణీ మీ అన్నయ్యగారిని మడికట్టుకోమను. నీవుకూడా రా భోజనానికి. మీరుకూడా కూర్చోండి అత్తయ్యా మీరు ముగ్గురూ భోజనం చేయండి నేను వడ్డిస్తాను" అన్నది శారద.

"అయ్యో! నేను కూడానా? పొద్దంతా రైలు ప్రయాణం చేసి బడలి ఉన్నదానవు. వచ్చీరాగానే విశ్రాంతి అయినా లేకుండా కష్టపడి వంటచేశావు. వడ్డనకూడా చేసి మా భోజనాలయినదాకా ఉండి భోజనం చేస్తావా? చాల్చాలు. నీవు కూచో అబ్బాయీ, మణీ, నీవూ ముందుగా భోజనాలు కానీయండి నేను వడ్డిస్తాను.

"నా కింకా ఆకలి కావడంలేదు" అన్నది.

అంతవరకును ప్రభాకర్, మణీ ఇద్దరూ శారద తెచ్చిన పెట్టెలు గోడలకు కొట్టి గది ముస్తాబుచేస్తూ సామానులు సర్దుకొంటూ ఉన్నారు. భోజనానికి రమ్మనగానే మడి బట్టలు కట్టుకొని వచ్చారు.

వంట ఇంట్లోకి రాగానే అత్తా కోడళ్లిద్దరు సరదాగా కబుర్లు చెప్పుకొంటూ నవ్వుకొంటూ ఉండడం జరుగుతోంది.

"ఏమిటో విపరీతం!" అనుకున్నాడు ప్రభాకర్.

"వంటంతా కోడలే చేసిందిరా అబ్బాయి అందులో నన్ను వేలయినా పెట్టనీయలేదు" అన్నది అత్త.

"సరిసరి నేను చేశానన్న పేరేకాని అన్నీ అత్తగారు చెప్తూ ఉంటేనే నేను చేయగలిగాను. వంటలో ఏమి లోపాలున్నా అవి నా చేతకానితనంచేత కలిగినవనుకోవాలి. మంచి ఏమున్నా అత్తగారి సలహావల్ల కలిగిందనే అనుకోవాలి" అన్నది కోడలు.

"ఐతే ఎల్లా ఉంటుంది వంట"? అన్నది మణి.

"తినబోతూ రుచి అడగడమెందుకు"? అన్నది శారద.

నీవుకూచో అంటే మీరు కూచోండని వాదించుకొని అత్తా కోడళ్లిద్దరూ ముందుగా అన్నా చెల్లెళ్ల భోజనాలు కానిచ్చారు.

"అమ్మ చెప్పగా
వదిన వంటగా
అన్నా, నేనూ తిన్నాము
అంతా బాగుందన్నాము" అని మణి పాడింది.

"అబ్బో! మణికి కవిత్వం వచ్చునే, మధురమైన కంఠం బాగా పాడుతుందే!" అన్నది శారద.

"అమ్మా వదిన వీణ తెచ్చుకుంది బాగా వాయిస్తుం దట! బాగా పాడుతుందట! అన్నయ్య చెప్పాడు."

"మంచిదమ్మా మంచిది. వదిన దగ్గర కూర్చుండి చదువు నేర్చుకో, పాట నేర్చుకో, ఇంగ్లీషు చదువులు అక్కర లేదుగాని, తెలుగు పుస్తకాలు, భాగవతం, రామాయణం చదువుకో" అన్నది అమ్మ.

"వదినా అమ్మ కెన్నో పూర్వకాలపు పాటలు—లంకా యాగం, కుచేలకథ, గంగాగౌరీ సంవాదం ఎన్నో వచ్చును." అన్నది మణి.

"చాల్చాలులే ఆ పాటలు ఇప్పటివాళ్లకు నచ్చవు."

"అలా కాదండోయి అత్త! ఈ పాటలమీద మళ్లీ మనవాళ్లకి ఆదరం ఎక్కువయింది. విజయవాడ రేడియో వాళ్లు ఈ పూర్వకాలపు పాటలు కావాలంటున్నారు, నాకు నేర్చుకోవాలని ఉంది చెప్పండి అత్తయ్యా నేర్చుకొంటాను." అన్నది శారద.

"నేనేమో అనుకున్నాను. నా కోడలు చాలా మంచి పిల్ల" అని తనలో తాను సంతోషించింది.

అత్తా కోడళ్లూ ఒకరియెడల నొకరు ఆదరానురాగాలు కలవాళ్లయినారు. ప్రభాకర్ ఆనందపూరితుడయినాడు.



ఆంధ్ర మహిళాసభ బ్రాంచ్ హాస్టల్ 14 ద్వారకాలో, ఉదయము, సాయంకాలముగూడ హిందీ ప్రాథమిక, మాధ్యమిక, రాష్ట్రభాష పరీక్షలకు శిక్షణ జరుగుచున్నది. చేరగోరువారు వివరములు తెలిసికొన వచ్చును.

అ. చన్నఘంటమ్మ.

# ఆంధ్ర మహిళా సభలో
# సభ్యురాండ్ర కార్యకలాపాలు

## సర్వసభ్య సమావేశము, ట్రస్టీల మీటింగు

ది 7-1-1951 సాయంకాలం 5 గంటలకు ఆంధ్ర మహిళాసభ సర్వ సభ్య సమావేశం శ్రీమతి దుర్గాబాయమ్మ గారి అధ్యక్షతను జరిగినది. రమారమి 150 మంది సభ్యురాండ్రు సమావేశమునకు వచ్చిరి. 31-5-1950 తో ఆఖరైన వివిధ శాఖల జమాఖర్చుల ఆడిటెడ్ నివేదికలు, కార్యనివేదికలు కార్యదర్శినులు చదివినవి విని, సభ్యురాండ్రు ఏకగ్రీవముగ నామోదించిరి.

శ్రీమతి జమునాబాయిగారు ట్రస్టు బోర్డులో సభ్యురాండ్ర ప్రతినిధిగను, శ్రీమతులు కస్తూరి రుక్మిణమ్మగారు, అచ్యుతుని గిరిజగారు, రత్నాల కమలాబాయిగారు, టి. జి. హైమవతిగారు, సి. రత్నావళిగారు, వరుసగా క్లబ్బు, సారస్వత, కళా, గ్రంథాలయ, క్రీడాశాఖలకు కార్యనిర్వాహక వర్గ సభ్యురాండుగా ఎన్నుకొనబడిరి. శ్రీమతులు గౌరీ సుబ్బయ్యనాయుడు, కమలామణి, రంగ నాయకమ్మ, కమల, సంపూర్ణమ్మ, లక్ష్మీకాంతమ్మ, స్వర్ణమ్మ, శకుంతలమ్మ, అహల్య, జయలక్ష్మి, లక్ష్మీరఘురామ్, వెంకుబాయమ్మ గారలు, సబ్ కమిటీ సభ్యురాండ్రుగ ఎన్నుకొనబడిరి.

అనంతరం జరిగిన ట్రస్టీల సమావేశంలో సర్వసభ్య సమావేశంలో ఆమోదించిన నివేదికలు జరిపించిన ఎన్నికలు, అమోదించబడినవి.

* * *

## కేంద్ర పరిశ్రమలశాఖ మంత్రి శ్రీ హరికృష్ణ మెహతాబ్ గార్కి సన్మానము.

7-1-51 తే. సాయంకాలం 7 గంటలకు గౌరవనీయులు శ్రీ హరికృష్ణ మెహతాబ్‌గార్కి ఆంధ్ర మహిళాసభలో సన్మానము జరిగినది. విద్యార్థినుల గౌరవ వందనం, ట్రస్టీలు, కార్యనిర్వాహకవర్గ సభ్యురాండ్ర పరిచయము, అయిన తరువాత స్థానిక పారిశ్రామికశాఖ మంత్రి శ్రీ పెరుమాళ్ స్వామి రెడ్డియారుగారు, పరిశ్రమలశాఖ డైరక్టర్ శ్రీ ఎస్. టి. రాజు గారితో కూడి, కేంద్ర మంత్రి పారిశ్రామికశాఖ విద్యార్థినుల నేత పరిశ్రమ ప్రదర్శనమును చూచెను.

విద్యార్థినుల నాట్య ప్రదర్శనము అయిన తరవాత శ్రీమతి చన్నఘంటమ్మగారు వినతి పత్రమును సమర్పించుచూ సభ కార్యకలాపములను క్లుప్తముగా విన్నవించి, బీదస్త్రీల సహాయార్థం ఆంధ్ర మహిళాసభ యాజమాన్యమున, ఒక కుటీర పరిశ్రమల వుత్పత్తి కేంద్రం స్థాపింపనున్నారనియు, దానికి తగినటువంటి ఆర్థిక సహాయము కేంద్ర ప్రభుత్వం యివ్వవలసిన దనియు, కుటీర పరిశ్రమల అభివృద్ధికై కేంద్ర ప్రభుత్వం ఏర్పరచిన విత్తమును తిరిగి ప్రభుత్వ పరిముఖంగా కొన్ని క్రొత్త సంస్థల ఏర్పాటుకై వినియోగించక యిదివరకే కొన్ని సేవాసంస్థలు వ్యవస్థాపనజేసి ఆర్థిక కష్టముచే పూర్తిగ నిర్వహించలేకున్న కృషికి తోడ్పడుట పరస్పరం యిటు ప్రభుత్వమునకు, అటు సేవా సంస్థలకు, కూడా లాభ దాయకమే గనుక యిట్టి సంస్థల పోషణ ప్రధాన విషయ ముగా ప్రభుత్వము ఈ పరిస్థితులలో గుర్తించవలసినదనియు విన్నవించిరి.

మంత్రిగారు బదులు చెప్పుచూ కుటీర పరిశ్రమల విషయంలో కృషిచేయుచున్న సంస్థలకు వలసిన ధన సహాయం చేయుటకై ప్రభుత్వం యిదివరలోనే నిర్ణయించి యున్నారనియు, ప్రభుత్వం పరిముఖంగా క్రొత్త సంస్థలు నిర్మించే ఆలోచనలేవీ యిప్పుడు జరుగుటలేదనియు చెప్పిరి. శ్రీమతి దుర్గాబాయమ్మగారు మంత్రిగార్కి వందనము లర్పిస్తూ, అనాథలై, నిరాధారలై ఆర్థికముగా అతిహీన దశలోనున్న యువతులకు గౌరవనీయమైన వృత్తిని కల్పించాలన్నా, వారిని నైతిక పతనాన్నుండి రక్షించాలన్నా ఈ కుటీర పరిశ్రమలలో శిక్షణనిచ్చి, శిక్షణ పొందినవారిచే ఉత్పత్తి కేంద్రాలలో పనిచేయించి వారికి జీవనోపాధిని కల్పించుట నేడు ప్రధాన సమస్యలయినవి. ఈ సమస్య పరిష్కారానికై పూనుకొన్న ప్రతి సంస్థను పోషించుట ప్రభుత్వంయొక్క కర్తవ్యం అని చెప్పిరి. మంగళగానముతో సభ ముగిసినది.

* * *

## రిపబ్లిక్ దినోత్సవము

26-1-51 నాడు సాయంకాలము మహిళా సభ సభ్యురాండ్రు, విద్యార్థినులు కలిసి రిపబ్లిక్ ప్రథమవార్షికోత్సవము జరుపుకొనిరి. శ్రీ బొబ్బిలి రాజాకుమార్తె శ్రీమతి ఇందిరాదేవిగారు పతాకా విష్కరణము చేసిరి. జండావందనానంతరం శ్రీమతులు చెల్లాయి భారతులు, జాతీయగీతములు పాడిరి. సమావేశపు అధ్యక్షురాలైన శ్రీమతి అల్లాడి వెంకటలక్ష్మిగారు ఉపన్యసిస్తూ, స్వాతంత్ర్యసముపార్జనకు కారణభూతుడైన, ధర్మనాయకుడైన మహాత్ముని స్మరించి, వారి యాజ్ఞానువర్తులై స్వాతంత్ర్య గథమును నడిపించి కృతార్థుడైన సర్దార్ పటేలును స్మరించి, ప్రస్తుతంలో నెహ్రూ ప్రభుత్వములో జరుగు చున్న లోటుపాట్లకు, అందని ఫలితాలకు, కేవలం ప్రభుత్వమును మాత్రమే నిందించక, ప్రజలు తమలోగల లోటుపాట్లను సవరించుకుని, బ్లాక్‌మార్కెటు మొదలగు నీచవృత్తులను విడనాడి, ప్రభుత్వముతో, పరిపూర్ణముగా సహకరించవలసిన బాధ్యత యున్నదిగనుక, ధర్మపరాయణుడగు గాంధీ మహాత్ముని ఆదేశములే మనము గుర్తుంచుకుని, జీవితములను ధర్మమార్గములో గడుపవలెనని చెప్పిరి.

వందన సమర్పణ, జనగణ మనగానముతో సభముగిసినది.

* * *

## సర్వోదయ దినము

జనవరి 30-తేదీ రాజాజీహాలులో జరిగిన అఖండ సూత్రయజ్ఞంలో, మహిళా సభ విద్యార్థినులు కూడ పాల్గొనిరి. తరువాత 3 గం॥ నుండి, 7 గం॥ వరకు సభ ఆవరణలో సూత్రయజ్ఞము, భజన జరిపించిరి.

* * *

## హిందూ కోడ్

హిందూ ధర్మశాస్త్ర క్రోడీకరణను గూర్చి యూనియన్ పార్లమెంటులో ఫిబ్రవరి మొదటి వారంలో చర్చజరుగబోతూఉంది. ఆకారణంచేత, అటు సనాతనులు, ఇటు ఆధునికులు చేయుచున్న తర్కవితర్కముల నడుమ దారి తోచక అతిసందిగ్ధావస్థలో నలుగుచున్న సామాన్య స్త్రీల ఉపయోగార్థము, మహిళా సభలో యీ క్రోడీకరణకు సంబంధించిన విషయములు, విషయ పరిజ్ఞానముగల ప్రముఖులు చర్చించు ఏర్పాట్లు చేయబడినవి—జనవరి నెలలో దీనిని గూర్చిన 3 చర్చలు జరిగినవి. చెన్నపురిలో అమలు జరుపబడిన బహుభార్యాత్వ నిషేధ చట్టము, విడాకుల చట్టములవల్ల స్త్రీలకు వర్తమానంలోనూ ఇంకభవిష్యత్తులోనూ, కలుగనున్న యిక్కట్లను, అసౌకర్యములను గూర్చి, బళ్లారిలో ప్రఖ్యాత న్యాయవాదియైన శ్రీ సత్యవంతరావుగారు కోర్టులో తమకు కలిగిన ప్రత్యేక అనుభవములను పురస్కరించుకొని ఉపన్యసించిరి.

శ్రీమతి కామరాజు కృష్ణమూర్తి, హైకోర్టు ఎడ్వొకేటుగారు, హిందూ ధర్మశాస్త్ర క్రోడీకరణయొక్క ఆవశ్యకతయు, దానియొక్క ప్రస్తుత స్వరూపము, దానిలో ఆధునికులు కావలెననుచున్న మార్పుల స్వరూపమును గూర్చి క్లుప్తముగా వివరించిరి. ఇక మీదట క్రమముగా వారు, ఈ క్రోడీకరణయందలి స్త్రీలకు సంబంధించిన ముఖ్య విషయములను ఒక్కొక్కటిగా ఒక నిదాన ఉపన్యాసములలో వివరించెదరు.

యూనియన్ పార్లమెంటు డెప్యూటీ స్పీకరుగారు శ్రీ అనంతశయనం అయ్యంగారు ఈ ధర్మశాస్త్రమందలి సమిష్టికుటుంబము యొక్క పూర్వ స్వరూపము యొక్క ఔచిత్యాన్ని, గూర్చియు, స్త్రీలకు ఆస్తి హక్కు తండ్రి ఆస్తిలోకన్న భర్త ఆస్తిలోసగ భాగముగా ఏర్పాటు చేయుట మంచిదనియు, బహు భార్యాత్వము శాసన రీత్యా నిషేధించవలసిన దేయనియు, విడాకుల విషయమైయిప్పుడు శాసనములు చేయక ఇంకా కొంతకాలము ఆపుజేసి, అప్పటి పరిస్థితులకు, మనమనో పరివర్తనలకు అనువుగా వలసినచో అట్టి చట్టము చేయించవచ్చుననియు ఉపన్యసించిరి.

స్త్రీలలో యీ ధర్మశాస్త్రము నిజమైన స్వరూప మొక్క విజ్ఞానమును పెంపొందించుట యీ ఉపన్యాసముల యొక్క ముఖ్యోద్దేశముకనుక, ద్విపక్షవాదులు, యీచర్చలలో పాల్గొనివారి అభిప్రాయాలను తెలియజేసే అవకాశాలు కల్పింపబడును—సందర్భపడినచో, వచ్చేనెల ఆంధ్ర మహిళలో జరిగిన ఉపన్యాసము లందలి ముఖ్యాంశములు ప్రచురింప బడును—

★

# అశోకా టాయిలెట్ పౌడరు

మీరు అనేక విధములైన పౌడర్లను ఉపయోగించి ఉండవచ్చును. ఈ మా అశోకా టాయిలెట్ పౌడరును కూడా ఒకసారి వాడి చూడండి. దీనిని వాడినచో ముఖమునకు చక్కని అందము నిచ్చును. చర్మము నును పుగా, నిగనిగలాడునట్లుచేయును. వేసవికాలపు ఉష్ణ తాపము నణచి మీకు హాయి నొసగును.




# అశోకా టాల్కమ్ పౌడరు

ఈ పౌడరును ప్రత్యేకముగా చిన్న బిడ్డల వుపయోగార్థమై మేము తయారు చేసితిమి. మీ బిడ్డలకు దీనిని ఒకసారి వాడి చూడండి. పిల్లలకు దీనిని వాడినచో, పేలుటు, చిడుములు మొదలైనవి లేకుండ, చర్మమును పరిశుభ్రముగా నుంచును.

అశోకా మార్కును గమనించి కొనవలయును.



పండిత డి. గోపాలాచార్యులవారి

# అరుణా

గర్భాశయ రోగనివారిణి

సౌఖ్య రహితమైన తల్పముపైన గిజ గిజ లాడించే నొప్పులు మాయమవగానే, ఉషా యామంవలె సూర్యుని తో పాటు తల్పంనుంచి లేవడం స్త్రీలకు ప్రీతి కరంగా ఉంటుంది.



ఆయుర్వేదాశ్రమం లిమిటెడ్
మదరాసు 17.

# విద్యార్థినుల కార్యకలాపాలు

## అల్పాహారవిందు

6—1—'51 శనివారం సాయంకాలం, 4 గంటలకు. కాశీహిందూ విశ్వవిద్యాలయపు పరీక్షలకు వెళ్లు, సీనియర్ ఇంటర్, సీనియర్ ఎడ్మిషను తరగుతుల విద్యార్థినులకు, జూనియర్ తరగతులవారు, వీడ్కోలు విందును ఏర్పాటు చేసిరి. సభ అన్నిశాఖల విద్యార్థినులు, ఉపాధ్యాయినీ ఉపాధ్యాయులు, ట్రస్టీలు, కార్యనిర్వాహక సభ్యురాండ్రు, ఆహ్వానింపబడిరి. పరస్పరం అభినందన వీడ్కోలు వాచకములుకాగా, విద్యార్థినుల కోర్కెపై శ్రీమతి దుర్గాబాయి గారు కొన్ని ఉపదేశ వాక్యములు పల్కుచూ—

ఈ విద్యార్థిదశలో, ధైర్యస్థైర్య పటుత్వములతో కూడిన శీలము నలవరచుకొనుటయే మీ ప్రధాన ఆశయముగా నుండాలి. కేవలం డిగ్రీసంపాదన, అనంతరం వృత్తి సంపాదన మాత్రమే మీ ఆశయములు కాకూడదు. దేశ కాల పరిస్థితులనను సరించి, ప్రస్తుతము రాజకీయంగా మనకు లభించిన స్వేచ్ఛా స్వాతంత్ర్యములను, ఓటింగ్ హక్కును పురస్కరించుకొని, సంఘానికి, దేశానికి ఏవిధంగా తోడ్పగలమా అనే దృష్టి తోనే విద్యాభ్యాసన జరగాలి. ప్రతి విద్యార్థినీ హిందీ నేర్చుకోవాలి. వార్తా పత్రికలు ప్రతి దినమూ చదివి ప్రపంచ విషయాలను తెలిసికోవాలి. ఎవరింటువారు యితర ప్రమేయం లేకుండా సుఖంగా ఉందామనుకునే రోజులు కావివి. ప్రపంచములో ఏమూల యుద్ధము జరిగినా, ఎక్కడ అశాంతిప్రబలినా, దానియొక్క విషమ ఫలితాలు మనకు కలుగుతాయి. అందువలన కేవలం ఉన్నత శ్రేణిలో ఉత్తీర్ణులు కావలెనని పుస్తకాలు చదువుతూనే మీరు సంతృప్తిపడక, విశాలమైన విజ్ఞానమునలవరచు కోటానికి, ప్రపంచ పరిస్థితుల నొకకంట పరికిస్తూనే ఉండాలి. మీరల వరచుకొన్న విజ్ఞానమును ప్రచారము చేయుటకూడ మీ విధాయకముగా స్వరించి, ప్రతి ఒక్క విద్యార్థినీ కనీసము మరియొక యువతినైనా విద్యావతినిగా చేయవలెననెడి దీక్ష పూని వర్తించినచో, మన దేశములోని స్త్రీలందరూ విద్యావతులు కాగలరు—అని చెప్పిరి. జనగణ మనమంగళ గానముతో సభ ముగిసినది.

* * *

## హాస్టలు వార్షికోత్సవము

15—1951, సోమవారము సాయంకాలము, మహిళా సభ వసతిగృహపు ఐదవవార్షికోత్సవమును బాలికలు జయ ప్రదముగా జరిపించిరి. చిన్న పిల్లలు అస్పృశ్యత కూడదని నీతినిబోధించే చిన్న నాటకమును ముద్దుగా ప్రదర్శించిరి. పెద్దవారు 'అద్దముమీద ఆవగింజ' యను రూపకమును అతిసమర్థతతో నటించి, సమావేశమైన సభికులకు వినోద మును గూర్చిరి.

ప్రదర్శనయనంతరము, శ్రీమతి యశోద వసతి గృహము నకు 5 సంవత్సరములు విజయవంతముగ గడచినవనియు, దినదినాభి వృద్ధియగుచున్న యీ సంస్థకు యింతలోనే ఒక శాఖ ఏర్పడ్డదనీ, రెండిటుజేరి 75 గురు నివసించుచున్నారనీ చెపుతూ జాతిమతకుల వివక్షతలను, ఆర్థిక భేదములను విస్మరించి, అందరూ తోబుట్టువులవలె అతిప్రశాంతముగా జీవించు నవకాశములు తమవసతి గృహములో కలవనియు, ఇందుకు కారకులు అధికారిణులైన శ్రీమతి జమునాబాయి, కమలా బాయిగార లేననియుచెప్పి, ఇట్టి సదాశయములతో గూడిన సంస్థను స్థాపించి ఎంతమంది యో యువతులకు బాలికలకు, విద్యాభ్యాసనావకాశములను కల్పించిన శ్రీమతి దుర్గా బాయమ్మగారికి యావదాంధ్ర దేశమూ కృతజ్ఞత కలిగియుం డాలని చెప్పెను.

జనగణ మన గానముతో సభ ముగిసినది.



# మహిళా లోకం

## స్త్రీ జనాభ్యున్నతికి విద్యావశ్యకత

డిశెంబరు 31-వ తేదీ హైదరాబాదులో స్త్రీ జనాభ్యున్నతికి విద్యావశ్యకతనుగురించి బొంబాయి రాష్ట్రంలో విద్యావతిగా, విద్యావేత్తగా పేరొందిన శ్రీమతి యమునా బాయి హిర్లేకర్ అచ్చట జరిగిన అఖిలభారత విద్యా విషయక మహాసభ మహిళా శాఖకు అధ్యక్షత వహించిన సందర్భంలో మాట్లాడుతూ, స్త్రీలకు సౌమ్యదితనాన్ని, సుకుమారాన్ని గౌరవ మర్యాదలను గరపడానికి సమర్థమైన విద్య అవసరమని చెప్పేరు.

స్త్రీలు పూరికే చదవుట, అర్థము చేసికొనుట. నేర్చిన చాలదు. చేతిపనుల ద్వారా, లలితకళల ద్వారా తాము తెలిసికొన్నదానిని అభివ్యక్తం చేయగల శక్తి వారికి అలవడేటట్లు చూడాలని ఆమె అన్నారు.

జరిగిన 50 సం||రాలుగా స్త్రీలలో కనపడుచున్న విద్యాభివృద్ధి సూచనలకు ఆమె సంతోషించిరి. కాని ఒక జీవిత మార్గావలంబ నోద్దేశంవారిలో ప్రబలిన కారణంగా కుటుంబాలు తల్లక్రిందు లౌతున్నందుకు, స్త్రీలు అట్లా ప్రవర్తిస్తున్నందుకు ఆమె విచారించిరి.

## రాజమండ్రీ ఆంధ్ర యువతీ సంస్కృత కళాశాల

రాజమండ్రిలో ఆంధ్ర యువతీ సంస్కృత కళాశాలలో శ్రీ అత్యం నరసింహమూర్తిగారు యం.ఎ., (న్యూయార్కు) కరెస్పాండెంటుగా నియమింపబడిరి. శ్రీ నరసింహమూర్తి గారు తమపదవిని స్వీకరించిన సందర్భములో కళాశాల పిన్సిపాల్ (ప్రధాని) శ్రీమతి బత్తుల కామాక్షమ్మగారు ఉపాధ్యాయులను, విద్యార్థినులను, శ్రీ నరసింహమూర్తి గార్కి పరిచయమొనరచిరి. శ్రీ నరసింహమూర్తిగారు ప్రాచీన భారత నారీమణుల, ఔన్నత్యాన్ని, వైదుష్యాన్ని, అమెరికాలో తాము గడించిన అనుభవాన్నిగురించి ప్రసంగించిన పిమ్మట, ఉత్సాహంతో పట్టుదలతో పవిత్ర ఆశయములను కలిగి ఈ సంస్థను నడిపించినచో, ఆంధ్ర యువతీ సంస్కృత కళాశాల యావదాంధ్రమునకు స్త్రీల విశ్వవిద్యాలయముగా కూడా తయారుకాగల అవకాశమున్నదని చెప్పిరి. కమిటీసభ్యులు, కళాశాల ఉపాధ్యాయులు, విద్యార్థినులు, అందరు పూర్తిగా సహకరించినచో శక్తి వంచనలేకుండా కళాశాల అభివృద్ధికి తోడ్పడెదమనిరి. తరువాత శ్రీమతి అత్యం సత్యవతీ దేవిగారు మాట్లాడుచూ, కళాశాలాభివృద్ధికి పాటుపడగలమనిరి. సోలస బాపయ్య, బచ్చు సత్యానందం గారలు శ్రీ నరసింహమూర్తిగారి గుణ గణములను ప్రశంసించిరి. వైస్ ప్రిన్సిపాల్ టి. మల్లికార్జున రావుగారి ధన్యవాదములతో సభముగిసెను.

* * *



శ్రీమతి చింతపల్లి సత్యగుణవతీ దేవిగారు.

వీరు దేశారాధకులైన, శ్రీ బిరుసుమంతి సింహాచలముగారి పుత్రిక. ఆల్ ఇండియన్ నేషనల్ ట్రేడు యూనియన్ కాంగ్రెసు, ఆంధ్రశాఖ కార్యదర్శి శ్రీ బి. జి. యం. ఏ. నరసింగరావుగారి సహోదరి.

అత్యధికమైన వోట్లతో విశాఖ జిల్లాబోర్డు సభ్యురాలుగ గెలుపొందిరి.






## రవీంద్రుని ఆరునాటికలు :

అనువాదకులు శ్రీ బెజవాడ. గోపాలరెడ్డిగారు :
గురుదేవ మండలివారి ద్వితీయ పుష్పం.
దొరుకు చోటు (త్రివేణి పబ్లిషర్సు) మచిలీపట్టణం :
వెల - రూపాయన్నర.

ఏ గ్రంథాన్నైనా మాతృకనుంచి అనువదించేటప్పుడు, మాటమాటికి, వాక్యానికి వాక్యం సరిగ్గా అలాగే ఉండేటట్లు తర్జుమాచేయనక్కర్లేదు. అలాచేయడం కష్టంకూడా. నిపుణుడైన అనువాదకుడు మూలగ్రంథం బాగా అర్థంచేసుకొని, అసలు భావం చెడకుండా, మంచిశైలిలో మనోరంజకంగా రసముప్పిస్తూ వ్రాస్తాడు. అచ్చంగా ఈ పద్ధతిలోనె శ్రీ బెజవాడ. గోపాలరెడ్డిగారు రవీంద్రుని "కాహిని" అను వంగ కావ్యంనుండి "ఆరునాటికలు" చక్కగా తెనిగించారు.

ఈ "ఆరునాటికలు" గత అయిదారేండ్లలో "సమత" "కృష్ణా పత్రిక" "భారతి" ల్లో ప్రచురించ బడ్డాయని శ్రీ గోపాలరెడ్డిగారు ప్రస్తావనలో చెప్పారు. అయినప్పటికిని ఈ "ఆరునాటికలు" చక్కని రూపంలో, మంచి కాగితంమీద శుభ్రమైన అచ్చులో ఒక పుస్తకరూపంతో మన కందజేసిన అనువాదకులను, గురుదేవ గ్రంథమండలి వారిని, ప్రకాశకులను, అభినందించాలి.

ఈ పుస్తకం మొదటి అధ్యాయం గాంధారి ఆవేదనలో- పుత్రుడు దుర్యోధనుడు పాండవుల కన్యాయం చేసిన పాపి యని, సామాన్య మానవునకు ఈతప్పుకే ఏశిక్ష విధిస్తారో అదే శిక్ష తన పుత్రునికి విధించి ధర్మం కాపాడమని ధృతరాష్ట్రుని గాంధారి వేడుకొంటుంది. దుర్యోధనుడు చేసింది తప్పని తెలిసి కూడా, పుత్రునిపై మమకారంతో ధృతరాష్ట్రుడు అలా చేయలేనంటాడు. గాంధారి ఆవేదన బూడిదలో పోసిన పన్నీరవుతుంది. ఈ అధ్యాయంలో గాంధారీ ధృతరాష్ట్రుల సంభాషణ చాల బాగాఉంది. గాంధారి పాత్ర సమంజసంగా చిత్రించారు.

రెండవ నాటికలో "సహగమనము" ఒక విషాద గాథ. సంఘదౌర్బల్యంతో తల్లే, తనకుమార్తె ప్రేమించి స్వతంత్రంగా పరరాజుతో చేసుకొన్న మతాంతర వివాహాన్ని నిందిస్తుంది. కూతుర్ని దూషిస్తుంది. బలాత్కార సహగమనం చేయిస్తుంది—తండ్రిమాట లెక్క చేయకుండా ఎన్ని కష్టాలొచ్చినా స్త్రీ హృదయం అచంచలమని, ఆమె ప్రేమ నిష్కళంక మయినదనీ యీ నాటిక నిరూపిస్తుంది.

కడపటి నాటిక "కర్ణ—కుంతీ సంవాదము" లో మాతృహృదయాన్ని మనోరంజకంగా చిత్రించారు. నిజంగా కర్ణుడు కుంతీదేవికి జ్యేష్ఠ పుత్రుడు. ఆ ప్రేమతోనే, కర్ణుని కౌరవుల సేనవదిలేసి పాండవులతో జేరి యుద్ధానంతరం విజయ గర్వంతో సింహాసన మెక్కమని, కుంతీదేవి ఉద్బోధిస్తుంది. నిరాధారంగా విసర్జించిన పసికందు పెరిగి పెద్దయై ఎట్టి భుజ పరాక్రమంతో తేజరిల్లుతున్నాడో అని కుంతి మాతృ హృదయం గర్విస్తుంది. నమ్మికొన్న కౌరవులను మోసగించి రాజసింహాసనంకొరకు రాలేనని, కర్ణుడు పాండవ పక్షం చేరడానికి నిరాకరిస్తాడు. "జన్మదినమున పేరు పెట్టక, ఇల్లుచేర్చక నీటిపై నెట్టిపోయితివి. అదేరీతి నేడును కాంతివాడిన, కీర్తితగ్గిన, పరాభవ ప్రవాహమున మమువిడని

చిత్తములో నన్ను విడిచిపొమ్ము" అని కర్ణుడన్న వాక్యం చాలా సమంజసంగా ఉంది. కుంతీదేవి కర్ణునికి అన్యాయం చేసిందని నిరూపిస్తుంది—ఈ నాటిక చదువుతూంటే ఆనందంగా ఉంటుంది.

"భావ-చంధము" ను గూర్చి వాల్మీకి నారదుల సంవాదము, "పతిత" "నరకవాసము" అను నాటికలు అంత యింపుగా లేకపోయినప్పటికీ, కాలక్షేపానికి చదవుకోడానికి ఉపయోగిస్తాయి.

కొన్ని నాటికలలో సంస్కృతమాటలు చాల వాడినారు. కొంచెంతగ్గించి, కొంత సులభశైలిలో అనువాదం చేసియుంటే పుస్తకంమొత్తం మీద చదవడానికి రసవత్తరంగా అందరికీ అందుబాట్లో ఉంటుంది.

చివరన ఒక్కమాట—వంగ మాతృకనుండి ఈ నాటికలను తాము "రాయవేలూరు జైలులో డిటెన్యూగ నున్నపుడు అనువదించితిన" ని శ్రీ గోపాలరెడ్డిగారు ప్రస్తావనలో చెప్పారు. గాంధీ నెహ్రూలు జైల్లో ఉండగా అనేక పుస్తకాలు వ్రాశారు. ప్రపంచఖ్యాతి పొందారు. ఇంకా చాలమంది మననాయకులు అలా చేయగల్గారు. కాని పదవుల్లో ఉంటే సారస్వత ప్రపంచానికి దూరమై పోతూ ఉంటారు. మంచిమంచి గ్రంథాలు తీరుబడిగా వ్రాయడానికి వీలుండదు. సారస్వత సేవ చేయడానికి తగిన వ్యవధీ ఉండదు. కాబట్టి మననాయకులు ఏడాదికొక మూడు నెలలైనా తమంతటుగా తాము "జైల్లో" లో (ఏకాంతంగా) ఉంటూంటే బాగుంటుందేమో! ప్రమాదం లేదు. పాఠకులకు మంచి ఆశయాల్ని, సరియైన "ఆహారాన్ని" అందజేస్తూ ఉంటారు, - అంతే!

గిడుగు లక్ష్మీకాంతమ్మ.

## దీక్షిత దుహిత !

రచయిత : శివ శంకరశాస్త్రి.

వెల : రుపాయి పావలా.

ప్రతులకు : సాహితీ సమితి, రేపల్లె, గుంటూరు జిల్లా.

భారతదేశం సకల ధర్మశాస్త్రాలకు పుట్టినఇల్లు. ఆచార, వ్యవహారాలలో ఈ నాటికి ఏ విషయంలో చూచినా ఏదో కొద్ది మార్పులు చేసికొని కాలాను గుణముగా భారతీయులు నడుచు కొనుచున్నారు, కాని సాహసించి ఒక ఆచారాన్ని, ఒక ధర్మాన్ని అనుకొన్నపాళంగా మార్చలేకుండా ఉన్నారు! దీనికి కారణం ఈ నవయుగంలో సహితం మన సాంప్రదాయాలను మార్చుటకు విద్యావంతులు, వెనుకంజ వేస్తున్నారు.

భారతదేశంలో ప్రాచీన కాలంనుండి స్త్రీ సమస్య చూస్తే అనేకవిధాల అణగారిపోయి ఉన్నది. స్త్రీ సమస్యలలో నేటికి కూడా ప్రాచీన కాలంలాగే ఉండి పోయాయి. ముఖ్యంగా "వితంతు సమస్య". బాల్య వివాహాలు చేసి తత్ఫలితంగా దురదృష్టవశాత్తు బాలికలు లోకజ్ఞానం తెలియక మునుపే వితంతువులవటం జరుగుతూ వచ్చింది. ఈ సమస్యను అనేకవిధాల సంస్కర్తలు సంస్కరించారు. ఆ సమస్యలోనే శివశంకరశాస్త్రిగారు 'దీక్షితదుహిత' అనేచక్కని పద్య కావ్యాన్ని ఏకాంక నాటిక రూపంలో రచించారు.

కథావస్తువు : అప్పయ్య దీక్షితులు పండితుడు అతనికి [illegible], ఉమామహేశ్వరుడు, చంద్రావతంసుడు అనే పుత్రులు. మరకతవల్లి, మంగళాంబ అనే పుత్రికలు ఉన్నారు. మంగళాంబ బాలవితంతువు. మంగళాంబ అంటే అందరికి పంచప్రాణాలు. అప్పయ్య దీక్షితునివద్ద చంద్రమౌళి అనే బ్రాహ్మణ యువకుడు శిష్యుడుగా ఉంటూ కావ్యరచన సాగిస్తుంటాడు. అతడు మంగళాంబను ప్రేమిస్తాడు. తన ప్రేమను మంగళాంబకు తెలియపరుస్తాడు. మంగళకూడా దానికి సమ్మతిస్తుంది. కాని వితంతువైన మంగళ పునర్వివాహానికి అందరు సమ్మతించాలి! మంగళాంబ పిన్ని సరసవాణితో ఈ విషయం చెప్తుంది. సరసవాణి ఈ సమస్యను పరిష్కరించి మంగళాంబను తిరిగి సుమంగళి చేయుటకు పూనుకుంటుంది. తన బావగారైన అప్పయ్య దీక్షితునితో వాదిస్తుంది. దీక్షితులు ఆలోచిస్తానంటాడు. కాని పురాతన, సనాతన ధర్మాన్ని, ధిక్కరించటానికి అతనికి భయం. ఒకవైపు తనపుత్రిక, మరి యొకవైపు ఆర్యధర్మం. అనేక విధాల ఆలోచిస్తాడు. చివరికి ఆర్యధర్మానికి తలవొగ్గుతాడు. చంద్రమౌళిని

పిలచి, అతనిలోకల పూర్వపు కోర్కెలు, వాంఛలు, పరిశుద్ధం చేసికోమంటాడు. తీర్థయాత్రలు చేయమంటాడు. పాపం మంగళ అమంగళగానే ఉండిపోతుంది.

ప్రప్రథమంగా కవి మంగళా, చంద్రమౌళి పరస్పర ప్రేమను ఒకరికొకరు వెల్లడి చేసికొనుటతో ప్రారంభించి చివరగా కూడా చంద్రమౌళి, మంగళాంబకు తన గురువైన అప్పయ్య దీక్షితుని ఆజ్ఞను తెల్పి వారి పరస్పర ప్రేమకు ఈ సంఘం ఒప్పుకో లేదని విషాదంతో తీర్థయాత్రలకు వెళ్ళిపోవటంతో ముగిస్తారు. ఆ విధంగా పాత్రలను ప్రవేశపెట్టి చివరగా నాయకీ, నాయకులు ఏసమస్యతో ప్రారంభంలో మనకు కనిపిస్తారు, అంతంలో ఆ సమస్యకు దూరమౌతారు. ఈ విధంగా ప్రవేశపెట్టటం ఎంతో బాగున్నది. ముఖ్యంగా ఈ కావ్యనాటికలో అప్పయ్య దీక్షితుని పాత్రను సృష్టించడంలో ఎంతో అద్భుతంగా సృష్టించారు. దీక్షితుని మనోభావాన్ని సృష్టించినప్పుడు నిజంగా అటు పితృప్రేమ, ఇటు సంఘభయం వీటిని ఎంతో చక్కగా చూపకలుగుతాడు, అసలు మరకతవల్లితో ప్రసంగించినప్పుడే.

> అదియునుంగాక విపరీతమైన క్రొత్త
> చారిత్రొక్కటి బహు కష్టదాయకంబు

అంటాడు. అతని మనోవీధిలో వృద్ధ బ్రాహ్మణ స్వరమేళ, యువబ్రాహ్మణ స్వరమేళ, వితంతుస్వరమేళ అనేక విధములుగా సంఘర్షణప్రారంభిస్తవి. చివరికి వృద్ధ బ్రాహ్మణ స్వరమేళ విజయంగాంచుతుంది. వృద్ధ బ్రాహ్మణ స్వరమేళ అంటుంది.

> బ్రాహ్మణ సంఘపు బంగరువన్నియ
> నష్టం బగునీ నవ విధానమున
> ఆలోచింపుము అప్పయ దీక్షిత
> ధర్మము ముఖ్యమొ తనూజ ముఖ్యమొ
> బహు కాలముగా ప్రవర్తిల్లు మన
> వృద్ధాచారము విడువంబోకుము!

చివరికి అప్పయ్య దీక్షితుడు సనాతన ధర్మానికే తలవొగ్గుతాడు, సరసవాణితో అంటాడు.

> నీకు హర్షమ్ము కలిగెడి నిర్ణయమ్ము
> గావలంపకు ముందుగా; కారణమ్ము
> అడిగినను బాధపెట్టక అలకించు
> చిన్నదాని వివాహమ్ము చేయజాల!

ఇక చంద్రమౌళి, మంగళాంబ పాత్రలు సృష్టించడంలోను, వారిరువురు తమ ప్రేమను ఒకరికొకరు వెల్లడిచేసికొన్నేటప్పుడు చక్కని భావాలను వారినోటి ద్వారా పల్కిస్తారు. చంద్రమౌళి రచించిన పద్యంలో తన ప్రేమను మంగళకు ఈ విధంగా చెప్పుతాడు.

> అని మిమదుర్లభం బైన యాదివ్య
> మంగళ విగ్రహ మహితహస్తంబు
> గ్రహియించు భాగ్యమ్ము కలుగునేలాగొ!
> పెనగొను సంభ్రమ భీవిస్మయాలు.

మంగళా, చంద్రమౌళి పరస్పర ప్రేమ సంభాషణలు చక్కగా ఉన్నవి. వీరికి సహాయంగా సరసవాణి పాత్రను ప్రవేశపెట్టడం ఆమెచేత వీరి అభిప్రాయాలను అప్పయ దీక్షితునికి చెప్పించడం ఎంతో బాగున్నది. కేవలం సరసవాణియే కాదు, మరకతవల్లి చేతకూడా.

చివరిగా చంద్రమౌళి గురుని ఆజ్ఞప్రకారం పూర్వబంధములు, పూర్వవాసనలను పరిశుద్ధి పరచుకొనుటకు తీర్థయాత్రలకు వెళ్లేముందు మంగళాంబకు చెప్పేటప్పుడు ఈ విధంగా అంటాడు.

> తెలియదు మంగళా, తిరుగ నిచ్చటికి
> వత్సరమ్ములకైన వత్తు నోరానో!
> పూర్వ బంధంబులు, పూర్వ వాసనలు
> ఛేదించి, నాశనచేయు మన్నారు!

అని చెప్పగానే మంగళాంబలో విషాదం చూస్తాము.

> ఇంక నాకేమున్నదీ లోకమందు!
> బ్రదికియున్నను నేను ఫలమేమి కలదు?
> తొలగి పోవగనాదు దుఃఖ భారమ్ము
> కాలకంఠా! నన్ను కబళింపవేమి!

ఈ విధంగా విషాదాంతం చేస్తారు కవి. ఇట్టి కావ్యనాటికను నాటకరూపంగా ప్రదర్శిస్తే దీనిలోగల భావాలు, సమస్యలు చక్కగా ప్రదర్శింపవచ్చు. నవ్యనాటక కళాహృదయులకు చక్కని కావ్యనాటికను అందచేసిన శివశంకర శాస్త్రిగారు అభినందనీయులు.

—జి. ప్రభ.



# ఆంధ్రమహిళాసభ

## మైలాపూరు, మద్రాసు

**మహిళా విద్యాలయము :—** హిందీ, కాశీ విశ్వవిద్యాలయపు ఎన్ట్రన్సు, ఇంటర్మీడియట్ పరీక్షలు. నృత్యము, గానము.

**పారిశ్రామిక విద్యాలయము :—** (గవర్నమెంటువారిచే రికగ్నైజ్ చేయబడినది) కుట్టు, ఎంబ్రాయిడరీ, ఊలు అల్లికలు, నూలు వడకుట, చేనేత ఇత్యాది పరిశ్రమలలో గవర్నమెంటు పరీక్షలకు శిక్షణ. బీద విద్యార్థినులకు ఉచితము.

**టెక్నికల్ ఇన్‌స్టిట్యూట్ :—** స్త్రీలకు టైపు, షార్టుహాండు - గవర్నమెంటు పరీక్షలకు శిక్షణ.

**మహిళా మందిరము :—** స్త్రీవిద్యార్థినులకు వసతిగృహము.

**ఆంధ్రమహిళ :—** స్త్రీలలో విద్యావ్యాప్తికై, స్త్రీలచే నడుపబడుచున్న సచిత్ర మాసపత్రిక.

**నిర్మలాదేవి గ్రంథాలయము :—** సభ్యురాండ్ర, విద్యార్థినుల ఉపయోగార్థము సేకరించిన తెలుగు, హిందీ, ఆంగ్ల గ్రంథ సముదాయము.

**నర్సింగ్ హోమ్ :—** స్త్రీ, శిశువుల సంరక్షణశాల, ఉచిత వైద్యశాల — అడయారులో నిర్మింపబడుచున్నది.

క్రీడా, క్లబ్బుశాఖలు.

సభ్యురాండ్రుగా జేరి, యీ జాతీయ సంస్థను పోషించండి.

Edited and published by G. Durgabai, M.A., B.L., at the Andhra Mahila Sabha, Mylapore, Madras.
Printed by M. Satyanarayana at the H. Prachar Press, 12, Thanikachalam Chetty Road, T'Nagar, Madras

# ఆంధ్రమహిళ



MARCH 1951. ANDHRA MAHILA ANNAS 6



మల్లమదేవీ మహిళా మందిరములోని చిన్నపిల్లలు
బొబ్బిలి రాజకుమారి శ్రీమతి ఇందిరాదేవిగారు
వార్డెన్ శ్రీమతి కమలాబాయిగారు

## ఆంధ్ర మహిళ చందాదారులకు

మే నెలలో ఆంధ్ర మహిళ పత్రికకు 7 సంవత్సరములు నిండినవి. ఇంత కాలము పత్రిక నిర్విఘ్నముగా, జయప్రదముగా వెలువడుటకు సహకరించిన మీ అందరికి హృదయ పూర్వక కృతజ్ఞత. ముందుముందు పత్రికను ఇంకా సొగసుగా, సర్వాంగ సుందరముగా ప్రచురించ గలమని ఆశించుచున్నాము.

ఈ మధ్య తిరిగి కాగితము ఖరీదు, అచ్చు ఖర్చులు ఇంకా హెచ్చు కావటము వల్ల తప్పని సరిగా పత్రిక ఖరీదు పెంచవలసి వచ్చినది. అందువల్ల మే నెల నుండి జన్మదిన సంచికతో సహా సంవత్సర చందా 5 రూ. బదులు 6 రూ. చేయనైనది. ఈ స్వల్పవ్యత్యాసమునకు మీరు సంకోచింపక మునుపటిమాదిరి ఆదరాభిమానములతో మాకు ప్రోత్సాహము ఇవ్వగలరని ఆశించుచున్నాము.

మీ సేవకు
ఆంధ్ర మహిళ

వస్తోంది!

వినోదా వారి

# స్త్రీ సాహసము

అంజలి..నాగేశ్వరరావు..సూర్యప్రభ..సి.యస్.ఆర్
శివరావు..రేలంగి..గిరిజ..రామ్మూర్తి..సీతారామయ్య
పి.వరలక్ష్మి..సదాశివరావు..అన్నపూర్ణ.

సంగీతం... సుబ్బురామన్
ఛాయాగ్రహణం...రంగా
కళ.. వాలి,గొడగాంకర్



దర్శకత్వం..వేదాంతం రాఘవయ్య
రచన, పర్యవేక్షణ.... సముద్రాల

MATA

ఆంధ్ర, సీడెడ్, నైజాం,
పూర్ణా రిలీజ్



మైసూర్,
అమృత్ పిక్చర్స్

త్వరలో విడుదల!

వరుణ ఫిలిమ్స్ వారి

# మంజరి

డైరెక్టర్.. వై.వి.రావు

ఫోటోగ్రఫి కోట్నీస్

వై రుక్మిణి ... జి.వరలక్ష్మి

సి.హెచ్.నారాయణరావు...వై.వి.రావు

మాధవపెద్ది సత్యం.. వంగర నటించినది

మ్యూజిక్ డైరెక్టర్... హెచ్.ఆర్.పి.శాస్త్రి

ఫొటోగ్రాఫి : కొట్నీస్

ఆంధ్ర, సీడెడ్

రాధాకృష్ణ ఫిల్మ్స్,

రాజమండ్రి.



మైసూర్ :

నంది పిక్చర్స్ సర్క్యూట్,

బెంగుళూర్ సిటీ.

ఇతర ప్రాంతాలకు :

శ్రీ వరుణా ఫిల్మ్స్

మద్రాసు 17.

# రాధా సిల్క్స్ ఎంపోరియమ్

14, సన్నది వీధి, మైలాపూరు, మదరాసు-4




మావద్ద
మీ మీ అభిరుచులకు
తగినట్లుగా
సరసమైన ధరలలో,
నాణ్యతగల
పట్టు, జరీచీరలు
నిత్యవాడుకకు, పక్కా
రంగులలో నేతచీరలు
దొరకగలవు.
ఎల్లప్పుడూ మీకు
మా అంగడిలో స్వాగతం.

## ఆంధ్రవాణి

ప్రథమవార్షిక సంచిక.

సంపాదకులు : ఎ. చెంగల్ రెడ్డి.

వెల 6 అణాలు.

ప్రథమవార్షిక సంచిక మాకు చేరింది. ఇందులో శ్రీ కళావారు రచించిన వ్యాసమువలన ముప్పది సంవత్సరాల చరిత్ర ఒక్కసారి మనకు తెలిపారు. కుంకనూర్ శేషగిరి రావుగారు 'చావుదెయ్యం' మొపాసానుండి చక్కగా అనువదించారు. సుభద్రమ్మగారి మహిళల బాధ్యత క్లుప్తంగా చక్కగా రచించారు.

సంచికలో సాహిత్యం, విజ్ఞాన శాస్త్రం, రాకీయం, చలన చిత్రములపై రచనలున్నవి. ప్రథమవార్షిక సంచిక జయప్రదముగా తీసికొనివచ్చిన వీరికి మా అభినందనాలు.

ఆంధ్ర మహిళాసభ

## నర్సింగ్ హోమ్

అడయారు స్థలంలో ఆంధ్ర మహిళా సభవారు కట్టబోయే నర్సింగ్ హోమ్‌కు నిర్మాణం ప్రారంభమైనది. జూన్ నెలలోగా యీ నిర్మాణము పూర్తి అగును.

స్త్రీ, శిశువుల ఉపయోగార్థం నిర్మింపబడుచున్న యీ భవనానికి, ఎక్కువైన ధనసహాయము కావలసియున్నది. ఉదార హృదయులు తగిన విరాళములిచ్చి, యీ ధర్మ కార్యాన్ని ప్రోత్సహించ వలసినదిగా మనవి.

అ. గిరిజ. జ. జమునాబాయి.

# ఆంధ్రమహిళ

సంపుటి 7 :: మార్చి '51 :: సంచిక 11





సంపాదకురాలు : శ్రీమతి దుర్గాబాయి, యం. యే., బి. యల్.

సహసంపాదకురాలు : శ్రీమతి చన్నఘంటమ్మ, యం. యే. యల్. టి.

ఆంధ్ర మహిళా సభ, మైలాపూర్

సంవత్సర చందా అయిదు రూపాయలు

# మీ డబ్బును పెట్టుబడి పెట్టండి

| 3½% రాబడి పన్ను లేదు | భారత ప్రభుత్వపు పది సంవత్సరముల ట్రెజరీ సేవింగ్స్ డిపాజిట్లలో |
|---|---|

**భద్రతకు :**

డిపాజిట్లను బొంబాయి, కలకత్తా, ఢిల్లీ, మద్రాసులలో గల ఇండియా రిజర్వు బ్యాంకులలోనూ, ఇతరత్ర ట్రెజరీ లావాదేవీలు గల ఇంపీరియల్ బ్యాంకు బ్రాంచీలలోను పుచ్చుకుంటారు.

**మంచి ప్రతిఫలానికి :**

వడ్డీని, సొమ్ము డిపాజిట్ చేసిన తేదీమొదలు ప్రతి పన్నెండు నెలల కొకసారి సారీనా 3½% వంతున అయిన వడ్డీ మొత్తాన్ని, ఏ ప్రభుత్వ ట్రెజరీనుండి అయినా పొందవచ్చును. లేక డిపాజిట్ చేసిన ఆయన/ఆమె యొక్క విలాసానికి పబ్లిక్ డెట్ ఆఫీసువారు పంపగలరు.

**మూలధనాన్ని సులభంగా తిరిగి పొందుటకు :**

10 ఏళ్ల తర్వాతనే డిపాజిట్ మొత్తాన్ని పొందవచ్చు గాని, అంత లోగానే అవసరమైతే, డిపాజిట్ చేసిన ఒక సంవత్సరం తరువాత, ఎప్పుడైనా సరే, నాటికి సాటియైన డిస్కౌంట్ చేయించుకొని, డిపాజిట్ కాలపరిమితిని బట్టి వృద్ధియైన నికర మొత్తాన్ని పొందవచ్చును.

## మీరు మరువవద్దు సుమండీ!

రాబడి పన్ను మినహాయింపు. డిపాజిట్లపై లభించు వడ్డీపై రాబడి పన్ను లేదు. రాబడి పన్ను రేట్ల కొరకు డిపాజిట్‌దారు మొత్తం ఆదాయాన్ని లెక్కించునప్పుడు ఈ వడ్డీ మొత్తం కలుపబడదు.
ఈ డిపాజిట్‌ను ప్రభుత్వంవారు ముమ్ముందు ప్రకటించే తేదీవరకే పుచ్చుకుంటారు.

డిపాజిట్లను రు. 100 మొత్తాలలో క్రింద సూచింపబడిన గరిష్ఠ పరిమితులలో పుచ్చుకుంటారు.

రు. 25,000/-డిపాజిట్‌దారు ఒక్కడే అయితే
రు. 50,000/-ఇద్దరుగా చేరియున్న లేక సంస్థల విషయంలో
రు. 1,00,000/-ధర్మసంస్థల విషయంలో

### జ్ఞాపకం ఉంచుకోండి :

మీరు ట్రెజరీ డిపాజిట్ చేయడంతో, మీ మూలధనాన్ని సురక్షితంగా చేసుకొనడంతోపాటు, 3½% వంతున, రాబడిపన్ను మినహాయించిన ఆదాయాన్ని పది సంవత్సరాలకు పొందుతామనే గట్టి నమ్మకం ఉంటుంది.

**— ఇప్పుడే డిపాజిట్ చేయండి —**

**క్రింది వివరాలతో అర్జీ పెట్టుకోండి :**

మీ పూర్తి పేరు, చిరునామా, డిపాజిట్ మొత్తం, ఒక్కరుగానా, లేక ఉమ్మడిగానా, వడ్డీని పొందగోరే ట్రెజరీ పేరు, లేక రిజర్వు బ్యాంక్ ఆఫ్ ఇండియా వారిచే సొమ్ము స్వీకరించబడిన విధానము : ఉమ్మడిగానైతే మరణానంతరం చెల్లింపబడు విధానము లేక, దరఖాస్తులను పంపవలసినదని రిజర్వు బ్యాంక్ ఆఫ్ ఇండియా వారికి, లేక మీకు సమీపంగానున్న ఇంపీరియల్ బ్యాంక్ ఆఫ్ ఇండియా బ్రాంచికి వ్రాసుకొనండి.

**భారత ప్రభుత్వపు నేషనల్ సేవింగ్స్ కమీషనరు, ఆర్థిక మంత్రి కార్యాలయం, గోర్టన్ కాజిల్, సిమ్లా వారి ప్రకటన**

AC—232 TG.




సంపుటి 7 మార్చి 1951 సంచిక 1

# కీ. శే. రామలింగా రెడ్డిగారు

భారత పుత్రులలో, అఖండ ప్రజ్ఞగల విద్యావేత్తగా, మహామేధావిగా, అఖిల భారత ఖ్యాతివందిన ఆంధ్ర ప్రముఖులు శ్రీ రామలింగా రెడ్డిగారు. చిన్ననాడు దేశీయ కళాశాలలలో ప్రథమ శ్రేణిలో నిలచి, తదుపరి విదేశీ కళాశాలలలో కూడనట్లే ఉత్తీర్ణుడై సూక్ష్మ బుద్ధిగల వ్యక్తిగా, ఆకర్షణీయమైన వక్తగా ప్రఖ్యాతి గడించినారు. విద్యానంతరం అనేకమార్లు ఇంగ్లాండు, అమెరికా, యూరోపులలోనూ, కెనడా, జపాన్, ఫిలిప్పీన్సు, మలయా దేశాలలోనూ సంచరించి, ఆయాదేశాల విద్యా సమస్యలను సమగ్రంగానూ, సునిశితంగాను పరిశీలించి సంపాదించిన యనుభవముతో స్వదేశమునందలి పెక్కు కళాశాలలో అభివృద్ధి కరమైన నిర్మాణమును చేయకలిగినారు. బరోడా కళాశాలలో వైస్ ప్రిన్సిపాలుగాను, మైసూరు మహారాజావారి కళాశాలలో ప్రధానాచార్యులుగానూ, అఖిలభారత విద్యా సంఘపు సలహాదారుగానూ, వీరొనరించిన సేవ, వీరు చేసిన నిర్మాణం, భారతీయులందఱి మన్నలను బడసినది.

1926—సం॥ స్థాపితమైన ఆంధ్ర విశ్వ విద్యాలయము యీనాడింత అభివృద్ధిని గాంచినదంటే, ముఖ్యంగా యిందలి శాస్త్రశాఖలు అఖిలభారత ఖ్యాతిని పొందుచున్నవంటే, దీనికి కారకులు శ్రీ రామలింగా రెడ్డిగారే అని చెప్పితీరాలి. ఆదినుండి, మధ్యలో ఏ స్వల్పకాలమోదక్క, మొన్నమొన్న మైసూరు విశ్వ విద్యాలయపు ప్రొఛాన్సలరు పదవిని స్వీకరించేటంతవరకు, శ్రీ రామలింగా రెడ్డిగారు, ఆంధ్ర విశ్వకళా పరిషత్తుయొక్క ఉపాధ్యక్షులుగా తన శక్తి సామర్థ్యములను వినియోగించి, పరిషత్తు వికాసమునకు దోహద మొనర్చినారు.

శ్రీ రెడ్డిగారు, ఆంధ్ర ఆంగ్లభాషల రెండింట ప్రసిద్ధ పండితులు. రెండింట గంభీరమై శ్రోతలను ముగ్ధులనుగాజేయు వక్తృత్వపటిమకుతోడు, రెండు భాషలలోనూ చక్కటి రచనా సమర్థతగలవారు. తెనుగున విద్వత్తుతోపాటు సునిశితమైన విమర్శనాచతురతగలవారు. స్వచ్ఛ



కీ. శే. కట్టమంచి రామలింగా రెడ్డిగారు.

జననం 1880. మరణం 1951.

మైన సాంప్రదాయబద్ధమైన గ్రాంథిక భాషలో కళాపూర్ణోదయముపై వీరురచించిన కవిత్వతత్వ విచారము, ముసలమ్మ మరణం అనే పద్యకావ్యము, విద్వాంసుల అభిమానాన్ని బడయగలిగినవి. తెలుగు భాషలో వీరు రచించిన అర్థశాస్త్రము మదరాసు విశ్వవిద్యాలయపు వారి బహుమానమును పొందినది. భారతమునకు తెలుగులోను, రామాయణమునకు ఇంగ్లీషులోను, వీరు వ్రాయుచున్న భాష్యములు ఏప్రిల్ నెలలోగా సమాప్తికాగలవన్న వీరియాశ నెరవేరకుండానే, వీరు కాలధర్మము నొందుట చాల శోచనీయాంశము.

ఇట్లు విద్యారంగములోనేగాక, రాజకీయ రంగములో గూడ శ్రీ రామలింగా రెడ్డిగారు ఎక్కువైన విజ్ఞానాన్ని సంపాదించారు. శాసన సభలలో వీరి చాక చక్యము మరువరానిది. అయితే, రాజభక్తి, రాజనీతి, సాంఘిక ఆదర్శములన్నియు, దినదినము క్రొత్త క్రొత్త రూపములను దాల్చుచున్న పరిస్థితులలో, ప్రత్యుత రాజకీయములన్నీ వ్యక్తిస్వేచ్ఛా తత్వవాదియైన వీరికి బురదగుంటలుగా తోచుటచే, బహు ప్రజ్ఞాశాలియయ్యు, రాచకీయ రంగమునుండి వీరు విరమించుకొనిరి.

పండితులు, భాషాసేవకులు, ప్రపంచ ఖ్యాతిబడిసిన వక్తలు, అఖండయశము సుసంపన్నులు బహుముఖప్రజ్ఞాశాలియునగు శ్రీ రామలింగా రెడ్డిగారు 24—2—1951 న, తమ 71 వ ఏట తనువు చాలించారు. వీరి మృతికై అఖిల భారతమూ, అందూ ముఖ్యంగా అఖిలాంధ్రావనీ దుఃఖించుచున్నది. వారి ఆత్మకు భగవంతుఁడు శాంతి గూర్చుగాక !





# కృతజ్ఞత

ఆంధ్ర మహిళాసభ యాజమాన్యాన కొన్ని సంవత్సరాలుగా జరుపబడుచున్న పారిశ్రామిక విద్యాలయము మా చదువరులకు చిరపరిచిత మైనదే. ఇందువనితలకు గౌరవమైన జీవనోపాధిసాధకములైన గృహ పరిశ్రమలు, ప్రభుత్వ పారిశ్రామిక శాఖవారి ఆమోదముతో, వారి నిబంధనలు, నియమావళులు, విధానాలు ఆధారంగా, నేర్పబడుతూ ఉన్నవి. నిరక్షరాస్యులు, వయోజనులునైన యువతులకుగూడ, ప్రభుత్వ ఆమోదముతో, మాతృభాషలోనూ, గణితములోనూ తగు మాత్రము ప్రవేశము కలిగించి, పరిశ్రమలలో ప్రభుత్వము ఏర్పరచిన వివిధ స్థాయిల పరీక్షలకు పంపుటకు కూడ ఏర్పాట్లు చేసి యున్నాము. నూలు తీయుట, చేనేత, కుట్టు, ఎంబ్రాయిడరీ, ఊలు, లేసు అల్లికలు ఇందు ముఖ్యంగా నేర్పించు చేతిపనులు. ఇంత వరకు 60 మంది లోయర్ గ్రేడ్, 15 మంది హయ్యరుగ్రేడు పరీక్షలలో కృతార్థులైరి. శిక్షణ ముగిసిన యువతులు, విద్యాలయములలో ఉపాధ్యాయినులుగానూ, లేక, కొలది ధనముతో ఒక చిన్న స్వతంత్ర వ్యాపారము పెట్టుకొని, గౌరవ జీవనమును గడపుచున్నారు.

యీ విద్యాలయమునకు భవనము నిచ్చి, మాకృషికి తోడ్పడిన శ్రీ రాజ్యలక్ష్మిగార్కి—దీనిని రికగ్నైజ్ చేసి, దానికగు వ్యయములో కొంత భాగము నాల్గు సంవత్సరములుగా భరించుచున్న రాష్ట్ర ప్రభుత్వము వారికి ఇందలి కడు బీద విద్యార్థినుల భోజనవసతి సౌకర్యములకు, ఉచిత విద్యార్థి వేతనములకూ ధనవిరాళము లిచ్చి, సానుభూతితో మాకృషికి తోడ్పడుతున్న ప్రతి ఒక్కరికీ మా కృతజ్ఞత.

ప్రస్తుతంలో యీ కృతజ్ఞత తెలుపుట కొక ముఖ్య కారణము గలదు. వీరువేసిన పునాదుల ఆధారముగా, వీరందఱూ చూపిన సానుభూతి సహకారముల ఫలితంగా, మేమింత కాలము విజయవంతంగా సాగించిన కృషి, నేటికి భారత కేంద్ర ప్రభుత్వమువారి ఆమోదమును బడసి భారత ప్రభుత్వ పారిశ్రామిక శాఖనుండి, పారిశ్రామిక విద్యాల యాభివృద్ధి నిమిత్తం, రు. 50000—విరాళమును బొందకల్గినది. ఇందులకై భారత ప్రభుత్వమునకుమా కృతజ్ఞత.

ఈ మొత్తములో, పారిశ్రామిక విద్యాలయములో కొన్ని క్రొత్త శాఖలు ప్రారంభించుటకై మహిళా సభ కార్య నిర్వాహకవర్గము నిర్ణయించారు.

ఇందు ప్రధానమైనది, అచ్చు పనిశాఖ—ముద్రణా యంత్రములో అచ్చు కూర్పుపనిలో యువతులకు శిక్షణనీయవలెనని, ఆంధ్ర మహిళాసభ చిరకాల వాంఛ. ప్రభుత్వ విరాళముతో తగుమాత్రము ముద్రణా యంత్రమును కొని, ఎక్కువమంది స్త్రీలకు, తెలుగు, ఇంగ్లీషు, అరవ, హిందీ భాషలలో అచ్చు కూర్పు విధానము నేర్పించి, ప్రభుత్వ పరీక్షలకు తర్ఫీదుచేయు ఏర్పాట్లు వెంటనే చేయబడును—

# కృతజ్ఞత

1951, జూన్ నెలనుండి, యీ విద్యలో శిక్షణ ఏర్పాటు కాగలదు. స్త్రీలందఱూ యీ సదవకాశమును వినియోగించు కోగలరని హెచ్చరిక.

ఇంకమీద, ఆంధ్ర మహిళ కూడ తన స్వంత ముద్రణాలయంలో ముద్రింపబడే అవకాశము కలుగుతుంది. గత ఏడు సంవత్సరములనుండి, అనేక విధములైన కష్టములకోర్చి, స్త్రీల విద్యాభివృద్ధియే ఆదర్శముగా, ప్రజామోదమే ఆధారంగా, నిర్విఘ్నంగా మాసమాసము వెలువడుచున్న ఆంధ్ర మహిళ యింకమీద స్త్రీలచే నడుపబడే తన స్వంతముద్రణా యంత్రములో ముద్రింపబడు సుదినమును చూడ బోతున్నది.

ఈ యభివృద్ధికి కారణభూతులైన భారత ప్రభుత్వపు పారిశ్రామిక శాఖవారికి, మా హృదయ పూర్వక కృతజ్ఞత.

—ఆంధ్ర మహిళాసభ.

## బాలమేధావి

శ్రీ కృష్ణహరినాథ ప్రభును అనే పేరుగల పదిహేను సంవత్సరాల బాలుడు (తణుకు, పశ్చిమ గోదావరి జిల్లా) తన తండ్రియగు కొండూరి [illegible]య్యగారితో సహా తే 26—2—51 దీని సాయంకాలము 4 గంటలకు "ఆంధ్ర మహిళాసభ" లో తన [illegible] మేధాశక్తిని ప్రదర్శించెను.

అనేక మంది వారి, వారి పుట్టిన తేదీ సంవత్సరములు చెప్పి ఆదినము పేరు చెప్పమన్న [illegible] వెంటనే సమాధానము నిచ్చి సభ్యురాండ్రకు ఆశ్చర్యాన్ని కల్గించెను.

ఇట్లాగే మహిళా సభలో బుధవారం, శనివారం, సభ్యురాండ్రకొరకై కార్యక్రమములు ఏర్పాటు చేయబడు చున్నవి. ఎక్కువమంది ఈ గోష్ఠులలో పాల్గొనుటకు వచ్చి మహిళాసభ కార్యక్రమములలో సహకరించవలసినదిగా మనవి.

కార్యదర్శినులు.





కుమారి సుగుణబగడే.
లక్షలమ్మ టెక్నికల్ ఇన్‌స్టిట్యూట్‌నుండి.
టైపు హయ్యరు పరీక్షలో ఉత్తీర్ణురాలైన ప్రథమ విద్యార్థిని.




## దశమ గుచ్ఛము

(వెనుకటి సంచిక తరువాయి)

౨

రాధాకృష్ణ తనతో ఏమిటి మాట్లాడాడు? అతడు తన ఉద్దేశం గ్రహించాడు. అతని మాటల్లో మరేమీ ఘాటు లేకపోయినా, భావం ఘాటుగానే ఉంది. వెంకట్రావుకు ఆ మాటలతో నాలుగు రోజులు తిన్నగా తిండి సహించ లేదు. నరసింహమూర్తి మేష్టారు వెళ్లిపోగానే సుశీల వెంకట్రావుకు ఒక నాయరు వంటమనిషిని ఏర్పాటుచేసింది. అతడి వంట కొన్నాళ్లవరకూ వెంకట్రావుకు రుచించలేదు. తర్వాత అదే అలవాటయింది.

"వెంకట్రావుగారూ మనది "ఫ్రీలవ్" సంఘం కాదు! కాని అలాని ముసలమ్మ చాందసాలు కలవాణ్ణీ కాదు. వివాహం చేసుకున్న స్త్రీ భర్త విషయంలో సత్యమైన నడవడి చూపించాలి. అంతకన్న దిట్టంగా భర్త వర్తించాలి. ఇష్టంలేమా భార్యా భర్తల తనం రద్దు చేసుకోవాలి! ఏమంటారు? వెనక ఒకటీ, ముందు వేరొకటీ ఉంటే న్యాయమా చెప్పండీ!" అని రాధాకృష్ణ అన్నాడా నాడు.

ఆ మాటలకు వెంకట్రావు తెల్లబోయాడు. ముచ్చెమటలు పోశాయి. ఒక నిమేషం అక్కడ ఉండలేక పోయినాడు. వెంటనే అతడు "రాధాకృష్ణగారూ! నాకు చాలా అర్జంటు పని ఉంది. నేను వెడుతున్నాను. సుశీలగారితో చెప్పండీ!" అని వెళ్లిపోయినాడు.

ఇంటికి వెళ్లే దారిలోనే అతనికి మతిపోయింది. కన్నీరు లేని దుఃఖం అతనికి పొర్లివచ్చింది. వక్షము వేడి నిట్టూర్పుతో నిప్పురాజేయు తోలుతిత్తిలా ఎగసిపోయింది. ఇంటికిపోయి పక్కమీద వాలిపోయినాడు. ఆపూట అతడు భోజనం చేయలేదు. నాయరు పిలిచినా వంట్లో బాగుండలేదని వంకపెట్టినాడు.

ఆ మర్నాడూ ఆ మర్నాడూ ఆఫీసుకు వెళ్లలేదు. తన చీకు హృదయం అందరికీ తెలిసిపోయిందని అతడు సిగ్గుపడి కృంగిపోయినాడు. చివరికి నాయరుకూ తన మొగం చూపించలేక పోయినాడు. అతని జీవితం ప్రాథమికావస్థలోనే పెరి

గింది. ఈనాటికి బహుళ భావ సంఘాతంతో క్లిష్టమైంది. పరస్త్రీ గమనం మహాదోషమని అతనికి ఎప్పుడూ తట్టలేదు. అలాగే పరస్త్రీ గమనం చేయాలనీ కాంక్ష ఉద్భవించలేదు. ఆ రకమైన రంగులు అతని జీవిత చిత్రంలో సన్నిహితం కానేలేదు. పద్మావతే అతనికి సర్వముగా నిండి ఉండేది. నేడా నిండుతనం వెలితి తాల్చింది. బహుళ ముఖమైన పూర్ణ మానవ జీవితంలోని ఘాటువాసనలూ, పులుముడు రంగులూ, రకరకాల చీకట్లూ, వెలుగులూ, చిత్ర చిత్రాలైన జీవితాలూ, భావాలూ, రాజకీయాలూ, మతాలూ, ఆదర్శాలూ, కాంక్షలూ వివిధ మానవ హృదయాలూ అతని జీవితాన్ని పొదివికొని పోయినవి.

అడవిలో పెరిగిన పక్షిలా ఉన్న అతడు ఉద్యానవనాల్లో చేరిన మయూరంలా అయ్యాడు. ఈ ధ్వనులూ, ఈ వాసనలూ, ఈ గుంపులూ వేరు. అక్కడ ప్రకృతాలవి, ఇక్కడ మానవారణ్యము.

నాలుగవరోజున సుశీలా రాధాకృష్ణలిద్దరూ అతని ఇంటికి వచ్చినారు. అతడు తెల్లబోయినాడు. అతనికి విపరీతమైన కోపం వచ్చింది. వారితో ఎంతకాలంవరకో అతడు మాట్లాడలేదు. పవుడరు పూసుకున్న సుశీల మొఖాన్ని ఫెళ్లుమని చెంపపెట్టులతో వికారం చేయాలని అతని మనస్సు ఘూంర్ఢించింది. సెంట్లు రాసుకుని, లాలిత్యంగా దుస్తులు వేసుకుని ఫ్రేములేని కంటి అద్దాలు ధరించిన రాధాకృష్ణుని ముక్కలుచేసి అతడెక్కివచ్చిన కారులో వేసి పోలీసు స్టేషనుకు తానే ఆ కారు తీసుకునివెళ్లి అప్పగించాలన్న తీవ్ర క్రోధం వెంకట్రావును ఊపివేసింది.

“వెంకట్రావుగారూ! ఏమిటీ స్థితి? షువరంఅన్నా చేసుకోలేదు. మా రకం జీవితం మీకు అర్థంకాక కంగారుపడిపోతున్నారు!” అని రాధాకృష్ణ అన్నాడు.

“మీకూ మాకూ గాఢమయ్యే స్నేహంలో మొహమాటం లేక రాధాకృష్ణగారన్న మాటలకు మనస్సు చీకాకు పెట్టుకున్నారా” అని సుశీల అడిగింది.

వెంకట్రావు మండిపోయాడు. “మీ ఇద్దరి స్నేహం నేను కోరలేదు. మీరే నా స్నేహంచేసి, నన్ను గడబిడ చేశారు. మీ ఉద్దేశాలు నాకు తెలియవు. మీ విధానాలు నాకు అర్థం కాలేదు. దగ్గిరకు వచ్చినా మీరే, అపార్థాలు చేసుకున్నా మీరే! మీకూ నాకూ స్నేహం లేకపోవడమే మంచిది.” అని అతడంటూ పడకగదిలోనికి వెళ్లి, పక్కమీద మేను వాల్చినాడు.

పదినిముషాలయిన తర్వాత రాధాకృష్ణ ఒక్కడూ లోనికి వచ్చాడు. “వెంకట్రావుగారూ! మీరు ఏదికోరితే అది చేస్తాను, సుశీలను ఇక్కడ వదలివెళ్లిపొమ్మంటే వెడతాను కాని నన్ను గురించి తప్పభిప్రాయం పడవద్దని ప్రార్థన!” అన్నాడతడు.

వెంకట్రావు తెల్లబోయాడు. అతడులేచి రాధాకృష్ణ భుజాలమీద చేయినైచి, ఒక్క నిమేషం నిల్చిఉండి, నిట్టూర్పువిడిచి, మళ్లీవెళ్లిమంచం మీదవాలినాడు. రాధాకృష్ణ మోముప్రఫుల్లంకాగా, మంచం దగ్గిరకువచ్చి, “నేను రేపువచ్చి కనబడతాను!” అని అవలకు వెళ్లిపోయినాడు.

సుశీల లోనికి వచ్చింది, ఆ మెతల నాల్చుకుని గుమ్మం దగ్గిర నిలుచున్నది. వెంకట్రావు గుండెగుబగుబ కొట్టుకుంది. ఆమె రావడమే! అతడు రివ్వునలేచి నిలుచున్నాడు. అతనిగుండె రెండుక్షణికాల కాలం ఆగిపోయింది. కళ్లు మైకం కమ్మినాయి. తలవాల్చుకున్నాడు.

“సుశీ! నువ్వునాకు చెల్లెలవు, నువ్వు ఇంటికి వెళ్లు! ఒకరికొకరం మనం పూర్తిగా అర్థంకాక ఈలా అయింది. ఇద్దరూ ఎల్లుండిరండి” అన్నాడు. సుశీల మెల్లిగా వెళ్లిపోయింది.

ఇదివరకే తనభార్య ఏ యాత్రకైనా వెళ్లవచ్చునని బుచ్చి వెంకట్రావు అనుమతి పత్రంవ్రాసి విద్యాలయాధికారిణికి ఇచ్చి ఉన్నాడు. ఆ విషయం తాను బయలుదేర బోయేముందు పద్మావతి భర్తకు కవరువ్రాసి పోస్టులో వేయించింది. ఆ ఉత్తరం అతడు రెండురోజులు చూడకుండా అలాగే ఉంచాడు. తర్వాత చూచుకొని ఆశ్చర్యం పొందినాడు.

ఈ యాత్రకు ఎందుకు వెళ్లినట్లు?

తాను యాత్రకో ప్రయాణానికో వెళ్లకుండానే ఎక్కడకు చేరుకున్నట్లు?

తనకూ! ఏమి కావాలీ?

అనేకులు ధనం సంపాదించుకోనడమే ఆశయంగా పెట్టుకుని, కుమిలి, కూరి, దోర్లి దోరి అధనం సంపాదించుకుంటారు. అలావారి జన్మంతా అ భయంకరయోగం నిండిపోతుంది. కాని తనబోటివాళ్లకు వ్యక్తంకాని ఏవో కాంక్షలూ, ఆశయాలూ నిండిపోతాయి. వాని స్వరూప జ్ఞానంలేక తాము ఆవేదనలో క్రుంగిపోడవం రోజూ జరిగే నిత్యనాటకం.

తనకు సుశీలకావాలా? ఆమె తనకు దక్కితే తనకు ఏదో ఆనందం కలుగుతుంది. అంతకన్న అందమైన మలయాళ భామినులు ధనం చూపిస్తే తనతోవచ్చి ఉండగలరే? మలయాళీలేమిటి, ఏ దేశస్థులైనా సరే ధనానికి వచ్చేవారు అచ్చరలవంటివారు మదరాసులో ఉన్నారు.

"బ్రాతెలు" శాసనం అమలులో ఉన్నా అమలులో లేనట్లే! ఎంతమంది రహస్యంగా ఈ వృత్తి సాగించడం లేదు. అయినా అతిపురుష వాంఛ జీవితానికి ముఖ్యంకాదే! అలాంటి అలోచనలే కలుగలేదే! ఈ సుశీల ఏదో అతి విచిత్రమైన బాలిక, ఆమెలో ఏదో అద్భుతమైన ఆకర్షణ ఉంది.

బహుళముఖమైన కారణాలవల్ల స్త్రీ పురుషులలో అకర్షణ ఉద్భవిస్తుంది. రూపసౌందర్యమూ అవయవ సౌష్టవమూ, ఆకారపు తీరూ, కంఠమాధుర్యము గుణగణాదులు, చేష్టలు ఈలా ఎన్ని కారణాలుండ వచ్చును. సుశీల తనలో పశుత్వభావాలకు దోహదంమిచ్చింది.

అలోచనలు సముద్రతరంగాలై, పోటుపాటులై ముంచెత్తుకు వచ్చాయి బుచ్చి వెంకట్రావుకు.

తాను సినీమాకంపెనీ పెడుతున్నట్లు పద్మకు తెలియదు. అ పెట్టబోయే కంపెనీతో చక్కని చిత్రంతీయాలి. అందులో పద్మభాగం పుచ్చుకోవాలని కదా తనకోర్కె! కాని తాను సినీమాకంపెనీని స్థాపించి పూనుకోడం ప్రత్యేకం సుశీలకోసం, సుశీలతనకు ఇంకా దగ్గిరగావస్తుంది. సుశీల కథానాయకురాలు కావాలి. కాని తనభార్య కంఠం ఆకథలో భాగంకావాలి.

బుచ్చి వెంకట్రావు అనేక సినీమాకంపెనీలు పరిశీలించి చూచాడు. అనేక సినీమాసంస్థలు కుక్క గొడుగుల్లా ఉద్భవించి మరునాడు మాయమై పోతున్నాయి. కొన్ని ఏదో రకంగా తంటాలు పడుతున్నాయి. కొన్ని చచ్చిచెడి చాయంగల విన్నపాలై ఒక బొమ్మతీసి మాయమై పోతున్నాయి. ఆ బొమ్మలాభం తెస్తే డిస్ట్రిబ్యూటరు నంజుకుంటాడు. విజయవంతమైన చిత్రం కాకపోయినా, ఆ చిత్రంవల్లనే డబ్బు గుంజుకోగలడు డిస్ట్రిబ్యూటరు.

ఒక కంపెనీపెట్టి చిత్రం తీయడం ప్రారంభిస్తే ఎంత మహోత్సవంలా అయిపోతుందో! వేలకొలది జనులు చిత్రం నిర్మించడానికి కావాలి. అందరూ నిర్మాతకు దాసానుదాసులవుతారు; కారులు, రిహార్సల్సు, తారలు రావడం, పోవడం, చిత్రంలో ఒక్కొక్క సంఘటన తీయడం! దానికై సెట్టింగులు, ఆ వెనక దర్శకుడూ ఛాయాగ్రాహకుడూ, శబ్దగ్రాహకుడూ కార్య క్రమానికి ఉపక్రమించడం. అంతకు ముందు నగలు, నాణ్యాలు దుస్తులు సేకరించి సిద్ధం అవడం! స్త్రీ పురుష తారలకు వేషాలు వేయడం. సెట్టింగులలో దీపాలు అమరించడం, ఆ దీపాలతో పగటిలా చేయడం, ఆర్పేస్తూ ఉండడము! ఒక్కొక్కసెట్టుకు సంబంధించిన రంగాలన్నీ తీయడం! ఎంతగడబిడ. ఈ గడబిడకంతకూ అతడు తాను నాయకుడు. అందరూ అతనిచుట్టూమూగాలి. అతన్ని కొలవాలి, పొగడాలి, గౌరవించాలి, అతడు సంపూర్ణాధికారి.

ఇదీ బుచ్చి వెంకట్రావు హృదయాంతరాన ఉదయించిన గాఢమైన కాంక్ష.

పద్మావతి యాత్రకు వెళ్లిన అయిదవరోజున సుశీల రాధాకృష్ణలు ఇద్దరూ బుచ్చి వెంకట్రావు దగ్గిరకు వచ్చారు. రాధాకృష్ణతానే తన కారును నడుపు కొంటూవచ్చాడు.

"రండి, దయచేయండి!" అంటూ బుచ్చి వెంకట్రావు వారినిలోని హాలులోనికి తీసుకొని పోయినాడు.

రాధాకృష్ణ :— వెంకట్రావుగారూ త్యాగరాజనగరంలో మొదటి రకం మేడ ఒకటి కుదిర్చాను, శుభముహూర్తం చూచి మనం పనిప్రారంభించడమే!

వెంకట్రావు :— ఫస్టు! శుభముహూర్తం చూడండి!

రాధాకృష్ణ :— మీదగ్గిర ఇప్పుడు ఎంత డబ్బు సిద్ధంగా ఉంది చెప్పండి?

వెంకట్రావు :—ఇరవై అయిదువేలున్నాయండి.

రాధాకృష్ణ తెల్లబోయినాడు. "ఇరవైఅయిదు వేలతో మనం ఏం చేయగలం బుచ్చి వెంకట్రావుగారూ? పని ప్రారంభించిన పదిరోజులకు కూడ సరిపోదే!" అని ఆతడు కాలుస్తున్న సిగరెట్టు సగంపైగా ఉండగానే బూడిద రాల్చి గిన్నెలో పారవేసినాడు. "ఒక లక్షైనా పెట్టుబడితో ప్రారంభిస్తారనుకున్నాను!" అని ఆతడు కుర్చీలో కూలబడ్డాడు.

"నాదగ్గిర లక్ష ఎక్కడున్నాయి రాధాకృష్ణగారూ! నావ్యాపారానికి అవసరమైన సొమ్ము అరవై వేలు. ఆ సొమ్ము మారుతూ ఉంటుంది. ఏర్పరచుకొన్న జీతమూ నావంతులాభమూ, ఖర్చులుపోను మిగిలింది ఇరవై అయిదువేలున్నాయి. అది పెట్టి మాత్రమే సినీమా ప్రారంభించగలను. మీరు ఇతర భాగస్వాములను తీసుకు వస్తామన్నారు కాదా?" అని వెంకట్రావు రాదాకృష్ణను పృచ్ఛచేసినాడు.

సుశీల నెమ్మదిగా వారిరువుర దగ్గిరకువచ్చింది. ఇంత వరకూ ఆమె ఇటూఅటూ పచారు చేస్తున్నది. "నా పేర వేసిన ఆరువేలూ వేసి నేనూ భాగస్వామినిని అవుతాను. రాధాకృష్ణగారి దగ్గిర అయిదువేలున్నాయి. అంతవరకూ ఆయన వేస్తాడు. నాజీతమూ, రాధాకృష్ణగారి జీతము నిర్ణయించి అదికూడా కంపెనీ వాటాలు చేయవచ్చును." అని ఆమె గోడకుకట్టిన ఒక నవీనచిత్రం చూస్తూనిలబడింది.

"మీ ఇద్దరి డబ్బూ వేయడం అన్యాయం. అదీకాక మీకు ఈయబోయే జీతాలుకూడా వాటాగా చూసుకోడం మరీ అన్యాయం. నాతంటాలు నేను పడతాను. ముహూర్తం పెట్టించండి మనం ఏర్పాటు చేసుకొన్న మేడలో పనిప్రారంభిద్దాము." అటూ వెంకట్రావులేచి "రండి ఆమేడచూచి వద్దాము" అని పూర్తిచేశాడు.

౪

సినీమా కంపెనీ ప్రారంభమైంది. ప్రారంభోత్సవానికే మూడు వేలయింది. తారలకూ, తారకులకూ ప్రారంభ రుసుములు ఎనిమిది వేలయ్యాయి. స్టూడియోకు అడ్వాన్సు అయిదువేలిచ్చారు. రాధాకృష్ణ దర్శకుడు తెలుగు చిత్రాలకు ఎవరు దర్శకులు కాలేదుగనుకా. చిత్రం కూడా గట్టిగా గీయలేని ఒక చిత్రకారుడు కళాదర్శకుడు. సంగీత దర్శకుడు రాధాకృష్ణే!

పెళ్లుమని ప్రారంభమైంది బుచ్చి వెంకట్రావు "నవీన చిత్రా ఫిలిమ్సు" కంపెనీవారి "దేవాలయం"! అనే చిత్రం "మందాకినీ" స్టూడియోలో చిత్రం తీయడం ఏర్పాటయింది. మొదటిరోజు షూటింగు ఒక మంత్రిగారు "మీట" నొక్కి ప్రారంభిస్తారట.

కథకు పేరుపెట్టారు కథ ఏమిటో ఎవరికీ తెలియదు. ముందర రాధాకృష్ణ పాటల వరసలు నిశ్చయం చేశాడు. "మూడు డాన్సులన్నా ఉండాలన్నాడు" రాధాకృష్ణ!

"కాదయ్యా! మొన్న లక్షలు ఆంధ్రదేశంలో గణించిన "కొట్టడా" అనే అరవ చిత్రంలో ఎనిమిది డాన్సులు, పదహారుపాటలు ఉన్నాయి. మన చిత్రంలో ఆఖరికి ఆరుడాన్సులు, పధ్నాలుగు పాటలన్నా ఉండకపోతే ఎట్లాగూ?" అని అసిస్టెంటు డైరక్టరు రామచంద్ర అన్నాడు.

"కథరాయడం ఎవరు? వాటికి మాటలూ పాటలూ రాయడం ఎవరు?" అని బుచ్చి వెంకట్రావు అడిగినాడు.

"కథ నేనే ఇంగ్లీషులో రాస్తాను. డైలాగ్సు కూడా నేనే ఇంగ్లీషులో రాసిపారవేస్తాను. అవి తెలుగులోకి మార్చడమేగా! కాస్త కథలు దిట్టంగా రాస్తున్నాడు మా మేనల్లుడొకడు ఈ మధ్య! ప్రతిపేపరులో నూవాడి కథే! వాడురాసిన "గజ్జెల చప్పుడు" "మ్యావుమ్యావు" "పైటకొంగు" "కుచ్చెళ్లు!" "రాత్రివేళ!" అనేకథలునూ రంజుగా ఉన్నాయి. వాడే నాడైలాగ్సు తెలుగులో పెడతాడు." అని రాధాకృష్ణ అన్నాడు.

"కథలో మూడు ప్రేమదృశ్యాలు. రెండు ఆకాశంలో ఎగరటాలు, అయిదన్నాకత్తి యుద్ధాలు, రెండుగుఱ్ఱం స్వారులు, నాలుగు విరహతాపాలు ఉండాలి లేకపోతే రక్తి కట్టదు" అని రామచంద్ర అన్నాడు.

"ఒక రాజభవనం, మూడు పల్లెటూళ్లు, రెండు అడవులు, రెండు పడకసీనులు, నాలుగు పల్లెటూరి ఇళ్లు" ఇది ఉండితీరాలని కళాదర్శకుడన్నాడు.





# పండుగ కోరికలు

* * *

## రూపకం

* * *

శ్రీమతి కొత్తపల్లి లలిత.

స్థలం : శ్రీమంతుల భవనం.

సమయం : ఉదయం 7-30 గం॥

శ్రీపతి
రాజ్యలక్ష్మి } భార్యా భర్తలు—

(రేడియోలో ప్రభాత గీతం: పక్కమీద నుంచి ఆవలిస్తూ లేస్తారు శ్రీపతిగారు :)

శ్రీపతిగారు : ఏమే...ఇటుచూడూ—ఇవ్వేళ కావలసిన వస్తువులన్నీ ప్యూన్‌చేత తెప్పించావా? గుమాస్తా దాసు—ముత్తయిదువులకు పంచి ఇవ్వడానికి కావల సిన చీరలు, అద్దాలు దువ్వెన్లూ ఇంకా అవేవో—అన్నీ సరిగ్గా తెచ్చాడా?...అన్నట్లు నేను 'ఆర్డర్' చేసి వచ్చిన 'బీరు' సీసాలు డ్రైవరు తీసుకొచ్చాడా లేదా?

రాజ్యలక్ష్మి : "ఆ...ఆ—అన్నీ చేరినట్టే—మీరేమంత అవసరపడనక్కరలేదు...ఇంతమంది పనివాళ్లు వుండగా మీకెందుకూ తాపత్రయం...వెధవలు వాళ్లే చేస్తారు చచ్చినట్టు ఎవరి కోసమనీ? వంటావిడకన్నీ పురమా యించాను...అన్నట్లు—

'ఓ వెంకమ్మా—కాస్త మొదలు ఇడ్లీ మాట మర్చి పోకద్దు...బాబుగారి కది లేనిదే బొత్తిగా పండగవదు... మొదటి వాయ పంపించు—రామిగాడ్ని 'బెడ్ కాఫీ' పట్టుకురమ్మను'

(మల్లీకాస్సేపాగి)

'ఒరేయ్...పుల్లా...పిల్లలకు తలంటి నీళ్లుపోసి కొత్త బట్టలూ అవీ వేయించు...డ్రైవర్ని కారు క్లీనుచేసి వుంచ మను...గుమాస్తా 'పాసు' చేసి 'టివోలీ' లో సీట్లు 'రిజర్వు' చేసాడో లేదో కనుక్కో—అసలే పరధ్యాన్నపు రకం—తీరా వేళకి తెల్లమొహం వేస్తాడు...దాసు నమ్మ కాని మనిషి!...

(ముసిముసిగా నవ్వుతూ)

చూడండీ మిమ్మల్నే శ్రీ. శ్రీగారూ—మరే—ఎంత సేపు ఆలోచించి బుజ్జబద్దలు చేసుకొన్నా తెగడం లేదు...నేనే చీర కట్టుకోనూ?—కాస్త చెబుదురూ......అబ్బ—మొన్న రంగూన్‌నుంచి తెచ్చిన చీరల రంగులన్నీ 'అదోలా' వున్నవి...పోనీ కేవల్‌రాములో తెచ్చిన జార్జెట్లు అంత 'కాస్ట్లీసారీల్లా' లేవు...చివరకు అంతకన్నా ఖరీదైనది ఏదైనా షాపుకెళ్లి తెచ్చుకుంటే మంచిదేమో అనిపిస్తోందీ; ఇంతకీ తగిన 'చోళీ' వుండాలి...దానికి సరిపడే 'సాండల్సు' కుదరాలి...మనం తయారయ్యామంటే 'ఏ—వన్' లా వుండాలీ...చాకచారుగా నిమిషంలో డ్రెస్ చేసుకోవచ్చును...అదెంతపనీ...Art for art's sake in everything dear...అంటాను"

శ్రీ : "ఏమో—రాజీ—శ్రీమంతులకు వుండేకొద్దీ ఏదో తక్కువగానే వుంటుంది...అన్ని చీరలు బీరువాలో నీకోసం మూల్గుతూంటే నీవేమో No...No—అంటావు. పోనీ—నీయిష్టమొచ్చిందే తెప్పించు... దాసు చేతికి క్యాష్ చెక్కు ఇస్తే పనిమాట క్షణాల్లో జరుగుతుంది...కొండ మీద కోతినైనా రప్పించ డానికి సిద్ధంగా! మహారాజ్ఞిగారి ఆజ్ఞ అవడమే ఆలస్యం—"

రా : "మొన్న నేను కట్టించిన ట్వీడ్ సూటూ మాతమ్ముడు ఇంగ్లండునుంచి పంపిన ఎక్ట్ర టై—పూలపూలది...అబ్బ నిజంగా ఏమి Wonderful Selection! దాన్ని చూస్తే సీతాకోక చిలకలూ అవీ జ్ఞాపకం వస్తవి... నిజంగా నాకే కట్టుకోవాలనిపిస్తుందా 'టై'ని చూసేకొద్దీ!—అవి ధరించడం మర్చిపోకండి...

(నవ్వుతూ వెళ్లిపోతుంది)

శ్రీ: "డబ్బుంటే ఎంత దర్జాగావుందో...ఇంతహాయిగా నిశ్చింతగా...అహా—అందుకే ఎవరో వేధవన్నాడు 'ధనమూలమిదం జగత్' అని—(కులాసాగా రాగాలు తీస్తూంటే తెర)

* * * *

స్థలం : మామూలు సంసారుల పెంకుటిల్లు :

శాస్త్రి }
రామమ్మ } భార్యా భర్తలు

సమయం :

(తెల్లవారింది: శాస్త్రి అరుగుమీద కూర్చొని రామమ్మ సానుపు జల్లుతూంటే చూస్తూంటాడు)

రామమ్మ : "ఏమండీ అలా మునించినట్టు కూర్చున్నారు. ఇవ్వేళ సంవత్సరాది పండుగ...నిన్న బజారుకెళ్లమంటే పూరుకుంటిరి...ఇవ్వేళైనా చప్పున వెళ్లి ఒకచీర పట్టుకు రండీ...మీరు వచ్చేటప్పటికి ధనియాల కాఫీ కాచి తలంటుకొని సిద్ధంగా వుంటాను!"

(అని కళ్లాపు జల్లుతూ వుంటుంది)

శాస్త్రి : "బాగానేవుంది సామెత...పండగ వస్తోంది అంటే గుండెల్లో రాయిపడిందన్న మాట. మీ ఆడవాళ్లు ప్రతిపండక్కీ కొత్తకోరికలు తెచ్చిపెట్టుకొంటారే?

రా : (విసురుగా) "మరీ విడ్డూరమండీ మీది...పండక్కీ గాక సరదాలు తద్దినాలకు తీరుతాయిటండీ...ఆడ వాళ్లకు వాళ్ల ఖర్మమాయని అడగనిదే ఒక్కచీర—ఉప్పాడంచు చీర—కనీసం నెల కొక్కటైనా తెచ్చి పారేసిన పాపాన పోరాయె...లక్షణంగా అంద రాడ వాళ్లు వన్నెవన్నె చీరలు కట్టుకుని సీతాకోక చిలకల్లా కులుకుతూ 'ఏమండీ రామమ్మక్కగారు—మీ రింకా పాతపీలికల్లోనే వున్నారు పండగపూట' అని దీర్ఘాలు తీస్తే నాకెంత వొళ్లు పచ్చిపోయినట్లుంటుందో! ఎంత సిగ్గుపోయి బొగ్గు కప్పుకున్నట్లవుతుందో! నిజంగా మీ రేమైనా ఊహించారూ! అందుకే ఇన్నిసార్లు చెప్పటం...నలుగురుల్లో 'ఫలానా పుల్లయ్యగారి భార్య కట్టుకున్న చీర ఎంత బాగుందో' అనుకొంటే—ఆ గౌరవం మీకేగాని నాకవుతుందేటండీ?"

(వంగి ముగ్గులు తీరుస్తూ వుంటుంది)

శాస్త్రి : (సద్దుకున్నుర్చుని) "ఉష్...ఎంత ఉపన్యాసం...అయినా నీ పుణ్యముంటుంది...నాదగ్గర చిల్లిగవ్వ లేదు" ఆ కోమటిసేనుక్కి ఇప్పటికే—బాకీ వున్నాము...ముఖం తప్పించి తిరగలేక చస్తున్నా... ఆడవాళ్లకు మగవాళ్ల కష్టసుఖాలు అవసరం లేదు... అదేమంటే 'ఈ చీరండీ...ఆ చీరండీ'—అని సాగ దీయడం చేతనవును...పాశ్చాత్యదేశాల్లో స్త్రీలువాళ్ల మగవాళ్లతో సమానంగా, పాటుపడి చల్లనీళ్లకు వేడి నీళ్లన్నట్లుగా తోడుపడ్తున్నారు...మనవాళ్లు చూసైనా నేర్చుకోవద్దు...'

రా : 'ఆ...వాళ్లకంటే పిల్లా పీచు వంటా పెంటా వుండదు కాబట్టి ఆ దొరసానమ్మలు టక్కుటిక్కు లాడుతూ ఉద్యోగాలు చేస్తారు...వూళ్లూ ఏలుతారు...వాళ్లకు పెద్దముత్తయిదువులు మాకూ సాటివస్తారూ... చాల్లెద్దురూ—'

శా : (కోపంగా) 'ఆ...యే...వూ—యీసడింపు చేస్తున్నావు...మీరే మహా పతివ్రతలూ...వాళ్లేమో పచ్చి సానులూను...బొత్తిగా ప్రపంచజ్ఞానం లేక వచ్చిన పాడుతలంపులంటే ఇవే...అందుకే అన్నారు 'స్త్రీ విద్య' అని అనుభవజ్ఞులు—'

రా : (ఉపన్యాస ధోరణినభినయిస్తూ) "అందుకే స్త్రీ స్వాతంత్ర్యం—సమాన హక్కులూ—విడాకులు—అని ఘోషిస్తున్నారు విద్యావతులు...'

శా : 'ఇవన్నీ ఇంట్లో కూర్చుని రేడియో వింటూ నేర్చు కునే చిలకపలుకులు...ఆడవాళ్లెబుబద్తే అటే తియగు తారు...వూరికనే అన్నారూ 'శక్తి స్వరూపిణీ—చండ ణాసినీ—మహిషాసుర మర్దనీ' ఇత్యాదులు'

రా : 'అగండి, ఆగండి...ఇప్పుడు కష్టపడి సహస్రనామ జపం పూర్తిచేయ నక్కరలేదు...అయినా మీరన్నా రంటే తప్పేముంది గనుక...మీరు దయపుట్టి తెస్తే వొళ్లు దాచుకుంటాము—చేసిన చాకిరీకి 'కబళం' వేస్తే కడుపు నింపుకొంటాం—ప్రభువులు మీరు... రాజ్యం మీది...చరణదాసీలం—మే మేపాటివారం స్వామీ! మీకు కరుణ గల్గాలి మా కడుపునిండాలి... ఇదేగా పురుషులు మాకు నిర్ణయించిన ధర్మపథం?'

శా : (ప్రార్థేయ పూర్వకంగా) "బాబ్బాయి...రామమ్మ తల్లీ—కాదుగాదు...నీకు పుణ్యముంటుంది...పొరు గింటి పుల్లమ్మ చెవులు గిల్లుకొని గోడచతలనుంచి వింటోంది...సిగ్గు చేటుపాటు—'శాస్త్రి వెధవ చేతగానివాడు; కానీకి మారనివాడు' అంటూ నీలాటి రేవు వద్ద రేపేపాటికి 'ఢంకా' వాయిస్తుంది—ఇంటి గుట్టున్నారు...అబ్బె—ఛా—ఏమీ లక్ష్యపెట్టవు."

రా : ఊ...ఊ (ఏడుపు స్వరంతో) ఇంతకూ—చీర తెమ్మంటే...ఇన్ని చీపురు దెబ్బలూ...ఊ...ఊ... (కంటతడి పెట్టుకుంటూ ఇంట్లోకి వెళ్లిపోతుంది) తెర;

* * * *

ముసలి తాత

మనుమడు సూరి.

స్థలం : పూరిగుడిస :

సమయం

బాగా తెల్లారింది :

వీధులో సందడిగా వుంటుంది.

సూరి : (నులక మంచంమీదనుంచి లేస్తూ) "తాతా— ఇంటింటా...ఎంతెంత సరదాగావున్నారో...ఇయ్యాళ పండుగ...సాన పెద్ద పండుగతాతా"

తాత : (నిర్లిప్తితకంఠము) ఆ...పెద్ద...పండుగే! వున్న వారికన్నీ పండుగలే...మనగోసం కాదురా పండు గలు...కంబళీలో వెచ్చగా కుంపటల్లేవుంది...సూరిగా- కడుపులో కాళ్లెట్టుకొని కదలకుండా పండుకోరా— మాట్లాడక...వాటివూసు మనకేటి (దగ్గుతాడు—)

సూరి : 'ఏంది తాతా నీమాటలు...పొద్దుకాడే లేచి వూరంతా సంబర పడ్తుంటే పండుకో మంటావేటి? దరిద్రంగాదే...తలకడుక్కోవాలి...మంచిమంచి బట్ట లేసుకోని (నోరు చప్పరిస్తూ) పొట్టపొంగేల్లా తినాలి— గదీ పండగంటే"

తా : "అయ్యో" పెద్దకూటలం మావు...సూడు— పినిగిన పేలికలు—బోర్లేసిన గంజికుండా—(దగ్గుతూ, ఆయాసంగా) సెడ్డ కంపేసే కుప్ప—ఏంటీ—ఈటికా పండుగ? మాటలు పేస్తే కోటలవుతయ్యా—ఏటి"

సూ : 'దేవుడంత కాదంటాడేటి తాతా...కొందరికి పండుగ మనకేటి వుండదా? గదెట్లవుతవే...మనం సేసు కొందాం...సూడబోదాం—ఎక్వరేటంటారో సూద్దాం—లే తాతా.'

తా : 'నీకెంత సెప్పినా సెత్తికెక్కదూ...పండుగలన్నీ గొప్పోళ్లకు...మనకెక్కడ ప్రభువులేరున్నారూ? ఏ యింటికి పోయినా సల్లని తల్లులు 'రేపను రోజుల్లో సస్తాంటే పొద్దున్నే మీపాడు మొహాలూ...పండుగ రోజున' గని కసిరికొడ్తారు...ముక్కకైనా దొరుకుతది గానీ...మనఖర్మ—(అని నెత్తిబాదుకుంటాడు)

సూ : 'అవును తాతా...మన మేమైనా గుళ్లోకి పోతామా...ఏవైనా పువ్వులూ ప్రెసాదాలు అల్ల కిస్తామా—ఏదీలేదు—దేవుడైనా వుట్టి సేతులాళ్లని సూస్తడా...బళ్లోకి పంపమంటే నన్నేమో జోలెకట్టి ఈధులెంట తిప్పుతావు...అల్లంద మాసదువు నేర్చిదొర లవుతారు...సదువు నేర్చిందే ఏటొస్తుందీ?... తాతా...తాతా—మనమట్టా, ఎందుకు పుట్టాం— సెప్పు—తాతా'

(తరువాయి 22-వ పేజీలో)

# స్త్రీహృదయము

మూలం :
ఎమ్. ఏ. సింగరాచారి

అనుసరణ :
కె. కామేశ్వర్రావు

"సుశీలా" అని పెద్దగా కేకపెట్టాడు. ఇంట్లో అడుగు పెట్టూ రామారావు. కడుగుతున్న పాత్రలు అవతల పెట్టి చేతులు కడుక్కొని అతని కెదురుగా వచ్చినిలబడింది.

"ఏమండీ" అలావున్నారు? అని అడిగింది సుశీల.

"ఆ! ఏమిలేదు. ఎప్పుడూ నీవు అలాభయపడ్తూనే వుంటావు." అంటూ చిలిపితనంగా సుశీల బుగ్గమీద చిన్నగా కొట్టాడు. సుశీల సిగ్గుతో తలవొంచుకుంది.

రామారావుకు గుఱ్ఱపు పందెములంటే అమితపిచ్చి. అతడు తనకాలాన్ని, ధనాన్ని, పందెములకు పెట్టేవాడు. ఎప్పుడు ఆ పందెములకు సంబంధించిన పుస్తకాలు చదకడంగానీ లేక పోతే ఆ పందెములలోని ట్రిక్కులు తెలుసుకోవలెనని కానీ మహా ఆశ. అన్ని పుస్తకాలు చదివినా, ఒక్క సారైనా పందెంలో గెలువలేదు. ఎప్పుడు ఒకప్పుడు గెలుస్తామన్న ధైర్యంచేత, అప్పులుచేసి పందెములకు పెట్టడం, ఇంట్లో వస్తువులు అమ్మడం యిలాచేస్తూ వుండేవాడు.

ఒక రోజు 11 గంటలకు యింటికి వచ్చాడు. ఇల్లంతా వెతికినా, అడువు పెట్టడానికి వొక్క బొచ్చైనా కనుపించ లేదు. తన పెండ్లాము మెళ్ళోవుండే మాంగల్యంలోని వజ్రాలపై రామారావు కళ్లుపడ్డాయి. "ఆమాంగల్యం అమ్మితే వెయ్యి రూపాయలు వస్తాయి. ఆ డబ్బుతో పందెం గెలవవచ్చు. మంచి లాభం వస్తుంది. ఓ. అప్పుడు మనమే లక్షాధికారి. సుఖమైన జీవితము. హా ఏం! అదృష్టము" అని అనేక విధమైన చెడ్డ ఆలోచనలు తలలో గిర్రునతిరిగాయి.

"సుశీలా. నాకు డబ్బుకావాలి" అని అడిగాడు

"ఏమండీ వున్నదిమన్నది అంతా మీకే యిచ్చేశానుగదా. పోనీ ఆ వెధవపందానికి ఈసారి వెళ్ళకుంటే ఏమి?" అని భయపడ్తూ చెప్పింది.

"ఇదేకడపటి ప్రయత్నం. నాకు యీరోజు వెయ్యి రూపాయలు కావాలి. ఇవాళ నేను తప్పకుండా గెలుస్తాను. నాకు తెలుసు ప్రతిసారి వంద, రెండు వందలు పెట్టి లాభం లేదు. ఈసారి ఒక్కసారిగా వెయ్యి రూపాయలు పెట్టా నంటే తప్పకుండా గెలుస్తాను."

"అ......యి......తే డబ్బు ఎలాగ వస్తుందండి?

"అందుకే సుశీ, నీదగ్గరకు వచ్చింది. ఇంట్లో ఏమిలేదని నాకు తెలుసు. కానీ ఈసారి మాత్రం నీమెళ్లో వుండే మాంగల్యం.........?

సుశీల తన భర్తమాటలు నమ్మలేకపోయింది. తన భర్తే స్వయంగా, తన మంగళసూత్రం అడుగుతున్నాడా అని పించింది— "ఏమండీ...నా...మాంగల్యమా...వివాహం రోజున అగ్నిసాక్షిగా నామెళ్ళో కట్టేరేమీరు...దానిని నా చేతులారా మీకు యివ్వడమా...మీ సంతోష కోసరం నేను అడ్డు చెప్పలేదు...దీనిని మాత్రం నే నివ్వలేను— క్షమించండి—"అని తన భర్త కాళ్ళమీదపడి ఎంతో ఏడ్చింది.

"ఛీ, మహాపతివ్రతవు మాంగల్యంలోనే వుందా ముత్తైదువు తనమంతాను. నాకా మాంగల్యము యియ్య లేవా..." అని మాటలకోసరం తడుమలాడాడు రామారావు.

"నన్ను క్షమించండి. అది ఒక్కటైనా నాకు దక్క నియ్యండి." అని కాళ్ళవేళ్ళ పడిబతిమాలుకుంది.

"ఈ ఆటలన్నీ నా దగ్గరసాగవు." అని తన చేతుల్తో పైకి లేవతీశాడు. 12 గంటలు కొట్టింది.

"త్వరగా తియ్యి. ఆలస్యం చెయ్యకు. నాకుటైం లేదు" అని వొకటే ధోరణిగా మాట్లాడు తున్నాడు.

సుశీల కొంచెం ధైర్యం తెచ్చుకొని, "మీరడిగినట్లు యిస్తాను. కానీ నా ఈ చివరకోరికతీర్చి వెళ్ళండి. నా మాంగల్యము తీసేముందు నన్ను చంపండి. ఆ విధంగానైనా నా మనస్సుకు శాంతి కలుగజేయండి. భర్త పాదాలపైన ప్రాణాలు విడిచేదానికన్నా, పవిత్రమైన కార్యము, హిందూ స్త్రీకి మరి యొకటి లేదు. మీపాదలను నా అశ్రువులచేత కడగనియ్యండి." అని తన కోరిక చెప్పింది.

“ ఆ బాలు, నీ వేదాంతము, నీవునూ. త్వరగా యిచ్చేయి. లేకపోతే ” అని అంటూ బలాత్కారంగా, సుశీల మెడలో నుంచి మాంగల్యాన్ని తీసి పోబోతున్నాడు. సుశీల తన భర్తదోవకు అడ్డుపడి అనేకవిధాల బతిమాలుకుంది. కానీ ఏం ప్రయోజనం అక్రూర హృదయుడైన రామారావు, పందెమునకు పోవలెనన్న ఆతృతతో భార్య మాటలను లెక్క చేయక, నిర్దయతో పాపం ఆ అమాయకురాలిని, కాళ్ళవేళ్ళతన్ని వెళ్ళిపొయ్యాడు.

“ ఇప్పుడు, వేలాదిగానున్న దురదృష్టపు వితంతువులలో నేనుకూడా ఒకదానినా ? సంఘంచేత నీచపుబ్రతుకు కనుపించుకొనుచూ, ఎదుటివారిచేత హీనంగా చూడబడుతుంటారో అటువంటివారిలో నేనుకూడ ఒక దానినేనా ? ఎవరినైతే పుణ్యకార్యములకు ఆహ్వానించరో, ఎవరికైతే పవిత్రమైన కుంకుమ నుదుటపెట్టు కొనుటకు అర్హతలేదో అటువంటివారిలో నేనుకూడా ఒకదానినేనా ? ” అని పరిపరివిధములైన ఆలోచనలలో మునిగిపోయింది. పొంగి వచ్చే కన్నీటిధారను, తన పమిట కొసతో తుడుచుకుంటూ, తనేదోమహాకార్యము చేయడానికి తల పెట్టినట్లుగా, శూన్యమైన ఆకాశంలోకి ఒక్కసారి చూచింది.

పందెమునందు మన రామారావు ఒక్కసారిగా వెయ్యి రూపాయలు పెట్టాడా, గెలిచాడా, రామారావుఒక గొప్ప ధనవంతుడు. లేదా ఒక బిచ్చగాని కన్నా అధమ మయిన బ్రతుకు. తన జయం కోసరము లోలోపల భగవంతుని ప్రార్థిస్తున్నాడు. అంతా రెండు నిమిషాల్లో తేలిపోతుంది. అదృష్టం తిరిగింది. రొట్టెవిరిగి నేతిలోపడ్డాది. ఒక్కసారిగా అతని జేబిలో 75 వేల రూపాయలు ఘల్లుమన్నాయి.

కానీ ఏం ప్రయోజనం. ఆ డబ్బుచూచి మాంగల్యం కోసరం తన భార్యను ఎంత హింసించింది ఒక్కసారి తన కండ్ల ముందర మెరిసింది. తను చేసింది తప్పు అని అప్పటికి తెలివొచ్చింది. ఎలాగైనా సుశీలను క్షమాపణ వేడుకుందామని యింటికి బయల్దేరాడు. అప్పటికే చీకటి పడిపోయింది. దోవలో మంచి సిల్కుచీరలు, గాజులు, అన్నీ కొన్నాడు. దేనికొరకైతే తన భార్య మనస్సు కష్టపెట్టుకుందో, ఆ మాంగల్యాన్నే మళ్ళీకొన్నాడు. ఇల్లు చేరుకున్నాడు.

ఇల్లాంతా చీకటి. నిశ్శబ్దం. ఏంతోచలేదు. దీపం వెలిగించాడు. ఒకమూల ఒకచిన్న వుత్తరం తన కోసరం ఎదురు చూస్తూవుంది. పైకితీశాడు అందులో యిలావుంది.

“ నాథా. నేను మీ సంపాద్యంలో ఒక్కవంద రూపాయలు మాత్రం దాచగలిగాను. బల్లపై పెట్టెలో వున్నాయి. భగవంతుడు మీకు ఎల్లప్పుడు జయముగలుగ జేయుగాక. మీ అశాంతమైన జీవితానికి నేను కారణము కాబట్టి నన్ను క్షమించండి. ”

ఆ వుత్తరం చదవలేకపోయ్యాడు. చేతులు వొణికిపోయినాయి. దిగచెమటలు పోసింది. ప్రక్కనున్న గదిలో మంచంపైన ప్రశాంతమైన నిద్రపోతూంది సుశీల.

తన కారణంగా తన భార్యను పోగొట్టుకొన్నానని తెలుసుకున్నాడు. ఇంతలో తనలో ఎదో పెద్దశక్తి నశించిపోతున్నట్లనిపించింది. తల సుశీల హృదయంపైన పడింది. కొద్దిసేపట్లో సుశీల యొక్క పవిత్రమైన, ప్రశాంతమైన హృదయంలో లీనమైపొయ్యాడు.



(34 వ పేజీ తరువాయి)

తా : ‘ బిచ్చపోళ్లు మరెట్టపుడ్డరో—అళ్లూ బిచ్చపోళ్లగా, వుడ్తరు...నువ్వొద్దంటే పోతుందా ? ’ వొల్లపోయి లాభమేట్టి ? నాగుండెసెరువవుతుంది.. నూరన్నా— ఓచిన్ననూరయ్యా గోడకు జేరబడి ఏడుస్తే— నేనేమి చేయన్రా...నీ అవ్వో అమ్మో వుంటేగింత సిన్న బుచ్చుకోవు...గదీలేదు...అయినా మన ప్రెభువులు సల్లంగ వుంటే మనకష్టాలు కాపురముంటయ్యా— నూరన్నా—బ్రతికుంటే బలుసాకు దినొచ్చురేపు... ధైర్యంగుండాలి సిన్నయ్యా......’ (ఆయాసంతో దగ్గుతూవుంటే) తెర.



ఉద్ధరించవలసిన గ్రామ వినోదాలు

# బుర్రకథ

※ శ్రీ కవికొండల వేంకటరావు ※

ఈ ప్రసంగనామమును విడదీసినచో కనబడేవి ముఖ్యమయినవి మూడు. (1) ఉద్ధరణ (2) గ్రామ వినోదాలు (3) బుర్రకథ. ముందు వరుసగా ఈ మాటలను పరిశీలించి చూదాము. "ఉద్ధరణ" అన్న పదమునందు అసలు వస్తువు క్రింద పడియున్నప్పుడు దానిని పైకి లేవనెత్తు నర్థమిమిడి యున్నది. భారతదేశమునందు గ్రామ సౌష్టవము, జానపద తుష్టికలిగి వున్నప్పుడు, ప్రజలు యావన్మంది, పల్నాటి వీర చరిత్ర మున్నగు శౌర్యగాథలను పాడుకొను చుండెడివారు, నేర్పరులు పాడునప్పుడు చెవులు దోరపెట్టుకొని వినుచుండెడివారు. అందలి తెనుగు సాహిత్యమును, తెనుగు రసమును చూరగొనుచుండెడివారు.

"ఎఱుగ వేనాబల మింబీవరాక్షి!
నలగాము డెఱుగును నాదు శౌర్యంబు
ప్రళయకాలమునాటి భైరవురీతి,
సైంధవ వధవేళ సవ్యసాచియగు
విజయుడు రణములో వెలసినయట్లు,
వాయు పుత్రుడు లంక వడితోడజొచ్చి
భస్మంబుగా గాల్చి ప్రబలిన కరణి,
జలధి మధ్యంబున సారెకుదిరుగు
భూరిమంధరనగ భూధ్రంబుపోల్కి,
పాలాక్షుడతి రౌద్ర పటిమ మీఱంగ
త్రిపురంబులను సంహరించిన గరిమ,
కాలాగ్నిలోకమున గాల్చినమాడ్కి
జంగమస్థావర సకలవస్తువుల
ప్రళయంబు ముంపంగ బరగినకరణి,
గామభూపతి సేన గడగడ వణక
విక్రమక్రమశక్తి విడివడజొచ్చి
పృథ్విపై పీనుంగు పెంటలుగాగ
విహరింతుమదిలోన వేడుకకొలది."

అన్నంతటను పంక్తులు పాటించినప్పుడు ఏ ఆంధ్రుని నెత్తురు ఉడుకెత్తదు? అందు శగువాయిద్య గాంధ్రతో, హంగు గాంధ్రతో నుంచి హెచ్చరిగ్గా, వెన్నెలబయళ్లనో, కోటానకోట్ల చుక్కల క్రిందనో, ఆలాపించి నప్పుడు, ఆసేతు, ఆలీల, అపురూపములయి యుండనోపు. ఇప్పుడేవి? అట్టి అవకాశములు కనిపించవు.

పల్లెటి ప్రజలు పట్నవాసముల కెగబడి, అందలి సినీమా భవనములందు అలవడుచున్న "కోకాదిల్లగి" "చిప్ చిప్" మున్నగుపాటలనే స్మరించగ చున్నారు. ఇట్టి దానిని సరికట్టవలెనన్నచో, వారిని వెనుకకు మఱలించవలెనన్నచో, గాథారూపకములైన మనపాటలను, పదములను, భావపూరితముగ నుండునట్లు, నిరూపించుచు నుద్ధరించవలెను. అప్పుడుగాని యందొదిగియున్న సముత్సుకత, శౌర్యము, సాధన, సంపత్తి, తట్టనేరవు. కావున వీటినుద్ధరించ వలసిన యగత్యమున్నది.

అయితే వీనిని "గ్రామ వినోదము" అని కుదించుటా? అట్లగుచో కట్టు కథలుగా మాటి పోగలవు. ఇయ్యవి గ్రామాలకే అనువర్తించునవికావు. వినోదమునకైయే పాడునవి కావు అనియుందు మనము గ్రహింపనగును. మనదేశమునందు ఏ కలకత్తా మదరాసు బొంబాయిలనో తప్పిస్తే, తక్కిన వి నిజరూపంగల పట్నములు కానేకావు. చెట్టులేని చోట ఆముదపుచెట్టే వృక్షమనట్టు మనము ప్రతి పెద్ద ఊరును నగరమనీ, అందలి ప్రజలను "నాగరీకు" లని గర్వపడుతున్నాము. అది సమంజసము కాదు. మఱిన్నీ వినోదము కానిదేది? కాలుంతెలము నాటకము ఆడు నప్పుడు వినోదమే? నవల చదవడం వినోదంకోసమే? అలాంటి వినోదముగానే ఈ బుర్రకథలు మున్నగు వాటిని తెలిసికొన్నప్పుడే వాటికి విలువ నిచ్చినవాళ్ల మగుదుము. అట్లుగాక "వినోదము" అన్న విని పకపకానవ్వుచు వెళ్లిపోదు రేమో!—దానికీభయం—శ్రోతలు సంకుచితార్థ మివ్వమని అభయమిచ్చు వారగుచో, బుర్రకథ, నిజమైన

సాహిత్యమేనని చదువతగ్గ సాహిత్యమేనని, చక్కని సాహిత్యమేనని ఘంటాపథంగా చాటగలను.

యక్షగానం, హరికథ, జంగంకథ, బొబ్బిలిపాట అవతారం, బుర్రకథ, ఇవన్నీ తెనుగువారి భాషాయోషామతల్లి యొక్క కొన్ని విశేష విభూషలు.

అందు "బుర్రకథ" ను కేటాయించి చూపడమన్న కష్టమే. ఈమాట ఎక్కువ గుంటూరు కృష్ణాజిల్లాలందు, వాడుకలో నున్నట్టు కానవచ్చును. అది తూర్పున వ్యాపించక పూర్వము అక్కడ, అనగా ఉభయ విశాఖపట్నోభయ గోదావరీ మండలాల, "పదము" అనే విశాలమకుటముతో, "బొబ్బిలిపాట" అని "కామమ్మకథ" అని ఇలా వేరువేరు నామాలను తెలిసియుండేది. ఇంతేకాకుండా, ఇదేకాలమప్పుడు మహారాష్ట్రీలు మనదేశము నాక్రమించుకుని అధివసించుకుని, "భళాభళానోయి తమ్ముడాసై" "మేలు భళానోయిదాదానా" అని పాడేవారు కూడాను, దానిని పుచ్చుకునే ఆమధ్య రెండవ ప్రపంచ యుద్ధావసర ప్రచారముగ

"వచ్చెరా వచ్చాడు రాసై
జపాన్ వాడొచ్చె రాసై
రంగూన్ దగ్గఱకురాసై
ఇలపాక దగ్గఱ కొచ్చాడోయ్."

అని పాడేవారు.

వీటిల్లోకొంత అపురూపం, అతి వినూత్నతకద్దని యీ విధంగా శ్రోతల్ని హెచ్చరించేవారు

"రామరావణా యుద్ధమె కాదు—
తందానతాని తందాన
బొబ్బిలి వారలగుద్దులాటలు కాదూ తందాన
బాలనాగు కథకా కాదు
కామమ్మకథతా నేకాదు
అచ్చమమ్మకథ అసలే కాదు"
"ఆకథ యీకథ కాకపోతెనే వెళ్లి—
పోతానోయి" తాని తందాన

అని బుర్రకథ రూపం అదోచిత్రమైన రూపంగా తెల్పి, వినే వారికి విసుగులేకుండా వినిపించేవారు.

ఈ రూపాన్ని రామారావను జమీందారు రైతు సమస్యకు ముడిపెట్టారు. ఎట్లా అంటే,

"రామాపురమని ఉత్తరాదిలో రాజిలు నొకపల్లె
రామారావను జమీందారుడా రామాపురముందు
ఆపల్లెను గలవన్నీ గుడిసెలె — అడివి కంపవడులె
రామాపురమని ఉత్తరాదిలో రాజిలు నొకపల్లె
రామారావను జమీందారుడా రామాపురముందు
ఎండకు ఎండి వానకుదడియుచు, కండలుకరిగించి
పండవు పొలములు, ఎంతగ వారలు—
పాటుపడినగాని"

అని—కథ పెద్దగనుగోండి—

ఈలా ఈ మధ్యన క్రొత్తక్రొత్తకథలు చాలా చాలా పాడబడు తున్నాయి. "వీరేశలింగంగారి కథ" "అల్లూరి సీతారామరాజుగారి కథ" "క్రిప్సురాయబారం" "హనుమంత సత్యాగ్రహము" మున్నగునవి. మీలో చాలామంది వినేవుంటారు. ఇంకనూ కలవు "రజాకర్ దురంతం" అని "నైజాం" అని అధునాతనమైనవి. అన్నింటికంటె క్రొత్తది ఈమధ్యనే చదివింది "ఆంధ్రరాష్ట్రాన్ని" గురించినదైయుంది. దాన్ని రచయిత బుర్రకథ అనక జంగం కథ అని వాడాడు. అందులో అతగాడు

"ప్రపంచమే అత్యద్భుతరీతిని పరిణమించుతోంది;
నిన్నటి లక్షాధికారు లెల్లరు నేడు బికారీలు;
నిన్నటి కిరీటమాంధాతలు నేడో సామాన్యుల్;
ప్రపంచమే అత్యద్భుతరీతిని పరిణమించుతోంది"

అని ప్రకటించాడు.

ఇలాగ్గా ప్రచారంకోసం హెచ్చుగా పోయి మీది పేడి పెపరట్ల పెనంలా ఈ బుర్రకథ చట్రం ఉపయోగింపబడుతూ ఉన్నట్లుంది. అట్లుగాక చక్కని బుర్ర కథలు పేర్చి కూర్చి, మిక్కిలిగా కళ, మక్కువ, అక్కజము, కొల్పవలసింది అని నామనవి. ఈ మాదిరిలో ఉద్ధరించవలసిన బాధ్యత ఆంధ్రుని భుజస్కంధం మీదవుంది. అప్పుడు బుర్రకథ పతిష్టకాంచడమే కాకుండా నిజమైన గ్రామ వినోదం కాగలదు.

[విజయవాడ రేడియోవారి సౌజన్యంతో]

★

# నవచైనా నిర్మాత



* శ్రీమతి రేణుకాదేవి *

ఇరవయిరెండేళ్ళ సుదీర్ఘ పోరాటం మా-సియాంగ్ తన మాతృదేశ స్వాతంత్ర్యాన్ని గూర్చికన్న కలలు ఫలించాయి. అభివృద్ధి నిరోధక వర్గ ప్రతినిధియైన చాంగ్-కై-షేక్ నిరంకుశపాలననుండి విముక్తి కలిగించాడు. "నేడు చైనాలో మావ్ సాధించిన విజయాలను గూర్చి ప్రజలు గొప్పగా చెప్పుకుంటూవుంటారు" అని అమెరికన్ రచయిత్రి అన్నాలూయీ స్ట్రాంగ్ తన గ్రంథంలో వ్రాసింది. అచిరకాలంలోనే మావ్, తన పార్టీ-ఆర్థిక, సాంస్కృతిక రంగాల్లో సాధించిన ఘన విజయాలను చూచి యూరప్ లోని రాజకీయ వేత్తలంతా ఆశ్చర్య చకితులయ్యారు.

మాసి-యాంగ్ హ్యూనాన్ రాష్ట్రంలోని ఒక బీద రైతు కుటుంబంలో జన్మించాడు. పేద విద్యార్థిగా, పొట్ట పోసుకునేందుకు పెకింగ్ విశ్వ విద్యాలయంలో లైబ్రేరియన్ గా పని చేస్తూ, సమకాలీన దేశ చరిత్రను ఆకళింపు చేసు కుంటూ, తన చుట్టూవున్న సమాజ వ్యవస్థను అవగాహన చేసుకుని మేధావిగా, ప్రజా నాయకుడుగా బయటుబడ్డాడు. ఇది మాసి-యాంగ్ జీవితంలో ఒక పెద్దమలుపు.

ఒకప్పుడు నిరంకుశ ప్రభుత్వపు ఆగ్రహానికి గురియై, కొండగుహల్లో జీవితాన్ని గడిపాడు. నేడు ప్రజల కఖండ విజయం చేకూర్చి మంచూ రాజభవంతిలో నవచైనా భవిత వ్యానికి పునాదులు వేస్తున్నాడు...నలుబది కోట్ల ప్రజలకు ఉజ్జ్వల భవిష్యత్తును నిర్మిస్తున్నాడు.

మావ్ 1893 లో పేదరైతుల కష్టాలకు నిలయమైన హ్యూనాన్ రాష్ట్రంలో, పూర్వాచార పరాయణులైన కుటుం బంలో జన్మించాడు. అది పేదలకే కాదు...విప్లవవాదులకు కూడా తావు. తన యింటి బౌద్ధమత ప్రభావంక్రింద పెరిగాడు.

తన బాల్యంలో జరిగిన ఒక చిన్న ఘట్టం ఇతనిలో గొప్ప సంచలనాన్ని కలిగించింది.

రాజధానియైన చాంగ్షాలో ఆకలితో అలమటిస్తున్న ప్రజలు ప్రభుత్వానికి వ్యతి రేకంగా తిరుగుబాటు చేసారు. నిర్దాక్షిణ్యంగా ఆ తిరుగు బాటునణచి వేసింది ప్రభుత్వం. ముందుముందు అలాటి తిరుగు బాట్లు జరగకుండా ప్రజల్లో భయోత్పాతాన్ని కలిగించేందుకు బహిరంగంగా అనేక మందిని వీధుల్లో చిత్రవధ చేసింది ప్రభుత్వవర్గం. అహృదయ విదారక సంఘటనను గూర్చి మావ్ విన్నాడు. అది తన హృదయంలో నాటుకు పోయింది. నాటినుండీ మావ్ హృదయంలో నిరంకుశానికి వ్యతిరేకంగా ప్రతీకార జ్వాలలు ఉద్భవించాయి.

ప్రఖ్యాత అమెరికన్ రచయిత ఎడ్గర్ స్నో మావ్ మాట లను తన గ్రంథంలో యిలా పొందు పరచాడు. "నా హక్కును నేను రక్షించుకోడానికి యత్నించినపుడు నా తండ్రి కరుణామయుడై చూచేవాడు. కాని అణకువతోను విధేయతతోను మెదలక కూర్చున్నప్పుడు తిట్టి కొట్టే పర్యంతం చేసేవాడు."

## చాంగ్షాకు ప్రయాణం

తన విద్యార్థిదశలో చాంగ్షా పట్టణాన్ని చూసేందుకు వెళ్లాడు. పట్టణ సౌందర్యాన్ని చూసేందుకు కాదు... అక్కడ నివసించే వివిధ ప్రజల స్థితిగతుల్ని తెలుసుకు నేందుకు. వార్తా పత్రికల్ని చదవడం అక్కడే ప్రారంభిం చాడు. రాను రాను డజన్ల కొద్దీ పత్రికల్ని కొని చదివేవాడు.

ఆ రోజుల్లో చైనా సంక్షోభంలో నిండియుంది. చైనా జాతీయ విప్లవ నిర్మాత సన్‌యట్‌సేన్ రాజాధి కారాన్నిధిక్కరించి జాతీయ విప్లవాన్ని తీసుకొచ్చాడు. ఇది ప్రతి దేశభక్తుని హృదయాన్ని చూరగొంది. ఈ విప్లవ నాయకుని చరిత్ర వార్తా పత్రికల ద్వారా మావ్ తెలుసుకున్నాడు.

సన్‌యట్-సేన్ సిద్ధాంతాలు మావ్ హృదయంలో నాటుకున్నాయి. చాలీ చాలని ఏడు డాలర్ల జీతంపై విప్లవ సైన్యంలో చేరాడు. ఆఖరుగా మావ్ పెకింగ్‌కు చేరుకున్నాడు.

# నవ చైనా నిర్మాత

పెకింగ్‌లో మావ్ దుర్భరమైన ఆర్థిక బాధలకు లోనయ్యాడు. వీటినుండి బయటు పడేటందుకు ఉద్యోగంకోసం ప్రయత్నించాడు. తుదకు తనకు పూర్వం నీతిశాస్త్రాచార్యుని సహకారం వల్ల పెకింగ్ జాతీయ విశ్వ విద్యాలయంలో లైబ్రేరియన్ ఉద్యోగం లభించింది.

జీవిత పరిమాణం చక్కబరచుకున్న పిమ్మట, నాడు సంభవిస్తున్న రాజకీయ సమస్యలవైపు దృష్టి మరల్చాడు. తీవ్రంగా ఆలోచించసాగాడు. అప్పుడే 1917 లో రష్యాలో జరిగిన అక్టోబరు మహా విప్లవం ముగిసింది. చైనాలోని ప్రతి విద్యార్థునిలోనూ ఆవిప్లవం అపూర్వ సంచలనాన్ని రేకెత్తించింది.

మావ్‌ను కూడా ఈ విప్లవం ఆకర్షించ గలిగింది. దీన్ని పూర్తిగా అవగాహన చేసుకునేందుకు స్వల్పంగాలభించే కమ్యూనిస్టు సాహిత్యాన్ని చదవడం ప్రారంభించాడు. ఈ సాహిత్యం అతనిలో అద్భుతమైన మార్పును కలిగించింది. నాటినుండే మార్క్సిజముపై తనకపారమైన భక్తి విశ్వాసాలు జనించాయి.

ఆ రోజుల్లో చైనాలో కమ్యూనిస్టు పార్టీలాంటి నిర్మాణాత్మకమైన సంస్థలు లేనందున మావ్ కమ్యూనిస్టుగా గాక-మార్క్సిస్టుగా తయారయ్యాడు. ఈలోగా మార్క్సిస్టు సిద్ధాంతం నలుమూలలా వ్యాపించసాగింది. తుదకు షాంఘైలో చైనా కమ్యూనిస్టు పార్టీ స్థాపించబడింది. మావ్ దానిలో సామాన్య సభ్యునిగా చేరి తుదకు దాని కతడే నాయకత్వం వహించ గలిగాడు. కాని అటుపిమ్మట, బీద రైతుల కష్టాలకు నిలయము, విప్లవాలకు తావు అయిన తన స్వరాష్ట్రానికి పార్టీ నిర్మాణానికై పంపబడ్డాడు.

## బహిరంగ తిరుగుబాటు

1923 నాటికి మావ్ సామాన్య ప్రజల్లో గొప్ప ఖ్యాతిని గడించాడు. అదే సంవత్సరంలో కాంటన్‌లో జరిగిన మూడవ పార్టీ కాంగ్రెసుకు హాజరయ్యాడు. ఈ చారిత్రాత్మక సమావేశంలో కొమింటాంగ్ పార్టీతో కలవడానికి తీర్మానించారు. ఈ సమావేశంలో మావ్ సల్పినకృషి, అతని అప్రతి హతవాక్చాతుర్యము పెద్ద పెద్ద ఉద్యోగులను కూడ ఎంతో ఆకర్షించింది. దాని తర్వాత కొలది కాలంలో నే మావ్ కొమింటాంగ్ ఎగ్జిక్యూటివ్ బ్యూరోకు సభ్యునిగా తీసుకోబడ్డాడు—అజ్ఞాతవాసంలోవుండే కాలంలో. అటు పిమ్మట కొమింటాంగ్ అధికార రాజకీయవార పత్రికకు సంపాదకునిగా ఎన్నుకో బడ్డాడు.

ప్రచార శాఖలో ఆర్గనైజర్లకు తర్ఫీదు నివ్వడానికి మావ్‌ను నాయకునిగా నియమించారు. తరువాత కొమింటాంగ్ వర్గములో చీలికలురాగానే, మావ్‌ను పట్టియిచ్చిన వారికి రెండు లక్షల ఏబది వేల వెండినాణాలు బహూకరిస్తామని ప్రకటించారు!

1927 లో జాతీయ వాదులకూ, కమ్యూనిస్టులకూ విభేదాలు రావడంతో, రెండూ విడిపోయాయి. అదే సంవత్సరం మావ్‌ను తన స్వరాష్ట్రానికి రైతు ఉద్యమాల రిపోర్టును సేకరించడానికి పంపించారు. మావ్ అచ్చటి పరిస్థితులను చక్కగా అవగాహన చేసుకుని రిపోర్టు వ్రాసి పంపాడు. కాని కమ్యూనిస్టు ఎగ్జిక్యూటివ్‌చే అది అంగీకరించబడ లేదు. ఈ రిపోర్టువల్లనే మావ్ తన పనినుండి తొలగి పోవలసివచ్చింది. కాని రైతుల్లో మాత్రం మావ్ యొక్క స్థానం దినదినాభివృద్ధి చెందింది. తుద కాతన్ని అఖిలచైనా రైతు ఉద్యమానికి అధ్యక్షునిగా ఎన్నుకొన్నారు.

ఇక్కడే మాసి-యాంగ్ చైనాలో రైతు విప్లవానికిగల అవకాశాల వేపు తన దృష్టిని సారించాడు. ఇక్కడే మావ్, చైనాలో జరుగనున్న ఏ విప్లవానికైనా రైతులు వెన్నెముకవలె నిలిచి పోరాడగలరని గ్రహించుకో గలిగాడు. ఈ ధైర్యంతోనే మావ్ ముందుకు పోయి విజయాన్ని సాధించాడు. ఇదే సమయంలో అధికార వర్గాలకు వ్యతిరేకంగా పోరాటాన్ని నడపికొంతవరకూ సఫలుడయ్యాడు.

దీనివల్ల మావ్‌ను అనేక విధాల విమర్శించడం ప్రారంభించారు. కాని వారికి సమాధాన మొక్కటే యిచ్చాడు మావ్. విప్లవమనేది విందుకు పిలిచే ఆహ్వానము కాదు... లేక చక్కని చిత్రాల్ని చిత్రించడమూ కాదు..., లేక లేరిక సమాయాల్లో చూసిమురిసేందుకు కుట్టుకునే కుట్టు పనీ కాదు. అది ఒక అచంచలమైన తిరుగుబాటు."

అనేక జిల్లాల్లో ప్రజాప్రభుత్వబలాల వ్యూహలు ప్రభువుల బలాలను సర్వనాశనం చెయ్యడం చూచాడు. ఇవే మావ్ సిద్ధాంతానికీ, కార్యా చరణకూ పునాదులయ్యాయి.

## దీర్ఘ యాత్ర

పార్టీ సభ్యత్వాన్ని అధికం చెయ్యటంలోనూ, సైనికబలాన్ని పెంపొందించడములోనూ మావ్ చూపిన కార్య దీక్ష అనన్య సామాన్యం. అందు వల్లనే అతడు చైనా కమ్యూనిస్టు పార్టీ నాయకునిగా ఎన్నుకోబడ్డాడు. శక్తిసామర్థ్యాలు గల లెఫ్టినెంట్ జనరల్ భూ టే సహాయం వల్లం-చంగ్ కై-షేక్ సైనిక బలాన్ని మించిన సైనిక సంపత్తిని చేకూర్చ గలిగాడు. ఒక సంవత్సరము కంటె తక్కువ వ్యవధిలో శత్రుబలాలను సర్వనాశనం చెయ్యడానికై నాలుగు దండయాత్రలు తననాయకత్వాన నడపి కొద్దిపాటి విజయాన్ని చేబట్టాడు.

1933 తో కమ్యూనిస్టు సైనిక బలం అనేక రెట్లు పెరిగింది. దీన్ని చూసి, జర్మన్ జనరల్ వాన్ షైకెన్ హాసెన్ సహాయంతో చాంగ్ కై-షేక్ కమ్యూనిస్టు ప్రధాన స్థావరమైన కియాంగ్సే మీదికి తన సైన్యాన్ని నడపాడు. శత్రు సైన్యాలు చుట్టూముట్టడించాయి. కాని ఎర్ర సైన్యాలు మావ్ నాయకత్వాన ముందుకు పోయి శత్రు సైన్యాల వ్యూహాన్ని విచ్ఛేదించి చెల్లాచెదరు చేసాయి. ఇదే చరిత్ర ప్రసిద్ధమైన దీర్ఘ యాత్ర. దీనికి సరిపోల్చదగిన ఘట్టము ప్రపంచ చరిత్రలో మరోటి యెక్కడా చూడలేము. ఎనభై వేల సైనికులు యీ యాత్రను 1934 అక్టోబరు 16 న ప్రారంభించారు. ఎనిమిది వేలమైళ్లు వారు ప్రపంచంలోని అతి కఠినమైన ప్రదేశాల గుండా ముందుకు సాగారు. పదునెనిమిది పర్వతాలను అధిగమించారు...ఇరువదినాల్గు నదులు దాటారు. ఈ యాత్రముగియడానికి 366 రోజులు పట్టింది. వారిగమ్యస్థానమైన యెనాన్ చేరుకునే సరికి 20 వేల మంది మాత్రమే మిగిలారు.

ఈ దీర్ఘ యాత్ర వల్లనే చైనా చరిత్రమనకు పూర్తియైన వ్యత్యాసంతో కనబడుతూంది. మావ్ కుశాగ్రత, భూ టే నిపుణత యీ విజయానికి కారణ భూతాలయ్యాయి.

ఈ దీర్ఘ యాత్ర మావ్ యొక్క స్థానాన్ని అగ్ర నాయకునిగా జేసింది. దీనితో మావ్‌కు విదేశఖ్యాతి కూడ లభించింది.

ఈ సమయంలోనే జపాన్‌తో యుద్ధం ప్రారంభమయింది. ఇది చైనాను ఏకంజేసి ఒకే ఒక పతాకచ్ఛాయకు తీసుకురావటుకు, తన శక్తి సామర్థ్యాలను నిరూపించుకొనుటకు తగిన సమయమని గ్రహించాడు. చాంగ్ జపాన్‌తో యుద్ధం మాని యెనాన్‌లోని కమ్యూనిస్టు స్థావరాలపై దండెత్తుతూంటే, మావ్ "ఐక్యంకండి" అని ఎలుగెత్తి చాటాడు.

ఇప్పుడే మావ్ తన "నూతన ప్రజాస్వామికము" అనే గ్రంథాన్ని రచించాడు. ఈ గ్రంథంలో చైనా ప్రజలకు విప్లవ శంఖారావాన్ని పూరించాడు. "కొమింటాంగ్ ప్రతీఘాతంగా తిరిగి నప్పటికీ, వారు ప్రజాద్రోహులుగా తయారైనప్పటికీ, చైనా ప్రజల్లోదాగియున్న అప్రతిహతమైనబలము విజృంభించి, జపాన్ యుద్ధంలోనూ, వారి విప్లవ పోరాటంలోనూ విజయాన్ని సాధించకమానదు." ఈ గ్రంథం చైనీయులలో ఒక అపూర్వమైన మార్పును కలిగించింది.

ఏప్రిల్ 1945 లో జరిగిన ఏడవ పార్టీ కాంగ్రెసుకు మావ్ అధ్యక్షత వహించాడు. కొలది కాలంలోనే జపాన్ ఎర్రసైన్యాలకు లొంగి పోయింది. దీనితో మంచూరియాకు కమ్యూనిస్టులు అధినేతలయ్యారు.

చైనాలో ఒక సామెతుంది. మంచూరియా పాలకులే చైనాకూ పాలకులని. 1949 సెప్టెంబరుతో కమ్యూనిస్టులు చైనా గడ్డనంతనూ వశపర్చుకున్నారు. అదే నెలలో పెకింగ్‌లో "ప్రజాస్వామిక రిపబ్లిక్" ను మావ్-సే-టుంగ్ అధ్యక్షతను స్థాపించారు.

ఈ విధంగా మావ్-సే-టుంగ్ ఇరువదియారు సంవత్సరాల పూర్వం తన మాతృ దేశభవితవ్యాన్ని గూర్చికన్నకలలు నేడు నిజమయ్యాయి.



# దిక్కుమాలిన సంఘం

✻ దుక్కిపాటి. సత్యనారాయణ చౌదరి ✻

"సోదరా! నా మొరాలకించే వారేలేరా. యీ గ్రామంలో? పదునైదు దినాలనుంచి యింటియింటికీ తిరిగాను. ప్రతి పెద్ద మనిషినీ సాయపడమని ప్రార్థించాను. నా దీనావస్థ వారితో విన్నవించుకొన్నాను. ప్రతివారూ నీ అత్తగారినోరు మంచిదికాదమ్మా, నీమరది దాసు ఉన్నాడంటే నీతీజాతీలేని దొంగముండా కొడుకాయె. మాకెందు కమ్మా లేనిపోని తగాయిదా వారితో అన్నవాళ్ళే. రాత్రి 8 గంటలకు చాకలిసుబ్బి చెప్పింది చౌదరిగారు పట్నంనుంచి వచ్చారని. నాప్రాణాలు లేచివచ్చినై. మీరాక విన్నంత" నే అంటూ తన దీనావస్థ చెప్పటం మొదలు పెట్టింది సుశీల.

"అన్నయ్యా,

ఏ మనిచెప్పను నాదీనావస్థ. మొదట్లో నావివాహ మయ్యేదినాలలో నాకు తగిన పరిజ్ఞానమున్ననూ పెద్దలను ఎదిరించి, నా యిష్టానుసారం నడచుకోటానికి సాహసించ లేకపోయాను. ఎలాగో వివాహం చేసారు. మా యిద్దరన్నలమధ్య నేను ఒక్కతెనే కాబట్టి వారు నన్ను చిన్నప్పటి నుంచి చాలా గౌరవంగా చూస్తూవారికి కొండపల్లి వద్దయున్న మెరక భూమిలో నాల్గు యెకరాలు నాకు యిచ్చారు. మానాన్నగారు మా చిన్న తనంలోనే చనిపోవుటచే, వ్యవసాయంచేసే దిక్కులేక పాడుపడిపోయి ఉంది. ఇప్పుడు మా అన్నయ్యలు వ్యవసాయంచేసి పండించు కొందామన్నా తగిన పెట్టుబడిలేక చేయలేకుండా యున్నారు.

"నేను కాపురానికి వచ్చిన తరువాత నాభర్త బుచ్చబ్బాయిగారు, నా అత్తగారు భాగ్యమ్మగారు, నన్ను ఎన్ని అవస్థలు పాలుచేసినదీ మీరు పొరుగింటివారుగాన వింటూనే యున్నారు. నాభర్త సరయిన వారయితే ఒకరిని అనవలసిన పనేముంది లెండి. నాల్గు సంవత్సరాలునరక యాతనలనుభవించి, యిక సహించలేక యే నూయో, గోయ్యో మాను కొందామని అనుకొంటూ ఉండేదాన్ని. యింతలో చిన్నన్నయ్య వాసువచ్చి తీసుకొని వెళ్ళాడు నన్ను.

"మొదట నుంచీ, మా అన్నయ్యలు దేశసేవా తత్పరులై యుండుటచే నాకు కూడా ఆభావాలే అలవాటు పడేలాగు నన్ను తయారుచేసి, కొండపల్లి ఝాన్సీ అని సంభోదించేవారు కూడాను. యిప్పుడు ఏమీ జరుగక పెద్ద అన్నగారు ఎలిమెంటరీస్కూలు మాష్టరుగా పనిచేయుచున్నారు. వాసుగారు ప్రవేటు చెప్పుకొంటూ వ్యవసాయం చేయగలిగింది చేసుకొంటూ కాలక్షేపం చేస్తున్నారు"—

"సుశీలా ఏంప్రయోజనం! నీవుగతాన్ని తల్చుకొని కడుపు చెరువు చేసుకొంటే" అని, ఓదార్చా. నేను ఓదార్చినకొలది ఆమె మరింత దుఃఖంలో మునిగిపోయి, "నన్ను చెప్పుకొని నా ఆరాటాన్ని తీర్చుకోనియ్యి సోదరా"! అని, మొదలు పెట్టింది—

"మొదట నుంచీ నా పెనిమిటి దాసుగార్కి త్రాగుడు అలవాటు ఉంది. అక్షరజ్ఞానం లేని అమాయికులగుటచే యెవరు చెప్పితే వారిమాటలువిని, దుర్వ్యసనాలకులోనయి ఆస్తి అంతా గుల్ల చేసినారు. యిప్పుడు మాకు మిగిలింది ఒక యెకరం పాతికసెంట్లు కృష్ణా జిల్లామాగాణి మాత్రం. యీమధ్య దేశంలో జరుగుతూండే రాజకీయ తగాయిదాలన్నీ ఎవరోగిట్టనివాళ్ళు చెప్పిన మాటలువిని, రాజకీయాలు అనే పదానికేయర్థం తెలియని దాసుగారిని ఖూనీకేసు ముద్దాయిగా బనాయించి, ద్వీపాంతరవాస శిక్ష విధించింది ప్రభుత్వం. మా అత్తగారు యిది అదను చూసుకొని పుట్టినచోటల్లా అప్పులు చేసి కేవలం దూబరా ఖర్చులతో సంసారం పాడుచేయటాన్కి మొదలు పెట్టింది.

"దాసుగారు యెన్ని నేరాలుచేసినా, నేను ప్రస్తుతః స్త్రీ జన్మ ఎత్తానుగనక్క జైలులోకి చూడటాన్కి వెళ్ళినను నావంక చూడలేదు సరిగదా, 6 సంవత్సరముల వయసుగల తన కుమారునైనా చూడలేదు. పై పెచ్చునా మొఖానజైలు

యధికారుల ఎదుట, తోటిఖైదీల ఎదుట అనరానిమాటలు అన్నారు. మారు మాట్లాడక తిరిగి వచ్చా.

"అక్కడ అన్యాయాలకు కూడా జరుగని పరిస్థితులు వచ్చేటప్పటికి, ఎలాగో అవస్థపడి మిషను కుట్టటం నేర్చుకొన్నా. నాల్గుకంటెల కూహాయిలకు, నాల్గు ఎకరాల మెట్టభూమి తాకట్టుపెట్టి మిషనుకొనుక్కున్నా. యింతలో గుండె నొప్పియధికమై, అనారోగ్యముగాను, బాధగాను ఉండుటచే యీ మిషను కుట్టే ఓపికలేక, కూటికి జరుగక అలమటిస్తూ యిచ్చట ఉన్న యెకరం భూమితో బ్రతుకుదామని కుర్రవాణ్ని తీసుకొని వచ్చా. యిదీ నా గతచరిత్ర—

"నేను గడపలో అడుగు పెట్టా. బోలెడు చీవాట్లు, సహించరాని అసభ్యపు కూతలు ప్రత్యక్షమయినై నా అత్తగారి నోటి వెంట. కాళ్ళమీదపడ్డా, ఏడ్చా, దిక్కులేక వచ్చానని చెప్పా, తల్లివి అయినానీవే అత్తగారి వయినానీవే నని ప్రార్థించా. ఆమె హృదయం కరుగలేదు. పైపెచ్చు "నీ మొగుడి కేసుకు చాలా డబ్బుఖర్చు పెట్టాము. దానికి నీవు నోటు వ్రాస్తావా లేదా" అని బాధ పెట్టటం మొదలు పెట్టింది. సాహసంచేసి యెకరంపైరు కొట్టించుకొని పండేగింజలతో బ్రతుకు దామనుకొంటె వీలులేదు నీకు యిచ్చట ఏమిలేదని మా చిన్నమరిది నారాయణ, ఆడబిడ్డ పెనిమిటి రామయ్య అడ్డం వచ్చారు. జబర్దస్తీగా కోర్టులో కట్టడానికి డబ్బులేదని మాత్రం లాక్కున్నారు. నేను గంజినీళ్లుతాగి వారందినములయింది. అత్తగార్కి భయపడి ఎవరూ నన్ను రానివ్వటం లేదు. యిదీ నా దీనావస్థ."

ఆమె శోక కంఠాన్ని వింటూంటే హృదయం తరుక్కుపోయింది. మాట్లాడ లేకపోయా. "సోదరీ భయంలేదు. ఏడవకు" అని బ్రతిమాలా. కాని యీమెను ఊరడించటానికి నాకు అలవికాలేదు.

మొదలు పెట్టింది మరల సుశీల.

"అన్నా! సంఘంలో న్యాయంలేదా? స్త్రీలు, పురుషులు సమాన భాగస్వాములు కారా! యీ ప్రకృతిలో పురుషుడు చేసే ఘోరదురంతాలకు, తప్పిదాలకు స్త్రీ బలియై పోవాలసిందేనా? నాల్గు రోజులనాడు విద్యావంతులు గదా యని యీశ్వరరావుగారూ, వెంకటేశంగారు కూర్చొని ఉంటే నా దీనావస్థ విన్నవించుకొన్నా. న్యాయం కలుగచేయమని ఏడ్చా. వారు యింకా పైపెచ్చు, "ఆడముండలు యిలా బజారులోపడి తిరగటానికి, ఏడ్వటానికి సిగ్గులేదూ? నాల్గు సంవత్సరాలు మొగుణ్ణి వదలిపెట్టి, చెడిపోయి, యిప్పుడు ఆస్తికోసం తయ్యిమంటూ వచ్చావా" అని, చీవాట్లు పెట్టేసరికి స్త్రీ జన్మ ఎత్తటమే మహాపరాధం అని అనుకొన్నా. స్త్రీ ఎంత నిజాయితీగా ప్రవర్తించినా దోషాన్ని అంటకట్టే సంఘం, పురుషుడు, అనేక వ్యసనాలకు లోనయి, నీతినియమాలు లేక సంఘంలో చీడపురుగులుగా ప్రవర్తించినసూ నోరు మెదపలేదు" అని ఒక దీర్ఘ నిట్టూర్పు విడిచిందామె.

నా శరీరమంతా ముచ్చెమటలు పోసినై. శరీరం గగుర్పొడిచింది. చూడలేకపోయా ఆదృశ్యాన్ని "అమ్మా! నాచేతనయిన సాయంచేస్తాను. ఓర్పుపట్టు, నీహక్కుల కొరకు పోరాడు, నేను అండగా ఉంటాను" అని, బలవంతాన ఓపిక తెచ్చుకొని అన్నా. యీ సంభాషణంతా ఉదయం 6 నుంచి 10 గంటలవరకూ.

"మరల కలుసుకుంటా. మీరు ఎన్నిరోజులు ఉంటారు?" అంటూ వెళ్ళిపోయింది. నీరయిపోయిన హృదయంతో ఏమీ మాట్లాడ లేకపోయాను.

"ఏమండీ సుశీలమ్మగారయేరీ! కాస్త భోంచేసి వెళ్ళుతారు" అంటూ నా అర్ధాంగి సుగుణ వచ్చింది. ఇద్దరం కలసి వెదకినాం. యింతలో ఎచ్చటకు వెళ్ళిందో కనపడలేదు—

మరునాడు ఉదయం 6 గంటలకల్లా సుశీల యింటిలో చచ్చిపోయి ఉన్నదనీ, ఆమెకొడుకు అవసానదశలో ఉన్నాడనీ, మా నౌకరు రాముడు, పరుగెత్తుకొని వచ్చి చెప్పాడు. వినీవినటంతోటే భార్యాభర్తలం యిరువురం పరుగెత్తుకొని వారియింటికి వెళ్ళాం. చచ్చియున్న తల్లి బిడ్డలనుచూసి, యీ దుష్టసంఘాన్ని ఏమిచేసినా పాపం లేదు. కుళ్ళు సంఘం అనే త్రాళ్లను నరికివేసి నవ్యపథాని! పురోగమించుదా"మని నేనూ, సుగుణా శపథం చేసాం—



# మహిళాభ్యుదయము

శ్రీమతి కాంచనపల్లి కనకాంబ.

మహిళయను పేరువలననే స్త్రీలను మనవారెట్టి గౌరవపదమందు నిలిపిరో తెలియనగును. "మహ్యాతి ఇతి మహిళా" (మహపూజాయాం) పూజింపబడును. "స్త్యాయతి సంఘాతో భవత్యస్యాంగర్భ, ఇతి స్త్రీ" గర్భమును ధరించువారు స్త్రీలు, వీరివలన సంతానము వృద్ధి పొందికులము నిలుచును. సంతాన నిరోధము ఒక సిద్ధిగా సాధించువారు, ప్రత్యక్షమగు శరీరసుఖమే కాంక్షించువారు కులమర్యాదలు పాటింపరు. కులమర్యాదలను పాటించిన, యవలంబింప దలచిన సాధ్వీమణులే గృహిణులు.

" యాంత్యేవం గృహిణీపదం యువత యోవామాకుల స్యాధయః." అని కాళిదాసకృతమగు శాకుంతలమున కణ్వుడు శకుంతలకు గృహిణీ ధర్మములనుపదేశించుపట్ల చెప్పెను. అట్టివారే గృహిణులు, కులపాలికలు అనియు వంకర నడకగలిగి వన్నెవన్నెలుగా గనబడువారు కులమునకు మనోవ్యాధి కలిగించువారు అని కాళిదాసు అభిప్రాయము.

మర్యాదనుంచి తొలగిపోవుట, యున్నతమగు పురంధ్రీ రత్నము నుండి జారిపోవుట భంగమేకాని యదిసంస్కారమని పించుకొనదు. భంగము అంగవైకల్య హేతువు. నిజమిట్లుండగా నట్టిపాటు సంస్కారమని, యలంకారమని కొందఱు కలిపురుషునిచేతవంచింపబడి మోసపోయి విమర్శ కోలు పోయినవారు పండితులు చేయువాదములవంటి వాదములు చేయుదురు. ప్రజ్ఞావాదములకునది పరిహాసోక్తి. అర్జునినిపట్ల గీతాచార్యుడు కృష్ణుడు వాడినాడు. తెలియని విషయము తెలిసినవారివలె మాటలాడువారు అతి తెలివియను నదిట్టిదే.

భరతఖండమున స్త్రీలు మర్యాదకు హేతుభూతలు. తాము మర్యాదలో నిలిచియితరులను మర్యాదలో నిలిపెదరు. భాగవతమందును "విభుడుపతితుడైన వెలది పాతివ్రత్యమహిమ పుణ్యుజేసి మనుపవలయు"నని యున్నది. కులమును రక్షించువారు స్త్రీలే. కులసంప్రదాయములను స్త్రీలే రక్షింతురు. తమ సంతానమైన మగబిడ్డలకును, ఆడుబిడ్డలకును గూడ ధర్మమును దిద్దువారు కాంతలే. ధర్మబోధకములైన కావ్యములు కాంతా సమ్మితములందురు. తమతమ పతులకు స్త్రీలు వేడుక కలిగించి చల్లగా ధర్మముపదేశించి యేలవరతురు.

బాహ్యదృష్టికి ద్వైతముగా దోచునది పరమార్థమున నద్వైతమే. బాహ్యదృష్టికి మిథునముగా గనబడుజంట పరమార్థదృష్టిలో నద్వైతమే. ఒక్కటియే. "అద్వైతం సుఖదుఃఖయోః" అనుపద్యమున భవభూతి దీనిని సూచించెను. 'ఇద్దరనొక్కటి చేయుట' అని పామర వ్యవహారమునందును కుటుంబినులలో కలదు.

మనోవాక్కాయముల దంపతులయైక్యమును త్రిమూర్తులు రూపించిరి. శ్రీధరుడు (విష్ణుమూర్తి) మానసిక వ్యాపారమునందు అభేదముగా దంపతులు మెలగవలయునని సూచించుటకు లక్ష్మిని ఱొమ్మున దాల్చుచున్నాడు. ఇక బ్రహ్మ (వాక్పతి) తనవదనమందు సరస్వతిని దాల్చిమాటయందలి యభేదమును రూపించుచున్నాడు. సాంబుడు తన అర్ధాంగమునదాల్చి శరీరముల యభేదమును తెలిపినాడు. అంగముగా జేయబడిన నిజాంగనగలవాడై దంపతులెట్లభేదముగా క్రియలందు మెలగవలయునో సూచించినాడు.

స్వవశమైన పురుషునితో సహధర్మచారిణియగు చున్నది. "నృణాతినయతి స్వవశం పురుషమితినారీ" అనగా పురుషుని వశము జేసికొనునది." సాధుగుణయోగాత్ సాధ్వీ" అనగా మంచి గుణములు కలది. సుగుణ సంపదకలము వైదుర పురంధ్రి కాదగియుండును. "పురం గృహంధరతీతి పురంధ్రీ" అనగా పుత్రభృత్యాది కుటుంబమును పోషించునది కుటుంబిని. ఇట్టి కుటుంబిని సతియనబడును. "దర్శనాదేవ పాపం స్యతీతి" సతీను దర్శనముచేత జనుల పాపము బోగొట్టు మహనీయురాలు సతియని పిలువబడును. సప్తర్షులు పార్వతీదేవిని జూడ వచ్చినప్పుడు "సధర్మవృద్ధేషు వయస్సమీక్ష్యతే" ధర్మముచేత పెద్దతికము కలిగినవారియందు వయసు (గణింపరాదు) చూడరాదు. "గుణాఃపూజాస్థానం గుణిషు నచలింగం

నచవయః" గుణములే పూజింపదగినవిగాని వయస్సును, స్త్రీ పురుష భేదమును చూడరాదని భవభూతియనినాడు.

వర్ణాశ్రమాచారముల కతీతమైన నిస్త్రైగుణ్యమగు విహంగ మార్గమున సంచరించు సులభ, లెంగము మొదలగు యోగినులు కొందఱుందురు. యువతీసమూహము ఆధీయరాంధ్రను దమతో గలుపుకొని వారలననుకరింపరాదు. పెద్దలవచనములే ప్రమాణములుగాని వారి సాహసములనుకరింపరానివియని యార్యులు పల్కెదరు.

చారుదత్తుని ప్రేమించిన వసంతసేన వారముఖ్యయయ్యు మన్నింపదగినది. అసత్పురుషులను ద్రవ్యముకొఱకు పరిగ్రహించు రూపాజీవలు (లోక్యమునకై రూపమమ్ముకొని జీవించువారలు) నింద్యలగుదురేకాని పూజ్యలుకాజాలరు. భర్తను గోలుపోయినదిగాని, భర్తతో గాపురము చేయునదిగాని యసచ్చరితురాలయ్యెనేని నిందింపదగినదియే. పెండ్లికాని దసచ్చరితురాలయ్యెనేని సంఘమునంతను నాశనముజేయజాలియుండును.

శ్రీమణి, యోగిని, సన్యాసిని మొదలగువారు కలియుగమున సచ్చరిత్రవలన బూజింపదగియుందురుగాని, ఆకారమును బట్టి పూజింపదగియుండరు.

ఒకప్పుడు కొందఱు మహనీయురాండ్రు పైవేసములచే అన్యథా కానబడినను వారిమానసము, చరిత్ర స్వచ్ఛమైనదై యుండును. సులభ జనకుని సభలో శృంగార భావమును ప్రకటించియున్నది యంతయు జనకుని బరీక్షించుట కొనరించినట్లు స్పష్టపడుటచే నాయమ్మ ప్రభావము మునిగీయమానమైనది.

ఆపత్కాలములయందు ద్రౌపది, దమయంతి మొదలగు సాధ్వీమణులు పరగృహములయందుండవలసిన వారలయ్యు వారి శీలములను వారుగాపాడుకొన్నారు. ఆడుదానికి దనశీలమె తనకు గవచము. భరతఖండమున బతివ్రతలు, జగద్విఖ్యాతలు తాపసులకించుకేనియుద్దగ్గని ప్రభావము కలవారు.



కథానిక

# విచిత్రకలయిక

* అనంత్ *

"సతీశ్ సతీశ్" అంటూ తలుపుతట్టిన చప్పుడు వినిపించింది. తదేక ధ్యానములో మునిగియున్న అతడు ఉలిక్కిపడి తిరిగి తనధ్యానములో మునిగిపోయెను. తిరిగి అదేకేక వినిపింపగా అతడు "ఎవరు? ఎవరు?" అని ప్రశ్నించెను.

"నేను! నేను!" అను సమాధానము వినిపించెను.

అప్పుడు సుమారు 8 గంటలయినది. ఇంత చీకటిలో యీ రాత్రి సమయమున తన కొరకెవరు వచ్చెదరని అతడు తలపోయదొండగెను.

తలుపు తెరవబడక పోవుటచే ఆవచ్చిన వ్యక్తి తిరిగి బిగ్గరగా "నేనే! నేను! కుమారిని! సతీశ్ త్వరగా తలుపు తీయుము." వెంటనే అతడు ఆశ్చర్యముతో తలుపుతీసెను.

"కుమారీ! ఇంత చీకటిలో ఏమి మునిగిపోయినదని వచ్చితివి? వెలుతురుండగా ఏల రాకపోయితివి? ఇంతకూ నీరాకకు కారణమేమి?"

"సతీశ్! ఎన్నిసార్లు పిలిచినను పలుకవైతివి? ఈనాడేమైనను తన్మయుడవైతివా!"

"లేదు కుమారీ, శాకుంతలమును పఠించుచున్నాను. కాళిదాసు యొక్క రచనా నైపుణ్యములో లీనమైతిని! ఆహా ఏమినాటకము అద్భుతముగా నున్నది."

"అయితే నాటకము చదువుచున్నంత మాత్రమున బాహ్యప్రపంచమునే మరచిపోవలయునా! అందులోనూ ఎవరో కాళిదాసట! శాకుంతలమట."

"అయ్యయ్యో! కుమారీ పొరబడితివి. అంతటి మహాకవి ప్రపంచములోనే లేడు! అతని గొప్పతనము ఆనాటకప్రశస్తి పాశ్చాత్యులచేతనే కొని యాడబడినది."

"ఓహో! అలాగా! అయితే ఏదీ ఒక్కసారి చూడనియ్యి."

"అది నీకు అర్థంకాదులే! నీకు సంస్కృతమురాదు. ఎంతసేపూ మీనాన్న నీకు ఇంగ్లీషు చదువేరావలయుననియితరమేమియు అక్కరలేదని పట్టుబట్టు చున్నాడాయెను. నీకు మాత్రం యిది చదవాలనివుందా ఏం? కాకపోతే పాశ్చాత్యులే పొగిడారని తెలిసింది కాబట్టి చూద్దామని అభిలాష. విన్నన్న చెప్పిందేవేదం! పాశ్చాత్యులు చెప్పారంటే నువ్వునమ్ముతావు. ఇది నీదోషంకాదు. నీతండ్రిది. పైగా నీవు, నివసించుచున్న సంఘముది.

"అయితే, సతీశ్, కాళిదాసు అంతగొప్పకవా ఏమిటి. అంతగా పొగడుతున్నావు. షేక్స్పియర్ కన్నగొప్పవాడా ఏమిటి,"

"షేక్స్పియర్ ఆంగ్లదేశపు నాటక రచయితలలో గొప్పవాడు. మనదేశములో కాళిదాసు అటువంటివాడు. ఒక్కొక్క దేశంలో ఒక్కొక్క గొప్ప కవివుంటాడు. అసలు యింతకీ నీవు యిప్పుడు వచ్చిందిదేనికి."

"అవును సతీశ్ నేను నీమాయలో పడిపోయి వచ్చిన కారణం చెప్పటం మరిచిపోయాను. నేను ఎంత ఖిన్నహృదయంతో వచ్చానో అదంతా నిన్ను చూడగానే మరిచిపోయాను. తిరిగి నన్ను వాస్తవిక ప్రపంచంలోకి తీసికొనివచ్చి నా ఆనందాన్ని భగ్నంచేశావు. ఇంతకీ నేను నీకొక దుఃఖసమాచారము జెప్పడానికి వచ్చాను"

"ఏమిటదీ! త్వరగాచెప్పు. సందేహమెందుకు."

"రేపటినుండి నిన్ను కలిసికోవద్దని నాన్నగారిహుకుమ్."

"ఏం? ఎందుచేత?"

"మన యిద్దరికలయిక ఆయనకు యిష్టములేదు. అందువలన మన యిద్దరికీ యిదే ఆఖరి సమాగమము."

ఈ మాటలు వినేటప్పటికి సతీశ్ కు పిడుగు పడ్డట్లయినది. తన ఆనందమయ జీవితము ఆనాటితో సమాప్తి. తాను కంటున్నకల లన్నియు వమ్మయినట్లుగా తోచెను. జీవిత నౌక పతాలున బ్రద్దలయినట్లనిపించెను. ఏవ్యక్తిని చూచి తాను సుఖజీవిత మొనరింపదలచెనో ఆమెనింక చూచుటకు గాని తలచుటకుగాని ఆశలేదు.

# విచిత్ర కలయిక

సతీశ్ చాలా పేదవాడు. విద్యయం దాసక్తిగలవాడ గుటచే విద్యా వేతనమునొంది స్వయంకృషివలన పైకి వచ్చినవాడు. చిన్నప్పటినుండియు కుమారితో పెరిగినవాడు. వారాటపాటలందు కలసిమెలసి అన్యోన్యప్రేమచే బంధింపబడిరి. ఇన్ని సంవత్సరముల స్నేహాలత నొక్కసారి త్రెంచుట అతనికసాధ్య మయ్యెను.

పాపము కుమారి కూడా చెప్పలేక చెప్పలేక ఆవార్తను చెప్పి తన తండ్రి కఠినత్వమున కెంతయు నొచ్చుకొనెను. ఆమె సుమారు పదువారేండ్ల ప్రాయముగలది. వినోదరావు నకు ఏకైకపుత్రిక. అతడు తన కుమార్తెను ఆంగ్ల విద్యా ప్రవీణురాలినిగా నొనరించి ఏధనవంతునకో యిచ్చి వివాహ మొనరించి అల్లుని తనయింట యుంచుకొందమను అభిప్రాయముతో నుండెను. అటువంటి సమయమున తనకుమార్తె పేదవాడైన సతీశ్‌తో కలయుట భావియత్నమునకు భంగమనితలచి ఆమెను కట్టడిలో నుంచెను. అందువలననే ఆమె నాటిరాత్రి చీకటి పడిన తదుపరి తనమిత్రుని ఆఖరుసారి కలిసికొనుటకు వెళ్లినది. తుదివాక్యము పల్కవచ్చినది. ఆమె ఏమిచేయగలదు. తండ్రిని కాదనుటకు శక్తిచాలదు. సతీశుని విడువజాలదు.

కాలము గడచిపోయినది. సతీశుడెట్లో పట్టభద్రుడై కలకత్తాలో ఒక మిల్లులో మేనేజరుగా పనిచేయుచుండెను. కాని అతడు వివాహము చేసికొనలేదు. సుమారు 30 సంవత్సరముల వయస్సున్నను అతనికి వివాహముపై యిచ్ఛకలుగలేదు. అతడెప్పుడును ఏదియోచింతించుచునే యుండును. అతనికి నెలకు రు 500 జీతము వచ్చుచున్నది. కాని వచ్చిన దంతయు దానధర్మములకు, పేదవిద్యార్థులకు వేతనముల క్రింద ఖర్చగుచుండును. అనేకులతని చర్యలను గురించి తర్కించుచుండిరి. పెద్దపెద్ద లక్షాధికారులు తమ కన్యల నిచ్చెదమని వార్తపై వార్తలనంపుచుండిరి. అతని మనస్సు మాత్రము కుమారినిదక్క అన్యులను వివాహమాడుటకు నిరాకరించు చుండెను.

ఇచ్చట వినోదరావు భార్య చనిపోయినది. ఏకైక పుత్రికతో కాలముగడపు చుండెను. దీనికితోడు గోరుచుట్టు మీద రోకటిపోటన్నట్లు అతనికి వ్యాపారములో గొప్ప నష్టము సంభవించెను. అతని ఓడలన్నియు తుఫానుకు సముద్రములో మునిగిపోయెను. అప్పులవారి బాధ అధిక మయ్యెను. అయినను ఆడంబరముగా కాలము గడపుచుండెను. సతీశును గురించి ప్రస్తావనలేదు. కుమారి మాత్రము యీ దురదృష్టమునకు కారణము పేదయైన సతీశుని పరాభవించుటయే అని ఎల్లప్పుడు చింతిలుచుండును. ఆమెకు తండ్రి నిశ్చయించిన సంబంధ మిష్టములేదు. తాను ధనికుల బిడ్డయైనను సతీశు తెలివితేటలు, గుణములు ఆమెకు యితరులయందు కన్పింపలేదు. కూటికి పేదయైనను కులమునకు పేదయా యని ఆమెకుతోచును. పాశ్చాత్య పద్ధతులలో పెరిగినను పవిత్రభారతరక్త మామెయందు ప్రవహించుచుండెను. సతీశుని ద్రోహము చేయవలదని ఆమె మనస్సు పలుమారు చెప్పుచుండెను.

ఒకనాడు వెంకట్రావు వినోదరావును కలిసికొని తన కుమారునకు కుమారినిచ్చి పెండ్లి చేయుటకు వీలుపడదని చెప్పెను.

"ఎందుచేత ? ఇంతకాలమునుండి మాకుమారిని నీకుమారుడైన శశిధరుడు వివాహము చేసికొనునని మాయింటి అల్లుడగునని యుప్పొంగి తిమికదా !"

"అవును అప్పుడట్లే అనుకొంటిమి. ఇప్పుడు పరిస్థితులు మారినవి. నీవు దరిద్రుడవయితివి. నీతోపాటు నీ కుమార్తెయునంతే ఇటువంటి సంబంధము చేయుట నాకిష్టములేదు."

ఈ మాటలు వినునప్పటికి వినోదునకు తలతిరిగినట్లైనది. కళ్లు మిరిమిట్లు గ్రమ్మినవి. తనుతానే నమ్మలేకపోయెను. పరిస్థితులిట్లు తారుమారగునని కలలోనైనను తలపలేదు. సతీశునకొనరించిన అపరాధమొక్కసారి తళుక్కున హృదయ వీధిని మెరసెను.

తలుపు చాటుననుండి యీ సంభాషణను ఆలకించిన కుమారికి ఒక విధమైన సంతోషముగల్గెను. ఎప్పటికైనను సతీశుడే తననాధుడనుకొనెను.

వినోదుడు తలఎత్తుకొనలేక అచ్చటినుండి కుమార్తెతో పాటు కలకత్తా వెళ్లెను. అంతటి మహాపట్టణములో ఏదో

విధముగా పొట్టపోసికొనవచ్చునని తలంచెను. తన ఆస్థి అంతయు నశించెను. గృహలక్ష్మియైన భార్య చనిపోయినది. అతనికి ప్రపంచమంతయు శూన్యముగా తోచెను. కుమారియే అతని జీవితనౌక. అతడు శరీరదుర్బలతచే పీడింపబడుచుండెను. రోజులు గడచునట్లులేదు. అందువలన కుమారి యుద్యోగము కొరకు ప్రయత్నములు మొదలు పెట్టెను.

సతీశుడు పనిచేయుచున్న మిల్లులో టైపిస్టు కావలెనని ప్రకటన చేయబడినది. కుమారి వెంటనే ఆఫీసులోనికి వెళ్లి తాను టైపిస్టుగా పనిచేసెదనని చెప్పినది. చాలమంది ఆమె ఆకారమును చూచి పిచ్చిదని ముష్టిదని తలంచిపొమ్మనిరి. నిజముగా ఆమె పిచ్చిదానివలె వికారియై యుండెను. సతీశునకు ఎవరో పిచ్చిది పనిచేయుటకు వచ్చినదని తెలిసెను.

అతడు దయాళుడు. కష్టసుఖము లనుభవించినవాడు గావున ఆమెను తీసికొనిరమ్మని బంట్రోతును పంపించెను. ఆమె నిరాశతో ఆఫీసు మెట్లను దిగుచుండగా బంట్రోతులోనికి రమ్మనిపిలిచెను. తిరిగి ఆశాజ్యోతి వెలుగ ఆమె "ఉద్యోగ మిచ్చెదరా ?" యని ప్రశ్నించెను.

"ఏమోనాకు తెలియదు. దొరగారు పిలువమన్నారు" అని అతడు చెప్పెను. తనను ఏమి చేసెదరోయని భయపడుచు ఆమె సతీశుపరోక్షమునకు వచ్చినిలువబడెను.

"నీపేరేమి ?" అని సతీశు ప్రశ్నించెను.

'జ్యోతి' అని సమాధనము వణకుచుచెప్పెను.

'ఉద్యోగము చేసెదవా ?'

'ఆహా ! తప్పకుండా !'

వెంటనే సతీశు ఆర్డరువేసి ఆమెను పనిలో ప్రవేశింపజేసెను. అతనికామెను చూడగానే జాలికల్గెను ఎంతోమంది కన్యలను చూచెనుగాని వారియందులగ్నముగాని మనస్సు యీమెను కోరుచుండెను. ఆమె ఎవరో పుట్టు పూర్వోత్తరముల నారయదలచెను. కాని సందేహించెను.

మరునాడు జ్యోతి తన తండ్రికి జబ్బుగా నున్నదనియు కొంత డబ్బు యిప్పించవలసినదని సతీశుని వేడికొనెను. సతీశుడుతాను కూడ ఆమె తండ్రిని చూచుటకు వచ్చెదనని పల్కెను. జ్యోతి తాము నిరుపేదలమనియు తామునివసించు గృహము సతీశువంటి ఉద్యోగులు ప్రవేశించుట కనర్హమైనదనియు చెప్పిరావద్దని బ్రతిమాలెను. కాని అతని బలవంతముచే ఆమె అతని రాకకంగీకరించెను.

జ్యోతి యింటికివెళ్లి తలుపుతట్టగానే తండ్రి ఆవేశముతో "కుమారీ ! వచ్చితివా !" యనిపిలచెను.

సతీశు 'కుమారి' యను మాటవిని ఆశ్చర్యపడెను. ఈమె తాను ప్రేమించిన కుమారి యా యనితలంచెను. ఇరువురులోనికి ప్రవేశించిరి. వినోదునకు తన అంత్య ఘడియలు సమీపించెనని తెలిసెను. తానింకెంతయో కాలము జీవింపలేననిస్పష్టపడెను. గ్రుడ్లనీరు నింపుకొని "కుమారీ ! నిన్ను కోరగాని దానినిగా జేసితని. ఒకయింటి దానినిగాజేసి నీసుఖమును కన్నులారగాంచ లేకపోయితిని. సతీశునుండి నిన్ను దూరముచేసితిని" అని వాపోవదొడగెను.

"తండ్రీ దుఃఖింపకుము. అయినదేదో అయినది. ఆనాడు ధనప్రభావముచే ప్రపంచమును కానగలేకపోయితిమి. ఈనాటికైనను నీవునన్ను సతీశునకిచ్చెదనంటివి. నేను ధన్యనైతిని. అతనినే ఏనాటికైనను పొందగలనను ఆశలేదు."

"కుమారీ తిరిగి నిన్ను సతీశుడు స్వీకరించునా ! అతడెచ్చట నున్నాడో ? ఈపాటికి పెండ్లియై భార్యాబిడ్డలతో సుఖముగానుండును. నీవాతని భార్యయగు భాగ్యము లేదమ్మా"

ఈ సంభావణవినుచున్న సతీశు తన్నుతాను నమ్మలేకపోయెను. ఎచ్చటనో విశాఖ పురియందున్న వినోదూ, కుమారి, యిట్టి దీనావస్థలోనికి వచ్చుటతలంచి విచారించి తానే సతీశునని కుమారిని స్వీకరించుటకు సిద్ధముగానుంటినని తెల్పెను. కుమారి ఆనందమునకు మేరలేదు. దైవచిత్రము తిరిగికలిసి కొంటిమని వినోదు వారిద్దరి హస్తములను కలిపి తన జీవితయాత్ర చాలించెను.

సమాప్తము.



వనితా విజ్ఞానము

# పిల్లల శిక్షణ శాస్త్రీయ దృక్పథం

శ్రీమతి దరిసి సుభద్రమ్మ

బిడ్డకు రెండేళ్లు నిండునప్పటికి, నడక మాటలు, పరిసర పరిస్థితుల పరిచయము, బంధుమిత్రులయందు స్నేహము, ప్రేమ మున్నగునవి కొంతవరకు పట్టుబడియుంటాయి. కొంత విపులంగా :—కండరములు, జ్ఞానవాహక, గతివాహక నాడులు, మెదడు కొంతవరకు అభివృద్ధియై యుంటాయి. జ్ఞానేంద్రియము ద్వారా కలుగుభావనలు, అనుభూతికి వచ్చి యుంటవి (అనగా, చర్మము, చెవి, నాలుక, ముక్కు, కన్ను, ప్రత్యేక జ్ఞానేంద్రియములు, శరీరంలో ఇంద్రియ జ్ఞానమును కలిగించునట్లు, కండరములు, కీళ్లు మున్నగు సాధారణ జ్ఞానేంద్రియములు వీటి మూలకంగా స్పర్శ. శబ్దం రుచి, వాసన, రూపము మొదలగు భావనలు.) ఒక్కొక్క జ్ఞానేంద్రియము ఒక్కొక్క ప్రేరణ వశమవుతుంది. చర్మము మూలకంగా స్పర్శ, నొప్పి, వేడిమి, ఒత్తిడి; చెవి మూలకంగా ధ్వని; నాలుక మూలకంగా రుచి, ముక్కు మూలంగా వాసనలు (క్రమేణ వివిధవాసనలు); కన్ను మూలకంగా వెలుతురు, రంగు, ఆకారము, దూరము, లోతుమొదలగు భావనలను గ్రహించి. తత్సంబంధ అనుభూతిని కొంతవరకు పొందియుంటుంది. వీటి నన్నిటినీ బిడ్డ ప్రకృతి ప్రసాదితమైన 'గ్రహణ శీలమనస్త్వం' ద్వారా, ఒక్కొక్క లక్ష్యసిద్ధికై ఏర్పడు ఆయా సూక్ష్మ గ్రాహ్యదశలో, పరిగ్రహించుకొంటూ, దైహికంగా మానసికంగా, అనగా, సర్వావయవములు నడక, మాటలు, బుద్ధి, మొదలగువాటిని నిర్మించుకొంటుంది. రెండేళ్లు దాటిన తరువాత, తన ఆటపాటలలో, పనులలో నైపుణ్యమును సాధించుతూ బుద్ధిని వికసింపజేసు కొంటుంది. ఒక్క మాటలో చెప్పాలంటే, ప్రకృతి సిద్ధమైన స్వశక్తి, స్వయం కృషి, స్వేచ్ఛలలో పరిసర పరిస్థితుల సహాయమును పొందుతూ, దైహిక, మానసిక నిర్మాణములు వికాసమును పొందుతుందన్నమాట.

అయితే, బిడ్డకు రెండేళ్లు నిండి మూడేళ్లు పూర్తియగు వరకు కలుగు మార్పులు స్పష్టంగా, (స్థూలంగా) కనుపించక పోవచ్చును. కాని, సూక్ష్మంగా పరిశీలించిన యెడల, ఆ ఒక్క సంవత్సరకాలంలో బిడ్డ మహత్తరమైన పరిణామాలను పొందటం చక్కగ విదితమవుతుంది. పై జెప్పిన నిర్మాణ కార్యకలాపమంతా బిడ్డ అస్పష్ట చేతనస్థితిలో చేసుకొంటుంది, ముఖ్యంగా 2½ సం॥ వయస్సునుండి కొంత అస్పష్ట చైతన్యంతో, కొంత స్పష్టచైతన్యంతో నిర్మించుకొంటూ, నిర్మితమైన వాటి ప్రయోగము ద్వారా నైపుణ్యమును సంపాదించుకొంటూ, బుద్ధిని వికసింప జేసుకొంటుంది. మరొక విధంగా చెప్పాలంటే;—బిడ్డ, అస్పష్ట చేతనస్థితి నుండి, చేతనస్థితికి క్రమక్రమంగా అనగా—ఒక్కొక్క అడుగు పెట్టుతూ మూడేళ్లు నిండునప్పటికి చాలవరకు చేతన స్థితిలో స్థిమితంగా నిలబడిపోతుంది. '2½ సం॥ నుండి 3 వరకున్న మధ్యకాలములో బిడ్డ అనేక పరిణామములను పొందుతుంది. కాబట్టి, ఈ అంతరకాలమును అవస్థాంతర దశయని పేర్కొన వచ్చును.

## అవస్థాంతరదశలో పరిణామాలు—

ఈ అవస్థాంతరదశలో బిడ్డ ప్రవర్తనలో అస్థిరత్వము, పరస్పర వైరుధ్యములు వ్యక్తమవుతుంటాయి. బిడ్డ, ఒకప్పుడెంతో ఉత్సాహంగా చురుకుగా ఆడుతూ ఉంటుంది; స్వయంగా తన పనులు చేసుకోటం, ఏదో ఒక పనిలో మగ్నమైయుండటం కనుపించుతుంది, ఇంకొక సమయంలో, అలసట వెలిబుచ్చుతుంది; ఏదో పరధ్యానంలో వుండి, కదలక మెదలక మొద్దులా కూర్చుండిపోతుంది; ఒకప్పుడు తన ఆటసామాను, ఆటలు, పాటలు మున్నగు వాటియందు ఎంతో అభిలాష, ఆసక్తి వెలిబుచ్చుతుంది. ఇంకొకప్పుడు వాటియందు, అయిష్టం చూపుతుంది. తల్లి ఏదైనా

సూచించితేచాలు, ఎంతో ఉల్లాసంగా, శ్రద్ధగా ఆపనిని చేస్తుంది; ఇంకొకప్పుడు జంతువులను, పక్షులను, చిన్న, పెద్దలను అనుకరించుతూ ఆనందిస్తుంది. మరొకప్పుడు చీదరించుకొంటుంది.

రెండు ఆటవస్తువులలో ఏదో ఒకటిని యేర్పరచుకోవలసిన సందర్భ మేర్పడినపుడు, తనకేది ఇష్టమో నిర్ధరించుకోజాలదు. కాబట్టి, తఱచుగా రెంటినీ తీసుకోటానికి యత్నిస్తుంది. మోసుకో పోజాలనంతటి బరువైనవిగా వుంటే క్రిందపడ వేస్తుందే కాని, ఒకసామానుతో తృప్తిచెందదు. ఇట్టి మానసికస్థితిని చూచి, లోభత్వం, మూర్ఖపుపట్టు అనుకోటం పొరపాటు (ఏర్పరచుకొను శక్తి స్థిరపడదు. అనగా అంతబుద్ధి వికాసం కాలేదన్నమాట.) ఆదేరీతిగా, ఏవస్తువుకాని కొన్ని సమయాల్లో చక్కగా పట్టుకొంటుంది. నీళ్లచెంబు, పాలగిన్నె మున్నగువాటిని, క్రింద చిందకుండ ఎంతో జాగ్రత్తగా పట్టుకొంటుంది. త్రాగుతుంది. కొన్ని వేళల్లో క్రింద పడవేస్తుంది.

ఆహారం—నిద్ర—విహారం—

ఈ వయస్సు బిడ్డకు ఆకలి ఒకేవిధంగా వుండదు. ఒకప్పుడు మంచి ఆకలివేస్తుంది; చక్కగా కూర్చొని, గిన్నెలోనుండే అన్నం తీసుకొని ఆకలి తీరుదాక తింటుంది. ఒక్కొక్కప్పుడాలాతినదు. ఆకలివుండదు. కారణం స్థిమిత బుద్ధిలేదు అన్నమాటే. ఏలాగంటే, ఒకప్పుడేమో అలసి పోవుదాక దుమకటం, పరుగెత్తటం. అక్కడక్కడ విహరించటం, ఆటలాడటం చేస్తుంది. మరొకప్పుడు అలా చేయదు. అట్టి సందర్భంలో ఆకలివుండదు. అంచేత, కుదురుబాటుగా పళ్లెంవద్ద కూర్చుని అన్నంతినదు, అది కావాలి, 'ఇది ఒద్దు' అంటూ, పారవేయటం పరుగెత్తటం నీళ్లను క్రింద ఒలకబోయటం, మున్నగు చిలిపితనమును వెలిబుచ్చుతుంది. ఒకప్పుడు ఎంతో మక్కువగా తినిన తినుబండమును మరొక సమయంలో ఏవగించుకొంటుంది. సాధారణంగా ఈ వయస్సు బిడ్డకు వెన్నపాలు, మీగడతో చేసిన తీపి పదార్థాలు (అలాగనీ, అమితంగా పంచదార నుపయోగించరాదు.) పళ్లు, కొన్నిదుంపలు, గ్రుడ్లు ఇత్యాదులు, ఇష్టం. ఆకు కూరలు అయిష్టం. ముఖ్యంగా తల్లి గమనించవలసిన దేమంటే—బిడ్డ కాకలి అయినప్పుడు, తనకిష్టమైన ఆహారాన్ని కుదురుబాటుగా కూర్చొని ఎవరిసహాయమపేక్షించకనే పుచ్చుకొంటుంది. కాని, ఆకలి ఉన్ననూ, కొన్నిసమయాల్లో తనతల్లి తినిపించాలని కూడ కోరుతుంది. (ఇది మనోస్థితి అన్నమాట) కొన్ని సమయాల్లో, ఆహారం పుచ్చుకోటానికి రమ్మని తల్లి పిలవగానే బిడ్డ పరుగెత్తుకొని వస్తుంది; కొన్ని సందర్భాలలో అలారాదు. అలాంటప్పుడు బిడ్డను నిర్బంధించరాదు బిడ్డ కిష్టమైన ఆహార పదార్థముల పెట్టి, వాటిపేర్లను చెబుతూ "నీవు భోజనం చేసిరా, ఇక్కడ పళ్లు మిఠాయి (బిడ్డ కిష్టమైనవి) తింపువుగాని" అని చెప్పి స్వేచ్ఛగా వదలిపోవాలి. మొదటనే చిరుతిండి తినాలని బిడ్డ పట్టుబట్టినట్లైతే, తల్లి గమనమివ్వకుండ వెళ్లిపోవాలి. వేమెందుకు? బిడ్డయొక్క ఆనాటి ఆక్షణంలో దైహికమానసిక స్థితినిబట్టి ప్రవర్తనలో మార్పునుబట్టి తల్లి తెలివి తేటలతో మెలగాలి అన్నమాట.

నిద్ర—

ఈ వయస్సు బిడ్డయొక్క నిద్ర విషయం ఒక్కరీతిగా నుండదు. కొన్నిరోజులు అత్యంతాసక్తితో అలసిపోవుదాక ఆడటం, చుఱుకుదనంకలిగి ఏదో ఒకపని చేస్తూవుండటం చేస్తుంది. అలాంటప్పుడు అలసి మధ్యాహ్నం కొంతసేపు నిద్రించుంతుది. అలా అలసిపోకనో, లేదా, ఏవో ఆటలు, వినోదాలు మొదలగు వాటియందున్న అభిలాష ఆసక్తివల్లనో కొన్నిరోజులు మధ్యాహ్నం నిద్రపోదు. ఆదేవింధంగా, కొన్నిరోజులు రాత్రిళ్లు 7, 8 గంటలకే నిద్రించుతుంది. ఒక్కొక్కనాడు అలానిద్రించక పక్కమీద పడుకుని, తనలో తానుమాట్లాడుకోటం, పాటలుపాడటం (విన్నపాటలను వల్లించటం) తల్లినో తండ్రినో ఆలకించమని ఏమో ముచ్చటలు చెప్పటం చేస్తుంటుంది. తల్లి, బిడ్డయొక్క ఇట్టి ప్రవర్తనను, మానసిక పరిణామమును అవగాహనం చేసికొని అనుగుణంగా ప్రవర్తించాలి. అలాచేయక బిడ్డను నిర్బంధించి, కొట్టి, తిట్టి, భయపెట్టి నిద్రపుచ్చరాదు. ఆవిధంగా నిర్బంధించి నిద్రపుచ్చుటవలన, బిడ్డ కేర్పడిన సూక్ష్మగ్రాహ్యదశలో సాధించవలసిన లక్ష్యమునకూ, నైపుణ్యమునకూ ఒక్కమాటలో బుద్ధి వికాసమునకు అవరోధమును కల్పించుటన్నమాటే.

ఈ విషయాన్ని చక్కగా ఎరిగి తల్లి అత్యంత మెలకువతో మెలగాలి.

సాధారణంగా ఈ వయస్సు బిడ్డలు దినమునకు 12 గంటలసేపు నిద్రపోవుటకలదు, (పగలు, రాత్రికలసి). అయితే అందరూ అంతకాలము నిద్రపోతారనుటకు వీలులేదు. పగలు చాలసేపు నిద్రించిన బిడ్డ రాత్రి త్వరగా నిద్రపోదు. ఉదయం సుమారు 8 గంటలకు మేల్కొంటుంది. పగలంతసేపు, నిద్రించని బిడ్డ రాత్రి త్వరగా—7, లేక 8 గంటలు—నిద్రించుతుంది; అట్టి సందర్భంలో తెల్లగతెల్లవారకముందే మేల్కొని, బొమ్మలు పిడతలతో పక్కమీదనే మంచమున కందుబాటులో నుండాలన్నమాట కొంతసేపు ఆడుకొంటుంది. ఈ విషయాల్లో తల్లి సమయోచితంగా వర్తించాలి. రాత్రి 10 లేక 12 గంటల కొకమాటు బిడ్డను తీసుకువెళ్లి మూత్ర విసర్జనచేయించుట మంచిది. అది నిరాకరించితే నిర్బంధించరాదు. మరొకప్పుడు ప్రయత్నించాలి.

కొందరు బిడ్డలు ఉదయం లేచునపుడే ఏడుస్తూలేస్తారు. అనారోగ్యం కారణమైతే తల్లి వెంటనే బిడ్డవద్దకు వెళ్లి లాలించి దాని కవశ్యమైన వాటినిచ్చి ఓదార్చాలి. అలా ఏడవటానికి కారణమేలేనిచో, బిడ్డగదికి వెళ్లరాదు, ఆఏడుపు అంతా ఆగినప్పుడు వెళ్ళాలి. అప్పుడుకూడ ఆగదిలో ఏదో వస్తువులను చక్కబెట్టినట్టు నటించుచూ అమ్మా, అని బిడ్డ పిలిచినపుడు మాత్రంవెళ్ళాలి.

## మలమూత్ర విసర్జన—

ఈ వయస్సు బిడ్డ సాధారణంగా రోజుకు ఒకటి రెండు పర్యాయాలు మలవిసర్జన చేయుటకలదు. కాని, అప్పుడప్పుడు ఒకటి రెండు రోజులుదాక దొడ్డికిపోదు. తల్లి అప్పుడప్పుడు సలహా ఇచ్చుటమంచిది. రెండు రోజులకన్న ఎక్కువకాలం దొడ్డికి పోకపోతే, ఏపళ్లరసమో ఇచ్చి దానికవసరమైన చికిత్సచేయాలి. కొందరు బిడ్డలు తమంతటతామే దొడ్డికెళ్లివచ్చి చెప్పుటకలదు. స్వయంగా వెళ్లి దొడ్డిలో కూర్చుని రావటం కొందరికిష్టం. అయితే కొన్ని సమయాల్లో తల్లి సహాయాన్ని కోరుతారు. లేదా, కొంచెంటెనంలో ఉన్నచోటనే కూర్చుంటారు. వీరి మనస్థితి నెరిగి క్రమక్రమముగా బిడ్డ, దొడ్డికివెళ్లి కూర్చుండు లాగున శిక్షణ ఇవ్వాలి. కొందరు పడుకొన్నట్టుగానో, నిలుచున్నట్టుగానో మలవిసర్జన చేస్తారు. అట్టి బిడ్డల విషయంలో తల్లి బిడ్డను వెంటనే దొడ్డికి తీసుకవెళ్లాలి. లేదా! నీళ్ల గదిలో ఒక కాగితంవేసి దానిపై కూర్చుండబెట్టాలి. ఈ విధంగా చేసినట్లైతే ఒక నిర్ణీతస్థలంల్లో దొడ్డికి కూర్చుండాలన్న విషయాన్ని బిడ్డ క్రమంగా నేర్చుకొంటుంది. మూత్ర విసర్జన విషయంలో, ఈ వయస్సు బిడ్డలు తఱచుగా నిర్ణీతస్థలానికే వెళ్లివస్తారు, అయితే, వీరిమలమూత్ర విసర్జనకు దుస్తులు అడ్డురాకుండ వుండాలన్న విషయం తల్లి గుర్తించాలి. కొందరుముందుగా చెబుతారు. వెళ్లమని తల్లి చెప్పుట ఇట్టి బిడ్డలకు కొంతకాలం అవసరమన్నమాట. ఇంటిలో పిన్న పెద్దలు నిర్ణీతస్థలానికి వెళ్లుట, ఇంటివద్ద, పశువులు, జంతువులు విసర్జించటం బిడ్డ వీక్షించటం కలదు.

## స్నానం, దుస్తులు—

సామాన్యంగా, ఈ వయస్సు బిడ్డలు, స్నానం చేయటానికి (ఉదయం) ఇష్టపడుతారు. తమంతటతామే చేయలేకపోయినను, నీళ్లగదిలో, చిన్న చెంబుతోనో, గిన్నెతోనో నీళ్లు ముంచటం, క్రిందపోయటం, తనమీద పోసుకోటం కొళాయిత్రిప్పటం, సబ్బుతో బొజ్జరుద్దుకోటం, చేతులకు రాచుకొని నురుగు వచ్చువరకు రుద్దటం మొదలగునవి చేస్తూ ఆడుకోటమంటె అమితఇష్టం, ఇదొక క్రీడ అన్నమాట.

ఇక దుస్తులు విషయంలో—ఈ ఈడు బిడ్డ, తన దుస్తులను స్వయంగా సులభంగా, విప్పుకొంటుంది. కాని తొడుక్కోటంలో మాత్రం—ముఖ్యంగా లాగు, చొక్కా తొడుక్కోటం కొంత కష్టసాధ్యమేను. తల్లి, తనసలహాతోనో, అవసరమైతే సహాయ్యం ఏదో బిడ్డలకు నేర్పాలికాని తల్లియే తొడుగుతానంటే మాత్రం బిడ్డ నిరాకరించుతుంది. ఒక్కొక్కప్పుడు సహాయాన్నికూడ తీసుకోదు. అట్టి సమయంలో తల్లి సలహాఇచ్చి, బిడ్డకు తెలియకుండ కొద్దిగ తోడ్పడి దుస్తులు తొడగాలన్నమాట. కాని, ఈ విషయాల్లో కూడ బిడ్డ ఒక్కొక్కప్పుడు స్వయంగా

(తరువాయి 40వ పేజీలో)

# స్వాతంత్ర్య పథమదె సోదరీ!....

❋ డి. యన్. రాజేశ్వరీ పట్నాయక్ ❋

నిదురమేల్కొనుము సోదరీ,
కనువిప్పిచూడవె సోదరీ,
గత చరిత్రమునందు
నీజాతి చరితంబు
తరచి తరచీ నీవు
పరికించి చూచితే
నీదువ్యక్తిత్వమిల నో సోదరీ,
మాయ జేసినదెవరు ఓ సోదరీ,
స్త్రీ విద్యనిరశించి
నీహక్కు మరపించి
గృహరాణి నీవనుచు
వింత బిరుదుల నిచ్చి
వంచింప జేసినది ఓ—సోదరీ
నికంతు శత్వముగాదె వో—సోదరీ,
సుకుమారి వీవనుచు
కుసుమములతోనిను పోల్చి
నీమంచి చెడుగులకు
మాయండనీ కనుచు
హక్కులను యుక్తితో—నో—సోదరీ
హుళక్కి చేసినదెవరు ఓ—సోదరీ,
స్వర్ణ శృంఖలాలతో
అజ్ఞానపు విలువలతో
ముక్తి లేని పథాలలో
అశృసిక్త వదనాలతో
వెతల నందుచున్ననీ
జాతినుద్ధరింపలేవె ఓ—సోదరీ
జాగృతినిగనవె ఓ—సోదరీ,
ఆచ్ఛాదితంబైన
నీ హృదయక్షేత్రాన
విజ్ఞాన బీజములే
వెల్లువలై ప్రభవింప
వ్యక్తిత్వమును జూపవే—సోదరీ
తర్కించ సమయముగాదు ఓ—సోదరీ,
'హిందులా' సవరింప
న్యాయ హక్కులనరసి
నీకున్న హక్కులను
నిండారచే కొనగ
అర్థికంబుగ నీవు ఓ—సోదరీ.
అణగియుండగ నేల ఓ—సోదరీ,
నేటి దేశస్థితిని
నిండార పరికించి
బాపుజీ చూపినా
బాటలో పయనించి
మానవత్వము జాటవే—సోదరీ
రాక్షసత్వము బాపవే—సోదరీ,
మహిళోద్య మంబనగ
వాక్పరంపరగాక
సంఘ సౌష్ఠవ మొసగు
శక్తులను పురికొల్పి
కర్తవ్యమును జూపవే.—సోదరీ,
కార్య రూపము దాల్చ నో—సోదరీ,
నిరుపేదమహిళలకు

## స్వాతంత్ర్య పథమదె సోదరీ!....

నిస్సహాయత బాప
వృత్తి విద్యల నొసగి
బ్రతుకు తెరువుల జూపి
భవితవ్యమును జూపవే—సోదరీ,
హాని సత్వము బాప ఓ—సోదరీ,
ఆహారక్షామంబు
అంతరింపగజేయ
పాడిపంటల పెంచి
బ్రతుకు భారము మాన్పి
దేశదుస్థితి బాపఓ—సోదరీ
దీక్షగైకొన లేవె ఓ—సోదరీ,
రాట్న చక్రము ద్రిప్పి
గృహ పరిశ్రమ నిల్పి
వ్యక్తిగత జీవితపు
విలువలెన్నో దెల్పి
గృహచ్ఛిద్రముల బాపవే—సోదరీ
గృహిణీత్వమును జూప ఓ—సోదరీ,

విజ్ఞానపు విలువలతో
ప్రగతిజూపు పథాలలో
దేశపు నిర్మాణపునాదుల్లో
ముందడుగువేయవె—సోదరీ
నీలక్ష్యస్థానము జేర—నో సోదరీ,
కీర్తిగాంచిన భారతావని
యశమునిల్పిన నీదుశీలము
వెలుగులీనెడు నీదుత్యాగము
వికసింపజేయవే—సోదరీ
వినువీధులలరగ నోసోదరీ,
రాజసంబున నీదువిజ్ఞత
నాదమొసగెడి నీదుగళమును
కవితలీనెడు నీదుకలమును
కళలొసంగెడి నీదుజ్యోత్స్నకు
ప్రభవింపజేయవె—సోదరీ,
స్వాతంత్ర్య పథమదె—సోదరీ.



(38వ పేజీ తరువాయి)

దుస్తులను తొడుక్కోడు. తల్లినే తొడగమంటుంది ఎంత మాత్రం, స్వప్రయత్నమన్నమాట చూపడు, ఏదున్నర్థం బిడ్డ లాగు ప్రవర్తిస్తుంది. తను ఒక బొమ్మఅనీ, చిన్నపాప అని అంటూ, పూర్తిగ తల్లిమీద ఆధారపడుతుంది. ఇదొక మానసిక పరిణామం అని తల్లి గుర్తించి విచక్షణతో మెలగాలి కాని విచారపడకూడదు. ఇట్టి మనోస్థితి ఒకటి రెండు రోజుల్లో మరిగిపోతుంది. ఈ వయస్సులోనె, బిడ్డ, ఒక్కొక్కమాటు అనువుగా దుస్తులు తొడుక్కోటం, ఒక్కొక్కసారి, తల్లికి దొరకకుండా తప్పించుకొని పారిపోవటం, తల్లి పట్టుకున్నట్టయితే, విడిపించుకొని పారిపోవటం చేస్తుంటుంది. ఇదొక వినోదం, నిర్బంధిస్తే దాని కెక్కడలేనికోపం, ఏడ్పువస్తుంది. కాబట్టి, తల్లి, "నీకిష్టమైనపుడు వచ్చి స్నానం చేసి బట్టలువేసుకో" అని చెప్పివెళ్లిపోవాలి, అనగా బిడ్డ యొక్క స్వేచ్ఛకు, వినోదానికి అవకాశమిచ్చినట్టయితే, బిడ్డయే తల్లివద్దకు వచ్చి, చక్కగా దుస్తులు తొడుక్కొంటుంది. బిడ్డయొక్క ప్రవర్తన, పరిణామము ననుసరించి తల్లి వర్తించాలన్నమాట.

(సశేషము)



# స్వర్గీయ సరోజినీదేవి

శ్రీ చింతగుంట హనుమంతరావు

శ్రీమతి సరోజినీ దేవి 1879 వ సంవత్సరం ఫిబ్రవరి 13వ తారీఖున దక్షిణ హైదరాబాద్‌లో జన్మించింది. ఈమె పూర్వజులు బెంగాల్ నుండి యిక్కడికి వచ్చి నివాస మేర్పరచుకున్నారు. ఈమె వంశము సమ్మాన పాత్రమైనది. ఈమె తండ్రి అఘోరనాథ చట్టోపాధ్యాయ్; గొప్ప వైజ్ఞానిక విద్వాంసుడు. 1877 లో ఎడిన్‌బరో విశ్వవిద్యాలయంలో డి. ఎస్. సి. డిగ్రీ పొందినవాడు. అతని స్వభావము మృదువైనది; సరళమైనది. సరోజిని జనకుని ప్రథమ సంతానం. తండ్రి కుమార్తె నధికంగా ప్రేమించే వాడు. జనకుని అనుజ్ఞల్లో సరోజిని విద్యాభ్యాసం ఆరంభమైంది. అఘోరనాథ్ కుమార్తెను మొట్టమొదటినుండి ఇంగ్లీష్ భాషలో మంచి జ్ఞానం సంపాదించు కొమ్మని హెచ్చరిస్తూండే వాడు. ఇంగ్లీష్ పట్ల పుత్రిక ఉపేక్ష కనపరిస్తే సహించేవాడు కాదు; దండించడానికి సైతం వెనుదీసే వాడుకాదు. బాల్యంనుండి యింగ్లీషు మాతృ భాషా తుల్యమవడమే దీని పరిణామం.

సరోజిని అతిప్రతిభాశాలిని. తన 13వ యేట మద్రాస్ మెట్రిక్ పరీక్షలో విజయం పొందింది. ఈ పరీక్షకు కొంత కాలం క్రితమే ఆమె హృదయంలో కవిత వ్రాయాలనే భావం అంకురించి వుండింది. ఆమెకపుడు 11 యేండ్ల వయసు. ఒక రోజుగణితంలో ఒక ప్రశ్న పరిష్కృతంకా లేదు, మనసు వ్యాకులమైంది. అట్టి సమయంలో హఠాత్తుగా కవితా ప్రవాహం హృదయంనుండి వెల్వడింది. సరోజిని తన 13 వ యేట The Lady of the lake అను పెద్ద పద్య కావ్యం రచించింది; అందులో 1300 పంక్తులున్నై. ఆమెరచనల్లో స్వప్రసూతభావాలయొక్క, అంతర తమ వుచ్ఛ్వాసాలయొక్క నిర్ఝరిణివ్యక్త మౌతుంది. W. T. Stade అను నతడు యీమె వ్రాసిన The Golden Threshold చదివి యిలా ఉద్ఘాటించాడు:—స్త్రీలు కవనం చేయలేరనే నిందించువాళ్లకు శాశ్వతంగా బీగం వేస్తున్నదీ గ్రంథం. సరోజిని కవిత హృదయాంత రాళంనుండి బయల్వెడలినది. ఇంకో అత్యంతోత్కృష్టమైనగుణం—దానిలోని మోహనమైన ఆకర్షణీయ సంగీతము. ఆమెకు ప్రకృతి, మానవ సాక్షేపాన్ని గూర్చిన, మానవులగూర్చిన, మానవ వ్యక్తిత్వాన్ని గూర్చిన, భావభరితమైనది.” ఈ కవయిత్రి యొక్క ప్రకటితమైన యితర గ్రంథాలు The Bird of Time, The Brokers Wings, Champakblossoms, Palanquin Bearers, The Song of Sleep, The Lonely Child అనునవి.

జనకుడు సరోజినిని ఉన్నత విద్యకొఱకు 1895 లో ఇంగ్లాండు పంపాడు. మూడేండ్లు లండన్ కిన్స్ కాలేజిలోను, కేంబ్రిడ్జి గిర్టన్ కాలేజిలోను అధ్యయనం చేసింది. ఆరోగ్యం పాడయి పోడంవల్ల ఇటలీ యాత్ర చేయాల్సివచ్చింది. గొప్పకవులకు, కళోపాసకులకు జన్మభూమియైన ఆసౌందర్య ప్రకాశ పూర్ణమయిన దేశము సరోజిని హృదయంలో నింపుతూ వచ్చిన రసమే కావ్య రూపంగా బయల్వెడల సాగింది.

1898 వ సం॥ సెప్టెంబర్ నెల లో హైదరా బాదుకు తిరిగి వచ్చి సరోజిని మూడు నెలల తర్వాత జాతిమత శృంఖలాన్ని తెంచుకుని హైదరాబాద్‌లోని ఒక డాక్టర యిన మేజర్ ఎమ్. జి. నాయుడుని వివాహమాడింది. ఆ కాలంలో సంఘ సంస్కరణా పథము యిప్పటి లా సరళము, ప్రశస్తము ఆయినదికాదు. కాని సాహసించి యీ కార్యమొనరించి, అప్పటినుండి యెడతెంపు లేకుండా భారత స్త్రీలకు జాగరణా సందేశాన్ని అంద చేస్తూ వచ్చింది. సరోజినీ దేవే భారత మహిళోద్యమ జన్మదాత్రి. ఆమె శిక్ష, పాశ్చాత్య పద్ధతిలో జరిగినప్పటికీ ఆమె హృదయంలో పాశ్చాత్య సభ్యత స్థల మాక్రమించుకో లేక పోయింది. అందు వల్లనే ఆమె సదా భారతీయ సంస్కృత్యాదర్శసందేశాన్నే హిందూ వనితకు సైతం అంద చేస్తూ వచ్చింది. ఆమె సీత, సావిత్రి వంటి పతివ్రతల ఆదర్శాలను పూజించేది. భారత మహిళల గూర్చి అడుగడు

# స్వర్గీయ సరోజినీ దేవి

క్కుయిస్తూ వచ్చిన ఆమె వుపన్యాస్యాసాల్లో భారతీయ మాతృత్వాదర్శోన్నత సుందర వివేచనమున్నది. ఆమె భారత నారి యొక్క మూలాన్ని సైతం మందుకో కలిగింది; కాబట్టే స్త్రీ యొక్క అవమానాన్ని సహించలేదు.

బాల్యంనుండి పీడితులయెడ సరోజినీ దేవిలో సాను భూతివుంటూ వచ్చింది. ఈసానుభూతే వృద్ధిచెంది, గత పాతికేండ్లుగా దేశం యొక్క మూలమూలల్లో ధ్వనిస్తూన్న ప్రతిధ్వనిస్తూన్న ఘోషగా పరిణమించింది. 1913 లో హిందూ ముస్లిమ్ ఐక్యతనుగూర్చి ముస్లిమ్ లీగ్ అధివేశం లో వుపన్యాస మిచ్చింది. ఆమె మానసక్షేత్రము యెడ తెరపిలేకుండా విస్తృతి చెందుతూ వచ్చితనలో అన్ని జాతులకు, ధర్మాలకు ఒక విధమైన గౌరవస్థానం యేర్పరచుకుంది. హిందూ ముస్లిమ్ ఐక్యతను గూర్చి 1917 అక్టోబర్ లో పాట్నాయందు ఉపన్యసించింది.

దేశం యొక్క సార్వజనిక జీవితంలో యెక్కువ పాల్గొంటున్నా 1921 వ సంవత్సరం వరకు యీ సేవ యొక్క వైఖరి ప్రాచీనంగానే వుంటూ వచ్చింది. జీవితమునుగూర్చి వైభవ విలాస స్వప్నాలు కంటుం మరవలేదు. ఆమెది విశ్రాంతియుత జీవనం. 1921 లో భారత స్త్రీమతాధికార ఆందోళనా సంబంధంలో ఇగ్లాండు వెళ్లింది. ఆ రోజుల్లో సరోజిని తన వస్త్రపరిధానానికి, కళా పూర్ణతకు ప్రసిద్ధి చెందివుండింది. ఆమెతన రచనలవల్ల బ్రిటన్ విద్వత్సమాజంయొక్క సమ్మానాన్ని పొందకలిగింది.

భారతాంబరంలో దుర్ఘటనా నీరదాలు వ్యాపిస్తూన్నై. అమృతసరంలో జరిగిన హత్యాకాండ దేశం యొక్క ఆత్మను దెబ్బకొట్టి మేల్కొలిపింది. గాంధీజీ నేతృత్వంలో అది విశ్వాస ప్రకాశవంతమైంది. అటువంటి సమయంలో ఇంగ్లాండునుండి మాతృదేశానికి ప్రయాణమైంది సరోజినీ దేవి. ఓడ బొంబాయి రేవువైపుకు పురోగమిస్తూండగా ఆమె హృదయంలో లిబరల్స్‌తో పని చేయడమా లేక గాంధీజీతోనా అనే సంఘర్షణ బయల్దేరింది. ఆఖరికి గాంధీ మహాత్ముని ఆందోళనలో కవి యొక్క ఆత్మను స్పృశించే అన్నితత్వాలు వుపస్థితమైవుండినవి. జప్తుచేయ బడ్డకొన్ని పుస్తకాలు బొంబాయి బాటలమీద అమ్మి న్యాయాతిక్రమణ చేసిన సరోజిని 1920 సం॥న పంజాబులో జరిగిన దుర్ఘటనలను గూర్చి ఇంగ్లండ్‌లో సంభాషిస్తూ స్త్రీలకు జరిగిన అక్రమాలను అత్యాచారాలను నిరసించింది.

కొంత కాలం తర్వాత ఒక సచివ ఆసనం ఖాళీ వచ్చింది. తనపూర్వపు మాటలను మార్చి చెప్పుకోమని కొందరు నిర్బంధించినపుడు తేజస్విని సరోజిని నిశ్చయంగా నిరాకరించింది. ఆమె వట్టికువుక్కువాదాలతో తృప్తిబడేవ్యక్తా?

1922 మార్చి 11 వ తారీఖున రాజద్రోహాభియోగం క్రింద తనకు ఆరేళ్ల కఠిన శిక్ష విధింప బడినపుడు బాపూజీ భారతైక్యతను సరోజిని హస్తాల్లో సమర్పించాడు. సర్వత్ర పర్యటనం చేసి ఐక్యతా సందేశాన్ని ప్రచారం చేయసాగింది. రాత్రిం బగళ్లు పర్యటనం చేయడం కారణంగా ఆమె ఆరోగ్యం చెడి పోయింది. ఆరోగ్యం బాగు చేసుకుందుకు సింహళానికి వెళ్లాల్సి వచ్చింది. అక్కడసైతం భారతీయ జాగరణా సందేశాన్ని అంద చేసేందుకు పరిశ్రమ చేస్తునే వుండింది.

ప్రవాసంలోవున్న భారతీయుల కష్టనివారణకు శ్రీమతి నాయుడు యెప్పటికి ప్రయత్నం చేస్తూనే వుండింది. నియమ బద్ధకూలీ పద్ధతికి విరుద్ధంగా యీమె 1917 లో బలమైన ఆందోళన చేసింది. ఆ సంవత్సర జనవరిలో యీ విషయ విరుద్ధంగా జరిగిన ఒక సమావేశంలో ప్రవాసంలోవున్న సోదరీ రత్నములయెడ చేయ బడ్డ అతినీచమైన వ్యవహారాల నుద్దేశించి ఇంగ్లీషులో యిలా అన్నదామె :—

మీ స్త్రీలు విదేశాల్లో అనుభవించిన అవమానాన్ని మీ హృదయ రక్తంతో కడుక్కోండి. నేటి రాత్రి మీరు విన్న మాటలు మీ హృదయాల్లో తప్పక ఒక భయంకర రోషాగ్నిని ప్రజ్వలితం చేసివుండొచ్చు. భారత పురుషులారా, ఈ అగ్నిని నియమబద్ధ కూలీ పద్ధతి యొక్క చితిగా చేయండి. యీ రాత్రి నా మాటలు వినగోరుతున్నారు. కాని నానయనాల్లోనుండి అశ్రువులు వెల్వడుతున్నై. ఇది నేను రోదించాల్సిన సమయం. ఎందుకంటే నేను స్త్రీని. మీరు మీ తల్లుల యొక్క, తోబుట్టువుల యొక్క అవమానాన్ని అనుభవిస్తూండవచ్చు. నేను నా జాతి యొక్క అవమాన రూపంగా నా అవమానాన్ననుభవిస్తూన్నాను.

# స్వర్గీయ సరోజినీదేవి

కేనియా ప్రవాసీ భారతీయ నిమంత్రణవల్ల శ్రీమతి సరోజిని అక్కడికి వెళ్లింది. ఆమె అక్కడి స్థితిగతులను చూచింది; వేర్వేరు ప్రాంతాల్లో పర్యటనంచేసి భారతీయులను తమ కర్తవ్యం పట్ల జాగృతులను చేసింది. తత్ఫలితంగా ప్రవాసీ భారతీయుల అసహాయయోగ మారంభించారు. పోల్‌టాక్స్ యివ్వడానికి నిరాకరించారు. ఆమెను 'దక్షిణాఫ్రికా భారతీయ కాంగ్రెస్' యొక్క మొంబాసా అధివేశనానికి అధ్యక్షురాల్ని చేసి శ్రద్ధాంజలి సమర్పించారు. దక్షిణాఫ్రికానుండి రోడీషియా వెళ్లింది; అక్కడకూడా ఆదేయత్నంచేసింది. 1924 లో హిందూ దేశానికి తిరిగి వచ్చింది; బొంబాయి రేవులో అపూర్వస్వాగతమివ్వబడ్డది. 1929 లో పూర్వాఫ్రికాక్కూడా వెళ్లింది. 1924 లో బెల్గాంక్ కాంగ్రెస్ అధ్యక్ష పీఠాన్నలంకరించింది. ఆమె దేశ అధ్యక్ష పీఠంనుండి శిథిల మౌతూన్న దేశం యొక్క ఆత్మకు ఉత్సాహము, ఆశకలిగించేలాంటి సందేశమొక్కటి యిచ్చింది. ఆమె మాటల్లోనేయిలా సంక్షేపంగా చెప్పవచ్చు,—స్వాతంత్ర్య సమరంలో భయమే యేకైక అక్షమ్యాపరాధము. నైరాశ్యమే యేక మాత్ర అక్షమ్య పాతకము." 1929 లో సరోజినీ నాయుడు అమెరికా యాత్ర చేసిన సందర్భంలో యిచ్చిన వుపన్యాసము అమెరికన్ ప్రజలను అపూర్వంగా ప్రభావితులను చేసింది. ఆ సంవత్సరాంతాన లాహోర్‌లో కాంగ్రెస్ సమావేశం జరిగింది. దీర్ఘ ప్రతీక్షానంతరం దేశము పూర్ణ స్వాతంత్ర్య ధ్యేయాన్ని స్వీకరించింది. 1930 లో ఉప్పు సత్యాగ్రహ సమయంలో నాయకు లందరు అరెస్టు చేయబడ్డారు. మే 29 వ తేదీన సరోజిని అరెస్టు చేయబడ్డది. అంతకుక్రితం 27 గంటలవరకు మండుటెండలో బాటపైన కూర్చుని సత్యాగ్రహం చేస్తూండింది. 1942 లో కాంగ్రెస్ కార్యకారిణి యొక్క తక్కిన మెంబర్లతోపాటు ఈమెకూడా అరెస్టుచేయబడ్డది. సుమారు రెండేండ్ల తర్వాత ఆరోగ్యం పాడయి పోడంవల్ల జెయిలునుండి నియమరహితంగా వదిలి వేయబడ్డది. ఆ సమయంలో ఆమె యిచ్చిన వుపన్యాసం దేశం యొక్క మానసంలో వుత్సాహ తరంగాలను ప్రవహింప చేసింది; కాంగ్రెస్ పట్ల వ్యాపించివుండిన భ్రమ దూరీకృతమైంది. ఏప్రిల్ 1945 లో ఆమెకొడుకుల్లో ఒకడు మరణించాడు. కర్తవ్యవశీల ఆమె యూ. పీ. గవర్నర్ భారాన్ని వహించింది. ప్రపంచంలోనే మహిళ గవర్నర్ కావడమిదే ప్రథమ పర్యాయం. విశ్వభారతి యొక్క ఉపాధ్యక్షురాలుగా 1947 లో జరిగిన సమస్త ఆసియా యొక్క దేశ ప్రతినిధుల సమ్మేళనను నిర్వహించినది కూడాయీమె. ఎన్ని విధాలగనో దేశానికై పాటుపడి, మధుర వాగ్ధాటిలో ఊయలలూగే వుపన్యాసాలవల్ల ప్రాక్ దేశపునైటింగేల్ అని ప్రసిద్ధిచెందిన నారీశిరోమణి అయిన శ్రీమతి సరోజిని గత సంవత్సరం మార్చి రెండవ తారీఖున స్వర్గమలంకరించింది.

ఈ ఫిబ్రవరి 12 వ తేదీన, ఆమె భర్త శ్రీ మేజర్. ఎం. జీ. నాయుడు గారు పరమపదించిరి.






# "పాదపూజ"

※ శ్రీ గజవెల్లి నీలాచాలం ※

జగద్రక్షకుడైన శ్రీ రామచంద్రుడు పితృనాజ్ఞ శిరసావహించి తన అనుజుడైన లక్ష్మణుని, సతియైన సీతాదేవిని వెంట బెట్టుకొని అరణ్యామునకు బయలు దేరెను. మార్గ మధ్యమున అనేక గుట్టలు, పుట్టలు, నదీ నదములు, కారడవులుదాటి, చివరకు గంగానది సమీపమునకు చేరెను. అప్పుడువారికి గంగానది దాటి వెళ్లుట ఒక గొప్పసమస్య అయ్యెను. శ్రీ రామచంద్రుడు ఈ విషయమై తీవ్రముగా ఆలోచించుచుండగా ఒక పడవవాడు వారి చెంతకు వచ్చెను. కాని ఆనావికునకు వారు సీతారామలక్ష్మణులన్న సంగతి మాత్రము తెలియదు.

"స్వామీ మిమ్ములను గంగానది దాటించమన్నారా ?" అని అన్నాడు నావికుడు.

శ్రీ రామచంద్రుడు ఎంత శాంత స్వభావము కలవాడో అంతకు పది రెట్లు ఉగ్ర స్వభావము గలవాడు లక్ష్మణుడు. "ఓరి మూర్ఖుడా ! మేము యిక్కడ ఎంతసేపై వేచియున్నామో నీకేమి తెలుసు ? అయోధ్య రాజైన దశరథ మహారాజుగారి కుమారుడు శ్రీ రామచంద్రుడు వచ్చియున్నాడన్న సంగతి నీకు తెలియదా ! దగ్గరకు వచ్చికూడా "మిమ్ములను గంగానది దాటించమన్నారా" అని, కుశల ప్రశ్న వేస్తున్నావా ? ఛీ పనికి మాలినవాడా !" అని ; అన్నాడు నావికునితో లక్ష్మణుడు.

"అమ్మ బాబోయ్ ! సాక్షాత్తు శ్రీ రామచంద్రుడే ! అయితే పడవ ఎక్కించను".

"ఏమి నీకంత పొగరెక్కిందా! చూడు నిన్నేమి చేస్తానో." అని చెయ్యెత్తాడులక్ష్మణుడు.

"తమ్ముడా ! లక్ష్మణా !! ఆగు, తొందర పడవద్దు." అని అన్నాడు శ్రీ రాముడు.

"నాయనా నావికా ! నీవు మమ్మల్ని పడవ ఎందుకెక్కించవు ?" అని ప్రేమతో అడిగాడు శ్రీ రాముడు. "ప్రభూ ! నీవే శ్రీ రామచంద్రుడవైతే నీకు నావందనములు. కాని ఒక్కమాటు నీ పాదములు కడుగకుండా నిన్ను పడవ ఎక్కించను. ఆనాడు పాషాణంగాపడి వున్న ఆ మహాసాధ్వి అహల్యనే పడతిగా

చేశావే! రాతిని నాతిగా చేసిన నీ పాద స్పర్శ నా పడవను ఏమి చేయునో! నా పడవనగా ఎంత? నేనెంత? ఇంట్లో నేను నా యిల్లాలు తో నే భాధపడ లేకుండా వున్నానే, ఈ పడవకూడా ఒక స్త్రీ అయిపోయిందంటే యింకనాకుచావే! ఒక స్త్రీనే భరించ లేకున్నాను. నా పడవపోతే నావృత్తి ఏంకావాలి? నాకు యింక బ్రతుకే లేదు. వద్దు, బాబో వద్దు నీపాదాలు కడగందే పడవ ఎంత మాత్రం ఎక్కించను" అన్నాడు పడవవాడు.

శ్రీరాముడు చిరునవ్వుతో, "సరే" అని అన్నాడు. అప్పుడు ఆనావికుడు తన భార్యతో సహా శ్రీ రాముని పాదపద్మములను గంగాజలముతో కడిగి ఆ తీర్థమును పుచ్చుకొని కృతార్థుడయ్యెను. పిమ్మట సీతా రామ లక్ష్మణులను పడవ నెక్కించుకొని గంగానది ఆవలి ఒడ్డుకు సురక్షితముగా తీసుకొని పోయినాడు. ఆ పడవవాడే శ్రీ రామచంద్రుని పరమ భక్తుడైన గుహుడు.



# తల్లిమాట వినకపోతే....

❋ ధవళనాగేశ్వర్ ❋

ఒక అడవిలో పెద్ద ప్రమానుకలదు. దానికి ఒక కన్నముగలదు. అందు నాలుగు ఎలుక పిల్లలు, తల్లి నివసించుచుండెను. ఒక నాటి రాత్రి తల్లి తన పిల్లలతో, "మీరు యీవెన్నెల రాత్రిలో ప్రమానువదలి అవతలికి పోవద్దు. అచట గుడ్లగూబలున్నవి. అవి మీరు అవతలికి పోతే చంపి తింటాయి" అని చెప్పి నిద్ర పోయినది.

మొదటి రెండెలుకలు తల్లి మాటవిని పరుండినవి. కాని మిగిలిన రెండు పిల్లలు తల్లి మాటను వినకుండా, చప్పుడు చేయక ప్రమానుదాటి అవతలికి పోయినవి. చంద్రబింబము ప్రకాశించుచున్నది. ఆ అడివియంతా పగలువలె వెన్నెలతో నిండియుండెను. ఆ రెండు ఎలుకపిల్లలు సంతోషముతో ఆడుకొనుచుండెను.

మామిడి చెట్టు మీద నిప్పులవంటి కండ్లు, భయంకరమైన ముఖము కలిగిన గుడ్లగూబల జంటను ఎలుక పిల్లలు చూచినవి. అప్పుడు వానికి తల్లి మాటలు జ్ఞాపకము వచ్చినవి. వెంటనే అవి ప్రమానువద్దకు పారిపోబోయెను.

ప్రమాను దగ్గరకుచేరుసరికి అవి గుడ్లగూబలకు చిక్కిపోయినవి. "తల్లిమాటవినక యిలాగై తిమిగదా"! అని ఆ ఎలుకలుచింతించి మరణించినవి. ఆ రాత్రి గుడ్లగూబ ఎలుక పిల్లలను కడుపునిండుగతిన్నవి.

తల్లి ఎలుక, మిగిలిన ఎలుక పిల్లలు చాలా విచారించినవి. చూశారా! తల్లిమాట వినని ఎలుక పిల్లలేమయినవో?

మీరందరూ! మీ అమ్మ చెప్పినట్టు వింటారుకదూ?



# తపశ్శాలి

"రాజేశ్వర్"

అనగనగా ఒక అడవిలో ఒకనక్క వుంటూ వుండేది. అది రోజూ ఎలుకలు వున్నరంధ్రం దగ్గరకు వెళ్లి ఒకకాలు భూమి మీదవుంచి నిలబడి ముఖం ఆకాశం వైపు, త్రిప్పినోరు తెరచు కొని వుంటూవుండేది.

ఒక నాడు ఆ రంధ్రములో వున్న ఎలుకలు బైటకు వచ్చినక్కను చూచి, "నీ పేరేమిటి? నువ్వెందుకిలా చేస్తున్నావు?" అని, అడిగేయి.

"నన్ను తపశ్శాలి అంటారు. నేను నాలుగు కాళ్లతో నిల్చొనివుంటే భూదేవి మోయలేదని ఒంటికాలు మీద నిల్చుంటున్నాను. నేను ఆహారం తీసుకోను, అందువలన ఆకాశం వైపు ముఖం త్రిప్పి గాలిని మాత్రమే పీల్చుతున్నాను. అంతే కాక, సూర్య నమస్కారం కూడా చేస్తున్నాను," అని, నక్క చెప్పింది.

అప్పుడు ఈ ఎలుకలన్నీ, "ఆహా! ఎటువంటి తపశ్శాలి. వాని ముఖం చూస్తే పాపములన్నీ పోవునుగదా!" అని, ప్రతి రోజు వచ్చి నక్కకు పూజచేసి చుట్టు ప్రదక్షిణం చేసి వెళ్లి పోతూ వుండేవి. అలాగ వెళ్లేటప్పుడు నక్క ఆఖరి ఎలుకను పట్టి తినేది. ఇలా రోజుకొక ఎలుక చొప్పున తింటూవుండేది. అలా క్రమేపి ఎలుకల గుంపు తగ్గి పోతూంది. ఒక నాడు ఎలుకల రాజు ఆఖరుకుమిగిలినది. అదినక్కకు పట్టుపడి పోవలసిందే. కాని అదృష్ట వశాత్తు తప్పించు కొని పోయింది. అప్పుడు ఎలుకలకు ఆనక్కయొక్క మోసం తెలిసింది. ఆమర్నాడు ఎలుకలన్నీ నక్క దగ్గరకొచ్చి, "నువ్వు చేస్తున్న దొంగ జపం ఇప్పుడు మాకు తెలిసింది. ఎన్నాళ్లనుండి నువ్వు ఈపని చేస్తున్నావో మేము తెలుసుకోలేక పోయాం. ఇప్పుడు నీ సంగతి తెలిసింది." అని, ఒక్క మారు ఎలుకలన్నీ నక్కమీదకు ఉరికి కొరినవి. ఆ నక్క కొద్ది సేపటిలో మరణించింది. అప్పుడవన్నీ ఆనక్కను పీక్కుతిన్నాయి. అంతటితో దాని పని అయింది.

"బాలలూ! మీరెప్పుడూ యిటువంటి కపటసన్యాసులను, మాయ గురువులను నమ్మకండేం?"



నా
ది

నా
ది

నా
ది




నా
ది

నా
ది

నా
ది

# అమృతాంజనము

గాని,

" యథాయథా.... .... .... ....కాలీధవళత్వ శంకయా."

అమృతాంజనమా ! నీ కీర్తి ముల్లోకములను దెల్పుఁజేయు పూనికతో పెరుఁగు
చున్నప్పుడెల్లను, నా నల్లని ముంగురులు, దెల్లబడునేమోయను భయముచే
నా హృదయము మిక్కిలి పరితాపమొందుచున్నది సుమా !!!

## ఆవశ్యకతా బోధకములు.

బలవంతము, పరాధీనతచే నొక పని చేయవలసివచ్చినపుడు క్రియార్థక సంజ్ఞకు '**पड़ना**' చేర్చవలెను.

'**पड़ना**' చేర్చినపుడు కర్తతో '**को**' ప్రత్యయము వచ్చును. క్రియ లింగవచనములు కర్మ ననుసరించియుండును.

ఉదా :—(1) **उसे पैदल जाना पड़ा।** అతడు నడిచి వెళ్లవలసి వచ్చెను.

(2) **मुझे पाँच रुपये जुर्माना देने पड़े।** నేను ఐదు రూపాయలు జుర్మానా ఇవ్వవలసి వచ్చెను.

ఒక పని చేయవలసిన ఆవశ్యకతను తెలుపుటకు క్రియార్థక సంజ్ఞకు **था, होगा, है** చేర్చవలెను.

కర్తతో '**को**' ప్రత్యయము వచ్చును. క్రియా రూపము కర్మ యొక్క లింగవచనముల ననుసరించియే యుండును.

ఉదా :—**मुझे एक चिट्ठी लिखनी है।** నేను ఒక పుత్తరము వ్రాయవలసియున్నది.

**आप को कल ही यह काम करना होगा।** తమరు రేపే ఈపని చేయవలసి యుండును.

**मुझे जाना था।** నేను పోవలసియుంటిని.

సూచన :—**था, होगा, है** వీనికంటె '**पड़ना**' యెక్కువ యావశ్యకతను తెలుపును.

క్రియార్థక సంజ్ఞకు '**चाहिये**' చేర్చిన తప్పసి సరిని తెలుపును. ఇది 'కావలెను' 'వలయును' అను యర్థములో కూడ వాడబడును. కర్తతో '**को**' ప్రత్యయము వచ్చును. క్రియకర్మ ననుసరించును.

ఉదా :—**तुमको वक्त पर आ जाना चाहिये** నీవు వేళకు సరిగా రావలెను.

**मुझे आप की मदद चाहिए** నాకు మీ సహాయమవసరము.

## పాఠము 20.

### కర్మణి ప్రయోగము Passive Voice कर्तृवाच्य

**मैं फल खाता हूँ।** (Active voice). కర్తృవాచ్యము.

**मुझसे फल खाया जाता है। कर्मवाच्य** (Passive Voice). కర్మవాచ్యము.

కర్తృ వాచ్యమందు కర్మగానున్న పదము కర్మవాచ్యమందు కర్తయగును. అపుడు క్రియా రూపములు కర్మ యొక్క లింగవచనములననుసరించి యుండును.

కర్తృ వాచ్య క్రియ యొక్క సామాన్య భూతకాల రూపమునకు '**जाना**' చేర్చిన, కర్మవాచ్యమగును.

ఉదా:—**लिखा जाना** వ్రాయబడుట.

భూత, భవిష్యద్వర్తమాన కాలములలో '**जा**' ధాతువు మారుచుండును. ముఖ్య క్రియ గూడ కర్తయొక్క లింగ, వచనముల ననుసరించి మారుచుండును. కర్తృ వాచ్యమందలి కర్తగా నున్న పదమునకు కర్మ వాచ్యములో '**से**' వచ్చును.

ఉదా:—**कृष्ण चिट्ठी लिखता है।** కృష్ణుడు వుత్తరము వ్రాయుచున్నాడు.

**कृष्ण से चिट्ठी लिखी जाती है।** కృష్ణుని చేత వుత్తరము వ్రాయబడుచున్నది.

### భావవాచ్యము. (Impersonal Voice).

అశక్తత, విధి లేక పోమిని సూచించుటకు భావవాచ్యముపయోగింతురు. దీని ప్రయోగము కర్మణి ప్రయోగము వలెనే యుండును అకర్మక క్రియకుగూడ నిది యనువర్తించును. ఇది ఎప్పుడును పుంలింగమందే యుండును.

సూచన:—హిందీలో తప్పయితర దేశ భాషలందీ ప్రయోగము లేదు.

**मुझसे इतनी दूर चला नहीं जाता।** నా చేత యింత దూరము నడువబడజాలదు. (నేను యింత దూరము నడువ జాలను).

## పాఠము 21.

### **कि** సముచ్చయ ప్రయోగము. (Indirect Speech).

ఒకడు రెండవ వానితో మూడవవాడు చెప్పిన మాటను చెప్పవలయునన్న ఆ వాక్యమునకు మొదట (తెలుగులో 'అని', ఇంగ్లీషులో 'that' వలె) **कि** చేర్చవలెను.

## ఆవశ్యకతా బోధకములు.

ఉదా :—**रामचन्द्र ने मुझसे कहा कि मैं बंबई जाऊँगा।** (రామచంద్రుడునాతో చెప్పెను- నేను బొంబాయి వెళ్లెదను అని), రామచంద్రుడు నేను బొంబాయి వెళ్లెదనని నాతో చెప్పెను.

### వాక్యములు.

| | |
|---|---|
| अगर आपको जाना ही है तो जाइये। | మీరు వెళ్లుట యవసరమగుచో వెళ్లుడు. |
| तुमको वहाँ जाना चाहिये था। | నీ వక్కడికి వెళ్లియుండ వలసినది. |
| हमें स्वदेशी चीजों का इस्तेमाल करना चाहिये। | మనము స్వదేశీ వస్తువులను వాడవలెను. |
| मुझे कल यह किताब वापस करनी है। | నేను రేపు ఈ పుస్తకము (తిరిగి) యివ్వవలసి యున్నది. |
| तुम्हें कल मास्टर साहब से मिलना होगा। | రేపు మీరు ఉపాధ్యాయులను కలుసుకొనవలసి యుండును. |
| हमारे मदरसे में हिन्दी पढ़ाई जाती है। | మా పాఠశాలలో హిందీ నేర్పబడుచున్నది. |
| यह काम किससे किया जायगा? | ఈ పని ఎవరిచే చేయబడును ? |
| आजकल हर देश में पंडितजीकी तारीफ़ की जाती है। | ఈ రోజులలో ప్రతి దేశములోను పండిత్ జీని పొగడుచున్నారు. |
| मैंने कभी नहीं सोचा था कि मुझे ऐसा काम करना पड़ेगा। | ఇటువంటి పని చేయవలసియుండునని నేనెప్పుడును తలచ లేదు. |
| क्या आप समझते हैं कि फिर युद्ध छिड़ने वाला है? | తిరిగి యుద్ధము ప్రారంభమగునని మీరు తలచు చున్నారా ? |



# మహిళలకు బాబూ రాజేంద్ర ప్రసాద్ గారి సలహా

అలహాబాదులో ఫిబ్రవరి 20 వ తేదీ మహిళా విద్యాపీఠ పట్టప్రదాన సభలో భారత ప్రభుత్వాధ్యక్షులగు డా॥ రాజేంద్ర ప్రసాదుగారు స్నాతకోత్సవ ఉపన్యాసములో యిటుల చెప్పిరి :—

ప్రాత సంస్కృతితో క్రొత్త సంస్కృతిని కలిపి పెన వేయుచుండుటవల్లనే పురోభివృద్ధి కన్పించుచుండును. ఈ విషయంలో స్త్రీల కెక్కువ బాధ్యతకలదు. మానవాభివృద్ధియే మానవ వికాసముగా సృష్టియందేర్పడి యున్నది. స్వకుటుంబములోను, స్వసంఘములోను ముఖ్యంగా మనం పోషించి కాపాడునది స్త్రీలే. ఆమె కోమలాంగమునందు భూత వర్తమాన, భవిష్యత్తులు సంశ్లేషమునంది అవిభక్తముగానున్నవి. కాబట్టి స్త్రీలు తమ నిజతత్వమును, పరమార్థమును బాగుగ గ్రహించవలెను.

మన మిప్పుడు యుగసంధిలో వున్నాము. మనదేశములో నిరాశా జీవులు చాలామంది వున్నారు. ప్రజా సంఘమునందు ఆశాభావము వుద్భవించవలెనంటే, స్త్రీలు కూడా కార్యరంగమునకు దిగవలెను. భూలోకమును, స్వర్గలోకముగా మార్చగల అద్భుత శక్తి స్త్రీ హృదయములో గలదు. రాబోయే పురుషాంతరము వారి మనస్తత్వమును వారి శైశవములోనే సక్రమంగా పోతపోసిననే తప్ప ఏరాజ్యముగాని ఎటువంటి ఆర్థిక విధానమును అమలు పరచినప్పటికి నిజమైన శాంతి సౌభాగ్యములు వెలయజాలవు, అందుచేత స్త్రీలను ఇంటి ఆవరణలోనే బంధించవలెనని వాదించను. మీదు మిక్కిలి సంఘములో పురుషులవలె స్త్రీలకు కూడా స్వేచ్ఛా స్వాతంత్ర్యము లుండవలెను. అయితే అట్టి స్వేచ్ఛగల వ్యక్తి తన స్వేచ్ఛను సద్వినియోగము చేయగలెను. తన జీవితమును లోక సంగ్రహార్థమై సద్వినియోగము చేయవలెను. తద్భిన్న ప్రవర్తనము అరాజకము, సంక్షోభము అగును. స్త్రీ అంటే, లోకమును పోషించి, కాపాడేదాది. మాతృ స్వరూపిణి ఇట్టి ఉన్నత ధర్మమును నిర్వర్తింపకుండ స్త్రీలను పెడత్రోవలబెట్టెడి ఈ కాలపు సంఘ పద్ధతులను, పోకడలను పూర్తిగా నిర్మూలించవలెను. స్త్రీ సంఘము పురుషులతో సమానంగా వికాసమును పొందవలెను. అట్టి వికాశమునువారు పొంద వీలులేకుండా ప్రతిబంధకములను కల్పిస్తే అది సంఘమునకు అనర్థదాయకము.

★

## మదరాసు సంగీత కళాశాల
## పంచమ వార్షికోత్సవము

మద్రాసు శాసన సభ డిప్యూటీ స్పీకరు శ్రీమతి అమ్మన్న రాజాగారి అధ్యక్షతను మదరాసు సంగీత కళాశాల పంచమ వార్షికోత్సవము గోపాలపురం బాలికోన్నత పాఠశాలయందు 17 వ తేదీ శనివారం నాడు జరిగినది. శ్రీమతి ద్వారకా పార్థసారథిగారు కళాశాల నివేదికను చదివిరి. పిమ్మట బేబీ పద్మ భరత నాట్యము, ఫిడేలు, గాత్రగానము జరిగినవి.

తర్వాత శ్రీమతి అమ్మన్న రాజాగారు ప్రసంగిస్తూ, సంగీతమువల్ల నైతిక దృక్పథము అభివృద్ధి చెందుననియు అందుకై యిట్టి చక్కని శిక్షణనిచ్చు కళాశాలలు పెక్కులు మనదేశమున నిర్వహించుట అవసరమనియు, ఈ విషయమున ప్రభుత్వము కూడ సాధ్యమైన సహాయము చేయుచున్నదనియు చెప్పిరి.

తరువాత శ్రీజయదేవుని 19 వ అష్టపది 'వదసి'ని ఛాయా నాటికగా ప్రదర్శించిరి. వందన సమర్పణతో సభ ముగిసినది.

★

## అఖిల భారత మహిళా సమావేశము
## చెన్నపురి శాఖ

ది 19—2—51 న కేంద్ర ఆఫీసులో, పై సమావేశము జరిగెను, చెన్నపురి వివిధ శాఖలనుండి, జనవరి ఆఖరున బెంగుళూరులో జరిగిన మహా సమావేశమునకు వెళ్లిన ప్రతినిధులు, తమ ప్రయాణపు అనుభవములను గురించి సమావేశములో జరిగిన వివిధ తీర్మానములను గురించి, ఉపన్యసించిరి. బెంగుళూరు పట్టు చీరలసొంపు, ఆహ్వాన సంఘాధ్యక్షురాలైన శ్రీమతి కె. సి. రెడ్డి సతిగారి నమ్రత కలుపు గొట్టితనము, మైసూరు మహారాణీగారి అల్పాహార విందు, మొదలైనవి ఎట్లావారి హృదయాలనాకర్షించాయో, ముందు కార్యక్రమాన్ని గురించి సమావేశంలో ఎలాంటి నిర్ణయాలు జరిగాయో, మున్నగు విషయాలను గూర్చి కూడ ప్రసంగించిరి.

ఆర్. లక్ష్మి.

★




## నాడు నేడు :

(మిత్రబృంద ప్రచురణలు)

రచయిత : జగం. వెల నాలుగు అణాలు :

ప్రతులకు : మాధవీ ప్రచురణలు, పవర్ పేట. ఏలూరు.

మిత్ర బృంద ప్రప్రథమ ప్రచురణ 'నాడు నేడు' అనే నాటికా ద్వయం శ్రీజగం రచించారు. 'నాడు నేడు' అని ఈ చిన్ని నాటికా ద్వయానికి చక్కని పేరు పెట్టారు.

ప్రథమ నాటిక 'పోతన' అంటే నాడు, పిదప రెండవ నాటిక 'పదిరూపాయలు', నేడు. ఇది ఈ చిన్ని నాటికలలో విశేషం. కవిముందు 'నాడు' అంటే పోతన జీవితంలో తను చదివినది, ఏవిధంగా పోతన తన దృష్టికి కనిపించినది, ఆవిధంగా తను వ్రాస్తున్నాననీ ముందు మాటలో వ్రాశారు.

పోతన మూడు రంగాల నాటిక.

నాటికలో ముఖ్యమైన విషయాలు : శ్రీనాథుడు పోతనను 'భాగవతం' రాజుకు అంకితం చేయమంటాడు. హాయిగా జీవించమటాడు. కాని దానికి పోతన తన అసమ్మతిని తెలియజేస్తాడు. భోగం కోసం ఒకరికి దాసులుగా—బానిసలుగా బ్రతకడం తనకు ఇష్టం లేదంటాడు. స్వాతంత్ర్యం మానవ జన్మహక్కంటాడు. శ్రీనాథుడు ఎగతాళి చేస్తాడు. జీవితం సుఖించడానికి కాని, పొలంమున్న కొని పొట్ట నిండక ఏడి చేందుకు కాదు అని, హాలికత్వంలో నున్న హాయి హాలికులకే తెలియాలి అని చివరికి శ్రీనాథుడు సహితం క్షమార్పణ వేడుకుంటాడు. రాజభటులు భాగవతం బలవంతంగా పోతన నుండి తీసికొని వెళ్లుటకు వస్తారు. కాని ప్రజలు ఈ అన్యాయం చూడకలే పోతారు. భటులను ఎదిరిస్తారు. భటులలో సహితం పరివర్తన వస్తుంది. పోతన తన భాగవతం శ్రీహరికి అంకిత మిచ్చానంటాడు. ఇవి పోతన నాటికలోని విషయాలు.

ఇక

నేడులో 'పదిరూపాయలు'

ఒక కవికుటుంబం నేడు ఏ పరిస్థితులలో ఉన్నదీ సృష్టించాడు. కవి ఈ రోజుల్లో ఎటువంటి దుర్భరమైన జీవితం గడుపుచున్నది, అతను రచించిన రచనలకు ప్రచురణ కర్తలు ఏవిధమైన ప్రోత్సాహ మిస్తున్నది చక్కగా చిత్రించారు. మనోహరం ఒక కవి. అతని భార్య ఉమ. వీరికి ఒకే ఒక్క కొడుకు, జబ్బుతో బాధపడుతూ చావు, బ్రతుకుల మధ్య తన జీవితాన్ని గడుపుచుంటాడు. డాక్టరు పదిరూపాయలు అడుగుతాడు. ఉమ తన మాతృప్రేమ కొద్దీ భర్తను ప్రాథేయపడి అడుగుతుంది. కాని మనోహరం వద్ద పదిరూపాయలు కాదు కదా పదిపైసలయినా ఉండవు. తను వ్రాసిన పుస్తకాలను చింపుతాడు, తనస్థితిని దూషించుకుంటాడు. తన పరిస్థితులను తను కథ వ్రాసిపంపిన ప్రతిక సంపాదకులకు వ్రాస్తాడు, ఒక్కపది రూపాయలు పంపమని. కాని వారి వద్దనుండి ఒక్కటే జవాబు తొందరగా పంపలేమని.

ఈ రెండు చిన్న నాటికలు చక్కగా ఉన్నవి. మిత్రబృందంవారు ఈ విధంగానే మన తెలుగు పఠితలోకానికి చక్కని సాహిత్యాన్ని అందజేయాలని ఆశిద్దాం.

* * * *


ఇంగువం
VHR
ఆరోగ్యము, ఇచ్చును!



ఆంధ్ర మహిళాసభలో రిపబ్లిక్ దినోత్సవమున జండా ఎత్తిన బొబ్బిలి రాజకుమారి శ్రీమతి ఇందిరాదేవిగారు, అధ్యక్షత వహించిన శ్రీమతి అల్లాడి వెంకటలక్ష్మమ్మగారు. ఉత్సవమునకేతెంచిన కొంతమంది సభ్యురాండ్రు.

## రచయితలకు మనవి

అమూల్య రచనలను ఇచ్చి ఆంధ్ర మహిళ పత్రిక 7 సంవత్సరములు నిరాఘాటముగా ప్రచురణకాగల అవకాశము కల్పించిన రచయితలందరికీ మా కృతజ్ఞత. ఇక మీదట కూడా మీరు రచనలనిచ్చి యథాప్రకారం సహరించగలరని నమ్ముచున్నాము.

ఇది వరకటి మాదిరిగానే వచ్చే మే నెలలో ప్రత్యేకించి జన్మదిన సంచిక ప్రచురింపదలచాము. ఆ సంచికకై రచనలు పంపేవారు మార్చి నెలాఖరులోగా మాకు చేరునట్లు పంపించ ప్రార్థన.

స్త్రీ జనాభ్యుదయమునకు, స్త్రీల సమస్యలకు సంబంధించినవిగా, ఆర్థిక రాజకీయములకు చెందినవిగా ఉన్న రచనలకు ప్రాధాన్యత చూపబడుతుంది. ఏకాంకికలు. చిన్నకథలు, గేయాలు కూడా కావాలి. విడివిడి అక్షరాలతో వీలైనంత స్పష్టంగా కాగితమునకు ఒక వైపున వ్రాసి, సకాలమునకు మాకు పంప ప్రార్థన.

రేఖా చిత్రములు, ఛాయా చిత్రములు, ముగ్గులు, కూడా చక్కనివి పంపినచో ప్రచురింతుము.

సంపాదకురాలు

ఆంధ్ర మహిళ



1950—'51 ఇంటర్ తరగతి విద్యార్థినులు, నిర్వాహకులు.

# విజయము

## కాశీ విశ్వవిద్యాలయపు

ఇంటర్ మీడియట్ పరీక్షలకు ఆంధ్ర మహిళా సభనుండి వెళ్లిన 10 మంది విద్యార్థినులలో అందఱూ విజయమును గాంచిరని తెలుపుటకు ఎంతయూ సంతోషించుచున్నాము. శ్రేణులతో పాటు విద్యార్థినుల పేర్లు యీ దిగువ ప్రకటించుచున్నాము.

### ద్వితీయ శ్రేణి

యం. పద్మావతి
లిల్లీ లక్ష్మి విశ్వాసం
లలితా గణేశ రత్నం
విశాలాక్షి సుబ్రహ్మణ్యం
వల్లూరి సావిత్రి
పద్మభాష్యం

### తృతీయశ్రేణి

సీతాబాయి రామచంద్రరావు
ఆర్. సరోజిని
వి. వరలక్ష్మి
విమలా శ్రీనివాసన్

పూర్తి వివరములకు కార్యదర్శిని, ఆంధ్రమహిళాసభ, మద్రాసు 4, అని వ్రాయవలెను. బుధ, శనివారములలో మధ్యాహ్నము 3 గం॥ నుండి, 6 గం॥ వరకు, కార్యదర్శినులను ఆఫీసులో చూచి మాట్లాడవచ్చును.

జి. జమునాబాయి,
అ. చన్నఘంటమ్మ,
కార్యదర్శినులు.

మైలాపూరు,
మద్రాసు-4.
Phone 86961.

మూడు నియమాలు : పణ్ణర్థం గడువు......



వినోదా వారి

# స్త్రీ సాహసము

అంజలి..నాగేశ్వరరావు..సూర్యప్రభ..సి.యస్.ఆర్..శివరావు..రేలంగి
గిరిజ..రామ్మూర్తి..సీతారాం..సి. వరలక్ష్మి..సదాశివరావు..అన్నపూర్ణ..విజయలక్ష్మి



దర్శకత్వం...వేదాంతం రాఘవయ్య
రచన, పర్యవేక్షణ... సముద్రాల....

సంగీతం....సుబ్బరామన్ * ఛాయాగ్రహణం.... రంగా * కళ.... వాలి & గొడగాంకర్...

ఆంధ్ర, సీడెడ్, నైజాం
పూర్ణా రిలీజు



మైసూర్
అమృత్ పిక్చర్స్

# ఆంధ్రమహిళ

సంపుటి 8 :: జూలై '51 :: సంచిక 3




సంపాదకురాలు : శ్రీమతి దుర్గాబాయి, యం. యే., బి. యల్.

సహసంపాదకురాలు : శ్రీమతి చన్నఘంటమ్మ, యం. యే. యల్. టి.

ఆంధ్ర మహిళా సభ, మైలాపూర్

సంవత్సర చందా ఆరు రూపాయలు






సంపుటి 8 జూలై 1951 సంచిక 3

# స్త్రీలకు క్రొత్త అవకాశములు

ఆంధ్ర మహిళా సభ గత దశాబ్దముగా స్త్రీల విద్యాభివృద్ధికి చేసిన సర్వతోముఖసేవ అందఱకు తెలిసినదే. బాల్యమునందు పాఠశాలకేగి విద్య నభ్యసించ నవకాశములేని యువతులు ఉద్యోగ నిమిత్తమై తల్లిదండ్రులు ఊరూర తిరుగుచుండుటచే తమ విద్య కాటంకము గల్గిన బాలికలు, యింకా, ప్రాంతీయభాష తమ మాతృభాషకాని బాలికలు, ఇచట ఏకోట విద్య నభ్యసించి, మెట్రిక్యులేషన్ మెట్టుదాటి, కళాశాలవిద్య నభ్యసించు నవకాశమును సంపాదించుకొనుచున్నారు. విద్యార్థినిలో గల చాకచక్యమునుబట్టి, ఎంత తక్కువ కాలములో వీలైన, అంత తక్కువ కాలములో ఈ మెట్టు దాటగలుగుటచే, ఎక్కువ కాలయాపన, ధన వ్యయము లేకుండా, కళాశాల ప్రవేశమును బొందగలుగు చున్నారు. అదేవిధంగా, ఒకే సంవత్సరములో రెండు సంవత్సరముల ప్రణాళికను ముగించుకొని ఇంటర్ మీడియెట్ పరీక్షకు కూడ వెళ్లు చున్నారు.

ఇకమీద, ఈ సంస్థలో స్త్రీలకు మరికొన్ని అవకాశములు కల్పింపబడుచున్నవి. ఇంతవరకు, ధనార్జనావసరముగల యువతులకు కొద్దికాలములో కుట్టు మొదలగు చేతిపనులు నేర్పించి, గవర్నమెంటు డిప్లొమా పొందు శిక్షణ ఇక్కడ పరిశ్రమల శాఖలో ఏర్పరుపబడినది. ప్రస్తుతములో, అట్టి సర్టిఫికెట్లు పొందిన యువతులకు పెక్కుచోట్ల ఉపాధ్యాయవృత్తి లభించు చున్నప్పటికినీ, ఎనిమిదవ తరగతి కనీసపు సామాన్యవిద్య అట్టివారికి ఉద్యోగ స్థిరత్వమునకు ఆవశ్యకమని నిర్ణయించుచుండుటచే, ఇచటి పారిశ్రామిక విద్యాలయపు విద్యార్థినులకు, 8వ తరగతి గవర్నమెంటుపరీక్షకు వెళ్లు నిమిత్తము శిక్షణకూడ యీ సంవత్సరమునుండి ప్రారంభింప బడుచున్నది. యీ పరీక్షలో ఉత్తీర్ణులగుటచే తరువాత నాల్గవ ఫారములోగాని,














ప్రొడ్యూసర్, డైరెక్టర్ : ప్రకాశరావు
రచన : తాపి
కెమేర ... రంగ
మ్యూజిక్ ... పెండ్యాల
ఆర్టు ... శర్మ

SHARMA.T.V.S

ఆంధ్రా & సీడెడ్ : నవయుగ ఫిల్మ్స్, విజయవాడ. :: మైసూర్ : ప్రకాశ్ పిక్చర్స్, బెంగుళూరు సిటీ.

నైజామ్ : కర్ణాటకా ఫిల్మ్స్ లిమిటెడ్, బెంగుళూరు సిటీ.

ఇతర వివరములకు : ప్రకాశ్ ప్రొడక్షన్స్ మద్రాసు—4.

# ప్రస్తుత పరిస్థితులు

* శ్రీమతి అచ్యుతవల్లి *



## మిడతంభొట్లు :

ఈతి బాధలలో మిడతలు ఒకటి. అవి కొన్ని లక్షలు కోట్లు ఒక దండుగాచేరి పంటలను నాశనం చేస్తాయి. కిందటేడు గుజరాతులో వీరవిహారం చేసిన దర్పంతో ఒక మిడతల దండు యీమధ్య ఢిల్లీమీదుగా ఎగిరి వెళ్లిందట. వాటినీడ పార్లమెంటు భవనంమీద కూడ పడ్డదని వినికిడి. మిడతలంటి కీటకాల నీడ తమకు సోకినందుకు ఉగ్రులైనటువంటివారై ప్రభుత్వంవారు వాటిని హతమార్చి తీరాలని శపథం పట్టారట. రాజు తలచుకుంటే దెబ్బలకు కొదవా ? వెంటనే ఆగమేఘాలమీద అమెరికాకు కబురు చేశారు, రెండు ప్రత్యేక విమానాలు మిడతలను చంపే టందుకు పంపమని. ఇదివరలో అమెరికావారిని మనవాళ్లు ఆహార పదార్థాలు అడగటం, వాళ్లు యిదిగో అదుగోనని పూరించడం అందరికి తెలిసిందే. ఇదిట్లా వుండగానే అటునుంచి రష్యా యిటునుంచి చైనా సమృద్ధిగా ధాన్యం పంపించారు. ఆ మాదిరిగానే యీ విమానాల విషయంలో కూడ తర్జన భర్జనలు జరిగి, ఒకరు పంపవచ్చునని, యింకొకరు కూడదని, చివరకు శాసన సభలదాకా వచ్చి, శాసనాల స్థితి దాటి కార్యరూపం పొందేటప్పటికి ఎంత కాలమవుతుందో. ఆహార పదార్థాలు అఖరుకు పడవ ఎక్కినట్లుగానే విమానాలు కూడ బయలుదేరుతవనుకోండి. ఈలోపల మేఘ సందేశంలో వర్ణించినట్లు ఆ మిడతంభొట్లు పట్టణాలు పల్లెలు దాటి యే పాకిస్థాన్ వైపో పోతే ఏమి చేయటం ? ఇంత దూరం వచ్చిన విమానాలను వూరికే పొమ్మంటే మరొకమాటు అవసరమైనపుడు మళ్లీ రావు. పోనీ మిడతలు వెళ్లిన చోటుకే వెళ్లి చంపిరమ్మని అంటా రనుకోండి. అంతా అయ్యేదాకా వూరుకుని చివరకు జఫ్రుల్లావారు నామిడతలను బతికించి నాకిస్తారా, చస్తారా అని కూర్చుంటే మళ్లీ భద్రతా మండలికి పరిగెత్తాలి. ఇదివరకు వున్న కాశ్మీరు సమస్యకు యీ మిడతల సమస్య ఒకటి తోడు అవుతుంది. ఇంకో ముఖ్య విషయం. ఆహార పదార్థాల నడిగిన అమెరికానే మిడతలను కూడ చంపి పెట్టమని ప్రార్థించ పడితే, రేపు అన్నింటికి మనమే ఎవరి వాళ్లే రేపు హిరణ్యాక్ష వరాలు అడుగుతారో, ఏ విశ్వాన్ల్లో యిరికిస్తారో. ఇవన్నీ యిట్లా వుండగా మొన్న బొంబాయి రాష్ట్ర ప్రభుత్వంవారు గుజరాతు మీద మళ్లీ మిడతలను వాలనీయకూడదని స్థిర సంకల్పం చేసుకున్నారు. ఇంక వాళ్లు యే దేశాలకు అర్జీలు పెట్టు కునేది చూడవలసి వుంటుంది. మొత్తం మీద మిడతం భొట్లు సామాన్యులుగా లేరు. అంతర్జాతీయ ప్రాముఖ్యత అందుకుంటున్నారు. మిడతంభొట్లుకు జై.

* * *

## ఏ రోటి దగ్గర ఆపాట :

ఏ రోటి దగ్గర ఆపాట పాడాలని, యే యెండ కా గొడుగు పట్టాలని లోకోక్తులు. అనుభవం గడించిన పెద్దలు వుండేలు దెబ్బంటే తెలియని పిల్లకాకులకు చేసిన నీతిబోధ యిది. ఇంతకన్నా మహత్తరమైనవి, గొప్పవి ఎన్ని వున్నా యీ ఈ రెండు లోకోక్తులకున్న ఆదరం మిగతా వాటికి కనిపించదు. ప్రధాన మంత్రి దగ్గరనుంచి చెప్పులు కుట్టే వాడి వరకు యేరోటి దగ్గర ఆపాట పాడగల పాటగాళ్లే. డాక్టర్ల సంఘంలో వుపన్యసిస్తూ "డాక్టర్లు లేనిదే దేశం బ్రతకట మెట్లా" గంటారు. ఇంజనీర్ల దగ్గర "దేశానికి చేయూత మీరే" నంటారు. కూలీల సంఘంలో "ఓ కూలి తమ్ముడా, నీచేతిలో కొడవలి వున్నంత కాలం దేశం సుభిక్షం, బిర్లాలు, తాతాలు నీకు దాసానుదాసులు," అంటారు. మళ్లీ యే బిర్లాకో స్వాగతమిస్తూ "ఓ విశ్వంభరా నీవంటి అపర కుబేరులు డబ్బు వెదజల్లుతు మిల్లులు ఫ్యాక్టరీలు పెట్టబట్టి కాని, లేకపోతే కోటానుకోట్ల భారత ప్రజలు యేమైపోతారు" అని అనాలి.

స్తోత్రపాఠం వల్లిస్తూ యే రోటిదగ్గర ఆపాట పాడటం యీనాటి ప్రజలకు అలవాటు అయిపోయింది. పంపుల్లో నీళ్లు రావాలన్నా, రోడ్డుమీద లైట్లు రావాలన్నా, రేషను షాపులో బియ్యం కావాలన్నా, అబ్బాయికి అయిదో క్లాసుకు బళ్లో సీటు కావాలన్నా, అన్నింటికి యీపాటలు



# రాజకీయాలు

* గోళ్లమూడి రామచంద్రరావు *

మే, జూన్ నెలలలో మన దేశంలోనూ, విదేశాల్లోనూ జరిగిన కొన్ని ప్రధాన సంఘటనలను ఇప్పుడు మనం పరిశీలిద్దాము. వాటిలో మన దేశానికీ, ప్రపంచం అంతటికీ కూడా సంబంధించిన సమస్య కాశ్మీర్. అది అఫ్ఘనిస్థాన్, రష్యా, టిబెట్, ఇండియా, పాకిస్థాన్ అన్నిటికీ సరిహద్దు సీమగా ఉన్నందువల్ల కాశ్మీర్ సమస్యకు ఈనాడు ఇంత ప్రాధాన్యత వచ్చింది.

ఈ సమస్యకు బ్రిటిష్‌వారు అంకురార్పణ చేశారు. భారత దేశాన్ని ఇండియా, పాకిస్థాన్‌లుగా విభజించినప్పుడు, సంస్థానాలు ఇష్టమయితే స్వతంత్రంగా ఉండవచ్చునని అనుమతించారు. దానితో యథేచ్ఛగా వ్యవహరించ వచ్చుననుకున్నాడు కాశ్మీర్ మహారాజు. కాని పాకిస్థాన్ దానిని మింగి వేయాలనుకుని కొండజాతి వాళ్లను ఉసికొల్పింది. వాళ్ల చేతుల్లో శ్రీనగర్‌కే ముప్పు రావడంతో మహారాజుకి సంగతులు తెలిసివచ్చి, ఇండియాలో చేరుతున్నాననీ, తనని రక్షించవలసినదనీ విజ్ఞప్తిచేశాడు. బ్రిటిష్ ప్రభుత్వ ప్రతినిధి అయిన లార్డ్ మౌంట్ బాటన్ ఇండియా గవర్నర్ జనరల్ హోదాలో ఆ విజ్ఞప్తిని ఆమోదించాడు.

భారత దేశం తన సేనలను తక్షణం ఉరికించి శత్రువులను అధికప్రాంతంలోనుంచి తరమగొట్టిన తరువాత, పాకిస్థాన్ చర్యను గురించి ఐక్యరాజ్య సమితికి ఫిర్యాదు చేసింది (1947 డిసెంబర్). అప్పటినుంచి ఇప్పటివరకు, పాకిస్థాన్ తన సేనలు యుద్ధం చేస్తున్నవని అంగీకరించినప్పటికీ, న్యాయం జరగలేదు సరికదా, ఫిర్యాదీ ముద్దాయిగా మారి పోవటం జరిగింది. అమెరికా, బ్రిటన్‌ల కీలుబొమ్మగా ఉన్న ఐక్యరాజ్యసమితి కాశ్మీర్‌లో పాక్ సేనల ఉనికిని సహించటమేగాక, కాశ్మీర్ ప్రభుత్వం రాజ్యాంగ పరిషత్తును ఏర్పాటు చేసుకుంటుంటే అడ్డుపడ్డది. సమితికి చెందిన ఒక మధ్యవర్తి కాశ్మీర్ విభజనను కూడా సూచించారు. దీంతో ప్రాణం విసికి భారత ప్రధాని నెహ్రూ జూన్ 11 వ తేదీన విలేఖరులతో మాట్లాడుతూ, అమెరికా, బ్రిటన్‌లు పాకిస్థాన్‌ను పురెక్కించి ఆడిస్తున్నవని కుండ పగల కొట్టినట్లు ఉన్నసంగతి చెప్పేశారు.

అమెరికా, బ్రిటన్‌ల వైఖరికి (1) ఇండియా తమకు తందాన పాడకుండా తటస్థంగా ఉండటం (2) తమ సైనిక, ఆర్థిక వ్యూహాలకు పాకిస్థానే ఎక్కువ అనుకూలంగా ఉండటం (3) కాశ్మీర్ పాకిస్థాన్‌లో చేరితే కమ్యూనిస్టు చైనా, రష్యాల మీద బాంబులు కురిపించే విమానాశ్రయాలు ఏర్పాటు చేసుకో గలగటం—అనే అంశాలు కారణమని చెప్ప వచ్చును. సమితి పంపుతున్న సరికొత్త మధ్యవర్తి గ్రాహంతో తాము సహకరించేది లేదని ఇండియా, కాశ్మీర్‌లు స్పష్టం చేసినవి.

* * *

కొరియా పోరాటం ఆగిపోతుందేమోనన్న ఆశను సమితిలో సోవియట్ ప్రతినిధి మళ్లీ కలిగించాడు. ఉత్తర, దక్షిణ కొరియాలకు మొదటి సరిహద్దయిన 38వ అక్షాంశ రేఖ దగ్గర ఉభయపక్షాల సేనానులూ యుద్ధ విరమణకు పూనుకుని, ఆ తరవాత శాంతిని సాధించవచ్చునని ఆయన సూచించాడు. ఈ సూచనలకు కమ్యూనిస్టు చైనా సుముఖత చూపింది. మాస్కోలో భారత రాయబారి డా॥ రాధా

మణిపూర్ మొదలైన చోట్ల పరిస్థితులు అదుపులోకి వచ్చినప్పుడు, కమ్యూనిస్టులు కూడా ప్రతిఘటనోద్యమాలను విరమించి ఎన్నికల్లో పాల్గొనటానికి సిద్ధపడినప్పుడు, మత వర్గసంస్థ అని చెప్పబడ్డ హిందూ మహాసభ వివిధ మతస్థులనూ చేర్చుకొనటానికి అంగీకరించినప్పుడు, రాష్ట్రీయ స్వయం సేవక సంఘం, అకాలీలు లొంగివచ్చిన తరవాత, 'శాంతి రక్షణ' పేరుతో వాక్ స్వాతంత్ర్యాన్నీ, అభిప్రాయ ప్రకటనా స్వాతంత్ర్యాన్నీ నిరోధించే శాసనాలను ఎన్నిటినయినా చేసే అవకాశాన్ని ఇవ్వటం ఎందుకో అర్థం కావటం లేదు. ఈ రోజుల్లో ఏ ఒక్క దేశమూ మడి కట్టుకుని కూర్చోలేదు. అటువంటప్పుడు వివిధ దేశాల సంగతులనూ, సవివరంగా చెప్పే అవకాశం కూడా పత్రికలకు లేకుండా పోతున్నది. మడికట్టుకుని కూర్చునే జాతి అధోగతిపాలేనని అదును చిక్కినప్పుడల్లా బల్లగుద్ది చెప్పే పండిత నెహ్రూ దీనిని సమర్థించటం చాలా దారుణం.

వెనకపడ్డ వ్యక్తులకు సదుపాయాలు కలిగించటం భావ్యమే కాని ముందున్న వర్గాలని చెప్పి, వర్గాలకువర్గాలనే అన్యాయం చేయటం భావ్యంకాదు. ఉదాహరణకు బ్రాహ్మణుల విషయమే తీసుకోండి. ముందున్నదని చెప్పబడే ఈ తెగలో ఎంతోమంది బడిపంతుళ్లు, బీదగుమాస్తాలు, హోటల్ సర్వర్లు, వంటవాళ్లు, అర్చకులు, ఉత్తర దేశంలో అయితే దర్వాన్లు కూడా, ఉన్నారు. బ్రాహ్మణులయి పుట్టినందువల్ల వీరందరికీ సున్నా చుట్టటం అన్యాయమని సహృదయులంతా అంగీకరిస్తారు. కాబట్టి ఈ రెండు సవరణలూ అధికార దుర్వినియోగానికి ఎంతో అవకాశం ఇస్తున్నవి.

జమీందారీల రద్దు ప్రస్తుత ప్రపంచ పరిస్థితుల్లో తప్పని సరికనుక దానిని పార్లమెంటు సభ్యుల్లో కూడా ఎవ్వరూ అట్టే ఆక్షేపించలేదు. కాని ఈ సవరణ అక్రమమని బీహార్, ఉత్తర ప్రదేశ జమీందార్లు సుప్రీంకోర్టులో దావావేశారు. అది జూలైలో విచారించబడుతుంది. పత్రికా స్వాతంత్ర్య నిరోధనకు నిరసనగా పత్రికలు జూలై 12 న హర్తాళ్ చేస్తున్నవి.

* * *

దేశంలో అంతటా కాంగ్రెసుపట్ల అసంతృప్తి ప్రబలిపోతున్నది. అనేక కారణాలవల్ల చాలామంది సంస్థనువదిలి వెడుతున్నారు. వీరిలో ప్రకాశంగార్లు, కృపలానీ ప్రభృతులు కలిసి జూన్ 16 న పాట్నాలో కిసాన్‌మజ్దూర్ ప్రజా పార్టీ అంటూ పెట్టారు. కాంగ్రెసులో నీతిలేదు కనుక దానిని ఎన్నికల్లో ఎదిరిస్తామంటున్నారు. కాని ఎవరయితే సక్రమమయిన కార్యక్రమాన్ని సూచించి ప్రజల విశ్వాసం సంపాదిస్తారో వారికే భవిష్యత్తు ఉన్నదని వారు గమనించాలి.

* * *

నానాదేశాల పుణ్యమా అని అన్ని రాష్ట్రాల్లోనూ జూలై నుంచి 12 ఔన్సుల రేషన్ ముట్టబోతున్నది. కాని ఆహార సప్లయిలో కూడా విదేశాలు అనుసరిస్తున్న రాజకీయాలు చాలాదారుణ మనిపిస్తున్నవి. ఆహారం సప్లయి చేయటమే కాక అది చౌకగా ప్రజలకు అందించటం చాలా అవసరం.

* * *

తూర్పు పంజాబ్‌లో శాసన సభ కాంగ్రెసు పార్టీకలతలు మితిమీరి పోవటాన రిపబ్లిక్ అధ్యక్షుడు జూన్ 20 న అక్కడ గవర్నర్ అధికారాన్ని నెలకొల్పవలసి వచ్చినది.

జూన్ 26వ తేదీన అంతర్జాతీయ కార్మిక సంస్థ స్త్రీలకు పురుషులతో పాటు సమానవేతనాలు ఉండాలన్న ప్రతిపాదనకు సూత్ర ప్రాయంగా అంగీకరించింది. ఇది అమలు జరగటం ఎప్పుడో ఊహించలేము కాని భారత ప్రభుత్వ ప్రతినిధి సూత్ర ప్రాయంగా కూడా దీనిని ఆమోదించక, తటస్థంగా ఉండటం మాత్రం శోచనీయమే.







ఉత్పత్తి శాఖలో తయారైన చీరెలు, పంచలు, తువాళ్లు, దుప్పట్లు మొదలైనవి, యింకా లేసులు, ఇతర ఎంబ్రాయిడరీ చేసిన దుస్తులు

వహించిన మదరాసు ప్రసూతి వైద్యాలయమే, ఉమాదేవి వైద్యాలయం పాదాలకడ కూర్చుని పాఠాలు నేర్చుకోవా లంటారు.

మహోత్తమమైన ఆమె వైద్యంలో రంగరింపబడిన, ఆమె గంభీర విషాదము ఒక దివ్యౌషధంలా అయి పోయింది.

ఆ విషాదము కరుణాస్వరూపమై వెల్లివిరిసేది.

ఆ విషాదము నిశిత పవిత్ర శస్త్రమై ఆమె హస్తాల నలంకరించేది.

ఆ విషాదము విద్యుచ్ఛక్తి సమాపాదిత శక్తివలె ఆమె దేహం అల్లా ప్రసరించేది.

ఆమె కోపమెరుగదు. విషాదము రంగరింపబడిన మంద హాసము మాత్రము ఎరుగును. ఆమె స్నేహములో చనువు లేదు. ఆమె దయలో చేలతనము లేదు. ఆమె వైద్యంలో అలసత్వములేదు.

వైద్యం తప్ప ఇంకో పని ఎరుగని అమెకు ఒక్క వీణ ఉన్నది. చెన్నపట్నం వైద్యకళాశాలలో చదువుకునే టప్పుడే ఏలాగో అలాగు, ఇంతో అంతో తీరికచేసుకుని హాస్టలునుంచి బయలుదేరివెళ్లి ఒక ప్రసిద్ధ గాయకురాలివద్ద పాఠాలు నేర్చుకుంటూ ఉండేది.

ఆమె వైద్యాత్మలో లీనమై, గాంధర్వాత్మ ఉండడం చేత, వైద్యవిద్య ఎంత ఉత్తమంగా వచ్చిందో గానకళా అంత ఉత్తమంగానే వచ్చింది. అందువల్ల పనిఅంతా అయి, తీరికవచ్చిన రాత్రిసమయంలో, త్యాగరాజకృతులతోపాటు తాను రచియించుకున్న విషాద గీతికలుకూడా ఆలాపించు కుంటూ ఉంటుంది.

3

ఆరోజు వీణపై!

"బ్రతుకునకు దారి ఒక
పలుకు చూపగచాలు
మతి మార్చుటకు ఒక్క
మాట వజ్రమును పోలు
ఏ వాడనో పుట్టి
ఏ జాడనో పెరిగి
ఒక ఏటి వరదలో
సుకముతోపయనించు
ఈనావ సంద్రాన
ఏ గతిని పోవునో"

అని పాడుకుంటున్న సమయంలో అనసూయాబాయి తన స్నేహితురాలిని చూడటానికి వచ్చింది.

అనూబహెన్ రాగానే ఉమ వీణ పక్కగా పెట్టివేసింది. అనసూయాబాయి ఉమ దగ్గరగా కూర్చుండి, ఉమ బుజం చుట్టూ చేయివేసి, దగ్గరగా తీసుకొని "ఉమాబహెన్! నువ్వు మీ భాషలో పాడుకొంటున్న ఆ పాటంతా అర్థం కాలేదుకాని, అందులో భావంమాత్రం పూర్తిగా గోచ రించింది. నీ జీవితం ఇంత విషాదపూర్ణం కావడానికి కారణం ఏదో గట్టిది ఉన్నది. ఆ కారణం ఛాయలా నిన్ను వీడటంలేదు. అది నేను తెలుసుకోవచ్చునా చెల్లీ!" అని అనునయిస్తూ, ఉమ ముఖం వైపు కరుణార్ద్రమైన కన్నులతో చూసింది.

"అనూబహెన్! ఒకదారిని ప్రవహించవలసిన నది ఒక కొండ అడ్డం రావడంవల్ల వేరోదారిని ప్రవహించిపోతుంది."

"అలా ప్రవహించటమే భగవంతుని ఇచ్ఛ ఏమో! ఆ దారివల్లనే లోకానికి ఉత్తమసేవ లభింప భగవంతుని సంకల్పమేమో!"

"కావచ్చును అక్కా! అయినా ఈ అనంత విశ్వ జీవితంలో ఒకప్రాణి కాకపోతే, ఇంకోప్రాణి ఆ సేవ చేయగలదు. ఆ ప్రాణికి అనంత పథం అవుతుందిగదా! అలాంటి జీవితం తారుమారయినప్పుడు, సేవ అనే భావమూ, జగత్కల్యాణార్థమూ, అర్థములేనివే అవుతాయి కదా?"

"దాన్నే శుష్కవేదాంతం అంటారు చెల్లీ! జరిగినది శుభం జరుగబోయేది శుభం చేసుకొనడమే మన తపస్సు కావాలి!"

"వెనకటివి మన శుభం కోసం అనుకునే శక్తి లేదు కదా నాకు!"



# మానసి

* * *

## నాటిక

* * *

* సులోచన *

## పాత్రలు

| | | |
|---|---|---|
| మానసి | — | మేవాడు రాజకన్య |
| రాణా | — | మహారాజు |
| రుక్మిణి | — | మహారాణి |
| అజయుడు | — | సైన్యాధ్యక్షుని కుమారుడు |
| కల్యాణి | — | సైన్యాధ్యక్షుని కూతురు |
| మహాబద్ | — | కల్యాణి భర్త |

(ప్రాభాత సమయం. మేవాడు రాజకన్య, మానసి - ప్రాకృతిక శోభను తిలకించటానికి ఉదయసాగర నదీ తీరానికి వస్తుంది)

(వేణుగానం—క్రమక్రమేణా తగ్గిపోతుంది)

మానసి : కరకరలాడుతూ ఉదయించే సూర్యుడు, ప్రశాంతంగా ప్రవహించే నది, సూర్యుని అరుణ కిరణాలకు తళతళ మెరిసే అలలు, అనంత నీలాకాశము—ఆహా, ప్రకృతికి మించిన సౌందర్యం మరొకటి వుంటుందా? వినూత్న వేషాలతో, ఘడియ ఘడియకీ మార్చు విలాసాలతో జీవితాన్ని సార్థక పర్చుకొనే కంటె, అనంతాకాశంలోని క్షణక్షణం మారే మనోహరమైన ప్రకృతిని చూసి, భూమిమీద పుట్టి పెరిగే సౌందర్యాన్ని విస్తృతంచేసే పచ్చనిచెట్లను చూసి, కలస్వనాలతో, తీయని భావనలతో మధురంగా పాడే పక్షులను చూసి మురిసి పోగూడదా? జీవితాన్ని ధన్యం చేసుకోగూడదా? అసలు మానవజన్మ, ప్రకృతి పరవశత్వంలో లీనం కావడానికేమో?

అజయ : మానసీ!

మా : అజయా!—రా, ప్రకృతి సౌందర్యాన్ని సందర్శించి అమరానందాన్ని అనుభవిద్దాం. అదుగో, కుంకుమ పూవులాగ, ఎర్రగా నదిలోంచి జనించే భాస్కరుణ్ణి చూడు, ఎంత అందంగా వున్నాడో—అతని దివ్య కాంతులకు పచ్చని చెట్లు, బంగారు వర్ణంగల ఇసుక ఎలా మెరుస్తున్నవో గమనించు.

అ : అవును—ప్రకృతిశోభని ఆరాధించటంలో నీకు మించిన రాజకన్యలుగాని, మరొకరుగాని లేరని పల్లెలలో, పట్టణాలలో తరుచూ వింటూనే వుంటాను. నీ జీవితం ధన్యం మానసీ!

మా : జీవితంలో వ్యక్తి సాధించేది, సాధించతగ్గది—ఉండే పరమార్థానికి దూరమై, వ్యర్థమైన తగవులతో,

# మీరు మెక్లీన్‌తో నేడు పళ్లు తోముకున్నారా?



నేను ఎన్నో టూత్ పేస్టులు వాడినాను. కాని, మెక్లీన్స్ అంత మంచిది ఒకటైనా నాకు కనిపించలేదు. నా మిత్రులందరూ నా దంత శోభనే ప్రశంసిస్తారు.

నోటిని పరిమళభరిత మొనర్చి
దుర్వాసనను
నివారిస్తుంది

ఆమ్లాలను విరిచివేసి
మీ ఇగుళ్లను
సంరక్షిస్తుంది

పళ్లమీది మరకలను తొలగించి
వాటిని ధవళతర
మొనర్చుతుంది

మీరు మెక్లీన్స్ పెరాక్సైడ్ టూత్ పేస్టును వాడినప్పుడు మీ దంతాలకు, ఇగుళ్లకు అధిక రక్షణ నొసగడంతో పాటు ముఖాన్ని పరిమళ భరిత మొనర్చుకోవచ్చు. అందుకే కోట్ల కొలది ప్రజలు మెక్లీన్స్ తప్ప మరి దేనినీ వాడరు.

నేడే మెక్లీన్స్
కొనండి!



టాలమ్మే స్త్రీ : (ప్రవేశించి) పటాలండీ అమ్మా, పటాలు.
(పటాలు క్రింద పెట్టును)

ఇదుగో ఈ పటం బాబరుదండి, ఈ పటం అతని కొడుకు హుమయూన్ దండి, ఈ పటం జహాంగీరు నండి... ఈ పటం మహబద్ ఖానుడి దండి, ఈ పటం...

మా : (మహబద్ ఖానుడి పటం తీసుకొని) కల్యాణీ! ఈ పటం వంక చూడు. ఆ మొఖంలో ఎంత సౌందర్యం ఉట్టి పడుతుందో. ఆ విశాలమైన ఫాలము చూడు... అంత నిగ్గెందుకు. నీ భర్తేగదా! హైందవ మతము నుండి మహ్మదీయ మతంలోకి వెళ్ళాడనా నీద్వేషం? కల్యాణీ! పొరపాటు. భర్త ఎలాటి వాడైనా, మంచి వాడైనా, చెడ్డ వాడైనా...చెడ్డ వాడైతే నీ తెలివితో మంచి తోవలోకి తెచ్చుకోవాలి. ఏమతంలోకి వెళ్ళినా ప్రేమించాల్సిందే.

క : మాతండ్రి ద్వేషించటానికి హేతువు?

మా : గోవింద సింహులా? వారికి మహమ్మదీయులన్న వారి ఆచారములన్న గిట్టదు. మీ తండ్రిగారితో నిమిత్తం దేనికి? కల్యాణీ, నీభర్తను ప్రేమించటానికి భయ పడుతున్నావా?

క : లేదు మానసీ!

మా : అయితే ఎందుకు ప్రేమించవు. ప్రేమకు కుల గోత్రాలు, మర్యాదామర్యాదలు, కలిమిలేములు అడ్డు రావు. హృదయమే—నిర్మలమైన హృదయమే సాక్షి. ప్రేమ ప్రేమికుల హృదయాలు రెండూ మధుర భావ నలలో విలీనమైనపుడే నిజమైన ప్రేమ ఉద్భవిస్తుంది. అప్పుడే రెండు జీవితాలలో భవిష్యత్తు ఏర్పడి, ధన్యమౌతాయి.

క : మానసీ! నాలో దివ్యజ్యోతిని వెలిగించావు. అంధ కార భూయిష్ఠమైన నా జీవిత వాహినికి ఒక త్రోవ చూపావు. మహమ్మదీయ మతాన్ని స్వీకరించారనే కారణంచేత వారి యెడల వైముఖ్యాన్ని ప్రదర్శించి పూరుకొన్నాను. ఇప్పుడు తగిన జ్ఞానోపదేశం చేశావు—కృతజ్ఞత ఎలా తెలుపాలో నాకర్థం కావడం లేదు మానసీ!

మా : (నవ్వుతూ) కల్యాణీ! వెళుతున్నాను.
(మానసి వెళ్లును)

క : నిజంగా మానసి అన్నట్టు, ప్రేమతో భర్తను, అతని సమర్థతాసమర్థలతో నిమిత్తం లేకుండా ప్రేమించడం నావిధి. జగత్తులో ప్రేమను మించిన పదార్థం మరొకటి వుంటుందా? నిజమైన ప్రేమకు దాసులై జీవిత శకటాన్ని నడిపే ప్రేమికుల జీవితం ఎంత తేనె సోనగా నడుస్తుంది.

* * *

(ఉషఃకాలము, అంతఃపురాన మానసి ఏకాంతంగా విహరిస్తూ వుంటుంది)

(వేణుగానం...అజయుడు రాగానే క్రమక్రమంగా తగ్గిపోతుంది)

మా : అజయా! ఈ మధ్య బొత్తిగా రావడం మానేశావే? కారణాలు తెల్సుకోవచ్చునా?

అ : కారణాలేమున్నాయ్, ఏవో పనులు.

మా : అజయా! మానవుడెటువంటివాడైనదీ, ఎంత అశక్తుడైనదీ మొన్న జరిగిన దేవారు యుద్ధంలో నాకు సుస్పష్టంగా అర్థమైంది సుమా! వత్సరాల కొలదీ కండ లుగా పెంచిన శరీరాన్ని కత్తి వ్రేటుకు ఆపుకోలేని అసమర్థుడై యున్నాడు. తన విధేమిటో తను జీవితంలో సాధించే ఉత్కృష్టమైన పదార్థమేమిటో, తెల్సుకో లేక—తోటి మానవుణ్ని ద్వేషించి, కలహాలు పెంచు కొని, చివరకు తన ప్రాణాన్నే కోల్పోతున్నాడు.

అ : (ఏదో, అందని దేనికో చూస్తున్నాడు)

మా : దేనికోసం. తదేక ధ్యానంతో చూస్తున్నావు.

అ : మానసీ! ఆనాడు, ఆ వీరక్షేత్రంలో చూసిన స్నిగ్ధ జ్యోతియే నీ ముఖాన నేడు గోచర మౌతున్నది—నేడే కాదు, అహర్నిశలూ నీ ఆనందమైన ముఖాన ఆ విశ్వ మానవ రోచిస్సు ఉండే ఉంటుంది. కాని, నేను తెల్సు

ప్రక్కనున్న పరిజనులు : తల్లీ! చనిపోయిన వాని గురించి విలపించటం వ్యర్థం. అజయుడు సామాన్యుడు కాడు. క్షత్రియ పుంగవుడు. లోకైక వీరుడు.

ఇంకొకడు : అతని కర్తవ్యం నెరవేర్చు కొన్నాడమ్మా, దుఃఖించడం అవివేకం తల్లీ.

మరొకడు : హింసాత్మకమైన మహమ్మదీయుల చర్యల్ని ఖండించి, ఆచర్యలకు గురయ్యే అనాథుల్ని, ఆర్తుల్ని రక్షించేందుకు యుద్ధం చేసి, వీరస్వర్గ మలంకరించిన అజేయు డమ్మా అజయుడు.

మా : (పిచ్చెత్తినట్లుగా) ఈ మాటలు నాకు రుచించవు. నా అజయుడు జీవితాన్ని చాలించి, దుఃఖాబ్ధినిముంచి వెళ్ళాడు. అయ్యో! అజయా! భీకరమైన తుపాకి, ప్రేమ పూరితమైన హృదయంలో దూసుకు పోయి నపుడు...ఆ ప్రేమంతా రక్తం రూపంలో బయటకు వచ్చిందా? ఈ దుఃఖోద్వేగం చల్లారటానికా మీ సూక్తులు.

క : ఓ మృత్యుదేవతా! నా సోదరుణ్ని...నా అజయుణ్ని తీసుకెళ్ళి...మమ్మల్ని శోకంలో ముంచి...ఏం ఆనంద పడతావు. లోకమారకమైన అగ్ని జ్వాలికలు ఈ మేవాడును...నా అజయుణ్ని భస్మం చేశాయి.

* * *

ప్రకటన : ఉదయ సాగర తీరాన రాణా, మహాబద్ లు.

రా : మహబద్, కత్తి పట్టుకో—ఈ అమరుణ్ని జయించి కదులు.

మ : మహారాజా! మేవాడుపై యుద్ధం చేయుట విరమించాను.

రా : ఏం! ఎందుకు! మాతృదేశం మీద మమత కలిగిందా? తుచ్ఛుడా—నీ మాతృదేవిని తురకల పాదాల క్రిందకు త్రోసావు. ఇది లజ్జాకరం కాదా? పాదుషాదగ్గర దాస్యజీవితం గడుపుతూ, బహూకృతులు పొందుతూ, మేవాడును విధ్వంసం చేస్తావా? మ్లేచ్ఛుడా—రా, భీకరమైన ఈ ఖడ్గానికి, పితృవ్యులు ప్రసాదించిన ఈ భావపునీత ఖడ్గానికి అవమానం జరగడం నేసహించలేను.

మ : మహారాజా! ఈ మహాబద్ ఖానుడు నీవన్న తుచ్ఛ మ్లేచ్ఛుడుకాడు.

రా : అనవసర ప్రసంగాలతో కాల విలంబనం చేయవద్దు. ఊఁ! కత్తి చేత పట్టు. నా వేడి రక్తాన్ని చూడాలని నీ మనస్సెంత ఆవేదన పడుతున్నదో—

మ : రాజా! నేను నీసోదరుణ్ని.

రా : సోదరుడవేవు. అహహా (వికటంగా నవ్వి) సోదరుడు చేయాల్సిన పనేనా నీవు చేసింది. భ్రాతృద్రోహి!

మ : (రోషంగా) మహారాజా : (కత్తి తీసిన శబ్దం) రా, యుద్ధానికి.

(కత్తి యుద్ధం కొంచం సేపు జరుగుతుంది. మానసి త్వరగా వస్తున్నట్టు నవ్వడి. కత్తి యుద్ధం జరుగుతూనే వుంటుంది)

మా : తండ్రీ! తండ్రీ! వద్దు. వద్దు.

రా : తొలుగు, తొలుగు మానసీ!

మా : తండ్రీ! యుద్ధం చేయకండి. శాంతం వహించండి. ఈ యుద్ధాల మూలానే సస్యశ్యామలమైన ఈ మేవాడు భూమి సర్వ నాశనమైంది. వీరుడు అజయుణ్ని పొట్ట బెట్టు కొంది. మీరు కూడా పశుత్వంతో యుద్ధం చేసి మేవాడు భూమిలో లీనం కావడం దేనికి? ఈ కోపాన్ని, ఒకరిమీద ఒకరికున్న మాత్సర్యాన్ని విడిచి, పశుత్వంలో వున్న మీరు మానవత్వంలోకి రండి. పాదుషాదగ్గర బహుమానాల్ని పొందుతూ, జీవితాన్ని గడుపుతూ తన విధిని నెరవేర్చు కొన్నారు. తండ్రీ! ఇంకా వారిపై ఈ క్రోధమెందుకు. వారి కర్తవ్యాన్ని వారు నెరవేర్చుకోడంలో ద్రోహము ఏముంది? ఇక నైనా సోదరులుగా వుండండి తండ్రీ, అజయుని మనశ్శాంతికి ప్రార్థన జరుపుదాం రండి.

(ఇద్దరూ కత్తులను క్రింద పడవేయుదురు)

— సమాప్తం —



జరిగిన కథ

# అడవిపిల్ల పెళ్లి

గుంటుపల్లి రాధాకృష్ణమూర్తి

"లాంగ్ లివ్ అవర్ క్రిస్టియానిటీ!" కొన్ని గొంతులు మిన్నుముట్టినై.

"ఇస్లాం మజహబ్ జిందాబాద్!" కొన్ని కంఠ స్వరాలు ఆకాశంలో ప్రతిధ్వనించినై.

ఒక చోట ఏదో పెద్ద గల్లంతూ, ఆకాశం చిల్లులు పడేట్లు రణగణ ధ్వనీ, రుధిరపిపాసతో ధగధగా మెరిసే కత్తుల సందడీ.

జెండాలు ఎగురుతున్నాయి; స్లోగన్లు వినవస్తున్నాయ్; రెండు వేలు దేశాలూ, రెండు వేలు జాతులూ, రెండు వేలు మతాలూ.

ప్రపంచానికి అంతిమ ఘడియలు వచ్చాయా అన్నట్టు వొణికి పోయాడు మాన్సూర్, హైకోర్టు ఆవరణలో ఒక మూల కూచుని.

"ఇస్లాం మతం వర్ధిల్లాలి!" మరో భీకర నాదం.

"క్రైస్తవ మతం వ్యాపించాలి!" మరో ఘోరా రాటం.

మళ్లా పెద్ద గల్లంతూ. మళ్లా ఆకాశం చిల్లులు పడేట్టు రణగణధ్వనీ. మళ్లా రుధిరపిపాసతో ధగధగా మెరిసే కత్తుల సందడీ.

మాన్సూర్ గజగజా వొణికి పోయాడు, ఈ హడా వుడికి కాదు, తన చేతినుంచీ ఏదో పెన్నిధి జారిపోతూన్నట్టు.

మాన్సూర్ తలమీద గొడుగులా నుంచున్న చెట్టూ గజగజా వొణికి పోయింది. సింగపూరు హైకోర్టూ భూకంపంలోలా వొణికింది.

మాన్సూర్ భ్రుకుటిత ఫాల భాగంలో అపరిమితమైన ఆదుర్దా వేళ్లాడింది. అతను చింతా భారంతో క్రుంగి పోయాడు, వయో భారంతోలాగా.

అతని కళ్లకి మత కలహాల కోలాహలం కనిపించలేదు. అతని మనసు నీ జాతి వైషమ్యాల విషమ పరిణామం వేధించ లేదు. అతనికి కనిపించిందల్లా ఆ సుందరి విగ్రహం. అతణ్ణి వేధించిందల్లా ఆ ఎడబాసే ప్రేయసి జ్ఞాపకాలు.

"బెర్తా!"

అప్రయత్నంగా ఆ పేరు అతని పెదాలనుంచి వెలు వడింది. అతని కళ్లల్లో నీళ్లు గిర్రున తిరిగినై.

బెర్తా సురుచిర సుందరమూర్తిని అతను తొలుదొల్త తిలకించింది దబ్బరుతోట చెట్ల నీడల్లో. బెర్తా అమాయ కంగా తన కుక్కతో ఆడుగాడుతూ వొచ్చి, ఆ రెండు చెట్ల సందునా విశ్రమించింది. మాన్సూర్ అప్పుడు విద్యా ర్థుల్ని స్కౌట్ కాంపుకు తీసుకు వెళ్లాడు. పిల్లల్ని కులా సాగా ఆడుకోటానికి వొదిలి అతను ఆ చెట్టు కిందనే కూచున్నాడు. కానీ, అతను బెర్తాను అప్పుడు చూడ లేదు.

కాస్సేపటికి కుక్క మెల్లిగా మొరిగింది. మాన్సూర్ పడుకున్న వాడల్లాలేచి ఇటూ అటూ చూశాడు. పక్కన కూచున్నది ఒక అమ్మాయి! అతను విస్మయంతో ఆ పిల్లను చూశాడు. పన్నెండేళ్ల పసి ముఖంలో యవ్వనచాయలు అప్పుడప్పుడే తల నూపుతున్నాయి. అతను ఆ పిల్లవైపు చూసేసరికి, ఆమె పెదాల మీద ఒక చిరునవ్వు తాండ వించింది. మాన్సూర్ మనోదర్పణంలో ఆ మందహాసం ప్రతి ఫలించింది. హైకోర్టు ప్రాంగణంలో కూచున్న అతనికి ఏడుపులో నవ్వూ నవ్వులో ఏడుపూ కలిగినై.

మళ్లీ ఆ జ్ఞాపకాలకు అంతరాయంగా బహిర్ప్రపంచపు మత విద్వేషాల రభస వినిపించి, అతణ్ణి కలవర పెట్టింది. ఈ భయంకర కంఠాలను తోసుకుంటూ బెర్తా మృదు మధురస్వరం అతని మనసుకు సోకింది.

రెండిళ్లకూ మధ్య ఉండే కిటికీలో కూచుని బెర్తా వలపు పాటలేవో పాడేది. అతనూ వాటిని వింటూ ఆ గదిలోనే తారట్లాడేవాడు.

# అడవిపిల్ల పెళ్లి

నానాటికీ బెర్తా అంటే మాన్సూరుకూ, మాన్సూరంటే బెర్తాకూ అనురాగం ఎక్కువ కాజొచ్చింది. బెర్తా అలా రాత్రికీ చుక్కల వెనకాల కూచుని, మాన్సూరు చుట్టూ మధుర భావాల సౌధాలు నిర్మించి, ఊహాజగతిలో ఉఱ్ఱూతలూగేది.

కాలం ఎవ్వరికోసమూ ఎప్పుడూ ఎక్కడా ఆగదు. కాలం అలా మహత్తరంగా, మహోజ్జ్వలంగా వెళ్లిపోతూంది, తన ప్రభావాన్ని చాటుతూ.

ఆ కాలదేవత గమనంలోనే వాళ్లిద్దరూ ఆలుమగలు అయారు. మాన్సూరూ, బెర్తా మహమ్మదీయ శాస్త్రం ప్రకారం వివాహం చేసుకున్నారనీ దేశదేశాలా వార్తా పత్రికా మూలకంగా ప్రాకిపోయింది.

క్రైస్తవమతం వాళ్లను ధిక్కరించింది. పాశ్చాత్య దేశాలు గొణిగినై. గవర్న మెంటులుసైతం క్రైస్తవ మతానికి జరిగిన అపచారానికి బొమ ముడిపాటుతో చురచురా చూసినై.

సింగపూరు హైకోర్టులో బెర్తా తల్లిదండ్రులు కేసు వేసారు. ఆ కేసువల్లనే మతకలహాలు కొన్ని చెలరేగినై.

బయటి నుంచీ ఆ రణగణధ్వని వినిపిస్తూనే ఉన్నది. అతను శిలా ప్రతిమలా ఆ మహావృక్షానికి ఆనుకుని చతికిల పడ్డాడు.

అతని వీనులకు విందుగా వెనకాల్నుంచీ ఒక మధుర స్వరం వినిపించింది.

"మాన్సూర్!"

ఆఁ! ఎవరిదాగొంతు? నిజానికి, బెర్తా ఇలాంటి పరిస్థితుల్లో తనకోసం వొస్తుందా? ఒకవేళ బెర్తా వద్దా మనుకున్నా, వాళ్ల తల్లిదండ్రులు రానిస్తారా!

అయినా, అతను వెనక్కి తిరగలేదు. ఆ గొంతు మఱీ మధురంగా వొచ్చి పక్కగా నిలబడ్డది.

ఆమె బెర్తాయే!

"బెర్తా!" రుద్ధకంఠంలోంచీ పెకలించుకు వొచ్చింది ఆ పేరు.

అతనేమీ మాట్లాడ లేక పోయాడు. ఆ పడుచూ ఏమీ పలకలేదు. కానీ, అతని పక్కనే కూచుంది.

"అయితే, నువ్వు వెళ్లుతున్నావన్నమాట?" అతను చివ్వరికి అడిగాడు.

బెర్తా పలకలేదు.

"బెర్తా, నువ్వు మళ్లీ వస్తావుకదూ?" మాన్సూర్ కళ్లల్లో నీళ్లు నిండినై.

బెర్తా కళ్లల్లోనూ నీళ్లు తిరిగినై. కానీ, అప్రయత్నంగా ఒక చిఱునవ్వు పెదాలమీద మొలిచింది, చిఱు ఎండ పొడలో వాన చినుకుల్లాగా. అతను దాన్ని అంగీకార సూచకంగా గ్రహించాడు.

కాస్సేపటికి బెర్తా లేచి నుంచుంది.

"సెలవు" బెర్తా గద్గదస్వరంతో అన్నది.

మాన్సూర్ తరలివెళ్లే సౌందర్య దేవతను తిలకిస్తూ కూచున్నాడు. ఆ మూర్తిలో ఏదో కొండంత ఆశపెట్టు కున్నాడతను.

మళ్లీ బహిర్ప్రపంచపు కోలాహలం అతని చెవులు చిల్లులు పడేట్టు సోకింది.

సింగపూరు హైకోర్టు తీర్పు తీర్చింది. పదమూడేళ్ల పిల్లకు క్రైస్తవ మతాన్నుంచీ మహమ్మదీయ మతానికి తీసుకునే అధికారం లేదు. అందుకని మాన్సూర్, బెర్తాల వివాహం న్యాయశాస్త్ర బద్ధంకాదు, అని.

మాన్సూర్ కూచున్నవాడు కూచున్నట్టు స్తంభించి పోయాడు చూపుకు అతీతంకాని ఆమె సుందర విగ్రహం అంతర్ధానం అవుతూ అవుతూ అతని మనస్సీమలో ఆశను నాటి వెళ్లి పోయింది.

బెర్తా మళ్లీ పెద్దదైంతర్వాత తనదగ్గఱికే వొస్తుంది! తప్పకుండా!

మాన్సూర్ తలపు వలపులోకి దిగాడు.

కానీ అతనికి ప్రత్యక్షంగా కనిపించిందల్లా రోడ్డు మీదరభస.

మళ్లా పెద్ద గల్లంతూ. మళ్లా ఆకాశం చిల్లులు బడేట్టు రణగణ ధ్వనీ. మళ్లా రుధిరపిపాసతో ధగధగా మెఱిసే కత్తులసందడీ.

మాన్సూర్ చిఱునవ్వు నవ్వుకుని, చేతులు దులుపుకుంటూ లేచినుంచున్నాడు.



# దుర్బుద్ధి

మూలం: రవీంద్రనాథ్ ఠాకూర్ — అనువాదం: కె. వైకుంఠరావు

నేను ఇల్లు విడిచిపెట్టి పోవలసి వచ్చింది. ఎందుకు పోవలసి వచ్చిందో స్పష్టంగా చెప్పను కాని సూచా వాచా తెలియజేస్తాను.

నేను ఒక పల్లెటూరి నేటివ్ వైద్యుడను. పోలీసు స్టేషన్‌కు ఎదురుగుండానే మా ఇల్లు. నాకు పోలీస్ ఇన్‌స్పెక్టర్ గారితో ఎట్లాంటి గాఢమైత్రి ఉండేదో, యమ రాజ్యంతో కూడా అంత గాఢస్నేహం ఉండేది. కనుక మనుష్యులకు నరునివల్లా, నారాయణునివల్లా కలిగే బాధలను గురించి నేను బాగా ఎరుగుదును. బంగారు కంకణంలో తాపడంవల్ల పొడికి అందంవస్తుంది. పొడి తాపడంవల్ల బంగారం రాణిస్తుంది.

అదేవిధముగా నేను మధ్యవర్తిగా ఉండడంవల్ల ఇన్‌స్పెక్టర్‌కూ, ఇన్‌స్పెక్టర్ మధ్యవర్తిగా ఉండడంవల్ల నాకూ మంచి ధనలాభం కలుగుతుండేది.

ఇటువంటి ముఖ్యకారణాలవల్ల చతురుడైన ఇన్‌స్పెక్టర్ లలిత్ ఛాటర్జీతో నాకు గాఢ స్నేహము ఏర్పడ్డది. అతని ఇంట దిక్కులేని బంధువు ఒక అమ్మాయి ఉండేది. ఆ అమ్మాయిని పెళ్లాడమని కోరుతూ, నేను కూడా ఒక దిక్కుమాలిన వాడ నన్నట్టుగా రాత్రింబగళ్లు నన్ను బాధ పెట్టేవాడు. కాని తల్లిలేని నా కొమార్తె శశిని సవతి తల్లి చేతిలో పెట్టడానికి నా మనస్సు ఎంతకూ ఒప్పుకోకుండా ఉండెను.

ఏటేటా కొత్త పంచాంగాలతో పాటు ఎన్నో శుభ లగ్నాలు వృథాగా పోతున్నవి. ఎంతోమంది యోగ్యులు అయోగ్యులు పెళ్లికొడుకులయి నాకళ్ల ఎదుట పల్లకీలలో వర యాత్ర చేసుకు వెళుతున్నారు. కాని నాకు ప్రాప్తించింది పెళ్లి విందులు మాత్రమే. విందులారగించి ఉత్త చేతులతో ఇంటికి తిరిగి వచ్చేవాడను.

శశికి పన్నెండు వెళ్లి పదమూడో ఏడు రాబోతున్నది. తగిన కట్నం ఇచ్చినట్టైతే పిల్లకు మంచి వరుడుదొరికే ఆశ ఉన్నది. ఈ శుభ కార్యం చేయగలిగితే శీఘ్రంగా మరి ఒక శుభ కార్యంమాట గట్టిగా ఆలోచించ వచ్చునని అనుకొన్నాను.

అత్యంత అవసరమైనా ఈ రూపాయలు ఎక్కడ జత పెట్టగలనా అని ఆలోచిస్తున్నాను. ఆ సమయంలో తల సిపాడా నివాసి హరినాథ మజుమ్‌దార్ మా ఇంటికివచ్చి నా కాళ్ల మీదపడి ఏడవడం ప్రారంభించాడు. అతని విధవకూతురు రాత్రి హఠాత్తుగా చనిపోయిందట. అతని శత్రువులెవరో ఆమెపై గర్భపాత అపరాధము మోపుతూ ఇన్‌స్పెక్టర్ దగ్గరికి ఒక ఆకాశ రామన్న అర్జీ పంపారట. పోలీసు వాళ్లు అమ్మాయిని దహనం చేయనియ్యకుండా అడ్డు పెట్టబోతున్నారట.

కొమార్తె చనిపోయిన దుఃఖము ఉండనే ఉన్నది, పైగా ఈ ఘోర అపవాదం. హరినాథబాబు దుఃఖము భరించలేక వచ్చి నాకాళ్లు పట్టుకొన్నాడు. నేను వైద్యుడను కావడమే కాకుండా, ఇన్‌స్పెక్టర్ గారి స్నేహితుడను కూడా గనుక ఏలాగైనా తనను రక్షించమని ఏడ్చాడు.

లక్ష్మీదేవికి దయకలిగితే మనము కోరకపోయినా తనంతటతానే ఒకప్పుడు ముందుదారిని, ఒకప్పుడు వెనకదారిని మన ఇంట్లోకివచ్చి పడుతుంది. మజుమ్‌దారు మాట విని, తల ఆడిస్తూ "ఘోరమైన సంగతే!" అన్నాను. అంటూ రెండు మూడు ఘటనలను గురించి ఉదాహరణగా చెప్పాను—వృద్ధ హరినాథుడు పాపం, పసిపిల్లవాడిలాగు ఏడవడం మొదలు పెట్టాడు.

తరువాత జరిగినదంతా సవిస్తరంగా చెప్పడేము అనవసరం—అమ్మాయి అంత్యేష్టి సత్కారాలు ముగించే సరికి హరినాథబాబు దివాలా అయిపోయినాడు.

నా కొమార్తె శశి నాదగ్గిరికి వచ్చి బహు జాలి పడుతూ, "ఏమి నాన్నా, ఆ ముసలి ఆయన ఎందుకు అలాగు ఏడుస్తూ నీ కాళ్లు పట్టుకున్నాడు?" అని అడిగింది.

తున్నదేమో అని నాకు తోచేది. ఎంతో దుఃఖంతో, "ఆ ముసలాయన ఎందుకు అలాగు ఏడుస్తూ నీకాళ్లు పట్టు కున్నాడు నాన్నా?" అని శశి నన్ను అడుగుతున్నట్టు అనిపించేది.

కొన్నాళ్లు ఈ విధంగా గడిచాయి. వైద్యానికి వచ్చిన బీదవాళ్ల దగ్గిర డబ్బు పుచ్చుకోలేకపోయినాను. ఎక్కడ ఏ పిల్లకు జబ్బుచేసినా మా శశే బాధపడుతున్నదని నాకు అని పించేది.

వర్షకాలం వచ్చింది. గ్రామాలలోని వీధులూ, పొలాలూ అన్నీ జలమయమై పోయినవి. గ్రామం నుంచి గ్రామానికి, ఇంటినుంచి ఇంటికీ, నావలమీద వచ్చి పోతున్నారు. రాత్రి మొదలు పెట్టింది ధారావర్షము, తెల్లవారింది ఇప్పటికి ఇంకా వర్షమాగలేదు.

జమీందారుగారి ఇంటినుంచి రమ్మని కబురు వచ్చింది. ఆలస్యం అయిందని జమీందారుగారి పడవవాడు ఓర్చి ఉండలేక కోపగించి వెళ్లి పోబోతున్నాడు.

ఇంతకు పూర్వము ఇట్లాంటి వర్షంలో బయలు దేరవలసి వస్తే, నా గొడుగును వెదికిపెట్టి గొడుగు విప్పి దానికి కన్నా లున్నవేమో అని చూచి, గాలీ వర్షంలో జాగ్రత్తగా ఉండ మని చెప్పేవాళ్లు ఇంటిదగ్గిర ఒకరుండేవారు. కాని, ఇప్పుడు ఇల్లు శూన్యం. నా గొడుగు నేనే వెతుక్కొని బయలు దేరే వేళకు మా అమ్మాయి ముద్దుముఖము జ్ఞాపకంవచ్చి అలాగు కొంచెముసేపు చతికిల పడిపోయినాను. ఇతరుల కష్టాలనుగురించి ఎట్టి చింతాలేని నావంటివాని సుఖం కోసమని శశివంటి ప్రేమస్వభావముగల వాళ్లను భగవంతుడు ఎందు కేర్పాటు చేస్తుంటాడో అని ఆలోచిస్తున్నాను. ఇలాగు అనుకొంటూ అనుకొంటూ ఆ ఖాళీగదివేపు వెళ్లేసరికి భరించరాని దుఃఖం వచ్చింది. పెద్ద ఇంటి నౌకరు బయట నుంచి కోపంతో కేకలు వేస్తున్నాడు. ఆ మాటలు చెవిని పడి, దుఃఖము కట్టిపెట్టి తొందర తొందరగా బయటికి వచ్చేశాను.

పడవ ఎక్కబోతూ చూచాను. స్టేషన్ ఎదుట ఒక చిన్న నావకట్టి ఉన్నది. కాపువాడొకడు గోచీ పెట్టుకొని తడుస్తూ అందులో నిలబడి ఉన్నాడు. వాణ్ణి చూచి, 'ఏమిటిరా సమాచారం?' అని అడిగాను. ముందురాత్రి వాడి కూతురు పాము కరచి చచ్చిపోయింది. రిపోర్టు చేయాడానికని రూల్సుప్రకారం దూరగ్రామమునుంచి ఆమెను తీసుకువచ్చి స్టేషను ఎదుట కనిపెట్టుకొని ఉన్నాడు వాడు, పాపం, తన ఒంటి మీదనుండే గావంచాను తీసి చచ్చిపోయిన కూతురి ఒంటిమీద కప్పాడు. ఓర్చి ఉండ లేని జమీందారుగారి పడవవాడు నా పడవను నడుపుకు పోయినాడు.

ఒంటిఘంటకు నేను తిరిగి వచ్చేసరికి ఆ కాపువాడు చేతులు ముడుచుకొని ఒళ్లు ముద్దచేసుకొని తడుస్తూ ఆనావ మీదనే కూర్చొని ఉన్నాడు. ఇన్‌స్పెక్టర్‌గారి దర్శనం ఇంకా దొరకలేదు. నేను ఇంట్లోకి వెళ్లి వంటచేసి వాడికి కొంచెము అన్నం పంపాను—కానివాడు ఒక్క మెతుకు నోట్లో పెట్టుకోలేదు.

త్వరగా భోజనం చేసేసుకొని, తిరిగి జమీందారుగారి ఇంటికి వెళ్లవలసి ఉంటే వెళ్లి ఇంటికి తిరిగి వచ్చేసరికి సాయంకాలం అయింది. అప్పటికీ ఆ కాపు ఇంకా అలాగే మతిపోయిన వాడిలాగు కూర్చొని ఉన్నాడు. ఏమిటి సంగతి అని వాణ్ణి అడిగాను. జవాబు చెప్పక పిచ్చివాడి లాగు నావేపు చూస్తున్నాడు. ఆ నదీ, ఆపల్లె, ఆ స్టేషనూ, వర్షము బురదతో నిండి ఉన్న భూతలమూ మేఘాచ్ఛన్న మైన ఆకాశమూ—అన్నీ వాడికొక కల మాదిరి ఉన్నవి కాబోలు! అనేకసార్లు ప్రశ్నించంగా, కాన్‌స్టేబిల్ ఒకడు వచ్చాడనీ, వచ్చి రూపాయలేమైనా తెచ్చావా అని అడిగా డనీ, తాను నిరుపేద, తనదగ్గిర ఏమీలేదనీ ఆ కాపు చెప్పాడనీ తెలిసింది. వాడిదగ్గిర రూపాయలు లేవని తెలిసి కాన్‌స్టేబిల్, "అయితే కూచో ముండాకొడకా, అలాగు కూర్చొని ఉండు" అని అంటూ స్టేషన్‌లోకి వెళ్లి పోయాడట.

ఇటువంటి దృశ్యాలు ఎన్నో ఇంతకు పూర్వం చూచాను. కాని అప్పుడు నా మనస్సుకు ఎటువంటి కష్టము కలుగలేదు. ఇవ్వాళ ఎందు చేతనోగాని, అది చూచి సహించి ఊరుకో

# ఉత్తర రామ చరిత్రలో సీత

* జోస్యుల సూర్యనారాయణ మూర్తి *

ఉత్తర రామ చరితమందలి సీత యొక్క లోకోత్తర
చరిత్రచేయు భారతీయ నారియొక్క మహత్తరాదర్శసృష్టి
నభిలషించుటయే మానవత్వమునకు, గౌరవమునకు లక్ష్యము.
శ్రీ రామచంద్రునితోబాటు వనమునకు బోవుట, లంకా
యాతనలవంటి పట్టులలోని యాసీత పావనచరిత్ర, ఈ నాటి
నారియందూహింపనైనరానిది ; మహత్తమత్వపరాకాష్ఠను
పొంది శ్రీరామ భద్రుని ఉత్తర చరితమందు మఱియు
నలౌకికమైనది. ఆమె లోకలీలల గానము వాల్మీకి
కాళిదాసులు గూడ నొనర్చిరి కాని తత్ప్రత్యక్షదర్శనము
కవికుల గురువగు భవభూతి ముఖముననే కల్గెను. అతని
ఉత్తర రామచరిత నాటకములో భగవంతుని లోకలీలతో
బాటు చేయబడిన దంపతుల యాదర్శసృష్టి మనుసంతానపు
మనుజత్వమున కత్యావశ్యకము.

శ్రీరాముడు లంకా విజయముపొంది యయోధ్యకు
మరలివచ్చి యందఱి కోర్కులు దీర రాజసింహాసన భారము
వహించెను. లోకోత్తరానందముతో ప్రజలకు గాలము
గడువసాగినది. సీత గర్భవతియైనది. ఆ కారణమున భవిష్య
దానందకల్పనలో మునిగి యున్నది రాజకుటుంబము. ఈ
వల ప్రజయు భావిసనాథత కెంతయు ప్రసన్నభావమునందినది.
ఇంతలో నొకక్షుద్రనాగరికుడొనర్చిన సీతా లంకా వాసము
నకు జెందిన యపవాదకల్పన మహారాజు రాఘవేంద్రుని
చెవికు జేరినది. సీత పవిత్రత యగ్నిముఖమున ప్రమాణితమైన
సంగతి మహర్షిలోకమంతయు నెరిగి యున్నప్పటికి
నీ లోకాపవాదము లోకవత్సలుడగు రామునికి చిన్తనీయ
మైనది. సీత తానింతకు బూర్వము రామునిట్లడిగినది “ నేనీ
ప్రత్యుత్పన్నదౌహృదావస్థలో మరల నా పూర్వ పరిచిత
ఘనగంభీర వనరాజియందు విహరింప నభిలషించుచున్నాను.
మరల శీతలతరంగయగు గంగలో మజ్జనమాడ నిచ్చ
వొడమెడి ” నని. ఈ వంక నడవికామెను బంపుట
కూతగాగొని యాతడు ప్రజావాత్సల్యమున ఖేదమైనను
లక్ష్మణుని ద్వారా ఆమెను నిర్వాసిత నొనర్చెను.

సీతకు వనవాసవాస్తవికత దెలిసిన మీదట నామె దీనిని
రామునిదోషముగగాని, యాతని వాత్సల్యమునకు బాత్రమైన
ప్రజదోషమనిగాని యెంచక తన దుర్విధి ఫలమనియే తలం
చెను. ఒకప్పుడు రాముడు ప్రసంగవశమున “ లోకము
యొక్క ఆరాధనకు సుఖ, స్నేహములనే గాక చివరకు సీత
నైనను విడువవలసి వచ్చినప్పటికి నాకు వ్యథయుండ ”
దనెను. అప్పుడు సీత “ కావుననే రఘుకుల శ్రేష్ఠుడ ”
వన్నది. ఆరోజులు సీతకు కండ్లకు గట్టి నట్లయ్యెను. ఆసన్న
ప్రసవయగు సీత మరల వనవాస దినములు చూచినది. ఎంత
కష్టము ! ఆమె తన దౌర్భాగ్యమున కెంతయు జింతించినది,
రోదించినది. రఘువంశ వర్ధకులగు కుశలవుల బ్రసవించి
మాతయగు ధరిత్రి నాశ్రయించినది. ఇట్లు వనవాసముండి
రామునియందేకాత్మత గలిగి సీత భగవంతుని (రాముని)
లోక కార్యమున సహకరించినది. సతి పతికి వామాంగమన్న
దాని పరిచయము సీతాచరిత్రలోనే యుండును.

ఇంత జరిగినను రామునియందు సీత కేకనిష్ఠ యున్నది.
రామునియందామె కలౌకిక పూజ్యభావమున్నది. వనవాస
ముండి పతి విరహ కష్టమనుభవించుచున్నది గాని దీనిని
మించి, “ రాముడు తన విరహములో వ్యథాభారము నను
భవించుచుండునే ” యన్నదే యామెకు కష్టమైనది. ఏలనన
భగవంతునికి తానన్నయెంత ప్రేమయో ఆమె యెరిగినదే.
సీతలేనిదే క్షణమైనను గడపుట రామునికి కష్టము.

ఉత్తర రామచరితపు రెండవ మూడవ యంకములలో
కవి సీతారాముల యపార అనన్యప్రేమను జూపించినాడు.
శంబూకుని దండించుటకు రామభద్రుడు పూర్వ పరిచిత
దండకారణ్యమును జేరును. శంబూకుని శిక్షించుటయైన
తర్వాత జీవిత పూర్వానుభూతి స్మృతు లాతని మనమున
మేల్కొన సాగినవి. సీతా స్మరణ మొనర్చి యాయన మూర్ఛ
పోయెను. నేడు సీతా దర్శనము లేదుగదా ! ఆమె
జీవించి యెక్కడ నున్నది ? భగవానుడు దుఃఖించుచు
నిట్లనును—

అసిఘోరా" అని ప్రతిజ్ఞ చేసిన సీత యసామాన్య చరిత్ర వ్యక్తమైనట్లే ఉత్తర రామ చరితములో అసాధారణ స్వరూపము గన్పట్టును.

ఇట్టి పుత్రికకు తండ్రియై జనకుడు తన జనకత ధన్యమను కొన్నాడు. నాల్గవ యంకమున పుత్రిక—నిర్వాసనమువలన దుఃఖితుడై పౌరుల మర్యాదోల్లంఘనము, రాముని యవిచార శీలతయు నను నీ యపరాధములపై జనకుని క్రోధచాపము (లేక శాపము) ద్వారా ప్రళయ సమయము కానుండుట చూచి యందఱు భీతులైరి. అప్పుడు ప్రజలయందు వాత్సల్యము జూపుడని యాయనను వేడుదురు.

కంచుకి దుఃఖము వ్యక్త మొనర్చుననును—

"రామభద్ర స్యాపిదైవ దుర్వినియోగః కోప్యపి యత్పౌర జాన పదానాగ్ని శుద్ధిమ్ అల్పకాః ప్రణిపద్యన్తే ఇత్యతో దారుణ మనుష్ఠితమ్."

ఇది విని రాజర్షియగు జనకుడు సంతాప విహ్వలుడై యనును—

"ఆః! కోయమగ్నిర్నామాస్మ త్ప్రసూతి పరిశోధనే?
కష్టమ్! ఏవం వాదినా జనేన రామపరిభూతా అపి
వయం పునఃపరిభూయామహే."

నాసంతతిని పరిశుద్ధ మొనర్చుటకా యగ్ని యెవడు? అయ్యో? ఇట్లను వ్యక్తివలన నసలే రామునిచే పరిభూతులమైన మేము మరల పరిభవమందుచున్నాము. ఇది విని అరుంధతి యన్నది—నిజముగ "నగ్ని" యన్నది, యీ బిడ్డ సీత విషయమున మిగుల లఘుతరాక్షరములు గలది. నిట్టూర్చియనును గదా!

"శిశుర్వా శిష్యావా యదసిమమ తత్తిష్ఠతు తథా
విశుద్ధేరుత్కర్షస్త్వయితుమమ భక్తిం జనయతి।
శిశుత్వం స్త్రైణంవా భవతు ననువన్ద్యాసి జగతాం
గుణాఃపూజాస్థానం గుణిషునచలింగం నచవయః॥"

(4/11)

"సీతా! నాకు నీవు శిశువువో శిష్యురాలవో కాని ఎట్లైన కానిమ్ము నీవిశుద్ధచరిత్రపుటుత్కర్ష నాకు నీపై భక్తిగల్గించుచున్నది. శిశుత్వము కానిమ్ము, స్త్రీత్వము గానిమ్ము. నీవు జగత్తునకు వన్దనీయవు. గుణములే పూజకు స్థానములు కాని గుణవంతులలో వయోభేద లింగభేదము లెన్నికకు రావు.

సీత పరమ పవిత్ర చరిత్ర. ధన్య. ఆమె గుణగాన సమయమున నరుంధతి విహ్వల మైనది.

నిజముగా భారతీయ నారియొక్క యాదర్శమును నిరూపించుటలో మహాకవి భవభూతికి సాఫల్యము లభించినది. ఆయన చూపిన సీతా చరిత్ర భారతీయ మహిళా సమాజమునకు సంచితమగు నిధి.

(డిసెంబరు. "కళ్యాణ్" నుండి)



# ప్రకటన

జూలై 1 వ తేదీ నుండి ఆంధ్ర మహిళా సభలో 8-వ తరగతి పబ్లిక్ పరీక్షకు, తెలుగు పిల్లలకు శిక్షణ ప్రారంభింప బడినది. వీరు 1953—వ సంవత్సరములో పరీక్షకు వెళ్లుదురు.

ఈ పరీక్ష పాఠశాలలోని మూడవ ఫారమ్‌తో సమానము. దీని యనంతరము, హయ్యర్ ఎలిమెంటరీ ట్రయినింగ్‌కు వెళ్లవచ్చును. లేకున్న నాల్గవ ఫారమ్‌లో జేరవచ్చును.

జేరదలచినవారు వివరములను తెలిసికొని వెంటనే దరఖాస్తు పెట్టుకొనవలెను.

ఈ శిక్షణతోపాటు పారిశ్రామిక విద్యాలయంలో ఏదైన పరిశ్రమను కూడ అభ్యసించవచ్చును.

కరెస్పాండెంటు—



# పిల్లల శిక్షణ శాస్త్రీయ దృక్పథం

శ్రీమతి దరిసి సుభద్రమ్మ

("బిడ్డ గది—ఆట సామానులను" గురించి వెనుకటి వ్యాసంలో కొంత వ్రాశాను)

గోపురము, మెట్లు—నిలువుగా, అడ్డముగా—కట్టుట కని ఉద్దేశింపబడిన రంగుదిమ్మెలు, దుక్కలు, వివిధ కొలత కని ఏర్పరుపబడిన సిలిండ్రికల్ బ్లాకు అను ఆటసామాను (పొడువు, పొట్టి, లావు, సన్నం, పెద్ద చిన్న మొ॥పరిమాణ ములకోసం) మున్నగు మాంటిసోరీ విద్యా బోధక సామానులతోను, వంతెన, రైలు, బాటలు, తోటలు, ఇల్లు, మంచము, బండి వగైరాలను కట్టుట కనువగు చెక్క ఇటికెలు కొయ్యలు మున్నగు ఆట వస్తువులతోను బిడ్డ తఱచుగా ఆడుకోటంవలన, నిలువు—అడ్డం, పొడుగు—పొట్టి, వెడల్పు—ఇఱుకు, లావు—సన్నం, పెద్దది—చిన్నది, దూరము—దగ్గఱ మున్నగు పరిమాణములు, విస్తీర్ణములను గుఱించి పరిచయము, పరిజ్ఞానము పట్టువడుతవి; నల్లపలకమీద (గోడకానించిన పెద్ద పలక) సీమ సున్నంతో, కాగితంమీద వివిధరంగు పుల్లలతో నిలువుగా, అడ్డముగా గీతలు గీయటం చుక్కలు పెట్టటం, వంకరగా సైనాసరే—వర్తులమును గీయటం కోసం చేతిని గుండ్రముగా త్రిప్పుతూ గీయటం చేస్తుంది; ఈ విధంగా బిడ్డ గీతలు గీయుటవలన, చుక్కలు పెట్టుటవలన, సన్నని వస్తువులను వ్రేళ్లతో చక్కగ పట్టుకొను నేర్పు, సున్నితములయిన చలనములు (కష్టతరమైనవి), పట్టువడుతవి.

బిడ్డకు, బంకమట్టితో ఆడుకొనుటయంటే అమిత ఇష్టం; తనకు పరిచయమైన వస్తువులను చేయుటకు ప్రయత్నించటం, చెరపటం, తిరిగీ బంకమట్టిలో నీరుపోసి పిసకటం, ఈ విధంగా తనకు తనివిదీరుదాక ఎన్నో పర్యాయములు చేస్తుంది. ఇదే విధంగా రంగు కాగితాలు, పుడకలు వగైరాలతో ఆడు కొంటుంది. తల్లి ముఖ్యంగా గమనించ వలసిన విషయమేమంటే:—దుకాణమునుండి కొని తెచ్చిన బొమ్మలు, పిడతలు, రైలు, కారు, బండి మున్నగు ఆట సామానులు, ఆదిలో బిడ్డ కాకర్షణీయంగా వుంటాయి, కాని వాటితో చాలకాలం ఆడుకొనదు; విరగగొట్టటమో, పారవేయటమో చేస్తుంది. తిరిగి క్రొత్తవి కావాలని కోరుతుంది. ఈ ఆకర్షణ తాత్కాలిక మన్నమాట. బంకమట్టి చెక్క ఇటికెలు, వగైరాలలో స్వయత్నంతో స్వప్రయత్నంతో—అవి ఎంత వికారంగా, అవకతవకలగా మన్ననూసరే—బొమ్మలు, పిడతలు, రైలు, కార్లు, ఇళ్లు, వంతెనలు అనుకొని నిర్మించుకొంటూ కొన్ని గంటల కాలం ఆడు కొంటుంది; కొన్ని సందర్భములలో కొన్ని రోజులదాక ఇట్టి ఆకర్షణ వుండిపోతుంది. కాబట్టి, బిడ్డ తన కిష్టమైనవాటిని—తన ఆట కవశ్యమైనవాటిని—స్వహస్తములలో నిర్మించుకొని ఆడుకొనుట కనువగు వస్తువులనమర్చుట అత్యావశ్యకము (ఇంతమాత్రంచేత ఇదివరకే వివిధరూపములలో తయారైన ఆటసామానును అసలే దుకాణములనుండి బిడ్డకు కొని పెట్ట కూడదని కాదు. అవి కూడా కొన్ని సందర్భాలలో కొంత ఆవశ్యకం కావచ్చుకాని, వాటికెక్కువ విలువ లేదన్న మాట) ఈ విధంగా బిడ్డ స్వహస్తములతో ఆట సామానులను చేసుకొని ఆడుకొనుటవలన ఈ వయస్సు బిడ్డలో ప్రధానంగా తలచూపుతున్న చంచల స్వభావము నానాటికి తగ్గిపోతూ స్థిరబుద్ధి నెలకొంటుంది. సంకల్పశక్తి, సృజన శక్తి, కల్పనాశక్తి మున్నగునవి వికాస మొందుతవి; వస్తువుల మధ్య నున్న తారతమ్యము నెఱుగుట, ఎంచుకొనుట, నిర్ణయించుకొనుట మున్నగు శక్తులు దినదినాభివృద్ధి చెందుతవి. ఒక్క మాటలో—బుద్ధిక్రమ వికాసమును పొందుటే గాక; "నేను చేస్తాను; నాచేత నవును" అను సంకల్ప శక్తి, ఆత్మ విశ్వాసము మొలకలెత్తుతవి.

తల్లి మరొక విషయమును జ్ఞాపకముంచుకొనుట అవసరము. బిడ్డకని ప్రత్యేకగదిని ఏర్పరచి, అందులో బిడ్డ బుద్ధి వికాసమునకూ, అవయవ పటుత్వము లాఘవములకూ తోడ్పడు నట్టి ఆట సామానులు విద్యా బోధక వస్తువులను

చాల కాలముండదు) అందువలననే, బిడ్డ తన ఆటసామాను, దుస్తులు, అన్నం పళ్లెము, గిన్నె వగైరాలు తన కంటి ఎదుట, తన కందుబాటులో నుండాలని వాంఛించుతుంది. ఈ వయస్సున కొందరు బిడ్డలు తమగదిలో లేక తమ ఆట సామానలున్న చోటును ఎవరైనా, శుభ్రపఱచి సర్దు కాలంలో, తమ ఆట సామానులు మొదలగునవి చిందర వందర కాకుండా; వాటి స్థానాల్లో యధాస్థితిలో వుండాలనీ, అవి భద్రంగా వుండాలనీ కాపలావుంటారు. తమ వస్తువులను ఇతర పిల్లలకివ్వరు సరికదా! తమ పిడతలు బొమ్మలు మున్నగువాటిలో వారిని ఆడుకో నివ్వరు; అయితే పైవారి ఆట వస్తువులను మాత్రం అరమర లేకుండ తీసుకొంటారు; వారివ్వకపోతే బలాత్కారముగా వారిచేతి నుండి లాక్కొంటారు; తమ దుస్తులనో, పళ్లెము, పాల గిన్నెనో, ఇతరపిల్లలు (అప్పచెల్లెండ్రు, అన్నదమ్ములుకాని) ఉపయోగించ వలసిన అవసరము ఏర్పడినప్పుడు ఈ వయస్సు బిడ్డ ఎంత మాత్రం ఓర్చుకోదు. కాని తనకు క్రొత్తదుస్తులు, బొమ్మలు, పిడతలు లభించినప్పుడు మాత్రం ఇతర పిల్లల వద్దకు పరుగెత్తివెళ్లి చూపెట్టుతుంది. "ఆహా! ఎంత బాగున్నవ" ని వారు పొగిడితే ఎంతో మురిసిపోతుంది, అంటే "అతిశయ" భావము మొలకెత్తు తుందన్నమాట. అదే విధంగా తన తల్లి, తండ్రి తనసొత్తు, మరెవరూ (ఇతర పిల్లలు) ముట్టుకోరాదు. తల్లి తన చెల్లాయినో, తమ్మునినో ఎత్తుకుంటే కూడా ఓర్చుకోదు. ఏడుస్తుంది. వారిని క్రిందికి లాగి వేయటానికి యత్నిస్తుంది. కొట్టుతుంది. ఇట్టి చేష్టలు ఈ ఈడు బిడ్డయొక్క అసహాయస్థితిని (దైహికంగా మానసికంగా దౌర్బల్యస్థితినీ, దైన్యస్థితినీ) అసూయ తనూ సూచించుతవి. పై జెప్పినవి—అంటే—అహం భావం, స్వావ్యాభావం, అతిశయ భావం, ఈర్ష్యమున్నగు నవి—మితిమీరి పోకూడదు. కాబట్టి తల్లి, ఈ వయస్సు బిడ్డయొక్క చిత్తవృత్తి నెఱిగి విజ్ఞాన విచక్షణలతో తోడ్పడటం ఆవశ్యకము. ఏవిధంగా తోడ్పడాలో కొంత ఆలో చిద్దాము:—

తన బిడ్డ ఇంటికొద్ద తక్కిన పిల్లలతో—తన ఈడువారితోనేగాక తనకన్న పెద్ద పిల్లలతో కూడ—(అంటే, అన్నదమ్ములు, అప్పచెల్లెండ్రు, ఇరుగు పొరుగువారు) కలసి మెలసి ఆడుకొనునట్టి పరిసర పరిస్థితులను తఱచుగా కల్పించాలి. నర్సరీస్కూళ్లు (శిశు విహారాలు) అందుబాటులో నున్నచో బిడ్డను అట్టిచోట్లకు పంపుట సర్వశ్రేష్టము. సాధారణంగా, ఈ ఈడు బిడ్డ, తనకన్న పెద్ద పిల్లలతో—అంటే, 4, 5, 6, 7, ఏళ్లవారితో—కలసి కుదురుబాటుగా ఆడుకొంటుంది. తనకన్న పెద్ద పిల్లలయందు గౌరవం, మైత్రిని వెలిబుచ్చుతూ ఎంతో చక్కగా మెలగుతుంది. అనగా—"ఆరాధన భావం" వెలిబుచ్చుతుందన్నమాట. తన సాటివారితో తన ఈడువారితో ఈర్ష్య, స్పర్థ (పోటీ) చూపెట్టుతుంది. ప్రధానంగా తన చెల్లియందు, తమ్మునియందు అసూయను, స్పర్ధతను చూపెట్టుట పరిపాటి, కావుననే, తల్లి, తన బిడ్డకు, చెల్లాయితో తమ్మునితో, ఇరుగుపొరుగు బిడ్డలతో—తనకన్న పెద్ద పిల్లలతోసహా—అనుదినము ఎంత స్వల్పకాలమైనా సరే ఆడుకొనునట్టి అవకాశముల, అనువగు ఆటలు, కల్పించుట ఎంతయినా అవసరము. ఇంతేకాదు తన బిడ్డ తక్కిన బిడ్డలయొక్క ఆటవస్తువులను లాక్కొన్న సందర్భంలోకాని, స్పర్థతో పోట్లాడినప్పుడుకాని తల్లి ఇతర బిడ్డల బంతి, బొమ్మలు మొదలగువాటిని వారికిచ్చి వేయునట్లు అత్యంత చాకచక్యముతో యత్నించాలి. అవి తనవి కావనీ, వారివి లాక్కొంటే ఏడుస్తారనీ నచ్చజెప్పుతూ, తన బిడ్డ వస్తువులున్న చోటికి వెళ్లి ఆడుకొనులాగున సలహా ఇవ్వాలి. ఇతర పిల్లలవే కావాలని పట్టుబట్టితేమాత్రం, అట్టి మూర్ఖపుపట్టుకు ఎడమివ్వక, దాని ఆట వస్తువులున్న చోటికి తీసుకవెళ్లి విడిచి పెట్టాలి. కొంత ఎడ్చినను లక్ష్యమివ్వరాదు. కోపావేశంతో కాని, అనవసరముగా కాని, మరేకారణముచేతనైనా కాని తన బిడ్డకు ఇతర పిల్లలను కొట్టటం, కొఱకటం, చేసినట్లైతే వెంటనే తల్లి అట్టి చేష్టలను ఆపి, ఆ చోటునుండి తీసుకవెళ్లి మరో చోటు విడిచి పెట్టాలి. బాధపడుతున్న బిడ్డలను ఎత్తుకొని ఓదార్చాలి. తను ఏ తప్పు చేసినందున తల్లి తన్ను ప్రేమించదేమో అను ఆతురత బిడ్డకు కలుగుట కొంత మంచిదేను. కాని, ఏనో కారణాలవలన తన బిడ్డకూ, ఇతర బిడ్డలకూ

# బాలానందం

## రామశర్మ

రాజేశ్వర్

పూర్వం అవంతీనగరంలో రామశర్మ అనే బీద బ్రాహ్మణుడు నివసిస్తూ యుండేవాడు. అతడి దరిద్రంతోపాటు ఇంటినిండా కుచేల సంతానం. ఇది గోరుచుట్టుపై రోకలి పోటులాగుంది రామశర్మకి. ఒకనాడు రామశర్మ కుటుంబంతో కూడా జీవనంకోసం తిరుగుతూ ఉజ్జయనీ నగరాన్ని చేరుకున్నాడు. అక్కడ స్థూలదత్తుడని ఒక ధనికుడున్నాడు. రామశర్మ వాని ఇంట్లో నవుఖరుగా యుండి, భార్యని వంట మనిషిగా నియమించి, పిల్లలని పశువులకాపరులుగ నియమించాడు. ఒకమాటు ఆ ధనికుని యింట్లో కుమార్తె వివాహం జరుగుతోంది. విందులు, నాట్యాలు మొదలగునవి లెఖ్ఖలేనన్ని జరుగుతున్నాయి. ఇంటినిండా బంధువులే. ఎవరి సందడిలో వారున్నారు. అప్పుడు రామశర్మ ఇలా అనుకున్నాడు "ఇప్పుడు నేను చివరివరకు నెయ్యి పిండివంటలు తింటున్నాను. ఈ వివాహ సందర్భంలో ఎవరిపనిలో వారున్నారు" అనుకొని ఇంటికి వెళ్లి భార్యతో "ప్రియురాలా దరిద్రంవలన నాకు అగౌరవం కలుగుతున్నది. కనుక, దేనివలన ఈ ధనికుని గౌరము పొందగలనో ఆ పని నేను చేస్తాను. నువ్వు కూడ సమయమొచ్చినప్పుడు నేను జ్యోతిశ్శాస్త్ర పండితుడనని చెప్పు" అన్నాడు. తరువాత అందరూ నిద్రించుచుండగా అల్లుని వాహనమైన గుఱ్ఱమును దొంగలించి ఊరవతల కాళికాలయమువద్ద దాచేశాడు.

అందరూ లేచిన తరువాత నవుఖర్లు గుఱ్ఱం కోసం వెదికారు. కాని దొరకలేదు. అప్పుడు రామశర్మ భార్య, గుఱ్ఱపు దొంగలను వెదుకుచున్న సేవకులు, వివాహసందర్భంలో అల్లుని గుఱ్ఱం పోవడం అమంగళమని తలచుచున్న యజమానుని దగ్గరకువెళ్లి "మహాత్మా రామశర్మ జ్యోతిశ్శాస్త్ర కోవిదుడు. అతడు ఇంటిదగ్గరే యుంటాడు. అడిగితే గుఱ్ఱంజాడ తెలుస్తుందేమో" అని చెప్పేరు. దానిని విని స్థూలదత్తుడు రామశర్మను కబురంపినాడు. రామశర్మ వచ్చిన తరువాత "ఓ రామశర్మా నీవు జ్యోతిశ్శాస్త్రమందు అపార కృషిచేసేవు. నా అల్లుని గుఱ్ఱం మెవరు తీసినది చెప్పు అన్నాడు."

పరీక్షించి చూడవలెను." అన్నాడు. మంత్రి మాటలవలన ఒక క్రొత్తకుండలో కప్పను యుంచి మూతపెట్టి రామశర్మతో "బ్రాహ్మణుడా ఈ కుండలో యేమున్నది నీవు చెప్పినట్లయితే నిన్ను విశేషముగా గౌరవిస్తాను." అని చెప్పేడు. రామశర్మ దీనిని విని తనకు వినాశ కాలము సంభవించుచున్నదని, చిన్నప్పుడు తను ఆడిన ఆట జ్ఞాపకమొచ్చి విచారిస్తున్న ముఖముతో "ఓ మండూకమా తంత్రమైన వినాశానికి ఘటం సంభవించింది." అన్నాడు. తరువాత రాజు రామశర్మని యథార్థముగా జ్ఞానిగా తలచి వానికి నూరు గ్రామములిచ్చేడు. నాటనుండి రామశర్మ ధనవంతుడై సుఖంగా కాలం గడుపుతున్నాడు. బాలలూ! ఇటువంటి జ్యోతిశ్శాస్త్ర పండితులు యెంతమందున్నారో కదా!!



# ముద్దబ్బాయి!

* మండ మల్లికార్జునరావు *

గురువు :—

కన్నప్పా! రావోయీ!
చిన్నమాట వినవోయి!
చెప్పినపని చేస్తావా!?
చెప్పమ్మా? చెప్పుచెప్పు?

కన్నప్ప :—

గురువుగారు-శెలవీయండి....!
మరువను మీ మాట లెండి....!
ఏమిటి అడగాలండి?
గుమస్తావద్ద నిలుచుండి!?....

కన్నప్ప :—

గురువుగారు, గురువుగారు!—
మీరు చెప్పినది విననటండీ?
మీ మాట నే వింటాను-.....
ఏమిటో చెప్పండి అది....

గురువు :—

నాకు లేఖ లేమైనా!
ఉంటే నీకిచ్చేయ్‌మను....
పోష్టాఫీసు తెలుసునా?
పోష్టాఫీసు ఎక్కడుంది?....

గురువు :—

అబ్బాయీ! అబ్బాయి!.
వెళ్ళుమోయి! వెళ్ళవోయి....
పోష్టాఫీసు క్లార్కు దరికి....
కష్టమ్మని....అనుకోకు!

కన్నప్ప :—

మేష్టారూ! మేష్టారూ!....
పోష్టాఫీసు నాకు తెలుసు!
మందమతిని కానులెండి,
కందిగుండ అమ్ముతారు!



## విరోధ కారణం

"సుమారు 10 సంవత్సరాలయిందండి. అప్పటికి నాకొక కూతురుండేదండి. ఆ పిల్లనే నా జీవిత నిధానంగా చూసుకుంటూ ఉంటే 12 ఏళ్లు పెరిగి ఆపిల్ల కూడా పోయింది. యింకెవరూ లేకపోతే రామారావు గారింట్లో కొన్నాళ్లున్నాను. నా డబ్బునేనే వాడుకున్నా, మాట సహాయానికి కూడా ప్రజల కన్నెర్రగా ఉండటం సహించలేక, యిక్కడేదో చిన్న స్కూల్లో పని ఉందంటే వచ్చాను."

"అయ్యో! పాపం. చాలా జాలికరంగా ఉంది మీ జీవితం. మనశ్శాంతిగా ఉంటుంది కొంచెం అలా సినీమాకో షికారుకో వెళ్దాం వస్తారా?"

"వద్దండి. అలాంటి అలవాట్లులేవు అపరిచితులతో. మనశ్శాంతి అందువల్ల రానూరాదు. నాకిప్పుడవసరమూ లేదు."

"సరే నేను వస్తాను పనుంది."

అని రెడ్డి వెళ్లిపోయాడు నిజంగా పనేమీ లేక పోయినాను. సరస్వతి మాత్రం క్రుంగి పోయింది. రెడ్డి సంభాషణ, ప్రవర్తన ఆమెను చాలా కలవర పరచాయి. రామారావు స్నేహితుడని చనువిస్తే ఆ చూపులు, ఆ అతిచనువుగా మాట్లాడటం అసహ్యంగా అనిపించింది. "ఆడదంటే యింతలోకువా? ఏమంత మహా స్నేహం వుందని నన్ను షికారుకి, సినీమాకి యీ సమయంలో పిలుస్తాడు? ఓ భగవంతుడా! నా జీవితంలో నాకింకా ఏమేమి అనుభవాలు కావాలి? ఏం ప్రయోజనం నేను జీవించి? నేనింకా పెళ్లి కూడా చేసుకోవాలట. నాభర్త నాకేమి లోపం చేయలేదు. గడపినకాలం తక్కువయినా నా జీవితమంతా కూడా నెమరు వేసుకునేందుకు తగినంత మధుర స్మృతులు వదలి వెళ్లారాయన. యిటువంటి స్నేహితుడు రామారావు కెక్కడ లభించాడో? యీ సంగతి చెబితే తనకు మాత్రం అసహ్యమేయదూ. నా సౌందర్యం తనకెందుకో?"

యిలా ఆలోచిస్తూ 8-౩౦. వరకూ దీపమన్నా వెలిగించకుండా కూర్చుండి పోయింది సరస్వతి. మనస్సంతా కలగి పోయింది. రామారావుతో చెప్పాలని ఆత్రంగా వుంది. ఎలాగో సమాధానపడి పడుకుంది. ఒంటరిగా ఎందుకు మా యింట్లోనే వుండమని అంటూనే వున్నాడు రామారావు.

* * *

"రా, రా, రెడ్డి! నీకోసమే యింకా రాలేదేమా అని చూస్తున్నాను. ఏమిటి విశేషాలు?"

"ఏం, అంత ఆత్రంగా వుందా విశేషాలు వినాలని?"

"కాదు మరి, పొరుగూరు వెళ్లి వచ్చావుగా. వింతలేమైనా వున్నాయేమోనని?"

"అంతేనా, యింకేమైనా ప్రత్యేక శ్రద్ధవుందా?"

"ఏమిటి యీ ధోరణివింతగా మాట్లాడుతున్నావు?"

"అన్నీ వింతలే ప్రపంచంలో. రానురాను అదే తెల్సుకుంటున్నాను."

"సరేలే నువ్వెప్పుడూ యింతే...అయితే ఆబుట్ట సరిగ్గా చేర్చావా?"

"అలాదారికిరా. మరేంబెంగ పెట్టుకోకు. యిచ్చాను లే"

రెడ్డి యిలా మాట్లాడటం రామానికి కొంచెం కష్టమనిపించింది. అలా కలిగించాలనే రెడ్డి అభిప్రాయం కూడాను. సరస్వతి తను పిలిస్తే కూడా రాకపోవడం రెడ్డికి చిన్న తనమనిపించింది. అంతగర్వమా దిక్కు లేకుండా వుందిగదా అని ఏవో ఆప్యాయంగా మాట్లాడితే నిరాదరణ చూపిందే. నిజంగా తను నిష్కళంకమైన జీవితం గడుపుతూవుండి వుంటుందా ఏమిటి? చిన్నది; అందమైనది; అసహాయ. మనసులో పరాభవాగ్ని రాజుతూ వుంది. ఏం చేయడం? రామారావుని సరస్వతిని కలిపి ఎవరితోనైనా చెపితే ఎవరు నమ్ముతారు? రామం మంచితనం, పరోపకార బుద్ధి స్నేహితుల కందరికీ తెలుసు. కనుక రామానికే సరస్వతిని గూర్చి చెబితే కొంచెం తమాషా ఆనందించ వచ్చు. అప్పుడు సరస్వతి గర్వమణుగుతుందని పన్నాగం పన్నాడు రెడ్డి.

"ఎలా ఉన్నారావిడ? ఏమన్నారు? ఏమిటలా ఆలోచిస్తున్నావు?"

"ఏం లేదుగాని రామం, నిజంగా చెప్పు. ఆవిడ పరిచయం నీకెలాగయింది? ఎందుకు నీవామెయందు అంత

శ్రద్ధ చూపాలి? కారణం వాదగ్గర దాచకు. నీవు చెప్పక పోయినా నేను తెలుసుకోగలను.''

రామం ఒక్కమాటు నిలువునా కంపించిపోయాడు. రెడ్డి యింత అసభ్యంగా ప్రశ్నించాడని అపరిమిత కోపం వచ్చింది.

" ఏమిటి రెడ్డీ అలా అడుగుతావు? ఎవరయినా కష్టాల్లో వుంటే సహాయం చేయడానికి కారణమడిగేటంత విశాల బుద్ధిగల వాడివనుకో లేదు నిన్ను. అదే ఒక మొగవాడికి చేస్తే నీవిలా నన్నడిగి వుండేవాడివా? యీ ప్రశ్నే చాలా నీచంగా వుంది. నేను చెప్పక పోవటానికి నీవు తెలుసుకోవటానికి ఏముంది? ఆమె భర్తనుకూడా నే నెరుగుదును. ఆమె గుణం కూడా తెలిసినవాణ్ణి. కించిత్తయినా మాట పడలేదు తను. మాయింట్లో వుండమంటే ప్రజలేమంటారో నని శంకించి పాపం పొరుగూరు వెళ్లింది. ఏం కష్టపడు తోందోనని నేనడిగితే దానికి ఒక కారణం, నేను చెప్పక పోవడం, నీవు తెలుసుకోవడం, అహా హా. ఎంత తెలివి!''

'' క్షమించు రామం. నాకేం తెలుసు. ఆమె నాకే రామం వుండగా కొదువ లేదన్నట్లు, నీవు ఆమె అంటే అపరిమితమైన ప్రేమతో వుంటున్నట్లు మాట్లాడింది. అందు కని నేనలాగనుకున్నాను. అయినా పూర్తిగా నమ్మలేదులే. నీవు మంచివాడివే నాకు తెలియదూ? ఆవిడ అలామాట్లాడితే ఎవరికైనా సందేహం వస్తుంది. నాకే అసహ్యమేసింది ఆవిడ ప్రవర్తన చూస్తేను. చుట్టు పక్కల వాళ్లికికూడా ఆమెను నీతో చాలా దగ్గర పరిచయమున్నట్లు చెప్పిందట. నీ దగ్గరకొచ్చి తెల్సుకున్నాకే నాకు నిజం తెలిసింది. లేకపోతే ఎలా తెలుస్తుంది? నీకెంత కోపం వచ్చిందో చూశావా?''

రామం చాలా ఆశ్చర్యపోయాడు. నమ్మలేదు. కాని రెడ్డి కావాలంటే నీ ఎదురుగుండానే ఋజువు చేస్తా నన్నాడు. ఏమో ఎవరిని నమ్మడానికి వుంది ఈ కాలంలో! ఏ క్షణంలో ఎవరి మనసెలా మారుతుందో ననుకున్నాడు.

రెండు మూడు రోజుల తరువాత తానే వెళ్లాడు. చాలా కోపంగా వుంది సరస్వతంటేను. పోనీ తన మనసులో ఏమి లేనేలేదనుకో. అలాంటి దురభిప్రాయం కలుగజేసేటట్లు ప్రవర్తించడమేమని. కాని శాంతంగానే అడగాలని నిశ్చయించుకున్నాడు. కొంత సంభాషణ జరిగిన తర్వాత భయపడుతూ.

" ఎందుకోగాని, రెడ్డికి మన యిద్దరి బాంధవ్యం వెట కారంగా వుంది. కారణం తెలియదు. నేనేమి అనుమానా నికి సందివ్వలేదు. మరి......''

లోకజ్ఞానం గలది. వెంటనే గ్రహించింది.

" అయితే నేనిచ్చాననా?"

'' అబ్బే మరేమీ అనుకోవద్దు. నిజంగా ఏంజరిగిందో తెలుసుకుందామని అడిగాను.''

" ఏం జరగడమేమిటి? అంతా సహజంగానే జరిగింది. నేనెలాంటి దాన్నో చూశాడు. కొంచెం కరకు సమాధానా లిచ్చేటప్పటికి పౌరుషం వచ్చింది—ఎంతైనా మొగవాడు, కాదూ—పగతీర్చు కున్నాడు. నమ్మడానికి కూడా తగ్గ......"

గొంతుక పూడిపోయింది. కళ్లునిండి పోయాయి. తన చెప్పేదంతా రెండు కన్నీటి చుక్కలే చెప్పాయి. రామా రావు చాలా నొచ్చుకున్నాడు. చిన్నప్పటి నుండీ తెలిసీ కూడా తాను ఒక్కక్షణంలో నమ్మగలిగానే అని తన్ను నిందించుకున్నాడు.

'' క్షమించాలి అర్థమయింది యిప్పుడు. వెంటనే అతన్ని నాలుగు చీవాట్లువేస్తాను. మీరేమీ అనుకోవద్దు." అని వెళ్లిపోయాడు.

ఆ తరువాత అనేకమార్లు రెడ్డి సరస్వతులు కలుసుకోవడం సంభవించినా మొహంచాటేసుకుని ఏదో విరోధం లాగ వెళ్లి పోయేవాడు. యీ మాట రామారావుతో చెప్పింది సరస్వతి.

" పోనీలెండి, మనమేం చేస్తాం?" అన్నాడు.

'' అలాక్కాదులెండి. సినీమాకు వెళ్లితే యింత విరోధం వచ్చేది కాదేమో '' అంది నవ్వుతూ.



# గుడిగంటలు

"శ్రీపాద"

కణ కణ లాడె
గుడి గంటలు !
కణ కణ లాడె
చితిపై మంటలు !!

పెంచిన బొజ్జల
ధవళిత వస్త్రాలలో
మరుగుపఱచి
కొలువుకూటు
మధిష్ఠించిన
భక్తవరుల
కులుకుపలుకు
లాధారముగ :
చతుర్దశ భువనాలను
పరిపాలించె—
జగన్నాథా !

" ఈసువిశాల
ప్రపంచమందు
జనియించిన
జీవులు కార్చెడి
అశ్రుధారలె, స్వామి !
నీ కభిషేకమౌన ?

దేశసౌభాగ్య
సంరక్షణార్థమై
యోధవరులు
రణరంగమందు
యొడ్చినసవోష్ణ
రుధిరబిందువులె
ప్రేమమీరగ
నీదుశిఖను ఇడిన
మధువు లొలుకని
మందారసుమములౌన ?

అనాథజనాళి
జీర్ణగేహమ్ములలో
దాగిన ఎమ్ముల
ఆర్తనాదమె
రజిత వీణను
మీటుచుపాడు
శృంగార తరంగమౌన ?

శ్యామదేవి
కటాక్షవీక్షణముల
మోక్షమందినవారి
కళేబరాల
భక్షించు నీతి
హోత్రుని నగవె
నీకఖండ జ్యోతియౌన ?

స్వార్థజగతి
పదయుగళమ్ము
క్రిందబడి
బాధలనొందెడి
బానిస మూకల
బుడిబుడి మూల్గులె
అఖండప్రతిభా
విభవమ్మగు

## గుడిగంటలు

పాంచజన్యమ్మగునా ?"
జగన్నాథా !
నీ గుడిలో గంటల
గణ గణలు
అశక్తులు కార్చు
భాష్ప బిందువులు

తళతళలు
......................
......................
గుడిలో గంటలు !
పేదవాని చితి మంటలు !!
......................

గణ గణ లాడె
గుడి గంటలు !
కణ కణ లాడె
చితిపై మంటలు !!



# తోటమాలీ

ఓ...తోటమాలీ...!

తరులతో లతలతో
తరు లతాదులతో
జీవితమంతా
హాయిగ గడిపే...ఓ...తోటమాలీ...!

తోటకునీరు
తోడాలంటావ్
తోటనుబాగా
పెంచాలంటావ్
తోటయెనీ
సర్వంబంటావ్...ఓ...తోటమాలీ...!

తోటయెనీ
సర్వంబైతే
తోడిబ్రతుకేమానోయ్ ?
నీతోడిబ్రతుకేమానోయ్ ?...ఓ...తోటమాలీ...!

తోటా తోడిబ్రతుకుల
తోటిబ్రతుకేనోయ్
నిజముగ
నిత్యము
అటులనె
సత్యంబౌనోయ్...ఓ...తోటమాలీ...!

—రావులపర్తి గంగరాజు



# महात्मा गाँधी

कोना మూల (Corner)
बचपन బాల్యము
उम्र వయస్సు
शादी వివాహము
कुसंगत దుస్సాంగత్యము
आदत అలవాటు
चोरी దొంగతనము
आँसू అశ్రువులు
विलायत విదేశము
मदिरा మద్యము
वकालत వకీలు వృత్తి
मुक़द्दमा కేసు
सरकार ప్రభుత్వము
तकलीफ़ కష్టము
आज़ादी స్వాతంత్ర్యము
रास्ता మార్గము
खोज వెదుకుట
गिनती గణన
मौत మరణము
ईसा मसीह ఏసుక్రీస్తు
एकता ఐకమత్యము
शहीद ప్రాణములర్పించినవాడు (martyr)
भरसक చేతనైనంత
पछताना పశ్చాత్తాపముచెందుట
लौट आना తిరిగివచ్చుట
संसार ప్రపంచము

आज कौन ऐसा हिन्दुस्तानी होगा जो गाँधीजी के नाम से परिचित न हो। सिर्फ़ हिन्दुस्तान में ही नहीं, दुनिया के कोने कोने में उनकी कीर्ति फैल गयी है।

महात्मा गाँधी का जन्म गुजरात के पोरबंदर नामक गाँव में सन अठारह सौ उनहत्तर ईसवी अक्तूबर दूसरी तारीख़ को हुआ। इनका पूरा नाम था मोहनदास करमचन्द गाँधी।

गाँधीजी बचपन में पढ़ाई में तेज़ नहीं थे। तेरह साल की उम्र में उनकी शादी हुई।

बचपन में कुसंगत में पड़कर उन्होंने बुरी आदतें सीख लीं। सिगेरट पीना शुरू किया। और जब सिगरेट खरीदने के लिये पैसा न मिलता, चाचाजी की जेब से सिगरेट चुरा लेते थे। कभी कभी पैसे भी चुराते थे। लेकिन कुछ दिन बाद उनकी आँखें खुल गयीं। अपनी चोरी और बुरे कामों पर उन्हें बड़ा दुख हुआ। वे पछताने लगे। एक कागज़ पर अपनी चोरी की बात लिखकर पिताजी के सामने रखा और क्षमा करने की प्रार्थना की। पढ़ते पढ़ते पिता की आँखों में आँसू आ गये। उन्होंने बेटे को क्षमा कर दिया। उस दिन से गाँधीजी ने अपनी बुरी आदतें तोड़ डालीं और सचाई के साथ बर्ताव करना सीखा।

गाँधीजी के बचपन में उनके पिताजी मर गये। मेट्रिक पास करने के बाद, गाँधीजी बैरिस्टरी पढ़ने इंग्लैन्ड गये। विलायत जाते समय उन्होंने अपनी माताजी को वचन दिया— "मैं माँस, और मदिरा न छुऊँगा।"

विलायत से लौटकर गाँधीजी राजकोट में वकालत करने लगे। इसी समय एक मुकद्मे के बारे में उन्हें दक्षिण अफ्रीका जाना पड़ा। वहाँ की सरकार भारतीयों को तकलीफ देती थी। यह देखकर गाँधीजी ने स्वदेशवासियों की भरसक मदद करने का निश्चय कर लिया। उन्होंने वहाँ हिन्दुस्तानियों की बड़ी सेवा की। वहीं उन्होंने पहले पहल सत्याग्रह किया। उसके बाद वे स्वदेश लौट आये।

हिन्दुस्तान में आने के बाद वे सार्वजनिक कामों में भाग लेने लगे और धीरे धीरे राजनैतिक क्षेत्र में आ गये। कांग्रेस के ज़रिये हमको आज़ादी का रास्ता दिखाया और आखिर आज़ादी दिलाई।

गाँधी जी ने अपना सारा जीवन सत्य की खोज में लगा दिया। कई दफ़े जेल गये, सत्याग्रह और उपवास किये। उन्होंने गौतम बुद्ध की तरह दुनिया को सत्य और अहिंसा का पाठ सिखाया। राजनीति में अहिंसा का प्रयोग करके दुनिया के सामने एक नया आदर्श रखा। उनकी सेवाओं की कौन गिनती कर सकता है?

इस अहिंसा के पुजारी को एक पागल आदमी ने गोली से मार डाला। इनकी मौत पर तमाम दुनिया रोयी। गाँधीजी भी ईसा मसीह की तरह अहिंसा की स्थापना और हिन्दू-मुस्लिम एकता के लिये अपने प्राणों की बलि देकर शहीद बन गये।

गाँधी जी के बताये हुए मार्ग पर चलने से ही संसार का कल्याण होगा।



ప్రస్తుతం ప్రపంచంలోని జనాభా 240,00,00,000 లట. ఇది ఏటా 2,50,00,000 చొప్పున ఏటేటా పెరిగి పోతూందట. ఇంత విశేషంగా (వ్యాధి వ్యాఘ్రాలనూ, క్షామ దేవతలనూ, యుద్ధ పిశాచాలనూ కనుగ్రామి) జనాభా పెరిగిపోవటం వల్ల, 150 సంవత్సరాలు అయ్యేసరికి, ఆహార పదార్థాలు సరిపోకపొయ్యే ప్రమాదం మానవకోటికి కలిగితీరుతుందని, మిత్రరాజ్య సమితి, ఏప్రిల్ 14వ తేదీని ఒక హెచ్చరిక చేసింది. అర్ధభాగం జనాభా అన్నమో రామచంద్రా అని అలమిటుస్తూన్న యీ తరుణాన్ని మరచి, 150 సంవత్సరాల తరువాత రాబోయే ప్రమాదాన్ని గూర్చి హెచ్చరించటంలో వీరి అభిప్రాయం?



(16-వ పేజీ తరువాయి)

"అదే నాకూ వారికీ ఎడబాటు కలిగించింది."

"అంటే?"

"వారి తండ్రి ప్రఖ్యాతవ్యక్తి. పోలీసుశాఖలో డిప్యూటీ సూపరింటెండెంటుగా ఉండేవారు. ఆయన పేరు సత్యనారాయణమూర్తిగారు. పేరుకు సత్యనారాయణమూర్తేగాని సకాలంలో బ్రిటిష్ ప్రభుత్వం క్రింద తయారైన కొండంత భయంకరమైన పోలీసు ఉద్యోగస్థుల లక్షణాలన్నీ ఆయనలో కనబడుతుండాయి. పైఉద్యోగస్థుల్ని కాకాపట్టడం, నిర్దాక్షిణ్యత, తామంటే పరకంటి పగ, రాక్షసుని బలం, బగ్గవిలాసాలు, ఆయన్ని చూస్తేనే ఎవరి గుండె అయినా ఎగిరి పడిపోయేది. ఆయనకెందుచేతనో, ఈ జాతీయోద్యమాలు ఏమన్నా పడేవికావు. యానిబిసెంటుగారి హోంరూలు ఉద్యమం, తిలక్‌గారి గాఢ జాతీయాభిమానం ఎవరన్నా ఆయన ఎదుట పొగడితే, పొయ్యిమీద ఉన్న మూకుడులో నీళ్లు పడితే మండినట్లు మండి పోయేవాడు. గాంధీపేరు చెబితే ఎర్రబట్టను చూసిన పోట్లెద్దే! అలాంటి ఆయనకు వారు పుత్రులు. తండ్రి గుణాలేవీ అబ్బక సాధుమూర్తి అయిన, తల్లిపోలికలే వచ్చాయి వారికి అని, మేము అంతా అనుకున్నాము."

"అంత విచిత్రమైన మాయమనుష్యులు ఉంటారు చెల్లీ!"

"ఆయన గాంధీగారిని పొగడేవారు. మా ఉద్యమాన్ని పొగడేవారు. పెళ్లికిముందు మావూరు వచ్చినప్పుడు, ఆయనా, నేనూ మాట్లాడుకుంటూ ఉండగా పెళ్లిళ్లలో వస్త్ర బహుమానాల విషయం ప్రస్తావన వచ్చింది. ఆ ప్రస్తావన ఖద్దరు వాదనలోకి దిగింది. రాజకీయార్థం తప్ప ఖద్దరుకూ మనుష్య జీవితానికి ఇంకోరకం సంబంధం లేదట. నేను ఖద్దరు ఆర్థిక దృష్టిలోనూ ఉత్తమం అన్నాను. ఆధ్యాత్మిక సాధనలో చక్కని మజిలీలలో పరమోత్తమమైన మజిలీ అన్నాను."

"ఇందులో తప్పేమి ఉంది? నేవా రామమూర్తిగారి వాదన అచ్చం అల్లాగే ఉంటుంది చెల్లీ!"

"ఎవరూ నేవా రామమూర్తిగారు?"

"ఆయన మీ ఆంధ్రుడేగా! నువ్వు ఎరగనే ఎరగవా?"

"నువ్వు చూస్తూనే ఉన్నావుగా అక్కా! నాకు సంబంధించనివారితో నేనేమీ జోక్యం కలుగజేసుకోను గదా!"

"అవునులే! తర్వాత! ఆ పెద్దమనిషి, నీ భావాలన్నీ గేలిచేశాడన్నమాట!"

"గేలిచేయడమేకాదు. మా ఇద్దరికీ చాల ఘాటుగానే జరిగింది వాగ్వివాదం! ఆయన ఆ వేడిలో బాపూజీని గోచీ పాతరాయుడనీ, జీవచ్ఛవమనీ, ఇంకా మళ్లీ నేననలేని మాటలన్నారు. నాకు పట్టరానికోపం వచ్చింది, 'ఫీ ఫూల్! నువ్వు పశువుకన్న నీచుడవు. నీ మొగంచూస్తే రౌరవాది నరకాలే!' అని పాలికేకలు పెడుతూ లోపలికి పారి పోయాను. నాకు అతిదుఃఖం వచ్చింది. నా గదిలో మంచంమీద పడుకొని వెక్కి వెక్కి ఏడ్చాను. ఆ తర్వాత నేను వారిని చూడలేదు. వారిదారి వారిది. నేను......!"

ఉమ కన్నుల నీరుతో పైకిరాని సముద్రంలాంటి దుఃఖంతో అనసూయాబాయి ఒళ్లో వాలిపోయింది.

౪

ఎందరి దుఃఖాలో తన హృదయంలో ధరించి వారికీ ఆనందం సమకూర్చిన డాక్టరు ఉమాదేవి నేడు తన దుఃఖం ఆపుకోలేక తన హృదయంపైన వాలిపోయిందే అని అనుకుంటూ, అనసూయాబాయి ఆమెను గాఢంగా తన గుండె లకు హత్తుకుంది.

"ఆ తర్వాత నా కర్థమవుతుందిలే తల్లీ! నువ్వు మనస్సు పాడుచేసుకొని తొందరగా ప్రయత్నించి మెడికల్ కాలేజీలో చేరివుంటావు. అప్పటినుండీ ఇంతవరకూ ఆ తుచ్ఛుని విషయం ఏమో తెలుసుకొని ఉండవు. కాని నీ జీవితంలో నుండి అతనిపై ప్రేమ హరించిపోలేదు. అదే నీబాధ! అతడు కరిగి నీకు విశ్వమే ప్రత్యక్షమైనది. ఇంక అత డెందుకు చెల్లీ!"

అలా అనసూయాబాయి ఒళ్లో తల ఉంచుకొనే ఉమ "మీకూ, నాకూ వివాహం మాటలు రద్దు. నేను మిమ్ము

నిజంగా—ప్రేమించలేను—" అని ఉత్తరం వ్రాసి మరీ వెళ్లి కాలేజీలో చేరినాను. మా చుట్టాలూ, వారి చుట్టాలూ ఏవేవో చెప్పవచ్చారు. బ్రతిమాలినారు. నేను వినిపించుకో లేను. వాద తీవ్రతలో ఏవో అన్నారట. అందుకు ఎంతో పశ్చాత్తాపం పడుతున్నారని చెప్పారు. కాని నా కోపం తగ్గలేదు. నేను మళ్లీ వారిని చూడలేదు."

"ఎంత బాధ పడ్డావో తల్లీ!"

"చుట్టాలూ స్నేహితులూ బ్రతిమాలారు. పరమపవిత్రమైన బాపూజీని అలా అనకలిగిన మనిషి, జీవితాన్నే క్రోధంగా మార్చగలడు. అలాంటి మనుష్యునితో నాకు సంబంధం ఏమిటి?"

ఉమ లేచికూర్చుంది. ఆగిన కంటినీటి వెనుక కోపాగ్ని శిఖలు జ్వలిస్తున్నాయి. గాఢ కాలమేఘం వెనక మధ్యాహ్న చండకిరణుడు ప్రజ్వలిస్తున్నాడు.

"అదా ఉమా! ఆగ్రహాతప్తమైన మనస్సూ, ప్రేమార్ద్రితమైన హృదయమూ! ఈ రెంటికీ నీ బ్రతుకు రణాంగణమైనదా? సరేలే! రా ఒక్కసారి మా విద్యాలయానికి. తోటపనిలో ఎక్కువ కూరలు పండించిన వారికి బహుమతులు, వడుకుటలో సన్నదారం, ఎక్కువదారం తీసినవారికి బహుమతులు, తమతమ ఒద్దికలో ఉన్న శిశువులను వరద సరస్వతీ ప్రముఖ భక్తులుగా బాగాచేసిన వరద విధానోపాధ్యాయినులకు బహుమతులూ అన్నీ ఏర్పాటు చెయ్యాలి. నువ్వు పరీక్షకులలో ఒకర్తెవు!" అంటూ అనసూయాబాయి ఉమను వరదా శిక్షణ కేంద్రానికి తీసుకొనిపోయినది.

(సశేషము)



# ఈ నాటి ఉత్తమ దేశసేవ

* శ్రీ చక్రవర్తి రంగస్వామి *

విద్యలో వెనుకపడ్డ దేశాలే ప్రపంచ చరిత్రలో అన్నిటా వెనుకపడ్డ దేశాలుగా ఉండిపోవటం మనం చూస్తున్నాం. ఏ దేశంలో అధిక సంఖ్యాకులు విద్యావంతులో ఆ దేశం అన్నిటా మిన్నగా కనపడుతూ ఉన్నది. ఆరోగ్యము, విజ్ఞానము, సుశిక్షణ, స్త్రీ స్వాతంత్ర్యము, సత్పరిపాలన విద్యవల్లనే లభ్యము కాగలవు. మన దేశములో నూటికి తొంభైమంది చదువు రానివారు. ఇతర దేశాలతో పోల్చి చూచినప్పుడు మన దేశములోని చదువురానివారి సంఖ్య చాలా ఎక్కువ. నిరక్షరాస్యత బాగా పేరుకొని ఉన్నదంతా వయోజనులలో, విశేషించి స్త్రీలలో.

ఈనాడు మన దేశములో కూడా వయోజన విద్యా వ్యాప్తికి ప్రయత్నాలు జరుగుతున్నాయి. పలువురు వయోజన విద్యా బోధకులుగా శిక్షణపొంది 'వార్తా పత్రికను చదివించడం ఆదర్శంగా' పెట్టుకొని ఊరూరా విద్యాలయాలను నడుపుతున్నారు. అనేకులు యువకులు, పెద్దలు అక్షరాస్యులౌతున్నారు. ఉపన్యాసాల ద్వారా, ప్రదర్శనాల ద్వారా అనేక విషయాలను తెలుసుకుంటు న్నారు. భూగోళశాస్త్రం, ప్రపంచచరిత్ర, భౌతిక విజ్ఞానం, ఆర్థిక, సాంఘిక విషయాలను వింటూ జ్ఞానాన్ని పెంచు కుంటున్నారు.

కొద్దిమంది ఉపాధ్యాయినులు కూడా శిక్షణపొంది అక్కడక్కడ స్త్రీ—విద్యాలయాలను నడుపుతున్నారు. కానీ ఏ కొద్ది విద్యాలయాలో ఇంత బ్రహ్మాండమైన కార్యాన్ని నిర్వహించ గలవా? ఏనాటికైనా తెలుగుదేశం లోని స్త్రీల అక్షరాస్యతకు కావలసినన్ని విద్యాలయాలు నడుపబడతాయంటే కల్ల. ముఖ్యంగా గ్రామాలలోనూ, చిన్నచిన్న పట్టణాలలోనూ, స్త్రీల కొరకు విద్యాలయాలు నడపబడటం లేదు. సామాన్యంగా గ్రామాలలోనూ, చిన్నచిన్న పట్టణాలలోనూ వారికి ప్రదర్శనాలను చూడ డానికిగానీ, ఉపన్యాసాలను వినడానికిగానీ అవకాశాలుం డవు. ప్రతిదినం పదిమంది ఒకచోట ఒక సమయంలో కూడడానికి కూడ సావకాశం ఉండదు. ఇంత మాత్రంచేత నిరక్షరాస్యులైన స్త్రీలకు చదువుకుందామనే అభిలాష లేకుండా పోతుందా? నిజానికి పురుషులలోకంటే స్త్రీలలో చదువుమీద అభిలాషను కలిగించడం తేలిక. ముఖ్యంగా ధనవంతులు, మధ్య తరగతివారిలో ప్రచారం ద్వారా ఈ అభిలాషను కలిగించడం చాలా సులువు. కొంత శ్రమ తీసుకుంటే పాటకపు జనంలో కూడా విద్యాభిలాషను రేకెత్తించవచ్చు. పెద్ద పెద్ద పట్టణాలలోని ఫ్యాక్టరీలలో పనిచేసే ఆడకూలీలకూ, ఆసక్తిగల ఇతర స్త్రీలకూ విద్యా కేంద్రాల ద్వారా తీరిక వేళల్లో విద్యను నేర్పవచ్చు.

చదువు, వ్రాత నేర్చుకోవడానికి స్త్రీలకు కొన్ని చక్కని అవకాశాలున్నాయి.

భర్త, కుమార్తె, కుమారులు మొదలైన చదువుకున్న వారి ద్వారా తీరిక సమయాల్లో విద్యాభ్యాసము చేయ వచ్చును; ఇరుగుపొరుగున వున్న విద్యావతులైన స్నేహితు రాండ్ర వద్దకు పగటిపూట, మధ్యాహ్నము వేళ, భోజనాలు అయిన పిదప వెళ్లి నేర్చుకొనవచ్చును.

ఉపాధ్యాయినులు, చదువుకొన్న సోదరీమణులు శిక్షణను పొందీ—పొందక పోయినప్పటికీ—వీలైనంత మందిని అక్షరాస్యలను చేయుటకు దీక్షపూనవలెను. అవకాశ మున్నచోట్ల స్త్రీల పాఠశాలలను నడపుతూ, ఇతరచోట్ల ప్రతి చదువుకున్న స్త్రీ ఇరుగుపొరుగు స్త్రీలలో విద్యాభి లాషను ప్రోత్సహించి విద్య నేర్పవచ్చును.

'ప్రతిఒకరు ఇంకొకరికి విద్య నేర్పాలి' అనే సూత్రాన్ని ప్రతి విద్యావతి అమలు పరచవలెను. మహిళా సంఘా లున్న ప్రతిచోటా విద్యా ప్రచారానికి ప్రాముఖ్యం ఇవ్వటం మంచిది. మహిళాసంఘాలు లేని గ్రామాలలోనూ పట్టణాలలోనూ స్థానికంగా ఉండే విదుషీమణులు ఉత్సా హంతో విద్యా ప్రచారంచేసి తెలుగుతల్లులను, సోదరీ మణులను అక్షరాస్యలను చేయవలెను. విద్యావ్యాప్తికి, విజ్ఞానవ్యాప్తికి పండుగలు, పేరంటములు, పాటలు

## ఈ నాటి ఉత్తమ దేశ సేవ

మొదలగు వాటిని అవకాశములుగా తీసుకోనవలెను. చదువూ, వ్రాతా నేర్పడం ప్రధానమే అయినా వ్రాయడానికన్నా చదవడం నేర్పడమే ముఖ్యంగా కావలసినది. చదువు ద్వారా గ్రహించడం చేతనౌతుంది. విజ్ఞాన సాధక ప్రయత్నంగా దీనిని కొనసాగించవలెను. అక్షరాస్యతను కల్పించగల పుస్తకాలను అనుసరించడం ఉపయోగకరంగా ఉంటుంది. నిరక్షరాస్యతా నిర్మూలన ఈనాటి దేశసేవా కార్యము లన్నిటిలోకీ ఉత్తమమైనది. ప్రతి విదుషీమణీ స్త్రీలలో అక్షరాస్యతను కలిగించుట ద్వారా తెలుగు తల్లి సేవ చేసిననాడు తెలుగునాటు బంగారు పంటలు పండుతాయి! తెలుగువారి కలలు ఫలిస్తాయి!!

"నిఖిల సౌభ్రాత్ర భావానికీ<br>
దేశ కల్యాణానికీ<br>
మహాభ్యుదయానికీ—<br>
ఏకైక సాధనం—కేవలం విద్యాలయం<br>
విజ్ఞాన దేవాలయం"






## సంజదీపం

రచన : పూర్భా. కళాకేళీ ప్రచురణలు. వెల 1 రూపాయి.

ప్రతులకు కళాకేళీ ప్రచురణలు, సామర్లకోట.

జీవితంలో ప్రతిజీవికి ఏదో ఒక సమస్య ఉండి తీరుతుంది. ఆ సమస్యలు ఏ విధంగా, ఏ రూపంకాల్చి ఫలితాలు ఇస్తవి అనేది తరువాత విషయం. కొన్ని విషయాలలో ఒక వ్యక్తికి ఒక సమస్య ఉండవచ్చు. కాని దానికి ఫలితం వ్యతిరేకంగా పరిణమిస్తుంది. అటువంటి సమస్యలనే తన దృష్టిలో తీసికొని 'పూర్భా' "సంజదీపం" అనే శీర్షికక్రింద చక్కని కథలను వ్రాశారు. ప్రతికథ లోగడ కొన్ని పత్రికలలో ప్రచురింపబడినవే. మొత్తం 15 కథలు. ముఖ్యంగా, "సంజదీపం, మానస పుత్రుడు, తీయని వెన్నెలరేయి, పెళ్లిచేసిచూడు, క్రీనీడలు జీవితం, సానుభూతి, పిల్లనచ్చింది, జ్ఞానోదయం" అనే కథలు చక్కగా రచించారు.

'సంజదీపం'లో సామాన్య మధ్య తరగతి ఉద్యోగి నిత్యజీవితంలో ఇంటా, బయటా, అతన్ని ఎదుర్కొనే సమస్యలు చక్కగా ఉన్నాయి. తీయని వెన్నెలరేయి కథ వ్యంగ్యంగా ఉన్నది. నిరంజనం పంతులుకు మొదటి భార్య చనిపోతుంది. నలుగురు పిల్లలతండ్రి కాని తిరిగి వివాహమాడాలని ప్రకటనచేయటం, దాని సహాయంగా కమల బి.ఏ. అనే ఆమె అతనిని వివాహమాడటానికి సమ్మతించటం, వివాహానంతరం తీరాచూస్తే తమాషాగా నిరంజనం పంతులుకు ఉన్నట్లే కమలకు పిల్లలు ఉండటం, దీని ద్వారా ఇద్దరి సమస్య ఒక్కటే కావటం.

'పెళ్లిచేసి చూడు'లో న్యాయమే తన జీవిత లక్ష్యం అని గోపాలం పంతులు తను ఉద్యోగం చేసినంతకాలం దృష్టిలో పెట్టుకొని రిటైరయి చివరికి కూతురు పెళ్లి చేసేసరికి ఉన్నది కాస్తా కూతురి కట్నంక్రింద ధారపోసి ఏవిధంగా తను జీవితంలో అనుభవం సంపాదించింది, బాగా ఉన్నది. 'సానుభూతి'లో లలిత అమాయిక మనస్తత్వం, దాసరి పాటలంటే శ్రీతితో విని ఆనందించే ఆమె లేత మనస్సు, చిన్నపిల్లల్లో కల్గే చక్కని భావాలు, చివరికి ఆమె అన్నమాటలు, (అమ్మో! పాపం! రామ! రామ! అంటూ ఒక పిడికెడు బియ్యం తెచ్చివేస్తూ "మీనాన్నొస్తే ఇంకా బియ్యం యిస్తు" నంది) ఇవి ఎంతో వాస్తవికంగా ఉన్నవి.

'జ్ఞానోదయం'లో రచయితలకు ప్రచురణకర్తలు చేస్తున్న మోసం బహుచక్కగా రచించారు. 'దివ్యశ్రీ'కి జ్ఞానోదయ ప్రచురణల యజమాని చూపిన ప్రతిఫలం చక్కగా రచించారు.

మారుతి మృదంగం క్రొత్త భావాలతో ఉన్నత అభిప్రాయాలతో ఉన్నది. 'సంజదీపం' కల్పిత కథలైనా వాస్తవికతతో, చక్కగా ఉన్నవి.

* * *

## అమరజీవులు

రచయిత : శ్రీ నండూరి రామకృష్ణమాచార్య, ఎం. ఏ.

వెల రూ. 1-8-0.

ప్రతులకు : శ్రీ నండూరి రామకృష్ణమాచార్య. ఎం. ఏ. ప్రధానాంధ్రోపన్యాసకులు. కళాశాల. భీమవరము.

మానవ చరిత్రను ఒకసారి మనం తిరగవేసి చూస్తే

# గ్రంథ సమీక్ష

ప్రాచీనకాలంనుండి, ఈ నవయుగం వరకు ఏ విధంగా పరిణామం చెందిందో గ్రహించ కలుగుతాము. ప్రపంచ చరిత్రలో యుగానికి ఒక యుగ పురుషుడు ఉద్భవిస్తూనే వచ్చారు. ఈ యుగ పురుషులు మానవ జాతికి అపారమైన, ఉత్కృష్టమైన, ఉద్బోధలద్వారా అజ్ఞానంతో అణగారిపోతున్న మానవ సమాజాన్ని, సాంఘికంగా, రాజకీయంగా అనేక విధాల పైకి లేవనెత్తారు. అట్టి యుగ పురుషులలో బుద్ధుడు, ఏసుక్రీస్తు, గాంధీ మనదృష్టిలో కనపడతారు.

బుద్ధదేవుడు, క్రీస్తు, బాపూజీ ఈ ముగ్గురు శాంతి దూతలే. బుద్ధదేవుడు హింసా విధానాన్ని రూపుమాపి, అహింసా సిద్ధాంతాన్ని ప్రచారం చేశారు. క్రీస్తు, మత దృష్టిలో యూదుల రక్షకుడైనాడు. బాపూజీ, రాజకీయ సిద్ధాంతాలలో విప్లవమనే దానితో సమరం చేసి అహింసా సిద్ధాంతాన్నే తన జీవితాశయంగా భావించి దాని ద్వారానే అనేక సమస్యలలో విజయం పొందారు.

శ్రీ రామకృష్ణమాచార్యగారు రచించేటప్పుడు ఈ అమరజీవులు ఏ ఏ శతాబ్దాలకు చెందినది ఉదహరించలేదు. కేవలం వారి జీవితాలనే వ్రాశారు. దానికంటే ప్రతి ఒక్కరు ఏ సమస్యలలో ముఖ్యంగా తమ సిద్ధాంతాలను అమలు పరచింది, అనే విషయాలను విపులంగా విశదీకరించి వ్రాస్తే బాగుండేది. సాధారణంగా వీరి జీవితాలు ప్రజానీకానికి బాగా తెలిసినవి. జీవిత చరిత్రలకంటే వారి ఉద్బోధలు వ్రాసినట్లయితే చాలా బాగుండేది. ఒక్క గాంధీగారి జననకాలం ఉదహరించారు. ఈ ముగ్గురు అమర జీవులు అహింస అనే సిద్ధాంతాన్ని తమ జీవితాల్లో వారు చేసిన ప్రతి పనిలో అమలు జరుపుతూ జయం పొందకలిగారు.

జీవిత చరిత్రలకంటే వారి జీవిత ఆదర్శాలను, ధర్మాలను ముఖ్యంగా తీసికొని తెలుగు సాహిత్యంలో చక్కని గ్రంథాలు రచించి అందచేస్తే క్రొత్తదనం కనిపిస్తుంది. శ్రీ రామకృష్ణమాచార్యగారి అమరజీవులు చదువుటకు వీలుగా సులభశైలిలో వ్రాశారు. ఈ విధంగా మానవ చరిత్రలో మిగతా యుగపురుషుల ఆదర్శాలనుకూడా రచించాలని ఆశిద్దాం.

—జి. ప్రభ.



# ఆంధ్ర మహిళా సభ

## నర్సింగ్ హోమ్



జరుగుచున్న కట్టడము

ఈ భవనములో 10 మంది రోగులకు తగిన వసతి ఏర్పరుప వీలగును.

దీని ప్రక్కనే, ప్రసూతిశాల నిర్మాణమునకై ఏర్పాటు జరుగుచున్నది. ఇందులకై శ్రీ సెయితూరు జమీందారుగారు, తామిదివరలో నీయదలచిన 10,000 రూప్యములతోపాటు మరిమొక రూ. 5,000/- ఇచ్చుట కంగీకరించిరి. ఈ భవనము సెయితూర్ సేవక పాండ్య తేవర్ గారి పేర నిర్మింపబడును. ది. 18-5-1951 న దీనికి డాక్టరు పట్టాభి సీతారామయ్యగారు శంఖుస్థాపన జేసిరి.

శంఖుస్థాపన ఉత్సవమున పలువురు పెద్దలు సమావేశమై, ఆంధ్ర మహిళాసభ కృషిని ప్రశంసిస్తూ, తమ ఆశీస్సుల నొసగిరి.

ANDHRA MAHILA Regd. No. 4753.

5729/J.

# ఆంధ్ర మహిళా సభ

## మైలాపూరు - మద్రాసు

మహిళా విద్యాలయము :— హిందీ, కాశీ విశ్వవిద్యాలయపు ఎడ్మిషన్, స్కూలు ఫైనలు సర్టిఫికేట్ పరీక్షలు, సాహిత్యము, సంగీతము.

పారిశ్రామిక విద్యాలయము :— కుట్టు, ఎంబ్రాయిడరీ, తోలు అల్లికలు, నూలు వడకుట, చేనేత ఇత్యాది పరిశ్రమలలో గవర్నమెంటు పరీక్షలకు తగిన విద్యార్థినులకు ఉచితము.
(గవర్నమెంటువారిచే రికగ్నైజ్ చేయబడినది)

మెడికల్ ఇన్స్టిట్యూట్ :— స్త్రీలకు నర్సు, మంత్రసాని - గవర్నమెంటు పరీక్షలకు శిక్షణ.

మహిళా మందిరము :— స్త్రీవిద్యార్థినులకు వసతిగృహము.

ఆంధ్రమహిళ :— స్త్రీలలో విద్యావ్యాప్తికై, స్త్రీలచే నడుపబడుచున్న సచిత్ర మాసపత్రిక.

నిర్మలాదేవి గ్రంథాలయము :— సభ్యురాండ్ర, విద్యార్థినుల ఉపయోగార్థము సేకరించిన తెలుగు, హిందీ, ఆంగ్ల గ్రంథ సముదాయము.

నర్సింగ్ హోమ్ :— స్త్రీ, శిశువుల సంరక్షణశాల, ఉచిత వైద్యశాల — అడయారులో నిర్మింపబడుచున్నది.

క్రీడా, క్లబ్బుశాఖలు.

సభ్యురాండ్రుగా జేరి, యీ జాతీయ సంస్థను పోషించండి.

Edited and published by G. Durgabai, M.A., B.L., at the Andhra Mahila Sabha, Mylapore, Madras
Printed by M. Satyanarayana at the H. Prachar Press, 12, Thanikachalam Chetty Road, T'Nagar, Madras.



# కృతజ్ఞత

శ్రీ జున్ జున్‌వాలా, ఎం. పి., గారు ఆంధ్ర మహిళా సభ పారిశ్రామిక శాఖ కుట్టుపరికరాల నిమిత్తము రూ. 1000/- విరాళముగా నిచ్చిరి. ఒక కుట్టు మిషనూ, ఒక మేజోళ్లు తయారు చేసే మిషనూ, యీ విత్తముతో కొన వీలగుచున్నది.

శ్రీ మీర్జాపూరు జమీందారుగారు, పారిశ్రామిక విద్యాలయపు, పదిమంది బీద విద్యార్థినుల భోజన నిమిత్తము, మాసమునకు రూ. 200/- చొప్పున ఒక సంవత్సరపు ఖర్చును భరించుటకు అంగీకరించిరి.

శ్రీ ఘంటసాల బలరామయ్యగారు, మాసమునకు రూ. 20/- చొప్పున, ఒక విద్యార్థిని భోజన నిమిత్తము, గత జనవరినుండి విరాళముగా నిచ్చుచున్నారు.

ఐక్యరాష్ట్ర లెజిస్లేటివ్ కౌన్సిలు అధ్యక్షులైన శ్రీ చంద్రా బాల్జీగారు, సభను సందర్శించి, వారి అభిమాన సూచకముగా రూ. 25/- విరాళముగా నిచ్చిరి.

శ్రీమతి గుడివాడ జయప్రదగారు, శ్రీమతి మాణిక్యం రామస్వామిగారు, ఒక్కొక్కరు రూ. 100 ఇచ్చి, మహిళా సభ యావజ్జీవ సభ్యురాండ్రైరి.

పలు విధములుగా, మా సేవాసంస్థకు విరాళము లిచ్చి, మా కృషిని ప్రోత్సహించుచున్న పై పేర్కొన్న అందరికీ మా హృదయ పూర్వక కృతజ్ఞత.

ఆంధ్ర మహిళా సభ.

9

"ఆగస్టు న"

అన్ని ముఖ్య కేంద్రములలో విడుదల!

అంజలీదేవి...నాగేశ్వరరావు
సూర్యప్రభ...సి.యస్.ఆర్...శివరావు
రేలంగి...గిరిజ...సి.వరలక్ష్మి...రామ్మూర్తి
సీతారామ్...సదాశివరావు
అన్నపూర్ణ...విజయలక్ష్మి
నటించిన

...వినోదా వారి...

# స్త్రీ సాహసము

...దర్శకత్వం...
వేదాంతం రాఘవయ్య

...రచన, పర్యవేక్షణ...
సముద్రాల

...సంగీతం...
సుబ్బరామన్

...కళ...
వాలి. గోడగాంకర్

...ఛాయాగ్రహణం...
బి.యస్. రంగా



CH. E. PRASAD

MATA

| ఆంధ్ర, సీడెడ్, నైజాం | మైసూర్ |
| --- | --- |
| పూర్ణా రిలీజు | అమృత్ పిక్చర్స్ |

* వాడి వాడి వాడి *

* వాడి వాడి వాడి *




# అమృతాంజనము

గాని,

" యథాయథా.... .... .... ....కాళీధవళత్వ శంకయా."

అమృతాంజనమా ! నీ కీర్తి ముల్లోకములను దెల్పుజేయు ఫూనికతో పెరుఁగుచున్నప్పుడెల్లను, నా నల్లని ముంగురులు, దెల్లబడునేమోయను భయముచే నా హృదయము మిక్కిలి పరితాపమొందుచున్నది సుమా !!!



## ఎదిగే పిల్లల సంక్షేమానికి అతి ప్రధానం

పిల్లలు చురుకుగా, పుష్టికరంగా ఎదుగుటకు విటోఫెర్రిన్ సాటిలేని సాధకం. రక్తక్షీణత, విటమిన్ లోపం, అన్ని రకాల నీరసాలతో బాధపడు వారికి ఇది మంచి టానిక్‌గా పనిచేస్తుంది.



# విటోఫెర్రిన్

ఉత్పత్తిదారులు :

ది మైసూర్ ఇండస్ట్రియల్ & టెస్టింగ్ లాబరేటరీ లిమిటెడ్; మల్లేశ్వరం, బెంగుళూరు.

సెల్లింగ్ ఏజెంట్లు :

బెస్ట్ అండ్ కంపెనీ లిమిటెడ్; పోస్ట్ బాక్స్ నం. 63, మద్రాసు.

BZ—36.

**పసిపిల్లలకు వరప్రసాదిని**

పిల్లల లివరు, స్ప్లీను వ్యాధులకు

**జమ్మివారి**

# లివర్‌క్యూర్

కెమిస్టులందరివద్దను దొరకును.

2 రకముల ఔషధములు-

(1) వ్యాధి ముదరని సాధారణరుగ్మతలకు

(2) ప్రమాదకరమైన లక్షణములు కలిగిన కఠినమైన వ్యాధులకు

జమ్మి వెంకటరమణయ్య & సన్సు హెడ్ ఆఫీసు మైలాపూరు మద్రాసు.

ఆంధ్ర మహిళా సభలో

# రంగు వేయుట, అద్దకపు పనులలో శిక్షణ

ఆగష్టు 1-వ తేదీనుండి, భారత ప్రభుత్వ కార్మికశాఖవారు, మహిళా సభ పరిముఖంగా, గుడ్డలకు రంగు వేయుట, అద్దకపు పనులలో శిక్షణ నిచ్చే తరగతిని స్త్రీలకై ప్రారంభించారు. ఈ తరగతులు ప్రస్తుతము, 14, ద్వారక, మైలాపూరులో జరుగుచున్నవి. ఈ శిక్షణ 12 మాసములు జరుగును.

ఇందులో, బ్లాకుల అద్దకమేగాక, స్క్రీన్ ప్రింటింగ్ మొదలైనవి, నవీనపద్ధతులు పరికరాలను ఉపయోగించే విధానంలో నేర్పబడును.

ఇందు ప్రవేశమును కోరు యోగ్యతలు

(1) నాల్గవ ఫారము చదివినవారు

(2) 18 ఏండ్లకు తగ్గని, 25 ఏండ్లకు మించని వయస్సుగలవారు

అయి ఉండి, 10 రూపాయలు ధరావత్తు కట్టవలెను. జేరిన తరువాత, మధ్యలో ఏ కారణముచేత మానివాసరే, ప్రభుత్వము ఆ విద్యార్థిపైన వెచ్చించిన మొత్తము అంతా వసూలు చేయబడును.

బీద విద్యార్థినులకు మాసమునకు రూ. 25/- ప్రభుత్వ విద్యార్థి వేతనము యీయబడును.

ఆగష్టు 15-వ తేదీవరకు అడ్మిషన్లు జరుగును.

కరెస్పాండెంటు

ఆంధ్ర మహిళా సభ పారిశ్రామిక శాఖ.

---

# ఆంధ్రమహిళ

సంపుటి 8 :: ఆగస్టు '51 :: సంచిక 4



సంపాదకురాలు : శ్రీమతి దుర్గాబాయి, యం. యే., బి. యల్.

సహసంపాదకురాలు : శ్రీమతి చన్నఘంటమ్మ, యం. యే. యల్. టి.

ఆంధ్ర మహిళా సభ, మైలాపూర్

సంవత్సర చందా — ఆరు రూపాయలు



సంపుటి 8 ఆగస్టు 1951 సంచిక 4

# సమాన వేతనాలు

స్త్రీ పురుషులకు సమాన వేతనాలు వుండాలన్న ప్రతిపాదనను అంతర్జాతీయ కార్మిక సంస్థ సూత్రప్రాయంగా అంగీకరించగానే భారత ప్రతినిధికి మనసులో తుపాను రేగింది. చూస్తూ చూస్తూ ఇటు స్త్రీలకు పురుషసింహాలతో సరిసమానంగా జీతాలు ఇవ్వమనటానికి ఆయనకు మనసు ఒప్పకపోగా, అటు బొత్తిగా పనికి రాదంటే నాగరికతకు భంగం వస్తుందేమోననే సమస్య, పచ్చి వెలక్కాయ గొంతున పడ్డట్టు పెద్ద చిక్కే తెచ్చిపెట్టింది. మరి యీ పరిస్థితులలో చేయ గలిగినది లేక భగవంతునిపై భారమువేసి తటస్థంగా ఊరుకోక తప్పింది గాదు. ఐతే భగవంతునికి తన బిడ్డలందఱియందుగల సమాన దృష్టిని అంతర్జాతీయ సమితిపై ప్రసరించేటప్పటికి, సమితి ప్రతిపాదనను అంగీకరించకా తప్పింది కాదు.

పురుషులతో సమాన వేతనాలు పుచ్చుకోటానికి స్త్రీలు ఎందువల్ల అర్హులు కారో! ఒక వేళ తెలివితేటలు తక్కువా? స్కూళ్లలో, కాలేజీలలో రికార్డులు చూస్తే, సగటున ఆడపిల్లలే ఎక్కువ మార్కులు తెచ్చుకుని పరీక్షలలో నెగ్గుతున్నారు. ప్రపంచ జ్ఞానం తక్కువా? ఉద్యోగంలో నియమించేముందు పురుషులతోపాటు పోటీ పరీక్ష పెట్టి అందులో నెగ్గినవారినే ఏరుకోవచ్చు—అనుభవజ్ఞానము తక్కువా? కాలేజీనుండి క్రొత్తగా డిగ్రీ పుచ్చుకున్న ఏ వ్యక్తికి మాత్రము అనుభవజ్ఞానముంటూ ఉంది గనుక! పనిలో ప్రవేశించాక, వ్యక్తిగత చాకచక్యాన్నిబట్టి అనుభవజ్ఞానాన్ని ఆర్జించుకుంటారు. నిర్వహణ దక్షతలు, వగైరాల విషయం ఆలోచిస్తే, స్త్రీలచే నిర్వహింపబడే ఏ సంస్థ, ఏ ఉద్యోగము, పురుషుల నిర్వహణకు తీసిపోతున్నది?

# సమాన వేతనాలు

ఇంత శరీరబలం చాలదని యేమో! ఎండనక, వాననక, మోకాటినీళ్ల మురుగుల్లో ఊడ్పులు, కోతలు, దంపులలో, ధాన్యపు మరల్లో, కర్మాగారాలలో, గనులలో, స్త్రీలు వేనవేలుగా బరువు పనులు పురుషులతో సమానంగా చేయటం లేదూ? కుంచెడు బియ్యపుకుండ అమాంతంగా వార్చి వేయగల బలం, కుదురుగా కుర్చీలో కూర్చుని లెక్కలు వ్రాసే గుమాస్తా గిరికి చాలకపోతుందా? వంచిన నడుము ఎత్తకుండానే, నల్గురు బిడ్డలకు నలుగులు పెట్టి, స్నానాలు చేయించి, చమటలు కార్చేశక్తి, నాజూకుగా కాగితము చదివీచదవకుండానే సంతకాలు పెట్టే మేనేజరు పదవికి చాలకపోతుందా? కుండ మీద కుండ పేర్చి, భావినుండో, చెఱువునుండో, ఇంటికి సరిపడ్డ 20 హండాల నీరు జారపోసేశక్తి, గొట్టంకొన చెవులో పెట్టుకొని, మనుష్యుల ఆరోగ్యానారోగ్యాలు పరిశీలించే డాక్టరు గిరికి చాలకపోతుందా? ప్లీడర్లు, టీచర్లు, నర్సులు, బ్యాంకు ఉద్యోగాలు, ఇలాంటివాట్లలో దేనికి మాత్రం కండరబలం కావాలి? నిజంగా కండర బలం కావలసిన రాళ్ల మోతల్లో, తక్కువ కూలి అనే కారణంవల్ల, ఎక్కువమంది స్త్రీలనేగా యజమానులు నియమించేది? ఈ విధంగా పురుషులతో సమానంగా పనిచేయించుకుంటూ, స్త్రీలకు వేతనాలు మాత్రం తక్కువ యియ్యటం అధర్మం కాదూ!

నిజానికి వస్తే, జరుగుబాటున్న ఏ స్త్రీ ఉద్యోగం కావాలంటుంది? చక్కగా భర్త సంపాదించి పోస్తుంటే, కడుపులో చల్ల కదలకుండా, సూర్యరశ్మి సోకకుండా, వాన చినుకు తాకకుండా, పిల్లా జల్లాతో కులాసాగా ఇల్లు సవరించుకోవాలని ఏ స్త్రీ మాత్రం ఆశించదు? దురదృష్టవశాత్తు అనేక అనివార్య కారణాలవల్ల, ఆర్జన అవసరమై, ఒక్కొక్కమారు తను పోషించవలసిన పిల్లలుగాని, ఇతర బంధువులుగాని ఉన్న పరిస్థితులలో, గత్యంతరము లేని స్త్రీలే, ఉద్యోగమును వాంఛిస్తారు. అట్టి స్త్రీలకు పురుషులతో సమానమైన ఆర్థిక బాధ్యతలున్నవి గనుక, సమానమైన ఉద్యోగ అవకాశము లేగాక, సమాన వేతనాలివ్వటం కూడా ధర్మం కాదని ఎవ్వరనగలరు? కొన్ని అసాధారణ పరిస్థితుల్లో మాత్రమే స్త్రీలు ఉద్యోగాన్ని కాంక్షిస్తారు గనుక, నిజానికి, పురుషులకన్న వీరికి మరో నాల్గు రూపాయలు ఎక్కువ యివ్వటమే ధర్మమేమో! పురుషుడు సంపాదించినా, స్త్రీ సంపాదించినా, కుటుంబ పోషణకుకాక మరెందుకు! అయినప్పుడు, పురుషునితో సమానముగా కష్టపడే స్త్రీకి, తక్కువ వేతనమివ్వటం ఏం న్యాయం?

పైగా, దేశసేవకు స్త్రీలు కావాలి, సంఘ ఉద్ధారణకు స్త్రీలు గావాలి, ఎన్నికల పోటీలలో ఓటు ఇవ్వటానికి స్త్రీలు కావాలి—అయితే ఉద్యోగాలలో స్త్రీలు లేకపోతేనే మంచిది, ఎన్నికలకు స్త్రీలు ఎక్కువగా నిల్వరాదు, కష్టపడి పని చేసినా స్త్రీలకు తగిన వేతనమీయరాదు—ఇదేనా న్యాయం!





# రాజకీయాలు

* గొల్లపూడి రామచంద్రరావు *

జూలై నెలలో జరిగిన సంఘటనలను చూస్తే, నాలుగు సం॥ల నుంచి నివురు కప్పినట్లున్న కాశ్మీర్ వివాదం మళ్లా భగ్గు మంటుందేమోననిపిస్తున్నది. కొండ జాతివాళ్ల పేరుతో కాశ్మీర్‌ను మింగివేద్దామనుకున్న పాకిస్థాన్, భారత సైన్యాలు అడ్డుపడేటప్పటికి ఆ పప్పులుడక్క, సొంత సేనలను పంపి చేతికి చిక్కినంతవరకూ ఆక్రమించు కున్నది. అంతర్జాతీయ వివాదాలను శాంతి యుతంగా, న్యాయంగా పరిష్కరిస్తామని పెద్ద పేరు పెట్టుకున్న ఐక్య. రాజ్యసమితి, దీనిని ఆక్షేపించటానికి బదులు హర్షించే టప్పటికి, మొత్తం కాశ్మీర్‌నే సైనికబలంతో ఆక్రమించాలన్న దుర్బుద్ధి పాకిస్థానుకు కలిగింది.

భారత సరిహద్దుల సమీపంలో పాకిస్థాన్ సేనలు విపరీతంగా జేర్చబడుతున్నవి. ఎంతో కాలంనుంచీ ఇండియా మీద ద్వేషప్రచారం జరుగుతున్నది. కాశ్మీర ముస్లింలను 'హిందూస్థాన్' అధికారంనుంచి విముక్తి చేయటం కోసం 'మతయుద్ధం' సాగించాలని ప్రచారం జరుగుతున్నది. దేశమంతటా యుద్ధోన్మాదాన్ని అధికారులే రెచ్చగొట్టుతున్నారు. ప్రధాని లియాకత్ అలీ స్వయంగా యుద్ధోన్మాదాన్ని పెచ్చరిల్లేట్లు చేస్తున్నారు. అస్సాం సరిహద్దుల్లో ఎవరికి చెందాలో ఇంకా నిర్ణయం జరగని మూడు గ్రామాలను పాకిస్థాన్ ఆక్రమించు కున్నది.

పాకిస్థాన్ ఇన్ని పనులనూ చేస్తూ, ఇండియా తన సరిహద్దుల్లో సేనను జేర్చి కయ్యానికి కాలు దువ్వు తున్నదని ప్రచారం మొదలు పెట్టింది. అయితే ఈ ప్రచారానికి మోసపోయే పిచ్చివాళ్లెవ్వరూలేరని అరబ్‌లీగ్ (7 అరబ్ రాజ్యాల సహకారంతో ఏర్పడ్డ అఖిల అరబ్ జాతీయ సంస్థ) కార్యదర్శి అజం పాషా స్పష్టం చేశారు. పాకిస్థాన్ మీద దాడి చెయ్యాలన్న ఆశయం ఇండియాకు ఉన్నదంటే తాను నమ్మలేననీ, పండిత నెహ్రూ అధ్యక్ష్యాన నడుస్తున్న ఆదేశం పొరుగు దేశాల మీద ఎప్పటికీ దాడి చేయదనీ, అజం పాషా జూలై 21వ తేదీన కైరోలో మాట్లాడుతూ స్పష్టపరి చారు. నిజంగా పాకిస్థాన్ శ్రేయస్సును కోరేవారిలో అరబ్ నాయకులు అగ్రగణ్యులని అంగీకరించక తప్పదు.

జాగ్రత్తగా గమనిస్తే పాకిస్థాన్ను ఎవరో సూత్ర ధారులు ఆడిస్తున్నట్లు తెలుస్తుంది. బ్రిటన్, అమెరికాలే పాకిస్థాన్‌కి ప్రోత్సహించి ఆడిస్తున్నవని జూన్ నెలలో పండిత నెహ్రూ చేసిన ఆరోపణను బలపరిచే సంగతులు కొన్ని ఇప్పుడు తెలుస్తున్నవి. అవిభక్త భారత దేశానికి కొంత కాలం సర్వసేనానిగా పని చేసినవాడూ, బ్రిటిష్ ముఖ్య సేనానుల్లో ఒకడూ అయిన ఫీల్డ్‌మార్షల్ ఆషిన్‌లెక్ వెనక పాకిస్థాన్ సర్వసేనానిగా ఉన్న జనరల్ గ్రేసీ నెలల తరబడిగా, పాకిస్థాన్ సైన్యాధి కారులతో మంత నాలు జరుపుతున్నారు. పాకిస్థాన్ సైనిక సన్నాహాలను వీరేనడిపిస్తున్నట్లు వార్తలు వస్తున్నవి. అందువల్ల ప్రధాని నెహ్రూ 16వ తేదీన బెంగళూరులో మాట్లాడుతూ పాకిస్థాన్‌లో బ్రిటిష్ సైనికోద్యోగుల చర్యలు చాల ఆందోళన కలిగిస్తున్నవని అన్నారు.

నెహ్రూ ప్రకటనకు బ్రిటిష్ అధికారులు గగ్గోలు పడ్డారు. ఆషిన్‌లెక్ ఉనికిని సమర్థించటం కోసం, తాడి చెట్టు ఎందుకు ఎక్కావంటే దూడమేత కోసం అన్నట్లుగా, ఆయన ఒక తివాచీల కంపెనీ పెట్టేందుకు వచ్చినట్లు ఒక ప్రకటన జరిగింది కాని ఈ కంపెనీ చివరకు అల్లా ఉద్దీన్ మాజిక్ తివాచీనిచేసి మొత్తం కాశ్మీరును మాయం చేస్తుం దేమోనని భయం వేస్తున్నది.

పాకిస్థాన్ యుద్ధ ప్రచారాల ఫలితంగా ఇండియా సిద్ధపరచిన రక్షణబలాలను వెనక్కు తప్పించి తనతో మాట్లాడేందుకు కరాచీ రమ్మని లియాకత్ ఆలీ భారత ప్రధానికి సూచించాడు. లియాకత్ ఆలీ కోరిక సబబుగానే ఉన్నదని బ్రిటిష్ ప్రముఖ పత్రిక టైమ్స్ సూచిస్తున్నది.

* * *

బ్రిటిష్ అధికారులు ఇండియాకు ద్రోహం చేయ తలపెట్టటం ఇది మొదటి సారికాదు. 1947 ఆగస్టులోనే గిల్గిట్ (ఉత్తర కాశ్మీర్) లో ఉన్న బ్రిటిష్ సైనికోద్యోగి మేజర్ బ్రౌన్ తిరుగుబాటుచేసి, పాకిస్థాన్ ప్రభుత్వాన్ని అక్కడికి ఆహ్వానించాడు. కాశ్మీర్ యుద్ధ శాఖాధిపతిగా ఉన్న బ్రిటిష్ ఉద్యోగి, కొండజాతుల దాడి నాటికి ఎక్కడి బలాల నక్కడ చెల్లాచెదరు చేసి ఉంచాడు. బ్రిటిష్ జాతీయుల వైఖరికి మరొక మచ్చుతునక సిడ్నీ కాటన్ వ్యవహారం. ఈ ప్రబుద్ధుడు నిజాముకు ఇండియా మీద యుద్ధం చేయటానికి విమానంలో ఆయుధాలను సప్లయి చేశాడు.

బ్రిటిష్ ప్రధాని అట్లీ, అమెరికా అధ్యక్షుడు ట్రూమన్ ఈ ఏడాది మొదట్లో పాకిస్థాన్‌తో, 'రాజీ' పడమని ఇండియాకు 'సూచన' చేశారు. దానిని పండిత నెహ్రూ నిరాకరించినప్పటి నుంచీ, ఆ రెండు దేశాలూ, పాకిస్థానుకు శివమెత్తిస్తున్నవి.

* * *

కొరియాలో యుద్ధ విరమణ సంప్రదింపులు జరుగుతూనే ఉన్నవి. 'కాలికివొదిలితే మెడకు, మెడకు వొదిలితే కాలికి' అన్నట్లుగా అమెరికన్ ప్రతినిధులు ఎన్నో ప్రతిబంధకాలు పెట్టినప్పటికీ, కమ్యూనిస్టులు ఇంతకు ముందెన్నడూ చూపించని ఓర్పుతో అన్నిటినీ సర్దుకుని వస్తున్నారు. కాని అసలు యుద్ధ విరమణ సరిహద్దు విషయంలోనే పెద్ద పేచీ వచ్చేట్లు కనిపిస్తున్నది.

కొరియా యుద్ధంవల్ల బ్రిటన్ మొదలైన దేశాల్లో అధికార పక్షాలకు మొహమాటపు పరిస్థితి ఏర్పడటమే కాక, అమెరికాలో కూడా కదలిక ప్రారంభమయింది. అచ్చగా నీగ్రోలం మాత్రమే ఉండే అమెరికన్ పటాలం ఒకటి కొరియాలో పోరాటంలో పాల్గొన్నది. దీని నిప్పుడు రద్దుచేయ బోతున్నామనీ, నీగ్రోలను విడిగా ఉంచటం కన్నా, తెల్లవాళ్లతో కలిపి ఉంచితేనే బాగా పోరాడ తారని తెలుసు కున్నామనీ అమెరికన్ సైన్యశాఖ జూలై 27న ప్రకటించింది. నీగ్రోలను చేరనివ్వని యూనివర్సిటీలు కూడా ఉన్న అమెరికాలో అధికారులకి ఈ చర్య తీసుకోవలసి వచ్చిందంటే, నీగ్రోలమీద కొరియా యుద్ధ ప్రభావం ఏమిటో అంతా ఊహించు కోవచ్చు.

* * *

మధ్య ప్రాచ్యరంగంలో బ్రిటన్ ఇబ్బందులు మరీ పెరిగిపోయినవి. పర్షియా నూనె సమస్య ఏమీ తేలకపోగా, వారికి అత్యంత ఆప్తమిత్రుడయిన జోర్డాన్ రాజు అబ్దుల్లా హత్య చేయబడ్డాడు. పాలస్తీనా యుద్ధంలో ఇతడు అక్రమంగా పాలస్తీనాలోని అరబ్ ప్రాంతాన్ని జోర్డాన్‌లో కలుపుకున్నాడు. ఆ ప్రాంతపు అరబ్బీ యువకుడొకడు ఇతడిని హత్యచేశాడు. ఆఫ్రికా రక్షణ సమావేశానికి రావలసిందని బ్రిటన్ పంపిన ఆహ్వానాన్ని ఈజిప్టు నిరాకరించింది. సూయజ్ నించి బ్రిటిష్ సేనలు వెళ్లేవరకూ బ్రిటన్‌తో సహకరించేది లేదని స్పష్టం చేసింది.

* * *

మన దేశంలో కాంగ్రెసు వ్యవహారాలు ఒక్క అడుగు కూడా ముందుకు సాగినట్టులేదు. కాంగ్రెసును బలపరచటం కోసం బెంగళూరులో జరిగిన అఖిలభారత కాంగ్రెసు సంఘ సమావేశంలో ప్రధాని నెహ్రూ కాంగ్రెసు కార్యవర్గాన్ని సవరించటం అవసరమని సూచించారు కాని, అధ్యక్షుడు టాండన్ ప్రతిఘటించటంతో ఆ ప్రయత్నాన్ని వొదులు కున్నారు. అందువల్ల బయటికి వెళ్లినవారు తిరిగీ రావలసిందని కాంగ్రెస్ సంఘం చేసిన ఆహ్వానం అటువంటివారిని రప్పించలేకపోయింది. అంతే కాదు—ఈ సమావేశంమీద ఆశలు పెట్టుకున్న రఫీ అహ్మద్ కిద్వాయ్ వంటివారు కాంగ్రెసునుంచి తొలిగిపోయినారుకూడా. కిద్వాయ్ రహదారి సౌకర్యాలశాఖ మంత్రి పదవికీ, ఆయన మిత్రుడు అజిత్ ప్రసాద్ జైన్ కాందిశీకులశాఖ మంత్రి పదవికీ రాజీనామా లిచ్చారు కాని, ప్రధాని కోరికమీద ఉపసంహరించు

(తరువాయి 14వ పేజీలో)

# ప్రస్తుత పరిస్థితులు

* అమ్ముడని గిరిజ *

### ప్రజా సేవకులు—పథకాలు :

ఈ రోజుల్లో ప్రజలు ఓంటిగా కష్టం వచ్చినట్లు, తనివి తీరా అనుభవిస్తున్నట్లా కరువు—అనారోగ్యం. వీటికి మాత్రం యే కంట్రోళ్లు, రేషనింగులు, పర్మిట్లు, కులతత్వ భేదాలు, పార్టీ పట్టింపులు లేనే లేవు. అంతా స్వేచ్ఛ. ఓపినంతవరకు అనుభవించవచ్చు. మామూలుగా సుఖం, సంతోషం, స్వేచ్ఛ యిటువంటివన్నీ ఏ నాటికయినా తరిగి పోతాయేమోనని భయపడతాము. కాని వీటి విషయంలో ఆ భయం పిసరంత కూడ అక్కరలేదు. ఎందుకల్ల నంటారా? దేశంలో ఒక్క వడ్లగింజయినా ఎక్కువ పండించే అవకాశాలు యిప్పట్లో కాదుగదా యింకో పది సంవత్సరాల వరకయినా లేవని నిక్కచ్చిగా చెప్పగలం. ఇంక బయటి నుంచి వచ్చిపడే ధాన్యం సంగతి చూతామంటే అమెరికా గోధుమల పుట్టి నట్టేట మునిగిపోయింది. పాకిస్తాన్ గోధుమలు దోవలోనే పుచ్చిపోయినవి. సయాం బియ్యం వొచ్చి కూడ ఆకాశాన ఎక్కికూర్చున్నయ్. అందువల్ల కరువు ఇప్పట్లో పొయ్యే సూచనలు బొత్తిగా లేవు. అసలు మనకు కరువు వుంటేనే మంచిది. 16 అవున్సుల బియ్యంనుంచి 6 అవున్సులకు వచ్చాం. అయినా బ్రతికే వున్నాం. రేపటి ఎలెక్షన్లలో వోటు యివ్వబోతున్నాం. అంటే కేవలం మనోసంకల్పముతో, దేశసేవ చేయాలన్న త్యాగబుద్ధితో జీవిస్తున్నామన్నమాట. కరువే లేకపోతే అబ్బిన ఈ సుగుణా లన్నీ మళ్ళీ తగ్గిపోతాయ్. అదీకాక నెలకు మూడు వానలు కురుస్తు, పాడీపంట సమృద్ధిగా వున్నవనుకోండి. అప్పుడది రామరాజ్య మవుతుంది. రామరాజ్య మనగానే ఖర దూషణాదులు, రావణ కుంభకర్ణులు, శూర్పణఖ దంపతులు అంతా జ్ఞాపకం వస్తారు. అంతకన్న రాముడి తమ్ముడు భరతన్న గారి రాజ్యమయితేనే మేలు. ఏదో సాక్షీగా నడుస్తుంది. పాము చావకుండ బడితె విరక్కుండ జీవచ్చవాలల్లే సురక్షితంగా వుండాలంటే కరువు తప్పనిసరిగా కావాలి.

ఇంక అనారోగ్యం సంగతి. అసలు ఇప్పట్లో దేశం అనారోగ్యంగా వుంటేనే మంచిది. ప్రపంచ ఆరోగ్య సమితివారు మనకు ఎంతో ఉపకారం చేయటానికి వీలుంటుంది. మనం ఎన్నో కొత్త జబ్బుల పేర్లు, కొత్త మందుల పేర్లు తెలుసుకోవచ్చు. గొప్ప గొప్ప ప్రపంచ వైద్యులతో కలిసి పని చేయవచ్చు. ఇంతకన్న ఏం కావాలి? ఇంకో ముఖ్య విషయం ఏమిటంటే మనం ఇంగ్లండు అమెరికాల నుంచి కాలేకవథాయిలు, మాట్రు, ఇంజక్షన్లు, మందులు, శస్త్రకారుల్లు, పుస్తకాలు ఉచితంగా కొంటేనేతప్ప వాళ్లు మనకు అండగా వుండరు. వాళ్లు ఓహో అనకపోతే మరి మోక్షమే లేదు. అందువల్ల ప్రజలు అనారోగ్యంగా వుండటం దేశానికి ఎంత అవసరంగావుందో చూశారా? ఇంతే కాదు. ఇంకో చిన్న కిటుకు కూడ వున్నది. ఆరోగ్యం ఇంతింత మాత్రంగా వుంటేనే యీ 6 అవున్సుల బియ్యం చాలటం లేదని గోడవగా వున్నది. ఇంక అందరు ఏనుగులల్లే తిని, సత్తాలల్లే పూరించుకోగలిగితే యేమిటి చేయటం? బియ్యం వారానికి రెండు పూటలకే సరిపోతాయ్. అప్పుడు ప్రభుత్వం, ప్రజానాయకులు, ప్రజాసేవకులు ఎటువంటి సంధిగ్ధంలో వుండేవాళ్లో ఆలోచించుకోండి. నిజానికి వాళ్లు యిప్పుడు పడుతున్న ఆరాటం చూస్తేనే కష్టంగా వున్నది. మొన్న నీమధ్య దేశంలో వుండే నాయకులు, ప్రజాసేవకులు, అంతా కలిసి ఒక తీవ్ర శపథం చేశారు. వారానికి ఒకపూట పస్తు వుంటామని, ఆ వార బియ్యం తగ్గించి తీసుకుంటామని శపథం చేస్తూ సంతకాలు చేశారు. దేశం యావత్తు యీ విధంగా చేస్తే నూటికి 7 వంతులు ఆహారం కొరత తీరిపోతుందనికూడ వివరించారు. వీళ్లు సంతకాలు చేసిన కాయితం చూస్తే కణ్వాశ్రమ వర్ణన జ్ఞాపకం వస్తున్నది. ఆ ఆశ్రమంలో పులులు-మేకలు, సింహాలు-లేళ్లు అన్నీ సహవాసంగా వుండేవిట. అట్లాగే అన్ని పార్టీలవారు అన్ని కక్షల నాయకులు తమ తమ అభిప్రాయ భేదాలను దాచుకుని

యీ విషయంలో మాత్రం ఏకమైనారు. నెహ్రూ టాండన్ లకు లేని శక్తి ప్రస్తుత వుద్యమానికి వున్నదంటే నిజంగానే దాన్ని అభినందించాలి.

ప్రస్తుతం మన ప్రజాసేవకులు, నాయకులు సరి క్రొత్త రాజకీయాల్లో ప్రవేశిస్తూ, పార్టీల నిర్మాణంలో, క్రొత్త పథకాల సృష్టిలో, వచ్చే ఎలెక్షన్ల ఆరాటంలో వున్నారు. తిన్నచోట తినక, వున్నచోట వుండక తిరిగి పనిచేస్తు వుండటాన యింటిదగ్గర వాళ్లకిచ్చే రేషను వాళ్లకు ఎన్ని పూటలకు సరిపోతున్నదీ అంతు పట్టలేదు. బహుశ వారానికి సరిపోతున్నదనుకుని, ఒకపూట పస్తుంటామని శపథం చేశారు. ప్రజలిదివరకే వారానికి రెండు పూటల పస్తుంటున్నారని తెలిస్తే ఒకపూట పస్తుండమని యెందుకు బోధిస్తారు? చేసిన శపథం ఎటూ చేశారు కాబట్టి కాసిని నీళ్లు చల్లుకుని తూచ్ కొట్టుకుని వారానికి మూడు పూటలు వుపవాసముంటామని మళ్ళీశపథం చేస్తే సరి. ఒక స్టేజికి వచ్చిన తర్వాత తిండిమీద, వేషంమీద వ్యామోహం వదలాలి. మనసులో వుత్సాహం, పట్టుదల వుంటే మనిషికి తిండి దేనికి? ప్రజలకు యిప్పుడు ముందు కావలసింది వోటింగు హక్కు, ప్రాథమిక హక్కులు వగైరా అంతే.



(12వ పేజీ తరువాయి)

కున్నారు. ఈ విషయమై కాంగ్రెస్ అధ్యక్షుడికీ, పండిత నెహ్రూకీ సిద్ధాంతరాద్ధాంతాలు జరిగినవి. తుదకు కిద్వాయి రాజీనామా ఖాయమైంది.

* * *

అయితే బెంగుళూరు సభవల్ల ఒక్క నికరమయిన ఫలితం రావచ్చు. ఈ తడవ కాంగ్రెసు తరఫున ఎన్నికల్లో నిలిచే వారిలో ఎక్కువమంది ఉత్తమ శీలం కలవారు ఉండవచ్చు. అదే జరిగితే అవినీతి చాలవరకు తగ్గి, కాంగ్రెసు సంస్థపట్ల దేశంలో ఏర్పడ్డ తీవ్ర అసంతృప్తి, విముఖత కొంతవరకయినా తొలగవచ్చు. బెంగళూరు సభలో నాయకులు ఈ విషయమై హెచ్చరించటమేకాక, రాష్ట్ర కాంగ్రెసు అధ్యక్షులకు ప్రత్యేక సూచనలు చేశారు.

* * *

బెంగుళూరు సభ ఆంధ్రులకు చాలా ఆశాభంగం కలిగించినదని చెప్పాలి. విశాలాంధ్ర స్థాపనకు ముఖ్యమయిన హైదరాబాద్ విభజన విషయమై కాశీశ్వరరావుగారు ప్రస్తావించగా, నెహ్రూ తీవ్రంగా ప్రతిఘటించారు. ఆ విషయం ఎత్తితే అసలు ఆంధ్ర రాష్ట్రమే ఉండదని ప్రధాని మందలించారట. హైదరాబాద్ భవిష్యత్తును అక్కడివాళ్లే తీర్మానించుకోవాలినని, ఇతరులు అడగటానికి వీలులేదని కాంగ్రెస్ కార్యదర్శి వెంకట్రావుగారు సమర్థించారు కాని అది ఎవరిని సంతృప్తి పరిచిందో తెలియటం లేదు. హైదరాబాద్‌లో వివిధ వర్గాలకూ ఏ విషయం మీద నయినా ఏకాభిప్రాయం ఉన్నదంటే, అది సంస్థాన విభజన మీదే నన్న సంగతి జగద్విదితం.

అయితే తత్ప్రాంతీయులకు అంగీకారం కుదిరినవెంటనే సరిహద్దుసంఘం ఏర్పాటు చేయాలని కాంగ్రెస్ ఎన్నికల ప్రణాలిక చెపుతున్నది కనుక, మద్రాసుమీద "హక్కులు వదులుకుంటేనే ఆంధ్రరాష్ట్రమన్నటువంటి అవమానకరమయిన షరతులను పై అధికారులు ఇకముందు విధించరని ఆశిద్దాం.

ఎన్నికలప్రణాలిక స్త్రీల ప్రాధాన్యతను ఉద్ఘాటిస్తున్నది కనుక ముందుగా హిందూ న్యాయశాస్త్ర సవరణ బిల్లు ఆమోదించబడి, స్త్రీలకు ఆర్థిక స్తోమత లభించాలని ఆశిద్దాము.



# కథ, నాటిక

* వాడ్రేవు శ్రీ జోగిపంతులు *

శ్రీ కారంలో అంతస్స్యూతమైనవి—కథ, నాటిక. కథానిక, కథానకము, చిన్న కథ— కథకు వ్యవహరించే వివిధపదాలు—'స్కెచ్' లేదా 'గల్పిక.' కథకంటె చిన్నది మాత్రమే కాకుండా చిత్రణ విషయాలలో కూడా భేదం వున్నప్పటికీ స్థూల దృష్టితో కథల శీర్షికలోనికే తీసుకుని పోవచ్చు. ఈ 'గల్పిక' ల్లో క్లయిమాక్సు, అంటే క్లయిమాక్సులు చెప్పకుండా వ్రాసుకు పోతున్నారు. ఇటీవల మన సాహిత్యంలో ప్రవేశ పెట్టబడ్డ కొత్త విధానాల్లో ఇది ఒకటి. 'హితశ్రీ,' కొడవటిగంటి కుటుంబరావు, ఈ గల్పికలు వ్రాస్తున్నారు. వివిధ పాత్రల చిత్రణ సమగ్రంగా, విశిష్టంగా జరిగిన నాడు అట్టిదాన్ని 'నవల' అంటున్నాము.

'నాటిక' — 'ఏకాంకిక — 'ప్రహసనము'—ఈ మూడున్నూ కాల పరిమితిలో ఒకే ఒక సూత్రానికి బద్ధమై వుంటవి. నాటిక, ఏకాంకిక కేవలం ఒకేదాని పర్యాయ పదాలు—అది ఖచ్చితం! రెండిటిలోనూ దృశ్య విభజన సాదృశ్యమే. అయితే ఈ దృశ్య విభజన లేకుండా నాటిక వ్రాస్తారు కొందరు—వ్రాయనూ వచ్చు! కాగా, దృశ్య విభజనలో కొంత పరిమితి చూపబడాలి—ఇక ప్రహసనం—ఇది కూడా దృశ్య విభజన, కాల పరిమితులలో సాదృశ్యత కలదేకాని చిత్రణ విషయంలో వైచిత్రి వుంటుంది. ఒక విశిష్టత కనబడుతుంది. వక్రోక్తికంటె పరిహాసోక్తి ప్రాధాన్యత వహిస్తుంది—ప్రాధాన్యత మాత్రమే కాదు 'పరిహాసోక్తి యుక్తం ప్రహసనం' అని నిర్వచించుకున్నా అభ్యంతరం వుండదు సరికదా అది సత్యం, అవశ్యం కూడా! అయితే ఈ పరిహాసం విశ్వ జనీనతనందివుండాలి. శుద్ధ మోటుగానూ, పచ్చి బూతుగానూ వుంటే అది విజ్ఞులకు అసహ్యం కలిగిస్తుంది కాని హాస్యమూ, పరిహాసమూ మాత్రం కాదు. సుస్మితంగా వుండాలి రచన—మనసును నొప్పించేలా వుండరాదు—ఈ ప్రస్తావన కథా, నాటికల బాహ్య స్వరూప ప్రదర్శన మాత్రం.

పోతే తదితర సాహితీ విభాగాలన్నిటిలోనూ కథ, నాటిక బహుళ ప్రచారంలో వున్నాయి—బహుముఖ ప్రయోజనం సాధిస్తున్నాయి. ముఖ్యంగా కథలు విరివిగా ప్రచురింపబడడంతో అక్షరాస్యులయినప్పటికీ పెద్దపెద్ద గ్రంథాలను చదివి అర్థం చేసికోలేక నేర్చిన విజ్ఞానం కాస్తా కోల్పోతున్న వారికి పఠన పిపాస ప్రవృద్ధమైంది పాడిందే పాటగా పోతూన్న ప్రాచీన సాహిత్యం మీద మోజు తగ్గిన వారికి క్రొత్త కనబడింది. నిజానికి—కథలు పరోక్షంలో ప్రయోజన విద్యా ప్రచారానికి దోహద ప్రక్రియగా పరిణమించినయ్. అప్రయత్నంగా సిద్ధించిన ప్రయోజనం ఇది. అయితే నేడు కానవస్తున్న కథకులందరి వల్లా ఈ ప్రయోజనం సిద్ధించిందా అని నిలదీసి

అడిగితే నోరు నొక్కిపెట్టడం వినా మరేమీ చేయ లేరు. ఏమంటే నేటి కథకులు కొందరు అసభ్యకథల్ని సృష్టిస్తున్నారు. వీటివల్ల సర్వత్రా తలంచబడిన చేష్టలు కలుగకపోగా కీర్తి మూసుతున్నారు. ప్రపంచాన్ని అవినీతి వైపుకు, పశుత్వం దిశగా పరుగులు తీయించడానికి ఈ నాటి కొన్ని పత్రికలు అసభ్యపు కథల్ని సృష్టిస్తున్నాయి. జనత కళ్లు తెరుస్తోంది—చూసి చూసి ఒక్కసారిగా బుద్ధి చెపుతుందీ పత్రికలకు—అంతే తప్ప మీరూ నేనూ ఎంతగా శక్తి కొద్దీ మొత్తుకున్నా కలిగే ప్రయోజనం 'కుందేటి కొమ్ము' లాంటిదే!

నాటిక—సంఘంలోని దురాచారాలను, దుర్మార్గాలనూ—అవి జరుగుతూన్న రహస్య మార్గాలనూ, వాటికి పూర్వరంగంలో వ్యవహరిస్తూన్న పెద్ద మనుష్యులనూ బహిర్గతం చేసింది. ప్రహసనం—ఆచారాదికాలను సహేతుకంగా తృణీకరిస్తూ హేళనచేస్తూ వానిలోని అనర్థములను జనతకు ప్రదర్శించడంతో జనతా మనోనేత్రం విడి ఆచార సంప్రదాయ వినీల యవనికలు చిరిగిపోయి, జారిపోయి జీర్ణ విశీర్ణాలయినవి. సంస్కారావశ్యకతను గ్రామిక జనతకూడా గుర్తించగలిగింది. అందుకుగాను వారిని సమాయాత్తం చేసే భారం నాటిక తన పైన వేసుకొని నిర్వహిస్తూన్నది—కొంతవరకు కృతకృత్య కాగలిగింది. ఈ శీర్షికకు కారకుడు వీరేశలింగం పంతులే కావచ్చు. ఆ నాటి అవినీతినీ, దురాచారాలనూ తన ప్రహసనాలలో కడిగివేశారు.

ఆ యీ పునాదులపై పుట్టి సమాజ హిత ప్రయోజనాలను సాధిస్తూన్న నాటిక, కథ సాహిత్యంలో సుస్థిరస్థానాన్ని ఏర్పరచుకొన్నవి. ఇక వీని విషయమై జనత చాలినంత ప్రోత్సాహాన్ని ఇవ్వలేక పోతోన్నది. కొంతవరకు ఇందుకు కారణం నిరక్షరాస్యత—తరువాత అసభ్యకథల దిగుమతీ!

అయినా వాటి అపార ప్రయోజనాల దృష్ట్యా, అద్యతన భావిలో జనత—కథాకారులకు, నాటికా కర్తలకు సముచిత స్థానాన్నిచ్చి, సత్కరించి తమ మహోజ్జ్వల భవిష్యత్ పథ నిర్మాణం చేయించుకోవాల్సివుంది—





ఏకాంక నాటిక

* * *

# "సా పా సా"

* * *

జి. యస్. సూరి

( సా )

[మధుసూదనరావు ఇంటిలో ఒకనాటి మధ్యాహ్నం రెండు గంటలకు. కాఫీ తాగటం అప్పుడే పూర్తి అవుతుంది. ఆయన భార్య రాజ్యం ఖాళీ కప్పులను వంట ఇంటిలోకి తీసికొని వెళ్తుంది. మధుసూదనరావు షర్టూ పంట్లాములను తొడగటం ప్రారంభిస్తాడు. ఇంతలో రాజ్యం హాలులోకి తిరిగి వస్తుంది.]

రాజ్యం : అప్పుడే జీను తగిలిస్తున్నారు. ఎక్కడికి ప్రయాణం ?

మధు : అడిగావూ ? ఊఁ. ఇక పని అయినట్లే.

రాజ్యం : [నవ్వుతూ] అడిగినంతమాత్రాన ఆగిపోయే పని అదెంతదిలే. సత్కార్యం అయితే వెనుకా ముందూచూడ నవసరం లేదు. పోనీ తమరు నాకు కాస్తో కూస్తో శకున శాస్త్రం బోధించి ఉంటే ఇలాంటి పొరబాటు జరిగి ఉండేది కాదుగా.

మధు : ఇప్పుడు మించిపోయిందేమున్నదీ ? టూకీగా వల్లె వేస్తా విను. పురుష సింహం బయటికి వెళ్తున్నప్పుడు సివంగి, ఎక్కడికీ అని అడగకూడదు. ఆలస్యంగా ఇంటికి తిరిగి వచ్చినప్పుడు మీ కోసం పడిగాపులు పడి కూర్చున్నాను అని అనకూడదు. చికాకుతో పాత తుప్పుపట్టిన బ్లేడునో కొత్త కాలి జోళ్లనో విసుక్కున్నప్పుడు అత్త మీది కోపం దుత్తమీద ఎందుకూ అని గొణగ కూడదు. తెలిసిందా ? మిగతా సూత్రాలు తరువాయి సంచికలో.

రాజ్యం : మనుమహర్షులు మునుముందు ఋషులు. తమ దివ్య సూత్రాలు యథా తథంగా పఠించి, జపించి, కుంపట్లో హోమం చేస్తాను. నమస్తే గురూజీ.

మధు : మగవాళ్లకు బయటికి పోవటానికి అనేక కారణాలు ఉంటవి. అట్లా అడగవచ్చా చెప్పు రాజ్యం ?

రాజ్యం : అబ్బో ఏమి మగతనం ! ఉమ్మాయ్ జగ్గాయిలతో ఏదో సినిమా ప్రోగ్రామ్ ఉన్నట్లున్నది. అంతే కాదు మధూ ?

మధు : సర్కారువాళ్లకు ఆడపోలీసులు కావాలిట, అప్లయి చేయరాదూ ? స్త్రీ పత్తేదారుగారూ ! పప్పులో కాలు వేశారు.

[అంటూ కుర్చీ క్రింద పడుకున్న కుక్కపిల్ల తోక మీద కాలు వేస్తాడు. కుక్కపిల్ల కుయ్యోఁ మని అరుస్తుంది.]

రాజ్యం : [పకపక నవ్వుతూ] ఇతరుల కాలు ఎక్కడ వేసిందీ రిమార్కు చేసేముందు తమ కాలి విషయం కొంచెం చూచుకుంటే మంచిది మధూ. ఇంతకూ శెలవిచ్చారు కాదే తమ మహత్తర కార్యక్రమం ?

మధు : ఏదో జర్నలిస్టుగా అఘోరించే మా బోంట్లకు మహత్తర కార్యాలు ఏముంటయ్యో చెప్పు. అలాంటివి చేసినా చేయించినా మామయ్యకు చెల్లి పోతుంది. మావన్నీ ఛోటాఛోటా పనులు రాజ్యం. తెలిసిందా ?

రాజ్యం : ఆ తెలిసింది మీ ఇన్‌ఫీరియారిటీ కాంప్లెక్స్. ప్రతివానికీ మా నాన్న ఒకడు దొరుకుతాడు ఒంటికాలు మీద లేవటానికి.

మధు : అంటే జ్ఞాపకం వచ్చింది. మొన్న మీ అమ్మ వచ్చినప్పుడు ఏమిటీ ఒకళ్ల చెవులు ఒకరు కొరుక్కున్నారు? ఇద్దరు ఆడవాళ్లు చేరితే సరి, ఒకటే గుసగుసలు. మరి తాదృశాలాలు కలుసుకున్నప్పుడు చూడు ఎలా ఉంటారో.

రాజ్యం : ఎలా ఉంటారూ? కాఫీకప్పుల గలగలలు, సిగరెట్ల పొగలు, అమ్మలక్కల కబుర్లు, ఎవరెరుగరు? ఏదో గొప్పగా చెప్పకన్తారు. అమ్మా కూతుళ్లు మంచీ చెడ్డ అనుకుంటే ఆక్షేపణ!

మధు : ఆ రహస్యం నా పాపపు చెవులు వినకూడదు కామాలు పోనీలే...చూడు రాజ్యం. నా బనియనుల సైజు నీకేమైనా జ్ఞాపకం ఉన్నదీ? ముప్ఫయిరెండా, ముప్ఫయి నాలుగా, చెప్పు. తెచ్చుకోవాలి.

రాజ్యం : రెండు సైజులు ఎక్కువగానే ఉండ నివ్వండి. కాస్త చిరుబొజ్జ వచ్చినా చేసినా ఇబ్బంది ఉండదు.

మధు : ఏమోయ్ చిరుబొజ్జ అంటూ ముసిముసి నవ్వులు నవ్వుతున్నావు. సంగతేమిటో కొంచెం బయటికి రానియ్యి. స్వయం పాకం చేసుకుంటే సుఖం లేదు.

రాజ్యం : కొంచెం తగ్గవోయ్ మధూ. నాకు కోపం వస్తుంది. ఇంతకు నీవు బజారు వెళ్లేట్లయితే ఒక పౌను కాఫీ పొడి మాత్రం మరచిపోవద్దు. ఇక శీఘ్రంగా దయచెయ్యి.

మధు : మరేమీ అక్కరలేదూ? ముసుగులో గుద్దులాట ఎందుకు త్వరగా చెప్పు.

రాజ్యం : తెచ్చిపెట్ట దలచుకుంటే ఒక జాకెట్టుకు గుడ్డ తీసుకొనిరండి.

మధు : ఆఁ అదీ! అసలు జాబితా ఇప్పుడు బయలుదేరింది. ఇంకా ఏమిటి? మరి దాని కిందికి చీర?

రాజ్యం : అన్నట్లు సంవత్సరాది మూడు రోజులేగా ఉన్నది. ఇష్టమైతే ఒక నూలుచీర కూడ తెస్తే మంచిది.

మధు : అయితే చీర నూలుది అన్నావు; మరి జాకెట్టు సిల్కుదా?

రాజ్యం : సిల్కు ఎందుకులే. ఇంగ్లీష్ వాయిల్లో లేకపోతే ఆర్గండీలో తెస్తే చాలు.

మధు : పాపం. అవి చాలా చౌక అని కామూ! ఏ రంగులో కావాలి?

రాజ్యం : ఏ రంగు అయినా ప్లెయిన్‌గా ఉండేట్లు చూడు మధూ.

మధు : అవశ్యం. మరి కొలతలో.

రాజ్యం : చీరె ఆరు గజాలు. జాకెట్టు గుడ్డ ముప్పాతిక పన్నా అయితే గజం పాతిక కావాలి. గజం పన్నా అయితే గజం సరిపోతుంది.

మధు : గజం పాతిక పన్నా అయితే ముప్పాతిక. అంతే, కామూ?

రాజ్యం : చురుకుదనం అంటే ఇలా ఉండాలి. పాదరసం వంటి మనసు...మధూ, చీరెకు దీటుగా ఉండే కలరులో జాకెట్టు గుడ్డ తీసికో తెలిసిందా? కొట్ట వచ్చేట్లు ఉండే రంగులు వద్దు సుమా!

మధు : గుండె చెరువా? ఇక శెలవు పుచ్చుకుంటాను రాణీ సాహేబా.

రాజ్యం : [దొంగ తుమ్ము తుమ్మి, నవ్వుతూ] తక్షణం దయచెయ్యి.

మధు : ఊఁ. దుశ్శకునం దుశ్శకునేన సుశ్శకునం అన్నారులే! తలుపు వేసుకో.

( పా )

[ఆ రోజు సాయంత్రం 5 గంటలకు. రాజ్యం సోఫా మీద పడుకుని పత్రిక చదువుతూ ఉంటుంది.]

మధు : [తలుపు తట్టి] రాజ్యం! రాజ్యం.

రాజ్యం : వస్తున్నా మధూ, వస్తున్నాను. [లేచి వెళ్తుంది]

[తలుపు తీయగా మధు ప్రవేశించి పొట్లాలు బల్లమీద పెడతాడు]

మధు : [కుర్చీ లాగి] అమ్మయ్య. టీ వేడిగా ఉంటే కాస్త ఇవ్వు రాజ్యం.

రాజ్యం : ఇదుగో తెస్తున్నా. (Pause) పుచ్చుకో మధూ. అలసినట్లున్నావు పాపం.

మధు : [టీ త్రాగుతూ] చూడు రాజ్యం. కాఫీ పొడి పొట్లం పగిలినట్లుంది.

రాజ్యం : అంత దూరంనుంచి భద్రంగా మోసుకొనివచ్చి గభాలున బల్లమీద పడవేయకపోతే నెమ్మదిగా పెట్ట కూడదూ ?

మధు : చవిటి నుంచి వచ్చిన గాడిద మాదిరి ఇన్ని సరుకులు నేను మోసుకు వచ్చినప్పుడు, కాఫీపొడి కాస్త పాగు చేస్తే తప్పు లేదులే. అర్థాంగ లక్ష్మివి ఆ మాత్రం పంచుకోకపోతే ఎలాగు ?

రాజ్యం : ఇది చీర పొట్లం అనుకుంటాను. [కాగితాల చప్పుడు] ఆహా ! తమ సెలెక్షను మెచ్చుకుని తీరాలి. ఏమి సెలెక్షన్. ఈ పాలనాగమ్మ చీర తప్ప కంటికి ఏదీ దొరకలేదు కామాలు !

మధు : పాలనాగమ్మ చీరెగా ! భలేవానివి. ఇది మధు బాల చీర అయితేను.

రాజ్యం : కాదు మధూ. మధుబాల చీరకు మధ్యగా బార్డరు ఉంటుంది.

మధు : ఏమో. షాపువాడు చెప్పింది అది. నర్గీస్ చీర అని, సురయ చీర అని, అంజలి చీర అని ఒక లక్ష చూపించాడు. ఒక్కటీ నీ వంటి ఇల్లాలుకు తగినట్లుగా కనబడ లేదు.

రాజ్యం : ఈ మూసివాయనం చీర నచ్చింది కాదూ ? ఈలాంటి చీరను మొన్న మొన్నటిదాకా కట్టుకుని పని చేసేదానికి ఇవ్వటం ఎరగవు మధూ ?

మధు : నీ చీరెల దొంతరలలో ప్రతిదాని స్వీయ చరిత్ర నాకు గుర్తు ఎలా ఉంటుంది రాజ్యం ? నీకు తెలుసో తెలియదో గాని ఈ రంగు నీ వంటికి బాగా ఒప్పి ఉంటుంది.

రాజ్యం : చాలా సంతోషం. మీకైనా నచ్చితే అంతే చాలు.

మధు : పోనీ నచ్చకపోతే ఇది వాపసు ఇచ్చి మరొకటి తెస్తానులే దిగులు పడకు.

రాజ్యం : దీనికి తోక మరొకటి తయారవుతుంది ; ఎందుకంటే అనవసరపు కష్టం.

మధు : నీకు ఇష్టమైనదేదో స్పష్టంగా మొదట చెప్పి ఉంటే కష్టనిష్ఠూరాలు లేకపోయేవి.

రాజ్యం : ఇష్టం, స్పష్టం, కష్టం—మాటలు దొర్లించటంలో అగ్ర తాంబూలం పుచ్చుకుంటావు. ఇంతకూ జాకెట్టు మరచిపోలేదు గదా ?

మధు : మరచిపోవటమే ! అదిగో ఆ చిన్న సంచి. దాని వ్యవహారం కూడ తేల్చివెయ్యి.

రాజ్యం : [పొట్లం విప్పి] ఊఁ, శకున శాస్త్రంలో యథార్థత ఉన్నట్లే తోస్తుంది మధూ. క్రేప్‌షిఫాన్ గుడ్డ కొన్నా వెందుకని ?

మధు : అరే భగవాన్ ! ఇది కూడా అంతే !

రాజ్యం : నాజూకైన ఇంగ్లిష్ వాయిలుతో అర్గండీతో తెమ్మంటే బొంతలాంటిది దీనిని తేవటమేమిటి ?

మధు : చూడు రాజ్యం. నాకు ఇవ్వాళ ప్రత్యేకొతారం, అన్నీ అస్తావిస్తం అవుతున్నవి. ఆ షాపువాడు మోసం చేసి అంటకట్టాడు. పోనీలే.

రాజ్యం : ఏమి కలరో చూస్తేగా. ఆ చీరకు దీనికి తూర్పు పడమరలంత వ్యత్యాసం ఉన్నది.

మధు : ఆ చీరమీద కాంట్రాస్టుగా ఉంటుందని చెప్పాడు షాపువాడు. నన్నేమి చెయ్యమంటావ్ ?

రాజ్యం : వాడు చెప్పాడు వీడు చెప్పాడు అనకపోతే కాస్త బుర్రను ఉపయోగించ కూడదూ ?

మధు : తెలివి ఒకడి సొమ్మా చెప్పు రాజ్యం ?

రాజ్యం : ఊఁ. సరే గాని గజం పన్నాది గజం పాతిక తెచ్చారేం. గజం చాలయ్యా అని నెత్తిన నోరు పెట్టు కుని అరిస్తే.

మధు : నేను అంతే ఇవ్వమన్నాను. పఫ్‌స్లీవ్స్ కావాలా, చోళీ కావాలా అని షాపువాడు అడిగాడు. అదైతే లేడీ ఫ్యాషన్ అనుకుని పఫ్‌స్లీవ్స్ అన్నాను.

రాజ్యం : నేను పఫ్‌స్లీవ్స్ మానేసి ఎంత కాలం అయిందో తెలియదు మధూ ?

మధు : నేను చెప్పేది వినూ. అయినా గజం చాలు అని నిక్కచ్చిగా చెప్పాను. కాని వాడు ఇది సన్నటి వాళ్లకా కొంచెం బొద్దువాళ్లకా అని అడిగాడు.

రాజ్యం: లావాటి తనాబీకి అని చెప్పారు. అంతేనా ?

మధు : ఎబ్బే ! అలా చెప్పలేదు. ప్రస్తుతం సన్న వారు క్రిందనే లెక్క అని చెప్పాను. ఎటు బోయి ఎటు వచ్చిన కాస్తా ఎక్కువ ఉంటేనే మంచిదంటూ ఫర్రున చించాడు. ఇక ఏం చేసేది ?

రాజ్యం : వాడి ముఖాన కొట్టి రావలసింది. ఇంత చదువూ చదివి గుడ్డల షాపువాడిచేత మసి పూయించుకున్నావు సిగ్గుచేటు మధూ.

మధు: నీ భర్త ఇందులో సిగ్గుపడటానికి ఈషణ్మాత్రమూ లేదు. కాకపోతే ఒక పాతిక గజం మిగిలిపోతుంది. అంతేగా !

రాజ్యం : ఆ పేలికను చెరొక రోజూ మనం నెత్తికి చుట్టుకుందాములే. సరేనా ?

మధు : మనమెందుకోయ్ ? ఒక చిట్టితల్లి పుడితే...

రాజ్యం : మధూ నాకు కోపం తెప్పించకు.

మధు : పోనీలే. నేను చెడ్డీ కుట్టించుకుంటాను. ఏం ? అయినా రాజ్యం చిట్టితల్లి అంటే అంత ఉడికిపోతావేం ? భగవంతుడు కళ్లు మూస్తే...

రాజ్యం : మధూ ! నాతో మాట్లాడకు ఇక. [నిట్టూర్పు]

మధు : రాజ్యం ! రాజ్యం !

రాజ్యం : [మాట్లాడదు.]

( సా )

[అదే రాత్రి 8 గంటలకు. రాజ్యం మధుసూదనరావులు చెరిఒక పడక కుర్చీలో ఆసీనులై ఉంటారు. చెరిఒక పుస్తకం చదువుతున్నట్లు నటిస్తూ ఉంటారు.].

మధు : రాజ్యం. ఎనిమిది దాటింది. భోజనంచేస్తాం రావూ?

రాజ్యం : నాకు ఆకలి కావటంలేదు. మీరు పోయి తినండి.

మధు : అయితే నాకు ఆకలి కావటంలేదు.

రాజ్యం : నాతో పంతా ఏమిటి ? ఎవరికి కావాలిస్తే వాళ్లు తినాలిగాని.

మధు : పోనీ కాసిని పాలైనా తాగరాదూ ?...మాట్లాడవేం రాజ్యం.

రాజ్యం : నన్ను పలుకరించకుండా వుంటే నమస్కారం.

మధు : ఊఁ.

[బయటినుంచి కారు హారన్ ధ్వని. తరువాత తలుపు తట్టిన చప్పుడు]

చిట్టిపంతులు : [దూరంనుంచి] రాజ్యం ! రాజ్యం !

రాజ్యం : వస్తున్నా నాన్నా.

[తలుపుతీసి చిట్టి పంతులుతో తిరిగి ప్రవేశం]

చిట్టి : ఏమర్రా ! భోజనాలు అయినయ్యా ?

మధు : లేదు మామయ్యా నీవు రొట్టెతిని వచ్చావా ?

చిట్టి : ఆ. తినేబయలు దేరాను. ఏమమ్మా రాజ్యం! ఒక ఊరిలో వున్నా వారానికి ఒక్కసారి కూడా కనిపించవు ?

రాజ్యం : వస్తూనే ఉంటినిగా. మొన్న అమ్మ ఇక్కడికి వచ్చి వెళ్లటాన ఈ తడవ మాత్రం రాలేదు.

చిట్టి : ఇక వాడు సరేసరి. క్షణం తీరికా...

మధు : దమ్మిడీ ఆదా ఉండదు. రెక్కల మీద బ్రతికే వాళ్లం కాదుమరి ! కారు ఉన్నవాడివి కూతురూ అల్లుడూ ఎలా ఉన్నారో అని కాస్త చూచి పోగూడదూ ?

చిట్టి : పిల్లనిచ్చిన మేనమామ అంటే ప్రతివాడికీ అలుసురా. ఏమిటోయ్ నీవు చేస్తున్న అములూ ? పోయిన వారం పత్రిక కూడా బయటికి రొచ్చినట్లులేదు.

మధు : కాగితానికి కాటకం తగిలింది. బ్లాక్ మార్కెట్లు వాళ్లు చాలామంది నీ క్లయంట్లు కామాలు కొంచెం రాయితీగా ఏర్పాటుచేసి పెట్టరాదూ ?

చిట్టి : రేపు ఇంటికి రారా చూస్తాను. దానికేమి గాని ఇంకా తిండి తినకుండా కూర్చున్నారేం ?

మధు : మీ పుత్రికారత్నం ఏకాదశి ఉన్నది. తోక వెంబడి నారాయణా అని నేను డిటో.

రాజ్యం : నేను అసలేగా ఏక తినలేను నాన్నా. తక్కిన వాళ్లను తినొద్దని అన్నానా ?

మధు : తక్కిన వాళ్లకు కూడా మందంగా ఉన్నది మామయ్యా.

చిట్టి : ఏమర్రా! చిలి జగడం వేసుకున్నట్లు న్నారే! ఇంకా కస్త్రితనం వదలకపోతే ఎలా అంటు ?

మధు : జగడం ఏమీలేదు మామయ్యా. నేను ఇంతకూ ఈ రోజు బజారు వెళ్లకుండా వుంటే సరిపోయేది.

రాజ్యం : ఇంతకూ నేను బజారు వెళ్లేవాళ్లని అడ్డు తగిలి గుడ్డలు తెమ్మనకుండా ఉంటే సరిపోయేది.

మధు : చీరెల నాణ్యం నాకు కొంచెం తెలిసి ఉంటే బాగుండి పోయేది.

రాజ్యం : ఇంకొకళ్లను బ్రతిమాలకుండా నాకు కావలసినవి నేను వెళ్లి కొనుక్కున్నా బాగుండి పోయేది.

మధు : పాపు వాడి మాయలో పడి పనికిరానివన్నీ పట్టుకుని రాకుండా ఉంటే ఏ గొడవా ఉండేది కాదు.

రాజ్యం : తెచ్చిన సరుకును చూసి మెచ్చి మేకతోళ్లు కప్పితే ఏ గొడవా ఉండేది కాదు.

చిట్టి : ఇదా మీ వ్యవహారం. మంచి సరాగమే. రాజ్యం! ఏ గుడ్డ అయితే నేమమ్మా? నీవు ధరిస్తేనే దానికి అందం వస్తుంది.

రాజ్యం : అవి తెచ్చినందుకు నేనేమీ అనుకోలేదు నాన్నా. ఇదివరకు నేను కట్టికట్టి విసుకెత్తి పారవేసిన చీర లాంటిదే మళ్లీ ఎందుకు తేవటం అని అడిగితే ఆ పెద్ద మనిషి ఏమి సమాధానం చెప్పాడో తెలుసా ? నావన్న చీరెల దొంతరలలో ప్రతిదాని స్వీయ చరిత్ర తనకేమి గుర్తు ఉంటుందీ అని వెటకారం. దొంతర్లుట దొంతర్లు. తానేమో మహా కట్ట పెడుతున్నట్లు.

మధు : నీవు చెప్పు మామయ్యా నాకు ఎలా గుర్తు ఉంటుందో. తడవ కొక కొత్త చీర కొంటుంది. బుల బాటంపడి అమ్మలక్కలందరిముందూ మెరిపిస్తుంది. ఇంతలో ఏ పుల్లమ్మో అలాంటి చీర కొనగానే ఇక దాని ముఖం చూడదు. పని చేసేదానికి రవాణా.

రాజ్యం : తన కష్టార్జన తీసుకెళ్లి నేనేమీ దుబారా చేయ లేదుగా. మా అమ్మా నాన్నా ఇచ్చిన కొద్దో గొప్పో కూడబెట్టి నాకు నచ్చినవి కొనుక్కుంటాను. మోజు తీరిన తరువాత నా యిష్టం వచ్చినట్లు చేసుకుంటాను. తన కెందుకూ అంట.

మధు : విన్నావు గదూ ! అత్తయ్యా నీవూ చేసే గారాబం నా గొంతుకు చుట్టుకుంటున్నది. నేనేమి దొంతర్లు పోగు చేయలేదని వెక్కసుబడితే నేను ఏం చేస్తాను చెప్పు మామయ్యా.

చిట్టి : నీవు తెచ్చి తలకెత్తలేదని ఎవరన్నారు రా ? తెచ్చేది కలిగి ఉండి కొత్తరకం తెస్తే బాగుండేది అనుకున్నది గాని. అంతే కాదు రాజ్యం ?

రాజ్యం : అంతే నాన్నా. నేను ముందుగానే చెప్పాను. గజం పన్నా అయితే గజం సరిపోతుందని.

మధు : కాస్తముందు దృష్టి ఉంచుకుని ఒక పాతిక ఎక్కువ తెచ్చినమాట నిజమే మామయ్యా. అదే నా దోషం.

చిట్టి : ఈ ఆడవాళ్ల కొలతలతికమకలు మగ వాళ్లకు ఎలా తెలుస్తుంది చెప్పు రాజ్యం. నా పెళ్లి అయి యాభైయేళ్లు అవుతున్నా మీ అమ్మ రవికకు ఎంత గుడ్డ కావాలో నాకు ఇప్పటికీ తెలియదు.

రాజ్యం : ఎక్కువ తెచ్చినందుకు కాదు. మిగిలిన పీలికనుటా—

మధు : నేను చెడ్డీ కుట్టించు కుంటాలే అన్నాను. అదీ నా తప్పు. ఊరికే పోనియ్యటం కన్న ఇది మంచిగాదూ మామయ్యా ?

రాజ్యం : ఆమాట అని ఊరు కుంటేనా !

మధు : దేవుడి చలవన చిట్టితల్లి పుట్టితే బుజ్జిగౌను కుట్టుకో వచ్చు అనబోయినా మామయ్యా.

రాజ్యం : అదే అనవద్దన్నది. చిట్టితల్లిట! చిట్టితల్లి !

చిట్టి : పుట్టబోయేది చిట్టితల్లి అని ఎందుకు అనుకోవాలిరా ? చిట్టితండ్రి కాగూడదూ ? అంతేనా రాజ్యం ?

రాజ్యం : ఊఁ నాన్నా.

మధు : పుట్ట బోయేదీ! అయితే నా అనుమానం నిజమే! అదీ తప్పే ? అ అంటే తప్పు; ఊఁ అంటే తప్పు.

చిట్టి : ఏమమ్మా రాజ్యం ! వాడితో చెప్పలేదూ ?

రాజ్యం : చెప్ప కుండా ఉంటేనే గంతులూ శివాలు, ఇక చెపితే ?

మధు : అన్యాయం, అసమంజసం, అశాస్త్రీయం. సూత్రధారుడికి తెలియకుండానే సువార్త దేశమంతటా తెలియటం! శే, భగవాన్!

చిట్టి : దేశమంతటా తెలియటం ఏమిటిరా ? అది ఎవరితో అన్నదనీ ? మొన్న మీ అత్తయ్య వచ్చిమాటల సందర్భంలో గ్రహించి నా చెవిన వేసింది. దానికి మాత్రం ఏం తెలుసు పసికూన ?

మధు : అంతా పసికూనలే. నేనుమాత్రం ముసలి తాతయ్యను. అంతేను ?

చిట్టి : నీవు ఎందుకవుతావురా ? ముసలి తాతయ్యను కాబోయేది నేను. పిచ్చ కజ్జాలు మాని భోజనానికి లేవండి. లే, రాజ్యం, లే.

రాజ్యం : ఆయనగారిని ముందు లెమ్మనండి.

మధు : ఆ యమ్మగారినే ముందు లెమ్మనండి.

చిట్టి : ఇద్దరూ లేవండిరా ఒక్కసారి. త్వరగా భోజనం చేస్తే సినిమాకు తీసికెళ్లుతాను.

మధు : సాగర్‌లో మధుబాల ఫిలిం ఉన్నది చూదామా ?

రాజ్యం : స్టార్‌లో నర్గీస్ ఫిలిం ఉన్నది చూదామా ?

చిట్టి : మళ్లీ మొదలు. అంతా కుర్రతనం. కొంపలో పసివాళ్లు లేకపోతే వచ్చే గొడవే ఇది.

మధు : ఆ లోటు తీర్చివేస్తున్నాముగా. [నెమ్మదిగా] అమ్మ దొంగా! చెప్పకుండా దాచిపెట్టావు కదూ ?

రాజ్యం : ఎందుకు చెప్పాలేం? కొత్త చీర కట్టుకురానా సినిమాకు.

మధు : తప్పకుండా,

చిట్టి : కట్టుకో తల్లీ. పండగకు మీ ఇద్దరికీ కొత్త బట్టలు పెడుతానులే.

మధు : అంత తేలికగా తప్పుకోలేవేమో మామయ్యా.

రాజ్యం : చాల్లే మధూ. ఎప్పుడూ గుంజుదామనే ఆలోచన.

చిట్టి : అంతకంటే కావలసినది నాకేమున్నదమ్మా ? త్వరగా తినండి. తొమ్మిది కావస్తున్నది...వట్టి పిచ్చిబాగుల దంపతులు.

రాజ్యం, మధూ : పక పక నవ్వుతారు.

[తెర]



# కరుణ

* బులుసు జీ. ప్రకాష్ *

కన్నాడొక ఉన్నవాడు
నన్నతి దుఃఖాంబుధిలో
ఇచ్చాడొక రూపాయిని
మాటలేక మంతిలేక—
చచ్చేశాయా బాధలు
యిచ్చేశానా రూపాయ్
మ్రొక్కానతనికి మదిలో
ఒక్కసారి ఒంటరిగా—

కన్నాడొక లేనివాడు
మళ్లీ నను బాధల్లో
పరిచర్యలు చేశాడే!
తిండిపెట్టి రేబవళ్లు!—
ఇతనికేమి చేయగలను
చేసిందానికి ప్రతిగా—?
విత్తము కన్నా గొప్పది
కలదు సుమా! కరుణ సుమా!-



# —: ఆగ్రహానుగ్రహాలు :—

తాడికొండ రాధావసంత

[వెనుకటి సంచికలో ఉమాదేవి సేవాగ్రాంలోని కస్తూర్బా చికిత్సాలయానికి వైద్యురాలు. [illegible] విద్యా విధాన మహోపాధ్యాయ శిక్షణ కేంద్రానికి ప్రధానో పాధ్యాయుడైన [illegible] గారు కూడ వైద్యశాల వసతి గృహంలోనే ఉంటూ ఉమాదేవితో [illegible] భావం కలిగి వుంటుంది. ప్రేమించి, ప్రేమింపబడి, వివాహమాడ నున్న తరుణంలో, ప్రియునకూ తనకూ బాపూజీ ఆదర్శ విషయాల్లో వచ్చిన వాగ్వివాదం విషమించగా, తిరిగి ఎవరి దోవను వారు పోయిన తన జీవిత విషాదాన్ని గూర్చి ఒకనాడు ఉమాదేవి అబూబహీన్‌కు వివరించింది—ఇట్లా ఆగ్రహతప్తమైన మనస్సూ, ప్రేమార్ద్రితమైన హృదయమూ—ఈ రెంటికీ తన బ్రతుకు రణరంగముకాగా, ఉమాదేవి కస్తూర్బా వైద్యాలయం లో సేవా దీక్షను పూని యున్నది—అంతట........!]

౨

వరదా విద్యావిధానానికి ఆంధ్రనాయకుడు సేవా రామమూర్తి ప్రముఖాచార్యునిగా ప్రసిద్ధి పొందినాడు. ఆర్య నాయకంగారికి కుడిచేయేనట అతడు. బాపూజీ ఏలాంటి అనుమానం వచ్చినా అతన్ని అడిగవలసిందేనట. ఎం.లిట్. పరీక్షలో కృతార్థుడై ప్రభుత్వ కళాశాలలో ఆచార్యుడుగా ఉంటూ, ఏకారణం చేతనో ఉద్యోగానికి రాజీనామానిచ్చి మతిపోయినట్లు రెండేళ్లు దేశంఅంతా తిరిగి నాడు. ఆ వెనక సేవాగ్రామంవచ్చి మహాత్మాజీకి ప్రియ శిష్యుడయినాడు. బాపుజీ ఆదేశం ప్రకారం పంథొమ్మిది వందల నలభై, నలభైరెండు సంవత్సరాల సత్యాగ్రహోద్యమాలలో జైలుకు పోయినాడు. హరిజనసేవలో పేరుపొంది నాడు. ఆ వెనక వరదా విద్యావిధానంలో శిక్షపొంది, అదే తన జీవిత సర్వస్వంగా మలచుకొని, వరద సరస్వతినే భక్తితో ఆరాధిస్తూ, ఆ దేవికి అమూల్యమైన నూతనాభర ణాలు అనేకం సమర్పించుకున్నాడు.

వరద సరస్వతికి ‘ఖాదీ’ ఆధ్యాత్మిక రూపమైన చిహ్నమట. ఖాదీయే భారతీయ స్వరాజ్య సంపాదనానికి మూలకారణమైనదట. ఖాదీయే అహింసావ్రత రూపమట. ప్రపంచమంతా బట్టల మిల్లులతో నిండిఉన్న ఈ రోజు లలో, ఆ మిల్లులలోనుండి సర్వనాగరికతలూ పుణికి పుచ్చు కొన్న వస్త్రాలు ఉద్భవించే ఈ కాలంలో, ఆ వస్త్రాలపైన ఇచ్ఛ చంపుకొని, నూలు స్వయంగా వడికి నేసుకొని, కట్టుకొనే భావం మహాపురుషులు చేసే తపస్సు వంటిదట.

భారతదేశం వ్యవసాయదేశమట. ఎవరికయినా తిండి వ్యవసాయంలోనుండే ఉద్భవించాలికదా! వ్యవసాయం ఒక విశ్వమే! విద్య అంతా వ్యవసాయంలోనే ఇమిడి ఉందం టాడు సేవా రామమూర్తి. సర్వకళలూ అందులోనుండే ఉద్భవించాయట. వ్యవసాయంలోని ప్రతిభావమూ కళా పూర్ణమేనట. నేల సరిచేయడం, దున్నడం, విత్తుపెట్టడం, నీరు ప్రవహింపజేయడం, కలుపు తీయడం, పంట పచ్చగా పెరగటం, బంగారంలా పండడం, పంట పోగుచేయడం అన్నీ విద్యాపూర్ణాలట.

వరదా విద్యావిధానవేత్త అవడంచేత అనేక రాష్ట్ర ప్రభుత్వాలవారు సేవా రామమూర్తిగారిని పిలుస్తూ ఉంటారు. ఆయన ఆయారాష్ట్రాలకుపోయి, అక్కడ వరదా విద్యావిధానం అవిచ్ఛిన్నంగా జరిగేటట్లు చూస్తూ, ఆయా రాష్ట్ర నైజాన్ని పట్టీ, ప్రజాచారాలనుబట్టీ,

కావలసిన మార్పులను చేయ్యడానికి సలహాలిస్తూ సంచారం చేస్తూ ఉంటారు.

ఒక్క నిమేషం ఊరికే ఉండలేడు. ఎప్పుడూ రాట్నం వడుకుతూనే ఉంటాడు. నిద్ర తక్కువ. శిలాకులా ఉంటాడు. అంత చిన్నతనంలోనే జుట్టు నెరిసిపోయింది. కోలమోము. అంటకత్తిరివేసుకొని, పిలక ఉంచుకొన్న జుట్టు. తాను వడికి తానే నేసుకున్న ఖద్దరు అంగవస్త్రం కట్టుకుంటాడు. ఒక దుప్పటి పైన కప్పుకుంటాడు. నవ్వడం ఎరగడు. అతి శాంతంగా మాట్లాడుతాడు. ఆతనికి కోపం తెప్పించడం బ్రహ్మకైనా తరం కాదంటారు.

సేవా రామమూర్తిగారిని శివగాం వెళ్లి అనసూయాబాయి కశేండకర్ గారి బాలికా విద్యాకేంద్రం పరీక్షించి రావలసినదని ఆర్యనాయకంగారి ఆదేశమయినది.

ఆయన వస్తున్నాను, అని వ్రాసి అన్న రోజు శివగాం వచ్చారు. అనసూయాబాయి ఆయన్ను ప్రత్యుత్థానం చేసి ఆయనకు బస ఏర్పాటుచేసింది. స్నానాదికాలు నిర్వర్తించుకొని, శివగాం అంతా చూడటానికి బయలుదేరారు.

దేశంలో ఎన్నో రాష్ట్రాలలో దారిద్ర్యదేవత తాండవిస్తున్నది. గ్రామాలలో పరిశుభ్రము తక్కువ. ఒక గ్రామానికి మరొక గ్రామానికి సరియైన బాటలులేవు. పంటలు తక్కువ. వ్యవసాయవిధానము హీనంగా పాతపోకడలుగా వెడుతున్నది. గ్రామ పరిశ్రమలు కన్నీళ్లతుడుపు. ప్రజల ఆర్థికస్థితులు సరీగా గ్రహింపలేక అనేక బాధలు పడిపోతున్నారు. నూతనంగా సంపూర్ణ స్వరాజ్యం సంపాదించుకొన్న భరతదేశం సర్వతోముఖంగా వృద్ధిపొందాలంటే ఎన్ని కష్టాలకో లోనుకావలసి ఉంటుంది అనుకుంటూ, ఆ గ్రామంలోని కాంగ్రెసు నాయకునితో కలసి అనసూయాబాయి విద్యాకేంద్రానికి వెళ్లినాడు సేవా రామమూర్తి.

సేవా రామమూర్తి వస్తున్నారని ఉత్తరంవచ్చిన విషయం ఉమాదేవి దగ్గరకువెళ్లి అనసూయాబాయి చెప్పింది.

"ఎవరాయన? పేరు విన్నాను. కాని ఎప్పుడూ చూడలేదు అక్కా!"

"మీ ఆంధ్రదేశస్తుడే!"

"అదేమిపేరు ఆయనకు?"

"అసలుపేరు ఏదో ఉండటమ్మా! కాని తనకేదయినా పేరు ప్రసాదించమని మహాత్మాగాంధీజీని అడిగినారట! ఆయన నవ్వుతూ ఈపేరు పెట్టినారట! అప్పటినుండీ అదే నిలిచిపోయింది."

"అల్లాగా! వారు తప్పక మా కస్తూరిబా వైద్యాలయము, సరోజినీ రోగి నిలయము, కమలా శిశుపోషణ శాల అన్నీ చూడాలి. తప్పక తీసుకురా అక్కా!"

"తప్పక!"

౨

సేవా రామమూర్తిగారూ, అనసూయాబాయి ఆయన శివగాం వచ్చిన మరునాడుదయం కస్తూరిబా వైద్యాలయానికి వచ్చినారు. వైద్యాలయం అతిథి మందిరంలో ఇద్దరూ కూర్చుండి ఈ సంగతీ ఆ సంగతీ మాట్లాడుకుంటున్నారు.

ఆ సమయంలో డాక్టరు ఉమాదేవిగారు ఒక పురిటి కేసులో నిమగ్నురాలై ఉన్నది. పదిహేను నిముషాలు గడుచునప్పటికి కేరు కేరు మంటూ నూత్న శిశువు తన జన్మకు తానే నాంది పాడుతున్నది. అప్పటికి మూడు గంటలనుండీ ఉమాదేవి ఆకేసులో నిమగ్నురాలై ఉన్నది. పురుడు చాలా గడ్డుకేసయినా అతి మెలకువతో, కౌశల్యంతో, ప్రతిభతో, వైద్యం నడుపుతు రావడంవల్ల, మాతాశిశువులకు ఏవిధి ముప్పం రాకుండా పురుడు వచ్చింది.

ఉమాదేవి వైద్య చాతుర్యం అంతా వర్ణిస్తూ సేవా రామమూర్తిగారితో చెప్తున్నది.

"ఎవరీ ఉమాదేవి?"

"ఈమె మీ ఆంధ్రబాలికే! అసలుపేరు ఏదో ఉండట. "ఉమాదేవి" అని శ్రీ కొండా వెంకటప్పయ్య పంతులుగారు పెట్టారుట!"

"ఎవరూ? మా దేశభక్తుడే! ఎవరు చెప్మా ఈ అమ్మాయి? గుంటూరు జిల్లా!"

"కాదు గురువుగారూ! గోదావరి జిల్లా!

ఇంతలో ఉమాదేవి చేతులూ అవీ కడుక్కుని, వైద్యపు దుస్తులు మార్చుకొని, వీరిరువురూ కూర్చున్న హాలులోనికి

(తరువాయి 41వ పేజీలో)

మూలం : ఠాకూరు

# నది మెట్లు

అనుసరణ : విభావరి

గతదినాల విషాదగాథలు వినాలనుకుంటే, నా మెట్లపై కూర్చుని జలతరంగాలు వినిపించే కలస్వనాన్ని ఆలకించండి :

అప్పుడే ఆశ్వయుజ మాసం రాబోతున్నది. నది వరదలతో నిండివున్నది. నా నాలుగు మెట్లు మాత్రమే యింకా పైన వున్నై. నిర్మలంగా తీరం మీదుగా చెట్లుగా దిగజారి, ప్రక్కనున్న పల్లపుభూముల్లోని మామిడి తోపులు తడిసినయ్. మామిడి కొమ్మల క్రింద, కొమ్మలను అంటుతూ, గడ్డి దట్టంగా యేపుగా పెరిగింది. నదిమలుపులో మూడు యెత్తైన యిటుకరాళ్ల గుట్టలు సగంవరకు నీళ్లలో మునిగినయ్. నదీతీరపు ఘనవృక్ష మూలాలకి బంధింపబడివున్న చేపలు, పట్టునావలు సూర్యోదయపు నది పొంగులకి అలలమీద ఉయ్యాలల్లాగు అటూయిటూ వూగుతున్నై. సైకతతీరపు రెల్లు గడ్డిమీద సూర్యుని లేత కాంతులు అప్పుడే అందంగా పడుతున్నై. ఇంకా రెల్లు మొక్కల తలలమీద తెల్లటి పూలకుంచెలు నిండుగా పెరగలేదు. అప్పుడప్పుడే కొంచెంగా విచ్చిన పూలు గాలికి మెల్లగా కదులాడుతున్నయ్.

సూర్యుని తొలికాంతి ప్రతిఫలించే నదీ హృదయం మీదికి, చిన్నచిన్న పడవలు తెరచాపలెత్తుకొని బయలుదేరినయ్. స్త్రీలు బిందెలు తీసుకుని, నీళ్లకోసం నా రేవుకి వచ్చారు. ఇదే 'కుసుమ' కూడా నా మెట్లమీదికి స్నానానికి వచ్చే సమయం.

కాని యెందుకనో 'కుసుమ' ఆ రోజు స్నానానికి రాలేదు. ఆమె స్నేహితురాళ్లు భవన, స్వర్ణ—యిద్దరూ రేవులో కుసుమను గురించి మాట్లాడుకుంటూ—విచారిస్తున్నారు. వాళ్ల ప్రియస్నేహితురాలు 'కుసుమ' యెక్కడో యీ నదికి చాల దూరంలోవున్న అత్తగారింటికి వెళ్లిందట! నిత్యమూ తమతో కలిసి, ఉల్లాసంగా కబుర్లు చెప్పుకుంటూ, నవ్వుకుంటూ, ఆడుకుంటూ స్నానం చేసే నది మెట్లనీ, స్నేహితురాళ్లనీ విడిచి క్రొత్త మనుష్లలోకి, క్రొత్త ప్రదేశాల్లోకి, క్రొత్త యింటికి వెళ్లింది!

కాలం గడిచే కొద్దీ, ఆమె విగ్రహం నామనసు నుంచి తొలగి పోయింది. నా రేవులోకి నిత్యమూ స్నానానికి వచ్చే కుసుమ స్నేహితురాండ్రుకూడా కుసుమని గురించి పూర్తిగా మరిచి పోయారు. వాళ్లు యెన్నడూ యిక కుసుమను గూర్చి నా రేవులో మాట్లాడినట్లు నాకు వినిపించలేదు!

ఇంతలో ఒకరోజు సాయంకాలం మళ్లీ నా పాత స్నేహితురాలి మృదుపాదాలనుస్పర్శకి నామెట్ల మేనులు పులకించినై! యిప్పుడు 'కుసుమ' పాదాలకి పూర్వం వున్న మధుర సంగీతం లేదు! వట్టి బోడి పాదాలు; యే అలంకారమూ లేదు!

కుసుమ వితంతువైందని విన్నాను. ఆమె భర్త యేదో దూరదేశాల్లో పనిచేసేవాడట. కుసుమ అతన్ని ఏ వొకటి రెండుసార్లు కంటే యెక్కువ చూడలేదట. యింతలో తన భర్త మరణించాడని కుసుమకి ఒక వుత్తరం వచ్చింది. పట్టుమని యెనిమిదేళ్లు నిండామోలేదో కుసుమ పాపం వితంతువైంది! బొట్టూ, కాటుకా, గాజులూ విసర్జించి కన్నీళ్లతో మళ్లీ తిరిగి కన్నవారింటికి వచ్చింది! కుసుమ విచారవదనాన్ని చూచి, నాగుండె దుఃఖంతో పొంగులెత్తింది!

అప్పటికి ఆమె పూర్వ స్నేహితురాళ్లు 'భవన', 'స్వర్ణ,' 'విమల' వివాహాలై అత్తవారిండ్లకి వెళ్లారు. ఒక్క 'సరళ' మాత్రం వుంది; ఆమె కూడా రేపోమాపో పెళ్లై, అత్తవారింటికి పోబోతోంది.

గంగానది అనంత వర్షవాహినులతో అతిశీఘ్రకాలంలో గట్టులంత నిండినట్లు—కుసుమ కూడా కాలగమనంలో అనతికాలంలోనే, సంపూర్ణ సౌందర్య యౌవ్వనవతి అయింది! ఉత్సాహం యేనాడో నశించి, విచారం ఘనీభవించిన ఆమె దీన వదనము, కాంతి విహీనమైన, మాసిన ఆమె దుస్తులు—ఆమె యౌవ్వనం పురుషులకి కన్పించకుండా వాళ్లకళ్లకి ఒక పొగముసుగును కప్పింది. యేళ్లకియేళ్లు దొర్లిపోతున్నాయి, కాని 'కుసుమ' సంపూర్ణ యౌవ్వనాంగి అని యెవ్వరూ గుర్తించలేదు!

# నది మెట్లు

ఒకనాటి సుందర ప్రాభాతాన యెక్కడినుంచో సన్నటి దీర్ఘకాయుడైన సన్యాసి వొకడు వచ్చి నా కెదురుగావున్న శివాలయంలో నివసించటం ప్రారంభించాడు. అతని రాక గ్రామమంతా తెలిసింది. ఆడవాళ్లంతా తమ బిందెల్ని బైటపెట్టి, ఆలయంలోని సన్యాసి చుట్టూ గుమికూడే వారు.

జనం గుంపులు రోజురోజుకీ పెరగటం ప్రారంభించారు. సన్యాసి కీర్తి శ్రీ లోకంలో అతిశీఘ్రంగా వ్యాపించింది. రోజూ అతను యేదో వొక పవిత్ర గ్రంథపఠనం చేసేవాడు. ఒకరోజు వేదపారాయణమూ, మరోరోజు గీతా వ్యాఖ్యానమూ చేసేవాడు. అతని అమూల్య సలహాల కోసం, మంత్రాల కోసం, మందుల కోసం రకరకాలుగా జనం అతన్ని ఆశ్రయించేవాళ్లు.

యిలా కొన్ని మాసాలు గడిచినయ్. ఏప్రిల్లో ఒకనాడు సూర్యగ్రహణ సమయంలో గ్రామ గ్రామాలనుంచీ జనం గంగా స్నానానికి రాసాగారు. వాళ్లు స్నానాలు చేసి, సన్యాసి దర్శనం కోసం గుంపుగుంపులుగా పోతున్నారు. వాళ్లల్లో 'కుసుమ' అత్తవారి గ్రామం నుంచి వచ్చినవారు కూడా వున్నారు.

అప్పుడే సూర్యోదయమైంది. సన్యాసి నా మెట్లమీద కూర్చుని, చేతిలో జపమాలను త్రిప్పుతూ—రుద్రాక్షలు లెక్కిస్తూ జపం చేస్తున్నాడు. తీర్థస్నానానికి వచ్చిన ఒకామె ప్రక్క నున్నామెని మోచేత్తో పొడుస్తూ, గడ్డం క్రింద చేయిపెట్టుకుని సన్యాసిని ఆశ్చర్యంగా జూస్తూ—

"అతను కుసుమ భర్త కాదూ!" అన్నది.

మరొకామె తన ముసుగును తొలిగించి పరీక్షగా చూచి—

"వాడే! యింకా అనుమానమేమిటీ? మనవూరి చతర్గ చిన్న కొడుకూ!"—అన్నది.

"అదే ముక్కూ, అవే కళ్లు, అవే కనుబొమలూ!" అని మూడో ఆవిడ అనంగానే, చెంబుతో నీళ్లు ముంచు కుంటూ, అతని వంకచూడనైనా చూడకుండానే ఒక్క నిట్టూర్పు విడుస్తూ—"యింకా వాడెక్కడున్నాడు? వూరిక మన పిచ్చిగాని! వాడేనాడో పోయాడు. మళ్లా రావటం కల్ల!" అంది అతిజాలిగా.

'వాడికి యింత పెద్ద గడ్డమెక్కడిదీ?'

'వాడసలు యిలా సన్నగా పుల్లలాగుండేవాడా?'

'వాడింత పొడుగెక్కడిదీ?'—ఇలా నలుగురూ నాలుగు విధాలు చెప్పుకుని, చివరికి అతను కుసుమ మొగుడు కాదనే నిర్ణయానికి వచ్చారు. అంతటితో వాళ్ల సంభాషణ సద్దు అణిగింది.

ఒకనాటి సాయం సమయాన, పూర్ణచంద్రుని పసిడి కాంతులు నా హృదయంపై ప్రతిఫలిస్తున్నయ్. అప్పుడే కుసుమ వచ్చి, నా రేవులో యింకా నీళ్లపైకి మిగిలివున్న ఒక్క మెట్టుమీద ఏకాంతంగా కూర్చుని, నాలోకి తొంగి చూస్తోంది.

గిలకోళ్ల 'రుయ్యి, రుయ్యి' మనే కూతలతో వాతావరణం గంభీరంగా వున్నది. దేవాలయపు తుది ఘంటా నాదం ఆవలి తీరపు చెట్లగుంపుల చీకటి నీడల్లో కలిసి పోయింది. గంగానది వినిర్మల జలంలో వెన్నెల రేఖలు మెరుస్తున్నయ్. నాతీరము ప్రక్కనే, పొదల నీడలూ, దేవాలయ గోపురపు నీడలూ, తాటితోపుల నీడలూ దెయ్యాల్లాగు వ్యాపించినయ్. నక్కల భయంకరమైన కూతలు ఒక్కసారి లేచి, మళ్లీ క్రమంగా నిశ్శబ్దంలో కలిసి పోతున్నయ్.

అప్పుడే సన్యాసి పవిత్ర దేవాలయాన్నుండి ప్రశాంత వాతావరణంలో యేకాంతంగా నావైపు నడిచివచ్చి, నా మెట్లు కొన్ని దిగి, హఠాత్తుగా ప్రక్కనున్న 'కుసుమ'ను చూచి గిరున వెనక్కి తిరిగాడు. కుసుమ లేచి తలెత్తి అతని వెనకాలే చూచింది. ఒక్కసారి ఆమె మానసాకాశంలో పూర్వపు జ్ఞాపకాలేవో తటిల్లతలా తళుక్కున మెరిసినయ్! ఆమె యింకా అలాగే సన్యాసివైపు మరో లోకపు మధుర స్మృతులతో చూస్తోంది! ఆమె తలపై ముసుగుజారి, వెన్నెల కాంతులు ఆమె లేత చెక్కిళ్లపై మెత్తగా మెరిసినయ్!

ఓ గుడ్లగూబ వాళ్లిద్దరి నెత్తిమీదుగా కూస్తూ యెగిరింది. కుసుమ ఆకూత వినటంతోటే ఉలికిపడి, తన జారిన ముసుగును తిరిగి ముఖంపైకి సవరించుకుని, సన్యాసి పాదాలకి నమస్కరించింది.

సన్యాసి ఆమెని ఆశీర్వదించి, 'నీ పేరేమిటమ్మా ?'— అని ప్రశ్నించాడు.

'కుసుమ' అని ఆమె అతినెమ్మదిగా సమాధాన మిచ్చింది.

వాళ్ల సంభాషణ ఆ రాత్రి అంతటితోనే ఆగిపోయింది. కుసుమ నెమ్మదిగా సమీపంలోనే వున్న తన యింటికి వెళ్లింది. సన్యాసి మాత్రం అలాగే నా మెట్టుమీద కూర్చుని, చంద్రుడు ప్రాగ్దిశనుండి పశ్చిమానికి వచ్చేవరకూ నిశ్చలంగా ఆలోచించి ఆలోచించి, చివరికి తననీడ తన ముందుకు సాగటం చూచి, చాల ప్రొద్దుబోయిందని తెలిసి నెమ్మదిగా దేవాలయం వైపు నడిచివెళ్లాడు.

ఆరోజునుంచీ అనుదినం కుసుమ వచ్చి సన్యాసికి నమస్కరించేది. అతడు భగవద్గీతని పఠించేటప్పుడు దేవాలయపు స్తంభం చాటునే నిలబడి వినేది. ప్రాభాత పూజ అయిన తరువాత, అతను కుసుమకు మతమాహాత్మ్యాన్ని గురించి బోధించేవాడు. అది ఆమెకి అర్థం కాకపోయి నప్పటికీ, శ్రద్ధగా అర్థం చేసుకోటానికి ప్రయత్నించేది. అతని ఉపదేశానుసారంగా ఆమె నడిచేది. భగవత్పూజా విషయాల్లో ఆమె అత్యంత శ్రద్ధాభక్తులతో ఉండేది. ప్రతి ఉదయం పవిత్ర గంగా జలంతో ఆలయాన్ని శుభ్రం చేసి, దైవ పూజకి తోటలోని పుష్పాలను కోసితెచ్చేది.

శీతకాలం తుదిరోజుల్లో పడ్డది. యింకా చల్లగాలులు వీస్తూనే వున్నయ్. సాయంకాలాల్లో మాత్రం అప్పుడప్పుడు వసంతపు ఆనంద వాయువులు దక్షిణ దిశనుండి వీస్తున్నాయి. గ్రామంలో నుంచి కోలాహల సంగీతాలూ, ఫ్యాక్టరీల కూతలూ నెమ్మదిగా నా వైపు వచ్చి, మళ్లీ నిశ్శబ్దంలో లీనమౌతున్నయ్. నావికులు తమ నావలకు తెడ్లువేసే పని లేకుండా, ప్రవాహవేగంలో తెరచాపలెత్తి, ఆనందంతో పాటలు పాడుకుంటూ కూర్చున్నారు.

ఆ దేసమయంలో కుసుమ నా రేవుకిగాని, దేవాలయానికిగాని, సన్యాసి దగ్గరికిగాని రావటం మానేసింది. తరువాత కొన్నాళ్లవరకూ 'కుసుమ' వార్తలు నాకేమీ తెలియలేదు.

మళ్లీ ఒకనాడు కుసుమ—సన్యాసి యిద్దరూ అనుకోకుండా నా మెట్టుమీద వచ్చి కూర్చోవటం చూచి నా కాశ్చర్యం వేసింది!

కుసుమ లజ్జాభారంతో తలవంచుకుని నేలకేసి చూస్తూ—

"నన్ను పిలిపించారటగా, స్వామీ!"—అంది నెమ్మదిగా.

"ఔను, పిలిపించాను—యిన్నాళ్లనుండి దైవ ప్రార్థనకి రావటం మానేసిన కారణం తెలుసుకుందామని..."

ఆమె మౌనంగా నిలబడ్డది.

"నీ మనస్సులోని విషయ మేమిటో దాపరికం లేకుండా చెప్పమ్మా"

తనతలను ఒక ప్రక్కకిత్రిప్పి—

"నేను మహాపాపిని, స్వామీ! అందుకనే దైవ పూజను మానివేశాను!"

"కుసుమా! నీ హృదయంలో యేదో పెద్ద బాధ వున్నట్టున్నది."

ఆమె మనస్సు కొంచెం వణికింది. పైట చెరగును ముఖం మీదికిలాగి, సన్యాసి పాద సమీక్షంలో నా మెట్లమీద కూర్చుని యేడ్చింది—సన్యాసి కొంచెం జరిగి—

"అమ్మా నీ హృదయంలోని బాధయేమిటో చెప్పు, ఉపశమన విధానం చెబుతాను!"

గాఢ విశ్వాస పూరితమైన కంఠస్వరంతో అక్కడక్కడా మాటలకోసం కొంచెం తడబడుతూ చెప్పింది:

మీరు ఆజ్ఞాపిస్తున్నారు కనుక చెబుతున్నాను. కాని స్పష్టంగా వివరించలేను! అది మీ దివ్యశక్తితో మీరు వూహించవలసిన విషయం. నా హృదయంలో ఒకరిని

భక్తితో దైవసమానంగా పూజించాను. అతని మీది ప్రేమానందంతోటే నా హృదయమంతా నిండిపోయింది. ఒకనాడు స్వప్నంలో నాహృదయ ప్రియుడు నా దక్షిణ హస్తాన్ని తన వామహస్తంతో పట్టుకుని, నాచెవిలో యేవో ప్రేమ విషయాలు చెబుతున్నాడు. అదంతా నాకు ఎంతో సహజంగా తోచింది. కలకరిగి పోయింది గాని, ఆ స్వప్నానుభవం మాత్రం నా మనస్సుపై మాయని ముద్రల్ని వేసింది! మరునాడు అతన్ని చూచేసరికి, మరొక రూపంలో అగుపించాడు. ఆ స్వప్నదృశ్యం నన్నెప్పుడూ వెంటాడుతోంది! అతని విడి యెంతదూరం పారిపోదా మన్నాగాని, అతని దివ్యస్వరూపం నా మనోదర్పణంలో మనోహరకాంతులలో తేజరిల్లుతోంది! ఆ నా ప్రియుని సంప్రాప్తి కోసం నాహృదయం తహతహ లాడుతోంది!

ఆమె తన కథ చెబుతూ జలజల కారే కన్నీళ్లని తనపైట చెరగుతో తుడుచుకుంటోంది. ఆమె విచార వదనాన్ని చూచి, సన్యాసి తన కాలితో నా మెట్లని యే భావంతోనో గాని, గట్టిగా నొక్కుతున్నాడు. ఆమె తన కథ పూర్తి చేయగానే—

"నీవు స్వప్నంలో చూచిన వ్యక్తియెవరో, చెప్పు?" అని సన్యాసి ఆమెని ప్రశ్నించాడు.

"చెప్పలేను, స్వామీ!"

"నీవు తప్పక చెప్పాలి?" గట్టిగా అడిగాడు.

"తప్పదా? ప్రభూ!"—

"తప్పదు...ఊఁ కానీ..."

ఆమె ఒక్కసారి భోరున యేడుస్తూ,

"ఆ వ్యక్తి మీరే ప్రభూ!" అని నా మెట్లమీదపడి వెక్కి వెక్కి యేడ్చింది.

ఆమె స్మృతికివచ్చి, లేచి కూర్చున్న తరువాత—

"నేను యీరాత్రే యీ దేవాలయాన్ని విడిచి—నీకు మళ్లీ కనపడకుండా వెళ్లిపోతున్నాను. నేను సన్యాసి నని నీకు తెలీదూ?—యీ లోకంలో నా కెలాంటి సంబంధమూ లేదు! ఇక నన్ను మరిచిపో"—అని శాంతంగా సన్యాసి ఆమెకి చెప్పాడు.

"అలాగే కానీండి, ప్రభూ!"—అన్నది కుసుమ క్షీణ స్వరంతో.

సన్యాసి అక్కడనుండి బయలుదేరుతూ—

"కుసుమా, యిక శెలవు!" అన్నాడు.

కుసుమ అతని పాదరజాన్ని తీసి తన శిరస్సున ధరించింది. తరువాత సన్యాసి—అక్కడ నుండి వెళ్లిపోయాడు.

చంద్రుడు అస్తమించాడు; రాత్రి కాటుకలాగా నల్లనైంది. నాకు నీటిలో యెవరో అగపడ్డట్టు పెద్దధ్వని వినిపించింది. ఆకాశంలోని నక్షత్రాలని దులిపి వేయటానికా అన్నట్లు వాయువు ప్రచండ వేగంతో చీకటిని వణికిస్తూ వీచింది!



చెప్పేవారే కాని, చేసేవారు లేరు

# మా అమ్మాయి చదువుకుంటుంది

* శ్రీమతి గొల్లకోట కమలామణి *

ఆడుదానికి, అక్షర జ్ఞానముండడం, అమంగళకరమను కునే కాలంలో,—'మా అమ్మమ్మ భారతభాగవతాలు చదువుకుంది, మాకిప్పుడర్థం చెప్తుంది' అని చెప్పుకో గలగడం ఘనతగాని, అబ్బాయిలతోపాటు అమ్మాయిలంతా B. A., లూ M. A., లూ ప్యాసవాలనే యీ రోజుల్లో,— "మా అమ్మాయి చదువుకుంటుంది" అని గొప్ప చెప్పుకోవడం నగుబాటు మాటే. ఇంకా, ఆ చదువుతోపాటు, యేదైనా, అదనంగా నేర్చుకుంటుంది అని చెప్పుకో గలిగితే కొంత విశేషముంది. కాని అలా చెప్పబోయే సరికి, "అబ్బో యిలాటివి చాలా విన్నాం లే. ఎన్నో చెప్పేవారే కాని, చేసేవారు లేరు" అని యెంతోమంది నిస్సాకారంగా అనేస్తారని తెలుసు.

నిజమే. చెప్పేవారే కాని చేసేవారు లేరన్నదీ, కేవలం అబద్ధం కాదు. అలాగవడానికి, ప్రధాన బాధ్యత మన ప్రస్తుత సంఘందే. ఆయన తల్లి కడుపు చల్లగా ఈ మధ్య నొక మహానుభావుడన్నట్టు, "లోకం, ఏదైనా సరే. చెప్పినా సహిస్తుంది; చేసినా క్షమిస్తుంది. కాని, చెప్పి, చెప్పినంతా చేస్తేమాత్రం భరించనంటుంది." అని (మొదట్లోనే లెండి.) అందుచేత సంఘ దృక్పథంలో మార్పు ముందు కలిగితేనేగాని, చెప్పింది చెయ్యడానికి చాలా మంది సాహసించరు. మంచివని నమ్మినా,—ఎంత దృఢాభిప్రాయాలున్నా, బలవత్తరమైన సంఘానికి భయపడకుండా, ధీరత్వంతో నిలవడం మాటలా? కనుక, ఆలోచనాశక్తి గల ప్రతివాళ్లూ, తమకు తోచినది నిర్భయముగా చెప్పడమూ, విమర్శనా జ్ఞానంగల వాళ్లంతా విని, తలలు తాకట్టులోనించి విడిపించుకుని, తమకు తాము తర్కించుకుని, మంచిదని తోచితే, సాధ్యమైనంతవరకూ, ఆచరణలో పెట్టడం ప్రారంభమైతే, సంఘంలో మార్పు దానంతటదే తెలియకుండా వస్తుంది. చెప్పే, చేసేవారి సంఖ్య వద్దన్నా పెరుగుతుంది.

మా అమ్మమ్మ తరంనించీ కూడా, మా కుటుంబంలో అమ్మాయిల సంఖ్యే, యెక్కువవడంచేత కాబోలు,— వాళ్ల బ్రతుకు తెరువులు గురించి, బాగుపోగులను గురించి, కొంత ఆలోచించుకోవడం మా కలవాటయింది. వాళ్ల విద్యాభివృద్ధులను గురించి, నా కేర్పడిన కొన్ని అభిప్రాయా లిప్పుడు చెప్ప దలచుకున్నాను.

లోకమంతటా, యిప్పుడొక తీవ్ర సంచలన మారంభమయింది. ప్రతి వారికీ, ఏదో ఒక విద్య నేర్చి, స్వసంపాదన కలిగి జీవించాలనే, ఉత్తమాశయం, ప్రబల మౌతూంది. స్త్రీలలో కూడా, మగవారితో సమానం కావాలనే ఆశ, పెద్ద పెద్ద పరీక్షలు ప్యాసయితేనే వారితో సమానమై, ఉద్యోగాలు చేసి, ఉన్నతులగలమనే ఆశయమూ, గుబురుగా అలుముకున్నాయి. B. A., లూ, M. A., లూ ప్యాసవడం తప్పు లేదు. సమాన వ్యక్తిత్వం కలిగి, ఆర్థిక స్వాతంత్ర్యముతో, ఒకరికి బరువు గాకుండా బ్రతకాలనే కోరిక, ఆత్మ గౌరవముగల ప్రాణు లెవ్వరికీ, అసహజమూ గాదు. కాని, దానికిని, ఏ విధానం లాభకరమో, ఆగి ఆలోచించుకోకుండా, అందరూ ఒక్క దారినే పోవడం, పురుషులతో పోటీకి పోయి, వారు చేసినవే స్త్రీలు గూడా చేస్తేనే, సమానత్వం వస్తుందనుకోవడమూ, అవివేకం గాదూ? కాలానుగుణ్యంగా కలిగిన కోరికలను, పాత్రానుగుణ్యంగా ప్రోత్సహించి, పోషిస్తేనే సత్ఫలితాలు కలుగుతాయి. సౌఖ్యకరంగా పరిణమిస్తాయి.

అక్కడక్కడ, అసామాన్య వ్యక్తులున్నా గానీ,— సామాన్యంగా స్త్రీలకి, పురుషులకి సులువైన M. Sc., D. Sc., లూ, ఇంజనీరింగు యిత్యాదులు తలకు మించిన బరువు; తనువోర్వలేని భారం. నవనవలాడే ప్రాయములో, గుండెలెండిపోయి, తల తెల్లపడిపోయి, ప్రాణాలు కళ్లల్లోకి వచ్చేలాగా, అంత కష్టపడి నేర్చి, యికముందు బాలికలు

మాట గట్టుకునే మహాద్భాగ్యమూ, ఏమంతగా కనపడడం లేదు...“ముందు పుట్టినవాళ్లకే లేక, మూకుళ్లతో భిక్షానికి బయలుదేరుతూ వుంటే, సంతానం కోసం సాగరాల యాత్రకు వెళ్లే” రన్నట్టు, ఎంతెంతో చదివి, సిద్ధంగా వున్న మగవాళ్లకే, తగిన ఉద్యోగాలు లేక, నానా అవస్థ పడిపోతూ వుంటే, ఆ చదువులే, యింకా స్త్రీలు కూడా చదివి, పురుషులతో పోటీకి పోతే, నిరుద్యోగ సమస్య మరింత క్లిష్టమై పోవడమే గాని, నారీమణులంతా నోల్లుకో బోయే నవనిధు లేమిటి? ముందు వెనుకలు చూడకుండా, అందరూ M. A., లూ, యింకా స్థితిమంతులైతే M. L., లూగా, చిగురంటా పోవడంలో వచ్చే విశేషం లేదని, పెద్దలంతా యిప్పుడు గుర్తించి, మగపిల్లలను మెట్రిక్యులేషన్ దగ్గరనించీ వివిధ శాఖల లోకి పంపితేనే యెక్కువ వృద్ధిలోనికి వస్తారనుకుంటూ వుంటే, అమ్మాయిల కేది అనువైనదో కూడా, కాస్త ఆలోచించుకోవద్దూ?

ఇంజనీరింగూ, పోలీసు యిత్యాది శాఖలు నిర్వహించ గలిగిన దారుఢ్యమూ, ధీరత్వమూ గల స్త్రీ, నూటి కొక్కతె కూడా వుండదు. కొంతవరకూ ప్రతి వారికీ సాధ్యమైనది, లేడీ డాక్టరూ, పంతులమ్మ పనులు, కాని, Competition యెక్కువైనకొద్దీ, అవైనా యెంత మందికి లభిస్తాయి? ఏమాత్రం లాభిస్తాయి? విధీ విరామం లేకుండా అతి కష్టపడితే, అదృష్టం కలిసి వస్తే, ఏ కొద్ది మందికో, కొంతవరకూ బాగా లాభించ వచ్చును. కాని, అదైనా, ఒంటిగా నున్నన్నాళ్లే గానీ, సంసారంలో దిగినతరవాత, సాగించడ మెంత కష్టమో, వేరే చెప్పేదేమిటి?

ఎన్ని చదివినా, ఎన్ని చెప్పినా,—ఏనాడో ఒక నాడు,—ఏదో ఒక విధమైన పెళ్లీ, యిల్లేర్పడడమూ తప్పవు. పురుషుడు గృహమేధిగావడమూ, పూబోడి గృహిణి గావడమూ ప్రకృతి సిద్ధము. అయినా, యిల్లాలై నేర్పరితనంతో, జయకరంగా యిల్లు దిద్దడం మాత్రం, ఒక ముఖ్యమైన పెద్ద ఉద్యోగం కాదూ? గృహ రాజ్యంలో Home Minister తో సమానమైన పదవి అన్నమాట. అటువంటి బాధ్యతాయుత పదవి నలంకరించక, పసిపాపల నెత్తి పెంచుతూ, ఇల్లు దిద్దుకుంటూ వుండవలసిన స్త్రీకి, బయటకు పోయి, రోజంతా కష్టించి పనిచెయ్యడం, సుళువా? సుఖమా?

బలశాలియైన పురుషుడికి, సాము గరిడీలు, ఉన్నత శాస్త్ర పరిశోధనలూ, కఠిన యంత్రాగార నిర్మాణ పరిశ్రమలూ మొదలైనవీ, సుకుమారియైన స్త్రీకి, గృహ నిర్వాహకత్వమూ, మధుర కళాభ్యాసమూ, సహజంగా ఒప్పే, అనుకూల విద్యలు.

ఏ కాలపు ఆశయాల నెంచి చూసినా, ఎన్ని విధాల ఆలోచించి జూసినా, ఆతివలకు సౌఖ్య గౌరవా లియ్యడానికి, కళాభ్యాసంతో సాటి అయినదింకేదీ కనపడదు.—ప్రాచీన కాలంలో, రాజ పుత్రికలకు గూడా, కళా శిక్షణ అత్యవసరంగా భావించబడేది. కులీనవంశ బాలికలు కళా వైదుష్యంతో విలసిల్లుతూ వుండేవారన్నది, ఏ కథ జదివినా, ప్రస్ఫుట మవుతూనే వుంటుంది. ఎటువంటి వ్యతిరేక పరిస్థితులలోనైనా, అభీష్ట సిద్ధి గావించి, ఆనందాన్ని పెంపొందించగల శక్తి, కళలకు గలదని,—మాళవికాగ్ని మిత్రమూ, రత్నావళి మొదలైన నాటికలలో కాళిదాసాది మహాకవు లతిమధురంగా చాటి చూపించారు. గ్రహచార వశాన్న, యెన్నో కట్టడులకు లోనై యున్న కథా నాయికలకు, వారి సహజ లావణ్యానికి, నేర్చిన కళానైపుణ్యం తోడై, కోరిన వరులను సమకూర్చింది. మగని ప్రేమ మన్ననలకు పాత్ర మయ్యారు. నాయిక సౌందర్యముతోపాటు, కళావైదుష్యము గూడా వర్ణించ బడని ప్రబంధ రాజము లరుదు.

ఆ తరువాత, రాను రాను మధ్యకాలంలో దేశంలోని సమస్త సౌభాగ్యాలతో పాటు, సంసార స్త్రీలలోని కళాభిలాష గూడా, సన్నగిల్లి పోయింది. తిరిగి—యిప్పుడిప్పుడే మినుకు మినుకు మంటూ పొడ చూపుతూ వుంది. స్వల్ప కాలంలోనే, జగజ్జేగీయమానంగా ప్రజ్వలించి తీరుతుంది.

పెళ్లి చేసుకున్నా లేకున్నా, ఆనందంతో, ఆత్మ గౌరవంతో బ్రతకడాని కవకాశమిచ్చేది, కళాభ్యాసము. పూర్వపు రోజులలోలాగు పసితనంలో పెళ్లిళ్లు యిప్పుడు

లేవు. కాలంతో పాటు కోరికలూ పెరుగుతూనే వుంటాయి. ప్రస్తుతపు యువకులు, వారి తాతల లాగు, తమ కర్థాంగి జేసుకునే స్త్రీ, కేవలం వండి పెట్టడం, వంశం నిలబెట్టడం, చేస్తుందన్నంత మాత్రంలో సంతృప్తి పొందలేకుండా వున్నారు. కొంతవరకూ విద్యావతియై, కళావతియై, మానసిక సాహచర్యమూ, ఆనందమూ గూడా యిచ్చే కాంత కావాలని కాంక్షిస్తున్నారు. అటువంటి బాలికలకే యికముందు అనాయాసంగా వివాహాలయ్యేది. (కట్నాలు పోయేది గూడా అప్పుడే!) స్వార్జితశక్తి గలిగి, ప్రాజ్ఞత వచ్చాక పెండ్లి జేసుకునే నాగరిక యువకులను, కేవలము కట్నాలతోనే కూతుళ్లకు భర్తలుగా తేగలగడం, యింకా కొన్నాళ్లలో కష్టసాధ్యముగాక మానదు. ఒక వేళ, వేలకు వేలు గుమ్మరించి, అమ్మాయికి పెళ్లికొడుకుని తేగలిగినా, మగనిమక్కువ కొనియ్యగలరా? ఆమక్కువ సంపాదించగలిగిన శక్తి బాలిక కియ్యాలి. కళాశీలియైన కామిని కాశక్తి సునాయాసంగా కలుగుతుంది. సంఘ నిబంధనలవల్లా, చట్ట నిర్బంధాలవల్లా, భర్తని కట్టేసుకునే కన్నా, మహారాజ పథాన్ని గూడా త్రోసి రాజనగల మానసికానందాన్నిచ్చి, (పుచ్చుకుని) స్వాధీన భర్తృకగా మురియడం, ఆత్మ గౌరవకరం గామా, ఆడదానికి?

ప్రతిభాశాలియైన పురుషుడు, కళాశీలి అయిన స్త్రీని ఆదరించక మానడు. కళామూర్తియైన స్త్రీని, ఆరాధించక మానడు!

సంసార సాగరములో దిగిన తరువాత గూడా, సౌఖ్యమే గాకుండా, అర్థ సంపాదనకు గూడా, అతివలకు కళా రంగంలోనే యెక్కువ అవకాశాలున్నాయి.—కాలేజీలో చదువుకుంటున్న కన్య గానీయండి, పసి పాపాయిలున్న కుటుంబిని గానీయండీ,—ప్రజ్ఞను బట్టి, వారికి వీలైన కాల పరిమితిని బట్టి,—కళావతియైన మానినికి ప్రోత్సాహ మిచ్చి, ఆదాయము గలిగించి, అభివృద్ధిలోనికి తేవడానికి,—రేడియో లున్నాయి; రంగ స్థలాలున్నాయి. పాటకచేరీలు, నాట్య సభలూ వున్నాయి. చివరికే రెండు మూడు సంగీతపు పాఠాలు చెప్పినా, కుటుంబాదాయము వృద్ధి జేసుకుని, తమ బరువే లేకుండా, సుఖంగా జీవితం సాగించవచ్చును. అన్నిటికన్న ముఖ్యమైనది,—కళాభిరతి గలవారికి, జీవితంలోని అందాన్ని, ఆనందాన్ని, అర్థం జేసుకుని, అనుభవించడం చేతనవుతుంది. అయితే, అందరికీ కళా వైదుష్య మబ్బుతుందా అంటే,—అత్యధిక ప్రజ్ఞ, పూర్వజన్మ సుకృతంవల్లగాని కలగనిమాట నిజమేగాని, M. Sc., లకూ, B.Sc. Hons., లకూ పడ్డ వ్యయ ప్రయాసాలు, ఆట పాటలకూ, బొమ్మల గీతలకూ, చక్కటి రాతలకూ పడితే,—జీవితంలో ఆపాటి కిట్టింపు లేకుండాపోదు.

మరొక్కమాట:—పెద్దపరీక్ష వచ్చి ఉద్యోగాలు చెయ్యడంవల్లనే గాని, కళా వైదుష్యంవల్ల జీవనోపాధి యేర్పరచుకోవడం, గౌరవకరం గాదనే అపోహ, మనలో చాలా మందికి లేకపోలేదు. మోటుగా, మగవా డొలిచి తియ్యగలిగిన కొబ్బరికే, దవడలు నొప్పి పుట్టే లాగు నమిలి తిని బ్రతుకవలసిందేగాని, నాజూకుగా నొక్కితే తియ్యటి రసం చిప్పిల్లే కొబ్బరి మామిడితో, బత్తాయితొనలతో, జీవితం సాగించుకోవడం, రుచి కలిగించుకోవడం మర్యాదగాదనే మాటకు, జవాబేమని చెప్పను?

ఊహా లోకంలో, మాటలకందని ఉన్నత స్థానానికి, హృదయాన్ని తీసుకుపోయి, ఆత్మ సంతృప్తి కలిగించే కళారాధన, సత్సాంప్రదాయంగల సంసారిణికి తగదనీ,—నిత్యమూ చక్కగా అలంకరించుకోవడమూ, సుఖపడ గోరడమూ, సంతోషముగా నున్నట్టుండడమూ,—పతి వ్రతా లక్షణం గాదనే దురభిప్రాయం తొలిగిపోతేనే గాని, నారీలోకం పైకెలా వస్తుంది?

తేనెలొలికే పాటలూ, ముద్దులు గొలిపే మాటలూ, అందాలు చిందే నడకలూ శృంగారవతులకు స్వంత సొమ్ములు. మనలో మన మాట,—ఏ యువతి శృంగార వతిని కానసుకొంటుంది?—కావాలని కోరుకోకుండా వుంటుంది. కళాభ్యాసము, వాటికి వన్నె వాసీ గలిగిస్తుంది. కళావతియైన తరుణి, సౌరభమూ, సౌకుమార్యమూ గల అపరంజి పద్మము. దాని నాశించిన వారెవ్వరు? మాన వతికి, అంతకన్నా కోర తగిన జీవితమేమున్నది?—

## మా అమ్మాయి చదువుకుంటుంది

కనుక, F. A., B. A., లే గాకుండా, వాటితోపాటు, ఏ విధంగా జూసినా, కోమలులకు అనువైన, కళాభ్యాసము గూడా, కులీన బాలికలందరూ తిరిగి ప్రారంభించితే, తమకు వచ్చిందని మానకుండా సాగించితే, స్త్రీ జీవితంలో సౌఖ్య సౌభాగ్యాలు వృద్ధి జెందుతాయని నా దృఢాభిప్రాయం. ఆనాడే అమ్మాయి చదువు సార్థకమౌతుంది.

అన్నీ సరేగాని, మీ అమ్మాయి విషయంలో నువ్వేమి చేస్తావంటారేమో! చెయ్యాలనే అనుకుని చెపుతున్నాను. ఎంతవరకు జయప్రదంగా సాగుతుందన్నది,—భగవంతుడి దయమీద, అమ్మాయిల పూర్వ పుణ్యం మీద ఆధారపడి వుంటుంది. చివరికి నేను,—'చెప్పేవారేగాని, చేసేవారు లేరనే' వారిలోనే చేరుతానో,—చెప్పినంతా చేసినవారికే చెందుతానో యిప్పుడెలాగ చెప్పగలను చెప్పండి?—

(ఆలిండియా రేడియోవారి సౌజన్యముతో)



## భ్రమరమా!

తొలితూరి నీతోను మాటలాడాలంటి
మలితూరి నీతోను తూగి తేలాలంటి
మాట బోటూనరించబోకే భ్రమరమా!
తేటి గీతము పాడవే.........!

ఘుమ ఘుమ రాడే వసంతవనిలో
ఝుమ ఝుమ రాగా లాల పించుచూ
కువకువలాడే కోయిల గీతికి
కమ్మకమ్మగా వంత పాడవే భ్రమరమా!

మాధుడు పీర విహారుడాయె నే
మదనుడు మనసున మాటలాడినాడే
సఖియలు సిగ్గున తలలు వంచినారే
ప్రకృతి యంతా పులకరింపగా......
మదిముద మందగ మధుర గీతికలు పాడవే!

వాడ్రేవు శ్రీ జోగిపంతులు



# "మమత"

* శ్రీమతి కొత్తపల్లి లలిత *

...వాడు పుట్టక పూర్వమే ఆమె భర్త చని పోయాడు...ఆ దుఃఖ సమయంలో తానుకూడా ఆత్మహత్య చేసికొని భర్తను అనుసరిద్దామను కొన్నది గాని, తాను గర్భవతినని గ్రహించు కొన్నది...సంతానం కలిగిన తర్వాత తాను బ్రతికింకా చనిపోవచ్చు ననుకొన్నది...

...వాడు పుట్టినాడు...ఆమెకు ఎక్కడలేని మమత కలిగింది...'అయ్యో! ఇంత చిన్నవాణ్ణి వదలి నేను చచ్చి పోతే వీడి గతి ఏమికాను' అని కొన్ని నెలలు అనుకొని ఊరుకొన్నది...పిల్లవాడు పెద్ద వాడవడం మొదలు పెట్టి నాడు...వాడి విద్దెలు చూస్తూ ఆనందించడం మొదలు పెట్టింది...అంతకు పూర్వం వాడు పాలు త్రాగుతూంటే, పిడికిళ్లు బిగించి కన్నులు నులుపుకొంటూంటే, బోసినోటితో నములుతూ నవ్వుతూంటే ఎక్కడలేని ఆనందం కలిగింది... వానిని అక్కున జేర్చుకొని చెక్కిలి నొక్కి ముద్దు పెట్టు కొంటూంటే శరీరం పులకరించేది...పాలు త్రాగుతూ కలవ కాడలవంటి చేతులతో మెడలోని వస్తువులను సవరిస్తూంటే ఏమిటో చెప్పలేని వెఱ్ఱి ఆనందం ముంచుకొచ్చేది...ఇవన్నీ అనుభవిస్తూంటే జీవితాశ బలమయింది..."నేను పిల్లవాని కోసం జీవించాలి...వీనిని ఎలాగైనా పెంచి పెద్దవాణ్ణి చెయ్యాలి...ఆదే నా జీవిత పరమావధి" అని తాననుకొని ఇతరులతో అనేది...చనిపోయిన భర్త అప్పుడప్పుడు జ్ఞప్తికి వచ్చేవాడు గాని, కొడుకు ముఖం చూస్తూంటే భర్త ముఖం మసకమసకగా కనబడేది...క్రమేపి, ఆ ముఖం జ్ఞాపకం చేసుకోడం కూడా కష్టమయింది...ఆ స్థానంలో వాడి ముఖమే కనబడేది......

...కుఱ్ఱవాడికి కూడా తల్లివద్ద చనువు చాలా అధిక మైంది. తన్ను ప్రేమించేవారు సమీపంలో తల్లిని మించిన వారెవరూ లేకపోవడం మూలాన్ని, ఏది కావలసి వచ్చినా తల్లికోసం ఏడుపే. తనకి శాంతినీ, భద్రతనూ ఇచ్చేది తల్లే గానీ ఇంకెవరూ కారని సహజంగానే గ్రహించాడు... ఆమె సామీప్యమే వాడికి పరమ సుఖస్థానం అయింది... ఆమెకి ప్రపంచం అంతా వాడే...వాడికి జీవితం అంతా ఆమే......

...చుట్టాల ఇంటికి ఎప్పుడైనా వెళితే, వాడికి సంబం ధించిన పనులన్నీ చేసి సుఖం కూర్చిన తర్వాతనే ఇతర కార్యాలు చూసేది. చుట్టాలలో ఎవరు వాడికి సహాయం చేసినా మండి పడేది; తనకి వాళ్లేదో అపకారం చేసినట్టు, తనకున్న ఒక్క హక్కునీ వాళ్లు లాగేసు కొన్నట్లు.

..."వాడు నా వాడు. వాడికేది కావలసినా, నన్నే అడగాలి. నేనే చెయ్యాలి. వాడికి నేను, నాకు వాడు విధాయకం. వీళ్లంతా ఎవరు?" అనేది...వాడి విషయంలో ఆమె అంత పట్టుదల చూపడం చుట్టాలకి వింతగా వుండేది.

..."మీ వాడి బంగారం మేమేమీ ఎత్తుకొని పోవటం లేదులే...ఎవడికొక్కవాలి మీ కల్లబంగారం" అని నవ్వే వారు...మరి కొంతమంది "కుఱ్ఱాడికి నీదగ్గర అంత చనువు కూడదు...ఇంక వాడు నిన్ను విడిచి బతక గలడా?" అని మందలించేవారు...ఇవన్నీ ఆమె చెవిని పెట్టేది. "నన్ను విడవడం ఎందుకు వస్తుంది వాడికి. ఏదో ఇంత తినడానికి వుంది గదా! కలో గంజో మేమిద్దరం కలిసి తాగ గలం" అని గర్వంగా సమాధానం చెప్పేది...బంధు వుల్లో ఈ అనుబంధం కథగా పరిణమించింది...చుట్టాలు అంటూన్నకొలదీ, ఆమె వాడిని దగ్గరకు తీసుకోడం మొదలు పెట్టింది...వయస్సు వస్తూన్నా కూడా, వాడు తనని వ్యక్తీకరించుకోలేదు...తనని ఆమెతో అభేదం చేసు కొన్నాడు...తల్లి వినాగా వాడికి జీవితమేలేదు...చివరకు 'వాడు' వాడుగానే ఉండి పోయాడుగాని, 'అతడు' కాలేదు...ఆమె, 'అతడు' అవడానికి వాడికి అవకాశాలు ఇవ్వలేదు......

* * *

...చదువు సంధ్యల్లో వాడు మంచి తెలివి తేటల్ని చూపడం మొదలు పెట్టినాడు. స్కూల్లో అందరూ మెచ్చు

కొనేవారు. "ఆ తండ్రే బతికివుంటే ఎంత ఆనందించే వాడో! పెట్టి పుట్టలేదు. ఏమంత పెద్దవాడు! నిన్న మొన్నటి వాడు "అనేవారు చుట్టాలు స్నేహితులుచూ... ఆమె మాత్రం ఎప్పుడూ అలా అనుకోలేదు... మొదట్లో ఊహిస్తే మసకమసకగా కనబడే భర్త ముఖం ఇప్పుడు కనపడ్డమే మానేసింది... ఇప్పుడంతా వాడే... వాడికి, అసలు తండ్రినే ఎఱుగుండక పోవడం మూలాన్ని ఆ గొడవే లేదు... తల్లీ, తండ్రీ తనూ అంతా... తల్లే... పరీక్షలు ప్యాసవుతున్నాడు—కొలతలు మార్చిస్తూ చొక్కాలూ, లాగులూ కుట్టిస్తున్నాడు—కానీ తల్లి దగ్గర మాత్రం ఇంకా 'అద్దాల్లోని ఓడ్డే'... తాను తల్లిమీద ఇంతగా ఆధారపడ్డం లోకంచూసి ఏమనుకుంటుందో వాడెరగడు. లోకాన్ని చూడ్డం ఆమె వాడికి నేర్పలేదు... ఎప్పుడేనా, ఎవరేనా తనని చూసి నవ్వితే, వాడువచ్చి తల్లికి ఫిర్యాదు చేసేవాడు... "నవ్వనీరా వాళ్ళమూతే వంకర పోతుంది. నీకేం రా, బాబూ; నే నుండగా" అనేది.

* * *

వాడు కాలేజికి వెళ్ళడం మొదలు పెట్టినాడు... అంత వయస్సు వచ్చినా, వాళ్ళిద్దరి మధ్యా మమత అలాగే ఉండి పోయింది... ఓ రోజున ఆమె ఏదో పనిమీద గదిలోకి వచ్చింది... వాడు తండ్రి యొక్క ట్వీడు కోటు వేసుకొని గదిలో నిలువుటద్దం ముందు నుంచుని ఉన్నాడు... ఆమె ఉలిక్కిపడి ఆగింది... తన కళ్ళని నమ్మలేక పోయింది... చనిపోయిన భర్త లేచి వచ్చాడా అనుకొన్నది... వాడి ధోరణిలో వాడుండి ఆమె రావడం చూడలేదు... ఆమె మెల్లిగా వాడి వెనక్కి వచ్చింది... ఆమె ముఖాన్ని ఆమె, తల్లి ముఖాన్ని వాడు ఒకసారే అద్దంలో చూడ్డం జరిగింది... అక్కడక్కడ నెరసిన వెంట్రుకలు, కాంతి తగ్గిన ముఖం... భర్త చనిపోయిన తర్వాత, ఆమె అద్దంలో తన ముఖాన్ని చూసుకోవడం ఇదే మొదటిసారి... "అమ్మా" అంటూ వాడు వెనక్కి తిరిగినాడు "నాయనా" అని ఆమె వాణ్ణి కౌగలించు కొన్నది... ఆ అద్దం ముందు వాడు నుంచున్నప్పుడు ఆమె కేదో కొఱత కనబడింది... ఆ కొఱత ఏమిటో తటాలున స్ఫురించింది... వాడికి పెళ్ళి చెయ్యాలి... తన పెళ్ళి నాటికి భర్తకు అదే వయస్సు... ఎన్నిసార్లు తనూ, అతనూ ఆ అద్దం ముందు ఇదివరలో నుంచో లేదు! తన భర్త! తానూ!... అద్దం ముందు నుంచున్న కొడుకు, తండ్రి స్థానాన్ని తీసు కొన్నాడు..... తనస్థానాన్ని?... తన కోడలు... ఆమె చిఱునవ్వు నవ్వుకొంటూ వంట ఇంటిలోకి వెళ్ళిపోయింది... వాడికిదేమీ అర్థం కాలేదు "ఏమిటే అమ్మా" అంటూ ఇంట్లోకి వెళ్ళినాడు... "ఏం లేదురా నాయనా. మీ నాన్నగారి కోటు తొడుక్కొని అద్దం ముందు నువ్వునుంచుంటే ఎంతచక్కని పెళ్ళికొడుకులా వున్నావురా" అని నవ్వింది... అమ్మ నన్ను చూసి నవ్వుతోందేమిటీ అనుకొన్నాడు... వాడు మామూలుగా భోజనం చేసి కాలేజీకి బయలు దేరినాడు... ఆవేళ తల్లి తన్ను చూసి నవ్వితే వాడికి అర్థంకాలేదు. తల్లి తన్ను చూసి నవ్వడం వాడికి ఉడుకుబోతు తనంగా ఉంది... ఏమిటో భయ మేసింది... క్లాసులో పాఠాలు వినబడలేదు సరిగ్గా... వినబడ్డవి అర్థం కాలేదు... ఈ పరధ్యానాన్ని చూసికొందరు స్నేహితులు "ఏం రా, అమ్మ తిట్టిందా ఏమిటీ?" అని ఎగతాళీ చేశారు... ఆ మాటలు వింటూంటే, ఎప్పుడూ లేంది ఆవేళ కన్నీళ్ళ పర్యంతం అయింది... ఆవేళ ఇంటికి వస్తూ ఆలోచించడం మొదలు పెట్టినాడు... అవును, తాను తల్లిమీద ఆధారపడి ఉంటాడు. ఆమె ఒక్క నిమిషం ఇంట్లో లేకపోతే తనపని తాను చేసుకోలేడు... ఆఖరికి ఆమె, "ఆ తెల్లలాగు మీదికి ఆ గళ్ళ షర్టు బాగుం టుందిరా" అని చెప్పాలి... ఈవేళ తన తెలివి తక్కువ తనాన్ని చూసి నవ్వలేదు గద తన తల్లి!... వాడికి, చిన్న కుఱ్ఱవాళ్ళకు వచ్చేకోపం వచ్చింది. అమ్మమీద కోపం వచ్చింది... ఇంక అమ్మమీద ఆధారపడ కూడదు అని తీర్మానించు కొన్నాడు. లేకపోతే, తన్నుచూసి నవ్వు తుందా?... ఈ వేళనుంచీ అమ్మమాట వినకూడదు అని అనుకొంటూ ఇంటివైపు గబగబా నడిచాడు...

...తనకి చిన్నప్పటినుంచీ అమ్మమాట వినడం అలవాటయిందే మరి ఇంక ఎవరిమాట వినడం! ఎవరిని ప్రేమించడం!... ఇందులోంచి తప్పించుకోడానికి ఏదో మార్గం

ఉన్నదని తోచింది గాని అదేదో జ్ఞాపకం రాలేదు. అలవాటు చొప్పున, అమ్మనడిగి తెలుసుకోవాలి అను కొన్నాడు చప్పున...వెంటనే తన ప్రతిజ్ఞ జ్ఞాపకం వచ్చి నాలిక కొరుక్కొన్నాడు...

...ఇంటిని సమీపించేటప్పటికి, [illegible] ప్రక్కనే ఆగి ఆకలేసిన సంగతి [illegible] మరిచిపోయాడా...[illegible] కొట్టుకొంటూనే లోపలికి వచ్చాడు...ఆమె పీట తెచ్చిపెట్టి కాళ్ళకి నీళ్ళిచ్చింది.....రోజూ వస్తే నాడు పుస్తకాలు బీరువాలో పెట్టుకొన్నాడు...ఈ మాత్రానికే ప్రపంచాన్నంతటినీ జయించినంత ఆనందం కలిగింది తనికి...కొడుకు ప్రవర్తన అర్థం కాక ఆమె అతని వైపు వింతగా చూసింది...ఎవర్లో పని వాళ్లు చేసుకోడంలో ఇంత ఆనందం వుందా అనుకొన్నాడు..."ఒంట్లో బాగాలేదా, నాయనా" అంది ఆమె అతని చెంపను చేతితో స్పృశిస్తూ..."బాగానే, వుంది కాని ఆకలేస్తోంది అన్నంపెట్టు" అన్నాడు. అంతకు పూర్వం ఇలా అడగడం లేదెప్పుడూ...ఆమెకు ఆశ్చర్యం కోపం కలిగింది...వాడు, అతడుగా వ్యవహరిస్తున్నాడని గ్రహించ లేకపోయింది... "నీ ఆకలి నాకు తెలియదట్రా నాయనా" అంది "అడక్కపోతే నీకెలా తెలుస్తుంది. అడక్కపోతే అమ్మయి నా పెట్టదు" అన్నాడు వెటకారంగా...ఆమె లోపలికి వెళ్లిపోయింది...వెండికంచం ఖంగున మోగింది వంట ఇంట్లో...ఆమెకి కోపం వచ్చిందని గ్రహించాడు...ఆమెకి ఆగ్రహం తెప్పించ గలిగానే అనే ఆనందం కలిగింది అతనికి..."రా" అని లోపలనుండి పిలుపు...కొంచెం ఆలస్యం చెయ్యాలి అనుకొన్నాడు...భోజనానికి ఆలస్యంగా వెళ్లినాడు...వండిన వాటిమీద వంకలు పెట్టినాడు... ఆమె నిర్ఘాంతయి పోయింది...మతి చలించింది...ఆలోచించింది...మధ్యాహ్నం తాను చేసుకొన్న నిర్ణయం జ్ఞాపకం వచ్చింది..."అయ్యో, నా తెలివి తెల్లారినట్లే వుంది... నోటితో చెబుతాడా ఏమిటీ...వెర్రి నాగమ్మ" అను కొంది..."దీనికి పెళ్లే మందు...అప్పుడదే నేను కలిసి వీడిని లొంగదీయ వచ్చును." అనుకొన్నది...అంతకు పూర్వం సంవత్సరన్నరనుండి సంబంధాలు వస్తున్నాయి...

మూడు వేలు కట్నం లాంఛనాలు వస్తాయని కొండబాబూను, చదువు చెప్పిస్తానని చలకొండబాబూ. కొంచెం లోకువగా వస్తే పిల్లను చేసుకొంటే మంచిదని, ఓ సంబంధాన్ని మనస్సులో నిశ్చయం చేసుకొంది...

"ఒకే అమ్మాయి, నీ ! బ్రాహ్మణ మాకంలో పెళ్లి చెయ్యాలి. [illegible] ఇంటివాడిని చేస్తే నా భారం తీరుతుంది" అన్నది..."నీ ఇష్టం" అన్నాడు అలవాటు చొప్పున... కొడుకు ఆ కొడుకు లొంగిపోయాడే అని పశ్చాత్తాప పడ్డాడు...ఇంటిలో సాయంకాలం తన మనస్సులో పడ్డ అలజడిని జ్ఞాపకం తెచ్చుకొన్నాడు..."ప్రేమించడానికి, ప్రేమను పొందడానికి ఓ వ్యక్తి వస్తుంది పెళ్లితో. దానితో కలిసి అమ్మను సాధించ వచ్చును. సాయంకాలపు ప్రశ్నకు అమ్మే సలహా ఇచ్చింది తెలియకుండా" అనుకొని "నీ ఇష్టం" అన్నందుకు విచారించడం మానివేశాడు...

...ఆనాటి రాత్రి ఇద్దరూ నిద్రపోలేదు...రాబోవు కోడలూ తనూ కలిసి కొడుకుని ఎలా తిప్పుకోడమా అని ఆమె ఆలోచన...

...భార్య సహాయంతో అమ్మనుండి స్వాతంత్ర్యాన్ని పొంద వచ్చునని కొడుకు ఆలోచన...

...ఈ ఆలోచనలవల్ల కాబోలు ఉదయం ఒకరి ముఖం ఒకరు చూడ్డానికి జంకి, ఆ రోజంతా తప్పించుకొని తిరిగారు...

* * *

...ఆమె అతనికి పెళ్లి చేసింది...పెళ్లి అయిన ఆరు నెలలకి కోడలు కాపురానికి వచ్చింది...ఆమెకు ఎక్కడ లేని సంతోషమూ కల్గింది...కోడలిని కాలు కింద పెట్ట నిచ్చేది కాదు...ఇప్పుడు తాను సుఖ పెట్టడానికి కొడుకు తోబాటు కోడలు కూడా దొరకింది గదూ—అను కొంది...కూతుర్లు లేని ముచ్చట తీరింది అనుకొంది...తన చీరలూ నగలూ అన్నీ కోడలకిచ్చింది...ఏ పనికైనా కోడలు సిద్ధ మయినప్పుడు "నేను లేనుటే, తల్లీ! నీ కెందుకే శ్రమ" అనేది...కోడలు పుట్టింటివారు, అత్తగారు చాలా మంచిది, తమ పిల్ల సుఖ పడుతుంది అని సంతోషిం

చూసి...అతను మామూలుగానే ఉన్నాడు...అన్ని పనులూ తనకూ, తన భార్యకూ తల్లే చేస్తూండటం అతని కింతగా పరిగణించటం లేకుండా పోవడం మొదలు పెట్టింది...

...కొత్త కోడలికి అత్తగారి ప్రేమ అర్థం గాలేదు... వాళ్లది పదిమంది గల కుటుంబం. ఈ గారాబాలు ప్రేమలు ఆమెకు తెలియవు...ఎవరి పని వారు చేసుకోవాలి అంతే అని నమ్మకం...మొదట నాలుగు దినాలు చూచింది... తాను ముఖం కడుగుకోడానికి సైతం అత్తగారే నీళ్లు తీసికొని రావడం ఆమెకు సవ్యంగా లేదు...చిన్న చిన్న పనుల దగ్గరనుండీ ఆమే చేస్తూంటే దానిలో వున్న ఆనందం కాస్తా పోయినట్లు తోచేది కోడలికి...తన భర్త స్థితి చూచింది...అతడు తనకంటె హీనస్థితిలో వున్నాడు. ఆమె మాటను కాదనలేక బాధ పడుతున్నాడని తెలిసి కొంది...అత్తగారికి ఇంత ప్రేమ ఎందుకు అని సందేహం కలిగింది...ఇంత ప్రేమా నిజంగా చూపిస్తున్నట్లామెకు తెలుసాలేదా అనుకొన్నది...ఆమె భర్తవైపు దృష్టి త్రిప్పింది...

...అతడు తన ప్రేమ నంతటినీ భార్య వైపు త్రిప్పి నాడు...ఆమె చిన్న చిన్న పనులు, పక్కకు బొత్తాలు పెట్టడం, భోజనానంతరం వక్కా ఒకటి ఇవ్వడం మొదలైనవి అతనికి ఎక్కువ ఆనందం కలిగించడం మొదలు పెట్టినవి...ఆ పనులే ఇదివరలో తన తల్లి చేసేటప్పటికంటే ఇప్పుడు తనకు ఈమె చేస్తూంటే ఎక్కువ ఆనందం కనపడింది... మెల్లి మెల్లిగా ఒకటొకటే భార్య చూస్తూంటే సుఖంగానే ఉన్నాడు...తన పనులు, భర్త పనులు తాను సుఖంగా చేసుకొంటున్నానే అనే ఆనందంలో కోడలు ఉన్నది...తల్లి అవసరం కనబడ లేదతనికి...ఆమెకు మొదట్లో, కోడలు కొడుకునకు కొన్ని ఉపచారాలు చేయడం, అతడు అందుకు సంతోషించడం ఆనందమే కలిగించింది...కానీ రానురాను కోడలు, తాను పూర్వం తన చేతులారా కొడుకునకు చేసే ఉపచారాలన్నీ చేయడం బాధ కల్గించడం మొదలు పెట్టింది...కొడుకు తన్ను బొత్తిగా మరచి పోయాడనీ, కోడలు, తను వానికి ఉపచారాలు చేయడంవల్ల వచ్చే ఆనందాన్ని దోచుకొన్నదనీ ఊహించడం మొదలిడింది...క్రమేపి అదికోపంగా బయలు దేరింది...తన హక్కు ఏదో ఈ కొత్తగా వచ్చిన పిల్ల లాగుకొన్నదే అని ఈర్ష్యపడడం మొదలు పెట్టింది...ఇంక వాళ్ల నిద్దరినీ ఒకచోట చూడ లేక పోయింది...వాళ్లపై పూర్వం ఉన్న మమకారం పోయి నట్లనిపించింది...ఇలా ఉండగా వాళ్లనిద్దరినీ ఓ రోజున గదిలో అద్దం దగ్గర నుంచుని వుండగా చూచింది...అతడు భర్త కోటు తొడుక్కొన్నాడు...కోడలు అత్తగారు తన కిచ్చిన చీర గట్టుకొని వున్నది...ఆమెకు తన వివాహ జీవితపు తొలిదినముల మిణుమిణుకులు కళ్లకగుపించినవి. ఆమె మనస్సు అదోకలా అయింది...నాటినుండి వాళ్లతో ఒక మోస్తరుగా మాట్లాడ్డం మొదలు పెట్టింది...వాళ్లు తమ ప్రేమ వికాసం వేపు తొంగిచూస్తున్న చీకటి తెరల అంత రార్థం గ్రహించలేక పోయారు...కోడలు ఎప్పటివలె తన ప్రయత్నంలో తాను ఉన్నది...అతడు తల్లిపై ఆధారపడని జీవితం గడుపు తున్నాడు గదా అనే ఉత్సాహంతో ఉన్నాడు...ఆమెలోని ఈ మార్పునకు కారణం కనపడ లేదు...అత్తగారి విషయమై కోడలు పూర్వ విధంగానే వుంది...తల్లి విషయమై అతడట్లే వున్నాడు...కోడలు అత్తగారి పనికి పూర్వం కంటే ఎక్కువగా సహాయం చేస్తూ అత్తకు కావలసినంత విశ్రాంతి నిస్తోంది...ఇది ఆమెకు ఏవగింపుగా ఉండేది...లోపల బాధపడేది...

...ఇలా ఉండగా ఓ రోజున అతడు తలంటు కొంటా నన్నాడు...అంతవరకూ కోడలు తన భర్తకు ఎన్ని ఉపచర్యలు చేసినా తలంటి నీళ్లు పోయడానికి మాత్రం సిగ్గుపడి పూరుకొనేది...ఆ పని ఆమే చేసేది...ఆ వేళ అతనికి భార్యచేత తలంటించుకోవాలనే వెఱ్ఱి కోరిక కలిగింది...ఆమె ఉత్సాహంతో మనస్సుపడి 'సరే' అన్నది...ఈ సంగతి అత్తకేమి తెలుసు...మామూలు ధోరణిలోనే స్నానం గదిలో అన్నీ సమకూర్చింది... "రారా" అన్నది సహజమైన ఖరి నభినయిస్తూ...కొడుకూ కోడలూ ఇద్దరూ వచ్చినారు...ముసిముసి నవ్వులు నవ్వు కొంటూ ఒకరికొకరు ఎదురుగా నుంచున్నారు...అఖరికి

కొడుకు ధైర్యం వహించాడు..."అమ్మా! నాకు పెందరాళే అన్నం కావాలి. నువ్వు వెళ్లి మడికట్టుకో. ఇది నాకు నీళ్లు పోస్తుంది లే" అన్నాడు...

...ఆమె చేతిలోని మూకుడు క్రిందపడి పోయింది... ఆమె వెళ్లిపోతూ గడపకి తగులుకొని పడిపోయింది... కొడుకూ కోడలూ కంగారుగా ఆమెని పట్టుకొని కూర్చుండ పెట్టినారు...ఆమెకు మాటా మంతీలేదు...మిడిగ్రుడ్లు వేసుకొని చూడటంతో వాళ్లు మెల్లిగా బుజాల మీద వేసుకొని గదిలోనికి తీసుకు వెళ్లారు...ఆ వేళ రాత్రి తీవ్రంగా జ్వరం వచ్చింది...మూసిన కన్ను తెరువలేదు... మరునాడూ, మూడవ నాడూ అంతే...నాల్గవనాటి మధ్యాహ్నానికి స్పృహ వచ్చింది...కొడుకు గ్లూకోజు కలిపిన నీళ్లు గొంతుకలోపోసిన తర్వాత, "నా...హా... క్కులు—పోయినవి" అన్నది ఏమీ అర్థంకాక వొకరి ముఖ మొకరు చూసుకొన్నారు...ఏమీ అర్థం కాలేదు... డాక్టర్లు వచ్చి మందులేవో ఇచ్చినారు...జ్వరం తీవ్రంగానే వుంది అన్నారు...'నా హక్కులు' అంటూ ఎన్నిసార్లో పలవరించింది...కానీ ఈ హక్కు లేమిటో ఎవ్వరికీ అర్థం గాక తెల్లపోతూ వూరుకొన్నారు...

ఆమెకు పూర్తిగా ఆరోగ్యం కలగడానికి రెండు నెలలు పట్టింది...ఈ రెండు నెలలూ కొడుకూ కోడలూ ఆమెకు సమస్త విధముల ఉపచర్యలు చేసినారు...కోడలి ఓర్పునకు అందరూ మెచ్చుకొన్నారు...ఆమె మెల్లి మెల్లిగా లేచి నడయాడడం మొదలు పెట్టింది ..పూర్తిగా సత్తువ రావడానికి ఇంకో నెల పట్టింది...శారీరకంగా సంపూర్ణారోగ్యం కల్గిందన్నారు వైద్యులు...ఏం కలిగినా ఏం లాభం పూర్వపు మనిషి కాలేదు...తనకు తోచిన పని తాను చేసేది...ఎవరితోటీ అనవసరంగా మాట్లాడేది కాదు... పిలుస్తే పలికేది...అంత చురుకైన మనిషి మన్ను తిన్న పాములాగ పడి ఉండేది...కోడలిని మాత్రం బెదురుతూ బెదురుతూ చూచేది...కొడుకూ కోడలూ ఆమెకు మతిస్థిరం తప్పిందని చాలా విచారించారు...అంత వెఱ్ఱి దానివలె ఉన్నా గృహ కృత్యాలన్నీ చక్కగా నిర్వర్తించేది...

.. కోడలికి ఏడవ మాసం అని ఆమె పుట్టింటివారు పురిటికి తీసుకొని వెళ్లినారు...

* * *

...మళ్లీ కొడుకు తల్లి మిగిలినారు. అతని వివాహానికి పూర్వం మళ్లేనే...తన పనులతో పాటు ఆమెకు కూడా సహాయం చేసేవాడు గృహకృత్యాల్లో...ఆమె మామూలు దానిలో మారి పూర్వపు పరిస్థితులు వస్తాయా అన్నట్లు మెలగ సాగింది...అతనికి కావలసిన పనులన్నీ బెదురుతూ బెదురుతూ చేసేది...ఎవరో తన్ను పరీక్షిస్తున్నారా అన్నట్లుగా మెలిగేది. 'అమ్మా నాకిది కావాలి, అది కావాలి' అని అతనెప్పుడైనా పాత అలవాటు చొప్పున అడిగితే ఎంతో భయపడుతూ అతన్ని సమీపించి ఆ అడిగినవి దగ్గర పెట్టి వెళ్లిపోయేది. అతని కీమె పరిస్థితి చాలా విచారాన్ని కలిగించింది. ఏందు మూలంగా ఆమె అలా అయిందో అతని కేమీ తెలియలేదు. ఎందరో డాక్టర్లకు చూపించినా మతి స్థిరం తప్పిపోయింది అని చెప్పి వూరుకొన్నారు...

* * *

...ఇలా వుండగా మద్రాసులోని మనోరోగ చికిత్సాలయానికి ఓ పెద్ద డాక్టరు వచ్చినాడని తెలిసి, ఆమెను తనతో తీసుకొని వెళ్లినాడు...ఆమె ఏమీ అడ్డు చెప్పలేదు. ఆమెను ముందు రామేశ్వరం తీసుకవెళ్లి అక్కడనుండి తిరిగి వస్తూంటే మద్రాసులో దిగి డాక్టరు దగ్గరికి తీసుకొని వెళ్లినాడు...డాక్టరామెను మామూలుగా చూచాడు. ఆమె ఏమీ అభ్యంతరం చెప్పలేదు. తరువాత డాక్టర్ని అతడు ఏకాంతంగా కలుసుకొన్నప్పుడు డాక్టరు అసలు విషయమంతా అడిగి తెలుసుకొన్నాడు. అంతా విని చివరికి ఆమె మళ్లీ బాగుపడాలంటే మళ్లీ జీవితంలో పెద్ద ఆపదవంటిది వస్తే ఆ ఆకస్మిక ప్రమాదం వల్ల మనస్సు కుదుట పడవచ్చు నన్నాడు. ఆమెకు అతని మీద వున్న విశేష మమకారానికి, అతని భార్య రావడంతోనే అడ్డం వచ్చిందనీ, ఈ అడ్డం ఆమెలోని మాతృత్వాన్ని విశేషంగా రెచ్చగొట్టి మనస్సునవున్న స్థిమితాన్ని చెడగొట్టిందనీ అన్నాడు. ఆమెకు కొడుకు

మీద వున్న హక్కుకూ, ఆమె మీద కొడుకు కున్న ప్రేమకూ మధ్య అడ్డంగా కోడలు వచ్చిందనీ, దాంతో ఆమె లోని తల్లి ప్రేమను పూర్తిగా వినియోగించబడే అవకాశం అకస్మాత్తుగా పోవడం చేత కల్గిన తొట్రుపాటువల్ల చిత్త చాంచల్యము కల్గిందని చెప్పి ఆమెకు మళ్లీ పూర్వస్థితి కలిగితే కలగవచ్చునని చెప్పి వెళ్లి పోవుచున్నాడు...

*　　*　　*

...ఇంటికి తిరిగి వచ్చిన తర్వాత అతను మనస్సులో ఎంతో దిగులు పడ్డాడు. తన వివాహం చేతులార ఆమె చేసింది గదా, కోడల్ని అంతగా ప్రేమించేది గదా—ఈ వైకల్యం ఎలా కలిగిందీ అని ప్రశ్నించు కొన్నాడు... అతని కేమీ అర్థం కాలేదు...చికాకు కలిగింది...భార్య మీద కోపం పొర్లుకొచ్చింది...సుఖంగా వున్న తన ఇంటిలో ఈ కష్టం ఆమె వల్లనే వచ్చి పడిందని చికాకు పడ్డాడు...ఏమీ పాలుపోక వీధిలోకి వెళ్లాడు...

*　　*　　*

...ఆవేళ అతను తలంటు కుందామని అన్ని వస్తువులు తీసుకొని నీళ్ల గదిలోకి వెళ్లినాడు. తలంటుకొన్నాడు... అంటుకొంటూన్నంత సేపూ తన చిన్ననాటి సంగతులూ, తాను సున్నిపిండితో నలుగు పెట్టుకోనని ఏడుస్తూంటే "శ్రీపతి కృష్ణమ్మ రేపల్లెలోనూ—" అనేపాట పాడుతూ తల్లి నలుగు పెడితే తాను వూరుకోడం మొదలైన విషయాలన్నీ జ్ఞాపకం వచ్చి కళ్లు చెమర్చాయి...ఆ పాట తాను పెద్ద వాడైనాక కూడా తల్లిచేత పాడించుకొని గానీ నీళ్లు పోసుకొనేవాడు కాదు...ఇలా తన జీవితం సాఫీగా జరుగుతుంటే తన భార్య తన జీవితంలోకి పిడుగువలె వచ్చి పడడం—పాత జీవనానికి కాలక్రమంగా స్వస్తి జరగడం జ్ఞాపకం వచ్చాయి...ఇవన్నీ ఆలోచిస్తూ ఒళ్లు తుడ్చుకొందామని చూస్తే తువ్వాలు మర్చిపోయినట్లు తేలింది. సరే... ఎలాగు తడిబట్ట కట్టుకొని వెళ్లాలి గదా. అని బట్టకట్టు కొంటూంటే స్నానాలగది తలుపుమీద తువ్వాలు కనబడింది...అతనికి ఆశ్చర్యం వేసింది. తన తల్లే అది తెచ్చివుండాలని నిర్ధారణ చేసుకొన్నాడు...ఆమెకు జబ్బు వచ్చి నప్పటినుండీ అతని పనే బొత్తిగా చూడ్డం మానే సింది...ఇప్పుడనుకోకుండా ఈపని చేయడం అతనికి ఆశ్చర్యాన్ని కల్గించింది...ఆమె మొట్టమొదట పడిపోయిన దినం జ్ఞాపకం వచ్చింది...ఆవేళ ఆమె 'నీళ్లు పోసుకుందు గాని రా నాయనా' అనడం, తన భార్య కోరిక ప్రకారం తాను 'నువ్వు పొయ్యక్కర లేదులే...ఇది పోస్తుంది' అనడం—జ్ఞప్తికొచ్చినవి...అతని గుండె గతుక్కుమంది...ఏమిటో అంతా అర్థమయినట్లయింది—డాక్టరు చెప్పిన వాక్యాలకు సమన్వయం కుదిరినట్లగుపించింది... మొదట్లో ఆ డాక్టరు వాక్యాలకు మనస్సులో నవ్వుకొని మనో రోగానికి మందేమిటీ—అని డాక్టర్లని లోపల గేలిచేశాడు...ఇంక ఆమెకు పూర్వ ప్రేమ మళ్లీ వచ్చేటట్లు మెలగాలనీ, తన భార్యను దూరం చేసుకోవాలనీ తీర్మానించుకొన్నాడు "అమ్మా" అంటూ ఒక్క అంగలో సావిట్లోకి వచ్చాడు...

...ఇంతట్లోకి 'పోస్టుమాను' అనేకేక వచ్చింది... ఆ జాబు తీసుకొని పోస్టు ముద్రనుచూచి మామగారి వూరు వద్దనుండీ అని తెలుసుకొని గబగబ చింపాడు—మాఘ శుద్ధ త్రయోదశీ బుధవారం రాత్రి 10-27 గం॥ పుత్రోదయ మని వున్నది. "అమ్మా" అంటూ సంతోషంతో వంట ఇంట్లోకి వెళ్లినాడు...ఆమె అతని మొదటి కేక విని ఇవతలకు వస్తూనే—ఇద్దరూ వసరాలో కలుసుకొన్నారు... మళ్లీ భార్యా—ఇప్పుడు కొడుకు—వాళ్లతో నిండిన ప్రపంచంలో పడ్డాడు. ఆమెకా శుభవార్త చెప్పాడు. ఆమె తలవూపి వూరుకొంది...

...నెల వెళ్ల కుండానే వుబలాటంతో వెళ్లి భార్యనీ, కొడుకునీ తీసుక వచ్చాడు...బాలెంతరాలు, చేసుకో లేదని అత్తగారు కూడా తోడు వచ్చింది...తన తల్లి ఎల్లాగా సహాయం చెయ్యలేదు గదా. అత్తగారు వుండటం మంచి దని అతనూ సరే అన్నాడు.

...వియ్యపు రాండ్రిద్దరూ ఏమీ మాట్లాడు కోలేదు... అతని అత్తగారికి తన కూతుర్ని అత్తగారి పిచ్చితనం ఏమి చేసి పోతుందో అనే భయం మొదట వుండేది. ఇప్పుడు పసి పాపను ఏమి చేస్తుందో అని మరీ భయపడి ఆమెకు పిల్లవాణ్ణి కనబడ నిచ్చేది కాదు...తల్లి కూతుళ్లు ఏ

మయ్యారు...ఆతనికీసంగతేమీ తెలియదు...తన గొడవ ఏదో తనేగాని...

* * *

...ఓ రోజున తల్లి చూస్తున్నదీ తన గదిలో ఏదో మాట్లాడుకొంటూంటే ఇప్పుడు లోపలికి వచ్చాడు "దేవిడ ముండ కిటికీలోంచి చూస్తోందా?" అన్న అత్తగారి మాటలు చెవిని పడ్డాయి...అల్లుణ్ణి చూసి అత్తగారు నోరు మూసుకొంది. అతని భార్య ముసిముసినవ్వులు నవ్వుతూ పిల్లవాడి కడుపుమీద ముద్దు పెట్టుకొంది... అతనేదీ వినిపించుకోకుండా ఇవతలకు వచ్చేశాడు...తరువాత పెళ్లాం చెప్పింది... అతని తల్లి కిటికీలోంచి చంటివాణ్ణి చూస్తోందనీ, పిచ్చివాళ్లకి పిల్లలంటే కోపం అని తల్లి చెప్పిందనీ ఆమె అంది...అతనేమీ మాట్లాడలేదు... గంభీరంగా చూసి వూరుకొన్నాడు....అతని హృదయంలో తరువాత చాలా బాధ పడ్డాడు...తన తల్లి ఎంత దయార్ద్ర హృదయో వాళ్లకేమి తెలుసు అని విచారించాడు... ఆమెను తానే వెళ్లి తన పిల్లవాణ్ణి చూపిద్దామను కొన్నాడు...కానీ కొంత సిగ్గుచేత, కొంత అత్తగారు భార్య ఏమనుకొంటారో అనే భయంచేత ఎప్పుడూ సాహసించ లేకపోయాడు...

* * *

...'పిల్లవాడు జాగ్రత్త సుమా' అని మరీమరీ చెబుతూ ఆమె తల్లి పిల్లవాడికి ఏడో నెలవచ్చి దొర్లుతున్నాడు గదా అని వెళ్లిపోయింది...

...అతని తల్లి ఏదో మామూలుగా తన పనేదో తాను చేసుకోడమేగాని పిల్లాడిని ఎత్తుకొంటాననిగాని, ఎలా వున్నాడనిగానీ ఎప్పుడూ అడగలేదు...ఇది కోడలికి కొంచెం కష్టంగా వున్నా అడుగుతే చేతికివ్వక తప్పదు; ఇస్తే పిచ్చిది ఏం చేస్తుందో అని భయపడడం వల్ల అడక్క పోవడమే బాగుంది అనుకొంది...ఓ పనిమనిషిచేత పిల్ల వానికి నీళ్లు పోయించేది...

* * *

...ఆ వేళ మామూలుగానే పిల్లాడికి నీళ్లు పోసి, పౌడరు అద్ది వసారాలో పడుకోపెట్టి గదిలోకి వెళ్లింది కోడలు. అక్కడ భర్తతో ఏదో ముచ్చటిస్తూ కాలమే మర్చిపోయింది...

...పిల్లాడు మామూలుగానే ఆడుకుంటున్నాడు... ఆ వసారా క్రింద పెరడులో కూర్చుని ఆమె వత్తులు చేసు కొంటూంది...అప్పుడప్పుడు పిల్లాడి కేసి చూసినా ఆ దృష్టిలో కార్యం తప్ప ఏమీ లేదు...పిల్లవాడు ఇటూ అటూ దొర్లడం మొదలు పెట్టాడు...వసారా అరుగు మీద, తాను కొత్తగా వశం చేసుకొన్న కండరాలకు పని కల్పిస్తూ దొర్లుతున్నాడు...ఆమె చూచింది...ఆమె చూపులోని కార్యం కొంత పొరలు విప్పుకొని మాసి పోవడమైంది...ఆ నిస్సహాయుడైన పిల్లవాణ్ణి చూస్తే ఆమెలో ఏదో విచిత్ర మేల్కొన్నట్టయింది...అది అసూయో—ప్రేమో—ఆమె చెప్పలేకపోయింది...

...పిల్లవాడిటు అటూ దొర్లుతూంటే ఆమె కళ్లుకూడా ఇటూ అటూ తిరగడం మొదలు పెట్టాయి...వత్తులు చెయ్యడం మానేసింది...కళ్లల్లోకి ఒక్కసారి ఈర్ష్య... ఇంకొక్కసారి వర్ణించలేని ప్రేమ వెల్లి విరిశాయి... శరీర మంతా ఆమెకు గగుర్పొడిచినట్లయింది... పిల్లవాడు ఒక్క సారి దొర్లి వసారా అంచు దగ్గరకు వచ్చాడు...ఇంకొక సారి దొర్లడానికి సన్నాహ పడుతున్నాడు....పిఱ్ఱలు పైకెత్తాడు.....ఆమె చూస్తూ కదలకుండా రాయిలా కూర్చుంది...తనకి లేని కొడుకు తన కోడలికి ఎందుకు అనే ప్రశ్న వేసుకొంటూంది కాబోలును...పడకగదినుండి కిలకిల నవ్వులు విన వచ్చాయి...కాపురానికొచ్చిన కొత్త దనాలు వాళ్లకేగా మరి...పిల్లవాడు దొర్లడం కెవ్వున కేక వేయడం ఒక్క క్షణంలో జరిగినాయి...ఆమె వైఖరి ఇంకా ఈర్ష్యా ప్రేమల మధ్య కొట్టుమిట్లాడు తున్నట్లు గానే అగుపించింది..."అయ్యో, అయ్యో—నా చిట్టి తండ్రిని చంపేసింది" అంటూనే లోపలినుంచి కేకలు వేసుకొంటూ కోడలు "ఆ" అంటూ అతనూ ఒక్క పరుగులో వసారాలో వచ్చి పడ్డారు...గానీ—ఆశ్చర్యం! ఆమె, పిల్లవాణ్ణి అక్కున చేర్చుకొని ముద్దాడుతోంది... చంటివాడామె శుష్కస్తనాన్ని నోట్లో పెట్టుకొని ఉత్సా హంతో ఆమెను హేళనం చేస్తున్నాడు... ఆమె మంద

## “ మ మ త ”

హాసంతో, వికసించినమోముతో—ఏవేవో ముద్దు మాటల్లో బుజ్జగిస్తోంది...అతనికి ఆ మాటలన్నీ వింటూంటే చిన్నప్పుడు తన్ని ఆ మాటల్లోనే తల్లి లాలించడం జ్ఞాపకం వచ్చి కన్నీరు వచ్చింది...కోడలు ఆ మాటలు వింటూ సిగ్గుపడింది......

...పిల్లాణ్ణి తీసుకు వెళ్లి తొట్టెల్లో పడుకోబెడదామని కోడలు అత్త చేతుల్లోంచి వాణ్ణి తీసుకోడానికి చేతులు జాచింది...వాడు వొకటే ఏడుపు...“ఉండవే పిల్లా! నే వాణ్ణి సముదాయిస్తాను...ఇప్పటి కాలం వాళ్లకి పిల్లల్ని పెంచడమే చాతగాదు” అంటూ ఆమె వాణ్ణి లోపలికి తీసుక వెళ్లింది...కోడలు భర్త కేసి వింతగా చూస్తూ—“పిచ్చిపోయిందల్లే వుందండోయి” అన్నది సాగదీస్తూ... అతను డాక్టరు వాక్యాలు జ్ఞాపకం చేసుకొంటూ ‘ఊ’ అని నిట్టూర్పు విడ్చాడు పెద్ద భారం దింపినట్లుగా...



# ఆగ్రహానుగ్రహాలు

(24 వ పేజీ తరువాయి)

వస్తూ, "క్షమించాలి. వైద్యం—" ఇంతలో ఆమె సేవా రామమూర్తిని చూచింది. "ఆఁ! మీ—మీ—మీరా ?" అని మోము వైవర్ణ్యం పొందగా తూలి పడబోయింది. "ఏమిటిది తల్లీ!" అని అనసూయాబాయి లేచి, ఒక గంతున ఉరికి ఉమాదేవిని పట్టుకుని సోఫాలో కూర్చుండ బెట్టింది.

"నర్సూ! త్వరగా! అమ్మగారికి అమ్మోనియా ఆరొమేటికా మందు ఒక డోసియ్యి!" అని కేక వేసింది.

ఇంతలో ఉమాదేవి ఆ సోఫామీద ఒళ్లు తెలియకుండా మూర్ఛపోయింది.

ఉమను చూడగానే చటుక్కునలేచి నిలుచున్న సేవా రామమూర్తిగారు "పార్వతీ! నువ్వా! నువ్వా!" అని ఆయన మోము వైవర్ణమైపోగా తూలబోయి, ఉమాదేవి స్థితినిచూచి తాను తెప్పరిల్లి ఒక్క గంతున ఉమాదేవి పడి ఉన్న సోఫాదగ్గిర వాలాడు.

"అనసూయా బహిన్! విసనకర్ర! నీళ్లు!!" అని అరచుచూ ఉమ నుదురు తడుపుతూ, తన టోపీతీసి ఆమె మోముకు విసరడం ప్రారంభించినాడు.

ఒక నర్సు మందు పట్టుకువచ్చి, సేవా రామమూర్తిగారి చేతికామందునిచ్చి, వారిని తప్పుకోమని, ఉమమోము సోఫానుండి తప్పించి, తాను సోఫాదగ్గిర చదికిలబడి, కాళ్లు ఎత్తుగా సోఫాపైనా, తలక్రిందుగా తన ఒళ్లోనూ వుండేటట్లూ పట్టింది. ఇంతలో ఒక మంత్రసాని వాసనమందు సీసా పట్టుకు పరుగెత్తుకొని వచ్చింది. అనసూయాబాయి కుండలో వున్న చల్లటి నీరుతో ఉమమోము తడుపుతోంది.

ఉమకు మెలకువ వచ్చి లేవబోయింది. వద్దని వారిస్తూ అనసూయాబాయి ఆమెకు మందు తాగమని తాగింపించింది.

సేవా రామమూర్తిగారు గజగజ వణుకుతూ ఉమ సోఫాప్రక్కన వున్న కుర్చీలో చతికిలబడినారు. ఉమకు కొంచెం బలం కలిగింది. అనసూయాబాయి "గురువుగారూ! ఇదా మీ కథ! మీ ఇద్దరూ వట్టి పెంకి బిడ్డలు! అంతకన్న నేనేమీ అనుకోను. ఇదిగో లోపల ఆ పురుడు కేసు ఎల్లావుందో చూసివస్తాను. అంటూ నర్సును, మంత్రసానిని తీసుకొని లోనికివెళ్లి పోయింది.

"పార్వతీ నువ్వా! అంత ప్రసిద్ధిపొందిన డాక్టరుగారివి. నేను...మహాపాతకుడను...నిన్ను ఎంత బాధ...పెట్టాను....రాక్షసులు—అయినా...,అంత బాధ...." అతని—కన్నులు...నీరు తిరిగింది.

ఉమ మాటలేక కన్నులు గంగోత్తరీ యమునోత్తురులై పైకెగసురుతూన్న వక్షంపైబడి పయ్యెదను తడిపివేస్తూ వుండగా మాటలేక, వంగి, ఆయన పాదాలను స్పృశించి తన కళ్ల కద్దుకొంది.

"మీ తప్పేమి...నా...నా...మూర్ఖత...మిమ్ము...అంత....అంత...ప్రేమిస్తూ....నిజ....నిజమైన....పతి వ్రతను కాలేక మాటలన్నాను...మీ.. మీ...మీలోని...కర్కశత్వాన్ని...పైకి...ఉబికింపచేశాను...ఈనాటికీ—"

"పార్వతీ...నా మూర్ఖత—వర్ణింపరానిది — నువ్వు ఆలా—వెళ్లిపోగానే, ఆ కోపంతో వెళ్లిపోయాను—మదరాసు—నువ్వు...వివాహం మానివేశావని—మీ—మీ నాన్నగారు—టెలిగ్రాం...ఇచ్చారు...నా ప్రపంచం కూలిపోయింది...మొదట వదిలింది ఈ కాంగ్రెసువాళ్ల సంబంధం అనుకున్నాను." కాంతారావు కళ్లవెంట నీరు కారిపోతూనే వుంది.

"నాన్నగారు నన్నెంతో బ్రతిమాలారు... నేనే వినక టెలిగ్రాం ఇప్పించాను—" పార్వతీదేవి భాష్పఝురులు ఆమె శరీరాన్నంతా ప్రయాగచేస్తున్నది.

"నేనెవర్ని సంపూర్ణావతారుని...పరమపవిత్రుణ్ణి...జగద్గురువును...బాపూజీని...అనడానికి...ఛీ! ఆ రోజునే ఎంత నీచుణ్ణి అయిపోయాను. ఆ బాధ వ్రణమూ అయింది! నిన్ను దేవీ మూర్తిని, కల్యాణస్వరూపను, సౌందర్యకాంతిమయిని—దూరం చేసుకొన్నానన్న బాధ హృదయంలో నిశితమైనబాణం గుచ్చుకొన్నట్లూ అయింది—తిండి సహించలేదు—నిద్రలేదు—ఖద్దరు కట్టాను—మీ ఇంటికి రాజమండ్రీ వచ్చి మీ నాన్నగారి కాళ్లమీద పడ్డాను—"

"అంతా విన్నాను——అయినా——రాయిలా అయిపోయింది హృదయం——నాకూ నిద్రాహారాలు పోయాయి—!"

"ఇంకనూ—"

"మిమ్మల్ని మరువలేదు—నాకు—నాకు ఎప్పుడూ—మీరే—"

"నేను—ఒక్క క్షణికం నిద్దురలోనవ్వా—నిన్నే—నువ్వు—"

"........."

"నన్ను — పూర్తిగా — సంపూర్ణంగా — క్షమించ గలవా ?"

"నన్ను—మీ — మీరే — క్షమించ — క్షమించ లేరు—"

"అయ్యో ! నేనా—నేనా క్షమించడం—హీనుణ్ణి—"

"మనం ఇద్దరం—ఒకరొకరు క్షమించుకో—అవసరంలేదు—"

"నన్ను...నన్ను...కృతార్థుణ్ణి చేయగలవా దేవీ !"

"నేను ఏనాటికైనా మీదాన్నే—మీమాట నాకు భగవంతుని వరం—"

"ఎంత కష్టపడితే ఏమి—ఆరాధ్య దేవతవు—నిన్ను ఇప్పటికైనా—దేవీ !"

"మీరు నా...నా—ఆత్మకు ప్రభువులు—"

వారిరువురూ ఎంతలోన ఆడిస్తున్నారో—వారి బ్రతుకులు ఏ పరిణతికోసం వేదనా భరితాన్వేషణ యోగంలో ఉండిపోయాయో ! సేవా రామమూర్తి లేచి ఆమె ప్రక్కన కూర్చుండినాడు. ఆమె అతనికి దగ్గరగా జరిగి—"మీరు—మీరు—నిజమా—?" అన్నది అస్పష్టకాకలీ స్వరంతో.

వారి కంటిధారలు అలాగే ప్రవహిస్తున్నాయి.

అవి పవిత్ర గంగాంబుజ తరంగిణాలు.

అవి దివ్యామృతధారలు.

ఆయన ఉమను దగ్గరగా తీసుకొన్నాడు.

"అనసూయాబహెన్ ముహూర్తం పెట్టిస్తుంది !"

"బాపుజీ ! జగత్పిత ! పెళ్లి పెద్ద !"

ఓం తత్ సత్

[ఇది కేవలము కల్పిత కథ. ఇందలి పాత్రలుగాని, పేర్లుగాని ఏ ప్రత్యేక వ్యక్తికి చెందినవిగావు. —రాధా వసంత.]



## చర్చిలో ప్రత్యేక అర్చనలతో, తోచిన బహుమానములతో
# తండ్రులను గౌరవించే పద్ధతి

అమెరికాదేశస్థులు, వర్షావర్షం, జూన్ 3-వ ఆదివారం, తండ్రుల దినముగా ప్రత్యేకించారు. ఆ రోజున గుళ్లల్లో ప్రత్యేక అర్చనలు చేయించి, ఏవో చిన్న చిన్న బహుమానములతో తండ్రులను గౌరవించటం ఒక పద్ధతి అయింది. 1910 సం॥లో, స్పోకేన్‌లో, మిసెస్. డాడ్ అనే ఆమె, తల్లి మరణానంతరం, ఆర్గురు బిడ్డలను పెంచిన తన తండ్రియందు ప్రత్యేక గౌరవమును తెలుపుటకై, ఆ ఊరి చర్చి సంఘంవారికి తన అభిమతాన్ని ఎరింగిస్తే, ఆ ఊరి ప్రజలందరూ దానికి సమ్మతించారు అమెరికా అధ్యక్షులు కాల్విన్ కూలిడ్జిగారు 1924 సం॥ నుండి, దేశమంతటా జూన్ మూడవ ఆదివారం తండ్రుల రోజుగా ప్రత్యేకిస్తే బాగా ఉంటుందని తమ అభిమతాన్ని సూచించారు. అప్పటి నుండి, ఆ పద్ధతి జాతీయమైనది.

ఈ సంవత్సరము, దేశీయుల ప్రత్యేక అభిమానాన్నిపొంది, బహూకరించబడ్డ పెక్కుమందిలో, మిషిగన్ వ్యవసాయదారుడు గెరిట్‌కోయంగా. 21 మంది బిడ్డల తండ్రి యగుటయే యితని ప్రత్యేకత—ఇందులో 5 జతలు కవలలు. 21 మంది సజీవులై యున్నారు. అగ్రజుడికి వయస్సు 25 సం॥లు. కనిష్ఠునికి 2 సం॥లు.





# పాత్రలకు బిడ్డలు

❋ శ్రీమతి వల్లూరి సుశీలాదేవి ❋

పూర్వము ఒక వూళ్ళో ఒక కోమటి ఉండే వాడు. వాడు చాల పిసిని గొట్టు, దురాశా పరుడు. ఎప్పుడు స్వార్థము కోరుతూ ఉండేవాడు. ఇలా ఉండగా ఆ కోమటి ఇంటికి ఒకడు వచ్చి "అయ్యా! నా ఇంట్లో ఒక శుభకార్యము జరుగ బోవుచున్నది. దయయుంచి తమరు నాకు కొన్ని పాత్రలు ఇప్పించండి. పాత్రకు రోజుకు రెండు అణాలు చొప్పున తెచ్చి ఇస్తాను" అని వేడుకున్నాడు. కోమటి కొంతసేపు ఆలోచించి తర్వాత లోపలికి వెళ్ళి కొన్ని పాత్రలు లెక్క-పెట్టి అతనికిచ్చి పంపివేసెను.

ఆ వచ్చిన మనిషి ఒక వారము దినముల తర్వాత వచ్చి అతను తెచ్చిన పాత్రలు కోమటి ఎదురుగ పెట్టెను. పెద్ద పాత్రలతో పాటు కొన్ని చిన్న పాత్రలు కూడ అధికముగ తెచ్చి నాడు. వాటిని చూచి కోమటి ఆమనిషితో "అయ్యా! ఈ చిన్న పాత్రలు ఎక్కడనుండి వచ్చాయి? నేను నీకు పాత్రలు ఇచ్చినప్పుడు అవి లేవు కదా!" అని అడిగాడు. వెంటనే ఆమనిషి "అయ్యా! అవి తమ పాత్రలు పెట్టిన పిల్లలు. అవి కూడ తమరికే ఇచ్చి వేయాలి గదా! అని అన్నీ ఇచ్చి వేశాను." అని చెప్పగానే ఆ కోమటి చాలా సంతోషించి వాటినన్నిటిని తీసుకొని జాగ్రత్తగా లోపలికి చేర్చి ఎల్లప్పుడు తన ఇంటికి వచ్చుచుండు మని చెప్పి అతనిని పంపివేసెను.

కొన్ని నెలల తర్వాత ఆ మనుష్యుడు తిరిగి కోమటి ఇంటికి వచ్చి "అయ్యా రేపు నా కొడుకు వివాహము. దయయుంచి ఒకమారు మీ పాత్రలు ఇప్పించండి" అని అడిగాడు. వెంటనే దురాశాపరుడైన ఆ కోమటి లోపలికి వెళ్లి ఇంటిలో ఉన్న పాత్రలు అన్నీ అతనికి ఇచ్చి "అయ్యా ఆ పాత్రలు పెట్టిన బిడ్డలు అన్నిటినీ తీసుకురండి" అని చెప్పాడు. ఆ మనుజుడు సరే నని ఇంటికి వెళ్లాడు. అతని ఇంట్లో పెళ్లి అయి పోయిన మూడు రోజుల తర్వాత అతడు ఏడుస్తూ

కోమటి ఇంటికి వచ్చాడు. అతని ఏడ్పు చూచి కోమటి సంగతేమిటో చెప్పమని కోరాడు. అప్పుడు అతడు "అయ్యా! రాత్రి తమ పాత్రలకు జబ్బు చేసింది. ఎంతమంది డాక్టర్లకు చూపించినా నయము కాలేదు. తెల్లవారు జామున అన్నీ చచ్చి పోయాయి!" అని ఇంకా ఏడ్చుట మొదలుపెట్టాడు. దానికి ఆ కోమటి "ఏమిటీ, నువ్వు చచ్చిపోతావు, నేను చచ్చిపోతాను. మనుష్యులు, జంతువులు చచ్చి పోతాయి కాని ఎక్కడైనా పాత్రలు చచ్చి పోతాయా? నిజము చెప్పుము" అని గద్దించాడు. ఆ మనుష్యుడు తిరిగి "అయ్యా! తమ పాత్రలు చాల విచిత్రమైనవి. మీ పాత్రలు బిడ్డలని పెట్టాయి, చచ్చి పోతాయి. కూడాను" అని చెప్పినాడు. అప్పుడు కోమటి అతని మాటలకు సిగ్గుపడి మారు మాటాడక లోనికి పోయాడు. ఆ మనుష్యుడు కోమటికి మంచి పాఠము నేర్పాడు. కథ కంచికి మనము ఇంటికి.

—హిందీనుండి



# గోరింక

**∗ గులపల గోపాలు ∗**

గూటిలో ఒకనీలి
గోరింక నను జూచి
కిలకిలా నవ్వింది
తలవూపి పోయింది.
సంధ్యవేళానాడు
చరచరా గోరింక
గూటికీ వెడుతుంటె
వేటకాడొక్కండు
వెంబడించాడు
గత్యంతరము లేక
కదలి వచ్చాను.
ఆ నాడు నడిరేయి
గగనమ్ములో మేము
కిచకిచల్లాడాము
పయిపైన పొర్లాడి
ఉస్సు మన్నాము.

మరునాడు గోరింక
నను కలియవచ్చింది
ప్రక్కనే వున్న ఓ
పక్కినీ జూచింది
ఉక్రోష మొచ్చింది
కండ్లు వుఱుముచు పండ్లు
పెటపెటా గీటింది.
గొల్లుమని నా యెదుట
గోడు మన్నాది.
నమ్మినా నన్నాది.
నట్టడవిలో నీట
ముంచినా వన్నాది.
దిక్కు లేదన్నాది.
నీవు విడిచిన-భ్రష్టు
రాలగుదు నన్నాది.
హృదయమంటూ నీకు

ఉన్నదా అన్నాది.
కటికరాయే నీకు
హృదయమూ అన్నాది.
సత్యమే పలికింది
నా మనసు కరిగింది.
కన్నీటి బిందువులు
బొటబొటా రాలింది
గోరింక, దరిజేరి
కొంగుతో తుడిచింది
కొంగులోనే తలను
దాచుకొన్నాను.
ప్రక్కనున్న పక్కి
పరువు లెత్తింది.
ఇరువురము యిచ్ఛగా
ఇలను యున్నాము.



# వదినపాట

* సుంకర రామమోహన రావు *

వాకిట నిలచిన వదినమ్మా
నేటికి పుణ్యం నెగ్గిందా
అన్నను దలచి మది కులుకు
మమ్ముల జూచి మరి నవ్వు! ॥ వా ॥

ముదమొందిన ముత్తైదులలో
పదములు బాడే పాపలలో
జీవము నిచ్చెడి దీవెనల
భావముచిందిన దోయమ్మా ॥ వా ॥

ఆస్తులు పెంచిన హంకారం
కట్నాల్ కీకల కలవరము
అణగిన జీవిత ఆనందం
గణన జేసెనా మీబాబు! ॥ వా ॥

లేతలేత సొరకాయలను
కోరిక దీరా కోసేస్తూ
పరిపరి విధముల మీరాయన్న
పలికిన సత్యం పండిందా! ॥ వా ॥

లోకం తీరులు పఠికించు
లోతుగుండెలను కదిలించు
విజ్ఞానాంబుధి చిలికించు
విజయ గీతమే పూరించు! ॥ వా ॥

అమాయకమ్మగు ఆనందం
అవలేపమ్మగు ఆశయము
పవిత్రమగు మీ ప్రణయమ్ము
పావనమై పోయినవమ్మా ॥ వా ॥

భారత మహిళల బాధ్యతలు
నెరవేర్చెడి నీ నేరుపులో
హారతి బట్టిన ఆశయము
అమరియున్నదని నమ్మితిమి! ॥ వా ॥



# ఆలోచించండి!

మండ మల్లికార్జునరావు

(1) ప్రపంచమంతటిలో పెద్దపట్టణ మేది?

(2) ప్రపంచమంతటిలో జనసంఖ్య ఎక్కువ గల దేశమేది?

(3) మన దేశములో పెద్దపట్టణ మేది?

(4) ప్రపంచ జనసంఖ్య ఎంత?

(5) బంగారు దేవాలయం మన దేశములో ఎచ్చట గలదు?

(6) మన దేశాధ్యక్షు డెవరు?



# శ్రావణ మంగళ వారం

* మండ మల్లికార్జున రావ్ *

ఒక గ్రాంటు బడికి ప్రొప్రైటరు
"జాక" ను క్రిస్టియన్ దొర
ఆ దొరగారికి మాత్రం
ఏదో తెలుగు కొద్ది వచ్చు.

ఆతను ప్రతి యేడాదీ
అతనిబడికి వచ్చువాడు
పిల్లల చదువులు సంధ్యలు
ఎల్ల తణిఖీ చేయువాడు.

ఇల్లాగునె ఒకయేడూ
ఆ స్కూలుకునె వచ్చాడు.
ఎన్ని ప్రశ్నలు వేయాలో
అన్నీ అట్లు వేశాడు

ఇంతలో ఒకకుర్రాడు—
వింతగ నిలబడ్డాడు.
జాక్కుగారు! దొరగారూ!
"ఒక్క మనవి"—అన్నాడు.

వెంటనె ఆ దొరగారు ఏ—
మిటని అడిగారు....
జంకకుండ కొంకకుండ—
బొంకులేక చెప్పాడు.!

శ్రావణ మంగళారానికి
ప్రతిసారి శెలవిచ్చేవారు!
కాని మరి యెంచేతో—.
ఈ యేడు ఇవ్వలేదు-!

తక్షణమె దొరగారు-ప
రీక్ష ఆపుచేశారు
హెడ్మాష్టర్నడిగారు-అ
తడిట్లు చెప్పాడు.

శ్రావణ మంగళవారం
ఈ యేడు పడ్డదాదివారం
సెలవురోజున పడుటచేత
బాలలకు శెలవివ్వలేదు.



(ఆలోచనలకు జవాబులు)

(1) లండన్.
(2) చైనా.
(3) బొంబాయి.
(4) 237 కోట్ల 80 లక్షలు.
(5) అమృతసర్.
(6) బాబు రాజేంద్ర ప్రసాద్.



साल సంవత్సరము
सही సరి
सो అది
पढ़ाई విద్య, చదువు
सुविधा సౌకర్యము
शुल्क బడి జీతము
मौका అవకాశము
करीब దాదాపు
प्रबंध ఏర్పాటు
बदनसीब దురదృష్టవంతుడు
जिन्दगी జీవితము
आसरा ఆధారము
जीविका జీవనోపాధి
सहेली స్నేహితురాలు
कताई నూలు వడకుట
बुनाई బట్టలు నేయుట
सिलाई కుట్టుపని
मुफ़्त జీతములేక Free
छात्रालय వసతి గృహము
सदस्या (woman) member
सराहनीय పొగడదగినది
सैकड़ों వందలకొలది
प्रायः సాధారణముగా
भर्ती होना చేరుట
बदलना మారుట, మార్చుట
कमाना సంపాదించుట

जानकी—लक्ष्मी, मैंने सुना, तुम्हारी बहन आजकल 'कान्वेन्ट' नहीं जाती।

लक्ष्मी—हाँ, वह तो इस साल 'आन्ध्र महिला सभा' में भर्ती हुई है।

जानकी—क्यों? एक ही स्कूल में पढ़ना अच्छा है न? इस तरह साल साल स्कूल बदलने से क्या फ़ायदा?

लक्ष्मी—हाँ बहन, तुम्हारा कहना सही है। लेकिन इस स्कूल में पढ़ने में फ़ायदा जरूर है।

जानकी—सो कैसे?

लक्ष्मी—पहली बात यह है—वहाँ पढ़ाई जल्द पूरी हो जाती है। वहाँ, जिसे अंग्रेजी का थोड़ा-बहुत ज्ञान है। उसके लिये तीन या दो ही साल में मैट्रिक परीक्षा में बैठने की सुविधा है। तो इससे समय और शुल्क भी कम लगता है न?

जानकी—लेकिन कोई कह रही थी—परीक्षा देने के लिये लड़कियों को बनारस जाना पड़ता है।

लक्ष्मी—हाँ, वह भी एक बात है। इसमें भी तो उन्हें फ़ायदा है। हर साल स्कूल की दो तीन अध्यापिकाएँ लड़कियों को बनारस ले जाती हैं। वहाँ इन्हें करीब एक महीने तक ठहरना पड़ता है। प्रायः ये वहाँ से सारनाथ, प्रयाग, देहली और आगरा भी देखने जाती हैं। इससे उन्हें उत्तर भारत की दो चार जगहें देखने का मौका मिल जाता है।

जानकी – तो वहाँ पढ़ाई पूरी करने के बाद ये लड़कियाँ कालेज में भर्ती हो सकती हैं ?।

लक्ष्मी—क्यों नहीं ? वहाँ की कई पुरानी विद्यार्थिनियाँ अब तक डिग्री भी ले चुकी हैं।

जानकी—इस स्कूल की स्थापना हुए कितने साल हुए ?

लक्ष्मी—दस साल हुए हैं। इसे खोलने का उद्देश्य था उन बदनसीब बहनों की पढ़ाई का प्रबंध करना—जिन्हें कि जिन्दगी में कुछ आसरा नहीं रह गया है और जो अपनी जीविका ख़ुद कमाना चाहती हैं।

जानकी—यह जानकर मुझे बड़ी ख़ुशी होती है। मेरी एक सहेली है जो ऐसी किसी संस्था में भर्ती होना चाहती है। तुम उसे किसी दिन वहाँ ले जा सकती हो ?

लक्ष्मी—ज़रूर। सभा की एक और शाखा भी है जिसमें स्त्रियों को कताई, बुनाई, सिलाई वगैरह की शिक्षा दी जाती है। जो शुल्क नहीं दे सकतीं, उन्हें मुफ़्त ही शिक्षा मिलती है। बाहर की लड़कियों के रहने के लिए छात्रालय भी है।

जानकी—वहाँ और क्या क्या है ?

लक्ष्मी—और भी बहुत है। क्लब शाखा एक है। क्लब की सदस्याएँ शाम को वहाँ आया करती हैं। उन्हें अन्य बहनों से मिलने का मौका मिलता है। यहाँ के पुस्तकालय में तेलुगु, अंग्रेजी और हिन्दी की किताबें पढ़ने को मिलती हैं। शाम को नृत्य, गायन और हिन्दी वर्ग चलते हैं। इतना ही नहीं, 'टाइप' और षार्ट हैन्ड़ के वर्ग भी हैं। सभा की तरफ़ से एक मासिक पत्रिका भी निकलती है।

जानकी—तो यह संस्था बहुत ही सराहनीय काम करती है।

लक्ष्मी—हाँ, इसकी प्रशंसा देश के बड़े बड़े नेता भी करते हैं।

जानकी—हमारे देश में अभी ऐसी सैकड़ों संस्थाओं की ज़रूरत है।



# పిల్లల శిక్షణ, శాస్త్రీయ దృక్పథం

శ్రీమతి దరిసి సుభద్రమ్మ

## సామాజిక ప్రవర్తన

(రెండవ భాగము)

రెండున్నరనుండి మూడేళ్లు ఈడుకరకు, బిడ్డలు కొందరు తమ ఇంటివద్దనే ఆడుకొనటానికిష్టపడుతారు. ఇరుగు పొరుగు బిడ్డలతో కొంత ఆడుకొంటారు కాని, ఇంటి వద్ద మాత్రమే ఆడుకొంటారు. ఇతరుల ఇండ్లకు, క్రొత్త చోట్లకు వెళ్లి ఆడుకోటానికెంత మాత్రము ఇష్టపడరు. మరికొందరు ఇరుగు పొరిగిళ్ల వద్దకాని మరెచటనైనా సరే క్రొత్త పాత లేకుండ చక్కగా ఆడుకొంటారు. మొదటి రకం బిడ్డలకు క్రొత్తవాళ్లు, క్రొత్తచోట్లు అంటే తగని బిడియము భీతి. ఇట్టి సిగ్గు భయాదులను వెలిబుచ్చు బిడ్డలు క్రొత్త పరిసరములకు, క్రొత్త పరిస్థితులకు తగినట్లుగా వర్తించు శక్తి త్వరగా అలవరచుకొన జాలరు. రెండవ రకం పిల్లల ప్రవర్తన భిన్నంగా వుంటుంది. అపరిచితులు, అపరిచిత స్థలాలంటే వీరికి, సిగ్గు, భయముండదు. అందు చేతనే ఈ రకం బిడ్డలు ఇరుగు పొరిగిళ్లకు వెళ్లి ఆడుకోటానికెంతో ఉల్లాసము ఉత్సాహమును వెలిబుచ్చుతారు. ఇట్టి బిడ్డలు, క్రొత్త పరిసర పరిస్థితుల కనుగుణ్యంగా ప్రవర్తించు శక్తిని త్వరగా అలవరచు కొంటారు. ఇట్టి భిన్న ప్రవర్తనలకు ముఖ్య కారణము బిడ్డ పెరుగుతున్న కుటుంబ పరిసర పరిస్థితులే అని చెప్పక తప్పదు. కాబట్టి తల్లి దండ్రులు, తమబంధు మిత్రులతో, ఇరుగు పొరుగు వారితో కలసి మెలసి వుండుట, విందు వినోదములలో తరచుగా పాల్గొనుట, సంస్కృతి, సహవాసము, సానుభూతి సహకారములతో గూడిన వాతావరణమును కల్పించుట, మున్నగు విషయములకు గమన మిచ్చుట ఎంతయినా అవసరమన్న మాట. ఇంత మాత్రమేకాదు, తల్లి తన ఈ ఈడు బిడ్డ యొక్క చిత్తవృత్తిని పరిశీలించుతూ దాని సామాజిక ప్రవర్తన పెంపొందుట కవశ్యకమైన సుశిక్షణ ఇవ్వాలి. ఏలాగంటే :—

తమ, ఇంటివద్ద తప్ప మరెక్కడ కాని ఆడనొల్లని బిడ్డల విషయం మొదట ఆలోచిద్దాము. తల్లి ఇరుగు పొరుగు బిడ్డలను ఇంటికి రప్పించి తన బిడ్డను ఉల్లాసంగా వారితో కలసి ఆడుకొనునట్టి అవకాశమును కల్పించాలి. దీనితోపాటు, పై పిల్లలతో కలిసి క్రొత్తచోట్లకు, ఇతరుల ఇళ్లకు, అనగా...పురఉద్యానవనములు, బాలక్రీడాస్థలములు, బంధుమిత్రులు, ఇరుగు పొరుగువారి ఇండ్లు మొదలగు చోట్లకు వెళ్లి ఆడుకొనునట్టి అవకాశములను కల్పించాలి; బిడ్డ తన ఈడువారితో మాత్రమేగాక తనకన్న పెద్ద పిల్లలతో—అనగా—నాలుగైదేళ్ల ఈడువారితో కలసి ఆడుకొనునట్టి సదుపాయములను కల్పించాలి.

ఇంతేకాదు. ఈ బిడ్డకున్న మరొక లక్షణము తెలుగుట అత్యవశ్యకము. ఈ బిడ్డ (తన ఇంటివద్ద తప్ప మరెచటకాని ఆడ నొల్లని బిడ్డ) సామాన్యంగా, తన ఆట సామగ్రితో ఇతర బిడ్డలను ఆడుకోనివ్వదు; తనకత్యంత ఇష్టమైన క్రొత్త పిడతలు, బొమ్మలను అసలే తాక నివ్వదు. ఇట్టి లక్షణమును గుర్తించి తల్లి ఇరుగుపొరుగు బిడ్డలు రాకముందే తన బిడ్డ కిష్టమైన ఆట వస్తువులను కొంత కాలం మాత్రం దాచి వుంచాలి. ఆ విధంగా చేసినచో తన బిడ్డ తనకంత ఇష్టం లేని ఆటసామగ్రితో ఇతర బిడ్డలతో ఆడుటకు అంగీకరించుతుంది; తను కూడ వారితో కలసి కొంత సేపు ఆడుకొంటుంది; అటుపిదప తనకత్యంత మక్కువగల క్రొత్త పిడతలను, బొమ్మలను తన చెలి కాండ్రకు చూపెట్టా లన్న అతిశయ భావంచేత తీసుకవచ్చి చూపెట్టుతుంది; క్రమేణ వారితో కలసి క్రొత్తవాటితో ఆడుకొనుటకు అలవడుతుంది. ఏ కారణం చేతనైనా తన బిడ్డకు తన కత్యంత ప్రియమైన ఆటవస్తువులను అసలే చూపించక పోయినచో వాటిని చూపెట్టు లాగున తల్లి అత్యంత చాక చక్యంతో సూచించాలి. ముఖ్యంగా ఇట్టి బిడ్డలను నర్సరీ స్కూళ్లకు పంపుట అత్యుత్తమము! అచట పరిసర పరిస్థితులు సుశిక్షణ ఫలితంగా ఈ బిడ్డకున్న బిడియము, భీతి సన్నగిల్లుతవి; అప్పుడప్పుడే తలసూపుతున్న అహం

భావం, అతిశయం మొక్కలోనే నశించిపోతవి; కష్ట నిష్ఠూరముల నెదుర్కొంటూ సహజమార్గమున తన వ్యక్తిత్వమును స్థిరపరచుకొంటుంది; వీటితోపాటు నలుగురితో కలిసి మెలసి ఆడుకోటం, అన్యోన్య అనురాగం, సహవాసం మున్నగునవి పట్టుబడుటేగాక, క్రొత్త పరిస్థితుల కనుగుణ్యంగా ప్రవర్తించుటను అలవరచుకొనుటకు అవకాశమేర్పడుతుంది. అనగా—సంఘ జీవనమునకు పునాది ఏర్పడుతుందన్నమాట.

ఇక రెండవ రకం బిడ్డలను గురించి ఆలోచిద్దాము :— వీరు ఇంటివద్ద ఆడుకోటాని కిష్టపడరు; ఇరుగు పొరుగిళ్లకు, క్రొత్తచోట్లకు వెళ్లి ఆడుకొంటారు; ప్రొద్దస్తమానం బయటకెళ్లి, ఎక్కడో ఒకచోట ఆడుకోటాని కిష్టపడుతారు. ఇట్టి బిడ్డలు క్రొత్త పరిసరములకు, పరిస్థితులకు అనుగుణ్యంగా వర్తించుటను త్వరగా అలవరచుకొంటారు, కాని, కుటుంబ జీవనము, బంధుజన ప్రేమ పెంపొందించునట్టి అవకాశములను వీరికి కల్పించుట అవశ్యకము. తల్లి ఈ లక్షణముగల తన బిడ్డకు ఇంటివద్ద సయితము, ఇతర పిల్లలతో పాటు, తన అన్నదమ్ములు, అప్పచెల్లెండ్రతో కలిసి ఆడుకొనునట్టి పరిస్థితులను—అనగా—అత్యంతాకర్షణీయమైన పరిస్థితులను కల్పించాలి :— ఉదా :— బిడ్డలు పాల్గొనునట్టి, విందు వినోదములు, తన బిడ్డ యొక్క జన్మదినోత్సవము, బొమ్మలకొలువు, ఆటపాటలు మున్నగునవి అన్నమాట; ఇంటిలో తన తల్లికి, తండ్రికి తక్కిన బంధు జనులకు చిన్న చిన్న పనులను చేస్తూ తోడ్పడటం మొదలైనవాటికి అవకాశములు కల్పించాలి. ఈ విధంగా తల్లి తెలివి తేటలతో ఈ రకం బిడ్డకు తోడ్పడినచో, తన బిడ్డ ఇంటా బయటా ఆయా పరిస్థితుల కనువగు ప్రవర్తనల వరచుకొంటూ కుటుంబ జీవనమునకూ, సంఘ జీవనమునకు సిద్ధపడుతుంది.

సాధారణంగా ఈ ఈడు బిడ్డలు (2 నుండి 3 ఏళ్లు దాక) తమ తల్లి దండ్రులలో ఎవరినో ఒకరిని మాత్రమే అధికంగా ప్రేమించునట్లు గోచరించుతుంది; తల్లినా, తండ్రినా అను విషయంలో ఒక్కొక్కరొక్కొక్క విధంగా వుంటారు; ఒకప్పుడొకరినీ మరొకప్పుడు ఇంకొకరినీ ఎక్కువగా ప్రేమించుట కలదు; కాని పై రెండు లక్షణములు తాత్కాలికమేను; పగలు ఒకరినీ, రాత్రి మరొకరినీ, లేదా, కొన్ని ఘంటల కాలం తల్లియందు, కొన్ని ఘంటలసేపు తండ్రియందు అధికానురాగం వెల్లిబుచ్చుట కలదు. మరుసటి రోజు, లేదా, కొంత సేపుకుతరువాత వారిలో మరొక విధంగా మార్పుకలుగుట పరిపాటి. అనగా—ఈ వయస్సు బిడ్డకు ఈ విషయంలోకూడ స్థిరత్వము ఏర్పడక డోలాయమానసము గోచరించుతుంది. అయితే, ఆ పూట ఎవరిని ఎక్కువగ ప్రేమిస్తుందో వారియందు బిడ్డకు గురుత్వం ఏర్పడి, వారి సలహా సహాయములను పొందుటకు ఇష్టపడుతుంది. రాత్రులందు మూత్రవిసర్జన విషయంలోకాని, తనకు నిద్రవచ్చినప్పుడుకాని తఱచుగా తల్లి తన చెంత వుండి సహాయ పడాలని కోరుతుంది. కాని, ఒక్కొక్క సమయంలో తండ్రి కావాలని పట్టు బట్టుతుంది. ఈ విషయమును గురించి మన శాస్త్రజ్ఞులలో వివిధాభిప్రాయములు బయలుదేరినవి. ముఖ్యమైన కొన్నిటిని మాత్రము సంక్షిప్తంగా తెలిసికొనుట మంచిదనుకొంటాను.

తల్లిదండ్రుల పిల్లలమధ్య, పరస్పర ప్రేమ లింగ భేదమునుబట్టి పెంపొందునని కొందరు శిశుమనస్తత్వవేత్తల అభిప్రాయము. మరి కొందరు శిశుమనశ్శాస్త్రజ్ఞులు పై అభిప్రాయము ఖండించుతూ, బిడ్డ పుట్టి పెరుగునట్టి పరిసర పరిస్థితుల ప్రభావ ఫలితముగ, అనురాగ విషయంలో లింగభేదం కొందరు బిడ్డల విషయంలో కొంత కనిపించినను అది అస్వాభావికమనీ, అందరికీ ఈ సిద్ధాంతం అన్వయించదనీ ఉద్ఘాటించినారు. కొంత స్థూలంగా పరిశీలిద్దాము :—శిశువు జన్మించి నప్పటినుండి ఆరు ఏళ్లు ఈడు వరకు సామాన్యంగా, ఆడ బిడ్డ తన తండ్రినీ, మొగ బిడ్డ తల్లినీ అధికంగా ప్రేమిస్తారనీ, ఇది సహజ గుణమనీ, వీటికి సంబంధించిన మరెన్నో విషయములను, కొందరు శిశు మనస్తత్వ వేత్తలు సిద్ధాంతీకరించి యున్నారు.

ఇట్టి సిద్ధాంతం పొరపాటు. బిడ్డ చుట్టునున్న సన్నివేశ సందర్భములు సరియైనవి కానప్పుడే ఇట్టి విచిత్ర గుణం (అస్వాభావికమైన పెడదారి బట్టిన చిత్తవృత్తి) తాత్కాలికంగా కొందరు బిడ్డలయందే మాత్రం గోచరించవచ్చుననీ,

అంపరు బిడ్డలయందు ఇట్టి చిత్త వృత్తి ఉండదు అనీ ఊహించారు—తండ్రి ఉదయం నుండి సాయంకాలంవరకు ఇంటివద్ద వుండడు; తన వ్యవహారములను ముగించుకొని సాయంకాలం తండ్రి ఇంటికి రాగానే బిడ్డను (ఆడ మొగ వివక్షత లేకుండ) చేరదీసి, వాహ్యాళికో, వింత వినోదములను తిలకించుటకో తీసుకపోతాడు; లేదా బిడ్డతో ఆడు కుంటాడు; సాధారణంగా తల్లి తన గృహ కృత్యాలలో మునిగిపోయి వుంటుంది. ఇంతే కాదు. వుదయం నుండి తండ్రిని చూడకపోవుటచే అతనియందు కొంత క్రొత్తదనం బిడ్డకు కనిపించుతుంది; ఇట్టులే మరెన్నో కారణములచేత బిడ్డ తండ్రిచెంత నున్న కాలంలో అధికంగా ప్రేమ వెలిబుచ్చుతుంది. కాని, ఇట్టివాటికి వ్యతిరేక పరిస్థితులలో—అనగా—వ్యవహార ప్రపంచమున పనిచేసి, అలసి వచ్చుట చేతనో, లేక కష్ట నిష్ఠూరముల వలన ఏర్పడిన హృదయ బాధ చేతనో తండ్రి ఇంటికి వచ్చినపుడు విసుకు, చీకాకు చూపించవచ్చును. అట్టి సందర్భములలో బిడ్డడు తండ్రితో ఆహ్లాదంగా, స్వేచ్ఛగా ఆడుకోక, భయపడవచ్చును. తల్లి తన్ను అనుక్షణం ఆదరించుతూ అనురాగం చూబెట్టుటచేత ఆమెను ఎక్కువగా ప్రేమించవచ్చును. లేదా, కుటుంబంలో దారిద్ర్యం మున్నగు బాధలవల్ల తల్లి తన సహాజ సహాన శక్తిని తాత్కాలికంగా గోలుపోయి చీదరించు కొన్నచో తాత్కాలికంగా బిడ్డ తల్లిని చూచి భయపడవచ్చును. లేదా, కొన్ని కుటుంబములలో నున్న అజ్ఞానం, ఐశ్వర్య మదాంధము, స్త్రీలయందు నైచ్యభావము, పురుషులయందు ఉత్కృష్ట భావము, మున్నగు వాటితో గూడిన వాతావరణములో పెరుగు నట్టి బిడ్డలు మొగ, ఆడ వివక్షతలేక తల్లిని ఏవగించుకోటం, తండ్రిని పూజ్యభావంతో ప్రేమించటం తటస్థించ వచ్చును. కుటుంబ పోషణకు సరిపోవునంత ద్రవ్య ఆధారముండి (ఉద్యోగంలేక ఏదో ఒక వృత్తి వలన సంపాదించుకొను అవకాశము) చక్కని సంస్కృతి—అనగా, విద్య విజ్ఞానాలు, సంగీత సాహిత్యాలు, పరస్పర ప్రేమ, సత్సహావాసము, సానుభూతి మొదలగు పరిస్థితి వాతావరణములమధ్య పెరుగునట్టి బిడ్డలలో సహాజమైన అనురాగము, సత్ప్రివర్తన మొదలగునవి నిరాటంకంగా అభివృద్ధి చెందుతవి. అష్టైశ్వర్యమున్నప్పటికీ, సంస్కృతికీ, అన్యోన్య రాగములకు, తావులేని కుటుంబములలో పెరుగు బిడ్డలలో అస్వాభావికమైన వాంఛలు, అవకతవకలగా నుండు అనురాగము మానసిక వ్యాధులు మున్నగునవి గోచరించును. అసలే అన్నానికే మలమల లాడి పోతూ, అష్ట దరిద్రము ననుభవించుచున్న కుటుంబములో పుట్టి పెరుగు బిడ్డలకు మరెన్నో విధములయిన అస్వాభావిక వాంఛలు, దైహిక మానసిక వ్యాధులు సంక్రమించ వచ్చును. కాబట్టి ఇట్టి విచిత్రమైన—అనగా—అస్వాభావికమైన ప్రవర్తనలు జన్మతో పుట్టిన సహజ గుణములనుటకన్న, బిడ్డ పెరుగు పరిసర పరిస్థితుల ఫలితముగ పెడదారి బట్టిన ప్రవర్తలనుట సమంజసము. అనేక సుగుణ దుర్గుణములకు, సత్ప్రవర్తన దుష్ప్రివర్తనలకు, సక్రమ చిత్తవృత్తులకూ, పెడదారిని బట్టిన చిత్తవృత్తులకూ, వివిధ మానసిక రోగములకూ బిడ్డ పుట్టి పెరుగు తుండే సమాజ, కుటుంబముల యొక్క పరిసర పరిస్థితులే మూలకారణములనీ, సామాజిక ప్రవర్తన అనేది బిడ్డకు ఆరు ఏళ్లు నిండునప్పటికే చాలవరకు పట్టుబడిపోతుందనీ మరికొందరు మన తత్త్వవేత్తలు అనేక ఏండ్ల పర్యంతము బహువిధములగ పరిశోధించి సిద్ధాంతీకరించి యున్నారు.

ఇందువలన తేలినదేమంటే, బిడ్డ సంఘజీవి. ఆడ, మొగ అను వివక్షతలేక సక్రమ మార్గమున సర్వతోముఖాభివృద్ధి చెందుటకు అనువగు సంఘ కుటుంబ పరిసర పరిస్థితులు—అనగా, ఒక వైపు, అష్టైశ్వర్యము, మరొకచెంప అష్ట దరిద్రమునకూ, ఉత్కృష్టత నైచ్య భావములకూ, అవిద్య, అజ్ఞానములకూ తావు లేనట్టిదియు, సమస్త ప్రజలకు జీవిత పోషణకు విద్యా విజ్ఞానములకు సదవకాశములూ, బంధు మిత్ర ప్రేమ, సత్సహావాసము, సానుభూతి, సహకారములు, విరాజిల్లునట్టి సమాజ, కుటుంబ పరిసర పరిస్థితులు అవశ్యకము అని వీరి సిద్ధాంతము. అట్టి పరిస్థితులు ప్రస్తుతం అందరికీ అందుబాటులో లేవు; నిజమే. కాని, తల్లిదండ్రులు, ఉపాధ్యాయులు, ఇట్టి సర్వోత్కృష్టమైన, శాస్త్రీయమైన సిద్ధాంతములను, అనుభవ జ్ఞానమునూ, కొంతయైనను తెలిసికొని తమకు సాధ్యమైనంత వరకు తమ బిడ్డల సక్రమ వికాసమునకు కృషి సల్పుట అత్యావశ్యకము కదా!



# ఆంధ్ర రాష్ట్ర కస్తూరిబా సేవా కేంద్రము

## రాజుపాలెము

సాయంత్రము 4-30 గంటలకు కేంద్ర పాఠశాలలో శ్రీమతి ఆదుర్తి భాస్కరమ్మగారి అధ్యక్షతను స్త్రీ సమాజము తెరువబడినది. ఆమె అధ్యక్షోపన్యాసములో ఇట్లు చెప్పిరి :-

సమాజము అనగా పదిమంది ఒకచోటు పోగవుట. సామాన్యముగా చాలామంది స్త్రీలు చెరువులవద్దను, బావుల వద్దను పోగవుదురు. అచ్చట వ్యర్థముగా కాలయాపనము చేయుదురు. స్త్రీ సమాజపు ఉద్దేశ మేమనగా స్త్రీలందరునూ ఒకచోట కూడి తమ తమ అభిప్రాయాలను ఒకరిలో ఒకరు తెలియజేసుకొని సంఘములోనున్న లోటుపాట్లను, అవసరాలను తీర్చుకొనుటకును, సంఘమును విజ్ఞాన వంతముగా చేయుటకును ప్రయత్నము చేయవలెను.''

స్త్రీలయొక్క శక్తిని గురించి చెప్పుచు పురుషులకంటెను స్త్రీలలో అధిక శక్తి గలందుకు మన దేశములో గల గొప్ప గొప్ప స్త్రీలను గురించియు, మళయాళ దేశపు స్త్రీలను గురించియు ఉదాహరణముగా చెప్పిరి.

'' స్త్రీలే పురుషులకు తల్లులు. పురుషులకు చక్కని శిక్షణ ఇవ్వగలవారు స్త్రీలే కనుక స్త్రీలు విద్యావంతులై యుండవలెను. అట్లయిన వారు ఓటింగు హక్కును కూడా తెలుసు కోగలరు. గనుక అన్ని విషయములు తెలిసికొనుటకు ముఖ్యముగా ప్రతి స్త్రీయు అక్షర జ్ఞానము కలిగి యుండవలెను.'' అని చెప్పిరి.

తరువాత గ్రామీణప్రజలకు పరిశుభ్రమును గురించియు (అనగా) పాకీదొడ్లు కట్టుకొనవలయు ననియు స్త్రీ సమాజమువారు పట్టుదలతో పని చేసిన, ప్రతి కార్యమును అవలీలగా సాధింప గలరనియు చెప్పిరి. ఇదేకాక తల్లులు చదువుకొన్నచో పిల్లలలో కూడా ప్రేమ, త్యాగం, శుభ్రం మొదలైనవి నేర్పగలరనియు, అంటువ్యాధులు మొదలగు వాటికి గల కొన్ని కారణములు చెప్పుచు అన్నిటిని స్త్రీ సమాజమువారు నిర్మూలించాలనియూ చెప్పిరి.

''కులమత భేదాలను గురించి చెప్పుచు బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్ర అనే నాలుగే జాతులు. బ్రాహ్మణేతరులందరును వారిలో వారు కలియరుగాని, బ్రాహ్మణులపై దాడి సల్పుచున్నారు. వారిలో వారు ఎంతవరకు సంబంధ బాంధవ్యాలు కల్పించుకొంటున్నారో అనే విషయం ఆలోచించిననాడు ఈ సమస్యే రాదు. ఇటువంటి విషయాచరణే సమాజ ఏర్పాట్లయొక్క ఉద్దేశము.'' అని తెల్పిరి.

స్త్రీ సమాజమునకు అధ్యక్షులుగా శ్రీమతి కోనూరి రామచంద్రంగారు, కార్యదర్శి శ్రీమతి కోనూరి అరవాలమ్మగారు, సహాయ కార్యదర్శి శ్రీమతి పెన్మత్స సూరమ్మగారు, ఇంకను 15 మంది స్త్రీలు సభ్యురాండ్రుగా చేరిరి. కేంద్ర కార్యకర్తలలో ఒకరైన శ్రీమతి సుసర్ల సావిత్రిగారు, గ్రామస్థుల తరపున శ్రీమతి ఆదుర్తి భాస్కరమ్మగారికి ధన్యవాదములర్పించిరి. సీతానగరం కస్తూరిబా గ్రామసేవికా శిక్షణ కేంద్రపు విద్యార్థినులచే బాపూజీ బుర్రకథ చెప్పించబడినది. సాయంకాల ప్రార్థన, జనగణ గీతముతో సభ ముగిసినది.

ఈ సమావేశమునకు క. గ్రా. సే. శి. కేం. సీతానగరము సంచాలికగారు శ్రీమతి దిగుమర్తి బుచ్చి కృష్ణమ్మగారును, ఆంధ్ర రాష్ట్ర కస్తూరిబాగాంధీ జాతీయ స్మారక నిధి అర్గనైజరుగారు శ్రీమతి ఆర్. సామ్రాజ్యంగారును విచ్చేసిరి.



# అక్క ఋణం

* శ్రీపాద గాయత్రి *

ఆ రోజు రాత్రి శశికళకు నిద్రపట్టలేదు. "తల్లి దండ్రులు లేని నిన్ను పెంచి, పెద్దచేసి, విద్యాబుద్ధులు చెప్పించిన నీ అక్కకి జరిగిన అన్యాయానికి ప్రతీకారం చేసి, ఆమె ఋణం తీర్చుకో." అనే ఉమ మాటలు శశి చెవుల్లో రింగు మంటున్నాయి. శశికి కర్తవ్యం తోచటం లేదు. "చూడు శశీ! లోకంలో ఎందరో స్త్రీలు మగవారి దౌర్జన్యాలకి ఆహుతియై పోతున్నారు. ఆది నుంచీ ఉగ్గుపాలతో మన భారత దేశ స్త్రీలకు పతే దైవమని, సహనమే భూషణమని, నేర్పబడింది. ఆడదంటే ఆట వస్తువుగానూ, మగవారు తమ ఆనందం కొరకు ఉపయోగించుకొనే కీలుబొమ్మగానూ తలచబడింది. ఇతర దేశాల్లో స్త్రీలు మనలాగే ఉంటారా? ఏమైనా సరే శశీ! నువ్వు ఒప్పుకోకు......మీ బావ నెదిరించి నీవు చెయ్యగలదేమీ లేదంటావా? నిజమే. ద్రోహి, నీకు వివాహం కాకూడదనే ఉద్దేశంతో నీ శీలం చెడిందనీ, నీవు పతితవనీ లోకంలో చాటేడు. గుడ్డిలోకం నమ్మింది. కానీ, శశీ! నీ డబ్బు కోసమే సుమా, నీ అక్కని చంపి నీ బావ నిన్ను పెండ్లాడ గోరుతుంట. రేపు నీ కన్న డబ్బున్నది కనిపిస్తే, నీకూ నీ అక్కగతే. డబ్బు కోసం తన లోని మానవత్వాన్ని పూర్తిగా చంపేసు కొన్నాడు నీ బావ. ఇటువంటి బావను కట్టుకొని నువ్వేం సుఖ పడు తావు? నీ కర్తవ్యం నెరవేర్చి నీ అక్క ఋణం తీర్చుకో" అనే ఉమ మాటలు ఇంకొకసారి రింగు మన్నాయి. తన ప్రాణం పోయినా సరే బావని పెండ్లాడ కూడదనుకుంది, తన బావ దౌర్జన్యాన్ని ప్రతిఘటించి తన అక్క ఋణం తీర్చుకోవాలని నిశ్చయించుకుంది శశి.

శశి కళ, సుశీలా అక్క చెల్లెళ్ళు. శశి పది నెలల పిల్ల అయి వుండగానే ఆమె తండ్రి పరలోకానికి వేంచేసేడు. చనిపోయేటుప్పుడు తన 200 ల ఎకరాల ఆస్తిని, 100 ఎకరాలు తన భార్య పేరా, మిగిలిన 100 ఎకరాలలో చెరి 50 ఎకరాలూ 5 ఏళ్ళ కూతురు సుశీలకీ, పది నెలల పశిగ్రుడ్డు శశికీ వ్రాసేడు.

తల్లి సుశీలను 14వ ఏట ప్రభాకర్‌కిచ్చి పెండ్లి చేసింది. శశికి 11వ ఏడురాగానే ఒకరోజు తల్లి హఠాత్తుగా మరణించింది. తల్లి 100 ఎకరాలూ కూడా పెళ్ళి కాని శశికే వచ్చింది. ఆమెకూ, ఆమె ఆస్తికీ ప్రభాకరే గార్డియనైయ్యాడు.

శశి చాలా చక్కనిది. చక్కగా చదువు కొంటూంది. ఆమెకి లోకంలో తన అక్క తప్ప ఎవ్వరూ లేరు. అక్కే ఆమె ప్రపంచం.

శశిని, సుశీల కంటికి రెప్పల్లే కాచేది. రెండు సంవత్సరాల తన బిడ్డ మంజూతో సమంగా ప్రేమించేది. తన తల్లి, చెల్లెలిని తన చేతులలో పెట్టి కళ్ళుమూసుకుంది. ఆమెను పెంచి, పెద్ద చేసి పెండ్లి చేసే బాధ్యత తన మీద వుంది. ఆమె రూపానికీ, గుణాలకీ తగిన వరుణ్ణి ఆమెకు కూర్చవలెనని సుశీల తలపోసేది.

ప్రభాకర్ విద్యావంతుడైనా చిన్నప్పటినుంచీ దారిద్ర్యంలో పెరగడంవల్ల సంకుచిత భావాల నలవర్చుకున్నాడు. అతనికి డబ్బంటే అమిత ప్రేమ. డబ్బు కోసం ఎటువంటి పనికైనా ఒడంబడే రకం. తన మరదలకి 150 ఎకరాల ఆస్తి సంక్రమించడం ప్రభాకర్‌కి కన్నుకుట్టింది. కానీ ఏమి చెయ్యగలడు. ఒకసారి ఈ విషయం తన భార్యతో అంటే ఆమె అతన్ని అసహ్యంగానూ, క్రోధంగానూ చూచింది.

ఒకనాడు సుశీల ప్రభాకర్‌తో శశి పెళ్ళి విషయం ఎత్తింది. ప్రభాకర్ కలవరపడ్డాడు. శశి ఆస్తి అంతా ఇంకొకరికి పోవలసిన దేనా? కొంతసేపూరకున్నాడు. సుశీల అతని ఖంగారు చూచి చిన్నప్పటినుంచీ పెంచిన మమకారమనుకుంది. వెంటనే "అలా ఖంగారు పడితే ఎలాగండీ? ఎంతైనా ఆడపిల్ల పై వారింటికి పోవలసినదే. ఎదిగిన పిల్లను ఎన్నాళ్ళు పెళ్ళి చెయ్యకుండా వుంచుకొనేదీ? మా అమ్మ దాన్ని మన చేతులలో వుంచి పోయింది. దానికి పెళ్ళి చేసే బాధ్యత మన మీద వుంది." అంది. ప్రభాకర్ వెంటనే తేరుకుని "సుశీలా! శశి అంటే సామాన్యురాలా? 150 ఎకరాల భూస్వామిని. ఆమెను

పెండ్లాడిన వాడెంత అదృష్టవంతుడో? అంత డబ్బు పై వానికి పోవలసినదేనా? వీల్లేదు. శశిని నేనే పెండ్లాడుతాను." అన్నాడు. సుశీల నివ్వెర పడింది. లోకంలో డబ్బే ప్రధానమా? నీతీ నియమం లేదూ? అనిపించింది. "అదేమిటీ? దానిజీవితం డబ్బుకోసం నాశనం చేస్తారా? ఏమైనా సరే మీరు దాన్ని పెండ్లాడ డానికి వీల్లేదు." అంది. ప్రభాకర్ కోపంగా, "ఏం. ఎందుకువీల్లేదూ? శశిని నేనే పెండ్లాడుతాను. పెండ్లాడి తీరుతాను. అప్పుడు 200ల ఎకరాలూ మనకే దక్కుతుంది." అంటూ బయటకి వెళ్ళి పోయాడు. అది మొదలు శశిని వివాహమాడడానికి ఒప్పుకోమని సుశీలని రహస్యంగా బాధించేవాడు.

ఒకనాడీ విషయమై భార్యా భర్తలకి పెద్ద ఘర్షణ జరిగింది. "వీల్లేదు. మీరు శశిని వివాహమాడ లేరు." అని అంటున్న సుశీల గొంతు ప్రక్క గదిలోని శశికి వినబడింది. ఆమె ఆశ్చర్య పోయింది. "ఏమైనా సరే. 150 ఎకరాలు పైకి పోనివ్వను. శశిని నేనే వివాహ మాడుతాను." అనే బావ కేకలు కూడా వినబడ్డాయి. శశి ఖంగారు పడింది. తన బావ డబ్బు కోసం తన్ని వివాహమాడ గోరుతున్నాడా? ఆమెకి బావంటే ఎక్కడలేని అసహ్యం పుట్టుకొచ్చింది. మళ్ళీ సుశీల అరపులు వినిపించేయి "ఒప్పుకోను. ఇప్పుడే శశితో మీ కుతంత్రం చెప్పేస్తాను. మా మేనమామ దగ్గరకు పంపుతాను. డబ్బు కోసం ఆమె జీవితాన్ని నాశనం చెయ్యకండి. నా చెల్లెల్నే నాకు సవతిగా తెచ్చి నా కడుపులో చిచ్చు పెట్టకండి. ఏమైనా సరే. నా కంఠంలో ప్రాణముండగా ఈ పని జరగ నివ్వను." ఆమె గొంతు వొణుకుతోంది. "ఒప్పుకోవూ? నీ కంఠంలో ప్రాణముండగా ఒప్పుకోవు కదూ? పోనీ అది తీసేస్తే ఒప్పు కుంటావా?" అంటూ ప్రభాకర్ ఆమె లెంపమీద బలం కొద్దీ కొట్టేడు. దాంతో సుశీల వెనక్కి పడిపోయింది. ఆమె కళ్ళు పచ్చ బడ్డాయి. సుశీల "ఒప్పుకోను, ఒప్పుకోను." అని ఏడుస్తూ లేవబోయింది. ప్రభాకర్ ఆమెని క్రింద పడేసి, ఏ చేతులతో ఆమె మెడలో పవిత్రమైన మంగళ సూత్రం కట్టేడో ఆ చేతులతోనే ఆమె మెడను "ఇప్పుడొప్పుకో. నీ బలమింతే, నువ్వు చెయ్యగలదింతే, చావు, చావు," అంటూ గట్టిగా నులిమేసేడు. సుశీల "కెవ్వు" మని ఆఖరిసారి గట్టిగా అరిచింది. ఆ అరుపుకి బంగళా అంతా ప్రతిధ్వనించింది. శశి హడలి పోయి ఆ గదివైపు పరిగెత్తింది. తన బావ రాక్షసుడిలాగ చనిపోయిన అక్క ప్రక్కనే నిలబడివున్న దృశ్యం చూచి గట్టిగా అరచి వీధులోకి పరిగెత్త బోయింది. వెంటనే ప్రభాకర్ ఆమెను జబ్బ పట్టుకొని వెనక్కి ఈడ్చి గదులోకి త్రోసి గడియ పెట్టేడు. అది మొదలు ప్రభాకర్ శశిని తన్ను పెండ్లాడమని నిర్బంధించేవాడు. నయాన్న, భయాన్న చెప్పిచూచేడు. లాభం లేకపోయింది. ఆఖరికి నెమ్మదిగానే మంచి మాటలతో వశపరచుకోవాలని తలచేడు.

ఉమ ఈ సంఘటన జరిగినప్పుడావూళ్ళోలేదు. ఉమా, శశీ ప్రాణ స్నేహితులు. శశి బంగళా ప్రక్కనే ఉమ ఇల్లు. చిన్న తనంనుంచీ ఒకే కంచంలో తినీ, ఒకే మంచం మీద నిద్రించేవారు. ఉమ సుశీలను "పెద్ద వదినా" అనీ, ప్రభాకర్‌ని "అన్నయ్యా" అనీ పిలిచేది. ఆమె ప్రభాకర్ లోని దుర్గుణాలు గ్రహించీ కూడా పైకేమీ అనేది కాదు. ఉమ వచ్చేసరికి గ్రామం అట్టుడికినట్లుడికిపోతోంది. ఆమె ఊర్లో అడుగు పెట్టగానే "శశి మంచిది కాదనీ, శశీ ప్రభాకర్‌ల ప్రవర్తన సహించలేక సుశీల ఆత్మహత్య చేసుకొందనీ, శశి తన బావని పెండ్లాడుతుందనీ తెలిసింది. ఆమె కలవరపడింది. శశి అలాంటిది కాదే. ఆమె నమ్మలేదు. తల్లివలన నిజం తెలుసుకుని ఆమె ఆశ్చర్యపోయింది. దుష్టుడైన ప్రభాకర్ బారినుండి శశిని తప్పించాలనుకుంది. ఒక రోజంతా ఆలోచనతో గడిపింది. మర్నాడు ప్రభాకర్ దగ్గరకు వెళ్ళి "అన్నయ్యా! శశికి నేను చెప్తాను. ఆమె నిన్ను వివాహ మాడడానికి ఒప్పుకునేటట్లు చేస్తాను." అంది. ప్రభాకర్ సంతోషంతో ఒప్పుకున్నాడు.

శశి ఉమని కౌగలించుకొని భోరున ఏడ్చింది. ఉమకి కూడా చిక్కి శల్యమైవున్న శశిని చూడగనే పట్టరాని దుఃఖం వచ్చింది. శశి సంగతంతా చెప్పింది. ఉమ శశికి కర్తవ్యాన్ని ఉపదేశించి ధైర్యంగా నిలబడమని ప్రోత్సహించింది. ఆమె ఉపదేశమే శశి చెవుల్లో గింగురు మంటూంది. శశికి ఎటూ పాలుపోక కొంతసేపు గదిలోనే అటూ ఇటూ

(తరువాయి 56-వ పేజీలో)




## పాల తరగలు

1-వ భాగము

రచయిత: శ్రీ కోట శ్రీరాములు.

పబ్లిషర్సు: ప్రకృతి కార్యాలయ ట్రస్టు, బెజవాడ.

వెల రు. 2 లు.

ఒక కథ వ్రాస్తే అది మన నిత్య జీవితాన్ని ప్రతిబింబించేటట్లుండాలి. అది మన సంఘంలోని సంఘటనలను చిత్రించి లోతుపాతులను సరిదిద్దుకోవడానికి మార్గాన్ని చూపించాలి. సంఘ వ్యవస్థను బాగా అర్థంచేసుకుని, సామాన్యుని కర్థమయ్యేటట్లు కథారూపంగా వ్రాసి, సంఘంలోని దురలవాట్లను బయట పెట్టాలి, నివారణోపాయాన్ని సూచించాలి కూడా. అట్టి కథలకు ఒక ప్రత్యేకత ఉంటుంది. అలా వ్రాయడం అంత సులువైన పని కాదు.

"పాలతరగలు" కథలు చదువుతుంటే అచ్చంగా ఈ పద్ధతిలోనే శ్రీ కోట శ్రీరాములుగారు వ్రాశారని తోస్తుంది.

ఈ "పాలతరగలు" మొత్తం 12 కథలున్న సంపుటి. ప్రతీ కథ వేర్వేరు అంశంపై వ్రాయబడింది.

ఈ పుస్తకంలోని కథల్లో, సామాన్య కుటుంబాల్లో ఉండే దురలవాట్లను, దినదినమూ జరిగే సంఘటల్ని ఆచార వ్యవహారాలను, కథకులు బాగుగా తెలియజేశారు. కొన్ని కొన్ని కథలు చదువుతుంటే పల్లెటూరి జీవితాలు కళ్లకు గట్టినట్లుంటుంది. కథల్లో మధ్య తరగతి కుటుంబాల్లోని పిల్లల పెళ్లిళ్లకు చేసే ప్రయత్నాలు, సంభాషణలు చాలా సహజంగా చిత్రింప బడ్డాయి.

కథలన్నీ చదువుతూంటే నిజంగా జరిగిన సంఘటనలేమో అనిపిస్తుంది.

"ఈ కథల్లో నూటికి తొంభై మన సంఘంలో ఉన్న అనేక దురలవాట్లను గూర్చి వ్రాసిన కథలు. అట్టే మాట్లాడితే ఏ కుటుంబంలోనో ఒకకుటుంబంలో...ఎక్కువగా బ్రాహ్మణ కుటుంబాలలో ఉన్న పిచ్చి వేషాలను గుఱించి వ్రాయటం," అని శ్రీ విశ్వనాథ సత్యనారాయణ గారు తమ తొలిపలుకుల్లో చాలా స్పష్టంగా తెలియజేశారు. "నెత్తురు కూడు" అనే కథలో, తుచ్ఛ జిహ్వ కోసం నోరులేని జంతువుని చంపడంవల్ల ఎంత దోషమో గ్రంథకర్త నిరూపించారు.

పతివ్రతా తల్లియైన ఒక సామాన్య కుటుంబంలోని స్త్రీ అవనీతిపరుడు, క్రూరుడు అయిన భర్తయొక్కయు, తన కష్టాలు అర్థంచేసుకోలేని తల్లిదండ్రులయొక్కయు మధ్య— ఏ విధంగా అంతులేని బాధ పడి అసువులు బాసిందో "పెనిమిటా-పిశాచమా?" అనే కథలో బాగా వ్రాశారు.

విద్యావంతుడు, రూపవంతుడైన భర్త హృదయం తెలుసుకో లేక ఆతడెప్పుడూ తనతోనే—ఆతని తల్లి దండ్రు లేమైనాసరే—సుఖంగా ఉండాలని కోరే ఒక గొప్ప ఇంటి యువతియొక్క స్వభావాన్ని అతి సమర్థతతో "ఇల్లఱికం" అనే కథలో తెలియజేశారు. ఈ కథ అన్ని కథలకంటే స్వభావసిద్ధంగాను, రమ్యంగానూ ఉంది. నాయిక చంద్రిక పాత్ర బాగా చిత్రించగల్గారు.

తక్కిన కథలుకూడ ఒక్కసారి చదువుకోవడానికి పనికి వస్తాయి.

గ్రంథకర్త రచనాశైలి అతి సులభంగా ఉంది. కాని మాధుర్యం లోపించింది. అయినప్పటికి, కథలను అనవసరంగా

పాడిగించలేదు. కొన్ని చోట్ల పొడిగించవలసి వచ్చినా, అతుకుల బొంతగా లేక "కంటిన్యూటీ" ఉంచగల్గారు.

కొన్ని కొన్ని కథల్లో రసవత్తర ఘట్టాలున్నాయి. అవి మళ్ళీ మళ్ళీ చదవాలనిపిస్తుంది. కథల్లో పాత్ర పోషణ చాలా బాగుంది. పల్లెటూరి జీవితాన్ని బాగా పరికించి, కథల్లో శ్రీరాములుగారు ఇరికించగల్గారు.

"పాల తరగలు" తేలిగ్గా కాలక్షేపానికి చదువుకోవడానికి బాగా పనికొస్తుంది. వెల కూడ పుస్తకంలోని సరుకుకు తగినట్టుంది.

* * *

## సూర్య నమస్కారములు

రచయిత: శ్రీ కందాళై వెంకటాచార్యులు:
ప్రకాశకులు: గుప్త విద్యామండలి, విజయవాడ.
మూల్యము. అణాలు 8.

ఒక జాతి వృద్ధి పొందాలంటే, ఆ జాతి ప్రజల్లో శారీరక, మానసిక శక్తులు పెంపొందాలి. ఆ శక్తుల కోసం ప్రతీ పురుషునకూ, స్త్రీకీ దేహ పరిశ్రమ అవసరం.

పది అధ్యాయములుగల ఈ చిన్ని పొత్తములో, శ్రీ కందాళై వెంకటాచార్యులుగారు సూర్య నమస్కారముల ఆవశ్యకతను, వాటినెట్లు చేయవలసినదో చక్కగా విపులీకరించి వ్రాశారు. ప్రతీ అభ్యాసానికి తగిన రీతిగా బొమ్మలు కూడా గీయబడ్డాయి.

దేహ పరిశ్రమయందు శ్రద్ధగల వారందరికీ ఈ పుస్తకం ఉపయోగిస్తుంది. వెల కూడా అందరికీ అందు బాటులో ఉంది.

* * *

హిత కారిణి సమాజము

## వార్షిక నివేదిక

రాజమహేంద్రవరంలో, కీ॥ శే॥ శ్రీ కందుకూరి వీరేశలింగంగారిచే స్థాపించబడిన హిత కారిణీ సమాజము యొక్క వార్షిక నివేదికల (1948—49 & 49—50) పుస్తకం మా కార్యాలయానికి చేరింది. సమాజ నిబంధనలు, కార్య నిర్వాహకుల యొక్కయు, సభ్యుల యొక్కయు పేర్లు, ఆదాయ వ్యయముల పట్టీయున్నూ, ఈ నివేదికల పొత్తములో జత పర్చబడింది.

—గిడుగు లక్ష్మీకాంతమ్మ




(54వ పేజీ తరువాయి)

తిరిగింది. బావ దౌర్జన్యాన్ని సహించి అతన్ని పెండ్లాడడమా? చాలసేపు దీర్ఘంగా ఆలోచించింది. శశిచెవుల్లో "డబ్బుకోసం దాని జీవితాన్ని నాశనం చెయ్యకండి. నా కంఠంలో ప్రాణముండగా ఈ అన్యాయం జరగ నివ్వను" అనే అక్కమాటలు ఒక్కసారి మ్రోగేయి. అక్క చేతుల్లో తనని అప్ప చెప్తూ, కన్నీరు నింపుతున్న తన తల్లి దీన వదనం కళ్ళకి కట్టినట్లైంది. "శశీ! ఈ అన్యాయాన్ని ఎదిరించు. అప్పుడే నా ఆత్మకి శాంతి లభిస్తుంది," అని అక్క అంటున్నట్లు వినపించింది. శశిలో ఉద్రేకం ఉరకలెత్తింది. తన కర్తవ్యం నెరవేర్చుకోడానికి సిద్ధపడింది.

నవ్వు ముఖంతో గదిలోకి వస్తున్న శశిని ప్రభాకర్ చూచి, ఉమ సామర్థ్యాన్ని మెచ్చుకున్నాడు. 200 ఎకరాల భూస్వామి నయ్యా ననుకొని పొంగిపోయాడు. పాపం, శశి తనని వరించడానికి వస్తూందను కొన్నాడే కానీ, శశి రూపంతో మృత్యుదేవత తన్నాహ్వానిస్తోందని అనుకోలేదు. చిరు నవ్వుతో శశి కెదురేగేడు. శశి తన ధైర్యాన్ని చిక్కబట్టుకొని రవికలో దాచిన పిస్తోలు బయటికి తీసి, ధన కాంక్షతో కళ్లు మూసుకొనిపోయిన బావ గుండెకు గురి చూసి "మా అక్కకి చేసిన అన్యాయానికి ప్రతిఫల మిదిగో" అంటూ మీట నొక్కింది. ప్రభాకర్ బాధతో కూడిన ఆక్రందనతో వెనక్కి జరిగేడు. వెంటనే శశి "అక్కా నీ ఋణం తీర్చుకున్నాను. నా కర్తవ్యాన్ని నెరవేర్చుకొన్నాను." అని పిచ్చిగా అరుస్తూ పిస్తోలు తన గుండె వైపు త్రిప్పుకొని మీట నొక్కింది.

ఈ శబ్దాలకూ, అరుపులకూ ప్రక్కింటి ఉమ పరిగెత్తు కొచ్చింది. శశి, ఉమకి మంజునీ, తన తండ్రి ఆస్తినీ అప్ప చెప్పి, తమ అప్పచెల్లెండ్ర గతి మంజుకి పట్టకుండా కాపాడమనీ, అనాథ స్త్రీ జనాభ్యుదయంకోసం తన తండ్రి ఆస్తిని వినియోగించమనీ కోరింది. ఉమ కన్నీటితో తను ఆజన్మ బ్రహ్మచారిణిగా ఆమె ఆదేశాన్ని పాటిస్తానని శపథం చేసింది. శశి ఆనందంతో, అక్క ఋణం తీర్చుకొన్నాననే సంతృప్తితో కళ్లు మూసుకుంది.





ఆంధ్ర మహిళా సభలో

# స్వతంత్ర దినోత్సవము

ఆగష్టు 15-న ఆంధ్ర మహిళా సభలో, భారత స్వాతంత్ర్య దినోత్సవము జరుగును

**శ్రీ. వి. వి. గిరిగారు**

(సింహళములో భారత ప్రభుత్వపు మాజీ హై కమిషనర్)

జాతీయ పతాకావిష్కరణము గావింతురు

ఉదయము 9-30 గంటలకు కార్యక్రమము ప్రారంభమై, పతాక వందనానంతరం, జాతీయ గీత, సంగీత, కాలక్షేపములతో ముగియును.

ఆంధ్ర మహిళా సభ.

---

# ఆంధ్ర మహిళా సభ

స్త్రీల విద్యా, విజ్ఞాన, సాంస్కృతిక, ఆర్థికోన్నతికై 10 సం॥ పైగా కృషి చేయుచున్న జాతీయ సంస్థ.

ఇందు

| | | |
|---|---|---|
| విద్యాశాఖ | — | ఆంధ్ర మహిళ పత్రిక |
| పారిశ్రామిక శాఖ | — | నర్సింగ్ హోమ్ |
| కళాశాఖ | — | ముద్రణ శాఖ |

సారస్వత, క్రీడా, గ్రంథాలయ, క్లబ్బు శాఖలు

సభ్యురాండ్రుగా చేరి యీ సేవాసంస్థను పోషించండి.

ఆంధ్ర మహిళా సభ.

# ఆంధ్ర మహిళా సభ

ఫోన్ : 86961

(రిజిస్టర్డ్)

స్థాపితము 1939

## స్త్రీలకు క్రొత్త విద్యాశాఖల ప్రారంభము

అద్దకము, రంగువేయు తరగతి

భారత ప్రభుత్వ కార్మిక శాఖ (పునరావాసం—వృత్తి) వారిచే, ఆంధ్ర మహిళా సభలో నిర్వహింపబడును.

అచ్చు కూర్పు, ముద్రణ, బైండింగ్ తరగతి

ఎనిమిదవ తరగతి పబ్లిక్ పరీక్షకు శిక్షణ

* * *

ఇవిగాక

ఇంతవరకు జరుగుచున్న వివిధ తరగతులు

విద్యాశాఖ

మెట్రిక్యులేషన్—ఇంటర్ మీడియట్

(కాశీ విశ్వ విద్యాలయపు పరీక్షలు)

హిందీ—ప్రాథమిక్ నుండి విశారద్ తరగతులు

పారిశ్రామిక శాఖ

ఎంబ్రాయిడరీ, కుట్టుపని,

నూలు వడకుట, చేనేత,

లేసు, ఉల్లు అల్లికలు,

షార్ట్ హాండ్, టైపు

కళాశాఖ

సంగీతం: గాత్రం—వాయిద్యం, భరతనాట్యం

* * *

వివిధ తరగతులకు అడ్మిషన్లు జరుగుచున్నవి.

పూర్తి వివరములకు:

సంయుక్త కార్యదర్శినులు ఆంధ్ర మహిళా సభ.

లజ్ చర్చ్ రోడ్డు, మైలాపూరు, మదరాసు. 4.

3 గంటల నుండి 5 గంటల వరకు మహిళా సభ కార్యాలయములో తెలిసికొనవచ్చును.

Edited and published by G. Durgabai, M.A., B.L., at the Andhra Mahila Sabha, Mylapore, Madras.
Printed by M. Satyanarayana at the H. Prachar Press, 12, Thanikachalam Chetty Road, T'Nagar, Madras.

## మా రచయితలకు

అభిమానముతో తమ రచనలను ప్రచురణార్థం పంపించుచున్న ప్రతి రచయితకూ మా కృతజ్ఞత.

అయితే వారు యీ దిగువ సూచించిన విషయములను గ్రహింపవలెనని మనవి:

సాధ్యమైనంతవరకు రచనలు స్వతంత్రమైనవిగా, చిన్నవిగా, చక్కటి దస్తూరీలో వ్రాసినవిగా ఉండాలి.

ఇంకొక పత్రికకు పంపిన ఏ రచనగాని మా పత్రికకు పంపరాదు.

అనేక కారణాలవల్ల రచయితలు పంపిన రచనలు వెంటనే ప్రచురింపబడవు. సందర్భానుసారంగా మాకు వీలైన సంచికలో ఏ రచననైనా ప్రచురించవచ్చుననే మా హక్కును గుర్తుంచుకొని, తమ రచనల ప్రచురణకు కాలం నిర్ణయించకుండా పంపినవారి రచనలే స్వీకరించబడ్తాయి.

ఒకసారి మాకు పంపిన రచన, మేము ప్రచురించకముందు, మరియొక పత్రికలో ప్రచురించిన పక్షములో, రచయితలు వెంటనే మాకు తెలుపవలసిన బాధ్యత వారిపై ఉంటుంది.

సంపాదకురాలు
ఆంధ్ర మహిళ.

---



ఆంధ్ర మహిళాసభ

## దసరా ఉత్సవములు

దసరాలకు, ఎప్పటివలెనే, ఆటలలో, వక్తృత్వములో, నాటక, సంగీతములలో పోటీలు జరుగును. దుర్గాష్టమినుండి దేవీపూజ, బొమ్మల కొలువు, పేరంటం, యధా ప్రకారంగా జరుగును. పూర్తి వివరములను సెప్టెంబరు 15 తరువాత, మహిళా సభకు వచ్చి తెలిసికొనవచ్చును.

ఉత్సవ ఖర్చులకై సభ్యులాంధ్రులు తమకు తోచిన విరాళములను పంపినచో, కృతజ్ఞతతో స్వీకరింతుము.

కార్యదర్శినులు
ఆంధ్ర మహిళాసభ.

ఆంధ్ర, సీడెడ్, నైజాంలలో
విజయవంతముగ
ప్రదర్శింపబడుచున్నది

వినోదా వారి...

# స్త్రీ సాహసము

...దర్శకత్వం...
వేదాంతం రాఘవయ్య

రచన.. పర్యవేక్షణ... సముద్రాల.... సంగీతం... సుబ్బురామన్
ఛాయ... బి. యస్. రంగా ... కళ... వాలి... గొడగాంకర్

పూర్ణా రిలీజ్



MATA

CH. E. PRASAD

ఆంధ్ర, సీడెడ్, నైజాం
పూర్ణా రిలీజు

మైసూర్
అమృత్ పిక్చర్స్

అతిత్వరలో విడుదల కాబోతూంది



వరలక్ష్మి
రామగోపాల్
నటించిన,
ప్రకాశ్ వారి,

# దీక్ష

డైరెక్షన్....ప్రకాశరావు....





# నేడు మీరు మెక్లీన్స్‌తో పళ్లు తోముకున్నారా?



"నా పళ్లు తెల్లగా నిగనిగలాడుతుండడానికి మెక్లీన్స్ ఉత్తమమైనదని అమ్మ చెబుతుందిగనుక నేను ఎల్లప్పుడూ వానినే వాడుతాను."

ఔను ఆమె అల్లే చేసింది! ఆమె నవ్వు తున్నప్పటి ముఖవికాసాన్ని, ఆరోగ్యవంతమై నిగనిగ మెరిసిపోతున్న పళ్లను చూడండి—ఆమె రోజుకు రెండుసార్లు మెక్లీన్స్ పెరాక్సైడ్ టూత్ పేస్టుతో పళ్లుతోముకుంటుంది.

మెక్లీన్స్ పెరాక్సైడ్ టూత్ పేస్టు మీ ఇగుళ్లను ఆరోగ్యవంతంగాను, పళ్లను ముత్యాలవలె తెల్లగాను, శ్వాసను పరిమళ భరితంగాను ఉంచుతుంది—అది వీటిన్నిటినీ ఏకకాలంలోనే సమకూర్చుతుంది. అందుకే ప్రపంచంలో జ్ఞానవతులగు తల్లులు అనేక లక్షలమంది తమ బిడ్డలకు ప్రతి రోజూ — రెండుసార్లు — మెక్లీన్స్‌తో పళ్లు తోముకోడం నేర్పుతారు.

## నేడే మెక్లీన్స్‌ను కొనండి!




MTY-I TEL.

వ్యాపార విచారణకు వీరికి వ్రాయండి :— జె. యల్. మోరిసన్, సన్ అండ్ జోన్స్ (ఇండియా) లిమిటెడ్., మహాలక్ష్మి ఆలయమునకు ఎదురుగా, వార్డెన్ రోడ్, బొంబాయి 26.

# ఆంధ్రమహిళ

సంపుటి 8 :: సెప్టెంబరు '51 :: సంచిక 5




సంపాదకురాలు : శ్రీమతి దుర్గాబాయి, యం. యే., బి. యల్.

సహసంపాదకురాలు : శ్రీమతి చన్నఘంటమ్మ, యం. యే., యల్. టి.

ఆంధ్రమహిళా సభ, మైలాపూర్

సంవత్సర చందా — ఆరు రూపాయలు

అ నే క

హె రా యి ల్సు

రా వ చ్చు ను

పో వ చ్చు ను

గాని

శాశ్వతముగా వుండునది

## అశోకా అమ్లా హెయిర్ ఆయిల్

తలనూనెకుండవలసిన అన్ని సుగుణములును యిందు గలవు. ఓషధిసత్వముల గుణమున్నది. దేశీయ అత్తరువుల సహజ పరిమళ మున్నది. వనస్పతి నూనెలనే ఉపయోగించుటవల్ల శ్రేష్టమైనది. భరత దేశమందేగాక యితర దేశములందును మహిళలు దీని సుగుణమును గ్రహించి సదా ఉపయోగించుచున్నారు.

ఘాటైన శింథటిక్ కెమికల్సువల్ల తయారైన బూటకపు తలనూనెలు వాడుటలో వెంట్రుకలకు కన్నులకు మెదడునకు హాని కలుగును గాన అశోకా ఆమ్ల ఆయిల్‌ను ఉపయోగించి గుణమును పొందుడు.

విజయ కెమికల్ అండ్ టాయిలెట్ వర్క్సు,

వి జ యా మా న్ ష న్స్

15, క్లిమెన్సు వీధి, పురసవాక్కం, మదరాసు.

ASOKA AMLA
HAIR OIL
FOR Lovely hair Growth and Enchanting Fragrance
VIJAYA CHEMICALS.."VIJAYA MANSIONS"
15, CLEMENS ROAD, PURASAWALKAM...MADRAS.7

వారి ఆనందానికి
అసలు కారణం



పండిత డి. గోపాలాచార్యులవారి
జీవామృతం

నిత్య వ్యవహారాలలో

నీరసించిన తండ్రికి

జబ్బునుంచి

కోలుకొంటూఉన్న తల్లికి

దినదిన ప్రవర్ధమానమౌతూవున్న

బాలునకు జీవామృతము

బలోత్సాహాలను యిస్తూవున్నది



ఆయుర్వేదాశ్రమం లిమిటెడ్
మదరాసు 17.




సంపుటి 8 | సెప్టెంబరు 1951 | సంచిక 5



# అఖిలాంధ్ర పక్ష మహా సభ— నాయకుల కర్తవ్యం—

"వ్యక్తి దృష్టిని, స్వకీయసంఘ దృష్టిని, రాజకీయ శాఖా దృష్టిని త్యజించి, ఆంధ్ర రాష్ట్ర సమస్యను సహజమైన ఆంధ్రత్వ దృష్టితో పరిశీలించ గోరుచున్నాను. ఉదార హృదయాన్ని, త్యాగబుద్ధిని, ధర్మనిష్ఠను, ప్రతిజ్ఞా నిర్వహణ సామర్థ్యాన్ని ప్రస్ఫుటంగా ప్రకటించి, ప్రదర్శించటానికి, ఉత్తమోత్తమమైన కాలం ఇప్పుడు మీకు లభించి ఉన్నది. ప్రాణ ప్రతిష్ఠలేని సంభాషణలు, తీర్మానాలు వ్యర్థం," అనేటటువంటి కర్తవ్య సూచకమగు సందేశాన్ని, అఖిలపక్ష నాయకులకు అందించినారు, శ్రీ తిరుపతి వెంకటేశ్వరస్వామి సాన్నిధ్యాన్న, సత్వరాంధ్ర నిర్మాణార్థం, శ్రావణ పూర్ణిమనుండి ప్రాయోపవేశ యజ్ఞాన్ని సాగిస్తున్న శ్రీ స్వామి సీతారామ్‌గారు, ఆగష్టు 31వ తేదీని విజయవాడాలో జరిగిన అఖిల ఆంధ్రపక్ష మహాసభ సందర్భములో.

33 కోట్ల భారతీయుల సంఖ్యలో 3 కోట్ల ఆంధ్రుల సంఖ్య అతిస్వల్పం. మాతృభాషా సంప్రదాయములనుబట్టి ఒకే సంస్కృతికి జెందిన యీ కొలది జనాభాలో లెక్కలేనన్ని పార్టీలు, క్రొత్తక్రొత్తగా, రోజుకొకటిగా, ఉద్భవించటంలో, నాయకుల యొక్క సంకుచితమైన వ్యక్తిగత అధికార, ప్రాభవదృష్టులే విశదమై, సమగ్రమైన ఆంధ్రత్వదృష్టి పరిపూర్ణముగా లోపించినట్లు స్పష్టమౌతూఉంది.

అసలే మనగతి మొదటినుండి అధోగతి. బ్రిటీషు పరిపాలన కాలంనుండి యీనాటి వరకూ మనం పరాయిమ్మ కన్న బిడ్డలవలె సవితి తల్లి ప్రేమకే నోచుకున్నాం. పావన కృష్ణా గోదావరీ జీవన జలాలలో నూటికి నూరు పాళ్లు ఉపయోగించుకునే యోగ్యత, తన్మూలంగా

వ్యవసాయ తదితర పరిశ్రమల యభివృద్ధి అవకాశములు లేక, చివరకు ఏటేటా పొంగిపొరిలి సస్యాలను మంటకలపి, ప్రజలను ఇండ్లు వాకిళ్లులేని నిరాధారులు, అన్నాతురులుగా చేసే వెధవ మురుగు కాలవలకు అడ్డు కట్టుకోలేకుండా ఉన్నామంటే, మన దీనాతి దీనావస్థను వివిధరీతుల వర్ణించుకో నవసరంలేదు. గోరుచుట్టుమీద రోకంటి పోటన్నట్లు, గోదావరీ తీరాన్న 25 లక్షల ఎకరాలను సాగుచేయగల రామపాదసాగరు ప్రాజెక్టును ఉఫ్‌మని ఊదివేసి, కృష్ణానదీ జలాలతో, తమిళ జిల్లాలలో సాగుబడికై కృష్ణాపెన్నారు ప్రాజెక్టును తలపెట్టటంలో, సంగమేశ్వరం, పులిచింతల ప్రాజెక్టులను గంగకలపడంలో ఆంధ్రులకు జరిగే అన్యాయం, అవమానం వర్ణనాతీతం. ఇక యిలాంటి అన్యాయాలను పేర్కొ-వాలంటే లెక్క-కు మీరి ఉన్నాయి. ఆంధ్ర మాతకు జరిగే యీ అన్యాయాలన్నీ, ఆంధ్ర నాయకులుగా, ఆంధ్ర ప్రజా ప్రతినిధులుగా వ్యవహరిస్తు ఉన్న వారికి అవగాహన కాకకాదు. అయితే వ్యక్తిగత ప్రాభవకాంక్ష దేశ అభ్యుదయ సమగ్ర దృష్టిని కప్పి వేయటంవల్ల, ఆంధ్ర నాయకులలో రేగిన అంతః కలహాలు అవతలవారికి లోకువగా నుండుటవల్ల, ఆంధ్ర గడ్డ యిట్టి అవమానాన్ని భరించవలసివస్తూ ఉంది.

అందువల్ల, అఖిలాంధ్రపక్ష మహాసభ యొక్క- పర్యవసానం, ఏకైక ఆంధ్ర పక్ష నిర్మాణ ముగా ఉండాలనీ, నాయకులందఱూ స్వార్థరహితులై, అఖిలాంధ్ర ధృక్పథంతో, ఆంధ్రావని పున ర్నిర్మాణమునకు ప్రతిజ్ఞ పూనాలనీ మా హెచ్చరిక. యీ సందర్భంలో శ్రీ స్వామి సీతారామ్ గారి సందేశము అమూల్యమైనది, శిరసావహించ వలసినది అని మా సూచన.






# కృతజ్ఞత

సర్ దొరాబ్జీతాతా ఛారిటీస్, బొంబాయి వారు ఆంధ్ర మహిళా సభ పారిశ్రామిక విద్యాలయ అభివృద్ధి నిమిత్తము రూ 20,000 విరాళముగా నిచ్చిరి.

శ్రీ నౌరోజీ మెకంజీ వాదియా ఛారిటీస్, బొంబాయి వారు ఆంధ్ర మహిళా సభ నిర్మించుచున్న నర్సింగ్ హోమ్ నిమిత్తము రూ. 2000/- విరాళముగా నిచ్చిరి.

ప్రాంతీయులు కాక పోయినప్పటికీ, సంస్థ నియమించుకున్న సేవా కార్యక్రమం పట్ల తమ అభిమానమును సూచిస్తూ, విరాళముల నొసంగిన యీ ధర్మనిధుల కర్తృత్వ సంఘము లకు మా హృదయ పూర్వక కృతజ్ఞత.

—ఆంధ్ర మహిళా సభ

మళయాళ, అరవ భాషలలో

*అఖండ విజయమును ఆర్జించుకొన్న సాంఘిక చిత్రము*



కె & కె. ప్రొడక్షన్స్ వారి

# జీవిత నౌక

తెలుగు భాషలో
ఆంధ్ర దేశమంతటా
సెప్టెంబర్ నెలలో విడుదల

*Released through* **THE VAUHINI PICTURES LTD.**

MADRAS...VIJAYAWADA... TADPATRI

# ప్రస్తుత పరిస్థితులు

* అచ్యుతుని గిరిజ *

ఎన్నికలు—స్త్రీలు :

"దేశసేవకు స్త్రీలు కావాలి, సంఘ ఉద్ధారణకు స్త్రీలు కావాలి, ఎన్నికల పోటీలలో వోటు యివ్వటానికి స్త్రీలు కావాలి—అయితే వుద్యోగాలలో స్త్రీలు లేక పోతేనే మంచిది, ఎన్నికలకు స్త్రీలు ఎక్కువగా నిల్వరాదు, కష్టపడి పని చేసినా స్త్రీలకు తగిన వేతన మీయరాదు. ఇదేనా న్యాయం!" అంటూ ఆగష్టునెల సంపాదకీయంలో 'ఆంధ్ర మహిళ' అడిగింది. ఆ సమయానికే అధికారరీత్యా వార్త వచ్చింది—మన దేశంలో వివిధ ప్రాంతాలకు చెందిన స్త్రీలు 28 లక్షలకు పైగా వోటు యివ్వటానికి నిరాకరించటమే కాదు, చివరకు పేరు కూడ సరిగా చెప్ప నిరాకరించారని. శహభాష్. అఖండమైన స్ట్రైక్ అనే చెప్పాలి.

మరి సమ్మె జరిగిపోతే కథే లేదు. భారత మహిళాభ్యుదయానికి ఎక్కువగా పాటుపడే కజిన్సు దంపతులు పత్రికల్లో అలజడి చేయటం ఆరంభించారు. ఫలానా ఆయన కూతుర్ని, ఫలానా ఆయన భార్యని అని చెప్పుకోవటం చెలామణి కావటం తప్పుకాదని, అది సనాతనాచారమని కజిన్సు దంపతుల వాదన. ఆ మాట నిజమనే అనిపిస్తుంది. జనకుడి కూతురు జానకిగా, ద్రుపదుడి కూతురు ద్రౌపదిగా మనకు పరిచయులైనారు. శంకరుడి భార్య శంకరిగా, శంభుడి రాణి శాంభవిగా పూజింపబడుతున్నారు. వాళ్లకు అసలు పుట్టు పేర్లు వున్నవా లేవా అనే విషయం వేరు. అసలు తండ్రి పేరుతోను భర్త పేరుతోను చెలామణి అవుతున్న మాట మాత్రం వాస్తవం. అందుచేత కజిన్సు దంపతులు అన్నట్లు పరిస్థితులకు, ఆచార వ్యవహారాలకు అనుగుణ్యంగా ప్రభుత్వంవారు పద్ధతులను ఏర్పాటు చేయటం, అమలు జరపటం న్యాయం. ఈ విషయాన్ని తిరిగి ఆలోచించవలసినదిగా పార్లమెంటు స్త్రీ సభ్యులు కొంతమంది ఆందోళన చేస్తున్నారు. మళ్లీ ఆలోచించి, తిరిగి సరిగా జాబితాలను తయారు చేయటానికి వ్యవధి లేదు కాబట్టి దాదాపు 28 లక్షల మంది స్త్రీల పేర్లను మొండి బండ అమ్మాయిలుగా కొట్టి వేయాల్సిందే నంటున్నారు అంబేద్కరుగారు.

స్త్రీలందరు దేశ పరిస్థితులను అర్థం చేసుకుని పురుషులతో సరిసమానంగా వోటు చేస్తే సరిఅయిన ప్రాతినిధ్యం వుంటుందని, మహిళాభ్యుదయానికి అవకాశం వుంటుందని, యీ పార్లమెంటు స్త్రీ సభ్యులు అనుకుంటున్నారు. కాని చిన్నప్పుడు స్కూల్లో టీచరు "నీవు ఎంత తక్కువ వ్రాస్తే అన్ని తక్కువ తప్పులు వుంటయ్" అని అనటం జ్ఞాపకం వుండే వుంటుంది. అదే విధంగా పార్లమెంటు స్త్రీ సభ్యులలో మరి కొంత మంది అధునికులు ఒక దళంగా ఏర్పడి "పేరు చెప్పటానికే నిరాకరించే సనాతన స్త్రీలు వోటు యిచ్చినా ప్రమాదమే, రేపు మనం యే అభ్యుదయ విషయం తలపెట్టినా సెగ్గ నీయరు, హిందూ కోడ్ బిల్లు సంగతి అసలే అణగారి పోతుంది. కాబట్టి అన్నీ తెలిసి, అర్థం చేసుకొన్న స్త్రీలు కొద్దిమందే వోటు యిచ్చినా మంచిదేగాని అందరిని పగ్గాలు వేసి లాక్కు రావద్ద"ని గోల పెడుతున్నారు. కాని వీళ్ల వాదన సహేతుకంగాలేదు. ఆ మాటకు వస్తే ఇప్పుడు జాబితాలో వున్న స్త్రీలలో యెంత మంది, రేపు వచ్చి తమ వివేచనా శక్తిని వుపయోగించి వోటు యివ్వగలరు? ఫలానా ఎల్లయ్య భార్యగా, ఫలానా పుల్లయ్య కూతురిగా పేరు యివ్వక ఫలానా మల్లమ్మగా తన పేరే యిచ్చుకున్నప్పటికీ, చివరకు ఆ ఎల్లయ్య సలహా ప్రకారమో, యీ పుల్లయ్య గదమాయింపు ప్రకారమో వోటు యివ్వక తప్పదు. తనకై తాను తెలిసి ఆలోచించి ప్రతి స్త్రీ వోటు యివ్వాలంటే మన దేశంలో యిప్పట్లో అనుకోవలసిన విషయం కాదు. ఆ విధమైన చైతన్యం యింకా రాలేదు. అటువంటి పురుషులసంఖ్యే స్వల్పమనాలి.

(తరువాయి 52వ పేజీలో)



# రాజకీయాలు

* శ్రీ గొల్లమూడి రామచంద్రరావు *

ఆగస్టు నెలలో జరిగిన సంఘటనలవల్ల ప్రపంచ దేశాలన్నిటిలోనూ ఒక విధమయిన సంచలనం కలిగినట్లు కనిపిస్తున్నది. అన్ని వర్గాలవాళ్లూ కూడా—తాము అనుసరించదలచిన అసలు ఆశయాలు ఏమిటి? వాటిని తాము ఏవిధంగా అమలు జరుపుతున్నారు? కాలపరిస్థితులనుపట్టి వాటిలో మార్పులు చేయవలసి ఉన్నదా?—అని ప్రశ్నించుకుంటున్నట్లు కనబడుతున్నది. భారత దేశంలో ఈ సంచలనానికి ఫలితం ప్రధాని నెహ్రూ కాంగ్రెస్ కార్యవర్గ సభ్యత్వానికి రాజీనామా ఇవ్వటంలో విశదమవుతున్నది. బ్రిటిష్ విదేశాంగ మంత్రి మారిజన్ సోవియట్ యూనియన్ కమ్యూనిస్టు పార్టీ పత్రిక అయిన 'ప్రావ్దా' తోనూ, సోవియట్ యూనియన్ అధ్యక్షుడు ష్వెర్నిక్ అమెరికా అధ్యక్షుడు ట్రూమన్‌తోనూ జరిపిన ఉత్తర ప్రత్యుత్తరాలు కూడా ఈ సంచలనానికి ఫలితాలే.

* * *

కాంగ్రెస్ కార్యవర్గ సభ్యత్వానికీ, ఎన్నికలబోర్డు సభ్యత్వానికీ పండిత నెహ్రూ రాజీనామా ఇచ్చినట్లు 11వ తేదీన ప్రకటించ బడ్డది. విద్యామంత్రి మౌలానా అజాద్ కూడా ఈ అభిప్రాయాన్నే వెల్లడించారని కూడా తెలుస్తున్నది. అంతకు రెండురోజుల క్రిందటే, పండిత నెహ్రూ ఢిల్లీలో ఒక సభలో ఉపన్యసిస్తూ, కాంగ్రెసును బలపరచటానికి తాను చేసిన ప్రయత్నాలు వ్యర్థమయినవనీ, ఇటువంటి పరిస్థితుల్లో తాను పదవిలో ఉండటం కొంతవరకూ సిగ్గు విడిచిన పనేననీ అన్నారు.

నెహ్రూ రాజీనామాకు అసలు కారణం, ఉత్తర ప్రదేశ్ రాజకీయాలవల్ల కిద్వాయ్—టాండన్ వర్గాలకు ఏర్పడ్డ తగాదాలేననీ, కిద్వాయ్ మిత్రుడయిన నెహ్రూ—కిద్వాయిని వెనకేసుకునివచ్చి కార్యవర్గాన్ని మార్పు చేయమని కోరినట్లూ, దానికి టాండన్ నిరాకరించటంవల్లనే నెహ్రూ రాజీనామా ఇచ్చినట్లూ, కొంత ప్రచారం జరిగింది. కాని 21వ తేదీన కాంగ్రెసు పార్లమెంటరీపార్టీ సమావేశంలో పండిత నెహ్రూ చెప్పిన దానినిపట్టి ఇది నిరాధారమయినదని తెలుస్తున్నది. తన రాజీనామాకు కారణాలను వివరిస్తూ, ఆయన ఈ కింది అంశాలను వెల్లడించారు.

"కాంగ్రెస్ సంస్థ గాడిలో పడ్డ బండి మోస్తరుగా నడుస్తూ, ఏదో వైపుకు సాగిపోతున్నది. కాని ఆ సాగిపోతున్నది మాత్రం సక్రమ మార్గంలో మటుకు కాదనే చెప్పాలి. అటువంటి సంస్థ చేసేదొకటీ, చెప్పేదొకటిగా వ్యవహరించటం మంచిదికాదు. కాంగ్రెస్‌లో ఏర్పడ్డ ఈ దృక్పథాన్ని మార్చటానికి నిజంగా ప్రయత్నాలు జరుగుతున్నవని ప్రజలకు విశ్వాసం కలగటానికే కార్యవర్గాన్ని మార్చవలెనని సూచించాను కాని, ఒకరిద్దరు వ్యక్తులు ఉన్నా లేకపోయినా నాకు ఒకటే."

ప్రజలను నడపకలగాలంటే కాంగ్రెసు ముందు తన వ్యవహారాలను చక్క జేసుకోవాలనీ, తన రాజీనామావల్ల కాంగ్రెసు వాదుల్లో ఒక కదలిక బయలుదేరి ఆ విషయమై ఆలోచిస్తారని తాను ఆశిస్తున్నాననీ నెహ్రూ అన్నారు.

నెహ్రూ ప్రతికూల వర్గంవారు ఆయనకు నియంతృత్వాభిలాషను అంటగట్టటానికి కూడా వెనకాడటంలేదు. నెహ్రూ—టాండన్‌ల మధ్య రాజీకుదిరే అవకాశమేమీ కనిపించటం లేదు. సెప్టెంబరు 8, 9 తేదీలో అఖిల భారత కాంగ్రెసు సంఘం ఢిల్లీలో సమావేశమై ఈ విషయాన్ని చర్చిస్తుంది. కొత్త కార్యవర్గాన్ని ఏర్పాటు చేసేదిలేదని టాండన్ పట్టుదలమీద ఉన్నారు. పార్లమెంటు కాంగ్రెస్

పార్టీ, ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెసు కార్యవర్గం మొదలైన అనుబంధ సంస్థలు నెహ్రూ నాయకత్వాన్నే బలపరుస్తున్నవి. వెనకటిరోజుల్లో ఇట్లాగే కాంగ్రెసులో ప్రతిష్టంభనలువచ్చి సర్దుకుని పోయినవి కాని ఈ తడవ అట్లా కనిపించటం లేదు. అధిష్ఠానవర్గం తన సూచనలను నామమాత్రంగా ఆమోదించి బుట్టదాఖలు చేస్తున్నదని నెహ్రూ పార్లమెంటు పార్టీ సమావేశంలో ఆరోపించారు. కనుక అటువంటి సర్దుబాటు ఏతన్మాత్రంగా సాధ్యపడదు.

కాంగ్రెసు అవసరం తీరిపోయినదనీ, అది అవినీతికి లోనయి జాతికి ప్రాతినిధ్యం వహించలేక పోతున్నది కనుక నెహ్రూ దానిని విడిచిపెట్టి అభ్యుదయ వర్గాలకు నాయకత్వం వహించాలనీ లోగడ అనేకమంది సూచించి ఉన్నారు. అయితే జాతినంతటినీ కలిపి నడిపించే సంస్థ కాంగ్రెసు ఒకటే నన్న నమ్మకం మాత్రం ఇంకా నెహ్రూకు పోలేదు.

* * *

దేశకాలపరిస్థితులవల్ల కాంగ్రెసు వ్యవహారాల్లో పండిత నెహ్రూకు సంచలనం బయలుదేరినట్లుగా, బ్రిటిష్ సోషలిస్టు ప్రభుత్వ విదేశాంగ మంత్రి మారిజన్‌కు కూడా సాంఘిక వ్యవస్థల మూలసూత్రాల విషయమై కదలిక బయలుదేరింది. అయితే పండిత నెహ్రూ బయటి పరిస్థితులను పట్టి తాను ఉంటున్న సంస్థలో లోపాలను తెలుసుకోగల్గా, మారిజన్ మటుకు గురిగింజ తన నలుపెరగ దన్నట్లు, కమ్యూనిస్టు దేశాల్లో ఉన్న పరిస్థితులను విమర్శించటం మొదలు పెట్టారు. కమ్యూనిస్టు దేశాల్లో వ్యక్తిగత స్వేచ్ఛ ఉండదని ఆరోపిస్తూ ఈయన వ్రాసిన ఒక వ్యాసాన్ని 'ప్రావ్‌దా' మొదలయిన సోవియట్ పత్రికలు ప్రకటించినవి. దీనికి ప్రావ్‌దా సమాధానం కూడా ఇచ్చింది. సోవియట్ అధ్యక్షుడు ష్వెర్నిక్ అగ్రరాజ్యాలు రాజీపడి శాంతిని కాపాడాలని సూచిస్తూ అమెరికా అధ్యక్షుడు ట్రూమన్‌కొక సందేశాన్ని పంపగా, రష్యాకు శాంతి వాంఛలేదని ట్రూమన్ జవాబిచ్చారు.

ఈ ఉత్తర ప్రత్యుత్తరాల్లో పరస్పర నిందలను వదిలితే, ఒక్క విషయం కనిపిస్తుంది. పశ్చిమ ప్రజాస్వామ్యాలు వాక్, పత్రికా, సమావేశ స్వాతంత్ర్యాలకు ప్రాధాన్యత ఇవ్వంగా, తూర్పు ప్రజా స్వామ్యాలు (కమ్యూనిస్టు దేశాలు) ఆర్థిక దోపిడి ప్రమాదం నుంచి ప్రజలకు స్వేచ్ఛ వుండాలని, వ్యక్తులు ఆర్థిక విపత్తు లేకుండా స్వచ్ఛందంగా జీవించగల అవకాశం లేకపోతే పైమూడు స్వాతంత్ర్యాలూ నిరర్థకమనీ వాదించినవి. అంటే 'వ్యక్తిగత ఆస్తి: దానివల్ల సమాజంలో కలిగే మార్పులు' అన్న అంశమే ఉభయ వ్యవస్థలకూ గల ముఖ్య భేదమని చెప్పవలసి ఉంటుంది. సమాజస్థితిలో మార్పులు కలిగించని ఆస్తులు వ్యక్తులకు చెందటానికి కమ్యూనిస్టులు అంగీకరిస్తారు. ఈ అంశాన్ని పట్టే ప్రపంచ ప్రజలు ఆ వ్యవస్థలపట్ల తమ వైఖరిని నిర్ణయించుకోవలసి ఉంటుంది.

* * *

మన దేశంలో కమ్యూనిస్టులకు, మిగిలిన వారికీ ఈ తేడాతోపాటుగా ఆశయ సాధనకు అనుసరించే మార్గాల విషయంలో కూడా తేడా ఏర్పడ్డది. కాని ప్రస్తుతం కమ్యూనిస్టులు తమ పంథా మార్చుకుని పార్లమెంటరీ రాజ్యాంగ పద్ధతిలోనే ఆశయ సాధనకు ప్రయత్నించ నిశ్చయించుకున్నారు.

* * *

కొరియా యుద్ధవిరమణ సంప్రదింపులు ఇంతవరకూ ఏ నిర్ణయానికీ రాలేక పోయినవి. అయితే జపాన్‌ను తమ యుద్ధ స్థావరంగా చేసుకొనటానికి అమెరికా చేస్తున్న ప్రయత్నాలు మాత్రం సాగిపోతున్నవి. యుద్ధంలో ఓడిపోయిన జపానుకు సకల స్వాతంత్ర్యాలనూ ఇస్తూ శాంతి ఒప్పందం చేసుకోవాలని అమెరికా వాదిస్తున్నది. అయితే జపానులో అమెరికన్ సేనలు ఉండాలనీ, జపానుకు చెందిన ర్యూక్యూ దీవులు మొదలైనవి తన 'ధర్మ కర్తృత్వం' కింద ఉండాలనీ అమెరికా షరతులు పెట్టింది. ఇండియా దీనికి అంగీకరించక, ఇది జపాన్ స్వాతంత్ర్యానికి భంగకరమని చెపుతూ, ఆ ఒప్పంద కార్యక్రమంలో పాల్గొనటానికి నిరాకరించింది. వెనకటి ఒప్పందాల ప్రకారం చైనాకు చెందవలసిన ఫార్మోజా విషయాన్ని ఈ ఒప్పందంలో ప్రస్తావించక పోవటమూ, చైనాకు న్యాయమయిన ప్రభుత్వంగా, తాము గుర్తించిన పెకింగ్ ప్రభుత్వం సంతకం చేయాలని కోరక పోవటమూ కూడా భారత ప్రభుత్వ వైఖరికి కారణాలే.

రష్యా ఒప్పందపు సమావేశంలో పాల్గొనటానికి అంగీకరించగా, అది అంగీకరించదులే అన్న ధీమాతో ఆహ్వానం పంపిన అమెరికన్ అధికారులకు పచ్చి వెలక్కాయ గొంతులో పడినట్లయింది. ఏది ఎట్లా ఉన్నా జపాన్ పొరుగు దేశాలయిన చైనా, రష్యాల ఆమోదంలేని జపాన్ శాంతి ఒప్పందం అశాంతి ఒప్పందం కాక తప్పదు.

* * *

కాశ్మీర్ విషయమై తర్జన భర్జనలు తీవ్రంగా సాగుతునే ఉన్నవి. బ్రిటన్, ఇటలీ, ఫ్రాన్స్, కెనడా మొదలైన దేశాలు పాకిస్థానుకు విరివిగా యుద్ధసామగ్రి సప్లయిచేస్తున్నవి.

ఒక్క బ్రిటనే 100 విమానాలను సప్లయిచేసినదనీ అందులో 6 బాంబర్లు కూడా ఉన్నవనీ వార్తలు వచ్చినవి. బ్రిటిష్ సైన్యోద్యోగులు ఆషిన్‌లెక్, గ్రేసీల ప్రవర్తనపై నెహ్రూ నిరసించినందుకు బ్రిటిష్ ప్రధాని ఆక్షేపించారు. దానిమీద ఉభయులకూ ఉత్తర ప్రత్యుత్తరాలు జరిగినవి. వాటిని వెల్లడించటం మంచిదికాదని నెహ్రూ అన్నారు.

ఫార్మోజా, ఇండోచైనా మొదలైన చోట్ల జోక్యం కలిగించుకున్నట్లుగా, అమెరికా కాశ్మీర్‌లో ప్రత్యక్షంగా గానీ పరోక్షంగా గానీ జోక్యం కలిగించుకోవాలని అభిప్రాయ పడుతున్నట్లు యునైటెడ్ ప్రెస్ లండన్ విలేఖరి తెలియజేశాడు. ఈ వార్తను బి. బి. సి. ప్రకటించినప్పటికీ, బ్రిటిష్ పత్రికలు దాచిపెట్టినవి.

అమెరికా జోక్యానికి పాకిస్థాన్ ఇష్టపడుతున్నట్లు తెలుస్తున్నది. కాశ్మీర్‌నుంచి పాకిస్థాన్ సేనలతోపాటు ఇండియా సేనలు కూడా నిష్క్రమించాలని అమెరికన్ రాయబారి ఇటీవల చేసిన సూచనచూస్తే, అమెరికా మీద పాకిస్థాన్ ఆశలు పెట్టుకొనటంలో వింత ఏమీ కనిపించదు.

తన పథకాలకు ఇతర దేశాల పరిస్థితులు అడ్డుపడితే వాటి వ్యవహారాల్లో అమెరికా జోక్యం కలిగించుకొనటం మామూలే. మధ్య ప్రాచ్యంలో యుద్ధంవస్తే నూనె సప్లయి దెబ్బతింటుందన్న ఉద్దేశంలో ఇజ్రేల్, అరబ్ దేశాలు యుద్ధానికి దిగితే స్వయంగా దెబ్బతీస్తామని అట్లీ, ట్రూమన్‌లు స్పష్టం చేశారు. ఇట్లాగే ఆగ్నేయాసియాలో అమెరికన్ యుద్ధ వ్యూహాల్లో బర్మా ముఖ్యస్థానం వహిస్తున్నట్లు యూరపులోని అమెరికన్ సైన్య పత్రిక జనవరిలో సూచించి ఉన్నది. అమెరికన్ సహాయంతో నిలిచి ఉన్న చాంగ్‌కై షెక్ సేనలు కొన్ని బర్మాలో జేరినవి. వాటిని నిరాయుధం చేయాల్సిందని బర్మా ప్రతినిధులు కోరినా ఫలితం కలగలేదు. ఆకోమింటాంగ్ సేనలు ఆగస్టు 2న బర్మానుంచి చైనాపై దండెత్తినవి. అయితే అవి చావు దెబ్బలు తిని పారిపోయి వచ్చినందువల్ల సరిపోయింది కాని లేకపోతే, బర్మా ఈపాటికి పెద్ద యుద్ధరంగం అయేదే. ఈ సందర్భంలో అమెరికా స్వభావం బయటపడుతుంది.

* * *

పర్షియా నూనె తగాదా మళ్లీ మొదటికి వచ్చింది. సిబ్బంది యావత్తు తమయాజమాన్యాన ఉండాలని బ్రిటన్ సూచించటంవల్ల సంప్రదింపులు భగ్నమైనవి. పరిశ్రమకు ఆయువుపట్టయిన సిబ్బందిని విదేశీయుల యాజమాన్యం కింద పర్షియా ఉంచుతుందనుకొనటం పొరబాటు.

బ్రిటన్‌తో ఈజిప్టుకిగల తగాదా మరీ విషమిస్తున్నది. బ్రిటన్ తన వైఖరి మార్చుకోకపోతే 1936 సం॥పు ఒప్పందాన్ని రద్దుచేయగలమని ఈజిప్టు ప్రధాని నహాస్‌పాషా 23వ తేదీన స్పష్టపరిచారు. సూయజ్ ప్రాంతంనుంచి బ్రిటిష్ సేనలు ఉండటానికి ఆ ఒప్పందం అవకాశం ఇస్తున్నది. సుడాన్‌ను ఈజిప్టులో కలిపి, తన సేనలను ఉపసంహరించుకోవాలని ఈజిప్టు కోరుతున్నది.

* * *

ఆగస్టు 15 న ఆంధ్ర రాష్ట్ర స్థాపనకు చర్యలు ప్రారంభించి అక్టోబర్ 10వ తేదీ నాటికి రాష్ట్రాన్ని ఏర్పరచాలని స్వామి సీతారాం (గొల్లపూడి సీతారామశాస్త్రి) గారు భారత ప్రభుత్వాన్ని కోరగా, అనుకూల సమాధానం లభించలేదు. అందువల్ల వారు 16వ తేదీన నిరశన దీక్షను ప్రారంభించారు. ఆంధ్ర రాష్ట్రాందోళన 1913 నుంచీ జరుగుతున్నదనీ, 1949 లో రాష్ట్రస్థాపన 'మద్రాసు వదులుకోవాలి' అనే అవమానకరమయిన, అనవసర షరతు విధించటంవల్లనే నిలిచి పోయినదనీ గమనిస్తే, స్వామీజీ చర్యలో తొందరపాటు లేదని స్పష్టపడుతుంది. పై షరతు లేకుండా, అప్పుడు ప్రారంభించిన కార్యక్రమాలను మళ్లీ నడిపించటంలో భారత ప్రభుత్వానికిగల చిక్కులు అర్థం కావటం లేదు.

★

ప్రఖ్యాత భారతనారి

# కీ. శే. శ్రీమతి రుక్మిణి లక్ష్మీపతిగారికి

## జోహార్లు

* శ్రీమతి. జి. ప్రభ *

స్త్రీ ఉద్యమంలో, సంఘ సంస్కరణలో, రాచకీయాలలో, 25 సం॥లకు పైగా కృషి చేసి, దేశసేవా పరాయణిగా వెలుగొంది, అమిత ప్రఖ్యాతి మర్యాదలను గాంచిన భారతనారి, ఆంధ్ర వనితా రత్నము, శ్రీమతి రుక్మిణమ్మగారి మృతివల్ల, వనితా లోకములో ఒకతీరని కొరత ఏర్పడ్డదని చెప్పి తీరాలి.

ఈమె జననం చెన్నపురిలో, 1891వ సం॥లో. న్యాయవాదులు సంస్కర్తలునగు శ్రీ. రాజా. టి. రామారావుగారి మనుమరాలు. ప్రఖ్యాత ఆయుర్వేద వైద్యులగు డాక్టరు లక్ష్మీపతిగారి ధర్మ పత్ని.

స్త్రీలకు విద్య గరుపుటయే ఒకనేర మనేటట్టి అంధకార యుగములో పట్టభద్రురాలై యీమె ఆదర్శనారి యైనది. స్త్రీల గౌరవాన్ని పెంపొందించి, ముఖ్యంగా భారతనారికి సంఘంలో ఉన్నత స్థానాన్ని కలిగించాలని, 30 సం॥లు యీమె తీవ్రకృషి సల్పి, స్త్రీ ఉద్యమాలను లేవనెత్తి, నాయకత్వము వహించి, మార్గ దర్శకురాలైన ధన్యజీవి. సాంఘికోద్యమములనుండి క్రమంగా, రాజకీయ రంగములో ప్రవేశించి, సత్యాగ్రహోద్యమంలో వెన్నిచ్చి నిలచి, కారాగారవాసాది శిక్షలను పలుమార్లు అనుభవించి, దేశ స్వతంత్ర సముపార్జనలో, మేటి నాయకులకు సాటియై, దేశ ప్రజల మన్ననల నందుకున్నారు.

మద్రాసు వాసియై, మద్రాసులో ఆంధ్రులకు తమిళులకు సామరస్యము కలిగించుటకు యత్నించి తమిళులలో కూడ చాల, పలుకుబడి సంపాదించి, తమిళరాష్ట్ర కాంగ్రెసు సంఘమునకు ఉపాధ్యక్షురాలుగా, తమిళ జిల్లాలు అనేక మార్లు పర్యటించి, స్త్రీ విద్య, కాంగ్రెసు నిర్మాణ కార్యక్రమము మున్నగు విషయాలలో తీవ్ర ప్రయత్నము సాగించారు—చాల సంవత్సరాలు మద్రాసు పురపాలక సంఘ సభ్యురాలుగా, ఒక సంవత్సరం డిప్యూటీమేయరుగా కూడా పని చేసినారు.

ఈమె కొంత కాలం అన్నామలై విశ్వ విద్యాలయంలో సెనేట్ సభ్యురాలిగా ఉన్నారు. మద్రాసులో భారత స్త్రీ మహామండలిలో కార్యదర్శిని. 1926వ సంవత్సరం పారిస్‌లో జరిగిన అఖిల ప్రపంచ మహిళా సభలకు భారత



మహిళల తరపున ప్రతినిధిగా వెళ్లారు. 1928వ సం॥ కాంగ్రెస్‌లో ప్రవేశించారు. 1929వ సం॥లో లాహోరులో జరిగిన అఖిల భారత మహిళా సభలకు అధ్యక్షురాలుగా ఉండి స్త్రీ జనోద్ధారణకై ఎంతో పాటుపడ్డారు. 1930వ సం॥ ప్రప్రథంగా ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొని వేదారణ్యంవద్ద అరెస్టు చేయబడిన ప్రథమ స్త్రీ ఈమె. దీనికి గాను 1 సం॥ ఖైదీ శిక్షను స్వీకరించారు. రాజకీయ రంగంలో ప్రవేశించిన ఈమె పిదప అనేక సార్లు కారా

(తరువాయి 50వ పేజీలో)



ఏకాంకిక

*　*　*

# "హారమ్" లో "ఔరత్"

*　*　*

శ్రీ కవికొండల వెంకటరావు

## మొదటి రంగము

[కళాశాలలో ఉత్సవసభ - వేదిక - సదస్యులు]

[వేదిక మీదకు "దిల్ జహాన్" అను మహమ్మదీయ బాలిక వచ్చును—శ్రుతి—పాట—ఈ విధముగా—సదస్యు లాలకింతురు.]

దిల్ జహాన్ : "ఎకనా నెబదోరో జగరమవద్ హాసిలె మర్ద
బరకూ జషికిస్తాదమె అజె సర్ద
మామూరక సేది గర్ చరాబాయెద్ బూద్
తాఖిద్మతె చూఖుదీ చరాబాయెద్ కర్ద"

[వరుస మార్చి మరొక గేయము ఇట్లు]

"సారే జహాన్ సే అచ్ఛా హిందూస్థాన్ హమారా!
హంబుల్ బుల్ యా నేహం ఉస్కీ వో బుల్ సితాన్ హమారా!"

........................

........................

(నిష్క్రమించును)

[సభలో గుసగుసలు]　[సదస్యులు చప్పట్లు చరతురు]

[ముఖ్యముగా ఒక ప్రొఫెసర్ పరమేశ్వరరావు వాని భార్య యశోలత ఇట్లు మాట్లాడు కొందురు]

యశోలత : ఆ అమ్మాయి ఎవరండీ? అంత చక్కగా, అంత స్వతంత్రంగా మన శరీరంలోని తంత్రులన్నీ స్పందించేలా పాడింది!

పరమేశ్వరరావు : ఆమే దిల్ జహాన్! మహమ్మదీయుల పిల్ల.

యశో : అందుకే "ఒమార్ ఖయ్యామ్" నుండి, "ఇక్బల్" నుండి ఉటంకించింది.

పర : వారెవరు అని నీ అభిప్రాయము?

యశో : కవులు.

పర : ఏమో లే! ఒకవేళ మత ప్రవక్తలని అనుకుంటున్నావేమో అని అడిగాను. ఆ పిల్లకు మతమన్నా, మతగురువులన్నా, మతాంధ సాంప్రదాయాలన్నా నమ్మకం లేదు.

యశో : అట్లా అయితే పదహారు అణాలు కాలేజీగర్ల్ అన్నమాట.

పర : ఆమెకున్న ఉత్సాహము, సర్వమానవ సౌహార్దత్వము, అందటికీ ఆ మతస్థులకుండి వున్నట్లయితే—

యశో : ఈలా మన భరతఖండం చీలబడక అఖండ జ్యోతిగా వెలిగివుండేది.

పర : చక్కగా పూర్తిచేశావు సమస్య. అదిగో! తెర ఎత్తుతున్నారు! చూడు! అఖండ భారత లక్ష్మి వైభవము.

యశో : ఎట్లా చూపింపగలుగుతున్నారండీ. ఇంకా పూర్వపు భరతమాతను? అంత ఖచ్చితంగా పాకీస్థాన్‌ను విడగొట్టుకు పోయారే!

పర : ఈ దిల్ జహాన్ ఈ కళాశాలలో విద్యార్థినిగా నున్నంత కాలం అఖండ భారత లక్ష్మినే ప్రదర్శింప నెంచియున్నాము. ఆమె కంఠం అంత వినసొంపైంది. ఆమె

రూపం అంత అపురూపమైంది. ఆమె మనస్సు ఒక దానికి కట్టుపడింది కాదు తెలుసా?—మీ ఆడ వాళ్లంతా ఆమెనుండి ఒకచక్కని పాఠం నేర్చుకో వలసివుంది—

యశో: చూస్తాగా! ఆమెయొక్క ఉదారస్వభావము! ఇంకా కన్య కాబోసు?

పర: కన్యేకాని, ఎప్పటికైనా పెళ్లి చేసుకోకపోదు—అదిగో పాడుతున్నారు పిల్లలంతా కలిసి.

[తెర ఎత్తగా అఖండ భారతఖండము యొక్క "టేబ్లో" దాని ఎదర విద్యార్థినీ విద్యార్థుల బృంద గానము]

"వందేమాతరం!

సుజలాం సుఫలాం మలయజ శీతలాం
సస్యశ్యామలాం—మాతరం! వందేమాతరం
శ్యామలాం, సరలాం, సస్మితాం, భూషితాం,
ధరణీం, భరణీం, మాతరం ॥ వందే మాతరం!"

యశో: మన పాటే పాడింది ఆ మహమ్మదీయ బాలికాను!

పర: అదిగో! తిరిగీ మహమ్మదీయ బాలిక అంటున్నావు! అదే నీ దగ్గఉవున్న దుర్గుణం. మతాన్ని మరువలేవు నువ్వు! అసలు అభిప్రాయాలందరికీ ఒక టేనని, మతమంటే అభిప్రాయమని అన్నసంగతి ఎన్నిసార్లు బోధించేది నీకు నేను? ఇందాకా ఆ పిల్ల చదివిన "రుబాయత్" కు పోతన్న పద్యానికి ఏమిటి తేడా?

యశో: "కాటుక కంటినీరు" అన్న పద్యమేనా?

పర: అదే "చనుకట్టు పయింబడనేల యేడ్చెదో" అని సాగుతుంది.

యశో: కాస్సేపు వూరుకోండి మీ పుణ్యమాయిరి, డొంక కదిపితే తీగ కదుల్తుంది. ఇది ఇల్లుకాదు కాలేజీ! సంసారం కాదు. సభ!

పర: వెల్, ఎసైడ్! ఇదంతా మన మధ్య నేపథ్యం—రేపు ఆమెను మన యింటికి "టీకి" పిలుస్తున్నాను.

యశో: ఆమె నొక్కర్తనేనా? ఆమె తండ్రినీ తల్లినీ కూడా పిలుస్తున్నారా?

పర: నీ వెప్పుడూ కళాశాల విద్య నభ్యసించలేదు కాబట్టి ఇంకా తల్లీ తండ్రీ అంటున్నావు. ఈ పిల్లలు పూరా స్వతంత్ర వాతావరణంలో తయారైన సరుకు అనుకో!

యశో: అయితే ఆమెనొక్కర్తెనేనా? తక్కిన ఆడ పిల్లలను కూడానా?

పర: ఆమె నొక్కర్తెనే!

యశో: ఇలా ఇక్కడే పిలుస్తారా?

పర: ఇక్కణ్ణుంచి ఇలా పిలవడమనేది "ఎటికెట్" కాదు. ఇంటికి వెళ్లాక "కవరింగ్ లెటరు" గా ఆహ్వానం. "టైప్" కొట్టించి నీ చేత కూడా సంతకం చేయించి మఱి పంపుతాను.

యశో: నా సంతకం మాత్రం వద్దుసుమండీ! నాకు ఇంగ్లీషు రాదు గింగ్లీషురాదు. చేసియిమ్మంటే "టీ" కాచి యిస్తాను. పిండివంటలేమైనా వండగలను.

పర: ఆడపిల్ల కాబట్టి ఆడవాళ్లు పిలవడం మెఱుగని.

యశో: ఎంతలో బోల్తా కొడుతున్నారు! మఱచిపోతు న్నారు, ఆ పిల్ల కళాశాలా విద్యార్థిని అని, సర్వ స్వతంత్రురాలని అన్నారు. కాని ఆహ్వానించినా వెళ్ల డానికి వెనుదీయ నవసరంలేని వాళ్లు వాళ్లు!

పర: అన్నానా? అంటేసరే! వొకణ్ణే సంతకంచేసి పంపి స్తున్నాను—విను—వేదికమీద నుంచి ఆ అమ్మాయి "టోస్టు" "ప్రొపోజు" చేస్తూవుంది.

(కరతాళధ్వనులు)

యశో: బల్ల గుద్ది చెబుతూ వుండండీ!

పర: ఏమనుకున్నావు!

(కరతాళధ్వనులు)

ఇక "థేంక్సు" లే!

(నిష్క్రమణ)

## రెండవ రంగము

[ప్రొఫెసర్ పరమేశ్వర్రావు ఇల్లు—అదే రాత్రి ఒక జవాను వేచియుండును. పరమేశ్వర్రావు యశోలత సభ నుండి ఇంటికి వస్తారు]

జవాను: ఈ వేళ తమ యిల్లు తాళంవేసి వుందేమండీ? సాయంకాలం నుంచి కనిపెట్టు కూర్చుని వున్నాను.

పర: అవును! నేనూ ఈమే కూడా వెళ్లాం కాలేజీలో "సోషల్" వుంటే.

జ: చిత్తం! తమకీకవరు ముసద్దీన్ జనాబ్‌గారు ఇమ్మన మన్నారు. సెలవు.

పర: "థాంక్స్" అందిందని చెప్పు. [జవాను నిష్క్రమించును]

[ఉత్తరం విప్పి చూచి] ఏమేవ్! ఆ అమ్మాయికి రేపు వుదయం 8 గంటలకు వివాహమట! ఇదిగో! ముసద్దీన్ సాహేబుగారు నాకు ఆహ్వానం పంపారు. ఇదిగో చూడూ!

యశో: అందులో మిమ్మల్ని వొక్కర్నేనా పేర్కొన్నది!

పర: నన్నొక్కణ్ణే! మఱెన్ని పిల్చేది. తానొక్కడే!—సతీసమేతంగా పిలవడం, పిలిపించుకోవడం, ఒక్క ఇంగ్లీషు వాండ్లకే చెల్లింది. వెయ్యి పుటాలు పెట్టినా మన వాళ్లకు మహమ్మదీయులకు కలగదు, కలగబోదు.

యశో: పోనీ! శుభలేఖ అని కాసింత పసుపైనా అంటించు కున్నారు కాలేం? మఱెన్నీ రేపే పెండ్లి అయితే పెళ్లికూతురుగా ఎప్పుడు చేయబడుతుంది? ఈ దాకా కాలేజీ ఉత్సవాల్లోనే పాల్గొంటూవుండె!

పర: పసుపు పేడ ఈలాంటివన్నీ మనకు—అకటావికటం మనిషివి బయలుదేరేవు! ఈ ఇరవైయో శతాబ్దంలో "మోస్టు బిసినెస్, లైక్"గా జరుగుతాయి పెళ్లిళ్లు!

యశో: అసలు వాళ్లు ఏమీ గుమ్మాలకు రాసుకోరం టారా? ఆడవాళ్లు ముఖాలకు పాము కోరంటారా?

పర: ఈలాంటివి అన్నీ అడిగి తెల్లవార్లూ నన్ను చంపే కన్న కాస్సేపు నీవు వూరుకుంటే మంచిది. తెల్లాతే అపిల్ల పెళ్లికెళ్లి, సమస్తం చూచి, పూసగ్రుచినట్టు నీకు నివేదిస్తాను. ఆదాకా బతకనియ్యి. [ఆలోచన అభినయించును]

యశో: ఏదో తీవ్రాలోచనలో పడ్డారు! మతిపోతూ వుంది!

పర: రేపు "టీ" కి నేను ఆ పిల్ల కొక్కర్తెకూ లకోటా వుత్తరంగా ఆహ్వానం పంపుతా నన్నానే యీ సాయంకాలం మఱి. ఆ సన్నాహం మానుకోవలసి వస్తూవుందే ఈ మ్యారేజి మూలంగానని యోచిస్తూవున్నాను.

యశో: మానుకోవడమేం? నూతనదంపతుల్ని స్వయంగా దీవించి యిద్దర్నీకూడా తీసుకురండి మనింటికి. నేనూ చూస్తాను ఆ దంపతులు ఎల్లా వుంటారో!

పర: గొప్ప "ఐడియా" పారేశావు. ఉండి ఉండి నీ తెలివి మహోద్భుతంగా అగ్ని పర్వతపు "లావా"లా ఎగజిమ్మేవు!—"టై" మెంతైంది?

యశో: మన మామూలు రాత్రి భోజనం వేళదాటి ఒక గంటే అయింది.

పర: "నైన్ ఫైవ్?"

యశో: ఏమి? ఎంత కావాలని?

పర: తెల్లారిందేమోనని!

యశో: నా పెళ్లి ముహూర్తానికైనా మీరింత తహతహ పడలేదు!

పర: అది మన పెళ్లి—నా తహతహలో నీవు సగంలాగేసి వుంటావు—ఇది కేవలం మఱొకరి పెళ్లి—వడ్డించు. ఏదోతిని నిదరపోయేలోగా అదే తెల్లాఱుతుంది—తప్పకుండా వెళ్లితీరాలి ఈ పెళ్లికి!

యశో: కాలేజీగర్ల్ కాబట్టి "ఫార్వర్డు"గా వచ్చి ఆమే మీకు స్వాగత మిస్తుందనుకుంటారు.

పర: అదే చూడాలి! మఱెన్ని మహమ్మదీయుల్లో, మనకు మల్లే, పిల్లను ఒకళ్లకు దానం చేయడం వుండదు. పిల్ల సర్వస్వతంత్ర! ఆ సందర్భం ఎట్లా నడిపిస్తారో!

యశో: అదిచూడదగ్గదే! [అంటూ వడ్డించును]

పర : పిల్లే, నడచి, అలా భర్తవద్దకు వెళ్లి—"నిన్ను నేను పెళ్లి చేసుకుంటూ వున్నాను" అని ముఖాముఖి చెప్పివస్తుందనుకుంటాను—[భోజనంచేస్తూ] ఏదీ! కూర మహాబాగావుంది! మరి రవంత వెయ్యి! ఒకవరకంగా వేగింది—గడియారం పదికొట్టిందే! నీ భోజనం అయిందా?

యశో : ఇప్పుడేగా వచ్చాం ఇద్దఱమూను.

పర : అయితే త్వరగా భోంచెయి. చూశావు! ఈ కార్డు లోని "వర్డింగు"! "బిస్‌మిల్లా" తో ప్రారంభ మైంది. వాళ్లకూ దేవుడున్నాడు!

యశో : అందఱకూ దేవుడు ముందు, తరువాత పెళ్లి? అది మీకు తెలియదు కాబోలు, వాడే వ్రాసి పడేస్తాడు ఎవరెవరికి జతో!

పర : మరి పిల్లా జెల్లా?

యశో : ఆ వెంట మనకొద్దు!

పర : అందుకే ఇలాంటి ఆహ్వానము నీకు రావడంలేదు.

యశో : నాకు లేని పిల్లలు మీకున్నారు కాబోలు!

పర : మఱది వేరూ? కాలేజీలో పిల్లలందఱూ నా పిల్లలే!

యశో : ఆ మాట వీధిలో అనండి!

పర : ఇవే వెడర్థాలు తియ్యడం అన్నా, వెడ మొగంగా పడుకోవడమన్నా!—స్విచ్ ఆఫ్ చెయ్యి!

## మూడవ రంగము

[మర్నాడు తెల్లాటి 9 గంటలకు—జానాబ్ ముసద్దీను సాహేబుగారి యింటి ప్రాంగణము—పందిరి వుండదు—బాజాలు వుండవు— తోరణాలు ఏమీ వుండవు—కుర్చీలుంటాయి. ముసద్దీన్‌సాహేబుగారొక్క కుర్చీలో కూర్చుని వుంటాడు. ప్రొఫెసర్ పరమేశ్వరరావు రిస్టువాచీ చూచు కొంటూ వస్తాడు—]—[ముసద్దీన్ లేస్తాడు కుర్చీలోనుంచి]

పర : "ఆదాబ్ జానాబ్!"

ముస : "ఆదాబ్! వెల్‌కమ్."

పర : "థాంక్సు"—తొమ్మిది అయిందే. ఇంత "సైలెంట్"గా వుండేం ఇదంతా? పెండ్లి వుందా?

ముస : పెండ్లి వుంది. మాలో ముహూర్తమంటూ లేదు; ఊరికే "కన్వీనియన్సు" కోసం వేస్తామేకాని గంటు, ఆ గడియకు పెళ్లి అవ్వాలన్న పట్టుదల లేదు.

పర : బాజాల్లేవు! పందిరి లేదు! తోరణాలు లేవు!

ముస : అవన్నీ మీకు. మాది "మ్యారేజి" అంటే "సింపిల్" వ్యవహారము. ఖాజీ రావాల, అంతే. ఆ రిజిస్టరులో దంపతులు సంతకాలు చేస్తారు. అదే పెళ్లి.

పర : ఖుషీ నహీ?

ముస : ఖుషీ బహుత్ హై! చూస్తూ వుండండి ప్రొఫెసర్ సాబ్! [నిష్క్రమించును]

పర : ఏమిటి చూస్తూ వుండేను? అప్పుడే 9-15 అయింది. పేరంటాళ్లు లేరు. ఆఖరుకు పియానో వాయించే ఏంగ్లో ఇండియన్ లేడీనైనా పెట్టారుకారు. ఉత్త సహారా యెడారిలా వుంది.—అదిగో ఎవరో దాడీవాలా వస్తూ వున్నాడు. ఆయనతో కాస్సేపు బాతాఖానీ వేస్తే కొంత సంగతి బోధపడుతుంది. బలే ముస్తాబై వస్తున్నాడే ఈ ఆద్మీ! నల్ల షెర్వాణి వేసికుని! ఆదాబ్ జేనాబ్!

అవతల వ్యక్తి : ఆదాబ్! [అని ఆలింగన పూర్వకంగా అన్యోన్యం ఇటు అటు జబ్బ అదుముకొందురు] మీకు తెలుసు పద్ధతి? మాకంటే బాగా ఆలింగనంగా అన్యోన్యం ఇటు అటు జబ్బలు మోపుకోవడం? అందుకే మాకంటే ముందు వచ్చారు!

పర : 9 గంటలకే ముహూర్తమనుకొని 8-59 కి వచ్చాను.

అవ : మాదీ నవాబ్‌దర్జా! టైమ్ గియమ్ నై! ఈ వేళ ఖాజీ వచ్చేసరికి పదకొండవుతుంది. ఆయనకేదో కేసు వుండి ప్లీడరుగారింటికి వెళ్లి ఆ పని అయ్యాక ఇలా వస్తానని నన్ను చెప్పమన్నారు...ముసద్దీన్‌జీ ఎక్కడ?

పర : అదుగో! వస్తున్నారు! ఈ రెండు గంటలు ఇలా పడి కాపులుపడి కూర్చోవడమేలాగుంది, కాఫీ ఉపమాలు గాని పులావుగాని లేకుండా!

అవ : పులావుకీ మాకీ వుంది పెళ్లి అయ్యాక! కాఫర్లకు నై. [ముసద్దీన్ రాక.] ముసద్దీన్! ఖాజీ ఈ పొద్దు వచ్చేసరికి పదకొండు అవుతుందట!

ముస : అయితే రిజిష్టరు ముందు పంపించివేయలేకపోయి నాడూ? నేడు ప్రొఫెసర్ సాబ్ కూడా దయచేశారు. దశ్ బజేకే వారు కాలేజీకి వెళ్లిపోవడం జరూర్ అని అనుకుంటాను. "క్యా బోల్తా?"

పర : అది మంచి పని.

అవ : అయితే అట్లా కబురు పెట్టించు. పదకొండింటి దాకా కూర్చోవడమంటే కష్టం అందఱికీ!

[ముసద్దీన్ నిష్క్రమించును.]

పర : మఱి సాక్షులు రావద్దూ?

అవ : వారూ వస్తారు. అదిగో ఇదిగో అని పదింటికి. మగ పెళ్లివారు తయారయి రావాలా? అదెల్లా చూచినా "బారా" కావచ్చు.

పర : ఎక్కడున్నారు వారు?

అవ : ఆ వీధిని మేడలో.

పర : ఆ వీధికి ఈ వీధికి బారెడు మేర—"బారా" గంటెందుకు?—ఊరేగుతూ వస్తారా?

అవ : ఊరేగింపూ గీరేగింపూ జాంతా నై. మాదీ నిఖా అన్న దీమాటు ఖరార్ వ్యాపారం ప్రొఫెసర్ సాదీ! జల్దీ జరిగిపోతుంది. అగ్గి బుగ్గి వుండవు.

పర : "జల్దీ" అంటూనే "జరూర్" అంటూనే అప్పుడే నా కాలం ఒక అరగంట వేస్ట్ చేశారు.

అవ : అట్లాంటి అర గంటలు మేము లోగడ జరిగిన పెళ్లిళ్లకు ఎన్ని పోంగొట్టుకొన్నామో లెక్కలేదు. ప్రొఫెసర్ సాబ్!—వస్తూవుంటారు ఈపాటికి మగ పెళ్లివారు. ముసద్దీన్ హడావిడి పడుతున్నాడు.

ముస : [వెంట ఒక చిన్న పిల్లవాడితో] బచ్చా! రేకు కూజామీద బంగారు జరీ పువ్వుల రుమాలు వాసెనగట్టి సిద్ధంగా వుంచుకున్నావా గేటువద్ద?—లేకుంటే పెళ్లి కొడుకు చులాగ్గా లోపలికి ప్రవేశిస్తాడు.

పర : అదేం ఆచారము?

ముస : మాలో పెళ్లికొడుకు అత్తింటి గుమ్మం ఎక్కే ముందు "రుజుం" చెల్లించాల! మీలో లేదూ ఈలాంటి ఆచారము.

పర : మాలో పెళ్లికొడుకు అత్తవారినుండి ఎంతైనా లాగే వాడేగాని పెళ్లికూతురు పెంపువారి కేగి సూపడు.—ఆ వచ్చే అతడేనా పెళ్లికొడుకు?

అవ : కాదండీ! ప్రతీముస్తాబై వచ్చే "ముసల్ మాను" పెళ్లికొడుకు కాదు—"బ్రైడ్ గ్రూమ్" మీలోన్లనే పెద్ద పార్టీతో వస్తాడు మాలో కూడా!

పర : అతి సైలెంటుగా!

అవ : అవును! అతి సైలెంటుగానే వస్తాడు. మాకీ నర మానవ సాక్ష్యం కావాలిగాని సన్నాయీలూ, సాని మేళాలు అక్కఱలేదు. "డవర్" ఏర్పాటు కావాలి.

పర : అదిగో! ఏదో పెద్ద బలగం వస్తూ వుంది. అందులో వుండివుండాలి పెండ్లికుమారుడు! అతడే కావాలి!— ఆ నిడుపాటి ఎఱ్ఱటోపీ! ఎఱ్ఱటోపీ చుట్టూ నాగ పట్టంలా గులాబి దండలు చుట్టారు! బుగ్గలకు తళుకు వేశారు. మెళ్లో గులాబి దండలు పొడూగ్గా వ్రేలాడుతున్నాయి లాడలకంటూ! మొఖమల్ లాంగు కోటూ! ఇరుకు వరాయి! ఎఱుపు రుమాలు! అతనే పెళ్లికొడుకు అయి వుండాలి. కాని కూడా అందఱూ మగవాళ్లే. ఆడ వాళ్లెవళ్లూ లేరు. ఈ మహమ్మదీయులకు ఆడవాళ్లు వుండరా ఏమిటి చెప్మా! తుదకు పెళ్లప్పుడు పెళ్లి కూతురైనా ప్రేక్షకులకు చూపిస్తారో లేదో!

[ఆలోచనలో పడును]

అవ : ఏమిటి ఆలోచిస్తున్నారు? ప్రొఫెసర్ సాబ్! ఆ గులాబి దండలు మస్తుగా వేసికొన్నవాడే పెళ్లి కొడుకు.

పర : అత్తవారి గుమ్మం దగ్గఱ సుంకం చెల్లించక పోతే "ఖడేరావ్" అన్నమాట అల్లుడుపని.

అవ : "దర్వాజాబంద్!"—చూడండి ఈ పైనుండి ఖుషి, ఖాజీ ఆతా హై! సాక్షులు లిఖ్తే హై.

పర ; మఱి ఆలస్యమెందుకు?

అవ : మీ హిందూ "ధోబీ" వచ్చి కోడిని దిగతుడుపు తీసెయ్యాల పెళ్లికొడుక్కి.

పర : ఈలాంటి ఆచారం అరేబియాలో వుండదనుకుంటాను.

అవ: అరేబియా ఇరాక్ తురాన్ విడిచిపెట్టి మేం వచ్చేసి ఏన్నాళ్ళయిందో! అక్కడ కోళ్లే లేవనుకుంటాను నిప్పుకోళ్లే కాని. ఇది మాతోచేసే మీవాళ్ల వేడుక అయి వుంటుంది.

పర: ఇలాంటివే హిందూముస్లిమ్ సభ్యతను పెంపొందించే సర్వసామాన్య సాంప్రదాయాలు.

అవ: సామాన్య సాంప్రదాయాలే కాదు—మా పెద్దల్కూ మీ పెద్దల్కూ బడాబడా మిలా కత్తులుండేవట—జాడ్భాయిని అక్బర్ పాదుషా పెళ్లాడాడన్నా, రోష నారా శివాజీని ప్రేమించినదన్నా—అవి మఱచిపోయే అడాయి పడేము మనకీ మనకీ!—చాకలి దృష్టితీసేశాడు. పట్టుకుపోతున్నాడు చూశారా ప్రొఫెసర్ సాబ్! వాడికది నేడు కైమా కాబోతుంది—ఇదిగో ఇటు దేఖోజీ! మఱి పెళ్లికొడుకు రొఖ్ఖ్యం అదిగో! ఉంచుతున్నాడు రుమాలుమీద!

పర: "వెల్! వెల్"—నించోడానికి తావే కనిపించడం లేదే? ఎంతలో ఎంత పెద్ద సభ అయింది!

ముస: అంతా లోపలి సావట్లోకి దయచేసి వచ్చి కూర్చోండి!—ప్రొఫెసర్ సాబ్! దయచేయండి!

పర: "అయ్యో" రాజుల్లో పెళ్లికొడుకు ఎదర కత్తైనా కనిపిస్తుంది. ఈ పెళ్లికొడుకు ముందుగాని పక్కల్ని గాని ఎవరూలేరు. ఎవరితోను ఇతగాని పెళ్లి?

ఖాజీ: [ప్రార్థన గావిస్తాడు] "బిస్మిల్లా! ఇర్ రహీమాన్ ఇర్ రహీం"

పర: తంతు ప్రారంభించేరు లాగుంది. "క్రాపుల వాలాలు" బుర్రలమీద చే రుమాళ్లను వేసుకొనుచున్నారు!

ఖాజీ: "లల్ హాంద్ ఉవిల్లా ఇరబ్బిత్ అలమిన్
అర్ రహీమాన్ ఇర్ రహీం!
మాలిక్ ఇయాం ఇద్ దిన్
ఇయ్యాకనబుదువ ఇయ్యాకవస్త
ఇన్ ఇహ్దీనవ్ షిరాత్
అవ్ ముస్తాఖిం షిరాత్ అల్లజన అన్
అనమ్త అలైహింగైర్ ఇవ్ మఘ్ఘూట్ ఇ
అలైహాం, నలద్ధా అల్లిన."

అందరు: "అల్లాఉ అక్బర్"

ఖాజీ: రిజస్టర్ ఇదిగో!

అవ: అదివరకే పెళ్లికూతురు సాక్షుల యెదుట సంతకం లోపల జనానాలో చేసి వేస్తుంది. సాక్షులున్న అక్కడ చేసి వేస్తారు. మాలో ప్రొఫెసర్ సాబ్! మఱి ఇక్కడ పెళ్లి కొడుకుచేస్తాడు వినండి!

పర: వినడమేమిటి కనడం గాని.

గాలిలో అన్నట్టు { "జవ్వాజ్ తూకా" / "ఖబిల్ తూ" } వినవస్తుంది.

పర: ఒకర్నొకరు చూచుకోకుండానే?

అవ: ఒకర్నొకరు చూచుకునే మైము వేరు.

పర: "కాలేజీగర్ల్"కి ఈ కట్టుబాటే?

అవ: ఇఖ కాలేజీగరల్ గిలేజీగరల్ సై! దిల్ జహాన్ "హేరమ్"లో "ఔరత్" సేటిసుండీ!

పర: గుమ్మంలో ఏదో కిర్రుకిర్రు ధ్వని అవుతూవుంది.

పకీరులు పాట—"హవ్వా" "యాదం" మోస్తర్
దోస్తీ కలియాల!
"వేతదానో" "హుసేన్" మోస్తర్
వరిధిల్లాల!
"జులేఖా" "యూసూపు" మోస్తర్
బాగుండాల!
"యాస్మెషా" "రసూవ్" మోస్తర్
ప్రేమించాల!

పర: తెనుగునే పాడుతున్నారు!

అవ: ఇప్పుడరబ్బీ పకీరు లెక్కణ్ణుంచిదిగేరు లేకుంటే! ఈ సమయంలో పార్శీ భాషలో మౌలవీలు మునీలు చదివిన ఆశీర్వాచన రత్నాలు విన్నారు గాదు మీరు!

పర : వినకేం అవీ విన్నాను! " షాషిష్ " " బుల్ బుల్ " " ఫూల్ ఫల్ " " కిస్మత్ " " ఆనీ " ఇవన్నీ చెవిలో ఇంకా మారుమోగుతున్నాయి.

(అంతలో కోలాహలం)

పర : ఏమిటీ కోలాహలము ?

అవ : మాలో — పెద్ద పళ్లెంలోపోసి— ఖర్జూరపు కాయలు సీమ బాదం కాయలు, పటిక బెల్లంముక్కలు, రుమాలు కప్పి తెస్తారు సభ మధ్యకు—

పర : అవును అదే కాబోలు అది.

అవ : ఆ రుమాలు ఒత్తిగించేరు చూడండి !

పర : ఆవిష్కరణం గావించేలో అందఱూ కూడి ఎగ రేస్తున్నారే పైకి! నా నెత్తిమీద కూడ పడుతు న్నాయే ! ఉండండి ఉండండి! బుర్రపగిలి పోగలదు. అరే ! పెళ్లికొడుకు తలమీద బుక్కాలా పోసేస్తు న్నారే ! అంతా త్రోక్కుళ్లాట క్రింద తేలిపోయింది! ఛెప్ ! అయినా ఝుల్సా చెప్పలేనంత వీరిలో పెచ్చు పెరిగిపోతూవుందే?— నే అవతలకు తప్పుకుంటే మెఱుగు లాగుంది.

అవ : చూశారా ప్రొఫెసర్ సాబ్ మహమ్మదీయుల పెళ్లి మజా !

పర : బలే తమాషాగావుంది— చొప్పకట్టె దెబ్బలకు ?

అవ : " జోయ్— జోక ! " మీలో వసంతం చల్లుకోరూ.

పర : మేం ఆడవాళ్ల మీద కూడా పోసేస్తాం— కళ్లల్లోకి, కొప్పుల్లోకి.

ముస : ప్రొఫెసర్ సాబ్ ! థాంక్సు ! ఇదిగో ! పాంతుపారీ! మీకు ఖర్జూరపు కాయలు, బాదం కాయలు, పటిక బెల్లం— ఇవిగో— సెలవు !

అవ : సెలవు ! ప్రొఫెసర్ సాబ్ ! జేబు రుమాల్లో కట్టి ఇచ్చేరు— అత్తార్ రాగి.

పర : ఇంకా మీరు పులావ్ గిలావ్ లగాయించి మటీ వస్తారనుకుంటాను—

అవ : ఆ అట్లనే !

పర : సాయంత్రం మీకు ఏమిటి పని ?

అవ : ఏమీ పనిలేదు.

పర : మా యింటికి ' టీ 'కి దయచేయండి.

అవ : అవశ్యం.

(నిష్క్రమింతురు)

## నాలుగవ రంగము

[తమ యింటి వద్ద యశోలత— పరమేశ్వరరావు]

యశో : ఏం చేసికొచ్చారు. పెళ్లి కళ్లి అత్తర్లో మునిగి తేలినట్లున్నారు. గుమ్మగా పిసాళిస్తున్నారు !

పర : " టీ "కి పిల్చివచ్చాను.

యశో : ఎవర్ని ?

పర : ఎవర్నని చెప్పను. ఒక ముసలివృద్ధు మహమ్మదీ యుణ్ణి. దాడీవాలాను.

యశో : అతడేనా పెళ్లికొడుకు ?

పర : పెళ్లికొడుకతడెల్లా అవుతాడు ? పెళ్లికొడుకు నిక్షే పంలా వున్నాడు. తళుకు బెళుకు వేసికొని. కాని మనకు పెళ్లికూతురు, కనిపించలే ! అవిణ్ణిబట్టి అతగాణ్ణి ' టీ 'కి పిలుద్దామంటే !

యశో : ఆమె కనిపించనే లేదు మీకు ? నిన్న సాయంత్రం కాలేజీలో అంత గట్టిగా సభలో బల్లగుద్ది మాట్లాడిన వ్యక్తి ?

పర : అదే చిత్రం ! ఆమె నేటితో " హేరమ్ "లో " భారత్ "గా మారిపోయిందట ! ఈ దాడీవాలా నిర్వచించాడు.

యశో : మీకు టీకి పిల్చిన ముసీలివృద్ధు ?

పర : ఊఁ !

యశో : అయితే ఆ టీపార్టీ ఏదో మీరిద్దఱే చేసికోండి ! పరస్పరం ! నన్ను చంపకండి ! నేనేనా ఏమిటి అంత " హేరమ్ "లో " భారత్తు "ను గానివాన్ని ? అయిన మగానికి కాని మగానికి అల్లాకరస్పర్శ గావించే దాన్నా నేను ?— ఏమో ఆ ఇస్లామ్ తాజా ఇస్తోగుడు

పర : వినకేం అవీ విన్నాను! "పోషిషే" "బుల్ బుల్" "ఫూల్ ఫల్" "కిస్మత్" "అనీ" ఇవన్నీ చెవిలో ఇంకా మారుమోగుతున్నాయి.

(అంతలో కోలాహలం)

పర : ఏమిటీ కోలాహలము ?

అవ : మాలో—పెద్ద పళ్లెంలోపోసీ—ఖర్జూరపు కాయలు సీమ బాదం కాయలు, పటిక బెల్లంముక్కలు, రుమాలు కప్పి తెస్తారు సభ మధ్యకు—

పర : అవును అదేకాబోలు అది.

అవ : ఆ రుమాలు ఒత్తిగించేరు చూడండి!

పర : ఆవిష్కరణం గావించేలో అందఱూ కూడి ఎగ రేస్తున్నారే పైకి! నా నెత్తిమీద కూడ పడుతున్నాయే! ఉండండి ఉండండి! బుర్రపగిలి పోగలదు. అరే! పెళ్లికొడుకు తలమీద బుక్కాలా పోసేస్తున్నారే! అంతా త్రోక్కుళ్లాట క్రింద తేలిపోయింది! ఛెప్! అయినా ఝల్సా చెప్పలేనంత వీరిలో పెచ్చు పెరిగిపోతూవుందే?—నే అవతలకు తప్పుకుంటే మెఱుగు లాగుంది.

అవ : చూశారా ప్రొఫెసర్ సాబ్ మహమ్మదీయుల పెళ్లి మజా!

పర : బలే తమాషాగావుంది—చొప్పకట్ట దెబ్బలకు?

అవ : "జోయ్—జోక్!" మీలో వసంతం చల్లుకోరూ.

పర : మేం ఆడవాళ్ల మీద కూడా పోసేస్తాం—కళ్లల్లోకి, కొప్పుల్లోకి.

ముస : ప్రొఫెసర్ సాబ్! థాంక్సు! ఇదిగో! పాంకుపారీ! మీకు ఖర్జూరపు కాయలు, బాదం కాయలు, పటిక బెల్లం—ఇవిగో—సెలవు!

అవ : సెలవు! ప్రొఫెసర్ సాబ్! జేబు రుమాల్లో కట్టి ఇచ్చేరు—అత్తార్ రాగి.

పర : ఇంకా మీరు పులావ్ గిలావ్ లగాయించి మఱీ వస్తారనుకుంటాను—

అవ : ఆ అట్లనే!

పర : సాయంత్రం మీకు ఏమిటి పని ?

అవ : ఏమీ పనిలేదు.

పర : మా యింటికి 'టీ'కి దయచేయండి.

అవ : అవశ్యం.

(నిష్క్రమించుదురు)

## నాలుగవ రంగము

[తమ యింటి వద్ద యశోలత—పరమేశ్వర్రావు]

యశో : ఏం చేసికొచ్చారు. పెళ్లికెళ్లి అత్తర్లో మునిగి తేలినట్లున్నారు. గుమ్మగా పిసాళిస్తున్నారు!

పర : "టీ"కి పిల్చివచ్చాను.

యశో : ఎవర్ని ?

పర : ఎవర్నని చెప్పను. ఒక ముసలివృద్ధ మహమ్మదీయుణ్ణి. దాడీవాలాను.

యశో : అతడేనా పెళ్లికొడుకు ?

పర : పెళ్లికొడుకతడెల్లా అవుతాడు? పెళ్లికొడుకు నిక్షేపంలా వున్నాడు. తళుకు బెళుకు వేసికొని. కాని మనకు పెళ్లికూతురు, కనిపించలే! అవిణ్ణిబట్టి అతగాణ్ణి 'టీ'కి పిలుద్దామంటే!

యశో : ఆమె కనిపించనే లేదు మీకు? నిన్న సాయంత్రం కాలేజీలో అంత గట్టిగా సభలో బల్లగుద్ది మాట్లాడిన వ్యక్తి?

పర : అదే చిత్రం! ఆమె నేటితో "హేరమ్"లో "ఔరత్"గా మారిపోయిందట! ఈ దాడీవాలా నిర్వచించాడు.

యశో : మీకు టీకి పిల్చిన ముసలివృద్ధు ?

పర : ఊం!

యశో : అయితే ఆ టీపార్టీ ఏదో మీరిద్దఱే చేసికోండి! పరస్పరం! నన్ను చంపకండి! నేనేనా ఏమిటి అంత "హేరమ్"లో "ఔరత్తు"ను గానివాన్ని? అయిన మగానికి కాని మగానికి అల్లాకరస్పర్శ గావించేదాన్నా నేను?—ఏమో ఆ ఇస్లామ్ తాజా ఇస్తోగుకు

కొంపకొట్టుకు పోతానని అనుకున్నాను. వెంకాయ పిచ్చి పులుసు పోసి పూసుకున్నారు!

పర: అలా కాదు. ఆ పాకీవాలా రిటైర్డు హైకోర్టు జడ్జియే! మా తాతయ్యకు నాన్న తాతయ్య యునానీ వైద్యం కూడా చేసేవాడట! మా నాయనమ్మ చెబుతూవుండేది. నీవు కూడా ఎప్పుడో చేయుండాలి. గుడ్డి సాంప్రదాయాలు ఇలా అడ్డంకులై విడదీస్తున్నాయి గాని నిజానికి మనమూ మహమ్మదీయులమూ అన్యోన్యం వివాహం చేసికొని వుండేవాళ్ళం ప్రతిరోజూను.

యశో: నాకు చెప్పండి! వెయ్యి చెప్పండి! నేనీ రోజున ఆ పాకీవాలాకు టీ పొయ్యను.

పర: మనం లోకం అంతట్లో చాలా "బ్యాక్ వర్డు" అయిపోతాం!

యశో: అయిపోం! వాళ్లకు అట్టూ మనకు పిట్టూ పనికి రాదని చెప్పేసెయ్యండి.

పర: బాగా ఆలోచించుకో! ఇది "సోషల్ స్టాండర్డు" సుమా! "వాట్ ఎ ఫూల్!" అంటారు అంతా!

[తెర పడును]

## [అయిదవ రంగము]

[సమయం సాయంకాలం—పరమేశ్వర్రావు చావడిలో]

అవతలవ్యక్తి పరమేశ్వర్రావు.

అవ: యశోలత ఏదీ? మిక్కిలి విలాసవతి! ఆమె టీ పోస్తూంటే అద్భుతంగా తాగేవాణ్ణి! ఇంట్లో లేదూ?

పర: ఆమె "ఇన్ డిస్పోజుడు"—కాదు—"హేరమ్" లో "ఔరత్" అయింది.

అవ: నా మాట నాకు చెప్పజెప్పడానికా ఈ పొద్దు నన్ను టీకి పిల్చింది? ప్రొఫెసర్! మీకు సందేహం—పెళ్లికూతుర్ని మేం ఎందుకు పదిమందిలోకి తీసుకు రాలేదని కాదూ! తీసికొనివస్తే మీ ఆడపిల్లలు ఏమి చేస్తున్నారు? తలలొంచుకు కూర్చుంటున్నారు. ఇప్పటి వఱకు ఎన్నో మీ హిందువుల్లో పెళ్లిళ్లు చూచాను గాని—ఒక్క పెళ్లిలోను పెళ్లికూతుర్ని "ఐడెంటిఫై" చేసింది లేదు.

పర: ట్రూ! ట్రూ! అవీ చెడ్డ అలవాటే!—వింటున్నావా? యశోలతా! ఏమంటున్నారో జానాబ్! అదిగో వస్తూవుంది.

యశో: [ప్రవేశిస్తూ] వింటూనే వున్నాను. అయితే స్త్రీకి సిగ్గు అన్నది సహజం కాబట్టి ఆ కారణంగా మాలో పెళ్లికూతుళ్లు తలలొంచుకుంటారు!

అవ: సలాము! యూరోపియను స్త్రీలు నిటార్గా నీవా నేనా అన్నట్టు నిలబడి వుంటారు. వాళ్లమాట?

యశో: సలామ్! వాళ్లసిగ్గు అందర్నీ మించిన సిగ్గు! హృదయంలోనే పొందుతారు! అదే అలవరచుకోవాలి మన మంతాను—టీ తీసికున్నారా! జానాబ్.

అవ: లేదు "టు ది హెల్త్ ఆఫ్ యు బోత్." 'థాంక్స్'

యశో: సంధ్యారాగం ఎంత చక్కగా వుందో చూడండి. మా చావడిలోకే ప్రసరిస్తుంది. మీరు నమాజు చేసికుంటే ఇక్కణ్ణే చేసుకుని మఱీ వెళ్లవచ్చు.

అవ: మీ ఆయన సంధ్యావందనం.

పర: రెండూ కలిపే చేయవచ్చు. నీళ్లుతీసుకురా!

యశో: నీళ్లెందుకు స్పిరిట్ కావాలి!

అవ: నిజమే. అది తెలియకే ఈ తికమకలన్నీ!—

[ప్రార్థన]

"సుబ్హానక అల్లా హుమ్మవబి
అమ్ షైతాన్ ఇత్—రజీమ్."

పరమేశ్వరరావు—యశోలత: "ఋతం బృహత్"

ముగ్గురూ కలిసి: అల్లా హో అక్బర్; ఓం తత్సత్!

[తెర పడును]



# ముద్దుపళని

శ్రీ క్రొవ్విడి లక్ష్మన్న, ఎమ్.ఏ., బి.ఎల్.

మధుర మంజుల గీతికాలాప మోహన పారవశ్యం, సరసత్వం చెలులకే చెల్లిందన్నారు, మిత్రులు శ్రీ వెంపటి నాగభూషణంగారు, వెనకటికి ఓ సారి. అలనాటి వైదిక వాఙ్మయం మొదలు, నేటి లౌకిక కావ్య వాహినీధునుల వరకూ, స్త్రీలు వాణీమ తల్లిని మనోహరంగా సేవించుకుంటూనే ఉన్నారు; మనోజ్ఞమైనభూషలు తొడుగుతునే వచ్చేరు. ఆ కోవకి చెందినదే ముద్దుపళని. "రాధికా సాంత్వనం" వ్రాసిన కవయిత్రి. కళామయజీవి—రసపిపాసువు. "ప్రతాపహేళి భోసలతాళరాజరాణ్మణి సుత ప్రతాప సింహేంద్రమౌళికి వలపునేస్తం."

ముద్దుపళని అనే యీ పేరు వింతగా తోచి, యీమె తెలుగుది కాదేమోనని బ్రౌనుపండితుడు అభిప్రాయ పడ్డాడు. కాని గ్రంథంలోని వివరాలని గమనిస్తే—కారణాంతరాల చేత దక్షిణానికి తరలివెళ్లిన కుటుంబంలోనిదైనా—పళని అచ్చంగా తెలుగుగడ్డ ముద్దుబిడ్డ అయినట్టు స్పష్టపడక మానదు. ఈమె వంశావళి: ముత్యాలూ, తంజనాయకీ అని అన్నా చెల్లెలూను. శూద్రకుటుంబానికి చెందినా వైష్ణవ భక్తి తత్పరుడు ముత్యాలు. అవ్వయ్యా, చెంగాతి వీళ్ల తల్లిదండ్రులు. ఈ ముత్యాలుకి నలుగురు కొడుకులూ, ముగ్గురు కూతుళ్ళూను. పెద్ద పిల్ల పళని. ఏ కారణంచేతనో ముత్యాలు దక్షిణా పథానికి వలస పోయేడు. ముద్దు (ముత్తు) అని తమిళులు ముచ్చటగా పిల్లలకి ఉంచే నామ పూర్వ పదం. (మా: ముత్తుస్వామి. ముత్తులక్ష్మి) పళని దక్షిణ దేశంలో వేలాయుధస్వామి క్షేత్రం విశాఖజిల్లాలో సింహాచలం (క్షేత్రనామం) లాగే యీ పళని (క్షేత్రనామం) కూడా ముద్దు అనే పూర్వపదంతో కలిసి—ముద్దుపళని అనే పేరయి నిలిచింది. (తతిమ్మా పిల్లలకి ముత్యాలు లక్ష్మి, పద్మావతి అని ఏ సంకరంలేని పేర్లే పెట్టేడు.)

"పున్నమ చందమామ కెనబోలు ముఖంబును,
ముఖాను రూపమౌ
తిన్ననిపల్కు; పల్కులను దేనిన సద్దయ;
సద్దయూరసో
త్పన్నపు జాడ్యు; మాప్పన ధృతంబగు సిరియు
సొమ్ములౌను, మే
నన్నలు నొందు నరనాథులు" మెచ్చేటటువంటి

ఉత్తమ గుణాలు...కొన్ని పెట్టని సొమ్ములుగా యీమెకి అలవడినట్టు తెలుస్తుంది. కాగా,

"తెలిచుక్కలలోన వెలుగునెల రేకయినన్
అలిత కళా విభవంబులు వలనొప్పగ"

నేర్చిన జాణ.

"ఘటియింప నేర్తువుక వనజాతు లెరింగి
పలుకుల కల్కి వెల్పెలలు బార.

*　　*　　*

నటియింప నేర్తువు నవరసంబులనంటి
తగురంభ యనిమిషత్వము వహింప"

అని మెప్పులుగైకొన్న పటిమా సమన్విత, భారత నాట్యప్రవీణ. ఆ యీగుణగణ ప్రతిభాప్రభావంగా, అపూర్వమయిన ప్రతాపసింహ మహారాజు ప్రాపు సంపాదించి, అనన్య సామాన్యమయిన వైభోగాలతో జీవితం సాంతమూ నిత్యకల్యాణం పచ్చతోరణంగా వెళ్లబుచ్చింది.

ప్రీణన కావ్యపరంపర సంస్కృతంలో నిస్తులంగా కనిపిస్తుంది. సాంత్వనోపాయాలకీ అనునయాలకీ తెలుగు వాఙ్మయంలోనూ కొదువలేదు. పదాఘాత బహూకృతులతోపాటు యీ ప్రక్రియ జరిగించి, లోకోత్తమంగా నడిపించేడు తిమ్మనామాత్యుడు. "సత్యభామా సాంత్వనం" అంటూ యింకా ప్రబంధమే వెలిసింది. ఈ త్రోవని పళని తొక్కిన మార్గం :—ఈమె కథావస్తువ కడుమన్నితంగా ఏరుకుంది. తన జీవితంలోని మధుర ఘట్టాలజాయ అని ఇంకా నాలుగు మెట్లు పైకి ప్రస్తరించి, రాధా—

ఇలా కృష్ణుని రసికతే చిత్రణలో అప్రతిమ ప్రతిభ నిరూపించింది. స్వీయ జీవితం ఒక శృంగార రసామృత భాండమైనా, ఎటువంటి కలంక ప్రౌఢిమను తెలియింప జేసుకున్న కవిని మెప్పించేటట్టులో రాధాదేవి కృత్యం చేసింది. మధ్యమ వసం అంటూ, అలంకారికుల వైనాకృతులలో అగ్రశ్రేణిని అలంకరించిన శృంగారం, ఉద్రేకం కల్పుగొట్టి మంగళ ప్రదంగా పరిణమించే శృంగారం, కావ్యంలో అనుగుణం గుణా తోడికలాండిని. శృంగార కథా కథన సంవిధానంలో, రసావిష్కరణలో ఎవరికి తనే సాటిగా వ్రాసింది ముద్దుపళని.

ఇంక రాధికా సాంత్వనం కథ : నందుడు, యశోద, రాధ, కృష్ణుడు — యీ నలుగురి సంబంధ బాంధవ్యం అందరూ ఎరిగి వున్నదే. యశోదకి కుంభకుడు అని ఒక సోదరుడు. అతని కుమార్తె ఇళ. ఇళకి కృష్ణుడికీ వివాహం. చనువు ఎక్కువగా ఉండడంచేత రాధవద్ద పెరిగింది, ఇళ. ఆమె చెప్పుచేతల్లో మెలిగి, ఆ వొరపొళ్లని అనుసరించుకుంటూ, నడితేరింది...

"మగనికి పెళ్లి అవుతుందనే కాని, తనకి సవితి వస్తుందన్నమాట ఎరగక పోయింద"న్న సామెత రాధపట్ల పూర్తిగా అన్వయించింది. తాను నిత్యమూ చూసి మురిసి పోతూఉండే కృష్ణుని చిన్న భార్య అంటూ, మేన కోడలికి మెలకువలు నేర్పడంలో తనని తనే మరచి పోయింది రాధ. ఇళా నిషేక ముహూర్తం వరకూ అమెకి యీ విషయమే స్ఫురించలేదు. అంతలో ఆ రాత్రి, తన ఏకైక లక్ష్యం, తన జీవిత పరమావధి, తాను వెయ్యి కళ్లతో కాపాడుకుని మురిసి పోతూన్న పెన్నిధి—హఠాత్తుగా మరొకర్తితో ఏకాంత సుఖం అనుభవిస్తున్నాడనే సరికి—రాధ గుండెల్లో చెయ్యిపెట్టి కెలికినట్టు అయింది!

తరవాత కృష్ణుడు యిళతోకూడా శ్వశృగృహానికి వేంచేస్తాడు. నిత్యమూ తన దృక్పథంలో నృత్యంచేసే హృదయాధిపతి కంటికి కరువై పోవడంతోటే, రాధకి మత్సరం పొడసూపింది. విరహతాపం యెక్కువై పోయింది. ఆ పైన శుకరాయబారం. ఆ చిలక అక్కడి ఇళా—కృష్ణుల శృంగారములు వివరంగా వర్ణించడం—దాంతో రాధ మూర్ఛ పోవడంన్నూ!

ఆ లోగా రాధని విడిచి ఉండడం కృష్ణుడికీ కష్టం అనిపించి తిరిగి వస్తాడు. రాధ తోకతొక్కిన పాములాగ మండి పడుతుంది. పిమ్మట కృష్ణుడు క్షమాభిక్ష వేడుకోవడం—పదాఘాతాత దండనం. చివరకి, ఎంత అణుచుకొని సాధిద్దాం అని ప్రయత్నించినా ఆగకుండా పెల్లుబికి వచ్చే దుఃఖం పట్టలేక, పాపం, రాధ వలవల యేడుస్తుంది. ఆ ఘట్టం అలాగ నడుస్తూ ఉండగానే కృష్ణుడి ఊరడింపు మాటలతో కొంత పూర్వ స్థితికి వచ్చి—నవమోహనా కారుడి సాన్నిధ్యంవల్లనూ, స్పర్శసుఖం చేతనూ—గతం అంతా విస్మరించి గాఢాశ్లేషంలో అణిగి పరవశ అయిపోతుంది, రాధ. ఇదీ కథ.

ఈ శృంగార ప్రబంధం 585 గద్య పద్యాలతో కూడిన నాలుగాశ్వాసాల గ్రంథం. మొదటి ఆశ్వాసంలో ఇళావకావనం, యిళతో కృష్ణుడి కూటమి, రాధ యీర్ష్య, ప్రాతఃకాల వర్ణనా జరిగేయి. ద్వితీయాశ్వాసంలో రతి, జ్యోత్స్న, నృత్యాది వర్ణనలు, తృతీయ చతుర్థాలలో రాధాకృష్ణుల ప్రణయంలో కలహం తటస్థించడం, తచ్ఛాంతిన్నీ.

స్త్రీ హృదయం, మనోభావాలూ అర్థం అయినంతగా పురుష హృదయాంతర్గత వివరాలూ, మనస్తత్త్వ విచారణా పళనికి తేట పడలేదు. రాధా కృష్ణుల పాత్రలలో యీ తారతమ్యం కనిపిస్తుంది. రాధని క్షమా భిక్ష వేడుకోవచ్చిన కృష్ణునిలో ఉండ వలసినంత ఔత్తరం కనిపించదు. కాగా,

"సకియ నీ కీల్జడ సరివచ్చెనని కదా మించి
కాళీయుని మర్దించుటెల్ల
నింతి నీ బొమ్మల కెనవచ్చెనని కదా విడక
కంసుని విల్లు విరుచుటెల్ల."

* * *

"అట్టినను న్యాయము యిట్టిరట్టుసేయు, అరయు మది లోన" అని ఆయుగంలో శరపరంపరంగా వస్తూన్న ప్రబంధ రీతినే మొగ్గ పెట్టుకుంటాడు. ఆ ముఖతః చెప్పించిన

భావాల్లో ప్రత్యేకించి ఉపజ్ఞ కనపడదు. ఇంక రాధ పాత్ర తైరిపారుగా చూడండి. ఇలా కృష్ణులు అలా శయనా గారానికి వెళ్ళగానే, చెంపఛెళ్లున చరిచినట్లయి, రాధ యెంతెలాగ చింతిస్తుందీ!—

“ సొమ్ము నియ్యవచ్చు సొమ్మంద మియవచ్చు
నియ్యమని ప్రాణ మియ్యవచ్చు
తనదు విభుని వేరు తరుణి చేతికి నిచ్చి
తాళ వశమె యెట్టి దానికైన ”

చివరకి యింకా పట్టలేక—

“ అకట మగలకు తమ యక్కలైనజాలు
సబలలాగించి లాలించరనుచు నిళదు
వగచుగతి ” అన్యోపదేశంగా లోనికంత తెలియ జేసుకొంటుంది కృష్ణుడికి.

ఈ ప్రబంధం అంతటిలోకీ పోషణ నిర్దుష్టంగానూ, సకలాంగంగానూ జరిగింది ఒక్క రాధ పాత్రే. అత్త వారింటికి కృష్ణుడినీ యిళనీ తీసుకు వెళ్లడానికి కుంభకుడు వచ్చిన ఘట్టం చూడండి మచ్చుకి. రాధకి పాపం, యిదో వ్యాస ఘట్టం. కృష్ణుని విడిచి ఉండడం దుర్భరం. అలాగని అత్తవారింటికి తీసుకు వెళతాం అంటే తనుమాత్రం యెలాగ కాదంటుందీ? అంచేత మనోగత స్నిగ్ధభావాలని మరుగు పరుచుకుంటూనే, పైకి బెసగకుండా, సంతోషం నటిస్తూ సరేనంది. ఇంక అక్కణ్ణుంచీ ఆమె ఆవేదన—

“ ఎడలేక మురవైరి నెనరయు ముచ్చట లెంచి
పగిలి గుండియ వకావకలు గాక
హరిభోగ్య వస్తువులందంద సోకిన నెమ్మేను
ఝుమ్మని సొమ్మసిల్ల

* * *

విరిగితల మిన్ను పడినట్లు విన్నవోవు
భావజునిధాటి కలికి రాధా వధూటి ”

స్త్రీ స్వాభావిక మయిన భావాలు కుప్పతిప్పలుగా రాధ పాత్ర పోషణలో కనిపిస్తాయి. కొంతకాలం ఎడబాటు అయిన మనోహరుడు కంటపడగానే రాధ యెన్ని నిష్ఠుర వాక్యాలు పలికించారో, పరకట్టిన సామ్యాలాగ ఎంత భద్ర మంటూ చేయించారో చూడండి—

“ నిలుకడేసుక్క తాల్ప కహానేక్క
ము కష్టార మాట పద్దు, తే
పలవు హృల్లోక్క లయాగలుసి
తొవ్రుల మై పయి మేల్కి నీదు నీ
కులం పొదిపొచ్చు లాదరణ మూరు
దయల్సల నమ్మవచ్చునే
యింకుగవారి దస్త్రహాదు లెన్నక
శక్య మొయింపులన్ హరీ ? ”

“ అల్లందు కందుకొని నీ
పెల్లింపుల జడిన మొదలు పెనుబాములకే
యిల్లయితి నరసి చూడగ
గొల్లనితో పొందు చెలికి గొదవే కొదువల్ ? ”

“ మున్ను నిను జతగూడి కంటనే నిన్నువీడి
ప్రాణములు చేర విన్నాళ్లు పట్టె, నార!
మరల నినుబొంది, పోయిన మరులు చెంది
జాలి బడజాల నందగోపాల బాల. ”

యింత యిలాగ అల్లరిచేసి యేడిపించుకు తిన్నా, వెల్లి విరిసిన ఆపేక్ష, అనురాగం, ప్రేమా అంతర్గతంగా ద్యోతకం అవుతూనే ఉంటాయి.

ఇంక ఈ సందర్భంలోనే పళని వ్రాసిన “ సప్తపదు ”లని గురించీ రెండు మాటలు చెప్పాలి. గోపాల కృష్ణుడు గోప కన్నెల మాన ధనం స్వాయత్తం చేసుకుంటున్నాడన్న కారణంచేత వాడ వాడంతా పెద్ద కట్టడి చేసింది, యింకెవ్వరూ యెన్నడూ కృష్ణుడివద్దకు పోకూడదు, మాట్లాడ కూడదు అని. ఈ కోడంత్రికం గోపాంగనలకి చాలా కష్టంగా ఉండేది. అసలు ఈలాంటి కట్టడి చిన్న కృష్ణుడికే మహా అపచారం. అంచేత దేశంలో వర్షాలులేక క్షామం ప్రబలిపోయింది. దానికి ప్రతిక్రియ: గోపకన్నెలంతా వర్షాలు పడడం కోసం వ్రతంచేసి, వరుణదేవుణ్ణి ప్రసన్నుణ్ణి చేసుకోవాలి. ఇదంతాసాగడం యెలాగ? ప్రక్రియ ఏ తీరుగా నడిపించాలి?...ఏమీ దారీతెన్నూ తెలియక,

ఘటనా ఘటన సమర్థుడు కృష్ణుడినె అడిగేసు, యీ గోపిక ఎంతా ఓ సాయంకాలం వెళ్లి. మర్నాడు వేకువనే వండి చెబుతాను అన్నాడు కృష్ణుడు. ఎవరి యింటికి వారు పోయారన్నమాటేగాని, వల్లవకాంతలు ఒక రాత్రికయినా నిద్ర పడితేనా? కృష్ణుడిమీద మమత కంటిమీద రెప్ప వాల నియ్యలేదు. ఇంకా హృదయ వృత్తి పట్టలేక బాగా చీకటి ఉండగానే లేచి ఒకరినొకరు పిలుచుకుంటూ, కోడిగాలాడు కొంటూ వెళ్లి—అప్పటికి యింకా నీలాదేవి పరిష్వంగ సుఖంలోనే వున్న—రసిక మనోజ్ఞమూర్తికి మేలుకొలుపులు పాడుతారు. ఈ రీతిగా నడిచిన కథా వృత్తమే పళని "సప్తపది"లకి ఆధారం. అయితే, యీమె స్వయంగా ఊహించి వ్రాసింది మాత్రం కాదు.

ఈ కథా సంవిధానం, చూడి కొడుత్తాళ్ (అండాళ్ దేవి) "తిరుప్పావై" అనే మారుపేరుతో, 30 పాశు రాలుగా వ్రాసింది. పాశురం అంటే గేయ రూపంలో చెప్పిన కథ. ఇవన్నీ తమిళంలో చెప్పింది ఆండాళ్ దేవి. దక్షిణాదిని వైష్ణవ స్త్రీలు ధనుర్మాసంలో యీ "పాశురాలు" రోజు కొక్కటి చొప్పున యిప్పటికీ పాడుకుంటారు. (ఈ కథని ఆధారంగానే గోదాదేవీ పాశురాలూ, విష్ణుచిత్తీయం వెలిసింది. ఈ సందర్భంలో శ్రీ మద్దురువర్యులు మేడేపల్లి వెంకట రమణాచార్యులవారి వ్యాఖ్య చూడవలసిందని నా మనవి.)

ప్రస్తుతంలోకి వద్దాం. ముద్దుపళని యీ పాశురాలని అతి మనోజ్ఞంగా "సప్తపది"లంటూ తెలుగు చేసింది. ఉక్తిచమత్కృతీ, పదములకూర్పు తీర్పులూ, తేట తెలుగు తియ్యందనాలూ వెల్లివిరిసేయి యీవిడ తెలుగు సేతలో. మచ్చుకి ఒక్కటి ఉదహరిస్తాను.

> "శ్రీనివాసగురుని తలచి చిత్తమునను ముద్దుపళని
> పూనిచేయు ద్రవిడ పాటలోని భావమూ—
> వెలిగి తెలియ వాణి తనదు జిహ్వా కొనను నిలిచి
> యటుల
> పలికె దిరుప్పావు సప్తపది పదంబుగా—
> మాసములకునెల్ల మంచి మార్గశిరము పర్వ మహహా
> ఆస గలిగినట్టి చెలులు డాసి రారే
> మంచి వగల మించి కులము నెంచి యవతరించినట్టి
> చంచలాక్షులెల్ల గూడ జనగ రారే...వగైరా.

ఈ ప్రబంధం "ఇళాదేవీయం" అంటూ వెంకట కృష్ణప్పరాసి, పళని పేరు ఉంచేడని కొందరు అంటారు గాని, అతని శైలికీ పళని శైలికీ చాలా భేదం ఉండడం వల్లనూ, స్త్రీ సహజమయిన భావాలూ, కోమలాంగి మృదుల హస్తం, స్పష్టంగా కనిపిస్తూ ఉండడం చేతనూ, యిది వెంకటకృష్ణప్ప విరచితం అనడానికి అవకాశం చాలదు. రాధికా సాంత్వనం రచించే సందర్భంలో వీర రాఘవ దేశికుడు తోడు పడ్డాడని యింకో ప్రతీతి. కాని, అతని పాండిత్యప్రకర్ష వేరు. త్రిపురాంతకుడి సంస్కృత ప్రేమాభి రామం, వల్లభరాయని గ్రంథానికిలాగే దీనికీ ఏవో మాతృకలు ఉండి ఉండవచ్చును.

ఈ గ్రంథంలో శ్రీనాథుడు, పెద్దన మొదలయిన ఆది ప్రబంధ కర్తల పోకడలు నిస్తులంగా కనిపిస్తాయి—ఉదా:

1. "కల్పింప నేర్తురు గంగ మట్టియ మీద కస్తూరికా పుండ్రకములు నొసల" (శ్రీనాథ)

"ఘటియింప నేర్తువు కవన జాతు లెతెంగి పలుకుల కల్కి వెల్వెలలు బార" (పళని)

2. వానిది భాగ్య వైభవము వానిది... (పెద్దన్న)

"ఎంత విలాసమెంత సొగసెంత వదాన్యత...(పళని)

ఇంకా యీ గ్రంథంలో అతి మిక్కుటంగా కనిపించేవి వ్యవహారంలోనున్న స్వభావోక్తులూ, లోకోక్తులున్నూ.

1. తనదు మట్టెంత తానెంత తానెయంత చేయ
జూచిన నేనెంత చేయరాదు
వేలు వాచిన రోలంత విరివియైన రోలు వాచిన
అది యెంత మేలు గనునో"

2. కుట్టదేలు కుట్టుకున్న కుమ్మర పురుగు.

3. త్రోసి రాజటంచు.

4. అరకాల బెట్టి రాచకున్నను నా పేరు రాధ గాదు.

5. అల్పునకు కల్మి వచ్చిన అర్ధరాత్రి గొడుగు తెమ్మన కథగాను.

ఈ. బ్రద్దికన్న దా మాయకు విచ్చినన్ మరచి మూసిన
నేమి తలచి చూడగన్. ఇత్యాది.

ఇంత రసవంతంగా ఉన్న గ్రంథంలో నెరసులు కూడా ఉన్నాయి; అక్కడక్కడ వర్ణన అతిపేలవ మయినట్టు తోస్తుంది. అంగాంగ వర్ణనావ్యామోహం...ఎక్కువగా తోస్తుంది కొన్ని చోట్ల. ఇంక వ్యాకరణ రీత్యా, "తుడి చేటిలతాంగొవర్తు, బహునాళ్లు, పడకిల్లు" వంటి స్ఖాలిత్యాలు అనేకం!

పళని ప్రతాపసింహుని ఉంపుడుకత్తె అని ఆవిని మనవి చేసేను. రాజు కాలాన్ని బట్టి యీమె 1740-1765 ప్రాంతాలని ఉండి ఉండాలి. నాటికి తెలుగు సాహిత్యంలో క్షీణదశ. ప్రబంధాలు ఒకదాని వెంబడి ఒకటి అదే మూసలో కరిగి, అదే వర్ణనలూ, అదే ఉపజ్ఞా (భావ) రాహిత్యం, అదే శబ్దాలంకార ఆడంబరంతో వెలువడిన రోజులు. కాబట్టే, పళని రచనలోకూడా శబ్దాలంకారాలు మెండు; భావోన్నతి తక్కువ. అయితే, పాండిత్యం చక్కగా అలవడుతుంది గనక భాషలో స్వతంత్ర ముద్ర వేయ్యగలిగింది పాఠక లోకాన్ని. భావప్రబంధస్తులలో కూడా పొరపాట్లు కనిపిస్తే—పారిజాతాపహరణంలాగ— యివి యింకా వికృతికెక్కి ఉండేవి.

రతిప్రధాన శృంగార కావ్యం అనడం వేళ్లా, అంగాంగ వ్యామోహం మిక్కుటంగా కనిపించడం చేతనూ, యిది అవనీతి బోధిస్తుందనీ, సంసారులు చదువ తగినది కాదనీ వీరేశలింగం పంతులుగారు అభిప్రాయ పడ్డారు. నాటికీ నేటికీ దృక్పథంలో ఎంతైనా మార్పు వచ్చింది. శృంగారమే గర్హ్యం అనే ఛాందసులతో పోరు చేసుకోవలసిన అగత్యమూ లేదు. ఉన్న దోషవల్ల నేపోతూ, భాషా పటిమచేత, శృంగార ప్రాధాన్యముకల్లనూ నిలిచివుంది "రాధికాసాంత్వనం."





# ఉజ్వల రాజపుత్ర సంప్రదాయం

తరతరాలనుండీ రాజపుత్రస్త్రీలు తమ విలక్షణ సద్గుణాలకు ప్రసిద్ధి గాంచారు. చరిత్రాత్మక మైన ఆకాలంలోవారు ధరించి నది వస్త్రాలు వారిసద్గుణాలకు వన్నెబెట్టేవి. నేడు ఆ వన్నె దనం మళ్లీ చూడగలం.



చూడగలం

సౌందర్యోపయోగమైన

**ఖటావ్ వాయిల్**

ది ఖటావ్ మిల్స్, బైకుల్లా, బొంబాయి. ఆఫీసు : లక్ష్మి బిల్డింగ్, బలార్డ్ పియర్, బొంబాయి బట్టల షాపు : మూల్జీ జేఠామార్కెట్, గోవింద్‌చౌక్, బొంబాయి—2.

KMS(S)35-A

# పరివర్తన

* శ్రీ కాశీభొట్ల సూర్యనారాయణశాస్త్రి *

వివాహం పూర్తయింది.

అప్పగింతలు ఆఖరయ్యాయి.

వధువుకి ఒడిగంటి మూటగట్టి పాలకిలో వరుని ప్రక్కన కూర్చోబెట్టారు పొరుగు ముత్తైదువలు. పెళ్లి కుమార్తె జనని జానికమ్మ జలజలరాలే కన్నీటి బొట్లను చెంగుతో తుడుచుకుంటూ 'జాగ్రత్తగా వెళ్లిరా తల్లీ' అంటూ వీడ్కోలిచ్చింది. చెదిరే హృదయంతో, శిరస్సు వంచుకుని, కారే కన్నీళ్లను తుడుచుకుంటోంది శంతన. పాలకి బయలు దేరింది. ఇరవై గజాలు ముందుకు నడచిన తర్వాత, శంతనకేదో స్ఫురణకొచ్చినట్లయింది. 'ఆగండి—ఆగండి!!' అంటూ యెలుగెత్తి అరచింది శంతన.

బోయీలు బోట్లు పెట్టుకుని తెల్లబోయి చూస్తున్నారు సమాధానం కోసం.

'దింపండి ఒక్క నిమిషం?' అంది శంతన.

వరుడు వరహాలు మాట్లాడటం లేదు సిగ్గుతో.

'ఏం! తల్లీ!' అని అడిగారు బోయీలు.

'ముందు పాలకి దించండి. ఒక విలువైన వస్తువ విడిగా బయట వుంచేసి వచ్చేశాను. మావాళ్లకు వప్పచెప్పాలి. ఒకే నిమిషం.'

'పల్లకీని వెనక్కి తిప్పుతామమ్మా!' అన్నారు బోయీలు.

'బయలుదేరిన పాలకి వెనుదిరగటం వుచితమైన పని కాదు. నేనొక్కర్తినే వెడతాను.'

బోయీలు పాలకి దించారు. వరహాలు తెల్లబోయి చూస్తున్నాడు శంతన వదనంలోకి. హడావిడిగా శంతన పాలకిడిగ్గి అడుగులు వడివడిగా వేసుకుంటూ యింటికి వెళ్లి పోయింది. వీధిలో కూచుని విస్తు పోతున్నారు ఆడంగులు.

'పుష్పం! పుష్పం! మాట!' తన చెల్లెల్ని పిలిచింది శంతన.

పది వత్సరాల పిల్ల పుష్పం. శంతన చెంతకు పరుగెత్తుకొచ్చింది.

'ఏం! అమ్మా. మళ్లీ యెట్లా వచ్చావు? ఎందుకొచ్చావు?' అడిగింది తల్లి.

'ఎందుకా! నా ఆత్మారాధకుడైన అనురాగమూర్తి కోసం, నా ఆరాధ్యదైవాన్ని తీసుకుని పోయి నా అపరాధాలు అర్పించటానికి, నా శ్యామ సుందరుని, నా ప్రణయ పిపాసిని, నా ప్రేమోపాసకుని ప్రతిబింబించు కుంటానికి—అమ్మా పల్లకీ నిలిపి...యిట్లా వచ్చాను.' అంది ఆవేశంతో.

'ఇంకా నీకా పిచ్చిపోలేదే తల్లీ' అంటోంది శంతన తల్లి.

'నాకీ పిచ్చి యీ వెచ్చటి సంసారం వరకే కాదు—చివరికి నన్ను—చిచ్చులో పెట్టినా సరేపోదు. అమ్మా! పుష్పం నా తల్లి కాదు. నీ పెట్టెలోవున్న నా శ్యామూ ఫొటో నాకిద్దూ. జాగై పోతూంది. బోయీలు యెదురు చూస్తూవుంటారు.' అంటూ బ్రతిమాలింది శంతన.

పుష్పం తొందరగా పెట్టెతీసి శ్యామూ చిత్రాన్ని శంతన కిచ్చింది.

'మాట, పుష్పం. శ్యామూ యిక్కడకొస్తే అతనెక్కడుంటున్నాడో కనుక్కొని కాస్త తెలియ పరుద్దూ...కడసారి అతన్ని చూడలేక పోయాననీ...యీ కన్నీళ్లతో అతని పాదాలకు కనకాభిషేకం చేశాననీ...కర్తవ్యం లేక కంటతడి పెట్టుకున్నాననీ చెప్పు' అంటూ దుఃఖావేశంతో ఆ పటాన్ని పరులకు తెలియకుండా పమిటలో పెట్టుకుని 'వస్తాచెల్లీ—శెలవు' అంటూ చకచకా నడిచి పోయి పల్లకీ యెక్కింది శంతన. దుఃఖించిన ఆమె దైన్య వదనాన్ని చూచి అర్థంచేసుకోలేక పోయాడు వరహాలు. వారి పరస్పర దృక్కులు పలికిస్తూ పల్లకీ పరుగెత్తుతోంది స్టేషన్కు. చివరకు తెగత్రెంపు చేసుకుని నూతనవరలజ్జా

చేష్టలను విచారిస్తూ 'ఏం అట్లావున్నావేం శంతా ?' అన్నాడు వరహాలు.

సమాధానం యీయలేదు శంతన.

'ఏ వస్తువో మరచిపోయి వచ్చావు ?' అన్నాడు తిరిగి ఆమె ముఖంలోకి చూస్తూ.

'నేను చదువుకునేటప్పుడు రోకీకోరి చేయించుకున్న శమంతక హారాన్ని' అని సమయస్ఫూర్తిగా అంటూ కనిటి నగ్గరని ప్రక్క ప్రక్కలకు చూస్తోంది శంతన.

'ఇంతకీ దొరికిందా'

"ఆ"

యింతట్లోకి పోలకి రైల్వేస్టేషను చేరింది.

శంతన చమత్కార సంభాషిణి. ఆంగ్ల విద్య కొంత వరకూ చదువుకొన్న సొగసుకత్తె. ఆమె కిప్పుడు పదహారో వత్సరం. ఆమె చిన్నప్పటినుండి అన్ని విధాలా అనురాగ పుష్పాలతో అర్చించిన శ్యామూనే యిచ్చి వివాహం చేద్దామని ఆమె తండ్రి వుద్దేశ్యం. కాని ప్రయోజనం? ఆమె పితృదేవత పరలోక గతుడై యిది కండ్లోరేడు. వారిది పేద సంసారం అవటంవల్ల తల్లి జానకి అనేక విధాలుగా ఆలోచించి, తమవలెనే నిరు పేదయైన శ్యామూకి యివ్వ జాలక ఒక మాదిరి స్థితిమంతుడైన వరహాలుకి కట్టబెట్టింది ఘ్రాన్య బంధుత్వాలను పాలమార్చుకుంటూ. వివాహం అయినప్పటికీ తను గాఢానురాగంతో ప్రేమించిన శ్యామూ మీద వలపుకలలు కంటూనేవుంది. శంతన తన తండ్రి కోసం పలుమార్లు పలవరిస్తుంది. సాగని కోరికలు సమయించుకోకుండా అట్టే సాగదీస్తే యేం ఫలితం సంభవిస్తుంది—శూన్యాకాశంలోకి తొంగిచూస్తే యేం సాధిస్తుంది ?!!

వాళ్లది లేని సంసారం అవటంవల్ల ఆ మనుగుడుపులలోనే శంతన శోభనం గూడా శోభాయమానంగా క్లుప్తంలో చేసేసింది జానకమ్మ. కాని, అసలు విషయం వరహాలుతో చెప్ప లేక మొగుడుతో మొగమాటంగానే కాలం గడుపుతోంది శంతన. కాని యీ కపటలోకానికి తీరనిలోటువ అనుకుంది తన నడవడిక—యిదే యీ మాయా ప్రపంచంలో తన జీవితానికి మాయనిమచ్చ నిపించింది. కాని యేం చేయగలదు ?—

బాల్య దశలోనుండి పరస్పరానురాగంతో వరించిన శ్యామూనే యీ విశాల ప్రపంచంలో భర్తగా చేసుకో కలుగుతుందా ? లేక—మాతృాజ్ఞా బద్ధురాలై మనసుకు నచ్చని వరునితో (వరహాలుతో) హెచ్చయిన ప్రేమతో కాపురం చేయ గలుగుతుందా ? ఇటువంటి అంతులేని ఆలోచనా పరంపరలతో అన్నాహారాలుగూడా మానేసింది శంతన. ఆమె మనోవ్యాధిని తెల్సుకుంటానికి అనేక విధాలుగా ప్రయత్నించేవాడు పాపం! వరహాలు. వరహాలు గూడా దయార్ద్ర హృదయుడు. పరుల సుఖదుఃఖాలు చూచి తనవిగా యెంచే పరోపకారతాపసి. అతనికి గూడా చివరికి యేం తోచిందికాదు. ఇటువంటి పరిస్థితులతో గడ్డకట్టిన కాలం క్రమేపీ కరిగినట్లు త్రెంచుకుని పరుగెత్తుకుపోతోంది.

ఒక రోజున వుదయం శంతన స్నానం ముగించి పడక ఇంటిలోనికి వచ్చి ఫేస్‌పౌడరు కోసం పెట్టె తెరిచింది. ఆమె హృదయనేత్రాలు పట్టుచీరలోవున్న శ్యామూ పటాన్ని ఆకర్షించాయి. ఆమె భర్త వరహాలు బజారుకు పోయి అప్పటికి పావుగంట పయిచిలుకయింది. శంతన పౌడరు సంగతి మరచిపోయి ఆ ఫొటోను తీసుకొచ్చి మంచం మీద కూర్చుని చూస్తూ ఆలోచిస్తోంది. అప్రయత్నంగా ఆమె కళ్లంట కన్నీటి భాష్పాలు ఆ ఛాయా చిత్రపాదాల నాశ్రయిస్తూ పరుపుమీద పడ్డాయి. దుస్సహమైన ఆ దుఃఖావేదనని ఆపుకోలేక అట్లాగే ఆ పటాన్ని రెండు చేతులతో అదిమిపట్టి యెదుటగావున్న కిటికీలోకి చూస్తోంది. ఎందుకో !! ఆమె దుఃఖం మరింత అధికమైంది. 'శ్యామూ!' అంటూ హఠాత్తుగా లేచినుంచుంది మంచం మీదనుంచి. ఎవరూ ఆ వచ్చింది ?!

ఎన్నాళ్లనుంచో ఆమె సందర్శన భాగ్యం కోసం యెదురు చూస్తూ ఆమె ముఖచిత్రాన్ని ఆతని మనస్సీమలో హత్తుకుని ఆరాధించుకుంటూ, చిన్నప్పటినుంచి చిరకాలం ఆమె శాశ్వత పరిచయం కోసం, ఆమె నవ్వు వెన్నెల్ల కోసం, ఆమె మనోహరశీతల వదనం కోసం

కౌటిల్యం లేని ఆమె కోమల హృదయ సౌందర్యం కోసం యెదురు తెన్నులు చూస్తూ, వలపు కలలుకంటూ, ప్రణయ బాధలు పొందుతూ, ఆమె సతీత్వం అభిలషించేటటు వంటి ఆ శ్యామూ నేడు నోటమాట లేక నిర్జీవ ప్రతిమలా నిలుచుండి ఆమె వైపు కిటికీలోనుండి చూస్తూ వున్నాడు.

అది స్వప్నమా—మాయా—భ్రమా—!!!

"శంతన్" అని పిలిచాడు దొర్లించే దుఃఖంతో పెదిమలు పెకలిస్తూ.

'శ్యామూ' అని అరచింది శంతన పొర్లిపోయే హృదయానందంతో ముందుకు పరుగెత్తుతూ, 'రా! శ్యామూ లోపలికిరా' అంటూ సుస్వాగతం చూపింది. శ్యామూ భయ విభ్రాంతులతో లోపలికి వచ్చి కుర్చీలో కూర్చున్నాడు.

'మా యింటికి వెళ్లే వచ్చావా? మా పువ్వం కనపడిందా?'

'ఆ. కనపడింది. అంతా కుశలంగానే వున్నారు. అట్లాకుప్కించావేం శంతన్?'

'విధివ్రాతకొద్దీ శ్యామూ......'

'శంతన్ చూడు. నేను రెండే రెండు మాటలు చెబుతాను క్షమించి వినాలి. గడచిన జీవితావస్థను తలచుకుని కలత చెందటం మంచిది కాదు. మన బాల్యావస్థలో వున్న సుందర సుఖస్వప్నాలను మరచిపోవాలి. నీకూ యౌవనోదయమైంది. ఇకనుంచీ నీ యేకైకపతితో సతీత్వం అనుభవించాలి. ఇదే నా హితాభిలాష. యిన్నాళ్ల నుంచీ నీ సందర్శనం కోసం తహతహలాడే నా హృదయబాధను ఓర్చుకోలేక నిన్నొక్కసారి చూచి యీ సందేశం నీ కర్పించి పచ్చటి మీ యిద్దరిపొత్తునూ ముచ్చటగా చూచి పోదామని యిట్లా వచ్చాను. శంతన్...యింకా.'

'శ్యామూ నా భవిష్యజ్జీవిత పరమావధి యింతేనా—నా నిశ్చల నిరంకుశ ప్రేమ యీ నికృష్టపు దుఃఖ భారానికేనా...!! నా పచ్చటి కాపురం చూచి ముచ్చటిద్దామనా లేక అంతులేకుండా పొంగి పొర్లిపోయే యీ వియోగ దుఃఖాన్ని, ఆ సాంతం, యీ జీవితాంతం వరకూ అంటుగట్టి పోదామనా వచ్చింది? నా అంతరాత్మలోని ఆశా జ్యోతిని ఆర్పివేయటానికేనా శ్యామూ?...'

'కాదు శంతన్ ప్రకాశవంతమైన నూతన జ్యోతిని కూడా వెలిగించటానికి.'

'శ్యామూ!'

ఇంతట్లోకే హాలు గడియారం తొమ్మిది గంటలు కొట్టింది.

ఇంతట్లోకే శ్యామూ పట్టె మంచంమీద వున్న తన ఫోటోను చూచి 'శంతన్ చూడూ! నా ఫోటో నాకిద్దూ. నేను మావూరు వెళ్లాలి. ఇకనుండి నన్ను నీ సోదరునిగా భావించుకో. నీవు పతివ్రతవై నీ భావి జీవితాన్ని ధన్యం చేసుకో. నా ఫోటో......'

'శ్యామూ! నీకీ ఫోటోను యివ్వలేను. కానీ నీ మనోభావాలను యిట్లా మార్చుకున్నావేం?'

'నా హృదయం వుద్బోధించటం వలన'

'ఇది వరకూ...?'

'అది బాల్యదశ శంతనా'

'దానికి పరిహారం?'

'హిందూ స్త్రీ ధర్మాన్ని అనువర్తించటమే'

'నిజంగా శ్యామూ?'

'నిరాఘాటంగా అంతే శంతనా!'

'దీనికి కారణం శ్యామూ?'

'స్త్రీ వదనం శీతలవదనం—హృదయం అమృత భాండం అనురాగాన్ని బట్టి.'

'అయితే?'

'అయితేనా ఆ అమృత భాండంలో నుంచి ప్రణయోద్రేకాలు ఆనంద వాయువులుగా, పై కెగసిపోయి మంచుగా గడ్డకట్టి అంతరిక్షం వరకూ గుట్టలు కాగలవు. కాని పరిణయం అయిన తర్వాత ఆ శైత్య ప్రణయరాశికి అగ్నిసాక్షిగా వివాహమాడిన భర్త అనే సూర్యకిరణాలు సోకి పల్చబడిన ఆ ప్రణయరసాన్ని పరిగ్రహిస్తాడు.'

'అందువల్ల నీ మనస్సు కూడా మార్చుకు తీరాలి. అహల్యాసీతాసుమిత్రాదుల పాతివ్రత్యాన్ని అనుసరించి నీ ఈ మానవలోకానికి ఆదర్శపత్నివి కావాలి'

'ఆ! ఆ! అయితే నీవు నాపాలిట పరమాత్మవు శ్యామూ!' అంటూ అట్టే అయిదు నిమిషాలుపాటు తెల్లగా చూస్తూ, దీర్ఘంగా ఆలోచించి కృతనిశ్చయురాలై, గతకాలపు తులు వర్జించి కన్నీళ్లు తుడుచుకుంటూ తన పవిత్ర భవిష్యత్కర్తవ్యాన్ని స్మరించుకుంటూ లేచి నిలబడి 'శంతన్ నమస్తే. యికనుంచి నిన్ను నా సాక్షాత్తూ సోదరుడిలా యెంచుకుంటూ యీ మాంగల్యం సాక్షిగా ప్రమాణం చేస్తున్నాను. నా అంధకార జీవితానికి అనంత ప్రకాశాన్ని అలయింప జేశావు. నా అజ్ఞాన దురూహాలను అగ్నిపాలు చేసి అఖండ జ్ఞానోదయం కలిగింప చేశావు. నా భవిష్యత్ప్రవర్తనకి బాట చూపించావు. క్షమించి యీ ఫోటోను యిక్కడేవుంచు. నా జీవిత పరమావధికి దారి చూపించిన నీకు నీ పవిత్రమూర్తిత్వానికి ప్రతినిత్యం తలుచుకుంటూ ఆ ఫోటోకు ప్రణమిల్లుతూ వుంటాను.

'అన్నా! శ్యామూ!'

'శంతన చెల్లీ!'

ఇంతట్లోకే గది తలుపు తెరుచుకుని వరహాలు లోపలికొచ్చాడు.

'శంతా! వంటపూర్తవలా?'

'లేదండీ, మా అన్నయ్యొచ్చాడు మాట్లాడుతూ కూర్చున్నాను.'

'అంటే?'

'మీారెరుగరు లెండి. ఇప్పుడిక్కడ వుండటం లేదు. మదరాసులో పని. మా పెత్తాత మనుమడన్న మాట.'

'ఓ! నమస్తే'

'నమస్తే'

'అయితే పిండివంటతోసహా పాకం తయారుచేయాలి'..

'మీారు చెప్పాలా? నాకు తెలియదేమిటి?'

'అమ్మాయి. శంతనా. తప్పకుండా భోజనంచేసి వెడతాను. త్వరగా వండాలి'

'వస్తా! అన్నయ్యా'

'బావగారూ! యెట్లాగైనా మీా చెల్లెలు యివ్వాళ హుషారుగావుంది'

'అసలు ఆమె తరహా అంతేనండి'—

'అబ్బే. అట్లా అంటే నేను నమ్మను. అస్తమానం అశోక వృక్షంక్రింద సీతామ్మవారులా వుంటుంది.'—

'ఎప్పుడూ వుంటుందేమిటి ఆ విచారం. నిన్నటివరకూ మా వాళ్లని యెవరినీ చూడలేదు, అందుచేత బెంగగావుంది. ఇవ్వాళ మా అన్నయ్యొచ్చాడు. నా విచారమంతా మటుమాయమైంది. ఇంక నా జీవితానికే విచార ముండదు.'



# అశోకుడు

* డాక్టరు వారణాసి యశోదా దేవి, ఎమ్. లిట్. *

(క్రీ. పూ. 273—232)

మౌర్యుల యాగమనముతో భారతేతిహాసం చీకటినుంచి వెల్తురులోనికి వచ్చింది. మౌర్యసామ్రాజ్యము బహు ప్రాచీనము. చంద్రగుప్తుని రాజ్యరమ దేశ సరిహద్దుల దాటి వ్యాపించెను. మరలనట్టి దేశీ యైక్యత సాధ్యమైనది బ్రిటిషు పాలనమందే. అశోకవర్ధన చక్రవర్తి చంద్రగుప్తుని పౌత్రుడు. రామచంద్రుడు రామరాజ్యమువలె నితడు ధర్మసామ్రాజ్యము నిర్మించెను. సార్థక నామధేయుడై అశోకుడు దేశమును, ప్రపంచమును నశోకముగ-దుఃఖ రహితముగ జేయ కంకణ బద్ధుడై యశఃకామి యయ్యెను. సామ్రాజ్యము ధర్మముపై నిలబడవలెనుగాని బలముపైగాదనెను. అశోకుని కీర్తి దిగంతములనిండి, విశ్వమానవ చారిత్రంలో శాశ్వతమై మానవ ప్రవృత్తులుల నేటికి స్థావర మేర్పర్చుకొన్నది.

అశోకుని తండ్రి బిందుసారుడు. తల్లి సుభద్రాంగి. సుసీమ, తిష్య, వీతాశోక లితని యన్నదమ్ములు. వెదిశ మహాదేవి, శాక్యకుమారి, కారువాకి, అసంధిమిత్ర, పద్మావతి, తిష్యరక్షితలు అశోకుని భార్యలు. మహేంద్రుడు, తీవరుడు, కుణాలుడు, జలేకుడను పుత్రులును, సంఘమిత్ర, చారుమతి యను పుత్రికలు, దశరథుడు, సంప్రతి, సుమనుడను మనుమలు అశోకుని కుండిరి.

క్రీ. పూ. 273లో అశోకుడు రాజ్యమునకు వచ్చెను. పట్టాభిషేకము నాలుగేండ్ల తర్వాత జరిగెను. అశోకుని బిరుదులు—దేవానాంప్రియ, ప్రియదర్శి అనునవి. మాస్కి—శాసనములో—దేవానాంప్రియ అశోకస—యనియున్నది. మౌర్య సామ్రాజ్యపు టెల్లలు వాయవ్యమున పర్షియా, సిరియాలును, దక్షిణమున చోళ, పాండ్య, సత్యపుత్ర, కేరళపుత్ర రాజ్యములునై యుండెను. 261సం॥ ప్రాంతమున కళింగమును జయించి, యుద్ధములో గతించినవారిని, వారికై విలపించువారిని దెలిసి బహు శోకించాడు అశోకుడు. ఇది కళింగ శాసనములోని "ఉపఘాటోవా వధోవా అభిరతానాం వినిష్క్రమనం" అను దానివల్ల విదితము. కళింగ విజయంతో మౌర్య దిగ్విజయ శక మంతమై, శాంతి, సంఘోద్ధతి, మత ప్రచారము ప్రణాళికగ గల ధర్మ విజయ శక మారంభమయ్యెను. చండాశోకుడు ధర్మాశోకుడై, ధర్మానుసరణ, ధర్మతత్పరత, ధర్మబోధలందు శ్రద్ధ గైకొనుచు, ధర్మ విజయము, యుద్ధ జయముకన్న మిన్నయని నమ్మి అహింసను జీవిత ధర్మముగ స్వీకరించాడు. అంతవరకు బౌద్ధ వుపాసకుడై యిపుడు బౌద్ధమతావలంబి యయ్యెను. క్రీ. పూ. 258-257 ప్రాంతమున ధర్మ సిద్ధాంతముల శాసన రూపమున వెల్లడించెను. "మానవక్షేమ, సౌఖ్యముకొరకై వారు ధర్మమవలంబించి వృద్ధిబొందుదురని నేను ధర్మ సిద్ధాంతమును రచింపజేసి, శాశ్వతముగ నుండునట్లు, గుట్టలు, రాతి స్తంభములమీద లిఖింప జేసితి" నని అశోకుని యొక స్తంభశాసనములో గలదు. అందువల్లనే యా ధర్మమూర్తి ధర్మఘోషను నేడును మనము వినగల్గుచున్నాము. కొన్ని సుమధుర విషయములను, ప్రజలు విన్న కొలది యనుసరింతురని, శాసనములలో పలుమార్లు చెప్పించి యున్నాడు అశోకుడు.

రాజధానిలో జంతుబలి, వృధా వేడుకలు జరుపరాదని యశోకుని యాజ్ఞ. ఇంతకు ముందు రాజు మహానసములో వందలకొలది జంతువుల జంపుచుండిరట. అశోకుడు దానిని నిషేధించి శాకాహారమును ఆదేశించెను; రాజునకు హాని జేసినవాడు గూడ కొంతవరకు క్షమార్హుడని యభిప్రాయపడెను. యుద్ధముల విరమించి యశోకుడు "తన పుత్ర పౌత్రులును క్రొత్త జయముల గొనుట తమ ధర్మమని భావింపకుందురుగాక" యని వచించెను. సర్వరాజ్య సమత సిద్ధాంతమును సృష్టించి యాచరణలో బెట్టెను. చిన్న రాజ్యముల స్వాతంత్ర్యమును ఒప్పుకొనెను. కాని యవి నీతిని దండింప సంసిద్ధుడై యుండెను. క్రీ. పూ. 242లో ననేక విధములైన జంతువుల, పక్షుల జంపుటయు, బౌద్ధ వుపవాస దినములలో నేవధయు నిషిద్ధమనియు అశోకుడు

శాసించెను. మనుష్యులకు, జంతువులకు వైద్యశాలలు గట్టించెను. ఓషధుల మొక్కలు, వేళ్లు, దుంపలు విదేశముల నుండి తెప్పించి, కృత్రిమ వాతావరణములో వాని పెంచి, యౌషధీ వనముల, యౌషధముల కొరకై పెట్టించెను. మనుష్యులకు, జంతువులకు బాటలపై నీడ నిచ్చుటకై మఱ్ఱి వృక్షముల నాటించి, మామిడి తోపుల వేయించి, యర క్రోసు దూరమున నొక్కొక్క భావి త్రవ్వించి, విశ్రాంతి గృహముల గట్టించి నీటి వసతులు గల్పించెను.

అశోకుడు బౌద్ధుడయ్యును రాజ్య త్యాగి గాడు. జనుల నీతిబోధ కొరకు దేవుళ్ల వూరేగింపులను, ప్రదర్శనములను ఏర్పాటు జేసెను. ధర్మ ప్రచారార్థమై ధర్మ యాత్రల సగురు, ససైన్య సమేతముగ సాగించి, లుంబినీవనము, కపిలవస్తు, బుద్ధగయ, సారనాథ్, కుశినగరము, శ్రావస్తి యిత్యాది బౌద్ధ తీర్థస్థలముల దిలకించెను. ఇట్టి ధర్మ యాత్రల సామ్రాజ్య మంతటను వున్నతోద్యోగులు వంతుల ప్రకారము ఐదేండ్ల కొకతూరి చేయవలెనని చక్రవర్తి యాజ్ఞ. మారు మూలరాష్ట్రములలో మూడేండ్ల కొకమారు ధర్మ యాత్రలు జరుపబడెను. కోపము, మొరటు తనము లేని యుద్యోగులు ధర్మబోధకై నియమింప బడుచుండిరి. జనుల నైతిక, ధార్మిక విషయముల బరికింప ధర్మమహామాత్రుల నియమించి, అశోకుడు ధర్మపాలనాశాఖను సృజించెను. ఈ శాఖచే కొందరు దూతలు వుత్తరమున యీజిప్టు, మాసిడోనియా, సైరీన్, ఎపిరస్ దేశములకు దక్షిణమున చోళ, పాండ్య, సింహళములకు ధర్మబోధకై బంపబడిరి. దేశములో స్త్రీల నీతి రక్షణకై అశోకుడు స్త్రీయధ్యక్ష మహామాత్రుల నియమించెను.

అశోకుడు ప్రజలను కన్నతండ్రివలె రక్షించెను. "మానవులందరు నా బిడ్డలు. నా సంతతి యిహ పర లోకములందు భోగ సౌఖ్యములనంద వాంఛించినటులే, యితరులు ననుభవించ గోరెద"నని చక్రవర్తి నానుడి. ప్రజలును రాజు పితృతుల్యుడనియు, తమను ప్రేమించుననియు తెలిసికోవలె నన్నాడు. ప్రజల బాధ్యత రాజ ప్రతినిధులకు గలదనియు, వారు, పసిపాపలకు దాయలవలె ప్రజా, దేశక్షేమ రక్షకులని యశోకుని తలంపు. నిజమైన బాధ్యతాయుత ప్రజా ప్రభుత్వ మశోకునిదే గదా! ప్రజా రంజకుడు, ప్రజా సేవకుడునగు నీ చక్రవర్తి యన్ని స్థలములందును, యెల్ల సమయములందును వార్తా హరులు తనకు వార్తల నీయవలెననియు, ప్రజాక్షేమమునకు మించిన ధర్మము లేదనియు శాసించెను. తాను చేయు పనులన్నియు మానవుల ఋణము దీర్చుకొనుటకేనట. ప్రపంచంలో మరేరాజు యీ విధంగా తన బాధ్యత నెరంగి యుండలేదు. ధర్మ పరిపాలనలో నేమరిన రాష్ట్రాధిపతులను అశోకుడిటుల మందలించెను. "ఈర్ష్య, కఠినత, సోమరితనము నుండరాదు. శ్రద్ధ, ఓర్పు, రాజ్య పరిపాలన కత్యవసరము. నా యాజ్ఞ పాలించినవారికి స్వర్గము రాదు; రాజాభిమానముండదు. ఆజ్ఞా పాలనవలన స్వర్గార్హులగుదురు. నా ఋణము దీర్చుకొందురు." దీనిని గుట్టలపై లిఖింపజేసి తిష్య దినములందు బహిరంగముగ చదివి వినిపించవలెనని శాసించెను. అశోకుని విశ్వ సోదరత్వమునకు జాతి, మత భేదము లడ్డురాలేదు. తన రాజ్య సంపదతో నితర దేశములలోని జన క్షేమమునకై కృషిసల్పుటాశ్చర్య జనకము.

అశోకుని శాసన స్తంభముల శిఖరములుగనున్న గజము, వృషభము, అశ్వము, సింహము బుద్ధ జీవితములోని ముఖ్య ఘట్టముల సూచించును. అశోకుడు తన సామ్రాజ్యమును మూడు సార్లు బౌద్ధ సంఘమునకు అర్పించి మరల గ్రహించి నటుల పాహియాన్ చెప్పియున్నాడు. పరమత సహనము నందు అశోకుడు అద్వితీయుడు. తాను సర్వమతముల సన్యాసులను, గృహస్థులను సమానగౌరవ పురస్సరంగా బహూకరించెద నన్నాడు. మత చర్చలలో నితర మతముల దెగడి తమ మతముల బొగడువారు తమ మతమునకే హాని జేయుచున్నారని అశోకుని హెచ్చరిక. సంఘోద్ధతికి స్వచ్ఛంద నైతిక జీవిత మవశ్యమని యశోకుని మతము. ధర్మ సిద్ధాంతములో దయ, దానము, సత్యము, శౌచము, మార్దవము, సాధుత్వము, అపవ్యయత, అపభాండత, సంయమము, భావశుద్ధి, కృతజ్ఞత, దృఢభక్తి, ధర్మనిరతి గలవు. మనుష్యులకు అశోకుడు చేసిన మహా దానము ధర్మ దానము లేక చక్షు దానమే. ధర్మానుశాసనము, సర్వలోక హితము, రాజ ధర్మములనియు, రాజుకీర్తి ప్రజల నైతికాభివృద్ధి

యందు ప్రతిబింబించు ననియు, యితడు ఘోషించెను. ధర్మ సిద్ధాంతములకు ధర్మ విపులనియు, యవి వ్రాయబడ్డ స్తంభములకు ధర్మ స్తంభములనియు పేర్లు.

> "ధమ్మేన పాలనా ధమ్మేన విధానె,
> ధమ్మేన సుఖియనా, ధమ్మేన గోతీతి
> ధమ్మాపె భాధమ్మ తామతా"

యని ప్రజాజీవన మంతయు ధర్మముపై నాధారపడి యుండ వలెనని అశోకుని యాధర్శము. అశోకుని ధర్మ సిద్ధాంత ములు సర్వమత సారమని చెప్పవచ్చును.

అశోకుడు కాశ్మీరమున శ్రీనగరమును, నేపాళమున లలిత పట్టణమును గట్టించెను. అశోకుడు కాశ్మీరమున 500 స్తూప ములను, యితరత్ర 84,000 స్తూపములను గట్టించెనట. 84,000 ధర్మ విభాగములనుగాని, మానవ శరీరములో నెము కలలోని పరమాణువులనుగాని సూచించునని ఐతిహ్యములు గలవు. అశోకుడు అనేక యేక రాతి స్తంభముల గట్టించెను. సారనాథ్‌లోని స్తంభము బహు సున్నితమై, నిగనిగ లాడుచుండును. దాని శిఖరమున నాల్గు సింహములును, వాని మధ్య ధర్మచక్ర చిహ్నముగ రాతి చక్రము గలదు. ప్రక్కలందు సింహము, యేనుగు, వృషభము, గుఱ్ఱము, అశోకుని ధర్మము నలుదిక్కుల వ్యాప్త మయ్యెనని చాటు టకోయన చిత్రితమై యున్నవి. అశోక స్తంభములందలి శిల్పకళా నైపుణి ప్రపంచంలో మరెచ్చట గానరాదు. అశో కుని లాంఛనము మయూరము. రాజధానిని, రాజ భవన మును బహు సుందరముగ అశోకుడు గట్టించెను.

బౌద్ధ విహారములు విద్యా స్థానములు ప్రజల కొరకై అశోకుడు శాసనముల దేశ భాషల లిఖింపజేసి యాత్రా స్థలములందుంచెను. బహుపత్నీత్వము, బాల్య వివాహ ములు, సముద్రయానము, విదేశముల కేగుట యా కాల మందుండెను.

అశోకుడు తర్వాతి శాసనములలో ధర్మాశోకుడనియు, ధర్మ రాజనియు, చెప్పబడ్డాడు. సాంచిస్తూపములోయితని జీవితగాధ చిత్రితము. బౌద్ధ శిల్పములో ప్రధానమైన యశోకుని చక్రమే మన స్వాతంత్ర్య పతాకపై చిహ్నితము. వాల్గానుండి జపానువరకు అశోకుని పేరు గౌరవింపబడు చున్నది. చైనా, టిబెట్, భరత ఖండములలో యితని యశోగానము ఆలాపితమగుచున్నది. సామాన్య ప్రజలు అశోకుని స్మరించుచుందురు. ఈ సామ్రాట్టు సారనాథ్ స్తంభ శిఖరమే సంయుక్త భారత రాజ్య లాంఛనమై మన తపాల బిళ్లలపై సైతము గానగును గదా!



# బాలానందం

## క్షుద్రజంతువులు

* మధునాపంతుల వేంకటాచలపతి *

పూర్వము శూద్రకుడను మహారాజు రాజ్యమును పరిపాలించేవాడు. ఆ రాజ్యములోని ప్రజలందరు ఆతనియందు మిక్కిలి గౌరవమును చూపించుచుండెడివారు. ఆ రాజు మాత్రము గొప్పగొప్ప జంతువులయందు, గొప్పగొప్ప ధనవంతులయందు ఆదరము చూపించేవాడు. బీదవారియందు, క్షుద్రజంతువులందు ఆదరమును చూపింపక చికాకు పడుచు, అసహ్యించుకొనే వాడు. ఇలాగుండగా ఒకనాడు కొందరు శత్రు రాజులు శూద్రక మహారాజుపై యుద్ధము చేయుటకు దండెత్తి వచ్చిరి. శూద్రకుడు వారితో యుద్ధము చేయలేక అడవి మార్గమున పోవుచుండగా శత్రురాజులుకూడ వెంటాడి తరుముచుండిరి.

శూద్రక మహారాజు కొంతదూరము వెళ్లి వెనుకకు తిరిగిచూచేసరికి శత్రురాజులు ఎక్కడను కనబడలేదు. అప్పుడాతను శ్రమను తీర్చుకొనుటకు ఒక చెట్టుక్రింద పరుండెను. బాగుగా పరుగెత్తిన మూలమున గుఱ్ఱుపెట్టి గాఢముగా నిద్రపోయెను. కొంతసేపటికి శత్రురాజులు సమీపమునకు వచ్చి వెదకుచుండిరి. ఆ సమయమున ఒక దోమ వేగముగావచ్చి, తొండముతో రాజుగారిని పొడిచెను. త్రుళ్లిపడి లేచి కూర్చొని నాలుగు దిక్కులను ఒకసారి చూచెను. ఇంతలో ఒక దిక్కునుండి వెదకుచు వచ్చుచున్న శత్రు రాజులను చూచెను. వారిని చూడగానే తొట్రుపడుచు లేచి మఱల పరుగెత్తసాగెను. ఇట్లు కొంతదూరముపోగా ఒక కారడవి చేరుకొనెను.

అడవియందు ఒక పెద్ద గుహ కనబడెను. మెల్లిగా ఆ గుహయందు ప్రవేశించి అలసట తీర్చుకొనుచుండెను. కొంతసేపటికి శత్రురాజులు ఆ గుహవద్దకే వచ్చి వెదకుచుండిరి. శూద్రక మహారాజు గుహలో ప్రవేశించగానే ఒక సాలె పురుగు గుహద్వారమునకు గూడుకట్టుకొనెను. దానిని చూచి శత్రువులు ఇట్లు ఊహించిరి. "రాజు దీనిలో ప్రవేశించినట్లయిన ఈ గూడు తెగి పోవును. అందుచే దీనిలో ప్రవేశించిఉండడు" అని అనుకొని వారు తిరిగి శూద్రక మహాపట్టణమునకు పోయి హాయిగా పరిపాలించుచున్నారు.

ఇట్లుండగా శూద్రక మహారాజు కొన్ని రోజులకు శత్రువులు రారని నిశ్చయించుకొని గుహ వెలుపలికి వచ్చెను. గుహద్వారమున అల్లు

కొన్న సాలె గూటును చూచి తన మనస్సునందు ఇట్లు విచారించెను. "నేను గొప్పవారిని, గొప్ప జంతువులను ఆదరముతో చూచేవాడను. క్షుద్ర జంతువులను, బీదవారలను నీచముగాచూచి అసహ్యించుకొనేవాడను. ఈనాడు దోమ, సాలీడు సహాయము చేయని-చో నేను బ్రతుకుట ఎట్లు? వారల సహాయముచే ఇప్పుడు రాజ్యమును పొందగలను" అని తెలివి తెచ్చుకొనెను.

ఆ తక్షణమే బయలుదేరి, క్షుద్రజంతువుల కడకు, బీదవారల కడకు పోయి వారల సహాయముకోరి తన రాజ్యమును తాను పొంద గలిగెను. అప్పుడు తన రాజ్యములోని ప్రజల కందరకును తన చరిత్రను చెప్పి వారలకు ఇట్లు బోధించెను. "సమస్త ప్రజలయందు, సమస్త జంతువులయందు సమాన ఆదరమును చూపవలెను. అందరుకూడ మనకు సహాయభూతులే."



# నల్లపిల్ల నవ్వింది

* బాబూ *

తెలుపు నలుపు రంగులతో వెలుగు నీడల చిత్రం చిత్రిస్తున్నాను. పకపకమంటూ నవ్వు వినబడింది. అటు చూశాను. తెల్లకళ్ల నల్లపిల్ల నవ్వుతుంది.

ఆమె, నా చెల్లాయి స్నేహితురాలు రమ. నా బొమ్మలు చూడడానికి వచ్చింది. వచ్చి నామె బొమ్మలు చూడాలి కాని, పెద్దగా నవ్వడమెందుకు? పోనీ నా గదిలో నవ్వువచ్చే వ్యంగ్య చిత్రాలు ఏమైనా ఉన్నాయా అంటే అవేమీలేవు.

నల్లపిల్ల నవ్వుతూనే వుంది. నన్నుచూసే నవ్వుతుందని నా ఉద్దేశం. అందుకే నాకు చాలా కోపం వచ్చింది. చిత్రించే బొమ్మ ఆపివేసి, అటూఇటూ చూశాను. గదిలో బొమ్మలన్నీ నవ్వుతున్నాయనిపించింది.

ఆ గదిలో ఉండలేక అలంకరణ గదిలోకి వెళ్లాను. అక్కడ కిటికీ ఒకటి తెరిచి ఉంది. దానిలోనుంచి వచ్చే వెలుతురు ఒక శిల్పంమీద పడుతుంది. అది నవ్వుతున్న నల్లరాతి శిల్పం. కోపంగా దానివైపు వెళ్లబోయాను.

కంగారులో నా చేయి అద్దానికి తగిలింది. అది టక టక మంటూ గోడను కొట్టుకొంది. అద్దం పగులుతుందేమో అని గట్టిగా పట్టుకొన్నాను. దాని ఎక్కువ దట్టంగా దుమ్ము కప్పి ఉంది. చేతి రుమాలుతో దానిని తుడిచాను. అందులో నా రూపం కనబడ్డది.

ఆశ్చర్యం! ఆ అద్దంలో నా ముఖం చూస్తే నాకే నవ్వు వచ్చింది. ఎక్కడి కోపం అక్కడే ఎగిరిపోయింది. పైగా సిగ్గుపడ్డాను. మసిబొగ్గు లాంటి నల్లరంగు నా ముఖంలో అక్కడక్కడా అంటుకొన్నది.

వెంటనే ముఖం కడుక్కొన్నాను. తిరిగి బొమ్మ చిత్రిద్దామని లేవబోయాను. మరల అద్దం కదిలింది. దానిని చూస్తూ నిలబడ్డాను. "నన్ను నేనూ నిన్ను నీవూ తెలుసుకొనక పోతే నల్లపిల్లయే కాదు, నరకలోకమంతా నవ్వుతుంది." అంటూ ఆ అద్దం ఆగిపోయింది.



# మామతో ముచ్చట్లు

"రాజేశ్వరి"

మామా బజారు కెళ్తే
నాకు బొమ్మలు తెస్తావా
బొమ్మల పుస్తకం కొంటావా.

బజారు కెళ్తే బొమ్మలు తెచ్చి
రంగుల బొమ్మల "మాకు" ను తెచ్చి
మంచివి మంచివి కొని నీకిస్తా
మరి నా కొక ముద్దు యిస్తావా ?

రంగుల బొమ్మల మాకును తెస్తే
చకచక నడిచే బొమ్మలు తెస్తే
మిఠాయి ఉండను నోట్లో పెడ్తే
తప్పక నీ కొక ముద్దును యిస్తాలే.

మామా మద్రాసెళ్తే
వింతలు యెన్నో చూపిస్తావా
వినోదాలకే త్రిప్పిస్తావా

ఆడుచు పాడుచు నాట్యం చేస్తే
ఆనందముగను పాటలు పాడ్తే
వింతలు యెన్నో చూపిస్తా
వినోదాలకే త్రిప్పిస్తా.

కాఫీ ఓవల్‌టిన్ కలిపిస్తావా
కమ్మని పూరి దేపిస్తావా
కడుపు నిండుగ తినిపిస్తావా

అల్లరి చేయక తిన్నగయుంటే
ముద్దుగ మరి కబుర్లు చెప్తే
చెప్పిన మాటను విన్నావంటే
కోరినవన్నీ యిస్తాను
కడుపు నిండుగ పెడ్తాను.



# .... మందబుద్ధి ....

* మండ మల్లికార్జునరావ్ *

పూర్వం ఒక కోమటి ఉండేవాడు. చాలా ధనికుడు. కాని పిల్లికి బిచ్చం వేయని పిసినారి. అతని దగ్గిర్కి ఒకనాడు ఒక సాయబు వచ్చి తనకు కావలసిన చిల్లర సామానులు అడిగాడు. మన శ్రేష్ఠిగారికి ఆ మాటలు వినపడతాయా! ఏదో లెక్కలు చూసుకుంటున్నాడు.

సాయబు మళ్లీ అడిగాడు. అబ్బే! లాభం లేకపోయింది. సాయబుకి ఎక్కడలేని కోపము వచ్చి ఆ సామానులని దాటుకొని శెట్టిగారికి చెంప ఛెళ్లుమన్నట్లు ఒక్క లెంపకాయ చెంప మీద వేశాడు. దాంతో శెట్టిగారు మూడంకె వెయ్యబోయి ఎనిమిదంకె వేశాడు.

శెట్టికి కోపంవచ్చి అన్నాడు—"ఎందు కయ్యా కొట్టావ్ సాయబూ?" "నేనడిగిందానికి జబాబియ్యక తందనాలు తొక్కితే ఏటవుతాది" అన్నాడు సాయబు. "పద నీ పని కరణంగారితో చెబుతా!" అని సాయబు గురించి కరణంగారితో రిపోర్టు చేశాడు శ్రేష్ఠి.

కరణంగారు కేసు విచారణ చేసి శెట్టిగారి వల్ల పొరపాటు లేదని సాయబుకి, ఒక్క లెంప కాయ కొట్టినందుకు అర్ధ రూపాయ జరిమానా విధించారు.

సాయబు రూపాయి జేబులోంచి తీసి కరణం గారి చేతిలో పెట్టి శెట్టికి ఛెళ్లుమని రెండో చెంపమీద లెంపకాయ కొట్టాడు. ఇదంతా కరణంగారు చూచి ఆశ్చర్య పోయారు.

"ఏమిటోయ్ సాయబూ? ఇదంతా!" అని గదమాయించాడు కరణం.

"మీరు ఒక్క లెంపకాయకి అర్ధరూపాయి జరిమానా ఇమ్మన్నారు. నాదగ్గర రూపాయి నోటుంది. చిల్లర లేకపోయింది. అంచేత మరోటి వేస్తే రూపాయి పూర్తయింది కదండీ!" అన్నాడు సాయబు.

కరణంగారికి నవ్వాగింది కాదు. శ్రేష్ఠిగారికి సిగ్గేసింది. రుసరుసలాడుతూ లేచి వెళ్లిపోయాడు. కాదు మరీ?....పోనీ ఒంటరిగా ఉన్నప్పుడైనా కాదు—కరణంగారి సమక్షాన!—సాయబు పనెట్లాగైనా పట్టించాలని పట్టు పట్టాడు శ్రేష్ఠి.

ఒక రోజు శెట్టి ఇద్దరు రౌడీల చేతికి కొంత డబ్బు ఇచ్చి సాయబుని కొట్టమని పంపాడు. దీన్నే అంటారు మన పెద్దలు "చేతకాని పౌరుషము" అని. పాపం—సాయబు ఒంటరిగా ఉండటం చూచి ఆ రౌడీలిద్దరూ సాయబు బుర్ర పగలగొట్టారు.

సాయబు వెంటనే వెళ్లి కరణంగారితో మనవి చేసుకున్నాడు. కరణంగారు శెట్టిని పిలిపించి విచారణ జరిపించి శ్రేష్ఠిగారి వల్ల పెద్ద నేరం వుందన్నారు. శెట్టిగారు నవ్వుతూ కరణంగారితో రహస్యంగా ఏదో మాటాడేరు కాని కరణం బుర్రూప లేదు.

"ఓయ్ శెట్టి! నేరం నీమీదుంది. నీక శిక్ష చెబుతున్నా విను. నువ్వు నూరు రూపా

యలు జరినామా చెల్లిస్తావా? లేక శేరు నెయ్యి త్రాగుతావా? లేక యాభై గుద్దులు తింటావా?" అని ప్రశ్నించారు కరణంగారు.

"బాబూ! నూరు రూపాయ లివ్వడం నా తరం కాదు. యాభై గుద్దులే! నే తినలేను. ఆ శేరు నెయ్యి కావలిస్తే త్రాగేస్తాను!" అన్నాడు పిసినారి శ్రేష్ఠి.

కరణంగారు నెయ్యి తెప్పించారు. శెట్టి మూడొంతు లెల్లాగో బ్రహ్మాండం మీద త్రాగేశాడు. మరి త్రాగలేక పోయాడు.

"బాబూ!" "మరి త్రాగలేను! ప్రాణాలు పోతున్నాయి. కావలిస్తే యాభై గుద్దులు తింటాను" అని ఏడ్చాడు.

కరణంగారు సాయబుని యాభై దెబ్బలు కొట్ట మన్నారు. సాయబు కసిదీర నలభై దెబ్బలు వేశాడు. శెట్టింతట్లో ఆగ మన్నాడు.

"బాబూ! మరి తినలేను. ప్రాణాలు పోతున్నాయి. కావలిస్తే నూరు రూపాయలివిగో తీసుకోండి!" అని ఆ రూపాయలు ఇచ్చేశాడు తెలివితక్కువ శ్రేష్ఠి.

కరణంగారు, సాయబు, శెట్టి తెలివి తక్కువకి నవ్వుకున్నారు.

"ఈ నూరు రూపాయలు మొదటే యివ్వ లేక పోయావూ?!" అని అడిగారు కరణంగారు.

"నా బుద్ధి గడ్డి తింటుంది" అన్నాడు శ్రేష్ఠి.



# స్వతంత్ర దినోత్సవము

## ఆంధ్ర మహిళా సభ

ఆగష్టు 15-వ తేదీని, ఆంధ్ర మహిళా సభలో స్వతంత్ర దినోత్సవము జరిగినది. ఉదయం—9 గం॥ నుండి—అమింజికర్రై, సివిల్ ఆర్ఫనేజ్ విద్యార్థులు, బ్యాండు వాయించారు—9-30 గం॥లకు అఖిల భారత మహిళా సంఘ కార్యదర్శిని శ్రీమతి బి. కామేశ్వరమ్మగారు పతాకము నెగురవేసినారు—జండా వందనానంతరం, శ్రీమతి కామేశ్వరమ్మగారు, స్వతంత్ర సముపార్జనలో కృషి చేసిన యోధవరులను సంస్మరిస్తూ, ప్రస్తుతంలోగల యిక్కట్లను అతిక్రమించి, స్వాతంత్ర్యాన్ని నిలుపదొక్కకోగల విద్యా విజ్ఞాన పటిమలను అలవరచుకొనుట, ప్రతి స్త్రీ విద్యావతియగునట్లు కృషి చేయుట, వచ్చే ఎన్నికలలో స్త్రీలు తమ స్థానమును గుర్తించి, తమ ఓటును సరిగా ఉపయోగించుకునేటటువంటి విజ్ఞానాన్ని సంపాదించుకొనుట అత్యవసరమని నొక్కి చెప్పినారు.

కుమారి రాధా రమణ జాతీయగీత గానముతో సభ ముగిసినది.

ఆంధ్ర మహిళా సభ



# విశాఖ పట్టణ మహిళా సంఘము

శ్రీ రామకృష్ణ రాజుగారు, శ్రీ నాగయ్యగారు, శ్రీమతి సూర్యకుమారిగారు, తదితరులు పాఠశాలను చూడనేగినవారు

మహారాణిపేటలో యీ సంఘం భవనము శ్రీమతి దుర్గాబాయి ఎం.ఏ., బి.ఎల్. గారి కృషిచే నిర్మింపబడినది. ఆ సంఘ ఆవరణలో శ్రీమతి దిగుమర్తి సరస్వతిగారు, బేసిక్ విధానముపై ఒక శిశు శిక్షణ కేంద్రాన్ని నిర్వహిస్తున్నారు. గత మే నెలలో, ఆంధ్ర దేశములో సాంస్కృతిక పర్యటన చేసిన శ్రీ రామకృష్ణ రాజుగారు, శ్రీ నాగయ్యగారు, శ్రీమతి సూర్యకుమారిగారు, యీ పాఠశాలనుచూచి, చాల ప్రశంసించిరి. బాల బాలికల నాట్య, గాన, వినోద కార్యక్రమములను జూచి సంతసించిరి.



చిన్నపిల్ల నర్సరీరైమ్ పాడుతూ ఉంది



బాలుర వినోద కార్యక్రమం

శ్రీమతి సుభద్రా కుమారీ చౌహాన్

# ముగ్గురు పిల్లలు

అనువాదం : సౌభాగ్యరావు

నా పిల్లలు ముగ్గురూ మూడు చిన్న చిన్న పూలతోటలు వేసుకున్నారు. అవి పూలతోటలు కావు. వాటిని పూల మళ్లు అనాలి. ఒక రోజు ఉదయం మేమంతా ఆ పూల మళ్లు పువ్వులతో పూచి యుండటం చూచాం. పువ్వులతో మళ్లు అందంగా కన్పిస్తున్నవి.

వాళ్లు పిల్లలు, పిల్లతనమూను. ముగ్గురూ నామడిలో పూచిన పువ్వులు బాగున్నవని గంతులు గెంతటం మొదలు పెట్టారు. ఇట్లా ముగ్గురూ జగడం పెట్టుకున్నారు. నావి బాగున్నవంటే నావి బాగున్నవి అని.

మాటకు మాట పెరిగిపోయింది. మళ్లల్లోని పువ్వుల సంగతి మర్చి పోయారు. అది ఉండి ఉండి పోట్లాటగా మారి పోయింది. ఒకడు ముసోలినీననీ, రెండవవాడు హిట్లరుననీ, మూడవవాడు స్టాలిన్ననీ, కేకలు పెట్టుకుంటూ రంగంలో నుంచున్నారు. బూతుల పంచాంగం కూడా విప్పారు. వీళ్ల కేకలు విని గబగబా పరుగెత్తుకు వచ్చా పెరట్లోకి. ముగ్గురి పేర్లూ వినేసరికి నేను ఈ ముగ్గురుకీ తల్లి నయ్యాను గదా అనే ఆనందం నాకు కల్గింది.

నేను వచ్చి నుంచున్నాను. నన్ను చూడగానే ముగ్గురూ తమతమ పక్షాలను సమర్థిస్తూ న్యాయం విచారించమని కోరారు. న్యాయంగా తీర్పుదిద్దాలి. కోర్టులో జడ్జి న్యాయం విచారించి తీర్పు చెప్పినట్లుగా తీర్పు చెప్పటకు వీలులేకుండా ఉంది. జడ్జికి ముందుగానే న్యాయ శాసనాలు వ్రాసి ఉన్నవి. వాటిని ఆధారంగా ఉంచుకొని కోర్టులో జడ్జి తీర్పు చెబుతాడు. నేను వీళ్ల ముగ్గురికి న్యాయం చెప్పదలచుకుంటే జడ్జికి ఉన్నటువంటి ఆధారాలు, శాసనాలు ఏవి? ముక్కుకు సూటిగా న్యాయం చెప్పాలంటే ఎవరో ఒకరికి అన్యాయం కలుగక మానదు. ఎలాగయినా నేను వీరిపోట్లాటకు తీర్పుచెప్పాలి. న్యాయబద్ధంగా నివారించాలి.

మొదట జూరీని ఏర్పాటుచేసి తర్వాత న్యాయం విచారించి తీర్పుచెబితే బాగుంటుందని తోచింది. జూరీలుగా ఎవరిని ఏర్పాటు చేస్తే మంచిద్దా అని ఆలోచిస్తున్నా. ఇంతలో ముగ్గురూ వాళ్ల నాన్నను బజారులో ఉండగానే రావటం చూచారు. కొట్లాట మానివేశారు. గప్చిప్ సంబారు బుడ్డీ అయ్యారు. ఆయనకు వీళ్లు పోట్లాడుకోవడంగాని, ఆనందంగా కేకలు పెట్టడంగాని సరిపడదు. వీళ్ల కేకలు బజారులో ఉండగానే విన్నారేమో వీళ్ల నాన్న. వచ్చీ రావడంతోటే "ఎందుకురా, మీరు పోట్లాడుకునేది ?" అని వాళ్ల వంక కళ్లురిమి చూస్తూ "ఒరేయ్, మీరు పోట్లాడుకున్నారూ అంటే మీ అమ్మను సత్యాగ్రహం చేయనివ్వను. ఆమెను జయిలుకు పోనివ్వను" అని హెచ్చరించాడు.

నా హిట్లరు, ముసోలినీలు సత్యాగ్రహం మాట అనేసరికి శాంతించారు. నేను లేందే వాళ్లపనులేవీ పూర్తికావు. స్నానం చేయించి, ఉడుపులు తొడిగి, అన్నంపెట్టి బడికి వెళ్లండిరా అబ్బాయిలూ, అంటేగాని పోరే, అటువంటి వాళ్లకు నేను సత్యాగ్రహం చేసి జయిలుకు పోవడం అంటే ఆనందంగాను, సంతోషంగాను ఉంది !

ఇక మీ పోట్లాట సమాప్తమైందా అని అడిగి చూచా. అంతా ఒకసారి—"లేదమ్మా, మా అందరి మళ్లల్లోని పూలూ మంచివే. ఇక మాకేమీ పోట్లాటలు లేవు. మేము పోట్లాడుకోనే పోట్లాడుకోం. నీవు సత్యాగ్రహం చేసి జయిలుకు పోవచ్చు" అని అన్నారు.

మేమందరమూ ఇంట్లోకి వెళ్ల భోతున్నాము. ఇంతలో బయట ఎవరో పాట పాడుతున్నారు. ఒకళ్లు కాదు, చాల. మంది కలసి పాడుతున్నారు. పాటను కొంచెం సేపు వినే సరికి అది పిల్లలు కలిసి పాడుతున్నట్లుగా ఉన్నది. చాల మధురంగా ఉన్నది.

పాట వింటూ మేమంతా బయట వాకిట్లోకి వచ్చాము. అప్పుడే రెండవ చరణం పాడుతున్నారు.

ఆ పాట పాడేవాళ్లు ముగ్గురు పిల్లలు. ఇద్దరు ఆడపిల్లలు, ఒక మగపిల్లవాడు. అందరికంటె పెద్దపిల్ల పదేండ్లది. రెండో పిల్లకు ఏడో, ఎనిమిదో ఏళ్లు ఉంటవి. మగపిల్ల వాడిని పెద్ద పిల్ల చంకన ఎత్తుకున్నది. బహుశా అయిదేళ్లు ఉంటాయేమో. మమ్మల్ని చూచి పిల్లలు పాట ఆపివేశారు. చంకలో నున్న తమ్ముణ్ణి పెద్దపిల్ల క్రిందకు దించింది. అక్కా చెల్లెళ్లిద్దరు మాకు నమస్కారం చేశారు. అది చూచి చిన్న పిల్లవాడు కూడ అదే విధంగా చేశాడు. ముగ్గురూ చింపిరి చొక్కాలు తొడుక్కున్నారు. చింపిరి చొక్కాలతో జానెడు లోతుకు పోయిన డొక్కలను చూపుతూ "అమ్మా, ఆకలివేస్తూ ఉంది. నిన్నటినుంచి అన్నం దొరక లేదు. ఒక ముద్ద అన్నం పెట్టు తల్లీ" అని పెద్ద పిల్ల అడిగింది. ఆ అమ్మాయి చేతికి జోలి ఉన్నది. రెండవ అమ్మాయి చేతిలో ఒక సీనారేకు డబ్బా ఉన్నది. రెండూ ఖాళీవే. ఖాళీ జోలిని, ఖాళీ డబ్బాను మాకు చూపుతూ యిద్దరూ మా వంక అత్యంత దీనంగా చూచారు.

"మీరు పాడిన పాటలు చాల బాగా ఉన్నవి. ఇంకా పాటలు పాడుతారా?" అని నేను అడిగాను.

"ఇవే గాదు తల్లీ. ఇంకా కీర్తనలు కూడా పాడుతాము" అని పెద్దపిల్ల కంటె ముందు చిన్నపిల్ల జవాబు చెప్పింది. మేము పాడమని చెప్పకముందే ఇంకొక కీర్తన పాడటం ప్రారంభించారు.

ఆ కీర్తన విని నవ్వు ఆపుకోలేక పోయాము మేము. అందరము ఒక్కసారి పగలబడి నవ్వాము. మా నవ్వును చూచి వాళ్లు ఏదో పొరపాటు చేసిన వారివలె మా వంక దీన దృక్కులతో చూశారు. వాళ్ల ఖిన్న వదనాలను చూచి నేను నవ్వును ఆపుకొన్నాను. "మీరు చాల బాగా పాడారు" అని వాళ్లకు ధైర్యం కలగాలని అన్నాను. నా ఓదార్పు మాట విని వాళ్లు మాకు నమస్కారం చేశారు. "అమ్మాయిలూ, మీకు అన్నం పెట్టమంటారా? బియ్యం పెట్టమంటారా? చెప్పండి" అని వారిని అడిగాను.

అందరిలో పెద్ద అమ్మాయి రెండు చేతులూ జోడించి అత్యంత దీనంగా—"ఏం పెట్టినా సరే, నిన్నటినుంచి అన్నంలేదు తల్లీ" అని అంది. వీళ్లకు పట్టెడు, పట్టెడు అన్నం పెట్టండని పిల్లలకు ఆజ్ఞాపించి నేను యింట్లోకి వెళ్లి పోయాను.

నా నోటివెంట మాట రాగానే పిల్లలు వీళ్లకు అన్నం తీసుకుపోయి పెట్టారు. ఎంత అన్నం వాళ్లకు పెట్టారో, నేను చూడ లేదు. మిగతా పనులు చేసుకుని వంటింటిలోకి వెళ్లిచూస్తే గిన్నెలలో కూరలూ, అన్నం లేవు.

౨

మర్నాడు ఉదయమే ఫలహారాలు, కాఫీలు పుచ్చుకుని లేవ సిద్ధంగా ఉన్నాము. ఇంతలో నిన్న పాటలు పాడిన బాలగాయకులు వచ్చారు. వారు పాడుతూఉన్న పాట వీనులకు విందుగొల్పుతూ ఉన్నది.

నేను పిల్లలను—"మీరు నిన్న గిన్నెలలోని అన్నమంతా పెట్టారుగా! అందుకనే వాళ్లు మళ్లీ యిక్కడికి వచ్చారు. ఇక్కడ వాళ్లకు రోజూ సంతర్పణ జరుగుతుందనుకుంటున్నారు" అని కోప పడ్డాను.

పిల్లలు నా మాట చెవిని పట్టించుకోకుండానే గల్లంతుగా కేకలు పెడుతూ వంటింటిలోకి అన్నం గిన్నెలు తెద్దామని పరుగెత్తారు.

"వద్దు, వద్దు, ఆగండి! ఆగండి! ఈ మోస్తరుగా వీళ్లకు అన్నం ప్రతిరోజూ పెడుతూ ఉంటే మన యిల్లు వదలిపెట్టి పోరు. ఒక్కొక్క గుప్పెడు బియ్యం పెట్టి వాళ్లను పంపివేయండ"ని చెప్పాను.

నా పిల్లలు మటుకు సామాన్యులా!

ఒకడు—"పాపం, వాళ్లు చిన్న పిల్లలు. వాళ్ల అమ్మ ఉన్నదోలేదో. మరి బియ్యం పెడితే వాళ్లెక్కడ వండుకుంటారు పాపం" అని జాలిగా అన్నాడు.

రెండవవాడు—"బియ్యం పెట్టేకంటే, ఊరకే పంపిస్తే బాగుంటుదని" వ్యంగ్యంగా అన్నాడు.

మూడవవాడు అందరికంటె చిన్నవాడు—"అమ్మా, నీవు అమ్మవు. అయినా ఇట్లా అంటావేమ్మా? పాపం

వాళ్లకు ఆకలివేస్తూ ఉండాలి! మావంతు అన్నంపెట్టు— అమ్మా" అని కనికరంగా అన్నాడు.

వీళ్లందరికంటె చిన్నది తెలివైంది. అది ఏమీ మాట్లాడకుండా మౌనంగా ఉన్నది. అమ్మ ఎప్పుడు ఆ పిల్లలకు అన్నం పెట్టమని అంటుందా, అన్నం గిన్నెలు తీసుకువెళ్లి పెడదామా, అని ఎదురుచూస్తూ ఉంది.

నేను నీరసంగానే చెప్పాను—"అన్నమే పెట్టండి. మీ కందరకూ సాయంత్రం మళ్లీ అన్నం వండాలి," అని.

"అమ్మా, మేము సాయంత్రం అన్నం తినములే" అని అందరూ ఏక కంఠంగా పల్కి, అన్నం గిన్నెలు చేత బుచ్చుకొని వాకిట్లోకి పరుగెత్తారు.

వంటింటి పనులన్నీ పూర్తి చేసుకొని నేను వాకిట్లోకి వచ్చాను. ఆ ముగ్గురు బాలగాయకులు ఆత్రంగా అన్నం తింటున్నారు. నా పిల్లలందరూ వాళ్లకు వడ్డిస్తున్నకొద్దీ, "కడుపునిండా తినండి" అంటూ అన్నము, కూరలు వడ్డిస్తున్నారు. ముగ్గురూ అన్నం తిని చేతులు కడుక్కున్నారు. ఆ తర్వాత నేను వాళ్లను ఇప్పుడే వెళ్లడానికి వీల్లేదు. ఒక పాటపాడి వెళ్లాలి" అన్నాను. కృతజ్ఞతా సూచకంగా మాకు నమస్కారం పెట్టి మధురంగా ఒక పాట పాడారు.

మళ్లీ మాకు నమస్కారం చేశారు. మమ్మల్ని ఆశీర్వదించి వెళ్లబోవటానికి సిద్ధంగా ఉన్నారా అన్నట్లు నుంచున్నారు. "మీరు ముగ్గురూ అన్నా చెల్లెళ్లా" అని అడిగాను.

"అవునండి అమ్మగారు" అని వాళ్లల్లో పెద్ద అమ్మాయి అన్నది.

"నీపేరు ఏమిటి?" అని అడిగాను. "నా పేరు 'సీత' చెల్లెలిపేరు 'సక్కు', తమ్ముడిపేరు 'మధు'" అని చెప్పింది.

"సీత, సక్కు, మధు" అని ఆపేర్లను మారుబల్కుతూ నేను—"మీ అమ్మనాన్న ఎవరూ లేరా? నిన్నా మీరు ఒంటరిగానే వచ్చారు! ఇవ్వాళా వంటరిగానే వచ్చారు" అని ప్రశ్నించాను.

"అమ్మా ఉన్నది, నాన్నా ఉన్నాడు. ఇద్దరూ ఉన్నారు, తల్లీ" అని సక్కు ఉత్సాహంగాను, తొందరగాను జవాబు చెప్పింది.

"వాళ్లిద్దరూ ఎక్కడ ఉన్నారు? వంటరిగా మిమ్మల్ని బిచ్చమెత్తుకు రమ్మని పంపుతున్నారు" అని అడిగాను.

"మా నాన్న బళ్లారిలో ఉన్నాడు అమ్మ......"

"బళ్లారిలో మీ నాన్న ఏం పని చేస్తున్నాడు" అని నా రెండో అబ్బాయి మాట మధ్యలోనే అడిగాడు.

"జయిలులో ఉన్నాడు చిన్నబాబూ" అని పెద్ద పిల్ల జవాబు చెప్పింది.

"జయిలులో ఉన్నాడా? ఎందుకు శిక్షపడింది?" అని నేను కొంచెం అశ్రద్ధగా అడిగాను.

"మా నాయన సారాయి త్రాగేవాడు. త్రాగినవాడు మెదలకుండా పడుకునేవాడా? కాదు. గోలచేస్తూ ఉండేవాడు. మా అమ్మను బాదేవాడు. నోటికి వచ్చీరాని మాటలు, తిట్లు తిడుతూ ఉండేవాడు. అందుకని పోలీసులు మా నాన్నను పట్టుకుపోయారు తల్లీ "అంటూ" వూళ్లో వాళ్లందరూ, పోలీసులు మంచిపనే చేశారని అంటున్నారని" అంది.

"సరే, మీ అమ్మ ఏదీ, ఎక్కడున్నది?"

"మా అమ్మా?—ఆమె కూడా జయిలులోనే ఉన్నది. ఆమెతోటే మా చిన్న తమ్ముడు కూడా ఉన్నాడు. వాడు వీడికంటె చిన్నవాడు. ఏడ్వనన్నా ఏడ్వడు" అని అన్నది.

అనాథలు పాపం! అమ్మా, నాయనా జయిలులో ఉన్నారు. వీళ్లు రోడ్డు పట్టుకుని అడుక్కుంటూ తిరుగుతున్నారు, అని అనుకున్నాను.

"మీ అమ్మ ఏమి చేసింది?"

"మా అమ్మ మా నాన్నను పట్టుకొన్న పోలీసును కొట్టింది. అందుకు ఆమెను కూడ పట్టుకువెళ్లి జయిలుకు పంపారు. పోలీసులు మంచి వాళ్లుకారు తల్లీ. మా అమ్మ లేక పోవడంచేత మాకు ఏమీ తోచడంలేదు. ఏమో భయంగా ఉంటుంది. వీడు రాత్రిళ్లు అమ్మకోసం ఏడుస్తూ

ఉంటాడు" అని తమ్ముణ్ణి చూపుతూ కళ్లనీళ్లు పెట్టుకున్నది పెద్ద పిల్ల.

నేను వాళ్ల తమ్ముడివంక చూచాను. పాపం చాల చిన్నవాడు. అయిదేళ్లు ఉంటవో ఉండవో. చింపిరిచొక్కాలు తొడుక్కున్నాడు. తలకు నూనె వ్రాసిన పాపాన పోలేదు. చింపిరి బుట్టలాగుంది జుత్తు. ఎప్పుడు నీళ్లు పోసుకున్నారో పాపం, వంటినిండా మట్టి పేరుకు పోయింది. ఏడ్చినప్పుడు కన్నులవెంట కారిన కన్నీరు చారికలు కట్టినవి. వాడిమీద జాలివేసింది. నేను—"జయిలులో ఉన్న మీ అమ్మను ఎప్పుడైనా చూచి వచ్చారా ?"అని అడిగాను.

"వెళ్లుతూనే ఉంటాము తల్లీ" అని చిన్నపిల్ల తడుముకోకుండా జవాబు చెప్పింది.

"మూడు నెలల కొకసారి చూడనిస్తారు తల్లీ. మొదటిసారి చూచి వచ్చాం. మూడు నెలల తర్వాత రెండోసారి వెళ్లినప్పుడు మా అమ్మను యిక్కడ జయిలుకు మార్చారట తల్లీ. అక్కడనుంచి తిరుగుతూ తిరుగుతూ లక్ష్మితో యిక్కడికి వచ్చాము. లక్ష్మికూడా మాకు మల్లేనే బిచ్చమెత్తుకుంటూ ఉంటుంది" అని పెద్దపిల్ల చెప్పింది.

"మీరందరూ రాత్రిళ్లు ఎక్కడ ఉంటున్నారు? ఎక్కడ నిద్ర పోతున్నారు? మీకు భయం వెయ్యదూ ?" అని అడిగాను.

"జయిలుకు ప్రక్కనే ఒక కాలువ ఉన్నది. మేమంతా రాత్రిళ్లు ఆ కాలువ వంతెనక్రింద మాటలు చెప్పుకుంటూ పడుకుంటాము. అప్పుడప్పుడూ లక్ష్మి కూడా వస్తూ ఉంటుంది" అని చెప్పింది పెద్దపిల్ల.

"మీ అమ్మకు ఎన్నాళ్లు శిక్షవేశారు ?"

"రెండేళ్లు. మేము ప్రతిరోజూ జయిలును చూస్తూనే ఉంటాము. మా అమ్మ అక్కడే ఉన్నది. మా అమ్మను వదిలిపెట్టగానే మా వూరుతీసుకు పోతాం" అని పెద్దపిల్ల ఉత్సాహంతో అన్నది.

ఆ పిల్ల ఆనందం చూస్తేవాళ్ల అమ్మను నిజంగా వెంటబెట్టుకుని వాళ్లవూరికి పోతున్నదానివలే ఉంది.

"మీరు స్నానం చేస్తూ ఉంటారా ?"

పెద్దపిల్ల సంకోచం, సిగ్గుతో ఊరుకున్నది. చిన్నపిల్ల—"మాకు మారు బట్టలు లేవుగా" అన్నది.

నేను సైగ చేయగానే పిల్లలందరూ తమ పాతబట్టలలో నుంచి గబగబా బట్టలు పట్టుకువచ్చి వాళ్లకు దానం చేశారు.

నా మనస్సు ఎందుకో విచారంగా ఉంది. గదిలో ఆలోచిస్తూ కూర్చున్నా. ఆ ముగ్గురు పిల్లలు బట్టలు తీసుకుని సంతోషంగా వెళ్లిపోయారు.

కొంత సేపయిన తర్వాత పాట వినిపించింది.

అది చాల మంచిపాట. చెవులు నిక్కబెట్టి విందామనిపించింది. కాని నేనూ చాలా మంచి మంచి పాటలు, పద్యాలు చదివాను. వ్రాశాను. విన్నాను. అయినా ఇంత ముగ్ధులనుజేసి, ఆత్మలనుయ్యాలలూపేపాట ఎన్నడూ వినలేదు. ఆ విషయం, శబ్దసంయోగం అన్నీ మంత్ర ముగ్ధులను చేసివేస్తున్నవి.

ఆ ముగ్గురు పిల్లలను మళ్లీ పిలిచి పాటపాడించుదామనే తలంపుతో త్వరత్వరగా పరుగెత్తుకొని వాకిట్లోకి వచ్చాను. అప్పటికే వాళ్లు కేకకందని దూరం వెళ్లిపోయారు.

(సశేషము)



# కవితా చరిత

* శ్రీమతి తనికెళ్ల సన్నాసమ్మ *

నేరాస్తానొక చరిత
నేచేస్తానొక కవిత—

నాచరిత్ర కాధారం
పురాకోట ప్రాకారం!—

నాకవితకు ఆయుధం
ఏటితటి సౌందర్య సౌధం!—

నేరాస్తానొక చరిత
నేచేస్తానొక కవిత—

నాచరితకు సహాయకులు
రాడ్భట కోటి అమాయకులు!—

నాకవితకు దివ్య కావ్యవాణి
విజయవాడ కృష్ణవేణి!—

నేరాస్తానొక చరిత
నేరాస్తానొక కవిత

నాచరితకు గొప్పత్రాణ
నెల్లూరులో నెరజాణ!—

నాకవితకు గొప్పశక్తి
తెనాలిరామ కాళిశక్తి

నేచేస్తానొక కవిత
నేరాస్తానొక చరిత!—



# కీ. శే. శ్రీమతి రుక్మిణి లక్ష్మీపతిగార్కి జోహార్లు

(16వ పేజీ తరువాయి)

గృహానికి వెళ్లవలసి వచ్చింది. తమిళనాడు కాంగ్రెస్ కమిటీలో ఉపాధ్యక్షురాలు. 1937వ సం॥ నుండి 1939 వరకు మద్రాసులోని స్త్రీల తరఫున శాసనసభా సభ్యురాలుగా విజయం పొంది, డిప్యూటీ స్పీకరుగా ఎన్నుకోబడ్డారు. 1937వ సం॥ పండిత జవహర్‌లాల్ అధ్యక్షత క్రింద సమావేశమైన భారత జాతీయ కాంగ్రెస్ కార్య నిర్వాహక సంఘంలో సభ్యురాలుగా ఉన్నారు. 1939వ సం॥ జపాన్, చైనా, సిలోన్ దేశాలలో విద్యా విధానాన్ని గమనించటానికి వెళ్లారు. పిదప 1946వ సం॥ శ్రీ ప్రకాశం పంతులుగారు మద్రాసు రాష్ట్ర ప్రధానిగా వచ్చినప్పుడు ఈమె ఆరోగ్య శాఖా మంత్రిణిగా పదవిని స్వీకరించారు. మంత్రిణిగా వీరు ఆయుర్వేద వైద్యానికి ఎంతో ప్రోత్సాహమిచ్చారు. 1946వ సం॥లో ఢిల్లీలో జరిగిన ఆరోగ్యశాఖా మంత్రుల సభలో పాల్గొన్నారు. ఇట్లు అనేక రంగాలలో, అనేక మహాసభలలో పాల్గొని స్త్రీజాతిలో ఒక మహోన్నత పదవిని స్వీకరించి, స్త్రీ జనోద్ధారణకై అనేకవిధాల పాటుపడినారు.

ఆమె మంత్రిణి అయినప్పుడు మా ఆంధ్ర మహిళ ప్రత్యేక విలేఖరితో ఈ వాక్యాలు అన్నారట.

"నన్ను మంత్రిణిగా చెయ్యటం నాకు కాదు గౌరవం, మహిళా లోకానికి; నేను వారి సేవకురాలిని మాత్రమే. అదే నా వాంఛ, అదే నా ఆశయం," అని. తన జీవిత ప్రారంభంనుంచి చివరి వరకు ఏదో ఒక విధంగా ఉన్నత స్థానంలోనే ఉండి, ఆ ఆ రంగాలలో తన కర్తవ్యాన్ని నిర్వహించారు.

అట్టి వీరు ఆగస్టు 6వ తేదీన పరమపదించారు. కాని వీరి సేవలు మాత్రం మనకు ఆదర్శాలు. ప్రతి స్త్రీ ఆమెను ఆదర్శంగా పెట్టుకొని తమ కార్యక్రమాలలో ప్రవేశిస్తే దేశానికి స్త్రీ జాతి ఎంతో మహోపకారం చేసినవారౌతారు.



# కీ. శే. శ్రీమతి వింజమూరి వెంకటరత్నమ్మగారు

ఒక నెల లోపలగానే ఆంధ్రవనితా లోకము మరియొక నారీ రత్నాన్ని కోల్పోయింది. యీమె శ్రీమతి వింజమూరి వెంకటరత్నమ్మగారు. శ్రీమతి ఆచంట రుక్మిణమ్మగారి సమకాలికులు. కళాశాల విద్యనభ్యసించి, డిగ్రీలు బడయక పోయినా, ఆ కాలమునందు అభ్యుదయ సమితులు నిర్ణయించిన విజ్ఞాన చంద్రికా పరీక్షలలో కృతార్థురాలై, విద్యా సంస్కృతుల నలవరచు కొన్నారు.

ప్రఖ్యాత విద్వత్కుటుంబీకులు శ్రీ దేవులపల్లి తమ్మన్న శాస్త్రిగారి కుమార్తె. ఆధునిక కవులు శ్రీ దేవులపల్లి కృష్ణ శాస్త్రిగారి సోదరి. శ్రీ వింజమూరి లక్ష్మీ నరసింహారావు గారి సతీమణి.

కాకినాడలోని స్త్రీ సమాజము, స్త్రీ ప్రార్థనా సమాజము, ఘోషా స్కూలు మున్నగు సంస్థలలో సభ్యురాలుగా నుండేవారు. స్త్రీ విద్య వెనుకబడియున్న ఆకాలములో స్త్రీ జనాభ్యుదయానికై పాటుపడినారు. ఆమె పుత్రికలైన శ్రీమతులు అనసూయ సీతలకు బి. ఏ., వరకు చదువు చెప్పించి యున్నారు.

రమారమి 35 సం॥ క్రితం—అనగా, 1914—15 ప్రాంతాలలో, స్త్రీలకు పత్రికంటూ లేని సందర్భాలలో "అనసూయ" అనే స్త్రీల పత్రికకు సంపాదకులుగా నుండి, చక్కగా నడిపించినారు. శ్రీ వెంకట పార్వతీశ్వర కవులు, ఇంకా ఆనాటి ప్రసిద్ధకవులు, విదుషీమణులు తమ రచనలనందు ప్రచురించేవారు కారణాంతరాలవల్ల, స్థాపించిన పత్రిక చిరంజీవి కాలేకపోయినా, ప్రథమ స్త్రీ పత్రికా స్థాపకులుగాను, స్త్రీ సంపాదకురాలుగాను, శ్రీమతి వెంకట రత్నమ్మగారు ప్రశంసా పాత్రులు.

తదుపరి తమ్మునితోపాటు ఈమె సాహితీసమితి సభ్యురాలుగా చేరిరి.

ఈ విషయాలలో ఒక మార్గదర్శిగా స్త్రీ లోకం మీమె నెప్పటికీ మరువజాలదు. వీరి కుటుంబమునకు మా సానుభూతిని తెలియచేస్తూ, వీరి ఆత్మశాంతికై భగవంతుని స్మరిస్తున్నాము.

—ఆంధ్ర మహిళ



# "మహాసౌధం మూల్గింది"

*** శ్రీమతి శశిరేఖ ***

ఒకానొక మహా శిల్పి. శిల్పాచార్యుల గురుదేవుడు. 'మయునికి శిల్పం వచ్చా' అన్న చాతుర్యంతో ఒక మహా సౌధం నిర్మించాడు. ఆ సౌధం చూచిన విజ్ఞులు శిల్పి మానవ మాత్రుడే కాడని—అతడు జనన మొందిననాడు విశిష్టమైన గ్రహాలక్షణాలు పెడగట్టుకున్న ఒక కారణ జన్ముడని రూఢిగా అంటారు.

అతడు సౌధ నిర్మాణానికి కఠిన పాషాణాలు, కర్రలు, వులి, సమ్మెటలుకాని, మరకత మాణిక్యాలుగాని కోరనే లేదు. ఏవత్ప్రజానీకం యొక్క ఆత్మ శక్తితో మాత్రు దేశార్చన చేసే మహాత్ముల నులివెచ్చటి రక్తపు నీటితో నిర్మాణం చేసేడు. ఆ యీ భవన నిర్మాణానికి పూనుకొనే ముందు దేశమేలే రాజు అనుజ్ఞ కోరనే లేదు. అతడి దృష్టిలో రాజు అనుజ్ఞ అనవసర మైంది. ఈ మహాశిల్పి నిర్మించిన భవనం రాజ నివాసానికి కాదు. మహారాజుల కామసంగ్రామ రంగస్థలం చేయడానికి కాదు. సాధారణ ప్రజ అందులోనుండి ఆనంద తరంగాలలో ఉఱ్ఱూత లూగడానికి.

ఆ, యీ, నిశ్చయం రాజనీతి తిరస్కారం క్రింద పరిగణించబడ్డది. రాజదండన ఆవెన్కనే కల్గింది. ఓర్పులో శిల్పి మేరువుకన్న మిన్న. దండనకోర్చి భవన నిర్మాణం పూర్తి జేసేడు.

భువనంలో వున్న మహోన్నత భవనాల్లోకల్ల ఉన్నత మాభవనం. జగజ్జేగీయమానంగా ధగ ధగా మెరిసే రతనాల దీపాలు పెట్టాడందులో. నవరస భరితమైన ఫల రసాదులు షడ్రసోపేతమైన భోజనాలు వుంచి—అక్షయ విభూతి చల్లి 'అనుభవించండి' అని ఆర్తులపాలిటి పెన్నిధియై, బీదలపాలిటి పాలవెల్లియై, ఆ మహా సౌధాన్ని వారికే విడిచి తాను తారా మండలాన్నుంచి తొంగిమాస్తూ నిలబడ్డాడు.

ఆనందంతో మత్తెక్కిన ప్రజ ఒక్కుమ్మడిని జొర బడ్డా రాసౌధంలో. అందులో జ్ఞాన హీనులు, విజ్ఞాన హీనులు, మూఢులు కూడా జొరబడ్డారు.

పొట్టనిండిన పిదప ఫలరసాదులు కల్పించిన కైపులో యీ మూఢులికి సౌధాంతరపు సౌకర్యాలు కోతికి దొరికిన కొబ్బరికాయలాగు, మోటు మనిషికి దొరికిన మల్లె పూవు లాగు అయాయి.

అక్షయ విభూతి క్షయమై పోయింది. చీనీ చీనాంబ రాలు క్షీణమై పోయాయి. దేవేంద్రభోగ మదృశ్యమై దరిద్రదేవత కాలవాల మైంది. దుష్టులు, దౌర్భాగ్యులు, దేశాభిమాన మణి ఖచిత కుడ్యాల్ని త్రవ్వేరు.

చిక్కటి...ఎఱ్ఱటి...నులివెచ్చటిరక్తం యేరువై పాఱింది. అప్పుడే....అప్పట్నుంచి....ఇప్పుడు ఆ "మహా సౌధం మూల్గింది."



# స్మారక సభ

ఆగస్టు 8వ తేదీ బుధవారం సాయంత్రం 6 గంటలకు ఆంధ్ర మహిళా సభలో స్వర్గీయ శ్రీమతి ఆచంట రుక్మిణీ లక్ష్మీపతిగారి స్మారక సభ జరిగినది. అధ్యక్షులు శ్రీయుతులు టంగుటూరి ప్రకాశం పంతులుగారు, శ్రీమతి రుక్మిణమ్మగారి సేవను, కార్యసాను కూలత పట్లగల నిర్భీతిని, పట్టుదలను, చక్కగా వివరించిరి. బేగం అమీరుద్దీనుగారు "శ్రీమతి రుక్మిణమ్మగారు మొదటినుంచి అఖిల భారత మహిళా సంఘంలో ఎంతో ఆసక్తి తీసుకుని మహిళాభ్యుదయానికి పనిచేశారు. మొదటి మంత్రిణిగా వుండి సామర్థ్యంతో పని నిర్వహించి స్త్రీలకు గౌరవం సంపాదించారు. వారు యింకా యెంతోకాలం బ్రతికివుండవచ్చు. కాని దైవేచ్ఛవేరుగా వున్నది. ఆమె సేవ స్మరణీయము" అని అన్నారు.

"ప్రఖ్యాత నారీరత్నము, దేశసేవా పరాయణి, స్వార్థత్యాగి, మాజీమంత్రిణి అయిన శ్రీమతి ఆచంట రుక్మిణీ లక్ష్మీపతిగారి మరణమునకు యీ సభవారు సంతాపమును తెలియ పరచుచున్నారు. మహిళల తరఫున వారుచేసిన అపార దేశసేవను గౌరవపూర్వకముగ సంస్మరిస్తు వారి ఆత్మశాంతికి ప్రార్థించుచున్నారు. వారి కుటుంబమునకు తమ సానుభూతిని తెలియ పరచుచున్నారు!" అను తీర్మానమును చదివి సభికులు ఒక నిమిషము నిశ్శబ్దముగ నిల్చొనిరి.

శ్రీమతి డాక్టరు ముత్తులక్ష్మి రెడ్డిగారు తమ బహుకాల పరిచయాన్ని పురస్కరించుకుని శ్రీమతి రుక్మిణమ్మగారి బహు ముఖ కృషిని వివరిస్తూ వ్రాసి పంపిన సందేశము చదువబడ్డది.

శ్రీమతి అమ్మన్న రాజాగారు "దేశ సేవకులు, సంఘ సేవకులు కూడ మామూలు వ్యక్తుల్లాగే అకాలంగా చని పోవటం ఎంతో విచార కరమైన విషయం. శ్రీమతి రుక్మిణీ లక్ష్మీపతిగారు బాహాటంగా బహిరంగ సభల్లో నిల్చి గంటల కొద్దీ వుపన్యసించక పోయినా వారు నిశ్శబ్దంగా దేశానికి మహిళలకు చాలా సేవచేశారు. ఆరోగ్యం బాగా లేకపోయినా పట్టుదలతో ఆఖరు వరకు శాసన సభల్లో పాల్గొంటూ ఆసక్తి చూపించేవారు. మరికొంతకాలం బ్రతికివుంటే యింకా కొంత సేవచేసి వుండేవారని నిస్సందేహంగా చెప్పవచ్చు"నని అన్నారు.

శ్రీమతి బి. కామేశ్వరమ్మగారు తమ చిరపరిచితులు గురుతుల్యులు అయిన శ్రీమతి రుక్మిణీ లక్ష్మీపతిగారి, ఆశయాలను ఆదర్శాలను, అనుసరయోగ్యమైన అలవాట్లను విపులంగా చెప్తూ, వారి నిరాడంబరత, కార్యదీక్షలను పేర్కొన్నారు. శ్రీమతి రుక్మిణమ్మగారు ఒకేమాటమీద నిలబడి యెటువంటి పరిస్థితులనైన ఎదుర్కొనగల స్థైర్యము గలవారిని సేవా తత్పరుల కది చాల ముఖ్యమని అన్నారు. శ్రీమతి రుక్మిణమ్మగారి సేవా సంస్మరణతో సభ ముగిసింది.

(12వ పేజీ తరువాయి)

ఆసలు మన పేరే చెప్పదామావద్దా అని వోటు నిచ్చే మహిళలూ, వీళ్లను వోటర్ల జాబితాలో చేరుద్దామా వద్దా అని దేశ నాయకులు తీవ్రంగా ఆలోచిస్తువున్న సమయంలో శ్రీమతి కామేశ్వరమ్మగారు మరొక చిక్కు తెచ్చి పెట్టారు. శాసన సభల్లో స్త్రీ సభ్యుల సంఖ్య చాలా తక్కువగా వుంటున్నదని, తగినంత మంది ఎలక్షన్లలో అభ్యర్థినులుగా నిల్చి శాసన సభల్లో స్త్రీలకు వుండవలసిన ప్రాతినిధ్యం నిల్పుకోవాలని మందలిస్తున్నారు. ఇవన్నీ చేరి మహిళల్లో ఎటువంటి చురుకును పరివర్తనను కలిగించేది గమనించతగ్గ విషయమే.



# వినోదా వారి
# 'స్త్రీ సాహసం'

రచన :
సముద్రాల

డైరక్షన్, నృత్యం :
వేదాంతం రాఘవయ్య

ఫొటోగ్రఫీ :
బి. ఎస్. రంగా

నటీనటులు :
అంజలీదేవి, సూర్యప్రభ, గిరిజ, రేలంగి, నాగేశ్వరరావు, సి. యస్. ఆర్., శివరావు మొదలయినవారు.

వినోదావారి 'స్త్రీ సాహసం' మద్రాసులో ప్రీవ్యూ జరిగి కొత్తగా విడుదలయిన జానపద చిత్రం. మనోహరి అనే ఒక రాజకన్య రాజా అనే ఒక యువరాజును ప్రేమించుతుంది. ఎట్లాగయినా పెళ్లి తప్పించుకోవాలని యువరాజు తన కాబోయే భార్య అత్తవారి సొమ్ము పుట్టింటి సొమ్ము పడకుండ, శీలం చెడకుండ, మాణిక్య భవనం కట్టించాలని, పాతివ్రత్యం చెడకుండ తనకు తెలియకుండ సంతానవతి కావాలని, తాను ప్రేమించే స్త్రీని యిచ్చి పెళ్లి చేయాలని మూడు షరతులు పెడతాడు. అతనినే పెళ్లి చేసుకో నిశ్చయించుకున్న మనోహరి యీ షరతులకు ఒప్పుకుని పెళ్లి చేసుకుంటుంది. యువరాజు యిల్లువదలి పరారి అవుతాడు. తన షరతులను పూర్తి చేసుకుని అతని అనురాగం సంపాదించటానికి మనోహరి కూడ అతనికి తెలియకుండ యిల్లువదలి వెళ్తుంది. ఆమె ధైర్యసాహసాలతో తన షరతులను పూర్తి చేసుకోవటమే మిగతా కథ. చివరకు భర్త ఆదరం, అందరి మన్నన పొందుతుంది. అందువల్ల యీ చిత్రానికి యీ పేరు బాగా తగి వున్నది.

మామూలుగా చిత్రాలలో మొదట చాలా సుఖంగా వుండటం, మధ్యలో అనుకోని కష్టాలు బాధలు రావటం, చివరకు మళ్లీ సుఖంగా వుండటం జరుగుతాయ్, కాని యీ కథలో అట్లావుండక కొత్తదనం కనిపిస్తుంది. మనోహరి తెలిసి స్వయంగా కష్టాలలోకి దిగుతుంది. అప్పుడయినా వాటిని కష్టాలుగా బాధలుగా యెంచి బాధపడదు. కేవలం భర్త అనురాగం సంపాదించాలన్న పట్టుదలతో షరతులు నెరవేర్చటానికి సాహసంతో గంపెడు ఆశతో పూనుకుంటుంది. భూకంపాలు, వరదలు, ప్రళయాలు, పతివ్రత బాధలతో విసుగెత్తిన ప్రజలకు, మనోనిబ్బరంతో సామర్థ్యంతో ఆత్మ విశ్వాసంతో కృషికి పూనుకున్న మనోహరి చాలా తృప్తి కలిగిస్తుంది. కథలో కొత్తదనం, పటుత్వం, వుండటమే కాక యీ చిత్రంలో పాత్ర పోషణకు ప్రాధాన్యత యిచ్చారు. ముఖ్యంగా జనపద చిత్రాలలో కథకు కాళ్లు, ముంతకు చెవులు అన్న ధోరణిలో పాత్రలకు వారి వ్యక్తిత్వానికి స్థానమివ్వకుండ వింతలు విడ్డూరాలతో కథలల్లుతారు. అందుచేత యీ చిత్రంలో చేసిన పాత్రపోషణ ఒక శుభ సూచనగానే పరిగణించాలి.

మనోహరి పాడుపడ్డ గుడికి వెళ్లి సంజీవిమందు కోసం పుట్టి తాళ్లను నరికేఘట్టం చిత్రమంతటిలోకి ఆయువుపట్టుగా నిలుస్తుంది. బీదలపాట్లు చిత్రంలో మురుగునీటి దృశ్యాన్ని జ్ఞాపకానికి తెస్తుంది. సూదిపడితే వినిపించేటంత నిశ్శబ్దంగా వుంటుంది ఆ ప్రదేశం. తాచుపాములు, శిధిలాలు, కంచెలు తప్ప ఏమీ కనిపించవు. వాటి మధ్య మనోహరి కేవలం పట్టుదలతో వుడిగిపోతున్న శరీరబలాన్నికూడ తీసుకుంటూ వుట్టిని సమీపిస్తుంది. ఈ ఘట్టంలో అంజలీదేవి ముఖంలో భావ ప్రకటన చాలా అద్భుతంగా వున్నది. ప్రేక్షకులకు వూపిరిబిగబట్టి చూడక తప్పదు. ఇటువంటి బిగువైన సన్నివేశాలు భావ ప్రధానమైన గంభీరఘట్టాలు తప్పని సరిగా చిత్రంలో సమకూర్చ కలిగితే ఆ చిత్రం తప్పక రాణిస్తుంది. నిర్మాతలు యిది గుర్తుంచుకోతగ్గ విషయం.

శబ్దం, కళ, అలంకరణ, సెట్టింగులు బాగానే వున్నయ్. మామూలుగా/జానపద చిత్రాలలో కనిపించే మానవాతీత

శక్తులు, దేవుళ్లు, మచ్చుమందులు, మాయలు, యివేవీ యిందులో వుండవు. మితిమించిన పాటలు, వెకిలిగావుండే నృత్యాలు, ఊహాలోకాలు, కలలు ఏమి వుండవు. అందువల్ల కథ, సన్నివేశాలు వీలయినంత సూటిగా సమయానుకూలంగా వున్నయ్. పాటల్లో జోలపాట చాలా శ్రావ్యంగా వున్నది. భాషలో యింకా కొంత వ్యంగ్యం, వెకిలితనం, చవకతనం కనిపిస్తయ్. వాటిని సరిదిద్ది నందువల్ల చిత్రం ఎంత మాత్రం దెబ్బతినదు. అమ్మన్న పాత్ర ద్వారా మితిమీరిన వెకిలిహాస్యం, అసభ్యపు మాటలు లాల్లిపాటలు ప్రవేశపెట్టారు. అంతనిమించి ఆ పాత్రలో కథకు వేరే సంబంధమేమి కనిపించదు.

నటన విషయంలో పక్షీరాజ్యపు రాజుగా నటించిన రేలంగికి అగ్రతాంబూలం వస్తుంది. ఆ పాత్రను అంత సామర్థ్యంతో అంత సజీవంగా యింకెవరు నటించలేరు. తర్వాత సూర్యప్రభ నటన చెప్ప తగివున్నది. నైపుణ్యం చూపించటానికి ఆమెకు తగిన అవకాశం యీ చిత్రంలో కలిగింది. అంజలీదేవి మామూలు పద్ధతిలో నృత్యాలు చేయక పోయినాగాని యీ చిత్రంలోనే బాగున్నది. గిరిజ నటన చెప్పతగిలేదు. నాగేశ్వరరావుకు నాయక పాత్రకు కావలసిన ఉదాత్తత, గాంభీర్యము కనిపించవు. అతని నటన అతని పూర్వపు పద్ధతిలోనేవున్నది. సి. యస్. ఆర్. నటన బాగున్నది. అటువంటి పాత్రలు బాగా వొప్పించ గలడు. సరిఅయిన విధాన పోషించని అనవసరపు పాత్రను ధరించి శివరావు తన శక్తిని వృధా చేసుకున్నాడు.

ఇట్లా సవరించగలిగిన చిన్నచిన్న దోషాలు వున్నా స్త్రీ సాహసం మంచి జానపద చిత్రమనే అనాలి. చెత్తను కత్తిరించితే యింకా రాణించేది.

—అ. గిరిజ.






## శ్రీ వివేకానంద జీవిత చరిత్ర:

రచయిత: శ్రీ చిరంతనానందస్వామి.
వలయుచోటు: శ్రీరామ కృష్ణమఠము,
మైలాపూరు, మద్రాసు.
వెల: మూడు రూపాయిలు.

హిందూ దేశ ప్రభావమును పాశ్చాత్య దేశములందు ప్రచారము చేసిన మహాత్ముడు శ్రీ వివేకానందస్వామి. చికాగోలో జరిగిన అఖిల ప్రపంచ మత మహా సభలో హిందూ మతాంశములను గంభీరముగా ఉపన్యసించి, దూరప్రాచ్యములో హిందువుల దొక ఉన్నత మతమని పాశ్చాత్యదేశీయుల కెరింగించిన మహా మేధావి.

శ్రీ వివేకానందులు మహావక్త. గొప్ప వేదాంతి. కార్యశూరుడు. ఎన్ని ఇక్కట్లు కలిగినను అస్ఖలిత శాంతియుత మనస్కుడై, చిద్విలాసముతో తన ప్రచారాన్ని సాగించి కృతకృత్యుడైన మహనీయుడు. ఈ మానవాతీత వ్యక్తిత్వమునే ప్రపంచ మెల్ల చోట్లను ఆయనకు మిత్రులను, శిష్యులను కలుగ జేసింది.

హిందూ మత ప్రచారకుడై, వేదాంత ధోరణిలో శ్రీ స్వామి తన దేశ ప్రజల ఆకలి మంటలు మరచి పోయెనను కొనుట గొప్ప పొరపాటు. "నాదేశమున నొక కుక్కయైనను పస్తుపడి యున్నంతవరకు దాని కాహారమిడి రక్షించుటయే నా పరమ ధర్మము. ఇదియే నామతము. తద్భిన్న మంతయు నధర్మము. కృత్రిమ ధర్మము" అని చాటించి శ్రీ వివేకానందులు పీడిత ప్రజల కొకమార్గ దర్శకు డాయెను.

అట్టి మహాత్ముని జీవిత చరిత్ర తెలిసికొనుటావశ్యకము.

తెలుగులో ఇంతవరకు శ్రీ వివేకానందుని జీవితమును గూర్చి సంగ్రహముగా తెలియజేయు గ్రంథములేదు. శ్రీ చిరంతనానంద స్వాములవారు, "శ్రీ వివేకానంద జీవిత చరిత్ర" వ్రాసి మనకా కొరతను తీర్చారు.

ఈ పుస్తకము ఆఱవకూర్పు. ఇది మద్రాసు, ఆంధ్ర, అన్నామలై విశ్వవిద్యాలయముల "ఇంటర్మీడియేట్" నకు ఉపపాఠ్య గ్రంథముగా ఇది వరలో నియమింపబడినది.

వీరేశ్వరాంశ సంభూతుడగుటవలన తల్లి భువనేశ్వరీదేవి ఇష్ట ప్రకారము జననకాలమున శ్రీ వివేకానందులకు "వీరేశ్వరుడని" పేరు పెట్టిరి. తరువాత "నరేంద్రనాథ్" అని నామాంతరము బడసెను. తదుపరి శ్రీ రామకృష్ణ శిష్యత్వముచే జ్ఞానోదయము నొంది, "నరేంద్రుడు" శ్రీ వివేకానంద స్వామి యాయెను.

ఇవ్విధముగా, శ్రీ వివేకానందుల బాల్యదశ, విద్యాలయ జీవితము, శ్రీ రామకృష్ణులవద్ద శిష్యత్వము, తదుపరి చేసిన వివిధ దేశ పర్యటనలు, శిష్యులకు చేసిన ఉపదేశములు— అన్నియు సవిస్తరముగా శ్రీ చిరంతనానందస్వాములవారి గ్రంథములో వ్రాయబడినవి.

"శ్రీ వివేకానంద జీవితచరిత్ర" రచనాశైలి చాలా మనోరంజకముగా ఉంది. విషయ రచన ఉత్కృష్టము. చదువుట ఆరంభించిన నడక చక్కగా పోతుంది. ముందుముందు ప్రకరణాలలో ఏమివ్రాశారో అని కుతూహలంకలుగుతుంది. పుస్తకం చదువుతూంటే, ఈ పుస్తకంలోని 425 పుటలు ఒక్కసారిగా చదివేసేవరకూ నిలిపివేయాలనిపించదు.

## గ్రంథ సమీక్ష

శ్రీ చిరంతనానందస్వామి ఈ పుస్తకంలో తగినంత పాదదీపికలు జేర్చి రమ్యంగా రచించారు. వారెంతయో అభివందనీయులు. ఈ గ్రంథము అందరి గృహములయందు నుండవలసినది.

పుస్తకములో అచ్చుకూడా చాలా ఒప్పుగానుంది. వెల గ్రంథ విషయాలకు తగినట్లుంది.

*  *  *

## స్త్రీ హితైషిణీ మండలి, బాపట్ల

పై మండలి యిరువదియవ వార్షికనివేదిక మా కార్యాలయమును జేరినది. ఇందు 30-7-51 న జరిగిన వార్షిక సభ, నూతన కార్యవర్గ సభ్యురాండ్ర పేర్లు, చందా వివరములు, సంవత్సరాదాయ వ్యయపట్టిక, గ్రంథాలయము, చికిత్సాలయము, నాట్య సంగీత తరగతులు, వ్యాయామక్రీడలు, సభలు, సమావేశాలు, మున్నగు వానిని గూర్చి వివరింపబడ్డది. అన్ని విధాలా మండలి అభివృద్ధి పంథాలో పోవుచుండుట సంతోష విషయము. ఇందలి వివాద విషయములో సభ్యురాలగు కర్లపూడి కమలాదేవిగారికి, నిర్వాహక వర్గానికి జరిగిన తగాదాకు అంత ప్రాముఖ్యతినిచ్చి మూడు పేజీలకు పైగా వివరించుట అనవసరమే మో !

—గి. లక్ష్మీ కాంతమ్మ.

## ఎన్నికలు, స్త్రీలు

వచ్చే యెన్నికలలో రమారమి 8 కోట్లమంది స్త్రీ ఓటర్లు. అయితే, దీనికి సంబంధించిన తగు విద్య లేక యెన్నికలలో వారి బాధ్యత, యింకా పెక్కు మంది స్త్రీలకు బోధపడలేదు. కొన్ని ప్రాంతాలలో స్త్రీ ఓటర్ల పేర్లు లక్షలుగా రిజిష్టర్లనుండి తొలగించవలసి వచ్చింది, వారు తమ పేర్లను సరిగా చెప్పని కారణంవల్ల—ప్రాంతీయ సంఘ మర్యాదల ననుసరించి, ఫలానావారి భార్యననో, లేక ఫలానావారి కుమార్తెననో మాత్రంచెప్పి, వారి నామధేయాన్ని వెలిబుచ్చని కారణంవల్ల బీహారు మొదలగు ప్రదేశాలలో, అధిక సంఖ్యాకంగా స్త్రీలు ఓటర్ల జాబితాల నుండి తొలిగింప బడ్డారు. ఈ కారణంవల్ల, దీనిని గూర్చిన ఉద్బోధ మారుమూలల, కుగ్రామాలలో జరిగేటందుకు స్త్రీ సమాజాలు పూనుకోవాలి.

### ఓటింగ్ జరిగే సందర్భంలో

1. పరదా ఉన్న స్థలాలలో, స్త్రీలకు ప్రత్యేకంగా పోలింగ్ బూత్సు ఏర్పాటు చేయాలని,

2. పరదా అంత కట్టుదిట్టంగాలేని స్థలాలలో, స్త్రీలు, పురుషులు, వేరు వేరుగా ఒకే పోలింగ్ బూత్‌లో ఓటింగ్ జరిపేటట్లు చూడాలని,

3. అసలే పరదాలేని ప్రాంతంలో, ఎటువంటి ప్రత్యేక ఏర్పాట్లు చేయ నవసరము లేదని,

స్థానిక ప్రభుత్వాలకు తెలియ పరచినట్టుగాను, ఛీఫ్ యెలెక్షన్ కమీషనరుగారు ప్రకటించి యున్నారు.

---



# ఆంధ్ర మహిళాసభ

## పారిశ్రామిక విద్యాలయము

చేనేత వస్త్రములు :—80, 60 నంబరు చీరెలు, ధోవతులు, సన్నటి, ముతక నేత తువాళ్లు, దుప్పట్లు, నవారు, సాదా, సార్లగుడ్డలు, ఇక్కడ తయారగుచున్నవి.

ఇకమీద :— వివిధ రంగులలో, నేత, అద్దకపు పనులు ఇక్కడ జరుగును.

ఇంకా :— స్త్రీలకు, పిల్లలకు, వివిధ రకముల దుస్తులు, రకరకముల ఎంబ్రాయిడరీ లేసు అల్లికపనులు ఇక్కడ చేయుచున్నారు.

ఇక్కడ తయారైన సామాన్లు కొనిగాని, మీకు ఇచ్చవచ్చిన నమూనాలలో దుస్తులు పురమాయించిగాని, యీ సంస్థను పోషించండి.

మీ సహకారము అమూల్యమైనది.

మీ రిక్కడ వెచ్చించిన ధనము, బీదయువతుల విద్యనిమిత్తము వినియోగింపబడుచున్నదని మరువకండి.

కరెస్పాండెంటు

ఆంధ్ర మహిళాసభ పారిశ్రామిక శాఖ.

---

# ఆంధ్ర మహిళ

సచిత్ర మాస పత్రిక

సంవత్సర చందా—రూ. 6—0—0 లు.

స్త్రీ రచయితలు ఈ అవకాశమును పురస్కరించుకొని, విజ్ఞానయుతమైన తమ అమూల్య రచనలను పంపించండి.

స్త్రీ విద్యాభిమానులు—స్త్రీల విద్యా సంస్కృతుల అభివృద్ధికై కృషిచేయుచున్న యీ పత్రికను పోషించండి.

సంపాదకురాలు

ఆంధ్ర మహిళ.

Edited and published by G. Durgabai, M.A., B.L., at the Andhra Mahila Sabha, Mylapore, Madras.
Printed by M. Satyanarayana at the H. Prachar Press, 12, Thanikachalam Chetty Road, T'Nagar, Madras.



# ఆంధ్ర మహిళా ప్రెస్

ఆంధ్ర మహిళా సభ వారిచే స్వంతంగా స్థాపించబడినది

## ఆంధ్ర మహిళా ప్రెస్

ఇక్కడ

గ్రంథములు, కరపత్రములు, రసీదులు, ఆహ్వాన పత్రికలు మొదలగునవన్నీ

**తెలుగు, ఇంగ్లీషు భాషలలో ముద్రించబడును**

విద్యార్థినులకు ప్రెస్ పనులు నేర్పటానికి క్లాసులుకూడ ఏర్పాటు చేయబడినవి

మీ అచ్చుపనులు ఆంధ్ర మహిళా ప్రెస్‌లో చేయించితే

సంస్థకు సహాకరించిన వారవుతారు.

ఇతర వివరములకు : ప్రెస్ మేనేజరు, ఫోన్ నం. 86322

14 ద్వారక, మైలాపూరు, మద్రాసు 4.

---

## ఆంధ్రమహిళా సభ

స్త్రీల విద్యా, విజ్ఞాన, సాంస్కృతిక, ఆర్థికోన్నతికై 16 సం॥ పైగా కృషి చేయుచున్న జాతీయ సంస్థ.

ఇందు

| | | |
|---|---|---|
| విద్యాశాఖ | — | ఆంధ్రమహిళ పత్రిక |
| పారిశ్రామిక శాఖ | — | నర్సింగ్ హోమ్ |
| కళాశాఖ | — | ముద్రణశాఖ |

సారస్వత, క్రీడా, గ్రంథాలయ, క్లబ్బు శాఖలు.

సభ్యురాండ్రుగా జేరి యీ సేవాసంస్థను పోషించండి.

—ఆంధ్ర మహిళా సభ

ఆంధ్ర, సీడెడ్, నైజాంలలో
విజయవంతముగ
ప్రదర్శింపబడుచున్నది

దా వారి...

# స్త్రీ సాహసము

....దర్శకత్వం....
వేదాంతం రాఘవయ్య

రచన.. పర్యవేక్షణ.... సముద్రాల.... సంగీతం... సుబ్బరామన్

ఛాయ... బి. యస్. రంగా... కళ... వాలి ఈ. గోడగాంకర్

ర్ణా రిలీజ్

ITA



CH. E. PRASAD

ఆంధ్ర, సీడెడ్, నైజాం
పూర్ణా రిలీజు

మైసూర్
అమృత్ పిక్చర్స్

అనాదినుండీ భారతీయ వస్త్రాలంకరణ నం. 4

# ఠీవి, మర్యాదలతో కూడిన విజయనగరం




ది ఖటావ్ మిల్స్ బైకుల్లా, బొంబాయి, ఆఫీసు : లక్ష్మీ బిల్డింగ్, బలార్డ్ పియర్, బొంబాయి.
బట్టల షాపు : మూల్జీ జేఠా మార్కెట్, గోవింద్ చౌక్, బొంబాయి — 2.

SISTA'S-KM (S) 36A-Telugu.

అక్టోబరు విడుదల!




*Distributors for Andhra, Ceded, Nizam and N. India.*

CHAMRIA TALKIES DISTRIBUTORS VIJAYAWADA—GUNTAKAL—SECUNDRABAD

# నేడే చూడండి!

ఆంధ్రదేశమున కొక సరిక్రొత్త చిత్రము!

నూతన వాతావరణము
నూతన సంప్రదాయము
నూతన నటీనటులు

కె. & కె. ప్రొడక్షన్స్ & తిరుమలై పిక్చర్సు వారి

# జీవితనౌక
తెలుగు

కేరళ ప్రాంతములకు చెందిన
ఒక రసవత్తర సాంఘిక చిత్రము...



విజయవాడ - లక్ష్మి
- సరస్వతి
గుంటూరు - రత్నా
తెనాలి - మినర్వా
మచిలీపట్టణము - జయరాం
ఒంగోలు

రాజమండ్రి - జయా
- శేషమహల్
నెల్లూరు. - చంద్
కర్నూలు - రాయల్
బళ్లారి - రఘువీర్
అనంతపూర్
తాడేపల్లిగూడెం - శ్రీకృష్ణాబాలాజీ

ఆంధ్రదేశమున ముఖ్యకేంద్రములలో ప్రదర్శింపబడుచున్నది!



*Released through* **THE VAUHINI PICTURES LTD.,**

MADRAS....VIJAYAWADA....GUNTAKAL




## మీరు పొదుపుచేసిన సొమ్ము మీ ఐశ్వర్యానికి, దేశాభ్యున్నతికి తోడ్పడునట్లు వినియోగించండి.

**పోస్టు ఆఫీసు సేవింగ్సు బ్యాంకు డిపాజిట్ల** ద్వారా, మీరు పొదుపు చేసుకున్న చిన్న మొత్తాలను సులభంగా సురక్షిత మొనర్చుకోవచ్చును. దీనిలో రు. 200 కుపైన దాటిన మొత్తాలపై సాలుకు 2% వడ్డీ చేర్చబడుతుంది. ఈ వడ్డీపై ఆదాయపు పన్ను ఉండదు. (రు. 200 వరకు 1½%). మీ ప్రత్యేకావసరాలకు కావలసిన సొమ్మును డిపాజిట్లనుండి తీసుకోవచ్చును.

**ఇరవై సంవత్సరాల నేషనల్ సేవింగ్సు సర్టిఫికేట్లు** మీ సొమ్మును 50% వృద్ధి చేస్తాయి. నేడు పెట్టుబడిపెట్టిన ప్రతి రు. 100 రూపాయలూ 12 ఏళ్లలో రు. 150 అవుతుంది. ఇలాగ మీకు 50% వంతున లభించు అదనపు సొమ్ముపై ఆదాయపు పన్ను ఉండదు; మీ మొత్తం రాబడిపై ఆదాయపు పన్ను రేటును నిర్ణయించుటలో ఇది లెక్కించబడదు. అవసరమైనప్పుడు గడువు పూర్తికాక పూర్వమే కొన్ని సులభ షరతుల ప్రకారం సర్టిఫికేట్లను సొమ్ముగా మార్చుకోవచ్చును. ఈ సర్టిఫికేట్లు హెడ్ పోస్టు ఆఫీసులలోను, సబ్ పోస్టు ఆఫీసులలోను లభిస్తాయి.

**పది సంవత్సరాల ట్రెజరీ సేవింగ్సు డిపాజిట్లు:** తమ సొమ్ముపై సాలీనా ఆదాయం పొందదలచినవారికి ఇది సర్వోత్తమమైన పెట్టుబడి పద్ధతి. దీనిపై సాలీనా 3½% చొప్పున వడ్డీని డిపాజిటరుకు చెల్లిస్తారు; లేక ప్రతి సంవత్సరం వారి విలాసానికి పంపుతారు. ఈ వడ్డీపై ఆదాయపు పన్ను లేదు. మీ మొత్తం రాబడిపై ఆదాయపు పన్ను రేటును నిర్ణయించుటలో ఇదికూడా లెక్కించబడదు. ఇప్పుడు రు. 10,000 డిపాజిట్ చేస్తే, మీకు సాలీనా రు. 350 చొప్పున పన్ను బాధలేని ఆదాయం 10 సంవత్సరాలవరకు నిశ్చయంగా లభిస్తుంది. పదేళ్లు గడువుతీరగానే మీ రు. 10,000 మీకు వాపసు చేయబడుతాయి. అవసరమైనచో, ఒక ఏడాది గడిచిన మీదట స్వల్పమైన కొంత డిస్కౌంటు ప్రకారం మీ సొమ్మును మీరు తీసుకోవచ్చును. మీ డిపాజిట్లను బొంబాయి, కలకత్తా, ఢిల్లీ, మద్రాసులలోని రిజర్వు బ్యాంకు ఆఫ్ ఇండియా ఆఫీసులలోను, ఇతర ప్రదేశాలలో ప్రభుత్వ ట్రెజరీ వ్యవహారాలను నిర్వహిస్తున్న ఇంపీరియల్ బ్యాంకు ఆఫ్ ఇండియా బ్రాంచిలలోను చెల్లించవచ్చును.

**ప్రభుత్వ ఋణాలు:** అప్పుడప్పుడు ఈ ఋణాలను ప్రజలనుండి చందాలద్వారా వసూలు చేస్తారు. బాగా పెద్ద మొత్తాలు పెట్టుబడి పెట్టగలవారికి ఇవి సురక్షితమైన మంచి అవకాశం కలిగిస్తాయి.

# ఫలితముగల పని

భారత నేషనల్ సేవింగ్సు కమిషనర్, ఆర్థికమంత్రి కార్యాలయం, [illegible], [illegible] ప్రకటన

మాడర్న్ థియేటర్స్‌వారి

# సర్వాధికారి




T.R. సుందరం

త్వరలో వచ్చుచున్నది

# ఆంధ్రమహిళ

సంపుటి 8 :: అక్టోబరు '51 :: సంచిక 6

ముఖచిత్రం : శారద

చిత్రకారిణి : శ్రీమతి రత్నాల కమలాబాయిగారు



సంపాదకురాలు : శ్రీమతి దుర్గాబాయి, యం. యే., బి. యల్.

సహసంపాదకురాలు : శ్రీమతి చన్నఘంటమ్మ, యం. యే., యల్. టి.

ఆంధ్రమహిళా సభ, మైలాపూర్

సంవత్సర చందా ... ఆరు రూపాయలు




సంపుటి 8 అక్టోబరు 1951 సంచిక 6

# తపః ఫలం

అక్టోబరు 2-వ తేదీ నాటికి ఆంధ్ర రాష్ట్రము అవతరించలేదు సరిగదా, కనీసం దానిని గూర్చిన కేంద్రముయొక్క తుదినిర్ణయమైనా ప్రజానీకానికి సమీపకాలంలో అందగలదన్న ఆశ కూడా సన్నగిలింది. లక్ష్యశుద్ధితో, పవిత్ర అంతఃకరణతో, స్వామి సీతారాంగారు కొనసాగించిన ప్రాయోపవేశ దీక్ష, పెంకిపట్టని, మొండితనమని, అక్రమమైన ఒత్తిడి విధానమని, కఠిన విమర్శకు గురియై, చెవిటివానిముందు శంఖారావమైనది. దీనికి కారణం వివిధ ఆంధ్ర ప్రాంతాల ప్రజలకు నాయకత్వము వహించుచున్నవారిలో, ఒక ఖచ్చితమైన మాట, ఒక సమగ్రమైన విధానము ఒక స్వచ్ఛమైన లక్ష్యం లోపించటమేనని చెప్పటలో అపరాధముండదు. ఎప్పుడో ప్రజలచే ఎన్నుకోబడ్డామన్న కారణముచే, ప్రజాసామాన్యానికి వారిపై ఉన్న విశ్వాసము పూర్ణానుస్వారమైన యీ రోజుల్లో కూడా, ప్రజల నాయకులం మేమంటూ యింతటి ముఖ్య విషయంలో వారు యిచ్చవచ్చిన రీతిని కల్పించుకుంటూ, కేవలం స్వప్రయోజన దృష్టితో గిల్లికజ్జాలు పెంచుకుంటూ, రాష్ట్ర నిర్మాణమును గూర్చి యిచ్చవచ్చిన రీతి తీర్మానములు, అభ్యంతరములూ దినమునకొకటిగా, ప్రధాని కందించటంవల్ల స్వామి సీతారాం, వినోబాభావేలవంటి సత్పురుషుల న్యాయబద్ధ స్వార్థ రహిత అభిప్రాయాలను పరిగణించి, ముక్కోటి ఆంధ్రులకు సంతృప్తిని కలిగించగల స్వంత రాష్ట్రాన్ని నిర్మించలేక పోతున్నాడు పండిట్ నెహ్రూ.

భాషా రాష్ట్ర విభజన మన పూర్వులంతా అంగీకరించినదే. వర్తమానములో తల ఎత్తిన వివాదాంశము కాదిది. దీని సిద్ధికై తపస్సు ప్రారంభించిన విరాగి సీతారాంగారు ఇందువల్ల ప్రోత్సహించే సంకుచితబుద్ధి, వెల్లడించే స్వార్థంగాని లేదు. అందూ వివాదగ్రస్త ప్రాంతాలను ఉత్తమ మధ్యవర్తి నిర్ణయమునకు వదలి, మిగతా ప్రాంతాలతో సత్వరమే ఆంధ్ర రాష్ట్రము నిర్మించమన్న వారి కోర్కె ధర్మబద్ధం కాదని ఎవరూ సాహసించి అనలేరు. మదరాసువంటి ద్విభాషాప్రాంతాలు ఏ ఒక్క భాషవారి సొత్తూ కావు గనుక, యితర ద్విభాషా ప్రాంతములవలెనే అందరి సామాన్య

అనుభవానికై ప్రత్యేక రాష్ట్రాలుగా ఏర్పరచి, ప్రజలందఱికూ న్యాయమూ, తృప్తి కలిగించాలనే వారి సూచనలో అధర్మమూ లేదు.

యింతటి సుళువైన సూత్రాలను స్వామి సీతారాంగారు ప్రసాదించినప్పటికీ, ఆంధ్ర నాయకులలో ఏకాభిప్రాయం లోపించినదనే కారణంవల్ల, ప్రధాని నెహ్రూ సాహసించి ఆంధ్ర ప్రజపట్ల న్యాయము జరుపలేకున్నాడు. అందువల్ల స్వామి సీతారాంగారు ప్రస్తుతం తమ దృష్టిని కేంద్రీకరించవలసినది ప్రజలపైనగాని ప్రజానాయకులపైన గాదని, తమ ప్రాయోపవేశమువల్ల ప్రజాహృదయాల్లో తిరిగి తలమెత్తిన స్వాతంత్ర్య జ్యోతిని పోషించవలసినది శాంతియుతమైన ప్రచారమువల్లగాని, తిరిగి నిరశన వ్రతమువల్లగాదని, ముఖ్యంగా వివాదగ్రస్త ద్విభాషా ప్రాంతాలలో, పల్లెపల్లెలో, వాడవాడలో, జరిగే శాంతియుతమైన సత్ప్రచారమే, వారి తపస్సుకు సరియైన ఫల మొనగూర్చగలదనీ, మా అభిప్రాయాన్ని మనవి చేస్తున్నాము. తపస్సువల్ల సాధించలేని పని లేదంటారు పెద్దలు—ఆత్మశుద్ధిగల స్వామి సీతారాంగారి తపస్సు, నిరశనవ్రత రూపంగాకాక, ప్రచార రూపంగా జరిగిననాడు ఫలము తథ్యమని మా విశ్వాసము.



# కృతజ్ఞత



ఆంధ్ర మహిళా సభవారు అడయారు ప్రాంతంలో నిర్మించనున్న స్త్రీ శిశువుల సంరక్షణశాల, ఉచిత వైద్యశాల నిర్మాణమునకు, యిదివరలోనే మదరాసు ప్రభుత్వం, సుమారు రూ. 40000/- ఖరీదుచేసే, 21 గ్రౌండ్ల స్థలాన్ని విరాళముగా నిచ్చారు. సహృదయుల ధన విరాళములతో యీ స్థలములో భవన నిర్మాణము జరుగుతూ ఉంది.

కేంద్ర ప్రభుత్వపు ఆరోగ్య శాఖవారు ప్రారంభింపనున్న, సంక్షిప్త నర్సుఎయిడ్, మంత్రసాని విద్యలను నేర్పించే ప్రథమ సంస్థను మదరాసులో నిర్మించుటకై ఆంధ్ర మహిళా సభవారికి ప్రోత్సాహకరముగా, రూ. 80000/- బ్లాక్ గ్రాంట్‌గాను, 5 సం॥ పాటు, సంవత్సరమునకు రూ. 15000/- చొప్పున, యీ సంస్థ నిర్వహణ కగు వ్యయము నిమిత్తముగాను, ఇచ్చుటకు కేంద్ర ప్రభుత్వమువారు అంగీకరించినారు.

అంటే, నర్సింగ్ హోమ్‌తో పాటు, నర్సులను తయారుచేయు విద్యాశాలకూడ యిందు నిర్మింపబడును.

సంస్థయొక్క నిర్మాణాత్మక కార్యక్రమమునకు యిన్ని విధాల చేయూత నిచ్చి ప్రోత్సహించి పోషించుచున్న కేంద్ర రాష్ట్ర ప్రభుత్వములకు మా హృదయ పూర్వక కృతజ్ఞత.

జి. దుర్గాబాయి
ఆంధ్ర మహిళా సభ ట్రస్టుబోర్డు కార్యదర్శిని.

# ప్రస్తుత పరిస్థితులు

* "ధరా" *

## 'ముసుగు వేత, పసుపు పూత'

వెనుకటికొక అమాయకపు పెద్ద ముత్తైదువ ఉండేదట—ఆమె వృద్ధ భర్త రోగగ్రస్తుడై ఉండటంవల్ల చుట్టుపక్కల అమ్మలక్కలు, ఆమెకు సహాయం చేయాలనే సదుద్దేశంతో, రోగి దగ్గరకు వెళ్లి చూస్తూ వస్తూ ఉండేవారట. ఒకరి కంటే ముందు మరి యొకరు తాజావార్తలు ప్రకటించే ఉత్సాహంతో, ప్రాణంపోయింది పోయిందని, ఒకమారు, ఉన్నది ఉన్నదని మరి యొక మారు చెప్పటంతో ఊరుకోకుండా, "ఇదెంత ఖర్మమే నీకీరాత" అంటూ ఒకమారు ముసుగు వేసి, "నీ కొచ్చిన ఫరవా ఏమీలేదని" వెంటనే పసుపు పూసి, ఇష్ట మొచ్చిన రీతిని ఆ పిచ్చిముత్తైదును వేపించుకు తిన్నారట—సదుద్దేశంతోనే అనుకోండి.

అలాగే ఉంది ప్రస్తుతం మనరాష్ట్ర ఆహార సమస్య—12 ఔన్సులకు రేషను తగ్గనేతగ్గదు అని అధికార రీత్యా ఒక వార్త వస్తుంది. 16 ఔన్సుల వరకూ రేషను హెచ్చించే సూచనలు ప్రబలంగా ఉన్నాయని ఒక ఉన్నతాధికారి ప్రసంగిస్తారు—కేంద్రం బాకీపడటం వలనో ఇంకెక్కడో అతివృష్టో అనావృష్టివలనో, "అనుకున్నంత ధాన్యపు గింజ రాష్ట్రాని కందకపోవటంవల్ల, రేపటినుండి రేషన్ షాపులలో 9 ఔన్సులు మాత్రమే ఈయబడునని" ఒక సిసలైన తాజా వార్త ఆ మరునాడే ప్రజలకు అశనిపాతంవలె తాకుతుంది. ఈ సంవత్సరానికి ఇక యీ గండం గడచినట్టే అన్నవార్త చెవిని సోకీ సోకకపూర్వం, "రాష్ట్ర ఆహారస్థితి ఆందోళన కలిగిస్తూ ఉంది, రేపటినుండి బియ్యపు రేషను 6 ఔన్సులకు తగ్గింపబడును" అనే దారుణవార్త మొదటి వార్తను దూసి పెట్టూఉంది. ఈ ఆరు ఔన్సుల బియ్యపు గింజలలోనూ, 3 ఔన్సులు వడ్లు, ఇసుక, రాళ్లు, నూకలు వగైరాలతో సమ్మిళితమైన పచ్చి బియ్యం, మరి 3 ఔన్సులు మగ్గిపోయి నలుపెక్కిన ఉప్పుడు బియ్యముతో ప్రజలు నానా అవస్తలూ పడ్తూ ఉంటే, యీ కారణాలవల్ల ఆహారస్థితి విషమిస్తూ ఉన్నదని రాష్ట్ర మంత్రిగారంటూ ఉంటే, మదరాసు రాష్ట్రానికి ఇంతటితో కొరత తీరిపోయిందని కేంద్ర మంత్రిగారు ఉద్ఘాటిస్తారు—చెప్పేవాడికి సిగ్గు లేకపోతే వినేవాడికైనా ఉండాలంటారు అందుకే మన పెద్దలు!!

అదేమంటే, అందరూ చేపలు తినటం అలవాటు చేసుకోవాలని మున్షీగారు సలహా చెప్తారు—అసలాయనకు బియ్యమే అక్కఱలేదు. ఏ కొంచెమో కావలసి వచ్చినా ఆ వారడ ఇంకో రుచియైన కేకులు, ఖరీదైన పండ్లు వగైరాలు—ఇలాడబ్బు పారవేస్తే వచ్చేసరుకు—బోలెడంత ఉన్నంతవరకూ, ఆయనకు మాత్రం చేపలుతినే అగత్యం ఉండదనుకోండి—అయినా, వ్రతంచెడి అందరూ చేపలు తింటేమాత్రం దానికీ రేషను, దానికీ బ్లాక్ మార్కెటు, అందరూ తమ దొడ్లలో మురుకు గుంటలు కట్టి తలొక గాలమూవేసి చేపలు పట్టితేనేగాని నిజమైన దేశసేవకులు, అభ్యుదయ గాములు, నిర్మాణ కార్యకర్తలు కాలేరనే ఉపన్యాసాలు, మళ్లీ యిదేగా సౌరభ్యం!!

'గోరుచుట్టుమీద రోకంటి పోటు'న్నట్లు విశాఖపట్టణంలో సప్లై జరుగుచున్న బియ్యం అంతా నూకలేనన్న విమర్శకు జవాబుగా, బియ్యం తినేవారందరూ అనాగరికులే ననే విచిత్ర అభిప్రాయాన్ని ప్రజలమీదికి సవాలుగా విసిరారు మున్షీగారు—ఇంతటి సవాలును ఇంత నిర్భయంగా వదిలారంటే వీరు అతి విచిత్ర వ్యక్తి అనే అనుకోవాలి—ఎవరో మరి నాగరీక వ్యక్తులు! చేతకాక చేపలు తినే నిర్భాగ్యులో, గతిలేక గడ్డితినే నరపశువులో!!

అయినా, మున్షీగారి పంచవర్ష ప్రణాళికలో ఇది కూడా ఎందుకు చేర్చకూడదు! బియ్యం తినేవాళ్లు అనాగరీకులని, అసలు ఆహారం అడిగే వాళ్లు అటవి మనుష్యులకన్నా అధమాధములనీ—ఒక ప్రచారం ప్రారంభిస్తే, అధికాహారోత్పత్తికయ్యే ఖర్చులో అత్యల్ప భాగంతోనే సరిపోతుంది. ఒక వంక వ్యయం, మరియొక వంక శ్రమకూడ తగ్గుతుంది—మున్షీగారు యీ సలహాను సమదృష్టితో పరిశీలింప గలరు.





# రాజకీయాలు

* శ్రీ గోళ్లమూడి రామచంద్రరావు *

సెప్టెంబర్ నెలలో మన దేశంలోనూ, విదేశాల్లోనూ జరిగిన రాజకీయ సంఘటనల్లో ఈ కిందివాటిని ముఖ్యమైనవని చెప్పవచ్చును—కాంగ్రెస్ అధ్యక్షుడుగా నెహ్రూ ఎన్నిక—కొత్తకార్యవర్గ నిర్మాణం; జపాన్ శాంతి ఒప్పందంపై సంతకాలు జరగటం; పర్షియా నూనెగనుల్లో ఉన్న బ్రిటిష్ సిబ్బందికి పర్షియా ప్రభుత్వం ఉద్వాసన చెప్పటం; బ్రిటన్‌లో ఎన్నికలు నిశ్చయం కావటం; ఆస్ట్రేలియాలో ఒకే పార్టీ నియంతృత్వ స్థాపనకై జరిగిన ప్రతిపాదనలను ప్రజలు భగ్నంచేయటం; హిందూ న్యాయశాస్త్ర సవరణబిల్లును ప్రభుత్వం విరమించ ప్రయత్నించటం; స్వామీ సీతారాం ప్రభృతులు ఉపవాసదీక్ష విరమించటం.

*   *   *

కాంగ్రెసు సంస్థ తప్పుదారిలో పడుతున్నదనీ, ప్రజలకు దానిలో విశ్వాసం కలగాలంటే అందులో గట్టి మార్పులు జరగాలనీ, దానికి విఘ్నేశ్వరపూజ కార్యవర్గంలోనే జరగాలనీ పట్టుపట్టిన పండిత నెహ్రూ సెప్టెంబర్ 8వ తేదీన కాంగ్రెస్ అధ్యక్షపదవికి ఎన్నుకోబడ్డారు. దానికి అంగీకరించని టాండన్ అధ్యక్షపదవి నుంచి తప్పుకున్నారు. 15వ తేదీ మధ్యాహ్నం 15 మంది సభ్యులతో పండిత నెహ్రూ కొత్త కార్యవర్గాన్ని ఏర్పాటు చేశారు. పాత అధ్యక్షుడు టాండన్, ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెస్ అధ్యక్షుడు సంజీవరెడ్డి, తమిళ రాష్ట్ర కాంగ్రెస్ అధ్యక్షుడు కామరాజ నాడార్, ఉత్తర ప్రదేశ్ ముఖ్య మంత్రి గోవిందవల్లభపంత్ మొదలైనవారు అందులో సభ్యులు. వెనకటి కార్యదర్శులు వెంకట్రావ్, మోహన్లాల్ గౌతమ్ గార్లకు స్థానం ఇవ్వలేదు.

ఈ మార్పువల్ల కాంగ్రెసులో నిజమయిన మార్పు వచ్చే అవకాశం ఉన్నట్లు తోచదు. ప్రస్తుతం అన్ని రాష్ట్రాల్లోనూ అధికారంలో ఉన్న వర్గాలకు చెందినవారే ఎక్కువ మంది ఈ కార్యవర్గంలో ఉన్నారు. అందువల్ల ఇప్పుడు రాష్ట్రాల్లో ఉన్న కాంగ్రెసు ప్రభుత్వాలే ఎన్నికలయిన తరవాత కూడా ప్రత్యక్షం కాగలవనీ, వాటి విధానాలను పండిత నెహ్రూ ఆమోదిస్తున్నారనీ చెప్పవలసి ఉంటుంది. ఒక పార్టీ అధికారంలో ఉన్నదంటే, ప్రజా విశ్వాసం ఆ పార్టీ ప్రభుత్వ ప్రతినిధుల మీదనే ఆధారపడి ఉంటుంది. ఈ రోజుల్లో ప్రజలకు కాంగ్రెసు పట్ల విశ్వాసం తగ్గిపోయినదని అంగీకరిస్తే, దానికి ముఖ్య భాధ్యత కాంగ్రెసు ప్రభుత్వాలదేనని కూడా అంగీకరించక తప్పదు. మొదటి అంశాన్ని గుర్తించిన నెహ్రూ రెండవ అంశాన్ని గమనించక పోవటం ఆశ్చర్యమే.

అందువల్లనే ప్రజా పార్టీవారు ఈ మార్పును ఖాతర్ చేయలేదు. కిద్వాయ్‌గారు మాత్రం వ్యక్తిగతంగా తనకు అయిష్టులయిన వెంకట్రావ్, గౌతమ్‌గార్లు కార్యదర్శులుగా విరమించినందుకు 25వ తేదీన సంతోషం వెల్లడించి, తాను తిరిగి కాంగ్రెసులో చేరవచ్చునని సూచించారు. నెహ్రూగారి కార్యవర్గాన్ని చూస్తే కేవలం కిద్వాయిగారిని సంతృప్తి పరచటం మినహా ఆయన వేరే సాధించినదేమీ కనిపించదు.

*   *   *

ఇరుగుపొరుగు దేశాలయిన చైనా, రష్యా, బర్మా, ఇండియాలతో సంబంధం లేకుండా, ఇండో చైనా, మలయా ప్రజలకు విదేశాక్రమణవల్ల తమ అభిప్రాయం ప్రకటించే అవకాశం లేని పరిస్థితుల్లో, జపాను పశ్చిమ

రాజ్యాలతో 'శాంతి' ఒప్పందాన్ని సెప్టెంబర్ 8వ తేదీన చేసుకున్నది. దానివల్ల జపాన్‌లో అమెరికన్ సాయుధ బలాలు తిష్ఠవేసినవి. చైనాతో వ్యాపార సంబంధాలు మాకు అత్యవసరం కాదని జపాన్ ప్రధాని ఒప్పందం సంతకాలప్పుడు ప్రకటించటంవల్ల, చైనా, జపాన్‌లను కలవకుండా విడదీసి ఉంచటానికే అమెరికా నిశ్చయించుకున్నట్లు స్పష్టపడినది. (జపాను వ్యాపారావసరాలన్నిటినీ ప్రస్తుతం అమెరికా సప్లయిలే తీరుస్తున్నవి.)

ఈ ఒప్పందంతో ఇండియా ఏకీభవించక వేరే ఒప్పందాన్ని చేసుకో దలచినట్లు ప్రకటించింది.

* * *

నెలల తరబడిగా నడుస్తున్న బ్రిటన్, పర్షియాల నూనె తగాదా ఈ నెల 25తో అసలు పాకానా పడ్డది. నూనె పరిశ్రమను నడిపే సిబ్బందిని—అంటే పరిశ్రమ ఆయువు పట్టును—తమ చేతిలో ఉంచమని బ్రిటన్ పట్టు పట్టగా పర్షియా అంగీకరించలేదు. అంతవరదాకా ఎంతో శ్రేయోభిలాషివలె మధ్యవర్తిత్వం నడిపిన అమెరికన్ మధ్యవర్తి హారిమన్ పర్షియా ఇచ్చిన కడపటి సందేశాన్ని బ్రిటనుకు అందజేయ నిరాకరించారు. సంప్రదింపులు ప్రారంభించకపోతే బ్రిటిష్ సిబ్బందిని వెళ్లగొడతామని పర్షియా బెదరించ దలచటమే తన నిరాకరణకు కారణమని అన్నారు. అందువల్ల ఈ నెల 22న పర్షియా ప్రధాని ఆ షరతు పెట్టకుండానే, సంప్రదింపులు ప్రారంభించవలసిందని బ్రిటన్‌ను కోరారు. తక్షణమే బ్రిటన్ దానిని తోసివేసింది. అందువల్ల 25న బ్రిటిష్ సిబ్బందిని బహిష్కరిస్తూ ఉత్తరువు చేశారు.

బ్రిటన్ పర్షియాకు వ్యాపార సప్లయిలనుకూడా నిలుపు చేసింది. అందువల్ల పర్షియా రష్యాతో వాణిజ్య సంప్రదింపులు జరుపుతున్నది. ఫార్మోజా, ఇండోచైనాలతో జోక్యం కలిగించుకుంటున్నట్లూ, కాశ్మీర్‌లో జోక్యం కలిగించు కొనటానికి ప్రయత్నిస్తున్నట్లూ, అమెరికా పర్షియాలు కూడా జోక్యం కలిగించుకోవచ్చును. అమెరికా ఈ విధంగా చేయటానికి గల అవకాశాలను గురించి బ్రిటిష్ విదేశాంగ శాఖలోని న్యాయశాస్త్ర నిపుణులు పరిశీలిస్తున్నట్లు ఒక అధికారి వెల్లడించారు.

బలహీనుడిని బెదిరించి చేసుకున్న ఒప్పందపు రాయభారాలను ఇన్నాళ్లు అనుభవించినదానితో తృప్తి పడక, దురాశకు పోయి బ్రిటన్ మొదటికే మోసం తెచ్చుకున్నది.

* * *

1950 ఫిబ్రవరిలోనే ఏర్పాటయిన బ్రిటిష్ పార్లమెంటు అక్టోబర్ 5వ తేదీన రద్దయి, 25న ఎన్నికలు జరుగబోతున్నవి. 18 నెలలపాటు 5 కోట్ల మెజారిటీతో, ఏ క్షణాన కూలిపోతుందో అన్నట్లు లేబర్ ప్రభుత్వం పరిపాలన జరిపింది. కాని ఇంక ఆ ఆశ కూడా లేక ఎన్నికలకు సిద్ధపడ్డది. లేబర్ పార్టీలోనే అభిప్రాయ భేదాలు ప్రబలటం, వెనకటి తటస్థులంతా తమనే బలపరచటం, అనే కారణాలవల్ల ఎన్నికల్లో గెలవగలమని కన్సర్వేటివులు గట్టిగా నమ్ముతున్నారు. వారు గెలిచినా ఆశ్చర్యంలేదు.

1945లో ఎంతో మెజారిటీతో నెగ్గిన లేబర్‌పార్టీకి ఈ దుస్థితి ఎందువల్ల పట్టిందో పరిశీలించటం అవసరం. దేశం అతి తీవ్రమయిన ఆర్థిక, నైతిక సంకటాల్లో చిక్కుకున్నప్పుడు, ప్రజలందరికీ కూడా, ఆచిక్కులకు మూలకారణం. పెట్టుబడిదారీ విధానమేననీ, వాటిని ధనికవర్గ ప్రభుత్వాలు ఎప్పటికీ పరిష్కరించలేవనీ సుస్పష్టంగా తెలిసి వస్తుంది. అప్పుడు సామ్యవాదం ఒక్కటే మార్గమని గమనించిన ప్రజలంతా సోషలిస్టు ప్రభుత్వాలను ఎన్నుకుంటారు. 1931లో బ్రిటన్‌లో మక్డానల్డ్ ప్రభుత్వం రావటానికి అప్పుడు ప్రపంచానంతా ఆవరించిన ఆర్థిక మాంద్యమే కారణం. అట్లాగే 1945లో బ్రిటన్, ఆస్ట్రేలియా, న్యూజీలాండ్‌లలో సోషలిస్టు ప్రభుత్వాలు రావటానికి రెండో ప్రపంచ యుద్ధం కారణం. కాని ప్రజా విశ్వాసాన్ని సంపాదించలేక పోయినందువల్ల 1950లో ఆస్ట్రేలియా, న్యూజీలాండ్ లేబర్ ప్రభుత్వాలు ఓడిపోయినవి. బ్రిటన్‌లో నెగ్గినా లాభం లేకుండా పోయింది.

బ్రిటిష్ లేబర్‌పార్టీ ఈ దశకు రావటానికి కారణాలివి: (1) ఆర్థిక సంస్కరణలను అమూలాగ్రంగా జరిపి, తన

వ్యాపారానికి లాభించే చైనా, తూర్పు యూరప్ దేశాలతో వ్యాపారం జరపటానికి బదులుగా, సగం సగం సంస్కరణలను ప్రవేశపెట్టి, చైనా తూర్పు యూరప్‌లను చెడనాడుకొనటం (2) అసంపూర్తి సంస్కరణలవల్ల సంస్కరణల ప్రయోజనం రాకపోగా, వాటివల్ల డబ్బు అవసరమై అమెరికాను యాచించే స్థితికి రావటం (3) అమెరికా ఇచ్చే డబ్బుకు లొంగిపోయి, అంతకంతకూ స్వతంత్ర ప్రతిపత్తినీ కూడా పోగొట్టుకుని, అమెరికాను మెప్పించటానికి తన శక్తికి మించిన ఆయుధోత్పత్తికి పూనుకొనటం. (దీనివల్ల ప్రజల్లో అసంతృప్తి ఏర్పడ్డది.)

శక్తికి మించి ఆయుధాలను తయారు చేస్తూ, స్త్రీలకు పురుషులతోపాటు సమాన జీతాలివ్వటానికి డబ్బు లేదని లేబర్ ప్రభుత్వం సాకు చెపుతున్నది.

* * *

1950 లో ఆస్ట్రేలియాలో ఏర్పడ్డ కన్సర్వేటివ్ ప్రభుత్వం కమ్యూనిస్టుపార్టీని నిషేధించగా అది రాజ్యాంగ విరుద్ధమని హైకోర్టు తీర్పు చెప్పింది. అయితే వెంటనే రాజ్యాంగానే సవరించటానికి ఆ ప్రభుత్వం పూనుకోలేదు. ఉన్న రాజ్యాంగాన్ని పట్టి, జనవాక్యంలో ప్రజలు అంగీకరిస్తే హైకోర్టు తీర్పును తోసిరాజనేందుకు వీలు ఉన్నది. సెప్టెంబర్ 22న ప్రభుత్వం అట్లా జనవాక్యం జరపగా, అధిక సంఖ్యలో ప్రజలు కమ్యూనిస్టుపార్టీని నిషేధించటానికి వీలు లేదన్నారు. ఎవరికయినా రాజ్యాంగంలో ఉన్న హక్కులను ఉపయోగించుకునే వీలు లేకుండా చేస్తే, వారిని రాజ్యాంగ వ్యతిరేకులుగా తయారు చేయటమే అవుతుందనీ, అధికారంలో ఉన్న పార్టీని రాజ్యాంగాన్నే మార్చివేయనిస్తే నియంతృత్వానికి దారితీస్తుందనీ ఆస్ట్రేలియా ప్రజలు గుర్తించారు. ఈ గుణపాఠం ఇండియాకూ అవసరమే.

* * *

దేశంలో అభ్యుదయ వాదులూ, వారికన్నా ఎక్కువగా స్త్రీలూ, ఎంతో ఆశలు పెట్టుకున్న హిందూ న్యాయ శాస్త్ర సవరణబిల్లు ఎన్నికలలోపల ఆమోదం పొందేట్లు కనిపించదు. 'ఈ బిల్లు నెగ్గకపోతే, నా ప్రభుత్వమే ఉండద'ని బల్లగుద్ది చెప్పిన నెహ్రూగారే, బిల్లులో అప్రధానమయిన నాలుగు క్లాజులను ఆమోదించిన మీదట చర్చను వాయిదా వేయటానికి అనుమతించారు. మొదట్లో మొత్తం బిల్లుకు వ్యవధిచాలదని చెప్పి, 'వివాహం—విడాకులు' భాగాన్ని మాత్రం విడిగా ఆమోదించదలచారు. కాని తరవాత అదికూడా సంక్షేపించుకున్నారు. దీనికి మహిళా సంఘాలు నిరసన ప్రదర్శనలు జరిపినవి.

* * *

ఆగస్టు 16వ తేదీనుంచి ఆంధ్ర రాష్ట్ర స్థాపనకోసం ఉపవాస దీక్షసాగిస్తున్న స్వామీ సీతారాం సెప్టెంబర్ 20న, వినోబాభావే కోరికమీద దీక్షను విరమించారు. ఆయన దీక్ష ప్రజల్లో రాష్ట్ర వాంఛను పురికొల్పి, ఒకరిద్దరు నాయకులతో కొంచం చలనం కలిగించినట్లు కనిపిస్తున్నది. కాని ఎక్కువ మంది ఆంధ్ర నాయకులు ఆయన ఆశయాలకు కూడా తమకు ఇష్టం వచ్చిన అర్థాలు కల్పించి వ్యవహరిస్తున్నారు. విభజన సంఘం (1950) నివేదికను పట్టి రాష్ట్రం ఏర్పరచాలని చాలా మంది చెపుతున్నారు, కాని ఆ నివేదికను భారత ప్రభుత్వం ఆమోదించనే లేదు.

రాష్ట్రాల విభజన పట్లనూ, అల్పసంఖ్యాకుల రక్షణ పట్లనూ భారత ప్రభుత్వం దేశమంతటికీ అన్వయించే కొన్ని అభ్యుదయ సూత్రాలను ఏర్పాటు చేసేవరకూ ఈ విభేధాలు పరిష్కారం కావు. విద్వేషాలు, భయాలు నశించవు. కొత్తగా ఏర్పాటు చేసే రాష్ట్రాల విషయంలోనే కాక, అమల్లో ఉన్న బీహార్-బెంగాల్ రాష్ట్రాలకూ, రాజస్థాన్-బొంబాయి రాష్ట్రాలకూ, తూర్పు పంజాబ్-ఉత్తర ప్రదేశ్ రాష్ట్రాలకూ ఈ వివాదగ్రస్త ప్రాంతాలు ఉన్నవి. కాబట్టి కేంద్ర ప్రభుత్వం ఆ సమస్యను న్యాయంగా, ధైర్యంగా ఎదుర్కున్నప్పుడే, దేశంలో నిజమైన సామరస్యం, ఐక్యత ఏర్పడతవి.





నాటిక

* * *

# సేవావ్రతం

* * *

* శ్రీమతి కనుపర్తి వరలక్ష్మమ్మ *

[ప్రదేశం : వాల్తేరు విశ్వ విద్యాలయం బాలికా వసతి గృహం.

ఒక గుండ్రని బల్లకు మూడు వైపులా ఉన్న కుర్చీలలో ముగ్గురు యువతులు కూర్చుండి వుంటారు. ఖిన్న వదనయై కూర్చున్న శ్యామలకు ఎదురుగా శాంతా, సరళలు కూర్చున్న కుర్చీలు ఉంటాయి. ఆ ముగ్గురు యువతులు ఆనాడు జరిగిన విశ్వ విద్యాలయ స్నాతక సభలో డిగ్రీలు పొందారు. వారి వేషభాషలు చాలా సౌమ్యంగా ఉంటాయి.]

శ్యా : శాంతా! సరళా! ఆ భీభత్స భయానక దృశ్యం చూస్తే నా గుండె లవిసిపోయినాయి. ఈనాడు యింత ఉత్సవానంద మనుభవించినా ఆ దృశ్యం కన్నుల కట్టి నట్టే ఉండి మనస్సుకు వేదన కలిగిస్తున్నది.

శాంత, సరళ : (ఒక్కమాటుగా) అంత మరపురాని దృశ్య మేమిటి శ్యామా!

శ్యా : ఈ కాన్వొకేషన్ నిమిత్తం యిచటికి వస్తున్నాను. బెజవాడవద్ద రైలుఆగింది. ప్రయాణీకుల ఎక్కే దిగే గడబిడ అంతా అణగింది. యింకా నాలుగైదు నిము షాల్లో రైలుకదలబోతున్నది. ఇంతలో

శాం : (ఆత్రంతో) ఆ అంతలో ఏమయింది?

శ్యా : ఒకరౌడీవచ్చి మా పెట్టెలో జొరబడ్డాడు. 'ఇది ఆడవాళ్ల పెట్టె దిగు, దిగు,' అని అందరూ అంటూనే ఉన్నారు. ఆ మాటవాడు వినిపించుకోకుండా ఒక్క ఉదుటునపోయి పెట్టెలో చివరగా ఒక మూల ఒక స్త్రీచాటున నక్కికూర్చున్న ఒక పదహా రేండ్లపిల్లను జుట్టుపట్టుకొని, బూతులు తిడుతూ పోదాం రమ్మని యీడ్వటం మొదలుపెట్టాడు. ఆ పిల్ల తన్ను అంటిపెట్టుకొని కూర్చున్న స్త్రీని గట్టిగా పట్టుకొని "అమ్మా పోనేవ్, పోనేవ్" అని ఒక్కటే ఏడ్పు. ఆస్త్రీ "అయ్యో! కూతురా నేనేమి చేతునే ఆ మాయదారోడు యీడకుగూడా వచ్చాడ"ని కూతు రును కౌగలించుకొని ఏడ్పు. ఈ యిద్దరి యేడ్పులు లక్ష్యపెట్టకుండా వాడు యీడ్వటంతో పెట్టెంతా గగ్గోలై పోయింది. అందరం హడిలిపోయినాము. చాలా మంది వాడిని నానాతిట్లు తిట్టారు. ఏమయితేనేమి అడ్డువచ్చిన తల్లిని గుండె పగిలేటట్టు ఒకతన్నుతన్ని ఆ పిల్లను రైలుపెట్టెలోనుంచి క్రిందికి యీడ్చుకు పోయినాడు. ఆతల్లి యేడుస్తూ వెంబడేపోయింది.

సర : అయ్యో! యింతఘోరం జరుగుతూ ఉంటే అక్కడ యెవ్వరూ లేరూ?

శ్యా : సరళా! ఎంత పిచ్చిదానవూ! రైలుస్టేషన్‌వద్ద అందులో బెజవాడస్టేషన్‌వద్ద మనుష్యులకు తక్కువా? అసంఖ్యాకజనం ఉన్నారు. చీమ చిటుక్కుమంటే ప్రత్యక్షమయ్యే పోలీసులుగూడా ఉన్నారు.

శాం : ఇందరుండీ ఎవరూ కాదనలేదా ?

శ్యా : ఎట్లా అంటారు ?

శాం : ఏమి ?

శ్యా : వాడు ఆపిల్ల మొగుడుట.

శాం : అయితే ?

శ్యా : దానిమగడు దాన్ని కొట్టుకుంటాడు, తిట్టుకుంటాడు. ఏమైనా చేస్తాడు.

స : ఎవరు కాదనగూడదా ?

శ్యా : అన్నమాటేగా !

శాం : పాపం ఆమనిషి ఆపిల్ల తల్లి కాబోలు. ఆదుర్మార్గుడి బారినుండి తప్పిద్దామని రహస్యంగా తీసుకువచ్చింది కాబోలు !

శా : అవును. వాడు ఆ పిల్లను నానాహింసలూ పెడుతూ ఉంటే చూడలేక యిరుగుపొరుగువారెవరో యీ విషయం తెలియబరిస్తేవచ్చి పిల్లను పంపమని అడిగిందట. వాడు పంపనన్నాడట. ఆపిల్ల తల్లివచ్చింది మొదలు ఈదెబ్బలూ, తిట్లు పడుతూఉండలేను నన్ను తీసుకొనిపొమ్మని ఒక్కటే గోలట. ఆ గోడుచూడలేక ఎట్లాగో గుట్టుగా తీసుకపోదామని ప్రయత్నిస్తే వాడెట్లాగో కనుక్కొని వచ్చి ఆపిల్లను బలాత్కారంగా యీడ్చుకొని పోయినాడు.

స : తనబిడ్డను తానుకాపాడుకొనే హక్కు కన్నతల్లికి గూడాలేదు కాబోలు !

శా : లేదు. లేదు. మన హిందూసంఘంలో వివాహానంతరం స్త్రీకి పెనిమిటే సర్వాధికారి. పూర్తిగా హత్యచేస్తే తప్ప తదితరవిధాలుగా ఎంత హింసించినా రాజశాసనాలుగూడా అతన్నేమీచేయవు. ప్రజలుగూడా ఏమీ అనరు. అతడు జారుడుగానీ, చోరుడుగానీ, త్రాగుబోతుగానీ, యింకా ఎటువంటి దుర్మార్గుడైనాగాని, అతను పెట్టినకష్టాలు స్త్రీ పడవలసిందే. వడ్లతో తట్ట ఎండవలసినదనే గదా మనవాళ్ల సిద్ధాంతం.

శాం : ఈ అమానుష సిద్ధాంతానికి తలమొగ్గి ఎంతమంది మానవతులు క్రుగ్గిపోతున్నారో !

స : మన భారత స్త్రీలస్థితి చాలా శోచనీయం.

శా : నెమ్మదిగా అంటావా సరళా ! తనకు స్వాతంత్ర్యం వచ్చిందని 1947 ఆగస్టు 15 తేదీని భరతమాత భారతవర్షమంతటా స్వాతంత్ర్యోత్సవం జరుపుకొని జయపతాకాలెగుర వేసుకున్నదికాని, ఆమె అనుంగుబిడ్డలైన పదిహేడుకోట్ల భారత మహిళామణుల దాస్యశృంఖలాలు బిగువు సడలకుండా అట్లాగే ఉన్నాయి. 'నస్త్రీ స్వాతంత్ర్యమర్హతి', అన్న స్మృతి వచనం ఉక్కుచట్టంలాగా అట్లాగే ఉన్నది. స్త్రీ వ్యక్తి గాదట. పురుషుని సొత్తుట. పొలముపుట్రు, గొడ్డుగోద, కొంపగోడి, నగనట్రు, చెంబుతెప్పాల వంటిదేనట.

స : (ఉద్వేగంతో) ఏమిటిశ్యామా, ఇది నిజమే ! స్త్రీ వ్యక్తిగాదూ ! హృదయంలేదూ !

శ్యా : (దృఢంగా) కాదు. లేదు.

శాం : శ్యామా యిది సహింపరాని దుర్భర దుస్సహ పరిస్థితి సుమా.

శ్యా : అవును. నిజంగా సహింపరాని విషయమే. చూడు ఈ రోజున మనమూ మానవ వ్యక్తులమేనని డిగ్రీలు పుచ్చుకున్నాము. మగపిల్లలకంటె ఉత్తమశ్రేణిలో జయమంది ప్రత్యేక బహుమానాలు గూడా అందుకున్నాము. కాని సంఘంలో మన స్త్రీకి ఉన్న స్థానం తలుచుకుంటే గుండె తుమిలిపోతున్నది. మనవిద్య స్త్రీ జనోద్ధరణకు వినియోగిస్తేనేగాని మనజన్మకు సఫలత లేదనిపిస్తున్నది.

శాం : అవును శ్యామా ! విద్యావతులైన స్త్రీల కర్తవ్యం అదే.

సేవ యన సుఖమైన త్రోవగాదు, భీకరోదగ్ర కంటకావృతము

స : ఎటుచూచినా స్త్రీలస్థితి ఎంతో శోచనీయంగా ఉన్నది. బాల్యవివాహాలు మూలమట్టుగా పోలేదు గదా. వితంతువులు బ్రదికే సదుపాయాలు శూన్యం గదా. ఆరోగ్యరక్షణకు త్రోవలేదుగదా. అకాల ప్రసవాలు, బాలింతచావులు, శిశుమరణాలు, అవిద్య, అజ్ఞానం, అస్వాతంత్ర్యం, కన్యాశుల్కం, వరశుల్కం, ఒకటా స్త్రీ బ్రదుకు ఎన్ని విధాల నలిగి చూర్ణమై పోతున్నది! ఎన్నో విద్యార్థి కాంగ్రెసులు యువజన కాంగ్రెసులు జరుగుతూ ఉంటాయి. లెక్కలేనన్ని తీర్మానాలు చేయబడుతూ ఉంటాయి. వరశుల్కనిషేధ మనే ఒక్క తీర్మానంచేసి ఆచరించవలెననే ఉద్దేశం ఏ యువక హృదయంలోను పొటమరించలేదు. ఇందు వల్ల స్త్రీ సంఘానికి జరుగుచున్న అన్యాయం యింతా అంతా కాదు.

శ్యా : అవును శాంతా! యీ అన్యాయాలు చూస్తే మనస్సు తుకతుక ఉడుకుతుంది. ఈ మధ్య మా పినతల్లి కొమార్తె ఒకామెకు పెనిమిటి పోయినాడు. పాపం దానికి పదహారేండ్లు నిండలేదు. అత్తవారు మంచి స్థితిమంతులు. భర్త జీవించి ఉంటే అష్టైశ్వర్యాలు అనుభవించ వలసినది పిల్ల. అటువంటిది కొమారుడు పోగానే దాని మామగారు ఏడాదికో పుట్టి గింజలు, దొడ్లో స్నానాల కొట్టువద్ద ఒక గదీ యిస్తానన్నాడుట. అదీ మా బాబాయి అడగలేదుట. ఆడవాళ్లకేవో హక్కులు రాబోతున్నా యని విని యిది పరిష్కారమైన కేసుక్రింద జమకట్టించ వలెనని ఆ మామగారే ముందుగా కబురు చేశాడుట. ఈ అన్యాయం చూచి మా బాబాయికి చాలా కష్టంవేసి "ఎందుకులెండి మీకంత కష్టం. ఏదో చదువు చెప్పిస్తాను. ఎక్కడన్నా బడి చదువు చెప్పకొని బ్రతుకుతుంది" అన్నాడట, "వద్దువద్దు బావగారు ఆ పని మాత్రం చేయవద్దు. అది మా వంశమర్యాదకు లోపం. ఆడ వాళ్లు ఉద్యోగం చేయడం మా యింటావంటా లేద"న్నాడట, మామగారు.

స : ఛీఛీ. ఈ మెకు కూటికి గుడ్డకు లేకపోయినా, పస్తులుండి వారి వంశమర్యాద నిలపాలెగాని, ఉద్యోగం చేసి జీవించరాదన్నమాట. అన్నంపెట్టే పూచీవారికి లేకపోయినా వంశగౌరవం నిలబెట్టవలసిన పూచీ మాత్రం యీ మెకు ఒప్పజెప్పారు కాబోలు.

శాం : అబ్బో! యిటువంటి వెన్నో! స్త్రీల బ్రతుకంతా దుఃఖభాజనమే!

స : రాజకీయాల్లో మాత్రం స్త్రీలకు ప్రత్యేకప్రాతినిధ్య మంటూ అనడమేగాని ఒకటో రెండో సీట్లుయిచ్చే టప్పటికి బ్రహ్మాండమవుతున్నది. మెజారిటీలేని ప్రాతి నిధ్యంవల్ల వీరికి జరిగేదేమున్నది చెప్పు? సమయం వస్తే పార్టీరాజకీయాల్లోకి ఈ స్త్రీలనుగూడా లాగి సత్రకాయల్లాగా ఉపయోగించడానికి ప్రయత్నిస్తారు ప్రతిపార్టీవాళ్లూ.

శ్యా : అసలు వోటుహక్కుమాత్రం స్త్రీలు ఏమి ఉపయో గించుకుంటున్నారు? ఇంట్లో మగవాళ్లు ఎవరికి యివ్వ మంటే వారికి వోటు యివ్వడమేగా మనవాళ్లు చేస్తున్న పని? దీనినిబట్టి ఒక్కొక్క మగవాడికి రెండుమూడు వోట్లు లభించినట్లైందిగాని స్త్రీవిచక్షణ జ్ఞానంతో ఉపయోగిస్తున్న దేదీ?

శాం : వీళ్లకు విచక్షణజ్ఞానం ఉండదని వారి వూహ.

స : అందుకనే స్త్రీలకుముందు విద్యరావాలె. దాంతో విచక్షణజ్ఞానమూ వస్తుంది. ఆత్మగౌరవమూ తెలుసు కుంటారు. ఆర్థికదాస్యంనుంచి విముక్తి పొందుతారు. అప్పుడు ఈపంజరబద్ధ జీవితం స్త్రీలకు వదిలి పోతుంది.

శ్యా : నగలు చీరలు చూచుకొని మన స్త్రీలు మురుసు కుంటూ ఉంటారు, తమంత భాగ్యవంతులు లేరని. కాని బంగారుతో చేసినా అవి సంకెళ్లే అనీ, పట్టుతో నేసినా అవి ఉచ్చులే అని వాళ్లకు తెలియదు. నిజానికి కూలినాలిచేసి జీవించే స్త్రీలు అనుభవిస్తున్నంత స్వాతం త్ర్యం లక్షాధికార్లభార్యలూ, ఉన్నతోద్యోగులభార్యలు

సేవా వ్రతానికి త్యాగమే పూజా పుష్పం, శీలమే నివేదన ఫలం

అనుభవించడంలేదు. కాని యీలోపం ఈ సంపన్న కుటుంబినులకు తెలియదు. ఆ కాయకష్టపడేవారు చాలాహీనులనీ తాము చాలా గొప్పవాళ్లమనీ భావిస్తూ ఉంటారు. కాని వారు కాయకష్టమే అమ్ముకుంటే తాము జీవితమే అమ్ముకుంటున్నామని వారు తెలుసుకోవడంలేదు. ఇదంతా తెలుసుకోవలెనంటే స్త్రీలల్లో ఎంత సంస్కారం జరగాలె! ఇది సామాన్య పరివర్తనం గాదు.

శాం : అవునుగాని శ్యామా! నాకొక్క విషయం ఆశ్చర్యం కలిగిస్తున్నది ఏమంటే స్త్రీల అభ్యుదయమంటె నూటికి తొంభై తొమ్మిది మంది పురుషులు వ్యతిరేకులుగా ఉంటున్నారు. స్వార్థాపేక్షతో వారు అట్లా ఉండటం సహజమే అనుకుందాము. కాని నూటికి తొంభై తొమ్మిది మంది స్త్రీలు గూడా వ్యతిరేకులే చూచావో లేదో!

శ్యా : అవును యుగయుగాలనుండి మన హైందవనారీ లోకానికి పారతంత్ర్య బానిసధర్మం వంట జీర్ణించిపోయింది. కనుపడని పుణ్యంకోసం ప్రత్యక్ష దుఃఖాలు అనుభవించడం పరిపాటైపోయింది. పైగా మూఢ నమ్మకాలు, పిచ్చి ఆచారాలు హృదయాల్లో బాగా పాదుకు పోయినాయి. బిడ్డకు కాస్త జబ్బుచేస్తే మందు యిచ్చే ఆలోచన చేయరు. సోది అడగటమో, ప్రశ్నలు చూడటమో, విభూతి పెట్టించడమో, మంత్ర తీర్థం యిప్పించడమో, దృష్టి తీయడమో, యిదీ తీరు.

శాం : పిల్లలకేమిటి పెద్దవాళ్ల విషయంలోనూ యింతే. బదిరిగడ్డాలవారు, ఊర్ధ్వపుండ్రాలవారు, విభూతి రేకలవారు, కావి గుడ్డలవారు, తులసి పూసలవారు, రుద్రాక్ష తావళాలవారు, మంత్ర తీర్థాలవారు, మాయ జడలవారు యింకా మన స్త్రీ సంఘంమీద ఆధిపత్యం వహించే ఉన్నారు. నిజానికి పురాణశాస్త్రుల్లనూ, వేదాంత గురువులనూ, హరికథా దాసులనూ పోషిస్తున్న దెవరు మన స్త్రీలు కాదూ? అయితే వాస్తవికంగా వాళ్లు ఎవళ్ల ఏజంట్లో వీళ్లకు అర్థంకాదు. ఈ మౌఢ్యమంతా నశిస్తేకదూ మన స్త్రీ లోకం అభివృద్ధి చెందేది?

శా : అందుకనే మనం మహిళాభ్యుదయ సేవకు పూనుకోవాలె.

స : సేవంటే సులభ కార్యం కాదోయ్. చాలా కష్టాలున్నాయి. ఒక కవయిత్రి ఏమి చెప్పిందో విన్నావూ.

శాం : ఏమి చెప్పింది. అది గూడా నీవే చెప్పు.

స : "పూల మాలల నిచ్చి పూజింప రెవ్వరు
కాని మాటలు పడి కలగవలయు
తోడుతోడుగవచ్చి తోడ్పడ రెవ్వరు
నొంటిపాటుకు నోర్చి యుండవలయు
బహుళధనమున సంభావింప రెవ్వరు
కడుపేద తనమున నడలవలయు
ఒకచోట నుండంగ నొప్పుకో రెవ్వరు
నూరూరు తిరుగుచు నుండవలయు
సేవయన నిట్లు సుఖమైన త్రోవగాక
భీకరోదగ్ర కంటకా వృతముగాన
ఐహిక సుఖసంపదలపై నాశ వదలి
చేయవలయును నిజ సంఘ సేవ మనము."

శా : అవును సేవావ్రతానికి ఐహిక సుఖ భోగాలకు చాలా దూరం.

స : మన స్త్రీల స్థితి ఎట్లా ఉన్నదంటే?
"చదువుకొనినవారి సంఖ్యను జూతుమా
నూటికిద్దరు లేరు బోటులందు
ఆ స్త్రీహక్కుల మాటనరసి చూచెదమన్న
నిరుదెసలరాదు నించుకంత
సొంతగా నార్జించి సుఖియింతురన్ననో
చిన్నకాని గడింప చేతగాదు
సంఘబలముచేత సాధింతుమన్ననో
కలసి వచ్చెడి నేర్పు కానరాదు
అక్కటా యీ భరతభూమి నాడువారు
అభ్యుదయమంచు మార్గంబు నరయుకొలది
దుర్గమారణ్య తుల్యమై తోచుగాని
గమన సౌలభ్య సుపథమై కానరాదు."

(తరువాయి 39-వ పేజీలో)

# రుద్రమ దేవి

* శ్రీమతి డాక్టర్ వారణాశి యశోదాదేవి, డి. లిట్. *

కాకతీయ ఆంధ్రసామ్రాజ్యము దాదాపు రెండు శతాబ్దములు ప్రవర్ధమానముగ వర్ధిల్లింది. కాకతీయులు చతుర్థకులజులైనను క్షత్రియ రక్తము మెండుగ ప్రవహించిన వీరావతంసులు. వీరు మొదట పశ్చిమ చాళుక్యుల సామంతులుగ నుండి తదనంతరము స్వతంత్రులైరి. వీరి రాజ్యములో ముఖ్యభాగము ప్రస్తుతము నైజాము రాజ్యములోని తెలంగాణము. వీరి రాజధాని యిపుడు వరంగల్ అనబడు యేకశిలానగరము. గణపతి దేవుడు (క్రీ. శ 1198—1261) రుద్రమ (1261—1295) ల కాలమందు కాకతీయ సామ్రాజ్యము అత్యుచ్ఛదశను అనుభవించెను. కాకతీయ సైన్యములు దక్షిణమున కాంచీపురమును కూడ ఆక్రమించెను. తండ్రి యనంతరము తనకు సంక్రమించిన సామ్రాజ్యరమను, ఏవిధమునను తరుగకుండ రక్షించుకొనుట రుద్రమ రాజనీతిజ్ఞతను వేనోళ్ల చాటుచున్నది.

గణపతి దేవునికి సోమాంబకు యిర్వురు పుత్రికలు గల్గిరి. వీరు రుద్రమ, గణపమ దేవులు; వరుసగ కాకతీయ, కోట రాజ్యముల నేలిరి. పుత్రాభావమువలన మహారాజు వీరిర్వురకు రాజ్యభారము వహించుటకు కావలసిన విద్యలన్నిటి యందును తర్ఫీదు చేసెను. రాజ్యము అన్యాక్రాంతము చేయ నిచ్చగింపక రుద్రమ జన్మించగనే, గురువు విశ్వేశ్వర శివదేశికుల యాజ్ఞానుసారము, గణపతి శిశువునకు రుద్రదేవుడని నామకరణముచేసి, పుత్రోదయ మయ్యెనని రాజ్యమున చాటించెను. రుద్రమదేవి యెప్పుడును పురుషవేషమందే యుండెను. గణపతి ఆమెకు యువరాజ పట్టము గట్టెను. ముమ్మడమ్మ అను కన్యను దెచ్చి, ఈమెకు వివాహ తంతు గూడ నడిపిరట. ఆ కన్యను తర్వాత రుద్రమ నిడుదప్రోలి చాళుక్య మహాదేవరాజునకిచ్చి పెండ్లిచేసి, తన కుమార్తెగ జూచుకొనెను. రాజగురు ఆనతిని గణపతి, రుద్రమను తన సామంతుడును చాళుక్యవంశజుడును, కొల్లిపాక పురవరేశ్వరుడునగు యిందు శేఖరుని పుత్రుడు వీరభద్రున కిచ్చి పెండ్లిచేసెను,

యౌవరాజ్య పట్టాభిషిక్తురాలై రాజ్యాంగ వ్యవహారముల జక్కబెట్టుచు రుద్రమ, రుద్రదేవ మహారాజనియే సామ్రాజ్యమంతటను వ్యవహరింపబడుచుండెను. ప్రతాప రుద్రీయములో విద్యానాథుడు "యోరుద్రోరజతాచలేస్థితిమగాదర్ధాంగ నారీఃపురా। సోయం సంప్రతి కాక తీశ్వగకులే సర్వాంగ నారీఃస్థితః" అనెను. అనగా అర్ధాంగ నారియై కైలాసమందున్న శివుడు కాకతివంశమందు పూర్ణముగ స్త్రీశరీరము ధరించియున్నాడని యర్థము. దీనిని ప్రతాప రుద్రీయ వ్యాఖ్యలో కుమారస్వామి సోమయాజి, సోమదేవరాజీయమునందు రుద్రమ గణపతి యర్ధాంగియని భ్రమపడిరి. అనేక శిలాతామ్ర శాసనములందును, కొలను ఆది గణపతి దేవుని శివయోగ సారమందుగల "గణపతి ధరణీ మండలపతి పుత్రి రుద్రమహాదేవి" అను వాక్యమును బట్టి రుద్రమ గణపతుల సంబంధము స్పష్టమగుచున్నది.

ప్రతాపరుద్రీయములో నాటక ప్రకరణములో అంకారంభమున రాజునకు మంత్రికి జరిగిన సంభాషణము ఆ కాలమున స్త్రీపాలన విపరీతమైనందున, ప్రజలను స్త్రీని రాజుగ గ్రహించుటకు తృప్తిపరచుటకే యైనట్లు గన్పడును. రుద్రమహారాజు రంగస్థలమున కేతెంచి కాకతీయుల కులదైవమైన స్వయం భూదేవుడు భవిష్యత్కాలమున నెట్లు రాజ్యపాలనము చేయవలెనో వుపదేశించుటకై స్వప్నమున సాక్షాత్కరించెనని చెప్పెను. అంతట పురోహితుడు "నీవు స్వయం భూదేవుని సంతానమనిపించుకొను సత్వముగల్గి యుంటివనియు అందువలన తండ్రి కుమారునకు చేయవలసిన విద్యుక్త ధర్మమగు వుపదేశమును స్వయం భూదేవుడు నీకు చేసె"ననియు చెప్పెను. అంతట మంత్రి "అట్లుకాకున్న నిరంకుశాధికారముగల ఒక మహారాజువలె నొకస్త్రీ దేశ

# రుద్రమ దేవి




యువమహారాజ్ఞి కాకతీయ రుద్రమదేవి

" యోరుద్రోరజతాచలేస్థితిమగా దర్ధాంగ నారీః పురా ।
సోయం సంప్రతి కాకతీశ్వరకులే సర్వాంగ నారీః స్థితః ॥ "

మును పాలించుట యెట్లు సాధ్యమగును ? కనుకనే యీశ్వ రాంశ సంభూతుడైన గణపతి మహారాజు తన దివ్యజ్ఞానము చేత తనకు జనించియుండిన బిడ్డ దేశపాలనము జేయుటకు తగిన గుణవిశేషములు గల్గియున్నదని తెలిసికొని లోక వ్యవహారము కొరకు కుమారుడనియే ప్రకటించి రుద్ర దేవుడని నామకరణము చేసె" ననెను.

రుద్రమ రాజ్యపరిపాలనా విశిష్టత ఆమె శాసనములవల్ల దెలియుచున్నది. క్రీ. శ 1261 లో గణపతి మందర గ్రామ మును, రుద్రమ వెలగపూడిని విశ్వేశ్వర శివదేశికునికి దాన మిచ్చిరి. ఈ రెంటినిగల్పి దానగ్రహీత ఒక అగ్రహారమును నిర్మించి విశ్వేశ్వరాలయమును, సత్రమును గట్టించెను. అరువదిమంది ద్రావిడ బ్రాహ్మణుల రప్పించి వారి కొక్కొక్కరికి రెండేసి పుట్లు భూమి, మిగిలిన భూమిని మూడు భాగములుచేసి ఒకభాగము విశ్వేశ్వరునకు, క్రొత్తగా స్థాపింపబడిన శైవమఠమునకు, విద్యార్థులకు కల్పి యొకభాగము, చివరిభాగము ప్రసూతిశాల, ఆరోగ్యశాల, సత్రములకు యిచ్చెను. మొత్తము భూమి 270 పుట్లు గలదు. వృత్తులబొందిన వారందరు తమ నియత కార్యముల యధా విధిగ నొనర్చుచు వృత్తుల శాశ్వతముగ ననుభవింపవలయును. పురుషులులేని పక్షమున స్త్రీలు తమ కార్యముల నితరులచే చేయించుచు వృత్తుల ననుభవించునది. ఏర్పాటులను సరిగ పరీక్షించుటకై యేడాదికి నూరు నిష్కముల జీతముపై నొక స్థానాచార్యుడు నియమింపబడెను. ఇతడు తన పని సరిగ చేయనిపక్షమున స్థానపతులు ఆ పనికి వేరొకని నియమింపవలెనని యున్నది. ఈ విషయములు రుద్రమ మాల్కాపుర శాసనమువల్ల దెలియుచున్నవి. పైన చెప్పిన వృత్తి భూములు అనుభవించుటకు హక్కులున్నను, అమ్మ కొనుటకు, కుదువబెట్టుటకు స్త్రీలకు హక్కులు లేకుండెను.

"ఈశ్వర ప్రసాదాద్భతే నిరంకుశం స్త్రీ వ్యక్తి విశే షస్య లోకాధిపత్యం." అనగా యీశ్వర ప్రసాదమువల్ల స్త్రీకి నిరంకుశ లోకాధిపత్యము వచ్చినదని విద్యానాథుడు చెప్పియున్నాడు. రుద్రమ పురుషనామము వహించుట మొదలుగా యిప్పటికిని రాజవంశములలో స్త్రీలకు అయ్య, అమ్మయ్య అను పురుషనామముల బెట్టుట గన్పడుచున్నది.

రుద్రమకు రాజ్యపరిపాలనలో అతి విశ్వాసముతో తోడ్పడిన మంత్రులు, సామంతులు, ముఖ్యులు కొందరుగలరు. ఇందు లూరి అన్నయమంత్రి రుద్రమకు అల్లుడు; కూతురు రుయ్యా మాంబ భర్త. ఇతడు మహామాత్యుడు. బాహుబల సంపన్నుడు; రాజనీతి విశారదుడు. కాకతీయ రాజ్యమునకు యే యుపద్రవము రాకుండ రక్షించెను. రాజనీతిజ్ఞతయందు విశ్వేశ్వర శివుని యపరావతారముగ యితడు ప్రజలచే నెన్న బడుచుండెను. మల్యాలగుండయ క్రీ. శ. 1259 నాటి బూదపూరు శాసనములో శ్రీమన్మహామండలేశ్వర రుద్ర దేవ మహారాజు ఒరంగల్లు మొదలి పట్నముగా సుఖసం కథావినోదంబుల పృథ్వీ రాజ్యము సేయుచుండగా ఆమెకు దక్షిణభుజముగ నుంటినని చెప్పుకొని యున్నాడు. ఇతని వంశీకులైన మల్యాల వారందరు ఆ కాలమున మహావీరులే; మహాసేనానులే; కాకతీయుల సామంతులుగ విశేష ప్రఖ్యాతి గడించినవారే. జన్నిగదేవుడు రాజద్రోహము జేయబూనిన వారల శిక్షించుచు రుద్రమకు ముఖ్యసేనానిగ నుండెను. త్రిపురాంతకుడు రుద్రమకు ప్రధానిగ, సైన్యా ధ్యక్షుడుగ నుండెను. ఇతని ప్రశస్తిలో కాకతి కులతిలక రుద్రదేవ మహారాజ చరణ నళిన యుగళ సమారాధన అను బిరుదుగలదు. ఇదిగాక బాహత్తరిని యోగాధిపతి, సమధి గల సకల రాజ్యాధిపత్య మహా విభవ బిరుదులు త్రిపురాంత కుడు వహించెను. గోన గన్నయ సాహిణి వర్ధమాన పురము రాజధానిగ రుద్రమ సామంతుడై పాలించెను.

రుద్రమదేవి తండ్రిచే రాజ్యతంత్ర జ్ఞానము చక్కగ గ్రహించిన దగుటచే యాదవ దండయాత్రలనుండి రాజ్య రక్షణకై రాజధాని శిథిల దుర్గభాగముల బాగుచేయించి, కోటల సురక్షితము గావించెను. రాజధాని చుట్టు గంప కోటను కట్టించి, లోపలివైపు మట్టికోటను గట్టించెను. దీనిచుట్టు పెద్ద అగడ్తను త్రవ్వించెను. భూమి కోటకు 8 గవనులు, 18 దిడ్లు, పుట్టకోటకు 4 గవనులు 8 దిడ్లు, రాతికోటకు 4 గవనులు 8 దిడ్లు, లోపలరాతి సోపాన ముల పెట్టించి తన బంధువర్గములోని వీరభటుల నుండ నియమించి, తక్కిన బంధువుల రాతికోటకు లోపలివైపున నున్న యిటుక కోటలో నుండ యాజ్ఞాపించెను. కొమ్మకు

యిర్వురు, బురుజుకు ఏబదుగురు, దిడ్డికి నూర్వురు, గవనుకు ఏనూర్వురు చొప్పున వీరభటుల కావలి యుంచెను. గోన గన్నయ ప్రజారక్షణార్థమై రాచూరు దుర్గమును బలపర్చెను.

రుద్రమ పాలనమున ఆంధ్ర దేశమున దేవాలయములు మంచిస్థితియందుండెను. విద్యానాథుడు, కాకతీయుల వలననే శ్రీశైల, దాక్షారామ, కాళేశ్వరములకు ఘనత వచ్చెనన్నాడు ప్రతాపరుద్ర యశోభూషణములో. ఓరంగల్లుకు నాల్గుమైళ్ల దూరాననున్న మొగిలి చర్లయను గ్రామమున యేక వీరాదేవి ఆలయము గలదు. కాకతీయులు యీ దేవత భక్తులు. రుద్రమదేవి పలుమార్లు యీ ఆలయమునకు పోయివచ్చుచుండెను. ఈమె వడ్డపల్లెలో బుద్ధగణపతిని యారాధించుచుండెను. పద్మాక్షీ దేవికి యుత్సవములు జరిపించెను. జన్నిగదేవుని ప్రాతినిధ్యమున పల్నాటి సీమలో కారెమపూడిలోని సురేశ్వరాలయమునకు ప్రాకార గోపురములు, దుర్గిపట్టణమున గోపినాథుని ఆలయము కట్టబడెను.

గణపతి, రుద్రమల కాలమున దేశము సుభిక్షముగ నుండి విదేశములతో ఎక్కువగ వ్యాపారము సాగుచుండెను. బాపట్ల సమీపమందలి మోటుపల్లి చీనా, బర్మా, పారసీక దేశములతో వ్యాపారము నెరపుచు ప్రసిద్ధికెక్కినది. దీనికి వేలానగరము అను నామాంతరము గలదు. ఈ రేవుపట్నమున క్షీణించిన వ్యాపారమును పునరుద్ధరించుటకై గణపతి వర్తకులకు అభయ శాసనమిచ్చి, అందు తన జీవితము కన్నను, తనకు తన ప్రజల రక్షణమే యెక్కువ ప్రీతికరమని వ్రాయించెను. మరియు సత్ప్రభుత్వముయొక్క ధర్మరక్షణార్థము యశఃకాములై సముద్రయానము విదేశములతో వ్యాపారము చేయు వ్యాపారులనుండి ఒక్క కూప శుల్కము తక్క మరే సుంకము తీసికొనకనెను. ఉత్తరము నుండి దక్షిణమునకుగాని, దక్షిణమునుండి ఉత్తరమునకుగాని పోవుయోడలు వాయువశమున యీ రేవున నెగకపట్టిన పక్షమున, సరకులను యోడదొంగలు ముచ్చిలకుండ కట్టడ బెట్టి, వర్తకులు నిర్భయముగ రాకపోకలు సల్పుటకు మార్గముల నేర్పర్చెను. ఎగుమతి, దిగుమతి సరకులపై సుంకము నిర్ణయించెను. ఇట్లు పునరుద్ధృతమైన ఈ రేవు పట్నము రుద్రమకాలమున సుప్రసిద్ధ వెనీసు యాత్రికుడగు మార్కోపోలోచే శ్లాఘింప బడెను. ఈ శాసనము రెడ్ల రాజ్యకాలమున అనపోతారెడ్డిచే తిరుగ వ్రాయింప బడెను.

రుద్రమ దౌహిత్రుడగు ప్రతాపరుద్రుని పుత్రునివలె పెంచి యువరాజును జేసెను. ఇతడు కుమార రుద్రదేవుడన బడుచుండెను. రాజ్యమునందును, సరిహద్దులందును, అపుడపుడు లేచు విప్లవములను అణచుచు శత్రురాజుల నోడించుచు బహుసమర్థతతో దాదాపు ముప్పదిరెండు సంవత్సరములు కాకతీయ సామ్రాజ్యమును పాలించి ప్రతాప రుద్రునకు బట్టము కట్టింది మహారాజ్ఞి రుద్రమదేవి.

(ఆలిండియా రేడియోవారి సౌజన్యముతో)





విశ్వ సాహిత్య వీధిలో :

# 'బ్రాంటే' సోదరీమణులు

## (BRONTE SISTERS)

※ శ్రీమతి కొత్తపల్లి లలిత ※

ఆంగ్ల సాహిత్యంతో పరిచయం ఉన్న ప్రతివారికీ ఈ పేరు గల సోదరీమణులు పరిచితులే. వారి కల్పనా చాతుర్యంచేత, రచనా నైపుణ్యంచేత వారు విశ్వ సాహిత్యంలో శాశ్వత స్థానాన్ని సంపాదించుకొన్నారు. నైసర్గికమైన ప్రతిభచేత ఈ పేరు సంపాదించుకొన్నారే గాని, వారి సాంఘిక స్థితిగాని, పలుకుబడిగాని, ధనంగాని, వారికి సాయం కాగా సంపాదించుకొన్న పేరు కాదది.

ఛార్లొట్, ఎమిలీ, ఆనే—అను వీరు ముగ్గురు సోదరీమణులు "పేట్రిక్ బ్రాంటే" అనే ఒక చర్చి ఉద్యోగి కుమార్తెలు. "హావర్త్" అనే 'యార్క్‌షైర్' (ఇంగ్లండు) లోని ఒక గ్రామంలో అతడుద్యోగి. దరిద్రం నాలుగో సోదరిగా పుట్టిన కష్టజీవులు. వీరిలో ఛార్లొట్ (1916—1855) పెద్దది. 'ఆనే' పుట్టిన కొద్ది కాలానికే వాళ్లతల్లి చనిపోవడంచేత సంసారభారం అంతా, పెద్దదైన ఛార్లొట్ మీద పడింది. కుటుంబం పెద్దది. డబ్బులేదు. పైగా శరీరాలలో దీర్ఘానారోగ్యం. తండ్రి వికలాంగుడు. 'పులిమీదపుట్ర' అన్నట్లు ఈ కుటుంబానికి తోడు ఎందూకూ కొఱగాకుండా పోయిన ఒక సోదరుడు. అతనిపేరు "పేట్రిక్ బ్రాన్‌వెల్ బ్రాంటే." అక్కచెల్లెళ్లకు ఇతనంటే ప్రాణం. అతన్ని అతిగా ప్రేమించి చెడగొట్టినారు కూడా! ఏదో వంశోద్ధారకుడవుతాడని ఆశించి కష్టనష్టాల్ని లెక్కపెట్టకుండా అతనికి చదువు చెప్పించి పైకి తీసుకొని రావాలని అక్కచెల్లెళ్ల వ్రతం. చదవక పూర్వం 'కాకరకాయ' అన్న ఇతడు చదివించిన తర్వాత 'కీకరకాయ' అండం మొదలుపెట్టినాడు. చిన్నప్పుడేదో కొంత కళావిషయిక ప్రజ్ఞచూపగా, సోదరీలు అతన్ని రాయల్ ఎకాడెమీ (లండను) నకు పంపినారు. అతడక్కడ విశృంఖలంగా తిరిగి అక్కచెల్లెళ్లు తాము పస్తుండి పంపించేడబ్బు దండుగచేసి ఇంటికి తిరిగి వచ్చినాడు. వచ్చేటప్పుడు తనతో 'మధుపాత్ర'ను ప్రియురాలిగా తెచ్చుకొన్నాడు. మిగిలిన కాలమంతా తమ ఊళ్లో ఉన్న 'కల్లుదుకాణాల్ని' సేవించడంతో గడిపి నిష్ఫలుడైనాడు.

ఇదంతా దరిద్రంతో కుమిలి పోతున్న వారిమీద 'మూలిగే నక్కపై తాటిపండు' పడ్డట్లు వచ్చిపడింది. ఇంతే కాకుండా, వారికి ఇరుగుపొరుగు లేకుండ, బాధ కలిగించె అంత ఏకాంతంగా జీవించ వలసిన దుర్గతికూడా. 'హావర్త్' అనే వాళ్లపల్లె' యార్క్‌షైర్' లో అతినిర్జన ప్రదేశం మధ్య వుంది. భూమి సారవంతమైనదికాదు. విపరీతంగా భరించలేనంతగా గాలులు. కాని, ఈ సోదరీమణులు వాళ్ల బాల్యజీవితం అంతా అక్కడే గడపడం మూలాన్ని వాళ్లకి అది స్వర్గంకంటె గరీయసి అయింది. వీళ్లముగ్గురిలోను 'ఎమిలీ' ఆ ప్రాంతాన్ని మరీ ప్రేమించింది కూడాను. ఆమె 'విదరింగ్ హైట్స్' అనే పుస్తకంలో అక్కడ సీనరీని వర్ణించి దాన్ని శాశ్వతం చేసింది. ఆమెకు ఆ వాతావరణం, ఆ పరిసరాలు ఎంత ఆవశ్యకాలయ్యాయంటే, వాటినివదలి పైకి పోయినప్పుడు ఆమెకు అనారోగ్యం అధికమైందికూడా.

ఇంక పై ప్రపంచంలోకి పోయి జీవనాధారాన్ని సంపాదించు కొనవలసిన అవసరం పెద్దదైన ఛార్లొట్‌కి పట్టింది. ఆమె చదువుచెప్పే దాదిగా ఎర్పడాలనుకొన్నది. ఇది తలచుకొంటేనే నవ్వు వచ్చే విషయం. చిలిపి పిల్లలతో వేగే బలంగాని, ఓపికకాని ఈమెకు లేనే లేవు. పైగా దృష్టిదోషం కూడాను. వంగి, పుస్తకానికి ముక్కు తగిలేటట్టు పెట్టి చదువుతేనే గాని ఈమెకు అక్షరాలు ఆనేవే కావు. కనుక ఎవరేనా తలపైకి ఎత్తు అంటే, దానితోటే పుస్తకంకూడా ముక్కుకి తగులుతూ పైకి పోయేది.

పైగా ఈమెకు చదువేమీ అంటలేదు. 19 వ శతాబ్దిలోని చర్చికి సంబంధించిన బాలికల పాఠశాలలు దోషదుష్టములు. ఇలాంటి ఒక పాఠశాలకే ఛార్లొట్, ఎమిలీలు పంప బడ్డారు. చిన్న తనంలో అక్కడ దండానికి ఇచ్చిన ప్రాముఖ్యం బోధనకు ఇవ్వలేదు. నరకంలాగ ఉండేవి అవి. తరువాత ఛార్లొట్ వాని నిజస్థితి తన 'జేన్ ఐర్' అనే నవలలో వర్ణించి, ఆ పాఠశాలలను ప్రపంచం అంతా గర్హించు కొనేటట్టు చేసింది.

ఇన్ని ప్రతి కూల విషయాలలో కూడా ఆత్మ విశ్వాసాన్ని, ధైర్యాన్ని కోలుపోక, ఆమె కుటుంబాభివృద్ధి తన ఏకైక లక్ష్యంగా పెట్టుకొని ప్రపంచంలోకి అడుగు పెట్టింది. మిగిలిన చెల్లెళ్లకంటె ఆమె కొంచెం ఆరోగ్య వంతురాలు గనుక ఈ బాధ్యత నిర్వహించడం తన కర్తవ్యం అని నిర్ణయించుకొన్నది. ప్రతిచోట, మొదట్లో అపజయాన్నే పొందింది. కాని ఆమె ధైర్యకంచుకం సడలలేదు. ఆమెలో ఉన్న గొప్పశక్తి ఈ పట్టుదల, కష్టాలను లెక్కచేయక పోవడమే. ప్రతికష్టం ఆమె పట్టుదలని రెట్టింపు చేసింది. కర్తవ్యతాపాలనం ఆమె ఏకైక లక్ష్యం గదా! ప్రారంభించిన కార్యాన్ని మధ్యలో వదలే చపలచిత్తురాలు కాదామె. అనేక నిష్ఫల కృషుల తర్వాత ఆమె 'బ్రసెల్స్' లో ఒక బాలికా పాఠశాలలో చేరింది. తన యోగ్యతలను అధికం చేసుకోడం కోసం ఫ్రెంచి భాష అభ్యసించాలని ఆమె కుతూహలం. ఆ పాఠశాలలో అనేక ధనవంతుల బాలికలు, రంగు రంగుల దుస్తులతో, ఫాషనులతో ఉన్నవారు, చదువుతుండే వారు. వారిమధ్య సహజ సౌందర్యంలేని, కృత్రిమ సౌందర్యాన్ని కల్పించే దుస్తులేనాలేని, పేద రాలగు ఛార్లొట్ మెలగవలసి వచ్చింది. ఆమె తన కర్తవ్య పాలనం కోసం దృఢసంకల్పం కలదై ఉన్నందువల్ల ఈ చిన్నచిన్న అడ్డంకులు ఆమెను భయపెట్టలేక పోయినవి. అంతిమ జయం తనదే అనే గాఢవిశ్వాసంతో ఆమె, తక్కిన బాలికలపై తన వ్యక్తిత్వ ప్రభావం పడేటట్లు ప్రవర్తించింది. ఆమె అచల దీక్షముందు, మిగిలిన బాలికలు నిలువలేక కడకు ఆమెకు దాసోహమ్మనక తప్పలేదు. ఈ సంగతులన్నీ ఆమె గ్రంథమైన 'విల్లెట్' లో మనోహరంగా, కళ్లకు కట్టినట్లు వర్ణింప బడ్డాయి.

ఈ విధమైన పట్టుదల వలననే, ఈ ముగ్గురు సోదరీమణులు, అనేక కష్టముల నడుమ నిశ్చలంగా ఉండి ప్రపంచ విఖ్యాతి పొందిన రచనలు సాగించ గలిగినారు. సంసార పరిస్థితులుగాని, సాంఘిక స్థితిగాని, దేహారోగ్యం గాని వారికి అనుకూలంగా, లేనేలేవు. కాని నవనవోన్మేషశాలిని అయిన ప్రజ్ఞ వారికి ఎంతేని కలదు. ఆ ప్రతిభచేతనే సాహిత్య లోకంలో ఎన్నడూ చ్యుతంకాని ధ్రువస్థానాన్ని పొందగలిగినారు. ఈ ప్రతిభ చాలా విచిత్రమైనది. సామాన్యంగా ఎవరూ ఊహించ లేనిచోట అకస్మాత్తుగా ఉదయిస్తుంది. దాని ప్రాదుర్భావానికి జాతి, మత వివక్షత లేదు. కుల గోత్రములు అక్కరలేదు. స్త్రీ పురుష వివక్ష అసలేలేదు. కాని ప్రపంచంలో ప్రతి దేశంలోను అత్యుత్తమమైన కళాసృష్టిగాని శిల్పనిర్మాణంగాని, గణిత నైపుణ్యంగాని చూపిన స్త్రీలు తక్కువమందే ఉన్నారు. దీనికి కారణం స్త్రీకి ఆర్థికంగా పురుషుని కున్నంత స్వేచ్ఛ లేకపోవడం కావచ్చు. మత విషయకంగా చూస్తే, మొదటి క్రైస్తవ ప్రచారకులు స్త్రీకి ఆత్మలేదని సందేహించినట్లు కూడా తెలుస్తుంది!

కాని, మిగిలిన విషయాలమాట అటుంచి, భావనా ప్రపంచానికి సంబంధించిన విషయాలను గ్రహిస్తే స్త్రీలు పురుషుల కేమాత్రం తీసిపోరని వ్యక్తమవుతుంది. ఆంగ్ల సాహిత్యాన్ని ఉద్దేశించి వ్రాస్తూ సి. ఇ. ఎమ్. జోడ్ "జేన్ ఆస్టిన్, బ్రాంటీ సోదరీలు, జార్జి ఎలియట్, కేథరిన్ మాన్స్‌ఫీల్డు మున్నగువారు, ఆంగ్ల సాహిత్యములోని గొప్ప ఊహా రచయితలకు తీసిపోనివారు," అని అన్నారు.

స్త్రీలు ఇట్టి భావనా ప్రపంచానికి సంబంధించిన రచనలలో పురుషులను మించడానికి గాని, సమం కావడానికి గాని, కారణం ఏమిటని విమర్శకులు వితర్కిస్తూనే ఉన్నారు. చివరికి, స్త్రీలకు పురుషులకంటె, వ్యక్తులుగా ప్రజలను పరిశీలించే ప్రతిభ అధికంగా ఉండడమే అని తేల్చినారు. అందుచేతనే కళ్లకు కట్టినట్లుగా పాత్రలను— అందులో ముఖ్యంగా స్త్రీ పాత్రలను— సృష్టించడంలో

స్త్రీ రచయితలదే పై చేయి అని తేలింది. ఈ రచనా నైపుణ్యమే "బ్రాంటీ" సోదరీమణుల దగ్గర ఉన్నది. చిన్ననాటి నుండి, నిశితంగా పరిసరాలను చూడ్డం, భావాంబర వీధిలో విహరించడం వీరికి 'వెన్నతో పెట్టిన విద్య.' 'ఛార్లొట్' నకు పదిహేను సంవత్సరాలున్నప్పుడే, ఆ సోదరీమణులు వాళ్ల సోదరుని సహాయంతో ఒక మాసపత్రిక నడిపి చర్చి ఉద్యోగుల్ని ఆశ్చర్య చకితులను చేశారు. అందులోని వ్యాసాలన్నీ వారే వ్రాసేవారు కూడా. గృహకృత్య నిర్వహణం చేసుకొంటూ, తీరిక ఉన్నప్పుడు రచనలు సాగిస్తూ ఉండేవారు. సామాన్య వ్యక్తులవద్ద కనరాని పట్టుదల, కృషి, మనస్సుని తమ పనియందే లగ్నంచేసే శక్తి, వీరియందు ముఖ్యంగా గోచరిస్తాయి.

వీళ్ల ముగ్గురిలోను 'ఎమిలీ' మరీ "భావాంబర వీధి విశ్రుత విహారిణి." వంటపని అంతా ఆమె వంతు. వంట చేసుకొంటూ ఆమె విద్యా వ్యాసంగం ఎలా చేసేదో ఈ క్రింది వాక్యం చూపుతుంది.

" Anyone passing by the kitchen door might have seen her studying German out of an open book, propped up before her, as she kneaded the dough; but no study, however interesting, interfered with the goodness of the bread, which was always light and excellent." (Mrs. Gaskell's Life of Charlotte Bronte.")

ఈ విధంగా, విశేషాను భూతులకు అవకాశమే లేని జీవితాలు ఒక కుగ్రామంలో గడుపుతూ కూడా, వాళ్ల ప్రతిభచేత, మానవ జీవితంలోని సుఖదుఃఖాలు, మంచి చెడ్డలు, క్రౌర్యం మొదలగు వాటినిగూర్చి అతి మనోహరంగా వ్రాయగలిగినారు. నైసర్గికమైన ప్రతిభా సూర్యుడు తన కిరణాలను ప్రసరింపలేని మానవ హృదయ కుహరం ఉందా! వాళ్ల రచనా పుష్పాలలో ఒక విధమైన, వెగటు కొల్పని, సుగంధం ఉన్నది. రచనకు పుష్టినిచ్చేది అదే.

వీళ్ల రచన లన్నింటిలోను ఛార్లొట్ యొక్క జేన్ ఐర్‌ను, ఎమిలీ యొక్క విదరింగ్ హైట్స్‌ను అత్యంతోత్తమ రచనలు. ఆ రచనలు ఎంత విచిత్రాలైనవంటే, అవి వ్రాసినవారు పిచ్చివారేమో అని కొందరు సందేహించారు కూడా. జేన్ ఐర్ లోని కథ సంగ్రహంగా ఇది. నాయిక అయిన జేన్, పిల్లలకు చదువు చెప్పేదాదిగా 'రాచెస్టర్' అనే ధనవంతుని ఇంటిలో కుదురుతుంది. అతనికి ఒక పిచ్చిభార్య ఉన్నది. ఆమె ఆ మహా సౌధంలో ఒక మూల నివసించేది. రాచెస్టర్ తన ఇంటిలో ఉన్న జేన్‌ను ప్రేమిస్తాడు. ఆమె ఆ ప్రేమను అంగీకరిస్తుంది. కాని అతడు వివాహితుడని తెలియగానే ఆ ఇల్లువదలి వెళ్లిపోతుంది. చివరికి రాచెస్టర్ యొక్క పిచ్చిభార్య తప్పించుకొని ఆ యింటికి నిప్పు పెట్టుతుంది. అతడు ఆమెను రక్షింపబోయి నిప్పువల్ల శాశ్వతంగా అంధుడవుతాడు. జేన్ అప్పుడు తిరిగి వచ్చి అతన్ని వివాహం చేసుకొని అంధుడైన అతనికి అండగా నిలుస్తుంది. ఇదీకథ. ఈ చిన్న సామాన్యమైన కథను తన ప్రతిభా విశేషంచేత అసామాన్యంగా దిద్ది తీర్చింది ఛార్లొట్. జేన్ ఐర్ లో ఛార్లొట్ జీవిత ఛాయలు కనబడును.

ఎమిలీ వ్రాసిన 'విదరింగ్ హైట్స్' ఇంకా అద్భుత జనకమైనది. మొదటి పేజీ మొదలు చివరి పేజీదాకా మన చేత ఊపిరి తీయనీదు కూడా! దానిలోని ముఖ్యపాత్ర హీత్ క్లిఫ్ మనిషికాదు. ఒక రాక్షసి. కొందరు విమర్శకులు ఈ పాత్ర, పురుషునిలో స్త్రీలు చూచే రాక్షసత్వాన్ని ప్రతిబింబించేది అన్నారు. అలా అనడంకంటె మానవునిలో—స్త్రీకాని, పురుషుడుకాని—ఉన్న పశుత్వానికిది ప్రతిబింబం అనడం మంచిదేమో! కాని మనం గుర్తించవలసినది ఒకటి. ఈ సోదరీమణుల నవలలలోని పురుషులు సహజ వ్యక్తులుకారు. వారు అతి బలవంతులుకాని, అతి క్రూరులుకాని, అతి మృదుల హృదయులుకాని అయి ఉన్నారు. ఇది అసహజమైన పాత్రచిత్రణం. కాన, స్త్రీ పాత్రలను అతి సహజంగా దిద్ది తీర్చిన పురుషులుగాని, పురుషపాత్రలను నిజస్థితిలో చూపగలిగిన స్త్రీలుగాని లేరని కొందరి ఊహ.

వీరి ప్రతిభనుబట్టి మెల్లిగా కీర్తి రాజొచ్చినది. రత్నం ప్రపంచానికి తెలియజేయబడకుండా ఎంతకాలం ఉంటుంది! వాళ్ల పుస్తకాల్ని ప్రచురించుకొనే విషయంలో

కూడా వాళ్లు చాలా బాధలు పడ్డారు. లండనులో వీధులలో నడవడానికి—అలవాటులేక—వీళ్లు భయపడేవారట! ఈ పుస్తకాల్ని సమీక్షించేవారు, ఈ సోదరీమణులనుగూర్చి తెలియక, పురుషులా పుస్తకాల్ని వ్రాశారనుకొని, రచయితలతిక్రూరులని వ్రాశారట కూడా! పొరపాటున ఆ సోదరీ మణులపేర్లు, క్యూరెర్ ఎల్లిస్, ఏక్టన్, బెల్ అని ప్రచురింప బడ్డాయట! ఇన్ని కష్టాలు పడ్డా, చివరికి దిగ్విజయం సాధించారు. గింజలో ప్రాణం ఉంటే, మొక్క మొలవడం ఆలస్యం కావచ్చు కాని, అనుకూల పరిస్థితులేర్పడ్డప్పుడు అసలు మొలవడం మానేస్తుందా! వారి కీర్తి బీజం— మొలక ఎత్తి, ఆకులేసి మొగ్గదొడిగి— క్రమక్రమంగా మహా వృక్షమై సాహిత్య క్షేత్రంలో శాశ్వతంగా నిలిచిఉంది.

ఇట్టి ఉత్తమ రచనలు చేసిన స్త్రీలను గూర్చి మనకి చాల తక్కువగా తెలుసును. పాశ్చాత్య రచయితలను గూర్చి అసలే తెలియదు. వారి రచనలు మన భాషలోనికి పరివర్తింప బడక పోడమే దీనికి కారణం. స్వతంత్ర రచన చేయడం ఎంతకష్టమో, ఉత్తమ అనువాదం చెయ్యడం కూడా అంతకష్టమే. పాశ్చాత్యులలో ఫిడ్జెరాల్డ్ మొదలగు వారికీర్తి వారి అనువాదాలవల్ల వచ్చినదే, కనుక అనువాదం, అపకర్ష హేతువనుకోకుండా మన రచయితలు, పాశ్చాత్య సాహిత్యంలోని ఉత్తమ రచనలను అనువాదంచేస్తే, మన సాహిత్యానికి, మన ప్రజానీకానికి ఎంతో సేవ చేసినవారవుతారు. పూర్వం సంస్కృతంలో నుండి తెలుగులోకి అనువాదం చేసిన కవులను మనం నేడు గౌరవించడం లేదా?

నేడు అనువాద సాహిత్యానికి, మన సాహిత్యంలో విశిష్టస్థానం ఉంది. పాశ్చాత్య దేశాలలో—ఒక సాహిత్యంలోని ఉత్తమ గ్రంథాలు ఇంకొక దానిలోకి వెళ్లకుండా లేనేలేవు. షేక్స్పియరును ఇంగ్లండులో ఎంత ఎరుగుదురో ఫ్రాంసులోను, ఇటలీలోనే అంత ఎరుగుదురు. మోలియర్, డాంటేలను ఫ్రాంసు ఇటలీలలో ఎంత ఎరుగుదురో ఇంగ్లండులోను అంత ఎరుగుదురు. ఈ ఇచ్చి పుచ్చుకోడాలు ఉన్నప్పుడే సాహిత్యం అభివృద్ధి పొందడం జరుగుతుంది. సాహిత్యంద్వారా మానవులు సన్నిహితులవడం కూడా ఆ నాడే జరుగుతుంది. అప్పుడే ఈ రకమైన వ్యాసాలకు పూర్ణోపయోగం కలుగుతుంది. లేకపోతే ఇట్టివి అరణ్యరోదనాలు అవుతాయి. కనుక, మన రచయితలు అన్య సాహిత్యాలలోని ఉత్తమ రచనలు మన సాహిత్యంలోకి తీసుకొని రావడం కూడా ఒక అభ్యుదయ కారకంగా ఎంచుకోవాలి.



శ్రీమతి సుభద్రా కుమారి చౌహాన్

# ముగ్గురు పిల్లలు

అనువాదం : సౌభాగ్యరావు

[ఇంతవరకు : ముగ్గురు భిక్షుక పిల్లలు—తండ్రి తాగుబోతై జెయిలులో వుంటే, తండ్రిని పట్టిన పోలీసులను కొట్టి తల్లి జెయిలుకెళ్తుంది—జెయిలుకు ప్రక్కనే ఉన్న కాలువ వంతెన క్రింద రాత్రిళ్లు, భిక్షాటనలో రోడ్లమీద పగళ్లు గడుపుతూ ఉంటారు. చక్కటి పాటలు పాడేకారణాన, నా ముగ్గురు పిల్లలకు వీరి యందు అభిమానము కలిగి, వారి దీనావస్థకు నా పిల్లలకూ నాకూ హృదయం కరగిపోయి, ప్రతిదినమూ వారికి అన్నం పెట్టూ, ఒకనాడు పాతబట్టలను యిచ్చాము. తరువాత....]

3

ఈ ఘటన జరిగిన మరుసటి రోజున నేను సత్యాగ్రహం చేశాను. ప్రభుత్వంవారు నన్ను జయిలుకు అతిథిగా తీసుకు పోయారు. నా పిల్లలు అందరూ సంతోషంతో నన్ను సాగనంపారు. ఉమ అందరికంటె చాల చిన్నది. నన్ను విడిచి ఒంటరిగా యింటిలో ఉండలేదు. నాతోపాటే జయిలు ఆతిథ్యం స్వీకరించింది.

నేను సత్యాగ్రహం చేసినప్పుడు రాజమండ్రిలో రాచకీయ కయిదీలులేరు. రాచకీయ స్త్రీ ఖయిదీలలో వంటరిదాన నవటంచేత నన్ను హాస్పటలులో ఉంచారు. నాకు సహాయంగా సాధారణ ఆడ ఖయిదీలను ఇద్దరిని యిచ్చారు. వారు రాత్రిళ్లు నా దగ్గరనే ఉంటారు. పగలు ఖయిదీలందరము కలిసిమెలిసి ఉండవచ్చు.

ఖయిదీల జీవితం చాల విచిత్రంగా ఉంటుంది.

"ఈమె దొంగతనం చేసిందా?"

"ఈమె గంజాయి అమ్ముతూ ఉంటుంది. తన కన్న బిడ్డను కూడా చంపటానికి యత్నించింది. పట్టుబడి జయిలుకు వచ్చింది"

"స్త్రీ అబల అని, మమకారమూర్తి అని ప్రతీతి గదా! ఈమె తల్లియై కన్నబిడ్డను హత్యచేయ సాహసిస్తుందా" అని నాకు సందేహం కల్గింది. స్త్రీ ఇంత సాహసం, అన్యాయం, అఘాయిత్యం చేస్తుందా అని ఆశ్చర్యం కల్గింది. నాకు మటుకు నమ్మకం కల్గలేదు.

"ఈ బాలికెందుకు వచ్చింది? వయస్సుచాల తక్కువేనే! ఏం చేసింది?"

"ఈమె తన భర్తకు, అత్తకు మందు పెట్టింది!!"

ఈ మాట చెవినిపడగానే నాకు వణుకు పుట్టింది!

"ఓ విధాతా! వీరందరూ అబలలేనా? నీ సృష్టి వైపరీత్యమేనా యిది? వీరిని నీవేనా సృష్టించింది?" ఇట్లా అనుకుంటూ ఉండగానే నన్ను ఎవరో తట్టి పిలిచినట్లనిపించింది. "నీవు ఒక పక్షమే ఆలోచించావు, రెండో పక్షంకూడ ఆలోచించి చూడు! వీరు నిర్దోషులు కావచ్చు, దేవతలూ కావచ్చు" అని.

నాకు సహాయార్థం యిద్దరు స్త్రీలను యిచ్చారు. ఒకతె పనీపాటు చాతకాని పెంకిది. రెండవది తెలివైనది. చురుకైనది. పనిపాటలు చక్కగా చెప్పకుండానే అన్నీ చేస్తుంది. అనుభవంకలది.

ఆమెచంకన ఒక పిల్లవాడున్నాడు. పనులు చాల ఉబలాటంగా చేస్తుంది. అయినా మౌనంగా ఉంటుంది. ఆమె ఎప్పుడూ ఆలోచిస్తున్నట్టుగా కనిపిస్తుంది. ఉమను మచ్చిక

చేసుకుంది. అది ఆమె దగ్గర తనతల్లివద్ద వున్నట్లే ఉంటూ ఉంది. ఆమె గిన్నెలు, చెంబులు తోముతుంటే ఉమ గ్లాసులు తోముతుంది. ఇట్లా కొన్నాళ్లు గడిచినవి. ఉమను ఆమె ఏపనిచేసినా, వీపుకు కట్టుకుని చేస్తూ ఉంది. ఆమె పేరు కస్తూరి.

ఉమకు, కస్తూరికి తల్లీ బిడ్డలవంటి ప్రేమ, మమకారం ఏర్పడ్డది. కస్తూరి బిడ్డకు తల్లిప్రేమ లభించటంలేదు. నేను ఉమకు తెప్పించినపండ్లు, మిఠాయిలు పెట్టి వాడికి కల్గుతూ ఉన్న లోటును పూర్తి చేస్తున్నాను. వాడు నాదగ్గరే ఆడుకుంటున్నాడు. తల్లిని మరుస్తూ ఉన్నాడు. వాడికి పండ్లు పెడుతూఉంటే వాడు ఆరోగ్యంగా ఉన్నాడు. కస్తూరితో పాటు ఉమచెంబులు తోమటం, నీళ్లు తేవటం మొక్కలకు నీళ్లు పోయటం, పనులన్నీ చేస్తూ ఉంటే దాని ఆరోగ్యమూ బాగా ఉన్నది.

ఈ కస్తూరి ఎవరా అని నేనెప్పుడూ ఆమెను గురించే ఆలోచిస్తూ ఉండేదానిని. జయిలుకు ఎందుకు వచ్చింది? అనే ఆలోచనే నన్ను పట్టుకు పీడిస్తూ ఉంది. అనుకోకుండానే ఒకరోజున మేట్రన్‌ను అడిగాను. "ఓహో! ఈమేనా! చాల ప్రమాదమైంది. ఈమె పోలీసును కొట్టింది. మేము ఈమె కోరలు ఊడబెరికాం లెండి. మీకేమయినా యిబ్బంది కలుగజేస్తూ ఉందా?" అని మేట్రన్ అడిగింది.

నాకు వెంటనే పాటలు పాడుతూ, బిచ్చమెత్తుకునే ఆ ముగ్గురు పిల్లలు గుర్తుకు వచ్చారు. వాళ్ల అమ్మకూడ పోలీసును కొట్టిందట. అందుకే జెయిలుకు వెళ్లిందన్నారు. ఆమెతోకూడ ఒక చిన్న పిల్లవాడున్నాడని చెప్పారు. ఆమె ఈమె కాదు గదా!

కస్తూరిని ఎన్నో సార్లు అడిగి తెలిసికుందామనుకున్నా. కాని, సాహసం కల్గలేదు. ఆమె గంభీరాకృతిని, దుఃఖావృతమైన ఆమె ముఖాన్ని చూస్తే ఆమెను ఏమీ అడుగుటకు బుద్ధి పుట్టేది కాదు.

ఒకరోజున విపరీతంగా వాన కురిసింది. ఉరుములు ఉరిమినవి. మెరుపులు మెరిసినవి. ప్రకృతి ప్రళయ తాండవాన్ని చూసే సరికి నాకూ భయం వేసింది. ఇంటి దగ్గర విడిచిపెట్టి వచ్చిన పిల్లలు జ్ఞప్తికి వచ్చారు. కడసారి వాడు మరీ భయస్తుడు. ఉరుము ఉరిమిందంటే నన్ను కావిలించుకుని పడుకునే వాడు. వాళ్లతోపాటు వంతెన క్రింద పడుకునే ముగ్గురు పిల్లలూ స్మృతిలోకి వచ్చారు. బహుశ......అంతకెక్కువ ఆలోచించలేక పోయాను. ఆలోచించాలని ప్రయత్నించినా ధైర్యం కల్గలేదు. వెంటనే ఆ పరాత్పరుణ్ణి—"ఓ పరాత్పరా! ప్రపంచంలోని తల్లుల బిడ్డల నందరినీ కనికరించు. ఆ తరువాత నా బిడ్డలను కూడా ఒక్కసారి చూడు" అని ప్రార్థించాను.

౪

జెయిలులో చదువుకొనటానికి నాకు వార్తా పత్రికలు వస్తూ ఉండేవి. అడ ఖయిదీలందరూ యుద్ధ వార్తలు వినాలని ఉబలాట పడుతూ ఉండేవారు. ఎప్పుడో ఒకప్పుడు జెయిలు ద్వారాలు తెరుచుకుంటై. శిక్షపూర్తి కాకపూర్వమే జెయిలులో నుంచి వెళ్లిపోతాము అని అందరూ కలలు కంటూ ఉండేవారు. నేను పత్రికలు చదివి విదేశవార్తలు, భారత దేశంలోని సత్యాగ్రహోద్యమం దోళనను గురించి చెపుతూ ఉండే దానిని.

సాయంత్రం పత్రిక వచ్చింది. పత్రిక చదువుతూ ఉంటే గుండె దడదడా కొట్టుకుంది.

## రాజమండ్రిలో కుంభ వృష్టి
## ముగ్గురు అనాథ పిల్లల మృతి

"నిన్నరాత్రి అంతా ఎడతెగని వర్షం కురిసింది. జెయిలు ప్రక్కన ఉన్న కాల్వలోనుంచి ముగ్గురు పిల్లల శవాలు కొట్టుకు వచ్చినవి. ఎంత విచారించినా ఆ పిల్లలు ఎవరో తెలియలేదు. ఆ మూడు శవాలలో ఇద్దరు ఆడపిల్లలు, ఒకడు మగ పిల్లవాడు. కొంతమంది వీళ్లు పాటలుపాడుతూ బిచ్చమెత్తుకుంటూ ఉండేవారని అంటున్నారు"

ఆ ముగ్గురు పిల్లల చిత్రాలు తక్షణమే నా కన్నులకు సినిమా బొమ్మలవలె కన్పించినవి. దూరంగా వాళ్లు పాట పాడుతున్నట్లనిపించింది.

# ముగ్గురు పిల్లలు

పత్రిక ప్రక్కన పెట్టి కన్నీటిని తుడుచుకున్నాను. "పాపం దిక్కులేని అనాథలు!" అని నానోటి వెంట అకస్మాత్తుగా వచ్చింది.

కస్తూరి కాఫీ కాస్తూఉన్నది. నామాట విన్నది—"పత్రికలోని సంగతులేమిటి అమ్మగారూ! విచారంగా ఉన్నారెందుకు? ఇంటిదగ్గర పిల్లలు జ్ఞాపకానికి వచ్చారా?" అని అడిగింది.

నేను ఆమెకు జవాబు చెప్పలేక పోయాను. ఆమె మళ్లీ—"గడువు పూర్తి కావచ్చిందిగా అమ్మగారు. ఈ నాలుగు రోజులూ ఎలాగో ఒకలాగున గడిచిపోతై. ఇంటి దగ్గర పిల్లల్ని వాళ్ల నాన్నగారు చూస్తారయ్యే. దిగాలబోతా వేం అమ్మా?" అని ఓదార్పుగా అన్నది.

కస్తూరి వంక చూచుటకు భయంతోస్తూ ఉంది. ధైర్యం కలగటం లేదు. కాని ఆమె నన్ను ఓదార్చుతూనే ఒక నిట్టూర్పువిడిచి, తనకన్నులను తుడుచుకోవడం చూచాను. ఆఖరుకు ధైర్యం తెచ్చుకుని ఆమెను—"కస్తూరీ, నీకు ఇంకా పిల్లలు ఉన్నారా? వీడు ఒక్కడేనా?" అని ప్రశ్నించాను.

కండ్లలోకి కన్నీరు, పెదవులపైకి చిరునవ్వును తెచ్చుకొని—"ఒకడంటారేమిటి అమ్మగారూ? ఈ అమ్మాయి కూడా ఉందిగా" అంటూ ఉమను చూపింది.

కస్తూరి గాఢంగా శ్వాసపీలుస్తూ—"జెయిలుబయటి వాళ్లేనా? వాళ్లు ఆ దేవుడి బిడలు అమ్మగారూ—నా పిల్లలని ఎట్లా చెప్పను?" అని కన్నీరు కారుస్తూ అన్నది.

ఆమె మాటలు వింటూ ఉంటే నా హృదయం దుఃఖంతో ఉప్పొంగి పోయింది. ఆమె ఇంకా పత్రికలోని వార్తలు చెప్పమని కోరింది. కాని నే నామెకు ఏమీ చెప్పలేక పోయాను.



# రాధిక

* శ్రీ చల్లా లక్ష్మీనరసింహశాస్త్రి *

గీ॥ అమృతవాహినీ వీచికలందు దూగి
మున్గుచుఁ దేలుచు మురియు ముగ్ధజీవి!
తనువు ప్రాణము ప్రేమయు తగవు నొసగి
దాసిగా కృష్ణు గొల్చెడు ధన్యజీవి!

గీ॥ భక్తియో ప్రేమయో లేక ప్రణయమేమొ!
ఎరుగజాలము రూఢిగా నిర్ణయింప!
త్యాగశీలయెగా నోపు తపసియేమొ
అంతరంగంబు పరికింప నర్హులెవరు?

గీ॥ మురళి మ్రోయించి మనమును జూరగొన్న
గొల్ల గోపాలు గాంచక గొల్లపడుచు
నిముసమైనను నిలువగా నేరదకట!
వేణుగానంబులో నేమి వేచియుండె!

గీ॥ "ఎచ్చటున్నాడవో ప్రియా యేలరావు!
కోపమా నా పయిని నీకు గోపబాల!
విరహ వేదనతో నన్ను నారడించి
దుఃఖమందగ జేసిన దోసమేమి?"

గీ॥ "నీదు పాద ద్వయంబునే నిల్పి మదిని
ప్రేమతోడుత దీననై వేడుచుండ
కఠిన మూనుచు నుంటివా కంసవైరి!
లేక భక్తి పరీక్షయా లక్ష్మీనాథ!"

గీ॥ "నీదు నెమ్మోము గాంచగ నిఖిల జగము
కన్నులఁ గట్టినట్లుండు కమలనాథ
నీలిరూపంబులోననే నిత్యమైన
కృష్ణ పరమాత్మ వసియించి కృపనుగాచు!



ప్రాత పాటలకును పాండవుల యజ్ఞాత వాసమునకునుగల పరస్పర సంబంధము

# జోలపాట

✻ శ్రీ పప్పు సోమేశ్వరరావు ✻

ఏడువకు ఏడువకు వెర్రి అబ్బాయి
ఏడుస్తె నీ కళ్లు నీలాలుగారు
నీలాలుగారితే నే చూడలేను
పాలైనకారవే బంగారు కండ్లు
జోలల్లు పాడితే బాలురకు నిద్ర
నాగస్వరమూదితే నాగులకు ఆట
జోల మావిళ్లమ్మ దూరాన గలవు
జోడించి తెస్తాడు అబ్బాయి మామ.

సందర్భము :—

"దక్షిణ గోగ్రహణ సమయమున గోవులను మరలించుటకై విరాట్రాజు ధర్మ, భీమ, నకుల, సహదేవులతోడను, సైన్యముతోడను వెడలిపోయెను. ఇంటివద్ద ఉత్తరుడు, బృహన్నలయును, స్త్రీలును మాత్రము మిగిలిరి. ఆ సమయమునసే ఉత్తర గోగ్రహణము సేయబడెను. ఆ సంగతిని గోపాలకులు వచ్చి ఉత్తరుని వద్ద మొరబెట్టుకొనిరి. ఉత్తరుడు స్త్రీలవద్ద తన శక్తి సామర్థ్యముల నేకరువు బెట్టుచు "తగిన సారథిలేనందున ఏమి చేయుట తోచకున్నది" అని విచారించుచుండును. ఆ సయమున సైరంధ్రిగానున్న ద్రౌపది, సామర్థ్యములో బృహన్నల యద్వితీయుడనియును సారథిగానుండ ప్రార్థింపు మనియును, ఉత్తరునితో జెప్పి బృహన్నలయను మారువేసముతో యున్న యర్జునునకు గూడ నుత్సాహము పుట్టించుటకై అర్జునుడు వినునట్లు పిల్లలను నిద్రబుచ్చు నెపమున పై పాటను పాడినది.

అర్థము :—

ఏడువకు ఏడువకు వెర్రి అబ్బాయి : ఓ వెర్రి యుత్తరుడా విచారింపకుము. ఏడుస్తె నీ కళ్ల నీలాలు గారు : నీలాలుగారితే నే చూడలేను : లోకైక వీరుడగు నా భర్త యర్జునుడు మీకు సహాయభూతుడై మీ యింట నుండగా, సహాయము కొరకు దీనునివలె నీ వేడ్చుచుండుట నేను చూడ జాలను. పాలైన కారవే బంగారు కండ్ల : ఓ యర్జునా నీకు కరుణలేదా ? నీ కనులనుండి యమృతధార నింకను గురియవేమి ? జోలల్లు పాడితే బాలురకు నిద్ర : ఓదార్పు మాటలను చెప్పి ఉత్తరునూరడింపుము. నాగస్వరమూదితే నాగులకు ఆట : (నాగులు : ఉరగకేతనులు, దుర్యోధ నాదులనిభావము) శంఖమును పూరించి కౌరవుల నందరిని తోలుబొమ్మల నాడించి నట్లాడింపుము. జోల మావిళ్లమ్మ దూరాన గలవు : (జోల, మా, విళ్లు, దూరాన, గలవు.) జోల : ఏమియు పనిలేక నిదురబోవు చున్న, మావిళ్ల : మా యొక్క ధనస్సులు, అమ్మ : (ఇది ఊతపదము), దూరాన గలవు : ఎచ్చటనో శ్మశాన వాటికలో జమ్మిచెట్టుపైన గలవు. అబ్బాయి !— ఓ యుత్తరుడా ! మామ : అర్జునుడు. (ఉత్తరార్జునులకు, మేనమామ, మేనల్లుళ్ల వరుస యున్నట్లు భారతములో చెప్పబడియున్నది.) జోడించి : ఆ ధనస్సులకు బాణములను జోడించి బాణవర్షము గురిపించి, తెస్తాడు : నీవు వేనికొరకై విచారించుచుంటివో ఆ యావులను మరలించి తీసుకొని వచ్చును లే. విచారింపకుము.

(ఈ పాట పైవారలందరకును జోలపాటుగా కన్పడి ఒక్క యర్జునకు మాత్రమే భావార్థము స్ఫురింప జేయును.)



# లలితకళలు—లతాంగులు

* శ్రీమతి వి. కె. మణి *

మొన్న సాయంత్రం పనులన్నీ చప్పున తెమలి పోయాయి. అప్పుడే కొన్న కమలాపురం మల్లెమొగ్గలు పట్టుకుని, కృష్ణ లీలా తరంగిణిలోని ద్రాక చరణం కూనిరాగం తీస్తూ ముందు డాబామీదకి వచ్చి కూర్చున్నాను.

అప్పటికప్పుడే, ఎవ్వరూ చూడకుండా ఎంత సేపటి నుంచి విను వీధిలో విహరిస్తోందో జాబిల్లి రేక, నేనూ రాగానే చిలిపి నవ్వుతో పలకరించింది. ఆ చిన్న వెన్నెల నవ్వుకి వింతశోభతో దిక్కులన్నీ కలకలలాడి పోయాయి. ఏమావిగున్న నుండో కోకిల "కూకూ" అంటూ పట్టరాని ఆనందంతో పాట ప్రారంభించింది. ప్రకృతినంతనీ ఒక అనిర్వచనీయానందం అలముకుంది. ఆ సంజ వెన్నెట్లో, కోకిల కూజితము వింటూ, అరవిచ్చిన మల్లెపూలు అలవాటుకొద్దీ అప్రయత్నంగా దండ కడుతూకూర్చుంటే ఎన్నో రకాల ఆలోచనలు నాకు తెలియకుండానే వెల్లివిరియ సాగాయి...

తేనె సోనలు చిలుకుతూ కోకిల పాడితే వీనులకు విందు. వయ్యార మొలికిస్తూ నెమిలి ఆడితే కన్నుల పండుగ. ఆట పాటలలోని అపురూప ఆనందాన్ని గ్రహించే, నృత్యగీతాలని లలిత కళలలోనికి జేర్చి, అభివృద్ధిలోకి తెచ్చి ఆదరించారు ఆర్యులు.

లలిత కళ: (ఆపదం ఉచ్చరిస్తేనే మనసు పులకరిస్తుంది.) నాజూకైన శోభ—సున్నితమైన నేర్పిరితనం—సామాన్య చక్షువుల కగపడని స్వర్గ సౌందర్యాన్ని ముచ్చటుగా కూర్చి తెచ్చి, మనస్సుకందియ్యగల, మ్రోలనిల్పగల, అసామాన్య చాతుర్యం, లలిత కళాప్రాదుర్భావం నిజంగా పూర్వపుణ్య విశేషమే.

ఆపలేని ఆకర్షణాశక్తితో, మనసూపివేస్తూ పరవశమొందింపజేసే లలిత కళలన్నిటిలోనూ నృత్యగీతాలు,— పక్షిజాతిలో పురుష వర్గపరమే అయినా, మానవజాతిలో మాత్రం తారుమారై లాలిత్యాని కాటపట్టయిన పూబోడుల దగ్గరనే ఎక్కువ రాణింపుకు వస్తాయి. మృదుమధురత్వమూ, వంపుసొంపులూగల స్త్రీలకవి జన్మహక్కు. ఉగ్గుపాల నుండీకోరి, అభివృద్ధిలోనికి తేవలసిన అసమాన్య విద్యలు. లలిత కళలతో విలసిల్లడం లతాంగులకు శోభస్కరం. సౌందర్యవతి అయిన స్త్రీకి కళావిశేషం కలిగితే, సువర్ణానికి సుగంధ మబ్బినట్టే గదా! అంతకన్నా కోరదగినదేముందీ?

అటువంటి సుందరమైన కళాభ్యాసాన్ని గురించి, కొందరెంత అనాదరంగా, అలుసుగా మాట్లాడుతారు! అబ్బా చెవులో చీమ కుట్టినట్టు బాధిస్తాయి వారి మాటలు.

ఆ మధ్య మా అత్తయ్య పెద్ద కూతురు, రామేశ్వర యాత్రకి వెడుతూ మా ఇంటికి వచ్చింది...చప్పున పెళ్లి చెయ్యకపోతే మర్యాదకాదనీ, పెళ్లి ఘనంగా చెయ్యకపోతే నలుగురిలో తలయెత్తుకు తిరగడ మెలాగనీ పట్టుబట్టి, పధ్నాలుగేళ్లు నిండుతాయనగానే అయిదువేలు అప్పు చేయించి గొప్పగా కూతురు పెళ్లి చేయించింది, మూడు నెలల క్రిందటే. (పాపం ఇంతలోనే మళ్లీ ఆ తీర్థయాత్రకి ధన మెలా సర్దుబాటు చేశారో.) "డబ్బులేదు. ఈ యేటికి మానివేయమనే అన్నారు. కాని, ఎప్పుడూ ఏదో ఒకటి వుంటూనే ఉంటుంది. ఇరుగు పొరుగువారు వెడుతున్నప్పుడు కాకపోతే ఇంకెప్పుడు వెళ్లడం పడుతుంది? గుడుగుడుకుంచం సంసారంలో ములగానాం, తేలనాం, నా జన్మంతా వెళ్లబుచ్చేసుకోవలసిందేనా? ఓ వ్రతమనీ, ఓ యాత్రనీ ఏదో కాస్త ముందుకి కూడా దారి చూచుకో వద్దా? మగవాళ్లు మీరు. ఎలాగో ఆలాగు తంటాలుపడి డబ్బు సర్దుపాటుచేసి పంపక తప్పదని, పేచీపెట్టి, మూడు వందలు పుచ్చుకుని బయలుదేరాను అమ్మాయీ" అని తనే చెప్పింది.

ఆ సాయంకాలం మా అక్కయ్య వంటచేసి పెట్టుకుని, చిన్న పాపాయిని తీసుకుని, మహిళా సభలో మీటింగుకు వెళ్లడం ఆవిడ చూసి, "సభలూ, సమాజాలూ, మీటింగులూ అంటూ ఇల్లు పట్టకుండా షికార్లేగదా ఈ కాలపు ఇల్లాళ్లకి" అని ఆశ్చర్యపోయింది—ఏమనడం. అప్పులు

చేసేనా వ్రతాలూ, యాత్రలకేగాని అన్ని బాధ్యతలు నిర్వహించుకునేనా అప్పుడప్పుడు సాయంకాలం ఇల్లు కదలడం ఇల్లాలికి తగనిపని కాబోలు!

సరి దానికేం కాని, అసలు—మా చెల్లెళ్లు ఆటపాటలు నేర్చుకుంటున్నారని అవిడచేసిన విమర్శకి మేరలేదు. చివరకి, "ఏమర్రా, చదువునేర్చిన ఆడదీ, వంట నేర్చిన మగవాడూ అయితేనే సంసారం సాగదంటారు. పోనీ, ఏదో నలుగురి తోపాటు కొంత చదివితే చదివేరుకాని, భోగం వాళ్లల్లాగ ఈ సంగీతాలూ, గజ్జెకట్టి గెంతడాలూ కూడా ఏమిటి? అయినా చిన్నప్పుడేదో చేస్తే చేశారు. వయసు వచ్చేక కూడానా? అయినింటి పిల్లలకిది మర్యాద కాదు. మీలాటి ఆటకత్తెల్నీ, పాటకత్తెల్నీ చూసి వాడిలిపోతాడు కాని ఎవడు పెళ్లాడుతాడు?" అన్నప్రశ్నతో విరమించింది. "ఆటకత్తెనీ, పాటకత్తెనీ చూసి వాడలిపోయే బెదురు గొడ్డును, అసలు మేమే పెళ్లిచేసుకోము, వదినా!" అని, నవ్వుతూ, వాళ్లు మేడమీదికి వెళ్లిపోయారు.

మా వదిన మోటుగా పైకి అన్నదేకాని, అటువంటి అభిప్రాయాలున్న వాళ్లెందరో ఇంకా వున్నారు. సాధారణంగా ఆడదాని కనువుగాని చదువులు, మగవానితో సమంగా చదివి, నిరుద్యోగ సమస్య మరింతగా పెంచినా సహిస్తారు కాని, మధురమైన కళలు నేర్చి బ్రతుకుతా మంటే మాత్రం భరించలేరుట. వయసు వచ్చి ప్రాజ్ఞతకలిగి భావ ప్రకటనతో చెయ్యవలసిన విద్యలు, 'కీ' ఇచ్చిన బొమ్మలలాగ పసితనంలోనే చేసి, ఏమి ఫలమో!

నాయిక సౌందర్యంతోపాటు కళావైదుష్యాలు వర్ణించబడని ప్రబంధరాజం లేదు. పూర్వం కులీన బాలిక లందరూ కోరి నేర్చిన కళలు, నేడు అయినింటి పిల్లలకు ఆచరించరానివై పోయినాయా? దేశమెంత దౌర్భాగ్య స్థితిలోనికి వచ్చింది! దేశంలోని సమస్త సౌభాగ్యాలతో పాటూ స్త్రీలలోని కళాప్రాభవం కూడా తరిగి పోయింది. నానాటికి మగువలలో మూఢత్వమూ, మగవారిలో అప్రయోజకతా పెరిగిపోయి, కళాభ్యాసం వారవనితకే గాని, కులకాంతకు తగదనే భావం ప్రచారంలోనికి వచ్చింది. చివరకి ఎంతో ఉదాత్తమైన కళావతీ నామం కూడా కళం కితమై పోయింది. ఏమంటే—అలసత్వంతో ఇల్లాళ్లు వదిలివేసిన కళలని, వెలయాళ్లు కష్టపడి నేర్చి కళావతు లయ్యారు గనుక! అయినా, దానితో నీచవృత్తికి కూడా కొంత విలువ కలిగించుకున్నారు గదా వాళ్లు!

కళాశీలి అయిన కామినిని ప్రజ్ఞాశాలి అయిన పురుషుడే ప్రాణప్రియగా ప్రేమించి, గౌరవంతో పాణిగ్రహణము చేసుకోగలడన్నదీ నిజమే. సామాన్యులు బెదరి పోతే పోనూ వచ్చును. కాని, మా చెల్లెళ్లు చెప్పినట్టు అటువంటి బెదరు గొడ్డును కట్టుకోకపోతే నేం? పెండ్లితోకాని జీవితం సంపూర్ణంకాని మాట వాస్తవమే అయినా, సమాన దాంపత్యం కానప్పుడు మాత్రం, జీవితం సంపూర్ణమెలాగవు తుంది? సుఖ సంతోషాలు లేకున్నా, తగినవాడైనా కాకున్నా తాడు కట్టించుకోకపోతే స్త్రీ సంఘంలో స్త్రీకి గౌరవం ఉండదనా?

పశుప్రాయులకి అమరలోక పారిజాతం దొరికితే, ఒక మాటు వాసనచూచి కాలబెట్టి నేలనైనా రాస్తారు; నమిలి మింగనైనా మింగుతారు. అంతేకాని, దాని మార్దవం అపురూప పరిమళం గ్రహించి, తలపై పెట్టుకుని, తనివి చెందడం కాని, జీవన మాలికలో నాయికమణిగా కూర్చుకుని వక్షస్సీమ చేర్చుకుని పరవశ మొందడంకాని, తెలియదు. స్వర్గలోక సౌఖ్యాలు సామాన్యుల కవసరం లేదు. రాజ హంసలకు మానస సరోవరంలో సౌరభం విరియించే సువర్ణ పద్మం అవసరం కాని, కొల్లేటి కొంగలకి సీకలూ, ఎండ్రకాయలే కావాలి! అవును ప్రస్తుత పరిస్థితులలో కళాభిజ్ఞత గల కన్యలకి కల్యాణమవడం కష్టమే కావచ్చును. కాని ప్రతిభావంతులైన పురుషులు అంతగా కరువై పోయారా? లేదు. లేదు. లోకంలో ప్రతిభ పూర్తిగా లోపించి పోలేదు.

తీక్ష్ణముగల సూర్యుని పురుషుడనీ, సౌకుమార్యము రూపొందిన చంద్రుని స్త్రీ అనీ అంటారు పాశ్చాత్యులు. మన జ్యోతిశ్శాస్త్రజ్ఞులు కూడా ప్రభాకరుని పురుష గ్రహం గానూ, కళాధిపతిని స్త్రీ గ్రహంగానూ నిర్ణయించారు. తేజస్వి అయిన సూర్యుని వెలుగే, ఆనందకరమైన చంద్ర కళలకు ఆధారం!......ఈ మృదువైన కుల్లెలు చూస్తే

మనసుకి ఎంత ఆనందం కలుగుతుంది. ఒక్కరోజే, వాటి జీవిత ప్రమాణంగా బ్రహ్మ సృష్టించినా, కవులకలంలో అమరత్వం పొంద గలిగాయి మల్లెలు; సరస శిఖామణుల గౌరవ ప్రేమలు చూరకొంటూ, తలనెక్కుతాయి; అక్కున జేర్చుకోబడతాయి. వాటి సౌందర్య సౌరభాలే కదా దానికి కారణం. అటువంటప్పుడు, ఏ జన్మపుణ్య ఫలమోపండి, నృత్యగానాది కళావిశేషాలే అబ్బితే, కాకులలాటి లోకుల మాటలు లెక్కచేసి, అవి వదులుకోవడం అవివేకంకాదూ?

"ఊఁ. ఊఁ అవునవును"

అని, నా ఆలోచనలకి ప్రక్కతాళం వేసినట్టు కోకిల "కూ. కూ. కు. కు. కు. కు. కూ." అంటూ, మరిఒక మామిడి కొమ్మ మీదకి ఎగిరిపోయింది. నేను కూడ పూర్తి చేసిన పూలదండ పట్టుకుని, నూతనోత్సాహంతో లేచి నిలిచాను. ఇంతసేపూ నామంతనము వింటూన్న శశికళ చల్లగా పడకటింటిలో అడుగుపెట్టింది.



# సౌందర్యము

* శ్రీమతి టి. బంగారమ్మ *

సౌందర్య మననేమి? అది చెప్పుట కలవికానిది. ఊహించుటకు కూడ సాధ్యముకానిది. అన్ని హృదయములు అదిఅన్న ఆశించునుగాని, ఏ వ్యక్తినిగాని అది యేదియో చెప్పుము, నీకు లభింప చేతునన్న, నోటమాటరాక, నోట నీళ్ళూర్చుచు, మందహాస వదనముతో అంధకారములో తనలో యేదో ప్రకాశమైన ఒక వస్తువు పోగొట్టుకొని వెతుకుచున్న వ్యక్తికైవడి ప్రవర్తించును.

సృష్టికర్త భగవంతుడు, సర్వాంతర్యామి, నిర్వికారుడు, సుందరమయుడు, అని మనమందుము. నిర్వికారుడు, సుందరమయుడు, అనుటలో సౌందర్యమన్న నిర్వికారత్వమా? అని నన్ను నేను ప్రశ్నించుకునేదాన్ని. అవును, ఆకారమున కన్వయించినదికాదు సౌందర్యమన్న. అది సర్వాంతర్యామి! ప్రతి జీవిలోను అవగాహన చేసికొనుటకు వీలులేని ఏదోఒక సౌందర్య చిహ్నము కలదు. ప్రకృతిలో జీవిగాని, నిర్జీవికాని ఎందు చూచినను సౌందర్యమే ప్రతిబింబించుచున్నది. ఉదాహరణకు, ఒకపుష్పము కన్న మరొక పువ్వు సౌందర్యమును చాటుచుండును. అందులకు కారణము ఇది అని చెప్పగల సామర్థ్య మెవ్వరికైన కలదా? అమావాశ్య రేయి గగన సౌందర్యమును, పూర్ణిమ రాత్రి సౌందర్యముతో పోల్చి ఏలుట కవకాశము కలదా! రెండింటిలోను సౌందర్యము కలదు. ప్రతి ప్రకృతి చర్యయందు మన హృదయ వికాసమునుబట్టి ఒక దానిని మెచ్చుకొనవచ్చును, కాని పరిశీలించిన దేనిని తృణీకరింపలేము. ఒకరు ఒకదాని సౌందర్యమునకు మెచ్చి తలయూచిన మరొక వ్యక్తి దానిని జూచిన యీసడింపవచ్చును. దీనిని బట్టి చూచిన సౌందర్యమనునది ఒక వ్యక్తియొక్క హృదయమునకు సంబంధించినదిగా తోచుచున్నది.

ఇక సౌందర్యమన్న అంగముల కూర్పని కొందఱి తలంపు. ఒకప్పుడు మనము "చూచితివా! అతడు సుందరుడు, అతని అందమునకు సరిపోని ఆస్త్రీని సహకారిగా పొందుట తటస్థించినది కదా" అని అబ్బురపడెదము. అతనిని ప్రశ్నించిన అసహజముగా అతని నోటనుండి "ఆ వ్యక్తిలోని కళ నన్నాకర్షించినది" అను జవాబు విందుము. కానసే సౌందర్యమనునది ఒక వ్యక్తియొక్క హృదయమున కన్వయించినది. హృదయ వికాసముకల ప్రతి వ్యక్తికి ప్రకృతిలో అన్ని వస్తువులు సౌందర్య చిహ్నములే! భూతదయా త్యాగసమ్మిళిత హృదయాలకు ప్రకృతిలోగల ప్రతి అణువునందును సౌందర్యము కన్పట్టుచునే యుండును.

---

వ్యక్తిగత మానసిక వికాస ప్రతిబింబమే సౌందర్యము

రావలసిన మార్పు!!

# విజయదశమి నాడు........

* శ్రీమతి. డి. రాజేశ్వరి పట్నాయక్ *

చిన్ననాటనె సునందతో నా వివాహమయింది. శ్రీమంతుల పుత్రిక ఆమె. అందువల్ల విలువ నెరుగని నా నూన్యపు జీవితంలో ఆమె విలువ లొలకబోసింది. గాని ఆమె ఒలకబోసిన విలువలో నూవుగింజంత 'అహం' దోబూచులాడుతుండేది. అందువల్ల నేను మరణవేదనైనా నయం అనగలను, గాని సహింప వలసి వస్తోంది. కారణం? నేను ఆమె భర్తను గనుక!

సునంద కావ్యవీధిలోని ప్రేయసి వంటిది. నేను ఖచ్చితమైన వాస్తవ వాదిని. నా కళ్లయెదుట దేశపరిస్థితులు ప్రళయతాండవం చేస్తున్నాయి. యెటుచూచినా తిండికీ—గుడ్డకూ — హాహాకారాలు — దేశదౌర్భాగ్యం నశింపజేసేదెలాగ? అనే నా హృదయావేదన.

పది సంవత్సరాల నాటిమాట, సునంద ముగ్ధమోహన రూపాన్ని అర్చించేవాణ్ణి. నేటివరకు ఆ సౌందర్యరాశి ముఖదీప్తిలో పరితృప్తుణ్ణి, ఎంత సౌందర్యరాశి!...... ఆ అందంలో యెంతటి మహత్తు!......ఎంత స్వాప్నిక జగత్తు!...ఎంత జీగివ!! సునందకోసం నేను చేయనిదీ— చేయలేనిదీ ఏదీలేదు. ఆమె కావ్యప్రియ, ఉమర్ ఖయ్యాం వంటి శృంగారరస ప్రధాన కవితలంటే ఆమెకు ప్రాణ సమానం. ఆమె తీయని గొంతువిప్పి గీతిక లాలాపిస్తుంటే జగత్తే నిద్రావస్థ చెందుతుందంటే అతిశయోక్తికాదు. గ్రీక్ దేశపు సౌందర్యసిరి, లాలిత్యం, ఆమెలో నిబిడీకృతమై యుండేవి. యివన్నీ యెందుకు చెప్తున్నానంటే, సునంద వంటి స్త్రీలకు సేవలందుకోవడమేగాని, సేవించే అవసరంలేక పోవడం! ఈ పరిస్థితుల్లో మార్పుకలిగే అవకాశం ఎప్పుడైనా కలుగుతుందా! అనుకు నేవాణ్ణి. సునంద జీవనాశయం సౌఖ్యాలాలస! మరి నా ఆశయం? నిస్సహాయ పీడిత ప్రజాజీవనానికై వగచెందే వేదనా భరము మాత్రమే.

* * *

ఆ వేళ విజయదశమి. సుందరమూ—సుఖకరమూ అయిన ప్రభాత సమయం. సునంద ఉల్లాస హృదయంతో గృహాలంకరణలో నిమగ్నురాలైంది. అలంకరణ పూర్తయింది. అన్యమనస్కుడనై కూర్చునియున్న నాకు "ఆహా, మర్చిపోయాను. మీ రూమ్‌లో ఏ అల్‌మారా సర్దబోయినా చీదరగొల్పే ఆ భయానక వర్ణనల పుస్తకాలు కొట్టొచ్చేంత భీతినిగొల్పి దరికి రానీయకున్నాయి. ఏమిటీ హా, హా, కారగ్రంథకాండ! యెక్కడ సంపాదిస్తున్నారు?" అనిన సునంద పలుకులు నన్నీ బాహ్యాలోకాన్ని పడవేసినాయి.

"సునందా, నేనెప్పటికైనా నీ అభిరుచులకు తగిన వాణ్ణి కానేమో! నా గదిలో పుస్తకాలు నిన్నెందుకు భయ పెడుతున్నాయి?"

"అవ్వే పుస్తకాలన్నిటి గురించికాదు. వారం, పది రోజులై వార్తాపత్రికల్లోని కొన్ని దుర్భరదారిద్ర్య విషయాల నేరి కత్తిరించి పెద్ద పుస్తకంలా తయారు చేస్తున్నారే. అవన్నీ నిజంగా జరిగినవేనా?"

"సునందా, ఈ ఆవేదన దృశ్యభావాలన్నీ అసత్యాలంటావా? ఆ......అన్నట్టు మర్చిపోయాను. ఈ వేళ విజయదశమి కదూ. నా కర్తవ్యం...ఆనందం...ఈ వేళ నీ కేదైనా మంచి ప్రజంటు చేయాలి. ఏం కావాలి నీకు?"

సునంద అభిమానిని. ఈ ప్రసంగాన్ని మార్చేందుకు ప్రయత్నిస్తూ "మీ రూమ్‌లో చెయ్యి చేసుకోలేక పోయాను" అంది.

"నీ కేమి కావాలంటే, రూము సంగతెందుకు?" సునంద ప్రఫుల్ల మొహంతో "ఈసారి వూరుకోను లెండి. ఒక రేడియో సెట్, రెండు బెనారస్ సారీస్, కొనాలి. అన్నట్టు మరిచాను! సాయంకాలం మన స్నేహితులకు విందు చేయాలి. అందుకోసం లిమన్‌క్రష్, బాదామ్, పిస్తా, అంగూర్, అన్నీ రెండేసి సేర్లు తీసుకురండి." మరి...

"సరే ఎవరెవరికాహ్వానాలు?"

"సబ్‌జడ్జీ, రామారావుపంతులు (మా నాన్న స్నేహితుడు) మహేశబాబు, (అతనిభార్యా, నేనూ చిన్ననాటి

స్నేహితులం) యింకా మీ స్నేహితులందరికీ—చూడండీ. ఈ విందుతో మనవెంత ప్రశంసిస్తారో!"

ఇంతలో "అనాథను తల్లీ, రెండు రోజులై బిడ్డకు పాలు లేక శోషిల్లిపోతుంది. సిరిగలయిల్లు తల్లీ. కాసిని పాలుంటే ధర్మం చెయ్యండమ్మా" అంటూ దీనస్వరం వినిపించి మా సంభాషణ కంతరాయం కలిగింది.

మాట్లాడే సమయానికి మధ్యలో ఆటంకం కలిగితే సునంద చిరాకు పడే మనిషి! అందులో విందు మాటలాయె "యిప్పుడేమీలేదు పొమ్మను రామూ—వేళాపాళాలేదు ముష్టివాళ్లకు" అంది. (అకస్మాత్‌గా నాలో ఏదో వుద్రేకం కలిగి బిచ్చుకురాలి వేదన నా హృదయాన్ని కుంగదీసింది.) "రామూ, ఇంట్లో వున్న పాలు వంటమనిషి నడిగి దానికి కావలసినంత తీసుకెళ్లమను" అన్నాను. "ఏమిటీ, దయా ధర్మాలు! ఈ రోజు విందు చేస్తామని తెలిసీ యింట్లో వున్న పాలు యెవరో ముష్టివాళ్ల మొహాన పారవేస్తారా!" అంది సునంద, కోపంతో.

"పోనిద్దూ, ఈ వేళ దసరాపండుగ గదూ— ఒరే రామూ—కారు గారేజీలో పెట్టి డ్రైవర్ని యింటికి పొమ్మను. వాడి పిల్లా పాపా యెదురు చూస్తుంటారు" అని రాముకి చెప్పేను. సునంద చిన్నబోయిన మొహంతో "బజారు వెళ్లాలన్నారే." అని మొగం ప్రక్కకు తిప్పుకొంది.

"సరే, రెడీగా—పదార్థ పరీక్ష గృహిణులకే తెలియాలి. వచ్చే అతిథుల ప్రసంశలందుకోవాలంటే నీ స్వయంకృషి ముఖ్యం. లే—తయారవ్—వెళ్దాం" అన్నాను.

నగరంలో యెటుచూచినా జనుల రాకపోకలు తొడ త్రొక్కిడిగా వున్నాయి. గారడీ విద్యల వింతచూచే వాళ్లు, పూజా ద్రవ్యాలు సమకూర్చుకునే వారు, యెవరిని చూచినా తీరని తొందరలే. సునంద ఛీత్కార శబ్దం అకస్మాత్ నా దృష్టి నాకర్షింపచేసిన సన్నివేశం—శరీరం గగుర్పాటు కలుగజేసింది. ఒక దీన బిక్షుకి కుక్కలతో పోరాడుచూ పారవేసిన ఎంగిలి విస్తరి నాకుచున్న దృశ్యం—ప్రక్కనే అయిదు సంవత్సరాల బిక్షుక సంతానం గాబోలు—శ్రీమంతులచే పెంచబడిన ఒక కుక్క మితిమీరి తినిన ఆహారాన్ని బొళబొళ కక్కుతూంటే—ఆశతో—సంతోషంతో ఆ బిక్షుక శిశువు అసహ్యించుకోకుండా తినివేస్తున్నాడు. అబ్బా! చూడలేని దృశ్యం! ఈ దుర్భర దారిద్ర్యాన్ని చూచి నా మనసు ఆక్రోసించింది.

"నడవండి, నా తల తిరిగి పోతోంది. నేను చూడలేను" అన్నది సునంద. కంపరమెత్తే ఈ దృశ్యాన్ని వీక్షించిన నేను స్థాణువునై పోయాను.

రత్నగర్భయని పిలవబడుచున్న మన భారతదేశపు దుర్భరస్థితి—తిండీ—గుడ్డా—లేని పేదప్రజల నిస్సహాయ దుస్థితి అయిదు సంవత్సరాల ఆ భిక్షుక బాలుని చూచిన ద్యోతకమవుతోంది. కుండలాంటి తల, పొంగియున్న పొట్ట, గోగుకాడలవలె కాళ్లు చేతులు మానవ శిశువని తలంచలేము. నా హృదయం బలహీనమయి చలనం ఆగినట్లయింది. హృదయాన్ని కూడబరచుకొని సునంద వైపు దృష్టిసాగించాను. ఆమె పైటచెంగుతో ముక్కు మూసుకొని ఛీత్కార భావముతో నిలువలేక హడలి పోతోంది. "నడూ రేడియో దుకాణంవైపు," అన్నాను. సునంద తొట్రుపడుతూ నడుస్తోంది. జనసమ్మర్ధమైన ప్రదేశాల్లో ఆమె నడవడానికి జంకి పోతోంది. మళ్లీ—ప్రజలగుంపు—ఎవరో అంటున్నారు "ముష్టివాడు తిండిలేని నీరసంలో నడుస్తూండగా—విహారార్థమై బయలుదేరిన ఒక శ్రీమంతుని కారుక్రింద పడి మరణించాడు."—ఆహా పరమేశ్వరా! ఏమిటీ చిద్విలాసం! అనాథ రక్షకుడని బిరుదు వహించిన ఆతని కరుణా దృష్టిలోని నిగూఢ రహస్యమేమిటి?

దరిద్రజీవనుల రక్షింపడేమి? ధనమదాంధుల శిక్షింపడేమి? కాళ్లు నడుస్తునే వున్నాయి. అగమ్య గమనం—హృదయం వెయ్యి వ్రక్కలై బాధిస్తోంది. హటాత్ నా చెయ్యి పట్టుకొని "ఎటు వెళ్తున్నాం?" అన్నది సునంద. "ఏం! రేడియో సెట్—చీరలు—విందు పదార్థాలు కొనేందుకేగా......"

"వద్దు, వద్దు, నేను భరించలేను"—సునంద విశాల నేత్రాలు అశ్రుపూరితాలైనాయి. మొహం చెమటలు గ్రక్కుతున్నాయి. సునంద అయిష్టం చూపినా ఒక టాక్సీని

పిలచి అందు అమెను చేర్చాను—టాక్సీ కదిలింది. "రఘుపతిరాఘవ రాజారామ్" నినాదాలతో దరిద్ర నారాయణ సంఘపు సేవకుడు మా టాక్సీ కెదురుపడి 'మహాశయా, మీరు శ్రీమంతులు, బీదప్రజల సహాయార్థం ఏమైనా యిప్పించండి" అన్నాడు. సునందచేతులు పర్సు తెరిచింది. ఆర్ద్రహృదయంతో—సజల నేత్రాలతో 50 రూపాయలు అతనికిచ్చింది.

"అమ్మా, ఈ దరిద్రులకు శాపం గాబోలు! లేనిచో ఆకలితో మానవులు చనిపోవడం యెప్పుడైనా విన్నామా, తల్లీ. దయామయుని నిందించిన లాభమేమి? కోటికి పగడలెత్తిన శ్రీమంతులు విందు వినోదాలకనీ—పెంపుడు జంతువులకనీ వెచ్చించే ధనాన్ని పేదమానవ సేవకు వినియోగిస్తే దేశమింత దుర్భర స్థితి నందుతుందా. తల్లీ, క్షమించండి, ఈ విజయదశమి రోజున తినతిండిలేని ప్రజలు యెందరు మృత్యువాతను బడుచున్నారో! దేవిపేరిట తమ వుల్లాసానికై ధనవంతుల భవనాల్లో నృత్యవినోదాలకై యెన్ని వేలు వ్యయపరుస్తున్నారో! మానవ సేవయే మాధవ సేవగదా?" అనుచు వెళ్లిపోయాడు.

నా హృదయం ఏదో అలోచనలతో నిండియున్నది. హటాత్ బాహ్య ప్రపంచంలోపడి టాక్సీవాడికి చెప్పేను "చూడూ బంగళాకి కాదు—బజారువైపు పోనీ" అన్నాను. సునంద గాద్గదిగ కంఠంతో "క్షమించండి విందుల పేరెత్తవద్దు, చూడండీ—మీ రూమ్‌లో దుఃఖపీడిత ఆ క్రోశగ్రంథాలకు నా హృదయపూర్వక సానుభూతి—మీ అడుగుజాడల్లో మీ ఈ అర్థాంగికి దారిద్ర్య నివారణకు దారి జూపండి. ప్రస్తుతం మనం తెచ్చియున్న ఏడువందల రూపాయలు ఈ దరిద్ర నారాయణులకు పంచివేయండి."

నేడు సునందాదేవి దరిద్ర నారాయణ సంఘాన్ని స్థాపించి నిర్వహిస్తోంది. ఒకప్పుడు పేదప్రజల రోదన నసహ్యించుకున్న సునంద—విసుగు విరామం లేకుండా స్వహస్త పాకంతో వేలకొలది దరిద్రుల కభయహస్త మొసగుతోంది. నేడు సునంద అన్నార్తుల పాలిట అన్నపూర్ణ! నా జీవితం ధన్యమయింది. మా యిరువురి హృదయాల్లో త్యాగశక్తి ప్రకాశమానమై దీనసేవాను రక్తికి దారిజూపి ప్రశాంతత నెలకొల్పింది.

సర్వేజనాస్సుఖినోభవంతు.



## సేవా వ్రతం

(20వ పేజీ తరువాయి)

శాం: సరళా పాతకాలపు పద్యాలుపాడుతున్నావు. నవభారత వర్షంలో స్త్రీలకన్ని హక్కులూ ఉన్నవి కదా.

స: హిందూకోడ్ బిల్లు ప్యాస్ కాకుండా ప్రతిఘటన జరుగుతున్నది యీ స్వతంత్ర భారత వర్షంలోనేగదా? స్త్రీల విషయంలో అన్ని రాజ్యాంగాలు ఒకటే— స్త్రీలలో అభ్యుదయకాంక్ష లేకపోతే ఎవరూ ఉద్ధరించరు.

శాం: సరళా నీవు చెప్పినది నిజం. స్త్రీలలో అభ్యుదయ వాంఛలేదు. మనం ఎన్ని కష్టాలకైనా వోర్చి వారిలో సంచలనం కలిగించేందుకు పూనుకోవాలె.

శాం: మంచిమాట చెప్పావు శ్యామా! నాకూ మహిళాభ్యుదయ సేవ చేయవలెననే అభిప్రాయమే కలుగుతున్నది. మన కార్య క్షేత్రమేదో నిర్ణయించు. పనికి పూనుకుందాం.

శ్యా: శాంతా అతి విశాలమైన మహిళాభ్యుదయ కార్య క్షేత్రంలో సేవకేమి తక్కువ?

స: నిజము. నిజము.

“ మాలనున్నవారి ముంగిళ్లకీడ్చెడి
యోటింగు హక్కుల యోరులొకట
పరిణయ పద్ధతుల్ పరివర్తనము సేయు
క్రొంగ్రొత్త చట్టాల గోలయొకట
ప్రాతి నిధ్యములకై పనిబూని పోరాడు
రాజకీయంబుల రగడలొకట
స్త్రీ పురుషసమాన సిద్ధాంతసిద్ధికై
తీవబోడులు సేయు తీర్పులొకట
దినదినంబును చెలరేగి తెలవలందు
నాపరానట్టి యూహల రేపుచుండ
సేవ చేయంగ నెంచెడి సేవికలకు
కార్య భారంబు తక్కువే గంపెడంత॥

శ్యా: అవునుగాని అభిరుచిని పట్టి పనిచేయడం ఉంటుంది గదా. కొందరికి విద్యా విషయంలో, కొందరికి సంఘ సంస్కరణాల్లో, కొందరికి ఆర్తసేవలో, కొందరికి రచనలో, రాజకీయాల్లో కుతూహలం గదా.

స: (నవ్వుతూ) సరేగాని శ్యామా! మాకు యిన్ని చక్కట్లు చెప్పి ఆనక్కు ఫస్టునప్యాసైనావని ఏ కాలేజీ వాళ్లైనా ఏ లెక్చెరర్ పనోయిస్తామంటే పోయి దూరవు గదా.

శాం: ఆ దౌర్బల్యమూ, ఆ ఆశపాటూ నీకు మాత్రం ఉండ కూడదా?

శ్యా: ఎబ్బే! ఉద్యోగం చేయదలుచుకుంటె యిన్ని ఆలోచన లెందూకూ. నా జీవితం మహిళా సేవకు అంకితం చేశాను. దానికి తిరుగులేదు. ఇక మీవంటి మిత్రురాండ్రను సహాయులను జేసుకొని ఒక సంఘంగా ఏర్పడి సేవారంగంలో ప్రవేశించడమే తరువాయి.

స: సరిసరి ఉన్న సంఘాలుగాక మరల నీదో సంఘమా? ఇప్పటికే వర్ణ, వర్గ, పక్ష, మహిళా సభలెన్నో బయలుదేరి సంఘ బలిమిని భంగదీస్తున్నాయ్. అనవసరంగా వ్యక్తులు స్వప్రయోజనం కొఱకు తలోసభ పెట్టడం తప్పితే చేస్తున్నపని కన్పడదు.

శ్యా: అయితే మనం ఎట్లా చేదామంటావు?

స: మహిళాభ్యుదయానికి కృషిచేసే ఏ మాతృసంస్థ అయితే ఉన్నదో, దాని పక్షాన్నే మనం పనిచేయాలె, దానికే బలము ఊతనూ యివ్వాలె.

ఉన్నసభకే ఊతమియ్యండీ ఓ తల్లులారా
భిన్న సభలను పెట్ట బోకండీ
చీలిపోతే మేలు లేదండీ ఓ తల్లులారా
కలిసి ఉంటే ఫలము ఘనమండీ.

అని స్త్రీలల్లో ప్రబోధం చేయాలె.

శాం: అబ్బా మాటకోపాట. అనవరతం నీ మృదుమధురగానలహరిలో ఓలలాడే మాకు నిన్ను వదిలిపెట్టి పోవడమంటే ఎంతో బాధగా ఉన్నది సరళా.

శా: హాస్టల్ జీవితమొక రమ్యమైన ఘట్టం. మరల యిటువంటి ఆనందకరమైన రోజులు రావు.

శాం: అదే విచారం కలిగిస్తున్నది శ్యామా! గడచిన సంతోష కాలం తలుచుకుంటే మన చదువులు అప్పుడే ముగిసిపోయినా యేమా అనిపిస్తున్నది.

స: ముగియకుండా ఎల్లకాలం విద్యార్థినులుగానే ఉండా మనుకుంటున్నారు కాబోలు. ఎల్లప్పుడు నేర్చుకొనే వాళ్లంగానే ఉంటే నేర్పేవాళ్ల మయ్యేదెప్పుడు? మనమనుకున్న సంఘసేవలో నిమగ్నులమైతిమా ఇంత కంటే ఆనందమే అనుభవించవచ్చు (తనగేతి రిస్టువాచి చూచుకొని) మాటల్లో ప్రయాణంమాట మఱచి పోయి నాము. రైలుటైము అయింది లేవండి.

శాం: (తన రిస్టువాచీ చూచుకొని) అబ్బా యింకా బోలెడంత టైమున్నది. ఏవన్నా రెండు గేయాలు పాడు. మళ్లీ ఎన్నాళ్లకో నీ పాట వినేది.

స: ప్రయాణం ముందు పెట్టుకొని ఇప్పుడు పాటలు పద్యాలూనా?

శాం: ప్రయాణమైతే మాత్రం మనమేమి సర్దుకోవాలె? భోజనాలు చేసి మన బెడ్డింగులూ మనమూ రైలులో పడటానికి సిద్ధంగానే ఉంటిమి. ఏమైనా సరే మొన్న క్రొత్త గేయమేదో పాడావే, అది పాడితేగాని కదలను.

శ్యా: (నవ్వుతూ) సరళా! శాంత అడిగేదేమిటో కాస్త పాడి వినిపించమ్మా. ఇది సమ్మెల యుగం. తానుకోరి నట్టు పాడకపోతే నిజంగా సమ్మె కట్టుతుందో, నిరశన వ్రతమే పూనుతుందో?

శాం: మాటలతో కాలం వ్యర్థం చేస్తున్నావు.

స: ఈ బలవంతపు బ్రాహ్మణార్థం తప్పనట్టున్నది.

(గేయము)

భారత నారీ కీర్తి అపారం
బానిస బ్రదుకె మహాభారం
పురుషులదే మాపై అధికారం
నారీప్రాణమె బలిహారం ॥భార॥
వెఱ్ఱివారికె అవిచారం
విద్యావతులకె బహువిచారం
ఆస్తిపాస్తీ హక్కులులేని
అనాథల క్షేమాధారం
భారత నారీ కీర్తి అపారం
బానిస బ్రతుకే మహాభారం.

శాం: పాటలో గూడ మన గోడవేనా ఏదైనా విజయ గీతిక పాడక!

స: జై జై శుభగుణచరితా
భరతమాత భవ్యోపేత ॥జై జై॥
త్యాగశీలలా తరుణులగనిన
మహిమోపేతా ॥జై జై॥
బానిస బంధపు గొలుసులు విడగా
నేటికి స్వేచ్ఛను పొందిన మాదు
నమస్సిదే స్వతంత్ర భారతావనీ ॥జై జై॥

శ్యా: జయగీతం కూడా విన్నాము. రైలు టైమైంది, పదండి. (అందరు లేస్తారు)



“అనవసరంగా వ్యక్తులు స్వప్రయోజనం కొఱకు తలోసభ పెట్టడం తప్పితే చేస్తున్నపని కనపడదు—” ఇంకా ఇటువంటి అమూల్య సత్యాలెన్నో రచయిత యీ నాటకము ద్వారా వెలిబుచ్చారు. విద్యావతులై, సేవచేద్దామని తహతహ లాడుచూ, ఎక్కడ, ఎట్లా ప్రారంభిద్దామా అనే నిరంతర సందేహములో, తమ అమూల్యమైన కాలాన్ని, అసాధారణమైన ప్రతిభా విజ్ఞాన విశేషాలనీ, అడివిగాచిన వెన్నెల చందాన్న వృథాచేసే సోదరీమణుల కిది యొక హెచ్చరిక. ॥సం॥

# బాలానందం

## హరివిల్లు

"శ్రీకృష్ణ"

ఆకాశ సీమలో
ఆనంద చిహ్నం
చినచిన్న చినుకులు
చిటపటల్ తళుకులు
అల్లదిగో, అటుచూడు
హరివిల్లు పొడిచింది.

.... .... .... .... ....

ఊదా, మేఘవర్ణ
నీలి, ఆకు పచ్చ
పసుపు, నారింజ
గాఢ ఎరుపులతోను
ఏడు రంగులలోను
ఏకమై పోయింది.

.... .... .... .... ....

మబ్బులన్నీ చెదిరి
మాయమై పోయాయి
వర్ష బిందువులలో
సంధ్యాకిరణాలవే
తొంగిచూస్తున్నాయి
మెరసిపోతున్నాయి.

.... .... .... .... ....

అందాల పాపాయి
హరివిల్లుచూచింది
అందుకుందామని
ఎగిరిపోబోయింది
....మింటిలో హరివిల్లు....
....యింటిలో పాపాయి....

.... .... .... .... .... ....

ఒకరి మొగముల నొకరు
చూసి నవ్వుకొన్నారు.



# గాజుల రాజు

* శ్రీ చొప్పల్లి వెంకటసూర్యనారాయణ *

గాజులవలసలో
రాజు వున్నాడూ
గాజు లమ్ముతూ
రోజూ దిరిగేవాడు.

..................

రైలుప్రమాదంలో
కాలువిరిగిపోతే
గోలుగోలుమంటూ
యిల్లుచేరినాడు.

..................

ఎండలకు జడిసి
బండీ యెద్దూ కొన్నా
డండీ ధనమెంతో
దండగ పెట్టేసి.

..................

బుద్ధిలేక తాఁదెచ్చిన
యెద్దూ యెల్లపుడూ
మొద్దునిద్దరతోటే
ప్రొద్దుపుచ్చు చుండేది.

..................

కొన్నాళ్లయాక
దాన్ని అమ్మేసి
కొన్నాడండీ
మున్సిపల్ యెద్దొకటి.

..................

పెంటకుప్పనుచూసిం
దంటే తోకముడుచుకు
వెంటనే ఆగేదండా
తుంటరియెద్దండీ.

..................

దానిని మార్చి వేసి
తానే స్వయముగ
కొనుకున్నాడండీ
గానుగయెద్దూను.

..................

ఒక్కడూ బండీ
యెక్కాడండీ
ఒక్కయెద్దునూ
ఒక్కటి కొట్టేసి.

..................

గిరగిరమనుచూ
తిరుగుచునూ
బరబరమంటూ
దొరలిపోయింది.

..................

వాటినుండీ
నేటివరకూ
కోటి యిచ్చినా బండీ
మాటే యెత్తొద్దంటాడు.






# కిరణ్ సాహస కృత్యాలు

* వి. కృష్ణమూర్తి *

కిరణ్ పరదేశ వ్యాపారి. అతనిది రత్నాల వ్యాపారం. నివాసం బొంబాయి. ప్రతి సంవత్సరమూ ఒకసారి దేశాలు చుట్టివచ్చి, తన వ్యాపారంలో వచ్చిన లాభాన్ని యేదో జల్సాగా ఖర్చు చేసేవాడు. భార్య, పిల్లల్ని తల్లి యింట్లోనే వుంచేవాడు వ్యాపారానికి పోయేప్పుడు. ఒక సంవత్సరం అతనికి చాల లాభం వచ్చింది. దాన్ని యెలాగ ఖర్చు చేయటమా అని అతనికి తోచలేదు. ఆ ధనం ఖర్చుచేసి ఈ పర్యాయం ప్రపంచమంతా ఒకసారి—అంటే వ్యాపారం మీద కాక—చుట్టిరావాలని అనుకొన్నాడు. ఈ సంగతి తన స్నేహితుడు షాజ్‌కి చెప్పాడు. అతడన్నాడు: "కిరణ్! ఇప్పుడే నీవు ప్రయాణంచేసి వచ్చావు. ఇంకా ఆ అలసట తీరివుండదు, మళ్లా అప్పుడే ప్రయాణం—అదీకాక ప్రపంచమంతా ప్రయాణం—చేయాలంటున్నావు. మొదలే అలసిపోయావు. మళ్లా అలసట ఎందుకు చేసుకుంటావు? వెళ్ళొద్దు."

"మరి యీ ధనాన్ని వెచ్చించటం ఎల్లాగ?" కిరణ్ అన్నాడు.

"ఓస్. అదేం ఘనకార్యమా? నీకు భార్యా పిల్లలున్నారుగా. వాళ్లకి ఆస్తిగా రాశేయి, నీకు కొంత వుంచుకొని."

"ఇప్పటికే వాళ్లకి ఆస్తి కావలసినంత వుంది. ఇంకా ఎందుకు? దీన్ని నేనే—నా కోసం—ఖర్చు చెయ్యాలి."

"ఐతే చెప్తా విను. రోజూ పంచ భక్ష్య పరమాన్నాలు తిను. విలువైన బట్టలు వేసుకో. ఇంకా ఒక పెద్దమేడ కట్టించి అందు రాజాలాగ వుండు."

"ఇప్పుడు మాత్రం రాజాలాగ లేనా? ఇవిగో నా వస్త్రాలు చూడు. ఎంత విలువైనవో, ఇక నా చెప్పులు చూడు. దీన్నిమించి విలు

వైంది వుంటుందా చెప్పల్లో? ఇక యిప్పుడు నాకున్న మేడకాక వేఱొకటెందుకు వృధాగా?"

"మఱి నీ ఆలోచన యేమి ఆఖరుకి?"

"నేను వచ్చేవారం ఇక్కడినుండి బయలు దేఱి ప్రపంచమంతా చుట్టివస్తాను. ఇంకా డబ్బు మిగిల్తే ఇక్కడొచ్చి అందరికీ విందు ఇస్తాను."

"సరే. నీ యిష్టము. నీ డబ్బు నీవేలాగేనా ఖర్చు చేసుకో. నాకు తోచిన ముక్క చెప్పాను."

"అంతే. నేను నిశ్చయించాను. వచ్చేవారం బయల్దేరుతున్నాను."



"ఒక్కమాట, కిరణ్! ఓడలో జాగ్రత్త, నీ డబ్బు దొంగల పాలుచేయకు."

ఇంతటితో వారి సంభాషణ ముగిసింది.

కిరణ్ ఇంటికి వెళ్లాడు. ప్రయాణసన్నాహాలు ప్రారంభించాడు. వస్త్రాలన్నీ ఒక పెద్ద పెట్టెలోపెట్టి తాళం వేసాడు. రెండు రత్న కంబళ్లు, 4 మెత్తలు, 6 తలగడలు తీసుకొన్నాడు. ఇంకా కావలసినవన్నీ సిద్ధం చేసుకొన్నాడు. ఓడ వాళ్లకి ఉత్తరం రాశి తన ప్రయాణాన్ని ఏర్పాటు చేసుకొన్నాడు. తాను బయల్దేరేముందు ఎప్పటిలాగే భార్యా పిల్లల్ని తల్లి యింట్లో వదిలాడు.

భార్యదగ్గర సెలవు పుచ్చుకొని కిరణ్ హార్బర్‌ని చేరాడు. సామాన్లంతా ముందుగా పంపేశాడు అక్కడికి. ఓడ సిద్ధంగా వుంది. తనకి ఏర్పాటుచేసిన గదిలోకివెళ్లి కూర్చున్నాడు. గంట చూచాడు. ఇంక 2 గంటలుంది ఓడ కదలటానికి.

అప్పుడే చీకటి పడుతోంది. కిరణ్‌కి ఏమీ తోచలేదు. ఏమో ఆలోచిస్తున్నాడు. తాను ప్రపంచమంతా తిరిగివస్తే ఎంత గర్వపడ్తాడు! అందరూ ఎంత పొగడుతారో! తాను తిరిగి బొంబాయి చేరేసరికి పూలహారాలు యెందరు వేస్తారో! తనమెడలో—అని ఆ ఆలోచన. ఇంతలో ఓడ కదిలింది. బొంబాయిని వీడింది. సముద్రంలో పోతూంది.

రాత్రి 10 గంటలవుతోంది. ఓడలో అందరి మాటలూ క్రమంగా తగ్గుతూన్నయ్. కొందరి నప్పుడే నిద్రాదేవత ఆవరించింది. కిరణ్‌కి మాత్రం నిద్రరాలేదు. "Count of Monte Cristo." అనే నవల చదువుతున్నాడు.

కిరణ్‌కి ఇంగ్లీషు బాగావచ్చు. వ్యాపారి—అందులో పాశ్చాత్య వ్యాపారి—అంటే ఇతర భాషలు రాకుండా వుంటాయా?

ఓడలో అందరూ నిద్రించారు. అంతా నిశ్శబ్దంగా వుంది. నిశ్చలమైన అరేబియా సీలో ఓడ ప్రయాణం సాగిస్తూంది.

కిరణ్ తెలియకుండనే నిద్రించాడు. గాఢ నిద్రలో వున్నాడు. ఏమో కలలు కంటున్నాడు. ఇంతలో ఎవరో తన వీపుని నిమిరినట్లని పించింది. ఉలిక్కిపడి లేచాడు. ఎవ్వరూ లేదు. కలవరించుకొన్నానని మళ్లా పడుకొన్నాడు. కాస్త సేపటికి మళ్లా ఎవరో తనని తాకినట్లైంది. మళ్లా లేచాడు. ఎవ్వరూ కనిపించలేదు. ఈ అర్ధరాత్రివేళ తనని తాకింది ఎవరు చెప్మా? కిరణ్‌కి భయం వేసింది. లేచి కూచున్నాడు.

అప్పుడు—తాను బయల్దేరే ముందు—పాజ్ చెప్పినమాట జ్ఞాపకం వచ్చింది.

"కిరణ్! ఓడలో జాగ్రత్త!! దొంగ లుంటారు!!!" అని పాజ్ హెచ్చరించాడుగా.

గదిచుట్టూ చూచాడు. ఏమీలేదు. రాత్రి ఆలస్యంగా పడుకున్నాడు కాబట్టి ఇప్పుడు నిద్ర వస్తూంది. కాని—దొంగల భయంచేత నిద్రించలేక పోయాడు.

మళ్లీ ఎవరో వీపుని నిమిరారు. ఇహ కిరణ్ ప్రాణాలు పైనే పోయాయ్! చేతితో వీపుని తడుముకొన్నాడు. ఓస్, ఇంతేనా!! ఏదో పురుగు వీపుమీద ప్రాకుతోంది. నిద్రమత్తులో మనిషి నిమిరినట్లయింది. ఇంతేనా! అనుకొని కిరణ్ ఆ పురుగుని తీసి పారేశాడు. కాస్త ధైర్యం కల్గింది. నిద్రపోగల్గాడు.

ఓడ కొన్నిరోజులకి ఏడన్ రేవుని చేరింది. అందరూ దిగుతున్నారు: కొందరు ఊరు చూడ్డానికోసం దిగుతున్నారు: కొందరు వ్యాపారం మీద దిగారు; ఇంకా కొందరు ఓడలోనే వున్నారు.

(ఇంకా వుంది)



# (నవ్వు కబుర్లు)

మనుమడు: మామ్మా నీవు జామకాయ కొరక గలవటే?

మామ్మ: కొరకలేనురా నాయనా, నాకు పండ్లంటూ ఉంటేగా!

మనుమడు: అయితే యీ జామపండ్లు కొంచం దాచిపెట్టుదూ!

భార్య: ఇదిగో మీకే చెప్తూ ఉంది. నేనింక యీ యింటిలో ఒక్క నిమిషం ఉండలేను. మావాళ్ల యింటికి యీ క్షణం వెళ్ళి పోతున్నా.

భర్త: అయితే అమ్మో, ఇది నిజమేనంటావా, లేకపోతే ఉత్త బెదరింపేనా?

(ఇంకా ఇలాంటివి పంపితే ప్రచురిస్తాము.)




MY AMRUTANJAN
There are Millions of "MY's" in that MY
Applied to the 48 year old "Pocket Doctor" of INDIA.

నిత్య జీవితములో మానసిక శాస్త్రం—

# సంభాషణలో పొరపాట్లు

* శ్రీమతి కె. సుగుణమణి *

సాధారణంగా నిత్యజీవితంలో మాట్లాడుతుంటే పొరపాట్లు వస్తుంటాయి; చేసే పనుల్లో ఏమరిపాట్లు కొన్ని జరుగుతుంటాయి. వీటినిగురించి మనమంతా మామూలుగా ఏదో పొరబాటు అని మాత్రమే అనుకుంటూ ఉంటాం. కాని, యదార్థానికి—ప్రతీ ఏమరిపాటుకు, పొరబాటుకు కూడ, మానసిక శాస్త్ర రీత్యా బలవత్తరమైన కారణా లుంటాయని ఋజువైంది. మాట్లాడ్డంలో పొరబాటు మాట వస్తుంది. ప్రత్యేకంగా ఆ మాటే రావడం ఏమి? మరొకటి ఎందుకు రాకూడదని వితర్కించి చూస్తే—ఆ మాటే పొరబాటు రావడానికి తప్పకుండా దాని వెనుక, ఒక కారణం ఉంటుందట. లోన అణిగివున్న ఊహాలు, సంకల్పాలు, ఆ వ్యక్తికి తెలియకుండానే ఈ పొరబాట్లు రూపంగా అప్పుడప్పుడు బయలు పడుతూ ఉంటాయట. ఉదాహరణలు కొన్ని చూద్దాం: అత్తా కోడళ్ల పొత్తు అందరికీ తెలిసిందే! ఊరికెళ్లి వచ్చిన అత్తగారి రాక ప్రకటిస్తూ—"మా అత్తగారు మళ్లీ చచ్చింది" అని, మాట పొరబాటు సర్దుకుంటూ "వచ్చింది" అని బాహ్యానికి ఉబలాటం వెళ్లడించిందట—కోడలు! దాంట్లో మానసిక తత్వం గ్రహిస్తే—కోడలికున్న గుప్తకోరిక 'పొరబాటు' మాటగా బయటకు ఏమరుపాటున వచ్చిందని ఋజువౌ తుంది. ఒక గయ్యాళి ఇల్లాలు భర్తను సాగనంపుతూ "మీ ఆగమనానికి ఎదురు చూస్తుంటా" ననబోయి, "మీ నిర్గమనానికి" అని, పాడు పొరబాటుకు ఎంతో నొచ్చుకుందట! ఒక వీధి బడిపంతులుగార్కి శిష్యబృందం రోజూ ఏ కూరగాయలో, పాలో, పెరుగో తెచ్చి సమర్పించుకునే అలవాటుందట. "ఏమర్రా! హోం వర్కులు తీసుకొచ్చారా?" అనబోయి, "హోమ్ సరుకులు తీసుకొచ్చారా?" అని పొరబాటున తన బుర్రలో పని చేస్తున్న ఊహాలు బయటు పడేసారట.

ఇలాగ నిత్యజీవితంలో ఎన్నెన్నో సంఘటనలు, 'పొర బాట్లు' వస్తుంటాయి. వీటికి హేతువులు అంతర్యంలో అణిగియున్న ఊహా లేనని—ఏమరిపాటున ఇలా బయట పడుతుంటాయని గ్రహించే యుంటారు. జాగ్రత్తగా పరిశీ లించి కనిపెట్టి—ఆ పొరబాటు మాట రావడానికి హేతు వేమిటని ఆరాతీయడం మొదలెట్టితే—(తీగలాగితే, డొంక అంతా కదిలినట్లు) అంతఃకరణలో అణిచిపెట్టబడి, నాగరికత వల్లనో, నాజూకు వల్లనో, మరి అనేక ఇతర కారణాల వల్లనో బాహ్యానికి ప్రకటనలోనికి రావడానికి వీల్లేక పడియున్న సంకల్పాలు, మాట్లాడుతుండగా ఏ వేళప్పుడో 'పొరబాటు' మాటల్లాగ బయటు పడుతుం టాయని నిర్ధారణయౌతుంది. వీటినిబట్టి ఆ వ్యక్తి యొక్క నైజం తెలుసుకోడానికి, ఇవి మానసిక శాస్త్రవేత్తల కెంతో సహకారిస్తాయి. కొన్ని సంకల్పాలు ఇలా 'లో మనస్సు' లో అణిగిపోయి—మతిభ్రమ, పిచ్చి, క్రొత్త ప్రవర్తన, పాడుచేష్టలు, వగైరా ఎన్ని అనర్థాలకో మూలమౌతాయని మానసిక శాస్త్ర వేత్తలు తేల్చేరు. నాగరికతవల్ల, సంఘ నిబంధనలవల్ల, స్వేచ్ఛగా విహరించ డానికి వీలులేని (జీవరాసులకు సహజమైన) తలంపులు కొన్ని మరుగు పర్చబడి, 'లోమనస్సు' అణగద్రొక్కబడి ఉంటాయి. ఇవి వేర్వేరు రూపాలుగా చేష్టల్లోను, మాట ల్లోను పొరబాట్లుగా పరిణమిస్తుంటాయి. లోన బాధించే ఈ ఒత్తిడిని తీసివేయడానికి మార్గాంతరం ఉందని కూడ కనుక్కొన్నారు. మెల్లగా ఆ వ్యక్తిని, తన అంతఃకరణలో అణిగియున్న అసలు రహస్యం ఫలానా, యన్న ఎరుకకు రాగలిగేటట్లు చేసియున్నాడు (దయ్యం వదలిన మనిషిలాగ) ఆ మనిషి సహజస్థితికివచ్చి, నిత్య జీవితంలో మళ్లీ సహజ నైజంతో ప్రవర్తించడానికి వీలవుతుంది. ఇది ఇంకా విశదీకరించాలంటే మానసిక శాస్త్రాన్ని గురించి కూడా చెప్పవలసియుంది. మనకున్న శాస్త్రాలన్నిట్లోకి నూతన మైనదీ, నిగూఢమైనదీ ఈ మానసిక శాస్త్రమే. ఈ సైకాలజీ విషయాలు అతి శ్రద్ధగా వింటే తప్ప గ్రాహ్యం చేసుకోవడం కష్టమని ముందుగా మనవి చేస్తున్నాను.

# సంభాషణలో పొరపాట్లు

'మానసిక శాస్త్రం' అంటే మనఃప్రవృత్తిని గురించి చర్చించే శాస్త్రమని అంతా గ్రహించే యుంటారు; గాని నిత్య జీవితంలో ఈ శాస్త్ర పరిశోధనలు ఏ విధంగా సమన్వయ మాతున్నాయో గమనించేవారు తక్కువమంది యుంటారు. అందులోను సంభాషణలో పొరపాట్లకూ, యీ మానసిక శాస్త్రానికీ, సంబంధం ఏమిటోయని ఆలోచించేవారు ఇంకా తక్కువ మంది ఉంటారు.

మనలో అందరికీ తెలిసినా తెలియక పోయినా, మన నిత్య జీవితానికీ మానసిక శాస్త్రానికీ ఎంతో సన్నిహిత సంబంధం ఉంది. నిజంగా గ్రహిస్తే నిత్య జీవితంలో, మనం గావించే బాహ్యాచర్యలుగాని, వ్యక్తపరచే భాషా భావాలుగాని, మన మనస్సులో (మనకు తెలిసి తెలియకుండా) జరిగే సంకల్ప—వికల్పాలయొక్క పరిణామాలేనని తెల్లమౌతుంది. అది ఎలాగో కొంత తెలుసుకుందాం:— మనిషిలో భౌతిక సంబంధమైన 'శరీరం' భౌతికేతరమైన 'మనస్సు' ఉన్నాయని అంతా అంగీకరించిన విషయమే. వీటి రెంటికీ ఒక అపూర్వమైన అవినాభావ సంబంధం వుంది. ఇది అర్థం చేసుకుంటే ముందు విషయాలు గ్రహించడం సులభం గనుక కొంచం విశదీకరిస్తున్నాను; అంతవరకు ఆనందకరమైన ఊహలతోనున్న 'మనస్సు' 'శరీరా' నికేదైనా దెబ్బ తగిలిందనగానే బాధపడుతుంది. అదేమాదిరిగా అంతవరకు ఆరోగ్యవంతగా నున్న 'శరీరం,' మనస్సుకేదైనా కొంచం చింత కలిగిందీ అంటే నీరసిస్తుంది. ఇలాగ 'శరీరం,' 'మనస్సు' వీటి ప్రభావం ఒక దాని మీద ఒకటి సాగిస్తూనే ఉంటాయి. అందుకే సుఖ జీవనానికి శారీరిక ఆరోగ్యం, మానసిక ఆరోగ్యం రెండూ ఉండాలని పెద్దలంటారు. వీటిల్లో దేనికెక్కువ ప్రాధాన్యం వుందా అన్నసంగతి కూడ మనకే తెల్లమౌతుంది.

శరీరాన్ని గురించీ, దాని ఆరోగ్య నియమాల్ని గురించీ అంతా వినేయుంటారు. అంటే పరిశుభ్రమైనగాలి, నీరు, ఆహారం, వసతి వగైరాల్ని గురించి మామూలుగా అంతా చెపుతూనే యుంటారు. నిత్య జీవితంలో వీటిని గురించి కొద్దో గొప్పో తెలుసుకుంటూ శరీరారోగ్య సూత్రాలు కొద్దో గొప్పో అంతా ఆచరణలో పెడుతూనే ఉంటారు. కాని, వీనికంటే మానసిక ఆరోగ్యం అనేకరెట్లు ఆవశ్యకమనీ, ప్రాముఖ్యమనీ ప్రాజ్ఞులు అంటుంటే—ఎందుచేత చెప్పారో, అని ఎప్పుడైనా వితర్కించి చూచేరా? చూడలేదు. ఇప్పుడు చూద్దాం. మానసిక శాస్త్రం మనస్సును గురించి తెలుసుకోడానికి ప్రయత్నిస్తుంది. మనస్సు అన్నది అపూర్వమైన వింతవస్తువు. వస్తువు అన్నామని అది ద్రవ్య (Matter) గుణాలు కలిగి భౌతిక సంబంధమైన దనుకోగూడదు. ద్రవ్యమైతే, మన పంచేంద్రియాల్లో దేనిచేతనో ఒక దానిచేతనైనా, గ్రహింపబడగలిగి ఉండాలి. ఇది అలా గ్రహింపబడదు. మళ్లీ పంచేంద్రియాలకు చిక్కనంత మాత్రంచేత ఇది లేదనడానికీ వీలులేకుండా—'ఉన్నది' అన్న ఊహే మనకు నచ్చజెపుతూ యుంటుంది. అందుకే—ఇది ఊహాజన్యమనీ, ఆ ఊహల్ని బట్టే దాన్ని తెలుసుకోనౌతుందనీ, ఆ ఊహలే మన వాక్కులకూ, చేష్టలకూ మూల కారణమనీ మన పూర్వులు అనేక శతాబ్దాలకు పూర్వమే గ్రహించేరు. ఆధునికులు ఇప్పుడిప్పుడే ఈ రహస్యం తెలుసుకుని 'మానసిక శాస్త్రం' (సైకాలజీ) అని ప్రకటిస్తున్నారు. "సర్వార్థములు మనస్సంభవములు" అన్న ప్రహ్లాదుడి వాక్యాల్లో ఎంత అనంతార్థం ఇమిడివుందో ఎప్పుడైనా ఆలోచించేరా! ఆలోచించండి. ఇది భక్తియోగం వెలిబుచ్చిన రహస్యం అని చెప్పొచ్చు. అలాగే జ్ఞాన, కర్మ, హఠయోగాలు మనస్సు—మానసిక శాస్త్రాన్ని గురించి అపూర్వంగా విమర్శించేయి. అవి గ్రహించ ప్రయత్నించండి.

ఇక ఆధునికులు తేల్చిన మానసిక శాస్త్ర రహస్యాలూ, ఇవి మన నిత్య జీవితంలో సుఖ జీవనానికి ఎంతవరకూ తోడ్పడతాయా నన్న హంశాలూ చెప్పాలంటే కూడా కొన్ని విషయాలు చర్చించాలి. మనం ప్రపంచాన్ని పంచేంద్రియాల ద్వారా తెలుసు కుంటున్నాం. కన్నువల్ల రూపాలు, ముక్కువల్ల వాసనలూ, చెవివల్ల శబ్దాలూ, నాక్కువల్ల రసాలూ, చర్మంవల్ల శీతోష్ణాలూ గ్రహిస్తున్నాం. ఐనా కేవలం ఈ పంచేంద్రియాల వల్లనే ఈ గ్రహణ జరగడంలేదని కూడా ఎరుగుదుం. ఎందుకంటే నిద్రలోనున్న శరీరానికిగాని, చచ్చిన శరీరానికిగాని ఈ పంచేంద్రి

యాలు ఉన్నప్పటికీ అవి విషయాల్ని గ్రహిస్తున్నాయా? లేదు. దీనివల్ల ఏమిటి బుజువౌతుందీ అంటే ఈ పంచేంద్రియాల కన్నా అతీతమైన దొకటివుండి, వాటి ద్వారా వచ్చే నాడీ సంజ్ఞల్ని సమన్వయ పరుస్తూ "ఎరుక" కలుగజేసేది—ఒకటుందనీ, దీన్నే 'మనస్సు' అన్నారనీ మన మిప్పుడు సులభంగా అర్థం చేసుకోవచ్చు. అలాగే మనస్సులో పుట్టినంత మాత్రంచేత, ఆ ఊహ, వాక్కు రూపంగానో, క్రియా రూపంగానో పరిణమించి, పంచేంద్రియాలను పని చేయిస్తూవుంది; అంటే ఏమిటి? మనస్సే శరీరాన్ని నడిపిస్తూ యుందన్నమాట, "మన ఏవ జగత్సర్వం" అన్న వాక్యార్థం అవగాహన చేసుకోవడం, అందరికీ సుసాధ్యం కాకపోవచ్చు. ఐనా మనస్సు అన్నది ఫలానా యని, శరీరంమీద దాని ప్రభావం పూర్తిగా యుందనీ గ్రహిస్తే ఇక మనం అధునిక మానసిక శాస్త్రాన్ని గురించి చెప్పుకోవచ్చు.

పాశ్చాత్యులు శరీరయంత్రాన్ని గురించి అమూల్య రహస్యాలే కనుక్కున్నారు; కాని ఈ యంత్రాన్ని నడిపే మనస్సును గురించి ఎక్కువగా గ్రహించింది ఇటీవలనే. జర్మనీ దేశస్థుడైన సిగ్మండ్ ఫ్రాడ్ అన్న మహనీయుడు ఈ మానసిక శాస్త్ర పితామహుడని చెప్పొచ్చు. ఇతడూ ఇతని సమకాలికులు కొందరూ, తదుపరి మరికొందరూ, చాల కృషిచేసి, మనస్సు—దాని ప్రవర్తన—నిత్య జీవితంలో దాని ప్రభావం—వగైరా విషయాలెన్నో కనుకున్నారు. వీరు తేల్చిన సారాంశాలు ఏమిటంటే:— మనస్సు అన్నది అతి నిగూఢమైనదనీ, దాంట్లో జనించే ఊహల్లో కొన్ని మాత్రమే మన 'స్మృతిపథం'లో ఉంటాయని, కొన్ని తలంపులు వీటి వెనుకనే ఉండి త్వరలో జ్ఞప్తిపథంలో పడతాయని, కొన్నిమాత్రం, అతి నిగూఢమైన 'లో అంతఃకరణ'లో అణిగిపోయి ఉంటాయనీ కనుక్కున్న హాంశాలు. మనస్సులో జన్మజన్మాంతరాలుగా (ప్రాణం అనేది ఉత్పత్తియై, ఏక కణజీవి, వృక్షం, అల్పజంతువు, చతుష్పాదజంతువు, ద్విపాదజంతువులు, వానరం, ఆఖరకు మానవుడు వగైరా) సృష్టి పరిణామంలో జరుగుతూ వచ్చిన రహస్యాలన్నీ, లక్షణాలన్నీ ఇమిడివుంటాయనీ, క్రమంగా 'నాగరీకులు' అనుకునే మానవసంఘం తయారైనకొద్దీ—సంఘ మర్యాద కోసరం, నాగరీకులుగా సంచరించాలని ప్రవర్తించడంలో—కొన్ని పశు లక్షణాలు, జంతు లక్షణాలు, మానసిక లక్షణాలు, మామూలు స్మృతి పంథంలోకి రాకుండా వెనక్కునెట్టబడి, అణచివేయబడి ఉంటాయని కనుక్కున్నారు. ఇలా అణచివేయబడిన ఊహాలు, కోరికలు, క్రమంగా 'మానసికముడులు'గా ఏర్పడుతాయట. ఇవి అవకాశం చిక్కినప్పుడల్లా, నాగరికత అనే పొరనూ, సంఘ మర్యాద అనే అడ్డునూ పడదోచుకుని, వెలికి రావడానికి ప్రయత్నిస్తుంటాయట. జాగ్రదావస్థలో బాహ్యస్మృతి పథం (పోలీసుకాపలావలె) వీటిని అణచి పెట్టి ఉంచుతుంటుంది. ఇవి అంతర మనస్సులో, ఎంత లోతుగా నెట్టివేయబడితే, అంత అధిక ఒత్తిడితోటి బయటు పడ్డానికి ప్రయత్నిస్తూ, అవకాశం కోసరం, రోజులు—నెలలు—సంవత్సరాలు కాచుకొని ఉండి, మామూలు స్మృతి పథంలో ఏ మాత్రపు అజాగ్రత్త, అప్రమత్తత ఏర్పడ్డా, బయటకు విభిన్న రూపాలతో ప్రత్యక్షమౌతూవుంటాయట. సరిగ్గాబయటు పడడానికి వీలు లేనప్పుడు, రూపాంతరం పొంది, నిద్రావస్థలో వింత 'కల' లరూపంగాను, జాగ్రదావస్థలో కూడా వాక్కుల్లోను, చేష్టల్లోను, 'పొరబాట్లు' రూపంగాను బయటుకు జారిపడుతూనే ఉంటాయి. సంభాషణలో పొరపాట్లు, నిత్య కృత్యాల్లో, ఏమరి చర్యలూ పరిశోధించి, కుశలుడైన మానసిక శాస్త్రవేత్త, వీటి పుట్టు పూర్వోత్తరాలు బయటు బెట్ట గలడు.

ఈ మానసిక శాస్త్రం తేల్చిన అమూల్య రహస్యాల్ని ఎన్నిటినో వినియోగించి, సంఘం యొక్క గోడూ, నాగరికతా నిలబెట్టుకుంటూ, వ్యక్తియొక్క సుఖ జీవనానికి ఎంత వరకూ సులభ పంథాలు నిర్మించగలమా అని పాశ్చాత్త దేశాలు అఖండమైన కృషి చేస్తున్నాయి. మనం కూడా ఈ రహస్యాలు అవగాహన చేసుకుంటే—నిత్య జీవితంలో, సంఘంలో, కుటుంబంలో, సక్రమంగా వ్యక్తులు అమరడానికి చాల తోడ్పడుతుంది. ఇది తెలియకుంటే, అలా అణచిపెట్టబడ్డ ఊహాలు, కోరికలు—అగ్ని పర్వతంలో

‘లాలాద్రవ్యం’ లాగ, లోలోపల విజృంభించి, వెర్రితలలు వేసి — హిస్టీరియాలు, సుపీరియారిటీ — ఇన్ఫీరియారిటీ కాంప్లెక్సులు, భ్రూణహత్యలూ, జార—చోర—ఖూనీ కార్యాలు వగైరా ఘోరకృత్యాల కెన్నిటికో దోహద మౌతాయి. యువతీయువకు లెందరో ఇట్టి మానసిక రోగాలకు గురియౌతున్నారు. మరొక రహస్యం కూడా వుంది. ఒక వ్యక్తిని బాధించే ఈ వెర్రి తలలకూ, ఊహలకూ, చేష్టలకూ, హేతుభూతమైన (ఎప్పుడో బాల్యంలో సహితం అంతఃకరణలోనికి నెట్టివేయబడి) అణచి పెట్టబడియున్న ఊహల్ని క్రమంగాతరచి, ‘మానసిక పృథఃక్కరణ’ (Psycho—analysis) వల్ల, ఆ వ్యక్తియొక్క స్మృతి పథంలోకి తెచ్చి—నిన్ను బాధించేది ఫలానా విషయం సుమా అన్న సంగతి ఆ వ్యక్తి అవగాహనలోకి తెచ్చిన తత్క్షణం—పిశాచం విడిచి పారిపోయినట్లు, పూర్వపు పిచ్చిచేష్టలూ, పరామరుష మాటలు, వాక్ధోరణులూ మారిపోయి, ఆశ్చర్యకరంగా మామూలు మనిషి అవడానికి తోడ్పడుతుంది.

అందుచేత ఇలాంటి అతిగహనమైన మానసిక శాస్త్ర వైజ్ఞానిక రహస్యాలు, నిత్య జీవితంలో శరీర—మానసికారోగ్యాలు సంరక్షించుకోడానికి—తద్వారా శాంతిమయ సుఖ జీవనాలుగడపడానికి మన మంతా ప్రయత్నించడం ఎంతైనా అవశ్యకం.

దుర్గ్రాహ్యమైన ఈ మానసిక శాస్త్ర రహస్యాల్ని సామాన్యజనానికి సుబోధక మయ్యేటట్లు, వివిధ శీర్షికల క్రింద పత్రికలు, రేడియోలు ప్రకటించడం ఎంతైనా ముదావహం—సంఘానికిది ఎంతైనా శుభావహం.

(ఆలిండియా రేడియోవారి సౌజన్యంతో.)



చిత్ర సమీక్ష

# దీక్ష

[శ్రీమతి అచ్యుతుని గిరిజ]

డైరెక్షన్ : ప్రకాశరావు

రచన : తాపీ, ఆత్రేయ

సంగీతం : పెండ్యాల నాగేశ్వరరావు

నటీనటులు :

జి. వరలక్ష్మి, రామగోపాల్, శివరావు, శేషమాంబ, రంగసామికుందు, చిట్టిబాబు, మొదలయినవారు.

ప్రకాశ్ ప్రొడక్షన్సువారి క్రొత్తచిత్రం దీక్ష. పిల్లల స్వచ్ఛమైన సుతిమెత్తని హృదయాలను సరిఅయిన పద్ధతిలో వికసింపచేసి వుత్తమ పౌరులుగా తయారు చేయగల నైపుణ్యం, వాత్సల్యంగల తల్లికే వుంటుందన్న విషయమే దీక్ష సారాంశం. శరత్ చంద్రుడి "రామేష్—సుమతి" అనే నవలను ఆధారంగా తీసుకుని యీ చిత్రం తీశారు.

యశోదమ్మ తల్లిలేని తన మరది గోపిని కన్నబిడ్డ కన్న ఎక్కువ మమకారంతో పెంచింది. గోపికి తల్లి, గురువు, అండ, అన్నీ వదినె యశోదమ్మే. అన్యాయం అక్రమంచూసి సహించే స్వభావంకాదు గోపిది. ఎంతటివారికైనా సరే నిర్భయంగా న్యాయం కోసం ఎదిరించాలంటాడు. లోకాన్ని మరమ్మతు చేయాలని సంకల్పం. గోపికి వూళ్లో వాళ్లకి రోజురోజుకు హెచ్చిపోతున్న గిల్లి కజ్జాలను చూసి విసిగెత్తి అతని అన్న తమ్ముడికి భాగం పంచి యిచ్చేస్తాడు. యశోదమ్మను గోపితో మాట్లాడవద్దని శాసిస్తాడు. వదినె పెట్టనిదే తినటం, జోలపాడనిదే నిద్రపోవటం అలవాటులేని గోపి యీ శిక్ష సహించలేక పట్నం పోతాడు. అక్కడ ఎటుచూచినా దగా మోసమే కనిపించుతయ్. మనుషులంటే వీళ్లేనా అని విస్తుబోతాడు. వదినె వాత్సల్యం తలంపుకు వచ్చి యిల్లు చేరుకుంటాడు. ఆమెదగ్గర బుద్ధిగా వీరుల చరిత్రలు, దేశచరిత్ర అన్నీ చదివి తెలుసుకుని దేశసేవకు దీక్ష తీసుకుంటాడు. గోపి జీవితాన్ని తీర్చిదిద్దిన ఆదర్శమాతృస్వరూపిణి యశోదమ్మను అంతా మెచ్చుకుంటారు.

యశోదమ్మగా జి. వరలక్ష్మి నటన మెచ్చతగి వున్నది. ఆమె భావాలు, ద్వంద్వభావాలు అతి విశదంగా ముఖాన కనపరచింది. ఎన్నో సన్నివేశాలలో మాటలు అవసరం లేకుండానే భావప్రకటనతో నిర్దుష్టంగా విప్పి చెప్పినట్లు చేసింది. మాతృదేవతగా వాత్సల్యం తొణికిసలాడుతున్న ఆమె యశోదమ్మ పాత్ర చూస్తుంటే ఎటువంటి పాత్రనైనా సామర్థ్యంతో నిర్వహించగల నేర్పరి అని ఋజువవుతుంది. గోపిగా రామగోపాల్ నటన అద్భుతంగా వున్నది. ఇదే అతని మొదటి వేషమంటే నమ్మటానికి వీలులేకుండ వున్నది. వృద్ధనాయకులు, యువనాయకులు తమదని విఱ్ఱవీగుతున్న కథానాయకత్వం యీ బాల నాయకుడు యిట్టే బుకాయించి తీసుకుని, అతి నైపుణ్యంతో తనదనిపించుకున్నాడు. అతని ఆకారమే తిరుగుబాటు సూచిస్తూవుంటుంది.

నిజం చెప్పాలంటే యీ చిత్రంలో రామదండు పిల్లలు, డాక్టరు, దుర్గమ్మ, అచ్చి, టీచరు కూడ తమ పాత్రలకు ఒక విధమైన ప్రత్యేకత కలిగివుండేట్లు చక్కగా నటించారు. పాత్రలన్నీ సజీవంగా వున్నయ్.

కథ సూటిగా క్లుప్తంగా వున్నది. చిత్రంలో పటుత్వం మాతాభావ ప్రకటనలోను, సన్నివేశాలలోను యిమిడ్చారు. అందువల్ల ప్రతిఒక దృశ్యం మనస్సులో నాటుకుపోతూ యేకాగ్రతతో చూడవలసి వస్తుంది. మాటలు చాలా తక్కువగా వుండి, భావ పూరితంగా నిండుగా వున్నయ్. అనుకరణలే అయినా పాటలు అర్థంకలిగి శ్రావ్యంగా వున్నయ్. యశోదమ్మ గోపిని దండించే సందర్భంలో అంత చేటుగా కొట్టటం ఆమె స్వభావానికి విరుద్ధంగా వున్నది. అంత మొరటుగా గొడ్డును కొట్టినట్లు కొట్టిన

తర్వాత ఎవరైనా కొంత మానసిక బాధ అనుభవించక తప్పదు. ఒకటి రెండు దెబ్బలుకొట్టి, దానికే ఆమె కొంత ఆవేదన చూపించితే, ఆమె మమకారము, హృదయా వేదన చక్కగా విశదమయ్యేవి. శిపాయీలు కథకు కేవలం నిరుపయోగం. అయితే జమీందారు పాత్రకు సహకరించుతయ్. తనకు యిష్టంవున్నా లేకపోయినా అనవసరమే అయినా కేవలం కలెక్టరుగారి మాటప్రకారం వాళ్ళకు జమీందారు వుద్యోగం యివ్వవలసి వస్తుంది. ఈ విషయం వివరించటానికి మాత్రం వాళ్ళు పనికివస్తారు. హాస్యానికి అనవసరం. ఊళ్ళో పెద్దలకు రామదండుకు జరిగే గిల్లికజ్జాలు, డాక్టరుపాత్ర, దుర్గమ్మ పాత్ర కథలో హాస్యానికి చాలు. చిత్రం చివరలో అనవసరంగా పెరిగింది. గోపీ సభలో ప్రశ్న అడిగేవరకు వున్న వాతావరణం, టెంపో ఒక్కసారిగా జారిపోతయ్. సర్దారు గోపాలం గోపీ పాత్రను నలిపివేసినట్లుగా తోస్తుంది. గోపీని దేశ నాయకుడుగా మార్చకపోతే బాగుండేది.

ఏది యెట్లా వున్నా ఆంధ్రులందరికి కళ్ళకు, చెవులకు, మనస్సుకు కూడా యింపుగావుండే వుత్తమచిత్రం దీక్ష. లొల్లిపాటలు, వెకిలిమాటలు, వెగటుహాస్యం మచ్చుకైనా కనిపించవు.



## జాజిమల్లి

ఆంధ్ర మహిళలో ప్రచురిస్తూ వస్తూన్న 'జాజిమల్లి' సీరియల్ నవల, కొన్ని అవార్యమైన కారణాలవల్ల, ఏకాదశ గుళుచ్ఛము ప్రచురించకుండా ఆగిపోయింది—దీనికి మా పాఠకులు మన్నింప గలరని భావిస్తున్నాము.

ఏకాదశ గుళుచ్ఛము నవంబరు సంచికలో ప్రచురింపబడుతుందని మనవి చేస్తున్నాము.

సంపాదకురాలు.

# శ్రీ కస్తూరిదేవి విద్యాలయం

## నెల్లూరు

### నూతన భవన ప్రవేశోత్సవము—రజతోత్సవము

21-9-51 న, నూతన భవన ప్రవేశోత్సవమును, మంత్రి గోపాలరెడ్డిగారి అధ్యక్షత క్రింద, మంత్రి మాధవ మీనన్ గారు ప్రారంభించినారు. శ్రీమతి కుట్టి అమ్మాళ్ గారు పతాకమును ఎగురవేసినారు. 22-9-51 న, రజతోత్సవమును, న్యాయపతి చంద్రా రెడ్డిగారి అధ్యక్షతక్రింద, ఆంధ్ర విశ్వకళాపరిషత్తు ఉపాధ్యక్షులు శ్రీ వి. యస్. కృష్ణాగారు ప్రారంభించినారు. ప్రముఖులు ఉపన్యసించినారు. కుమారి రాధ నృత్యం, గాన కోకిల శ్రీమతి ఎమ్. ఎస్. సుబ్బలక్ష్మిగారి గానం, విద్యాలయ బాలికల నృత్యనాటక ప్రదర్శనములతో ఉత్సవశోభ పూర్తిగా రాణించినది.

1923 నాటి మాట—జాతీయోద్యమం, మహాత్ముని నాయకత్వాన అతి ముమ్మరంగా ఆసేతుహిమాచలం వ్యాపించి, మహా పురుషుల త్యాగము, తేజస్సు, సమ్మిళితమై స్వాతంత్ర్య పిపాస ప్రజా హృదయాల్లో పాడ నూపిన సమయం—ఆ పుణ్యసమయంలో, మహాత్ముని ఆదేశముతో—ఆయన ఆశీస్సులతో, యీ విద్యాలయం స్థాపింపబడినది—1944 నుండి ఇది యొక యున్నత పాఠశాలగా వెలుగొంది 400 మంది విద్యార్థినులతోడను, వసతి గృహములో 60 మంది బాలికలతోనూ, అభివృద్ధి సూచిస్తున్నదంటే, వ్యవస్థాపకుల ఆశయశుద్ధి, నిర్వాహకుల దక్షత, పోషకుల సహృదయత వెల్లడౌతూవున్నవి.

రజతోత్సవమనేది ఏ సంస్థయొక్క చరిత్రలోనైనా ఒక అపురూపమైన సంఘటన—అందులో ఎన్నియో పవిత్ర వీరగాథలతో, "త్రింశత్కోటి భారతీయుల స్వాతంత్ర్య తేజస్సు, ముక్కోటి ఆంధ్రుల జాతీయ యశస్సు" సాక్షాత్కరింప జేస్తూ, పురోగమన పంథాలో, యీ విద్యాలయ మొక స్త్రీల పారిశ్రామిక కేంద్రంగా, ఒక ఉన్నత కళాశాలగా విజృంభించ గలదనే ఆశయమును సూచిస్తున్న యీ రజతోత్సవ పర్వసమయంలో, మహిళాభ్యుదయానికై ఇంత కృషిచేస్తూ ఉన్న యీ విద్యాలయాన్ని స్థాపించిన శ్రీమతులు కనకమ్మ, లక్ష్మీబాయమ్మగార్లకు, తదితరులకు ఆంధ్ర మహిళా లోకమంతయు కృతజ్ఞులయ్యెనా రనుటలో అతిశయోక్తిలేదు.




—: మ్రొక్కుబడి :—

రచయిత : శ్రీ మొక్కపాటి నరసింహశాస్త్రిగారు.
వెల రూ 2. ప్రతులకు : మొక్కపాటివారు,
అడ్మిరాలిటీ హౌసు, మైలాపూర్, మద్రాసు-4.

తెలుగు సాహిత్యంలో నాటికారచన అనాది నుండి ఎంతో పురోగమించి ఉంది. నాటికారచనలు సాగించిన రచయితలు అనేక మంది ఉన్నారు. ప్రాచీన కాలంనుండి, ఈ నవయుగం వరకు తెలుగు సాహిత్యాన్ని పరిశీలించి చూస్తే అమూల్యమైన నాటికా గ్రంథాలను మనం చూడ కలుగుతాం. ఒక్కొక్క రచయిత ఒక్కొక్క మహత్తరమైన నాటికలను సృష్టించి ఉండవచ్చు. ఆనాటికలను సమర్థులైన నటకులు రంగస్థలములపై ప్రదర్శించిన నాడే దానికి రక్తికట్టి ఉంటుంది.

ముఖ్యంగా చిలకమర్తి, వీరేశలింగంగారి ప్రహసనాలు భమిడిపాటివారి నాటికలు తెలుగు నాడులో వ్యాపించాయి. శ్రీ మొక్కపాటివారి మ్రొక్కుబడి (ఇతర నాటికలు) చక్కని భాషలో వ్రాశారు. వీటిలోని విశిష్టత ఏమిటంటే ఒక్కొక్క నాటికలో హాస్యంతోకూడ, భావగర్భితమైన చక్కని సమస్యలున్నాయి. నటించటానికి చక్కని వాతావరణాలు సృష్టించారు.

మ్రొక్కుబడి, అభ్యుదయం, పెద్ద మామయ్యా, అసాధారణ సమావేశము, వారసత్వం, పాతివ్రత్యం. ఈ ఆరు నాటికలలో "మ్రొక్కుబడి" లో మనకు విచిత్రమైన మనస్తత్వాలను చక్కగా చూపించారు. "అభ్యుదయం" అనే నాటికలో నారాయణరావు (విజ్ఞాన వేత్త) పాత్రను మనం పరిశీలించి చూస్తే కేవలం ఆ వ్యక్తి ఒక్క నియమానికేకట్టుబడి, తన స్వార్థం తాను చూచుకుంటాడు. అతని అక్క పద్మావతి విమర్శించి చెప్పినా తన్నుతాను బలపరచుకుంటాడే కాని, తాను చేసేకార్యంవల్ల వచ్చే ముప్పును స్మరించడు. అతడు మాట్లాడే ప్రతివాక్యం చూస్తే మతి పోయిందేమో అనుకుంటాము. అభ్యుదయ భావాలతో, తమాషాగా మట్లాడుతాడు. ఈ నాటికను చక్కని స్థాయిలోకి తెచ్చారు.

"పాతివ్రత్యం" అనే నాటికలో సావిత్రమ్మ, పూర్వాచారపరాయణురాలు, ఆదర్శ గృహిణి. కాని ఆమె భర్త రమణరావు విద్యాధికుడు, ఆధునికుడు. సావిత్రమ్మ పతే దైవమంటుంది. పతి సేవ కంటే స్త్రీకి వేరే మోక్షం లేదంటుంది. రమణరావు ఆధునిక అభిప్రాయాలు కలవాడు కనుక, తన భావాలకు అనుగుణంగా తన భార్య నడవాలి అంటాడు. తన భార్యవచ్చి అతను పరస్త్రీతో సత్కాలక్షేపనచేస్తున్నందుకు ఏవైనా ప్రశ్నలు వేస్తే దానికి కోపగించుకొని, చివరికి భార్యను సహితం గొంతుక నొక్కుతాడు. చివరికి సావిత్రమ్మే తన పద్ధతిని మార్చుకొని తన భర్త అభిప్రాయాలకు అనుగుణంగా ఉంటానంటుంది.

ఈ విధంగా ప్రాచీన ఆధునిక భావాల మధ్య జరిగే సంఘర్షణను "దంపతుల సమస్య" లో మనకు మొక్కపాటివారు చక్కగా చూపించారు. ఇదే విధంగా మిగతా నాటికలలో ఏదో ఒక సమస్యను సృష్టించారు. ప్రతి నాటిక చదువుతుంటే పదేపదే చదవాలనే కుతూహలం మనలో కలుగుతుంది.

—జి. ప్రభ

# గ్రంథ సమీక్ష

## శ్రీ శారదా ప్రసంగములు

అనువాదకులు : శ్రీ వెదురుమూడి వెంకట కృష్ణారావు.
వలయుచోటు : శ్రీ రామకృష్ణ మఠము,
మైలాపూరు : మద్రాసు.
వెల : రెండున్నర రూపాయలు.

శ్రీ రామకృష్ణుని సతి, శ్రీ శారదాదేవి మనదేశంలో మాతృదేవిగ పరిగణింపబడిన పూజ్యురాలు. మహామ తల్లి. మహాసాధ్వి. ఈ మాతృదేవి బోధించిన భక్తి జ్ఞాన నీతి బోధలే ఈ పుస్తకమున పొందు పరపబడినవి.

మూడు భాగములుగల ఈ గ్రంథములో హిందూ మతాచారములు, సాంఘిక ధర్మములు మానవ విద్యుత్ ధర్మములు, ఈశ్వరోపాసనము మొదలగునవి వ్యక్తపరుప బడినవి.

శ్రీ శారదాదేవి స్వాంతనవచములతో తన శిష్యు రాండ్ర కుపదేశించిన వ్యాక్యముల మూల్యములు. ఆడువారికి ఓరిమి ఉండవలయును. ఎంత స్వల్పవస్తువునైనను వ్యర్థము చేయ కూడదు. చెడుగులో మంచి, సత్యం భావణ, పవిత్రత, జీవిత లక్ష్యము అను ఉపశీర్షికలక్రింద పొందు పరచిన శ్రీ శారదా వాక్యములు ఎంతో ఆచరణీయములు.

శ్రీ శారదాదేవి ప్రసంగములను వంగ భాషలో "మాయేర్ కథా" అనుగ్రంథముగా శ్రీమద్ అరూపానంద స్వామి వ్రాశారు. దీనిని ఆంగ్లీకరించినది శ్రీ నిఖిలానంద స్వామి. ఈ ఆంగ్ల పుస్తకమునుండి శ్రీ వెదురుమూడి వేంకట కృష్ణారావుగారు తెనిగించినారని ప్రకాశకులు "తొలినుడి" లో తెలియ జేశారు.

శ్రీ కృష్ణారావుగారి అనువాదం సమంజసంగా ఉంది. ఈ గ్రంథము చదువుతూంటే అనువాద గ్రంథమని పించదు. అసలు ఇదే మూల గ్రంథమేమో అనిపిస్తుంది.

మంచి కాగితంపై పెద్ద అచ్చులో ఈ పుస్తకం ఒప్పుగా ఉంది. ఇది మనకందజేసే సందేశాలకు ధర కొంచెం తక్కువే అని చెప్పొచ్చు.

"శ్రీ శారదా ప్రసంగాలు" ప్రతీవారు చదువ వలసిన గ్రంథము.

—గి. లక్ష్మీకాంతమ్మ.



# ఆంధ్ర మహిళా సభలో

# దసరా ఉత్సవములు

అక్టోబరు 8, 9, 10 వ తేదీలలో దుర్గాష్టమి, మహానవమి, విజయదశమి పండుగలకు ఉదయం తొమ్మిది గంllలకు దేవీపూజ, బొమ్మల కొలువు, పేరంటం, సాయంకాలము 5 గంllల నుండి వినోద కార్యక్రమము జరుగును.

అంతకు పూర్వము, ఆటలలో, పాటలలో, వక్తృత్వములో, నాటకములలో పోటీలు జరుగును.

ఎప్పటివలె, తెలుగు, హిందీ, ఇంగ్లీషులలోనేగాక, యీసారి తమిళ భాషలో కూడ వక్తృత్వ పోటీలు, నూలువడకుట, చేనేత, కుట్టు, ఎంబ్రాయిడరీ, రంగువేయుట, అద్దకపుపనులలోనూ కూడ పోటీలు ఏర్పాటు చేయబడినవి.

పోటీలలో గెల్పొందినవారికి విజయదశమినాటి సాయంకాలము బహుమతులీయబడును.

నవంబరు సంచికలో పోటీల వివరములు, గెల్పొందిన వారి ఫోటోలతో సహా ప్రచురింపబడును.

జ. జమునాబాయి.
అ. చన్నఘంటమ్మ.

# శ్రీ రాజ్యలక్ష్మి శతవార్షిక వర్ధంతి

## విజ్ఞాపన

సాహిత్య - సాంఘిక రంగములయందు చైతన్యవంతమైన వసంతయుగమును స్థాపించిన మహాపురుషుడు శ్రీ వీరేశలింగము పంతులుగారికి ధర్మపత్నియై, సాంఘికోద్యమములన్నిటను ఆయనకర్ధాంగియై పాల్గొని, విశేషించి - పతిత స్త్రీ సమాజోద్ధరణమునకు తన దివ్యజీవితము ధారవోసిన మహాసాధ్వి శ్రీ కందుకూరి రాజ్యలక్ష్మమ్మగారు జన్మించి, రాబోవు 10—11—51 తేదీకి ఒక శతాబ్దము కావచ్చుచున్నది. ఈ సందర్భమున పంతులుగారికి జరిపించినట్లే - ఆమెకును శతవార్షిక వర్ధంతి మహోత్సవము గావించుట తెనుగు దేశముయొక్కయు, ప్రధానముగా రాజమహేంద్రవర పౌరుల యొక్కయు కర్తవ్యమై యున్నదని వేఱుగా మనవి చేయవలసిన యవసరములేదు. చిరస్మరణీయురాలైన ఆమెయెడల మన కృతజ్ఞతకు గుర్తులుగా కొన్ని విధులు నిర్వహింపవలసి యున్నది. వానిలో—శ్రీ రాజ్యలక్ష్మిగారు వివిధ విషయములపై చేసిన యుపన్యాసములు, వ్రాసిన వ్యాసములు, గీతములు చెదరిపోకుండ చేర్చి యొక సంపుటముగాను, అనేకులు ఆమెపై వ్రాసిన ప్రశంసారచనలు కూర్చి ఒక సంపుటముగాను వెలువరించుట ప్రథమ కర్తవ్యము. ప్రథమ శ్రేణిలో ఉత్తీర్ణురాలైన ఒక్కొక్క విద్యార్థినికి ఏటేట "రాజ్యలక్ష్మి స్వర్ణపతకము" నిచ్చుచుండుటకు తగిన నిధి "ఆంధ్రవిశ్వవిద్యాలయము" న నెలకొల్పవలసి యున్నది. ఈ నిధి సమర్పణము డిశంబరు నెలలో జరుగనున్న విశ్వవిద్యాలయ రజతోత్సవ సమయమున జరుగుట ఉచితముగా నుండునని భావించుచున్నాము. ఉదారులగు ఆంధ్రమహాశయులు, మహిళామణులు ఈ యుద్యమమునకు చేదోడు వాదోడై విజయవంతముగా జరుగునట్లు ఆశీర్వదింప గోరుచున్నాము. సంపుట ప్రకటనము—"నిధి" స్థాపనము అయిన తరువాత పతిత స్త్రీ జనోద్ధరణకు సంబంధించిన ఒక సంస్థ కూడ ఆ మహాసాధ్వి పేర నెలకొల్పవలయునని సంకల్పించి యున్నాము. ఈ యుద్యమముల సక్రమ నిర్వహణముతో "శతవార్షిక వర్ధంతి" జరుపుట ఆ తల్లి ఆత్మశాంతికి కారణమగుటయేగాక, నేటి మహిళా సంఘములో ఒక జీవనాభ్యుదయము వికసింప జేయుటయు కాగలదు.

కావున ఈ సమయమున స్త్రీ పురుషుల హృదయపూర్వకమైన ఆర్థిక సహకారమునకు వినయ పూర్వకముగా మేము పట్టు భిక్షాంజలి యిది.

తారకం

శ్రీ రాజ్యలక్ష్మి శతవార్షిక వర్ధంతి సంఘము తరపున

విరాళములు సహాయ కార్యదర్శి, శ్రీ రాజ్యలక్ష్మి శతవార్షిక వర్ధంతి వార్షికోత్సవ సంఘము, రాజమహేంద్రవరము, అని పంపండి.



# తెలుగు భాషా సమితివారిచే ఉత్తమ గ్రంధరచనలకు బహుమతి

1943 సం॥ తరువాత, యీ క్రింది పేర్కొన్న విషయములలో ఆంధ్రమున గ్రంథములు రచయించినవారు, తమ గ్రంథములు, నవంబరు 1-వ తేదీలోగా, తెలుగు భాషాసమితి కార్యాలయము, 27, యూనివర్సిటీ బిల్డింగ్సు, మద్రాసు-5కు పంపించవలెను.

## విషయము

1. కర్ణాటక సంగీతము యొక్క క్రమ పరిణామము. 2. భారతీయ శిల్పము, భారతీయ చిత్రలేఖనములయొక్క చరిత్ర. 3. చిత్రముల నిర్మాణము, ప్రదర్శనములను గూర్చిన శాస్త్రరీతి. 4. ఆహార పదార్థములు—స్వాభావికములు, సంయోగీకరణముచే కల్పితములు. 5. తెలుగు కవయిత్రుల కవిత్వమును గూర్చిన సవిమర్శక సమీక్ష. 6. రసాయనిక శాస్త్రము.

ఇందు ప్రతి పుస్తకము C/8 సైజు కాగితములో 200 పేజీలకు తగ్గనదిగా ఉండవలెను.







I.T.L

చిత్ర జగత్తులో 'కావ్యగౌరవమును'
సంపాదించగలి కళాసృష్టి
వాహినీవారి

# మల్లీశ్వరి



స్టూడియో
వాహినీ

నిర్మాత-దర్శకుడు
బి.యన్.రెడ్డి

త్వరలో వస్తున్నది

THE VAUHINI PICTURES LIMITED
MADRAS—VIJAYAWADA—GUNTAKAL

# నవంబరు 3 మొదలు

కృష్ణన్, మధురం
లలితా, పద్మిని...
నటించిన



ఎనెస్కే వారి

# పెళ్ళి కూతురు

అద్భుత తెలుగు చిత్రం

డైరెక్టర్: N.S. కృష్ణన్... చమ్రియా రిలీజ్

# రీటా హెయిర్ టానిక్

## తల వెంట్రుకలను పెంచును



రీటా కుదుళ్లకు బలమునిచ్చి, నిగనిగలాడు నిడుపాటి వెంట్రుకలను పెంచుటకు అద్భుతమైన హెయిర్ టానిక్.

తలవెంట్రుకలు రాలుట, నెరయుట, చుండ్రు, బట్టతల, పేను కొరుకు, ఇంకను తలవెంట్రుకలకు సంబంధించిన సమస్త వ్యాధులకు రీటా అమోఘముగ పనిచేయును. వేలకువేలువాడి గుణమును పొందియున్నారు. మీరుకూడ నేటినుండియే రీటా వాడుడు. రీటా హిందూదేశమంతటా దొరకును.

వెల సీసా 15 అణాలు.

**RITA**
**HAIR TONIC**




---

# మైసూరు పట్టు బట్టలు

## హెచ్చుకాలము మన్నిక కలవి

మునుపటికంటె ఇప్పుడు మైసూరు సిల్కు వస్త్రములే హెచ్చుగా స్త్రీలు ధరించుచున్నారు. మైసూరు సిల్కులలో శ్రేష్టమైన చీరెలు, గౌనుగుడ్డలు, రవికెగుడ్డలు మొదలైనవి స్త్రీలకు, పురుషులకుకూడా అవసరమగు సర్వ విధములగు దుస్తులును అధికముగా వాడబడుచున్నవి.

★

మైసూరు సిల్క్సు
100 కి నూరు వంతులు
స్వచ్ఛమైనవి, కల్తీలేని
పట్టువి.



## మైసూర్ సిల్క్స్

గవర్నమెంట్ సిల్కు వీవింగు ఫ్యాక్టరీ, మైసూరు.


దీపావళి శుభ సందేశం
శ్రీమతి.. కృష్ణవేణి
ప్రభాకర్‌రావు.....కోటేశ్వరరావు....మాణిక్యరావు.....కాంతయ్య......
విక్రం..... నటించిన,
శోభనాచల వారి,
సాహసం
డైరెక్షన్......మీర్జాపురం రాజావారు....
SARMA NS
DISTRIBUTERS FOR: ANDHRA, CEDED, NIZAMS & N. INDIA
CHAMRIA TALKIE DISTRIBUTORS.
VIJAYAWADA, GUNTAKAL, SECUNDERABAD

# నేడు మీరు మెక్లీన్స్‌తో పళ్లు తోముకున్నారా?



మీ ముఖమండలం ఆరోగ్యానంద పూరితమైన చిరునవ్వుతో వికసించడానికై మెక్లీన్స్ పెరాక్సైడ్ టూత్ పేస్టును వాడండి. మెక్లీన్స్ మీ చిగుళ్లను కాపాడి, శ్వాసను పరిమళభరితమొనర్చి, పళ్లను ముత్యాలవలె మెరిసేటట్లుచేస్తుంది — ఇది వీటినన్నిటినీ ఏక కాలంలో సమకూర్చుతుంది.

మెక్లీన్స్ పెరాక్సైడ్ టూత్ పేస్టు ఒక ప్రత్యేకమైన సూత్రాన్ని అనుసరించి తయారు చేయబడినది. ఇది మిక్కిలి పరిశుభ్రమైనదవి హామీ కలదు. అందుకే ప్రపంచమంతటా ప్రజలు రోజుకు రెండుసార్లు — నిత్యం మెక్లీన్స్‌ను ఉపయోగిస్తారు.

"కొన్ని సంవత్సరాలుగా
నేను మీ మెక్లీన్స్ టూత్
పేస్టును వాడుతున్నాను.
అప్పటినుండి నా దంత
శోభను ఎల్లరు మిక్కిలి
ప్రశంసిస్తున్నారు."

## నేడే మెక్లీన్స్‌ను కొనండి!




MTY-4 TEL.

వ్యాపార విచారణకు వీరికి వ్రాయండి : — జె. యల్. మోరిసన్, సన్ అండ్ జోన్స్ (ఇండియా) లిమిటెడ్., మహాలక్ష్మి ఆలయమునకు ఎదురుగా, వార్డెన్ రోడ్, బొంబాయి 26.

# ఆంధ్రమహిళ

సంపుటి 8 :: నవంబరు '51 :: సంచిక 7

ముఖచిత్రము : దీపావళి వెలుగులు




సంపాదకురాలు : శ్రీమతి దుర్గాబాయి, యం. యే., బి. యల్.

సహసంపాదకురాలు : శ్రీమతి చన్నఘంటమ్మ, యం. యే., యల్. టి.

ఆంధ్ర మహిళా సభ, మైలాపూర్

సంవత్సర చందా ఆరు రూపాయలు



సంపుటి 8 నవంబరు 1951 సంచిక 7

# ఎన్నికల మహాయజ్ఞం

అక్టోబరు ఆఖరు వారంలో హిమాచల ప్రదేశంలో ఆరంభమైన ఎన్నికలు సేతు పర్యంతం క్రమంగా వ్యాపించ బోతున్నవి. 17 కోట్లమంది ఓటర్లచే 3772 అభ్యర్థుల ఎన్నిక, ఏక కాలంలో జరుగ బోతూంది, ప్రజాస్వామ్య పథంలో సాగుతున్న మన భారత భువిలో. ఇందులో, 3283 గురు రాష్ట్ర శాసన సభలకూ, 489 మంది ప్రజా ప్రతినిధుల సభకూ అభ్యర్థులు.

ఏ దేశంలోనూ, ఏ కాలంలోనూ ఇతఃపూర్వము కని విని ఎఱుగని, మహా ప్రళయముం బోలు మహా ప్రయోగమైన దీనిని మహా యజ్ఞమని నిర్వచించుటలో ఆక్షేపణ యుండబోదు. వివిధ పార్టీల నాయకులు, వారి అనుయాయులు, యీ యజ్ఞ వాటికలలో పౌరోహిత్యానికి సిద్ధమౌతున్నారు. "మీ ఓటును మా పౌరోహిత్యంతో యజ్ఞగుండంలో ధారపోయండి. ధర్మార్థ కామమోక్షములను సత్వరమే సిద్ధింపజేసెడి, ఇష్టదేవతా ప్రత్యక్షం చేయిస్తామ" నే పురోహితుల నినాదాలు, హెచ్చరింపులతో దేశం నలుమూలలా మారు మ్రోగి పోతూఉంది.

అసలు ఓటంటే ఏమిటో, ఓటుద్వారా తమకు గలిగిన హక్కేమిటో, ఓటును సద్వినియోగం చేయడంలో తమకుగల బాధ్యత ఎంతో, ఓటును దుర్వినియోగం చేయడంలో తాము చే చేతులా కొని తెచ్చుకునే తద్దినమేమిటో, అర్థము చేసికోగల వివేకము నిచ్చే విద్యగల ప్రజలు యీ 17 కోట్లలో అతిస్వల్ప సంఖ్యాకులనుటలో అతిశయోక్తిలేదు. అందువల్ల యీ పురోహితులు పూరించే శంఖారావాలలో ఏవి కల్లలో, ఏవి కావో అనే విచక్షణ ప్రజా సామాన్యంలో కలిగించే బాధ్యత, విద్యావంతులపైననూ, వివేకవంతులపైననూ ఎంతైనా కలదు.

ఏ పక్షపు అభ్యర్థులైనా చేసే నినాదం ఒకటే—"ప్రజాక్షేమమే మా పరమాశయము—ప్రజారక్షణయే మా లక్ష్యం" అని నాల్గేళ్లు పరిపాలించి ప్రజల అసమ్మతికి పాల్పడ్డ కాంగ్రెసు పక్ష అభ్యర్థులు, అధికార రాజకీయాలలో ఇంతవరకు ఇరుకుకొన లేకపోయిన సోషలిష్టు అభ్యర్థులు, కాంగ్రెసు పక్షీయులుగా ఉండి, ఇతఃపూర్వము తమ అధికార వ్యామోహము తీరే అవకాశమును బడయలేక, కొన్ని కారణాలచే పదవీ భ్రష్టులు కూడా అయి, ఇంకముందు

ఎన్నికల మహాయజ్ఞం

కాంగ్రెసులో వుండి నెగ్గలేకపోయే భయంచేత, కాంగ్రెసును తూర్పారపడ్తూ, అనేక పార్టీ లేవ నెత్తుతున్న వివిధ ప్రజా పార్టీలవారూ, అతివాదులూ, మితవాదులూ, దురాక్రమ పరులైన కమ్యూనిష్టులూ—అందఱూ, తమ ప్రణాళికలలో తమ పార్టీ నెగ్గితే, ప్ర భ్యుదయము పిసలంటూ అరచేతిలో స్వర్గాన్ని అగపరచాలని అతి శ్రమ పడుతున్నారు.

ఈ గందరగోళములో పార్టీ రాచకీయాలనుండి దూరంగా ఉండి, ఏ అభ్యర్థియైన విజ్ఞాని, వివేకవంతుఁడు, దీక్ష, దక్షతగలవాడు, దేశాభ్యుదయం స్వార్థంకన్న మిన్నయని విశ్వసిం వాడు అని విశ్వాసముతో నైతేనే ఓటు చేయుట ప్రజా శ్రేయస్సునకు కారణము కాగలదు— నినాదాల ఒత్తిడికిలోనై, పక్ష రాచకీయాల్లో ఇరుకుకొని, ఏ అప్రయోజకుడు, మోసగాఁడ స్వార్థపరుడు అయిన వానికో ఓటు చేయుట తమ గొయ్యి తామే తవ్వుకొనునట్లగును. గాన, వివి ప్రదేశాలలోని వివేకవంతులు, విద్యావంతులు అయిన స్త్రీ పురుషులు, ఆ ఆ ప్రాంతాల అభ్యర్థులుగా నిలిచేవారిని గూర్చిన మంచిచెడ్డలను గ్రహించి, ప్రాంతీయ జన సామాన్యాని తెలియజేసే బాధ్యత పూనుకోవాలి. ఈ నాడు ఓటునందుకొని అందలము నెక్కి, రేపటినుం మననుండి వంగిసలాములు పెట్టించుకుంటూ, మన మీదే సవాలు చేస్తూ, మన శ్రేయస్సు అడుగుకునెట్టి, స్వార్థాన్ని పెంచుకోగల అభ్యర్థులని తోచిననాడు, ఏ పార్టీకి చెందినవాడైనా స ఓటుచేయక పోవటం మన ధర్మం. తమ భవిష్యత్తును నిర్మించుకోవలసిన పెద్ద బాధ్య యీ 17 కోట్ల ఓటర్లపైనా ఉన్నది. అప్రమత్తతో సంచరించనిచో, యింతమంది ఓటుచేసిన ప్రజ స్వామ్యం, గాడిద గంపెడుఊక తిన్నదన్న సామెతగా ఉంటుంది.



## కృతజ్ఞత

శ్రీ పబ్బిచెట్టి రాఘవులు చెట్టి చారిటీస్ ధర్మకర్తృత్వ సంఘంవారు పారిశ్రామిక శాఖ బీద విద్యార్థినుల భోజన నిధికని రూ 50/— విరాళముగా యీ సంవత్స రము కూడ ఇచ్చిరి. మూడు సంవత్సర ములనుండి యీ విరాళమును కృతజ్ఞతతో అందుకొనుచున్నాము.

శ్రీమతి వై. శేషగిరమ్మగారు, ఆంధ్ర మహిళా సభకు రూ. 100/- సభ్యత్వ రుసుము కట్టి, యావజ్జీవ సభ్యురాలైరి.

కరెస్పాండెంటు
పారిశ్రామిక విద్యాలయము.

## హిందీ పరీక్షా ఫలితములు

ఆగష్టులో జరిగిన హిందీ పరీక్షలలో వి యము నొందిన ఆంధ్ర మహిళా సభ విద్యా నుల పేర్లు దిగువను ప్రకటించుచున్నాము.

ప్రాథమిక్

ప్రథమ శ్రేణి — టి. కె. కమల
ద్వితీయ శ్రేణి — కె. నళినీకుమారి
" — కె. కమల

మధ్యమ

ద్వితీయ శ్రేణి — ఎస్. సరస్వతి
" — ఎస్. జయలక్ష్మి

# నూత్న వధూవరులు



చిరంజీవి సౌభాగ్యవతి లీల—చిరంజీవి మాధవరావుబాజీ

లీల శ్రీ బెన్నూరి నారాయణరావుగారి కుమార్తె; శ్రీమతి గుమ్మిడిదల దుర్గాబాయి, ఎమ్. పి. గారి మేనగోడలు.

ఆంధ్ర మహిళా సభకు అంకురమైన 'Little Ladies of Brindavan' లో ప్రథమ సభ్యురాలుగా, వ్యవస్థాపకత్వాన్ని సంపాదించుకుంది లీల. తనతోపాటు పెరుగుతూ వచ్చి మహిళా సభ అభివృద్ధికై, ప్రతి రంగంలోనూ, ముఖ్యంగా మహిళాసభ ఖ్యాతి గడించిన నృత్య ప్రదర్శనాలలో, పాల్గొని, ఇతోధిక సేవ జేసింది. సభ విద్యాలయంలోనే మెట్రిక్యులేషన్ ఇంటర్ మీడియట్ పరీక్షలకు చదివి కృతార్థురాలైంది. త్వరలోనే పట్టభద్రురాలు కాబోతూంది

విజయదశమి పర్వదినంనాడు లీలకు మాధవరావు బాజీతో వివాహమైంది. వీరి దాంపత లత, భగవంతుని అనుగ్రహముతో, సర్వాంగ సౌష్టవముగా, శోభాయమానంగా వర్ధిల్లి ఆద ప్రాయమై వెలుగొందాలని, ఆంధ్ర మహిళాసభ ఆశీర్వాద పూర్వక అభినందనాలను అర్పిస్తూ ఉం

# ప్రస్తుత పరిస్థితులు

❋ శ్రీమతి అచ్యుతుని గిరిజ ❋

## ఎలక్షను—విద్యార్థుల ఆదర్శం :

మొన్న నీమధ్య పెన్సిలిన్ కనిపెట్టిన శాస్త్రవేత్త సర్ అలెగ్జాండరు ఫ్లెమింగ్, లండనులోవున్న భారతీయ విద్యార్థులతో ప్రసంగించాడు. ఆ సందర్భంలో కృతార్థులు కావటానికి ఒక చిన్న చిట్కా చెప్తానన్నాడుట. ఏమాత్రో ఇంజక్షనో చెప్తాడనుకుని విద్యార్థులు చిత్తం చిత్తమంటు మరింత దగ్గరగా చేరారుట. అప్పుడాయన చిరునవ్వుతో ఇదుగో అబ్బాయిలూ చూశారూ, జాగ్రత్తగా వినండి. మీరు కష్టపడి కృషి చేయాలి. ఆ పైన అదృష్టం కూడ కలిసి రావాలి. అంతే—అన్నాడుట.

ఆయన అదృష్టంకూడ కలిసిరావాలి అని అన్నాడు. కాని కృషిచేస్తే కలిసిరాదా అని అఖిలభారత విద్యార్థి సమితివారి వుద్దేశం. అక్టోబరులో మద్రాసులో అ. భా. వి. సమ్మేళనం జరిగింది. 11 రాష్ట్రాలనుంచి విద్యార్థి ప్రతినిధులు వచ్చారు, అయిదు రోజుల కార్యక్రమం. ఎన్నో చర్చోపచర్చలు జరిపి కొన్ని తీర్మానాలు పథకాలు తయారు చేశారు. బడి జీతాల తగ్గింపు, వుచితవిద్య, అందరిని పరీక్షలకు పంపించటం మొదలయిన కోరికలు వెలిబుచ్చారు. జరగబోయే ఎలక్షన్లు వారిచర్చలో ఒక ముఖ్యాంశం. "ప్రస్తుతం మనదేశం ఆర్థికంగా, సాంఘికంగా, వెనకబడి వున్నది. విద్యార్థుల పరిస్థితులు బాగా లేవు. ఈ పరిస్థితులను మార్చి దేశాభ్యుదయానికి తోడ్పడగల అభ్యర్థులను రేపటి ఎన్నికలలో ఎన్నుకోవలసి వున్నది. ఏ రాజకీయ పార్టీగాని వర్గంగాని వుత్తమమైన దనే వుద్దేశం లేదు. అభ్యర్థి ఏ పార్టీకి చెందినా మేలు అనే మాట ఒకటే. మాకు దేశానికి యీ యీ విషయాలు కావాలి. అవి నెరవేర్చగల సమర్థులకే మా సహకారం, వోటు లభించుతయ్. ప్రతి విద్యార్థి తన ప్రదేశపు పరిస్థితులకు విషయాలకు అనుగుణ్యంగా ఆలోచించి వోటు చేయాలి గాని ముఖ్య సూత్రమంటు వుండదు. వీటన్నింటికి అనుగుణ్యంగా ఎలక్షన్లు ప్రశాంతంగా, న్యాయంగా, నిష్పాక్షికంగా జరిపించాలి." ఎలక్షన్లను గురించి అ. భా. వి. స. వారి అభిమతంయిది.

ఇదే అభిమతాన్ని భారత మహిళలు వరవడిగా పెట్టుకుని ఉపక్రమించితే చాలా లాభం వుంటుంది. ముందు తమకు ఏమి కావాలో చక్కగా ఆలోచించుకుని, అవన్నీ ఒక ప్రణాళికగా కూర్చాలి. నిర్మొగమాటంగా అభ్యర్థులతో మాకు యివి కావాలని తెలియ చెప్పాలి. ఆ విషయాలు అర్థం చేసుకోగల సామర్థ్యం గలవాళ్లని, అవసరం వచ్చినప్పుడు విషయాలను పైవాళ్లకు విప్పి చెప్పటానికి నోట్లో నాలిక వున్నవాళ్లను, అభ్యుదయ మార్గాలను ఆలోచించటానికి తగిన సరుకువున్న విద్యావంతులను, వ్యక్తిగతంగా చూసి, విమర్శించి వోటు యివ్వాలని ప్రయత్నిస్తేనే మనకు మోక్షం. కేవలం పార్టీ టిక్కెట్టుతో నిలబడిన అప్రయోజకులకో, స్వార్థపరులని తెలిసిన వారికో, రాజకీయ కారణాల వల్లగాని యితర వొత్తిడి వల్లగాని వోటు నివ్వరాదు. అప్పుడే వయోజన వోటింగు ప్రయోజనకారి అవుతుంది. అందుచేత మహిళలంతా మనదే ముందిలెమ్మని అనుకోక, తగిన జాగ్రత్త తీసుకుని వివేచనా శక్తిని వినియోగించి తీరాలని ఒక తీర్మానం ముందు చేసుకుంటే మంచిది. అప్పుడు ఫ్లెమింగ్ మహాశయుడు చెప్పినట్లు మన కృషికి అదృష్టం తోడై కృతకృత్యులం కాగలం.

## గుజరాతు—మేఘనాధుడు

గాంధీ మహాత్ముడి జన్మవల్ల గుజరాతుకువచ్చిన గొప్పను సర్దారు పటేలు పదవికి వచ్చి స్థిరంచేశాడు. ప్రభుత్వంవారు గుజరాతుమీద మిడతలసైనా వాలనీయరు. చివరకు అర్జునుడు ఒక్క బాణంవేసి తాతగారికి దాహం తెప్పించి యిచ్చినట్లుగా రాష్ట్ర ప్రభుత్వంవారు, విమానాల్లోవెళ్లి మేఘాలను వెంటాడి పట్టి వాన కురిపించి, అర్జునుడేకాక మేఘనాధుడు కూడ అవుతున్నారు. వీళ్లనుచూసి దేవేంద్రుడలుకతోడను వావిరిగా రాళ్లవాన వడిగురియింప వచ్చాడనుకోండి. వాళ్లకేం భయం. విమానాల్లో పయికివెళ్లి రబ్బరు గొడ్డుగొడుగులు విప్పి పట్టుకుంటారు. ఇంక జరిగే తంతు అంతా ఆఘ మేఘాలమీద అంతరిక్ష మార్గానే. ప్రస్తుతం మేఘాలమీద మందులు మాకులు చల్లి మేఘాలు కరిగి

## ప్రస్తుత పరిస్థితులు

వాన కురిసేటట్లు చేస్తూన్నా రనుకోండి. ఇంక నాలుగు రోజులు పోతే యింకా వుపాయాలు సాధనాలు తప్పక హెచ్చుతయ్. అప్పుడు రాత్రింతల వాన కురిపిస్తారు. తెల్లవారి కాఫీలకు పాలవాళ్లు బయలుదేరే వేళకు వాన ఆపు చేస్తారు. ఇంకా నాలుగు రోజులు గడచిన వనుకోండి. అప్పుడు రేడియోతో వింటున్నట్టే ఒక్కొక్క రైతు ఒక వానయంత్రం పెట్టుకుంటాడు. తనకు ఎప్పుడు కావాలో అప్పుడు, ఎంత కావాలో అంత వాన తన పొలంమీద మాత్రం కురిపించు కుంటాడు. ఇవన్నీ వుత్తవూహాలని భ్రమ పడకండి. ప్రజాహితం కోసం సత్సంకల్పంతో ఆరంభించిన సత్కార్యం వృద్ధికి ఎందుకురాదు?

అయితే మనకు మాత్రం యీ అవకాశాలు వుండక పోతయ్యా అని ఆశపడతారేమో. అటువంటి వెర్రిమొర్రి ఆశలు మాత్రం పెట్టుకోకండి. ఆ మాటకొస్తే బొంబాయి రాష్ట్రంలో వచ్చిన యే సంస్కరణలు మనకు వచ్చినవి గనక? మద్రాసు ప్రాంతీయులు మేధా సంపన్నులని పేరు గడించారు. పనికి ఆలోచనకు పొత్తు కుదురదు. ఒకపని చేశామంటే ఆ ఆలోచన అంతటితో అయిపోతుంది. ఊరు కున్నా మనుకోండి. ఆలోచనలు శాఖోపశాఖలుగా వామ నావతారమల్లే వ్యాపించుతయ్. ఆ బిస కనిపెట్టే మనవాళ్లు రామపాద సాగరాలంటి వాట్ల నెన్నింటినో పదిలంగా బుర్రల్లోనే దాచారు. రాయల సీమలాంటి ప్రదేశాల్లో యే బుద్ధిన వుండో మన రాష్ట్ర ప్రభుత్వంవారు వాన కురిపించాలని అనుకో బోతున్నాం అని అంటా రనుకోండి. వెంటనే కొంతమంది నాయకులు—తెలుగు జిల్లాలమీద ఎగిరివచ్చిన మేఘాలను మాగడ్డమీద వాన కురిపించి వాళ్లదే పైచెయ్యి అని చూపించ వూనుకున్నారా—అని నిలవ తీస్తారు. ఇంక మద్రాసుమీద కురిసే మేఘాలు ఎవరివిగా వుండాలో ఎట్లా తేల్చటం? కృష్ణాపెన్నారు తీర్థాలలో, మద్రాసు వీధుల్లో వ్యాపించివున్న రాష్ట్రయుద్ధం మేఘాల దాకా నడుస్తుంది. ఇంకవచ్చే మేఘసందేశాలకు, మెయిలు రాయబారలకు అంతు వుండదు. ఏ గాలికి ఏ మేఘం యెటువచ్చి తగులు తుందో మన కెందుకొచ్చిన రభస అని ప్రభుత్వంవారు అసలే వూనుకోరు. అయినా మనకున్న రాజకీయ రద్దిలో యిటువంటి పనులకు తీరిక ఎక్కడ వుంటుంది.





# రాజకీయాలు

* శ్రీ గోళ్లమూడి రామచంద్రరావు *

అక్టోబర్ నెలలో బ్రిటిష్ గొప్పదనానికి ఆఖరుదశ ప్రారంభమయినట్లు చెప్పవచ్చు. ఈ నెలలోనే పర్షియా నూనె గని ప్రాంతాలనుంచి బ్రిటిష్ సిబ్బందికి ఉద్వాసన జరగటం, తన ఒప్పందపు షరతులను మార్చాలని ఇరాక్ కోరటం, సూయజ్ ప్రాంతంలో ఉన్న బ్రిటిష్ సేనలను ఉపసంహరించుకుని సుడాన్‌ని తనకు అప్పజెప్పి పొమ్మని ఈజిప్టు స్పష్టపరచటం, మొదలైన చిక్కులన్నీ బ్రిటన్‌కు సంక్రమించినవి. అయితే వీటన్నిటికన్నా పెద్దదెబ్బ, సాంఘిక వ్యవహారాల్లో బ్రిటన్ సాధించిన అభివృద్ధిని తుడిచిపెట్టే ప్రమాదం, ఈ నెల 25వ తేదీన జరిగిన ఎన్నికల్లో కన్సర్వేటివ్ పార్టీ గెలుపువల్ల ఏర్పడ్డది.

క్రిందటి నెలలో సూచించినట్లుగా ఎన్నికల్లో కన్సర్వేటివ్ పార్టీ గెలిచింది. కామన్స్ సభలోని 625 స్థానాల్లో ఫలితాలు 624 స్థానాలకు తెలిసినవి. కన్సర్వేటివులకు 321, లేబర్ పార్టీకి 294, లిబరల్ పార్టీకి 6, ఇతర పార్టీలకు 3 స్థానాలు వచ్చినవి. కన్సర్వేటివ్ నాయకుడు చర్చిల్ ప్రధాన మంత్రిగానూ, ఈడెన్ విదేశాంగ మంత్రిగానూ మంత్రివర్గం ఏర్పడ్డది.

కన్సర్వేటివ్‌లకు ఇప్పుడు ఉన్న మెజారిటీ అట్టే పెద్దది కాకపోయినప్పటికీ, లేబర్ ప్రభుత్వం రద్దుచేసిన విశ్వవిద్యాలయ నియోజక వర్గాలను మళ్లీ ఏర్పాటుచేసి, మొదటినుంచీ కన్సర్వేటివ్‌ల స్థావరాలుగా ఉన్న ఆ స్థానాలలో మెజారిటీని పెంచుకోవచ్చు. అంతేకాక లేబర్ ప్రభుత్వం కన్సర్వేటివులు ఎక్కువగా ఉన్న లార్డ్స్ సభ అధికారాలను కొన్నింటిని తగ్గించి వేసింది. కన్సర్వేటివులు ఇప్పుడు మళ్లీ ఆ అధికారాలను ఇచ్చి తమ స్థానాన్ని బలపరచుకొనటానికి కూడా ప్రయత్నించవచ్చు. లిబరల్ పార్టీ మంత్రివర్గంలో జేరటానికి నిరాకరించినా, కన్సర్వేటివ్‌లతో సహకరించటానికే సిద్ధంగా ఉన్నారు.

ఈ అంశాలు అట్లావుండగా, ఆస్ట్రేలియా, న్యూజీలాండ్‌లలోని కన్సర్వేటివ్ ప్రభుత్వాలూ, దక్షిణాఫ్రికాలోని మలాన్ ప్రభుత్వమూ, అమెరికా ప్రభుత్వమూ బ్రిటిష్ కన్సర్వేటివులను పూర్తిగా బలపరుస్తవని నిస్సందేహంగా చెప్పవచ్చును. అదీకాక, మధ్య ప్రాచ్యదేశాల్లో కలిగి జాతీయ చైతన్యానికి ఫలితంగా అక్కడ బ్రిటనుకు కలిగి చిక్కులను కన్సర్వేటివ్ ప్రభుత్వం పరిష్కరిస్తుందన్న ఆశ బ్రిటిష్ ప్రజలకు ఉన్నది.

ఈ కారణాలనుపట్టి, కన్సర్వేటివ్ ప్రభుత్వం లేబర్ ప్రభుత్వ విధానాలకు సున్నా చుట్టటంలో తటపటాయిస్తుందని కొంతమంది ఆశపడటం నిష్ప్రయోజనమేమోనని తోస్తున్నది.

లేబర్ ప్రభుత్వం తన విధానాలను ధైర్యంగా అనుసరించలేకపోవటంవల్లనే ఓడినట్లు అన్ని దేశాల అభ్యుదయ వర్గాలూ భావిస్తున్నారు. కన్సర్వేటివ్ ప్రభుత్వం ప్రపంచంలో యుద్ధాలకు కూడా దారితీయవచ్చునని ఇండోనీషియా, ఈజిప్టు మొదలైన దేశాలు భయపడుతున్నవి. ఆ ప్రభుత్వం ఇండియా పట్ల ప్రతికూలంగా ఉంటుందనీ, కాశ్మీర్ వ్యవహారంలో పాకీస్థానుకు ఇంకా ఊతం ఇస్తుందనీ, ఇంకనుంచీ కామన్వెల్తులో ఇండియా సభ్యురాలుగా ఉండలేదనీ, ఇండియా వర్గాలు చెప్పుతున్నారు. ఏది ఎట్లా ఉన్నా, కన్సర్వేటివులు అమెరికా మాటలువిని తమ వ్యాపారాన్ని పోగొట్టుకోరు. చైనా, తూర్పు యూరప్ దేశాలతో వ్యాపారాన్ని వృద్ధి చేసుకునే ఉద్దే

శంతో రష్యాను కొంచం మంచిచేసుకొనటానికి కూడా ప్రయత్నిస్తారు.

* * *

1936 సం॥ వరకూ ఈజిప్టు, సుడాన్‌లు దాదాపు బ్రిటిష్ వలసలుగానే ఉండేవి. అప్పుడు సూయజ్ ప్రాంతంలో బ్రిటిష్ సేనలు ఉండే షరతుమీద ఈజిప్టు స్వాతంత్ర్యాన్ని పొందింది. 1899 నుంచీ సుడాన్ ఈజిప్టు, బ్రిటన్‌లు రెండింటికీ సమిష్టి డొమినియన్‌గా చేయబడ్డది. కాని నిజానికి అధికారమంతా బ్రిటన్ చేతుల్లోనే ఉన్నది. బ్రిటిష్ సేనలు నిలవటానికి అవకాశం ఇస్తున్న 1936 ఒప్పందాన్నీ, సుడాన్‌పై బ్రిటిష్ అధికారాన్ని అంగీకరిస్తున్న 1899 ఒప్పందాన్నీ ఈజిప్టు పార్లమెంటు అక్టోబర్ 15 న రద్దు చేసింది. ఈజిప్టురాజు ఫరూక్‌ను సుడాన్ రాజుగా ప్రకటించింది.

అయితే ఈ ప్రకటనలను బ్రిటన్ అంగీకరించలేదు. ఉభయపక్షాల సమ్మతి లేనిదే ఒప్పందాలను రద్దు చేయరాదని బ్రిటన్ వాదిస్తున్నది. అయితే ఒప్పందాలను సవరించాలని ఈజిప్టు గడచిన నాలుగేళ్లనుంచీ కోరుతున్నా బ్రిటన్ దానిని సానుకూలం చేయలేదు. ఈజిప్టు ప్రజలు బ్రిటన్‌పట్ల అతి తీవ్రనిరసనను ప్రకటిస్తున్నారు. బ్రిటిష్ సేనలు, నౌకలు సూయజ్ ప్రాంతానికి చేర్చబడుతున్నవి. ఉభయ సేనలకూ కొన్ని సంఘర్షణలు కూడా జరిగినవి. ఈజిప్టు ప్రభుత్వం బ్రిటన్‌లో సహాయ నిరాకరణం చేస్తున్నది. ఏ క్షణాన్నయినా భగ్గుమనేట్లుగా ఉన్న ఈ పరిస్థితుల్లో, బ్రిటన్ కరుగ్గా వ్యవహరించ వలసిందేనని పట్టుపట్టే కన్సర్వేటివ్‌లు అధికారంలోకి రావటం మరింత ప్రమాదం తెచ్చిపెట్టింది.

సుడాన్ ప్రజల 'అభిప్రాయం' కనుక్కొనందే దానిని విడిచిపెట్టేది లేదని బ్రిటన్ చెపుతున్నది. ఇండియా, పాకిస్థాన్ విభజన సందర్భంలో, తమ ప్రాంతం స్వతంత్రం కావాలని కోరిన పఠానుల అభిప్రాయాన్ని బ్రిటన్ ఏ విధంగా 'నిర్ణయించిందో' అందరికీ తెలుసు.

పర్షియానుంచి ఈ నెల మొదట్లో బ్రిటిష్ సిబ్బంది అంతా ఇంటికి వెళ్లిపోయింది. అంతర్జాతీయ న్యాయస్థానం పర్షియానూనె జాతీయ కరణం వ్యవహారంలో ఇచ్చిన 'ఇంజన్‌క్షన్' ఉత్తరువును పర్షియా నిరాకరించినందుకు దానిని మందలించాలనీ, తిరిగీ తనతో సంప్రదింపులు జరపవలసిందిగా పర్షియాకు ఆజ్ఞాపించాలనీ బ్రిటన్ భద్రతా మండలిని కోరింది. కాని ఆ కోరికను ఇండియా మొదలైన దేశాలు సమర్థించనందువల్ల నెగ్గే అవకాశం కనిపించలేదు. నూనె వ్యవహారం తన సొంత విషయం కనక అందులో భద్రతామండలి జోక్యాన్ని సహించేదిలేదని పర్షియా నాయకులు స్పష్టపరిచారు.

పర్షియా అడుగు జాడల్లో ఇరాక్ (ఇక్కడి నూనె గనులు కూడా బ్రిటన్ చేతిలోనే ఉన్నవి) కూడా నడుస్తూ, బ్రిటన్‌కు నూనె హక్కులు, సేనలు నిలిపే హక్కులు ఇచ్చిన పాత ఒప్పందాలను సవరించ వలసిందని కోరింది

* * *

మధ్య ప్రాచ్యదేశాలన్నిటిలోనూ జాతీయ చైతన్యం విజృంభిస్తున్నది. తమ దేశాలను దోచుకుంటూ, తమ గొంతులమీద కూర్చుని పీడిస్తున్న బ్రిటన్, ఫ్రాన్స్, అమెరికా మొదలైన పశ్చిమ రాజ్యాలమీద ప్రజలకు ద్వేషం పెరిగిపోతున్నది. అందువల్ల వెనుక పశ్చిమ రాజ్యాలతో ఒప్పందాలు చేసుకున్న నాయకులే ఇప్పుడు ప్రజాభిప్రాయానికి భయపడి, పశ్చిమ రాజ్యాలను ప్రతిఘటిస్తున్నారు. తమ గొంతులమీద కూర్చున్న పశ్చిమ రాజ్యాలు పరదేశాల స్వేచ్ఛను రక్షిస్తవని అరబ్ ప్రజలు నమ్మలేక పోతున్నారు. అందువల్లనే పశ్చిమ రాజ్యాలు మధ్య ప్రాచ్య 'రక్షణ' కని సూచించిన ప్రతి పాదనలను అరబ్ దేశాలన్నీ తోసివేసినవి. అరబ్ దేశాల పరిపాలకులకు ఇష్టం లేకపోయినా, పశ్చిమ రాజ్యాలపట్ల ప్రజల్లో కలిగిన తీవ్రక్రోధంవల్ల ఆ దేశాలు సోవియట్ రష్యాకు మరింత దగ్గరగా వెడుతున్నవి.

ఈజిప్టు మొదలైన వ్యవహారాల్లో పశ్చిమ రాజ్యాలు సక్రమ పరిష్కారానికి అంగీకరించక పోతే, అరబ్

రాజ్యాలన్నీ కలిసి బ్రిటన్, (ఈజిప్టు, సుడాన్, ఇరాక్‌ల శత్రువు), ఫ్రాన్స్ (మొరాకో, ఆల్జీరియా, ఉత్తరాఫ్రికా అరబ్బుల శత్రువు), అమెరికా (అరబ్ రాజ్యాలన్నిటికీ శత్రువయిన ఇజ్రేలుకు మద్దతుదారు) లమీద, నవంబర్‌లో జరిగే సమితి సమావేశంలో తీవ్రచర్యలు తీసుకో బోతున్నట్లు తెలుస్తున్నది.

*    *    *

పాకిస్థాన్ ప్రధానమంత్రి లియాకత్ అలీఖాన్ 16వ తేదీ సాయంత్రం రావల్పిండిలో ఉపన్యసిస్తుండగా, ఒక సరిహద్దు ప్రాంతవ్యక్తి తుపాకితో కాల్చి హత్యచేశాడు. హంతకుడు స్వతంత్ర పఠానిస్థాన్ వాది అని కొందరూ, కాశ్మీరులో తీవ్రవైఖరి అవలంబించినందుకు లియాకత్ పట్ల అసంతృప్తిపడ్డ ఖాక్సార్ వర్గంవాడని కొందరూ అంటు న్నారు. ఇదివరకు ఖాక్సార్ వర్గపు వ్యక్తే ఒకడు జిన్నాను బొంబాయిలో హత్యచేయ ప్రయత్నించాడు. పాక్ ప్రభుత్వాన్ని కూలదోయటానికి కుట్రచేశారని కొందరు ముఖ్యమైన సైనికాధికారులను కొన్ని నెలల కిందటే అరెస్టుచేసి ఉన్నది.

లియాకత్ తరువాత, గవర్నర్ జనరలుగా ఉన్న నజీముద్దీన్ ప్రధాని అయినారు. కాని ఆయనవైఖరి చూస్తే ఇండియా పట్ల మిత్రవైఖరి ఎక్కువగా కనిపించటంలేదు. కాశ్మీర్ వ్యవహారంలో లియాకత్ అలీ సూచించిన 'పిడికిలి, పోటు విధానాన్నే ఈయన ఇంకా ఘాటుగా అనుసరించ వచ్చునని తెలుస్తున్నది. కాశ్మీర్ సమస్యమీద మధ్యవర్తి గ్రాహం భద్రతా మండలికి ఈ నెల 15న 2వ నివేదికను సమర్పిస్తూ, ఉభయ దేశాలమధ్య యుద్ధప్రచారం మొదలైనవి నిలిచిపోవాలనీ, మళ్లీ అంగీకారం కుదుర్చుకునే ప్రయత్నాలు చేయాలనీ సూచించారు. కాశ్మీర్ ప్రధాని అబ్దుల్లా మాంచెస్టర్ గార్డియన్ విలేఖరితో మాట్లాడుతూ అజాద్ కాశ్మీర్ నాయకునితో సమాధాన పడగలనని సూచించారు.

ఇటీవల—ఈ నెలలో రెండోసారి—రష్యాలో అటం బాంబు పేలినట్లు అమెరికా ప్రకటించింది. తాము అటం బాంబులను పరీక్షిస్తున్నమాట నిజమేననీ, అయితే అది కేవలం ఆత్మరక్షణకేననీ స్టాలిన్ ప్రకటించారు. అటం బాంబు రహస్యం అమెరికా, రష్యాలకే కాదు మాకుకూడా తెలుసునని పెకింగ్ రేడియో కూడా ప్రకటించింది.

వీటిఫలితమో, మరేకారణమోకాని, కొరియాలో మళ్లీ యుద్ధవిరమణ సంప్రదింపులను ప్రారంభించటానికి అమె రికా ఒప్పుకున్నది.

*    *    *

కాంగ్రెస్ ఎన్నికల సన్నాహాలు ఒక పక్కన జోరుగా జరుగుతున్నవికాని మరొక పక్కన అన్ని రాష్ట్రాల్లోనూ కాంగ్రెసులో తీవ్ర అభిప్రాయ భేదాలు ఏర్పడ్డవి. పంజాబ్, ఉత్తరప్రదేశ్, బీహార్, మద్రాస్‌నగరం, మధ్యభారత్ మొదలైనచోట్ల అవి చాలాతీవ్రంగా ఉన్నవి. కాంగ్రెస్ మాజీ అధ్యక్షుడు టాండన్‌గారు ఉత్తరప్రదేశ్ కాంగ్రెస్ పార్లమెంటరీ బోర్డునుంచి తప్పుకోవలసి వచ్చింది. హిందూ మహాసభకు సన్నిహిత మయిన సంస్థలన్నీ కలిసి అఖిలభారత జనసంఘమనే పార్టీగా ఏర్పాటయినవి. ఇన్నాళ్లనుంచీ కాంగ్రెసులో ఉన్న జాతీయ సిక్కులు, కాంగ్రెసుపట్ల అసంతృప్తిపడి అకాలీలతో కలిసిపోవటానికి నిశ్చయించు కున్నారు. తమిళనాడు జాతీయ ట్రేడ్ యూనియన్ కాంగ్రెస్ కాంగ్రెసును ప్రతిఘటించటానికి నిశ్చయించుకున్నది.

*    *    *

ఆంధ్ర రాష్ట్రంమీద, నవంబర్‌లో సత్యాగ్రహం చేస్తామని స్వామి సీతారాం పరివారం చెపుతున్నారు. ఆయన వ్యక్తిగతంగా చేసే కృషిని కోస్తాప్రాంతాల్లో కాకుండా, అది నిజంగా అవసరమయిన రాయలసీమ, చెంగల్పట్, మద్రాసు ప్రాంతాల్లో జరిపితే చాలా మేలుగా ఉంటుందని అనిపిస్తున్నది.





# పృథ్వీరాజు

*  *  *

నాటిక

*  *  *

* శ్రీ బులుసు సీతారామశాస్త్రి *

[చారిత్రికాంశములలో కొలది మార్పులతో రచింపబడినది. వృథా విద్వేషములతో అంతఃకలహములకు లోనయిన వారి గతి నిరూపించెడి దలపే యీ రచనలకు కారణము—

రచయిత]

## మొదటి రంగము

(స్థానము: ఢిల్లీ. రాజభవనములో, పృథ్వీరాజు మందిరములో, సముచిత స్థానాలలో పృథ్వీరాజు, రాణీ సంయుక్త కూరుచుండి యుందురు.)

పృథ్వీరాజు : ప్రియతమా! నీ నిష్కళంకమైన అనురాగమునకు, మీదుమిక్కిలి మహారాజ మండలిని తండ్రిని ధిక్కరించి నిర్భీకముగా పయనించిన నీ సాహసమునకు నే నానంద పరవశుడ నగుచున్నాను. మఱియు నిన్నెటు లభినందింప వలయునో తెలియకున్నాను.

సంయుక్త : ప్రియా! మానవ జన్మమెత్తి యుక్తాయుక్త పరిజ్ఞానముకల ఏ సామాన్యవ్యక్తియైన చేయగల, చేయదగు కృత్యము మాత్రమే నే చేసినది. దీని కభినందన మవసరమని నే భావింపజాలను.

పృథ్వీ : కాని ఒక్క విషయము మాత్రము నాకు బాధాకరముగా తోచుచున్నది. జన్మించినదాది నానా కష్టములుపడి పెంచి పెద్దచేసిన తండ్రి కవమానము కలిగించుటంత యుక్తము కాదేమో అని.

సం : జనకుని కరుణవలననే వివేకము గాంచితిని. వివేకమునకు దగినట్లుగా మహావీరుని దేశరక్షణ దీక్షాబద్ధకంకణుని వరించి, యుక్తమే ఆచరించితిని. ఇది తండ్రి కవమాన కరమెట్లు కాదగును?

పృథ్వీ : తాను పరమ శత్రువుగాను నీచాతి నీచుడుగాను భావించి స్వయంవరమునకు మర్యాదకైనను ఆహ్వానము పంపకపోవుటేకాక ప్రతిమా రూపమున ద్వారదేశమున నిల్పిన వానిని వరించుట అవమాన కరముగాక మఱేమి?

సం : అది నా నేరము కాజాలదు. దేవతా విగ్రహమును రత్నసింహాసనమునుండి తొలగించి పెంటకుప్పపై నుంచిన అజ్ఞానమునకు నా కృత్య మవమానకరముగా తోచిన నేనేమి చేయగలను?

పృథ్వీ : కేవలము అవమానకరమే కాదు. నీ చర్య జనకుని మహాయుద్ధమున దగులుకొనజేసి భారతదేశ స్వాతంత్ర్య సంరక్షణ కంతరాయముగా పరిణమింప జేయగలదని నీ వూహింపలేదని నే తలపోయజాల.

సం : మీ వాక్కుల యర్థము గ్రహించితిని. నా తండ్రి తన కృత్యమునకు సిగ్గిలక మీపై యుద్ధ సన్నాహ మొనర్చుచున్నట్లు తెలియని దానను కాను. మీరు నా తండ్రిపై యుద్ధముచేసి నన్ను విషాదమునకు గుఱి చేయవలసి వచ్చునని సంశయించిన నన్నవమానించినట్లే యగును.

పృథ్వీ : నీ జనకుడు నాపై యుద్ధమొనర్చి జయించినను మన అనురాగానందముల విచ్ఛిన్నము చేయలేదు. నాపైగల ద్వేషముచే పరదేశీయులైన తురుష్కుల సాయము కోరి సంధి రాయబారములు వారితో జరుపుట భారత జాతికి ఉపద్రవకరమని నా మనమెంతయో బాధ నొందుచున్నది.

సం : కానున్నది కాక మానదు. వీరులై జన్మించిన వారు తుది శ్వాస విడుచువరకు స్వాతంత్ర్య రక్షణకై సర్వమొడ్డి పోరాడుటే కర్తవ్యము. జయాపజయములు దైవాధీనములు.

పృథ్వీ : జయచంద్రున కిట్టి విద్వేషమునకు మన యనురాగమే, నీ స్వయంవర విధానమే కారణమైనచో దానికి ప్రతి క్రియ సలిపి దేశరక్షణకు హానిలేకుండ చేయుట కుపాయాంతరమేమియు లేదా?

సం : మహావీరా! నా మనస్సును మీకు నచ్చునట్లు పరీక్షించు కొనవచ్చును. నేను సమస్త పరీక్షలకు సంసిద్ధురాలనని నేను జరిపిన ప్రతిచర్య ప్రత్యక్ష సాక్ష్యమిచ్చుచుండ వేరే శంకయేల?

పృథ్వీ : నీ నిర్మల ప్రణయమును శంకించి నన్ను నేనే అవమాన పఱచు కొనజాల; కాని, దేశము విపద్గ్రస్తము కాకుండు నుపాయమేదైన కలదేమోయని మాత్రమే ఆత్రము నొందుచున్నాను.

సం : మహారాజా. నేను మిమ్ము వరింపక ఇంట పడియున్నంత దేశరక్షణ సుగమమగునేని సర్వస్వము త్యజించియైన అందుకు అంగీకరింప గలను కాని ఈ స్వయంవరముతో నిమిత్త మేమియులేదు. నా జనకుడెట్లైన తురుష్క సాహాయ్యముతో ఢిల్లీపై దండెత్త మంతనములు సలుపుట మున్నే యెఱుగుదును. నేను దేశ స్వాతంత్ర్యమునే యెక్కువ ప్రేమించితినో నా మనోనాయకునే అధికముగా ప్రేమించుచుంటినో? బహుశః రెండు విషయములకు భేదము లేదనుకొందును. నీ సాహచర్యముతో దేశరక్షణకు కలుగబోవు సర్వోపద్రవముల నెదుర్కొన దలచియే యిటకేతెంచినది.

పృథ్వీ : సెహబాస్! కన్నతండ్రికంటె, మనసార వలచిన ప్రియునికంటే, దేశ స్వాతంత్ర్యము నధికముగా కాంక్షించిన నీ హృదయౌన్నత్యమునకు జోహారులు. జయచంద్రుడు ఢిల్లీపై దండయాత్ర గావించుటకు తురుష్క సాహాయ్యము వాంఛించు చున్నట్లు, కొలది దినములలో ఆతడు దండెత్తి రాగలడని చారులవలన తెలియుచున్నది. ఆతడు ఢిల్లీ పొలిమేరలలో చేరకముందే యెదుర్కొని అవసరమైనచో తురుష్కులతోసహా తరిమి కొట్టవలసిన దిన మాసన్నమైనది. వీరఖడ్గ మందిచ్చి సమర రంగమునకు నీ ప్రియుని పంపు సుదినమునకై వేచియుండుము.

సం : మీ వాక్యములు నాకు చాల నిరుత్సాహ కరముగా నున్నవి. సమరాంగణమున పార్శ్వవర్తినై శత్రుసంహార కార్యమున పాల్గొన నాకు నా ప్రియుడనుమతి నిరాకరింప జాలడని నమ్ముచుంటిని.

పృథ్వీ : నీ యుత్సాహమునకు ప్రియుడు భంగము కల్గింప జాలడు. కాని తుదిపర్యాయము జయచంద్రుని సన్నిధి కేగి, భారతవీరుల అంతఃకలహమువలన దేశమునకు కలుగబోవు మహోపద్రవము గూర్చి వివరించి, ముష్కరులగు తురకల నీ దేశమున అడుగుపెట్ట నీయరాదని బోధించిరాగల దూతను పంపి యాతడు వినకున్న కాగల కార్యమునకు సిద్ధపడుట మంచిది. జాతి వినాశమునకు బాధ్యత మనది అను నిందకు భవిష్యత్తులో తావుండరాదు.

సం : యుక్తముగా నున్నది. ఆదౌత్యము నిర్వహించుటలో నీ ప్రియయే యర్హురాలు. కాన అనుమతి వేడెదను. సంధి జరుగుట అసంభవమని నా యూహ.' ఐనను ఏ షరతులపై మాటలాడ దగునో దేవరవారానతీయ వలయును.

పృథ్వీ : పవిత్ర భారతావని ఘోర తురుష్క పాదఘట్టన నొందకుండుట కేవరతులకైన నంగీకరింప గలను. చివరకు తానే ఢిల్లీ సింహాసన మారోహించి తురుష్కుల నెదిరించినను సహకార భావముతో ఆయన ననుసరింప గలను. కాని నీ దౌత్యమువలన ప్రయోజన

ముండెదనండుటే కాక దురహంకార పూరితుడగు జయచంద్రునివలన నీ కవమానము ప్రాప్తమగునేమో!

సం: అయినను మంచిదే. దేశసేవా పరాయణత్వమున నుండు వారి కవమానము లొక లెక్కకాదు. కార్యము నెరవేరుచో నట్టి వేయి యవమానములైన పొందవచ్చును.

పృథ్వీ: సరే, జయచంద్రుని తోడి యుద్ధము నీ మనమునకు విషాదకరమని ఇంత కాలమునుండియు నీ సమ్ముఖమున ప్రస్తావించి యుండలేదు. నేడు నా శంకలన్నియు నిరాధారములని తేలినవి. రాయబారు లెవరాయను విషయము ఒకటి రెండు దినములలో నిర్ధారణ చేయుదము. విశేషాలోచనా పరిశ్రాంతవైనట్లు తోచెడివి. ఈ సేవకుని పరిచర్య యేమైన తచ్ఛాంతి నొనర్ప గలదేమో!

సం: ఈ ప్రణయనిధిని చేరుటతోనే నా పరిశ్రాంతియంతయు పోయినది. త్వదధీనురాలనైన నేను మీ యాజ్ఞల పరిపాలించుటకై నిరీక్షించుచుందును.

పృథ్వీ: అయిన నిటు...అని కరము గ్రహించును.

(తెరపడును)

## ద్వితీయరంగము

(ప్రదేశము: స్థానేశ్వరము. తురుష్క సేనా శిబిరములకు వెలుపల సెలయేటి ఇసుక తిన్నెపై ఆలోచనతో జయచంద్రుడు. అలతి దూరములో సేవక వేషములో అబ్దుల్ కరీము.)

జయ: సెలయేటి నీటితుంపరలతో కలిసివచ్చు ఈ మందమారుతము ఆలోచనా పరిశ్రాంత మనస్కుల కెంతయో ఉల్లాసము నొసంగజాలు.

సేవ. ప్రభూ తమ దర్శనమునకై ఏకాంతమున నెవ్వరో రాజపుత్రు డేతెంచు చున్నట్లున్నది.

జయ: (పరికించి చూచి) ఎవరు వారు?

వీరుడు: (జయచంద్రుని పాదములపై బడి) ప్రభూ కాపాడుము. అనుమతి లేకుండ రావలసి వచ్చినది.

జయ: ఓ వీరాగ్రణీ, నీముఖవైఖరి జూచిన మహా పురుష లక్షణములు తోచుచున్నవి. నీ విట్లొంటరిగా అకాలమున రానవసరమేమి కలిగెను? ఏదో తాత్కాలిక విషాదమలముకొన్నట్లు తోచుచున్నది. సత్వరమే కారణ మెఱిగింపుము.

వీర: సాహసమునకు క్షమింపవేడెదను. తాము, పూర్వపు ఢిల్లీ చక్రవర్తియు, అన్యదేశీయుల పవిత్ర భారత భూమిపై అడుగిడకుండ నెదిరించిన విధము లోక మింకను మఱువలేదు.

జయ: ఆ దినములు గతించినవి. కిరాతకుడగు పృథ్వీరాజు చక్రవర్తి నన్యాయ మొనరించి ఢిల్లీ సింహాసన మారోహించినాడు కదా!

వీర: ఆతడు ఢిల్లీ సింహాసన మధిష్ఠించినది రాజలోకమంత నేకముఖ మొనరించి శత్రుదుర్గమ్య మొనర్చుటకే కదా!

జయ: నీ వాగ్వైఖరింగాంచిన నా శత్రు పక్షము వాడవని తోచుచున్నది. ఆ మార్గుని ప్రశంసించుటకే యిటకేతెంచిన వృథాశ్రమగొనక మరలిపోవుట మంచిది.

వీర: పృథ్వీరాజు సంగతి పరిపూర్ణముగ దెలిసికొన్న మీరట్లు భావింపరు. ఆతడు తురకల నెదిరించుటకై మీ సహాయము నపేక్షించుచున్నాడు. దేశ వినాశమును దప్పించుట కెంతటి త్యాగమునకైనా సంసిద్ధముగా నున్నాడు.

జయ: కల్ల. నామిత్రుడగు చక్రవర్తిని పదభ్రష్టు నొనరించి, సింహాసన మెక్కి, గర్వాతిరేకమున, నా కుమార్తె నపహరించి, నాపై యుద్ధమునకు కత్తిగట్టిన యాతడటు లెన్నటికి గోరడు.

వీర: నీ కుమార్తె నాతడపహరించె ననువార్త నూతనము. ఆతని లోకాతిశయ సద్గుణ సౌందర్యములచే నామె యాతని వరించినదని లోకమంతయు చెప్పుకొను చుండెను.

జయ: అనవసర ప్రశంసలకు దిగక నీ వృత్తాంత మెఱిగించి, రాకకు కారణము తెలుపుము. నీ ముఖముం గాంచిన

వీర రాజపురుష లక్షణములు నన్ను చకితుని చేసినవి. లేనిచో ఇంతవఱకు శత్రుగుణ ప్రశంస అనుమతింపబడి యుండదు.

వీర : కృతార్థుడను. పృథ్వీరాజు...

జయ : ఆతని విషయ మొక్కమాట కూడ పలుకరాదు.

వీర : క్షమార్హుడను. దేశైక్యతకై, స్వాతంత్ర్య దీప్తికై ఢిల్లీ ఆధిపత్యము తన పాదముల కడనుంచి అనుచరుడుగా తురకల నెదిరించుట కాతడు సంసిద్ధుడు.

జయ : నమ్మజాల. ఒక వేళ అది నిజమే యైనను ఒక స్త్రీ జనాపహారి, వంచకుడు రాజ్యాధిపత్య ప్రదాన మొనరించిన, చేయి చాపుట కీ జయ చంద్రుడు యాచకుడుగాడు.

వీర : ఉదాత్తాశయముతో, స్వాతంత్ర్య యుద్ధమునకు నాయకత్వ మంగీకరించుట కొఱకు అట్టి యాచనమైన మేలుకాదా.

జయ : మాకు హితోక్తులు బోధింప నెంచినట్లున్నది. వచ్చిన కారణము దెలిపి వెంటనే పొమ్ము.

వీర : ఏమని తెల్పగలను? నీ కుమార్తె సంయుక్తయే స్వయముగావచ్చి నా వచనములు సత్యమని పలికిన నేమందువు?

జయ : ఆ పితృద్రోహి నామాక్షరము లుచ్చరించిన నీ నాల్క చీల్పవలయును.

వీర : హా తండ్రీ. అకారణ విద్వేషమున నెంతటి అవివేకమునకు తల యొగ్గుచుంటివి.

జయ : ఛీ! నీచురాలా! నీవేనాడో గతించితివని తలచితిని. కన్నకులమునకు కళంకము తెచ్చిన, నీచ పురుషాభిసారికవైన నీ ముఖము చూడ నిచ్చగింప.

వీర : తండ్రీ. నీవెన్ని అవమానము లొనర్చినను, దేశ రక్షణమే పరమావధిగా నెంచి ఈ రూపమున నిన్ను గలిసికొనవలసి వచ్చినది. ఢిల్లీ సామ్రాజ్యము నీ యధీనము గావింతుము. నీకు చేయూతయై శత్రుముష్కరుల నెదుర్కొందుము. అనవసరావేశమునకు దావీయక చక్కగా పర్యాలోచింపుము.

జయ : ఛీ నీచురాలా!

వీర : నే నొనరించిన నైచ్యమేమి? అనురాగము లేని రాజపుత్రమ్మన్యుల వరింపక పోవుట నీచ కృత్యమా? సర్వసద్గుణసముపేతుని స్వాతంత్ర్య ధర్మదీక్షాబద్ధ కంకణుని వరించుట దూష్యమా! భక్తిచే సర్వస్వము జనకుని కర్పణ చేయునట్లు ప్రియుని ప్రోత్సహించుట క్షుద్రత్వమా ఆలోచింపుము తండ్రీ.

జయ : నీ ముఖమిక జూడ నొల్ల. నాకవమాన మొనర్చిన రాక్షసివి. స్త్రీ హత్యకు విముఖుడనై యూరకుంటిని లేకున్న ఈ పాటికి...

వీర : ఎన్ని రాక్షస లక్షణములున్నను తండ్రివే యని తలచితిని. నీ పౌరుషము స్త్రీ పైనే చూపగలవు. మహా వీరుల స్నేహము నీకంగీకారము గాదు. తురుష్కుల నాశ్రయింపగలవు. నా ముఖము చూడవలయునని అంగలార్చు సమయమున, నీకా యదృష్టము భగవానుడీయ జాలడు. స్త్రీయని నన్ను జంపక విడుచు చున్నావు. నీ వట్లు విడువనిచో ద్వంద్వ యుద్ధమున నా పవిత్ర ఖడ్గమునకు నాశిరమిప్పుడే బలియగును. మహావీరుడు, సాటివాడు పృథ్వీరాజు కన్న మహా పవిత్రులుగా నెంచుకొన్న తురుష్కుల చేతిలో మరణింప వలయు నీస్పర్శవలన నాఖడ్గము నపవిత్ర మొనరింపజాల. జాతికి వేరుపురుగవై, నీచాతి నీచుడవై దేశము నన్యులకు, ముష్కరులకు, గోమాంసభక్షకుల ధార పోయదలచిన నీకు మృత్యు ముఖముననైన నిజవృత్తాంతము తెలిసి, వివేక ముదయించుగాక. అప్పుడైన దేశ స్వాతంత్ర్య రక్షణకై ఒక యబలపడిన పరితాపమును అర్థము చేసికొందుగాక. ఈ క్షణముననే నాతండ్రి హతుడైనాడు. తిలాంజలు లొసగి మతి ముందు కార్యక్రమమున ప్రవేశించెదగాక. (వేగముగా నడిచి వృక్షచ్ఛాయయందున్న అశ్వము నధిరోహించి నిష్క్రమించుచుండగా తెరపడును.)

## తృతీయ రంగము

(స్థానము: స్థానేశ్వరమున కొంతదూరము మహమ్మదీయుల సేనా శిబిరములు. గోరీ ఉచితాసనముపై నుండును. సేనాని కరీము మంత్రియు ప్రక్కల గూరుచుండి యుందురు.)

మహమ్మదు గోరీ : పృథ్వీరాజు మూఢత్వము వలన అనాయాసముగ రాజ్యము చేజిక్కినది. ఢిల్లీ ఆక్రమించి సత్వరముగా కనోజీపైకి ఎత్తి వెళ్లవలయును.

కరీము : జయచంద్రుడు యుద్ధములో జయించి భారత సామ్రాజ్యమున నేకచ్ఛత్రాధి పత్యము వహింప నువ్విళ్లూరు చున్నాడు. మీతో సంభాషింప సమయమునకై నిరీక్షించుచున్నాడు.

గోరీ : ప్రవేశ పెట్టుము. వినోదమునకై యాతని యభిలాష మేమో తెలిసికొని ముందటి సంగతి చూతము.

(జయచంద్రుడు విషాదముతో ప్రవేశించును. కరీము సామాన్యాసనము చూపును. జయచంద్రుడు కూర్చుండక నిలిచియే సంభాషించును.)

గోరీ : సార్వభౌముల వారేలకో విజయం చేసినారు.

జయ : ఏలినవారి సేనలు ఢిల్లీ నాక్రమింప బోవునట్లే కాక కనోజీపైకి వెళ్లనున్నట్లును వదంతులు వినబడుచున్నవి. అట్టి యవకాశము లేకుండ కర్తవ్య నిశ్చయార్థమిచ్చటికి వచ్చియున్నాను.

గోరీ : మేమీ మహాప్రయాసము లన్నియు తమకు చక్రవర్తిత్వ మొప్పగించి అడవుల వెంట పోవుటకేయని తమ యభిప్రాయమా ?

జయ : చేసిన వాగ్దానముల మఱచి యిట్లు పలుకుట న్యాయమా ?

గోరీ : ఒడ లెఱిగి ఎచట ఏ పరిస్థితిలో నున్నది గుర్తించి మాట్లాడుము. పృథ్వీరాజు దిక్కులేని మరణము పొందిన తర్వాత నీ వంటి క్షుద్రుడొక లెక్క యనుకొనకుము.

జయ : ఇంతటి వంచనము వీరునకు దగదు.

గోరీ : సాటి మహావీరుడు శత్రువు నెదుర్కొను చుండ పరరాజు సాహాయ్యమునకై ప్రాథేయపడుట క్షుద్రత్వమని నీకు తోచలేదా ? అది వీర కృత్యమే యనుకొంటివా ?

జయ : ఢిల్లీ నీవు జయించి ఆక్రమించినను నాకు సమ్మతమే. నా రాజ్యము జోలికి నీవు రాదగదు.

గోరీ : నీవు విశ్వాస ద్రోహివి. కన్నకూతురును వంచించితివి, ద్వేషించితివి. వృథా పౌరుషము ప్రదర్శించి చేజిక్కినపుడు అంత మొందింపక పందతనము జూపితివి. ఆమె మాత్రము పౌరుషము జూపలేక పోయితివి. నిన్ను నీ కనోజిని విడిచినచో మాకు విశ్వాస ద్రోహము చేయవను నమ్మక మేమి ?

జయ : అవకాశము చిక్కినపుడు కూతురని విడిచినట్లు నీకెవరు చెప్పిరి ?

కరీము : నీచుడా, నీకు సేవకుడై పరిచర్య చేసిన కరీమును గుర్తింప నేరవైతివి. నీకు రాజ్యతంత్ర మొప్పగించిన ఆరాజ్యపు గతి వేఱే చెప్ప నక్కఱలేదు.

జయ : హా దైవమా ! ఎంతమోసము. అందఱు వంచకు లేనా ? (ఒఱలోని కత్తిపై చేయి వైచును.)

కరీము : చేయి అణుమాత్రము కదల్చితివేని నీచేయి, శిరము ఒక్క మాఱుగా నేలకూలును.

జయ : హా ప్రియ తనయా, సంయుక్తా ! మూఢ పశువునై నీ వాక్యముల సారము గ్రహింపజాలనైతిని. నిర్మల ప్రణయ తేజో విరాజమానమై దేశ స్వాతంత్ర్య సంరక్షణ దృఢ దీక్షాబద్ధమై యొప్పు నీ ముఖ మొక్కసారి చూపవా ?

గోరీ : అసమాన పౌరుషము జూపి కదనరంగమున కాళికా దేవియై వెలగిన ఆమె ముఖము పాపండులకు చూడ యోగ్యము కాదు. ఈ మూర్ఖునితో కాలయాపన మొనర్పరాదు, కరీమ్. ఈతని వెంటనే ఖండ ఖండములుగా నఱకి కాకులకు, గ్రద్దలకు వైచి ఢిల్లీ కనోజిలతో ఆర్యావర్త మంతయు పాదాక్రాంతముగు నేర్పాటులన్నియు చేయుము.

జయ : (ఖడ్గము తీసి క్షణములో పొడిచికొని పడిపోవు చుండ తెరవాలును.)

సమాప్తము



# కథ అడ్డం తిరిగింది

* "శ్రీ" *

1

"తొంగలి రెప్పలన్ దొలఁగ ద్రోయుచు
పైపయి విస్తరిల్లు క
న్నుంగవ యాక్రమించు కొనునో
ముఖచంద్రు నటంచుఁ బోవనీ
కంగజు డాన వెట్టి కనియన్
గుబ్రొత్తె ననంగ జాతి సా
రంగ మదంబు లేఁజెమట గ్రమ్మె
లలాటము డిగ్గి చెక్కులన్"

(మనుచరిత్ర)

అని సన్నని గొంతుతో చదువుతూ 'అమ్మయ్య' అన్నాడు రామదాసు అప్పుడే ముగించిన వరూధినీ చిత్రాన్ని దూరంగా పెట్టి చూస్తూ. ఇంతలో పోస్టుమేన్ 'లెటర్. సార్' అని కిటికీ లోంచి ఒక కవరు పడేసి వెళ్లాడు. దాసు చేతిలోని కుంచెను బల్లమీద పెట్టి కవరుతీసి వెంటనే విప్ప కుండా 'ఎవరు వ్రాసారు?' అనుకుంటూ పైనున్న విలాసం పరిశీలిస్తున్నాడు. కవరుమీద ఒంకర టింకరగా నున్న పెద్ద పెద్ద తెలుగక్షరాలతో—రామదాసు-మహారాణీపేట, విశాఖ పట్టణం అని వ్రాసివుంది. విలాసం చూచినంత మాత్రాన ఉత్తరం వ్రాసిన వారెవరో అర్థంకాక ముఖం చిట్లించుతూ కవరు విప్పాడు దాసు.

"శ్రీ రామదాసు బావకు అనేక నమస్కారములు చేసి వ్రాయునది—

అమ్మకు నెల దినములనుండి చాలా జబ్బుగా నున్నది. ఇంట్లో చాలా ఇబ్బందిగా నున్నది. నిన్నొకసారి రమ్మన మని వ్రాయమన్నది. నీవచ్చుటకు క్షేమముగా నున్నావను కొనియెదను.

విశేషములు లేవు
ఇట్లు మీ మరదలు
మణి"

'ఊ'...'మణి' అని సాలోచనగా చూస్తూ ఉత్తరం మడిచిపెట్టి డ్రాయరులో పెట్టాడు. ఇంతలో టకటకా జోడుచప్పుడు చేసికొంటూ 'ఏం వోయి' ఇంకా యిలాగే ఉన్నావేమిటి అంటూ వచ్చాడు విశ్వం.

దాసు 'యింకా ఆరు గంటలేగా అయింది. అరగంటలో వెళ్లలేమా?' అన్నాడు.

"ఇవ్వాళే బిగినింగ్. ముందుగా వెళ్లకపోతే టిక్కెట్లు దొరకవు"

'ఇదుగో వచ్చేస్తున్నా! కూర్చో" అంటూ టవలు సోపు తీసికొని పెరట్లోకి వెళ్లాడు దాసు. విశ్వం వరూధినీ చిత్రాన్ని జాగ్రత్తగా పరిశీలిస్తున్నాడు.

దాసు పావు గంటలో బట్టలు మార్చుకొని క్రాపు దువ్వుకొని నీటుగా తయారయి వచ్చి 'ఊ నాపనయింది' అన్నాడు.

'పద' అంటూ లేచాడు విశ్వం.

ఇద్దరూ చెప్పులు తొడుగుకొని 'మినర్వా' టాకీసుకు దారి తీశారు.

2

రాత్రి తొమ్మిది గంటలు దాటింది. మినర్వా టాకీసు నుండి జనం గొల్లుమంటూ బయటికి వచ్చారు. బీచి రోడ్డంట జనం గుంపులు గుంపులుగా వస్తున్నారు. సినిమా హాలు ఆవరణ దాటి జన సమూహం నుంచి కాస్త యివతలకి తప్పుకొన్న ప్రతి యిద్దరు ముగ్గురు వ్యక్తులూ 'కల్పన' చిత్రంలోని మంచి చెడ్డలను గూర్చి వితర్కిస్తున్నారు. అందులో కొందరు విద్యార్థులు ఆ చిత్రం తీయడంలో ఉదయ శంకరుని అభిప్రాయమేమిటా అని వాదించు కొంటున్నారు. మరికొందరు సినిమా అర్థమే కాలేదని విసుగుకొంటున్నారు. కొందరు పెద్దలు అర్థం కాలేదంటే నాట్య శాస్త్రంలో తమకభిరుచి లేదంటారేమోనని చాలా బాగుందనుకుని

వారికి వారే తృప్తి పడుతున్నారు. కొందరు సత్యవాదులు 'అర్థం చేసికొంటే అద్భుతమైన చిత్రమిది' అంటున్నారు.

చాలావరకూ జనం రద్దీ తగ్గింది. సిగరెట్లు కాల్చు కుంటూ దాసు, విశ్వం తీరికగా వస్తున్నారు. కొంత దూరం నడిచాక దాసు 'ఇప్పటినుండీ యింటికివెళ్లి ఏం చేయాలి, కొంతసేపు సముద్రపు ఒడ్డున కూర్చుందాం రావోయి' అన్నాడు

విశ్వం కొంచెం విసుగుదలగా "అబ్బా సినిమా చూసి తలనొప్పి వచ్చింది. ఇంటికిపోయి పడుకుంటా. కావలస్తే నువ్వుపోయి ఆ ప్రకృతి సౌందర్యాన్ని అనుభవించు" అన్నాడు.

దాసు తల పంకిస్తూ- 'ఆ తప్పకుండా అనుభవిస్తాను. అనుభవించడం చాతకాని నీలాంటి వాళ్లను చూస్తే నాకు తలనొప్పి, అన్నాడు విశ్వంవైపు చురుకుగా చూస్తూ. 'సరే తలనొప్పికి రేపు మందు తెస్తానులే. నేను పోతు న్నాను,' అంటూ ప్రక్కసందుకు మళ్లిపోయేడు విశ్వం.

దాసు నెమ్మదిగా అడుగులువేసికొంటూ రోడ్డుదిగి సముద్రపు ఒడ్డుకువచ్చి కూర్చున్నాడు.

వెన్నెల చక్కగా ఉంది. ఉబుకుతూ వస్తున్న నీటి తరంగాలు వెన్నెల కాంతిలో మెరసి పోతున్నాయి. దూరంగా స్టీమరు కాబోలు మినుకు మినుకు మంటున్న ఎర్రలైట్లతో చక్కని దృశ్యాన్నిస్తూంది.

దాసు సముద్రంలోకి దూరంగా చూస్తూ క్రొత్త సిగరెట్టు వెలిగించాడు. ప్రకృతి ప్రశాంతంగా ఉంది. దాసు ఏమిటో ఆలోచిస్తూ సిగరెట్టును గట్టిగా పీల్చి పొగ ఒదిలిపెట్టాడు. సిగరెట్టు పొగ సుడులు తిరుగుతూ తన కళ్లముందరే నాట్యం చేస్తూంది. దాసుకు తన పూర్వ జీవిత మంతా ఒక్కసారి స్మృతిపథానికి వచ్చినట్లయింది. పాత సంగతు లొక్కొక్కటీ జ్ఞప్తికి రాసాగినై.........

"ఎంత అదృష్ట జాతకమో గాని తాను పుట్టిన రెండు సంవత్సరాలకి తన తల్లి చనిపోయిందట. భార్యపోయిన దుఃఖమే కాక ఈ పసిగ్రుడ్డును పెంచడ మెలాగ అని తన తండ్రి బాధపడుతున్న సమయంలో తన మేనత్త రాధమ్మ తన తండ్రిని "అన్నయ్యా అన్నిటికి బెంగపడితే ఎలాగ-పిల్లాడిని నేనుపెంచి నీ కప్పచెపుతాను. నువ్వుధైర్య పడకు" అని హామీ యిచ్చి తనను తీసుకు వెళ్లింది.

దాసుతండ్రి కేశవరావు అమలాపురంలో ప్లీడరు గుమాస్తా. లేని సంసారమైనా భార్య చనిపోయేసరికి తనకు 30 సంవత్సరాలైనా నిండక పోవడంచేత జీవిత రథం ఒంటి చక్రంతో నడవడం కష్టమని తోచి, భార్య చనిపోయిన రెండు సంవత్సరాలకే మళ్లీ వివాహం చేసుకున్నాడు కేశవరావు.

మహేశ్వరి (తన సవతి తల్లి) బీద సంసారంలో పుట్టినా మంచి గడసరి, తెలివితేటలు కలది. కాపురానికి వచ్చిన కొద్ది నెలలకే "అబ్బాయిని తీసుకురండి" అని భర్తను ప్రోత్సహించింది. ఎందుకోగాని కేశవరావే మొదట జంకాడు. "పెంచుతానని కోరి తీసుకువెళ్లిన మేనత్త కంటె సవితి తల్లి ఎక్కువ ఆదరణ చూపుతుందా" అని అతని సందేహం.

ఎలాగైతేనేం భర్తను పదే పదే వేధించి మేనత్త గారింట్లో పెరుగుతున్న దాసును రప్పించింది.

దాసుకు తాను మేనత్తగారింట్లో ఉండటం తండ్రివచ్చి తనను తీసుకు వెళ్లటం చిన్నలీలగా జ్ఞాపక మున్నాయి. మహేశ్వరిని తాను 'పిన్నీ' అని పిలచేవాడు. ఆమెకూడా అప్యాయంగా 'ఏం నాయనా' అని సంబోధించేది.

నిజానికి మహేశ్వరి లోకంలో అందరూ చెప్పుకునే వంటి సవితి తల్లి మాత్రంకాదు. తనను అభిమానంగానే చూచేది. కాని ఆమెది కొంచెం గర్వ స్వభావం. తన హయాంలో ఉన్న వాళ్లంతా తనకు అణిగి మణిగి ఉండా లంటుందామె స్వభావం. అందుకనే ఆమె కాపరానికి వచ్చిన కొద్ది దినాల్లోనే భర్తను తన అదుపాజ్ఞలలో ఉండేలా చేసుకుంది. దాసుకు కూడా తనంటే భయభక్తు లుండేలా పెంచింది.

'కాని ఆ తరువాత నాలుగైదు సంవత్సరాలలోనే పిన్ని వైఖరి మారింది. దానికి కారణం ఆమెకీ ఒక కొడుకు పుట్టడం-లోకానికి వెరచి తనను ఆమె కుమారునితో సమా

సంగా చూచినా మనుషులి ప్రేమాభిమానాలు దూరమైనాయి. చాటుమాటుగా తనను చూసి విసుగుకునేది. అప్పుడప్పుడు కొట్టేది కూడా. కాని ఆమెకు తనయెడల గల అభిమానం సన్నగిల్లడానికి ముఖ్యకారణం తనే. ఎప్పుడైయినా పిన్ని కొడితే తనకు చాలా కోపం వచ్చేది. చాలా వెటకారంగా జవాబు లిచ్చేవాడు తాను పిన్నికి. ఆమె తనయెడల ఆశించే వినయ విధేయత అతనిలో లేవు. అందుకనే ఆమెకు కోపం వచ్చేది..........

............ఆ దినం అతనికి బాగా గుర్తుంది. తన జీవితంలో ఎన్నటికీ మర్చిపోలేని దినమది. అప్పుడు తాను ఫష్టుఫారము చదువుతున్నాడు. వీధికొట్లో పెన్సిలితో గోడ మీద బొమ్మగీస్తున్నాడు తాను. అప్పుడే కోర్టునుండి వచ్చి కాళ్లూ చేతులూ కడుగుకొని ఈజీ చెయిర్లో కూలబడ్డాడు నాన్న. పిన్ని గ్లాసుతో కాఫీతెచ్చి నాన్న కిస్తూ 'అబ్బాయి చెప్పినమాట బొత్తిగా వినటంలేదు. రోజు రోజుకీ వ్యవహారం ముదిరిపోతూంది. ఊరంతు తిరగడం ఎక్కువయింది. నెలదినములనుండి వాడు బడికే పోవటం లేదట' అన్నది.

'అయితే ఇన్నాళ్లు ఎందుకు చెప్పలేదు' అన్నాడు నాన్న.

'ఏమో! నాకు మాత్రమేం తెలుసు. పుస్తకాలు పట్టుకుని వెళుతూంటే బడికి కాబోలు ననుకున్నాను. ఇవేళే నాకీసంగతి తెలిసింది. మీ అబ్బాయిని మీరిలా సరిదిద్దుకుంటారో. నేనేమైనా అంటే సవితి తల్లి కిట్టక చేసింది అని నన్నాడిపోసుకుంటుంది లోకమంతా' అంటూ వంటింట్లోకి వెళ్లిపోయింది. తాను వీధికొట్లోఉండే ఈ మాటలన్నీ వింటున్నాడు-ఇంతలో నాన్న 'అబ్బాయి!' అని పిలవడం వినిపించింది. చేతిలోని పెన్సిలు అక్కడే పడేసి నాన్న ఎదుటికి వచ్చి నిల్చున్నాడు తాను.

'రోజూ బడికి వెళ్తున్నావురా!' అన్నాడు—నాన్న కోపంగా చూస్తూ.

'లేదు!' అన్నాడు తాను.

'ఎందుకు వెళ్లడం లేదూ!' అని గర్జించాడు నాన్న.

'డ్రాయింగు మాష్టరి గారింటికి వెళ్లి బొమ్మలు వేయటం నేర్చుకుంటున్నా.'

'బొమ్మలు గీసుకుంటూ కూర్చుంటే అవి నిన్నుద్ధరిస్తాయా యేం? తిన్నగా బడికి వెళ్లి చదువుకుంటేనే సరి. లేకపోతే అనవసరపు జీతం దండగ.' అన్నాడు నాన్న తనను వెరిపిస్తున్నట్లు చూపిస్తు.

కాని నిజానికి తనేమీ భయపడలేదు—'నా కసలు చదవాలని లేదు—ఇకమీద బడికి వెళ్లను' అన్నాడు నిక్కచ్చిగా.

తన మొండి జవాబుకు విస్తుపోతూ "అలాగ వీలులేదు నువ్వు తిన్నగా బడికి వెళ్లి చదవాల్సిందే నా దగ్గర ఇలాంటి వెధవ వేషాలు పనికిరావు" అన్నాడు నాన్న.

అంతే! ఆ సాయంత్రమే తాను కట్టు బట్టలతో యిల్లువదిలి వచ్చేశాడు. ఎందుకు వచ్చేశాడో తనకే తెలియదు"...

......చేతిలోని సిగరెట్టు కాలిపోయి చెయ్యి చురికింది. దాసు మళ్లీ ఈ ప్రపంచంలోనికి వచ్చాడు. చంద్రుడు తెల్ల మబ్బుల్లోంచి పరుగులు పెడ్తున్నాడు. ఎత్తుగా కొట్టుకునే కెరటాలనుండి నీటి తుప్పరలు తనమీదకు తూలుతున్నాయి. మళ్లీ అతడు తన గత జీవిత సింహావలోకనంలో పడ్డాడు.

అవును అది నిజంగా యిప్పటికీ అర్థంకాని సమస్య. ఆ దినం తాను యింటినుండి పారిపోడానికి కారణం? తాను యింట్లో ఉండలేనంత ఎక్కువగా ఎవ్వరూ కష్టపెట్టలేదు. పిన్ని కూడా తన వెంకి జవాబులకు చాలకాలం ఓర్చింది. నాన్న ఎప్పుడూ తనని ఒక దెబ్బయినా కొట్టలేదు. ఆఖరికి వచ్చేసేనాడు కూడా తనను బుద్ధిగా చదువుకోమన్నాడేగాని మరేమీ అనలేదు. కాకపోతే కాస్త కళ్లెర్ర చేశాడు. అంతమాత్రానికే. తాను అలిగి వచ్చేశాడా? ఊహు! అదికాదు. ఎందుకో తాను ఇంట్లో ఉండలేకపోయాడు. స్వేచ్ఛగా ప్రపంచములో విహరిద్దామనుకున్నాడు. ఇంటినుండి వచ్చేశాడే కాని తనకు తిండి, బట్ట, బస వీటినిగురించి ఆలోచించనయినా లేదు. అప్పుడప్పుడు

(తరువాయి 49వ పేజీలో)




[పద్మాలు, బుచ్చి వెంకులు, పల్లీలు. యుద్ధంలో సంపాదించిన డబ్బుతోపాటు కొంత నాగరికత కూడా సంపాదించి, యిల్లాలు పద్మాలుకు సంగీతం చెప్పించి, వర్తక నిమిత్తం చెన్నపట్టణం చేరతాడు బుచ్చి వెంకట్రావు. ఆ కొత్తవాతావరణంలో, కొందరి వ్యక్తుల సహవాసంలో, వారిరువురి జీవితాల్లో చెలరేగినతుపాను, తన్మూలంగా వారికి ఏర్పడ్డ ఎడబాటును గూర్చి ఇంతవరకూ చదివినాము. 11-వ గుచ్ఛంలో తిరిగి వారిరువురకు పూర్వ జీవిత స్మృతి రావడం కూడా చదివినాము. ఇకపైన ఏమవుతుందో ఈ 12-వ గుచ్ఛంలో చదవండి. దీనితో కథ సమాప్తం]

## ద్వాదశ గుచ్ఛము

### ౧

రైలు వేగంగా సాగిపోతోంది. పద్మావతి హృదయంలో ప్రత్యూషం ఉదయించేటట్లే లేదు. తన బావ ఢిల్లీ రాకపోతే? తన బావకు తానేమీ పనికి రాకపోతే? పురుషునకు స్త్రీగాని, స్త్రీకి పురుషుడుగాని ఒక్క స్త్రీ పురుష సంబంధార్థానికేనా ఉద్భవించింది? అయితే పండులవలె, ఋషిదంపతులవలె జీవించే వృద్ధులైన భార్యాభర్తలగతి?

బ్రహ్మచారిణులై, విధవాత్యాన యోగినులై జీవిస్తూ, జాతిసేవ చేసే ఉత్తమ స్త్రీల జీవితాలు అర్థము లేనివేనా? మానవ జీవితం తీగెలల్లుకు పోయిన నికుంజము వంటిది. బహుళ లతాపూర్ణ నికుంజములో ఏ తీగను విడిగా పరిశీలించ గలమూ అని పద్మావతి భావించుకొన్నది.

రైలులో తనతోటి ప్రయాణీకులైన ఈ నూత్న స్నేహితు రాండ్రు తన్ను సంగీతం పాడమని ప్రార్థించినప్పుడు, తాను పాడుటకూ సందేహించలేదు. వారాపాటవిని ఆనందంలో ఏవో లోకాలలో తేలిపోయామని ఉప్పొంగిపోతూ తన్ను

మెచ్చుకొన్నారు. భగవంతుడు తనకా గాంధర్వ మహిమను ప్రసాదించింది ఏదో ఉత్కృష్ట సేవ జగానికి అర్పించమనే కదా! ఎంతకాలం తాను నీడలను చూచి భయపడి పారిపోవడం? తన బావ ఢిల్లీలో తన్ను కలుసుకుంటాడా పరేసరి. అతనికి నిజమైన సైదోడై, అతని నీడలనుండే సంఘసేవలో మానవ జాతికి సాష్టాంగమవుతుంది. తన్ను కలుసుకోలేదూ—తాను ఒంటిగానే బ్రతుకు దారుల ప్రయాణిస్తూ జాతికి పరిచర్యచేస్తుంది. చదువు పూర్తి చేస్తుంది. సేవచెయ్యాలనే అనుకుంటే, చేసే దీక్షకలవారికి మార్గాలూ ఉన్నాయి. ఆ మార్గాలలో మహోత్తమమైనవీ ఉన్నాయి.

ఇంక తన బావను దూరంనుండే ఆరాధించుకుంటూ తన సేవామార్గాన్ని అనుసరించి పోతుంది.

మనుష్యులెంత దగ్గిరవారైనా వారి హృదయాలు ఇనప గోడల వెనక ఉన్నట్లు ఉంటాయి. ఆ హృదయాలు తామన్న ప్రేమార్ద్రితా పూర్ణములై కరిగిపోతాయి అని నమ్మినంతసేపూ ఆ హృదయాలు ఆ రీతిగానే ప్రత్యక్షమవుతూ ఉంటాయి. ఎదుటి జీవితాలలో అర్థములేని ఏదో ఒక సంఘటన సంభవించే సరికీ, ఆ సంఘటన ఇవతలి హృదయాలకు కోటి క్రీనీడలు కమ్ముకొని దర్శనమిస్తుంది. ఇంక వీరికీ వారికీ ఇంతవరకూ ఉన్న సామరస్యం మాయమై, కాకోలంవంటి విషం ఉద్భవిస్తుంది. తాము గరళ కంఠులై ఎవరావిషం ఆస్వాదించుకోగలరు?

తన బావ తన్ను ప్రేమించడం లేదని తానెందుకు నిర్ధారణ చేసుకోగలిగింది? పద్మాలు నిట్టూర్చింది. రైలు స్టేషనులలో ఆగుతూనే ఉంది. యోజనాలను అంగుళాలు చేస్తూ సాగిపోతోనే ఉంది.

తాను మాత్రం తన బావను అంతు ఎరగని గంభీర ప్రేమతో ప్రేమించి ఉంటే, తనకెందుకు బావంటే విసుగు జన్మించింది? బావంటే ఏదో భయంవేసి ఏదేని సాకుతో, బావనువిడిచి పారిపోయింది! ఎట్లు విడిచి ఉండగలిగింది తాను? ప్రేమకోసం సర్వమూ ఆహుతిస్తారన్నమాట వట్టిది. గాటంగా కోరిన ఏ సంఘటన కోసమైనా మనుష్యుడు తన జీవితం కొంత ఆహుతిస్తాడు. ధనం, పదవి కోరినవాడు తన గౌరవం, తనలోని ఉత్తమ మానవత్వం నాశనం చేసుకొంటూనే ఉన్నాడు.

ఇప్పుడు పద్మావతిలో బాలికాత్వము జారిపోయింది. ఆమె మనస్సులోని మంచులు దెసలకు ప్రవహించి మాయమైనాయి. చిన్ననాటి నుండీ తన నాయకుడు బుచ్చి వెంకులు బావే! అతడు తనకై, అతనికై తాను, మెట్లెక్కుతూ పైకి నడచివచ్చారు. తాము చిన్ననాడు ఆడుకొన్న సముద్రానికి మేరలు చిన్నవి. ఈనాడవి విస్తరించి కడపలను దాటిపోయాయి.

ప్రతి జీవితమూ ఇంకో జీవితంతో చేయి అంది పుచ్చుకొని మెట్లెక్కి పోవలసిందే. అదే మానవుని నిత్యలీల! అదే భగవంతుని నిత్యఖేల! అనుకుంది ఆమె చిన్న బిడ్డలా. ఆమె హృదయం శాంతి పొందింది.

రైలు వేగంగా సాగిపోతూ ఉంది.

౨

బుచ్చి వెంకట్రావు ఆకాశపథంలో మహావేగంతో ఉత్తరానికి ఎగిరిపోతున్నాడు. నరసింహమూర్తి మేష్టారి టెలిగ్రాం అందిన వెంటనే కారుమీద విమాన కార్యాలయానికిపోయి, వెంకట్రావు ఢిల్లీకి టిక్కెట్టు కొనుక్కున్నాడు. ఆ మర్నాడు ఉదయమే విమానం అందుకొని ప్రయాణం సాగించాడు.

క్రింద ఎన్ని పట్టణాలు, నదులు, కొండలు వెనక్కి పరుగిడుతున్నాయో పొలాలు, అడవులు, జిల్లాలు, రాష్ట్రాలు వెనకనే ఉండి పోయాయి. అలాగే తన బ్రతుకులో ఎన్నో కాంక్షలు, బాధలు, ఆనందాలు, సంఘటనలు వెనక్కి వెళ్లిపోయాయి. ఈ నదులూ, కొండలూ వెనక్కి వెళ్లినా, అవన్నీ ప్రయాణ మార్గంలో ఉండనే ఉన్నాయి. అదేరీతి తన జీవితంలోని సంఘటనలూ అలాగే ఆ వెనక సంవత్సరాలలో ఉండిపోయాయో? మనుష్యుడు వెనక్కి వెళ్లడం నేర్చుకుంటే, ఆ జీవితయానంలో మళ్లీ ఆ సంఘటనలన్నీ సంభవిస్తాయా? తన తల్లితండ్రులు వెనకటి ప్రపంచాన్ని ప్రత్యక్షం చేస్తూనే ఉన్నారు.

తాను తన గ్రామంలో తల్లితండ్రులకు అన్నదమ్ములకు చక్కని పెంకుటిల్లు కట్టించి ఇచ్చాడు. మామగారికీ

చాలామంది చుట్టాలకూ తన రొయ్యపప్పూ ఎండుచేపలూ ఎగుమతి కంపెనీలో వాటాలు ఇచ్చాడు. తనతో వాటాల వారందరి దగ్గర కొద్దో గొప్పో సొమ్ము నిల్వ ఉంది. ఆ వాటాదార్లందరూ చిన్నచిన్న పెంకుటిళ్లు కట్టుకున్నారు. కాని వారందరూ ఇంకా పల్లీయులే. ఇంకా పుట్టగోచీలు పెట్టుకొని తన చుట్టాలు, పెద్దలూ చిన్నలూ అందరూ సముద్రం వేటకు వెడుతూనే ఉన్నారు. ఆలా పల్లీయులు సముద్రం వేటకు వెళ్లకపోతే తన కంపెనీ దివాలా తీసిందన్నమాటే!

తన పల్లెవారిలోనుండి ఇంగ్లండులోవలె ఉత్తములైన నావికులు తయారు కావాలి. చదువులు లేకపోవడం చేతనే కదా తనవాళ్లని ప్రభుత్వం యుద్ధ నౌకానావికులుగా జేర్చుకొనకపోవడం. కులమత వైషమ్యాల వంటి ఈ నికృష్ట జీవితాని కంతకూ చదువు లేక పోవుటమే గారణం. తన పద్మ చదువు కొన్నది. చదువు కొంటుంది. తానూ చదువు కొంటున్నాడు. ఈ పరీక్షలు చదువులో ముందుకు ప్రయాణం చేయించగల మజిలీలవంటివి. తన పద్మ బి. యే., ప్యాసవుతుంది. తానూ తన పద్మా దేశాలు తిరుగుతారు. తన కంపెనీ బాగా ఏర్పాటుచేసి, తానూ తన పద్మా ఆమెరికాకో, ఇంగ్లండుకోపోయి అక్కడ చేపల విషయమూ అందుకు సంబంధించిన సముద్ర జ్ఞానమూ, సముద్రయాన ప్రావీణ్యతా నేర్చుకుని రావాలి. అప్పుడే తన దేశానికి తానేదైనా సేవ చేయకలడు. తనకు ఉద్యోగాలు అవసరంలేదు. తన కంపెనీ మంచిలాభాలు తెస్తున్నది. తాను ఇదివరకు కంపెనీలవారివలె పల్లెవారిదగ్గిర అతి చవకగా కొని, అతిలాభంగా అమ్మటంలేదు. తానన్ని కంపెనీలకన్న ఎక్కువ ఖరీదులకు కొంటున్నాడు. లాభసాటికిగా పరదేశాలకు ఎగుమతి చేస్తున్నాడు. చీనాకు, జపానుకు, బర్మాకు, మలయాకు, సింహళానికి, జావాకు తన సరకు రవాణా అవుతోంది. తాను ప్రభుత్వానికి లెక్కలన్నీ సరీగా చూపించి, ఇవ్వవలసిన పన్ను సకాలంలో ఇస్తున్నాడు. తనకు రాజకీయాలతో అనవసరం. ఆంధ్ర రాష్ట్రం విషయంలో మాత్రం తనకు తీరనికోర్కె ఉంది. మదరాసులో సగపాలు తెలుగు వారున్నారు. అయినా మదరాసు తెలుగువారిది కాకపోవడమేమి? పోనీ కొందరన్నట్లు సగంసగం పంచితే ఉభయరాష్ట్రాలవారికీ మేలు. ఏ రాష్ట్రం వారిదైనా మదరాసు దెబ్బతింటుంది. చివరకు ప్రత్యేక రాష్ట్రమైనా మదరాసు హీనస్థితి పొందుతుంది. రెండు రాష్ట్రాలకు ముఖ్య పట్టణమైతే మదరాసు ఇప్పటికన్న మహోన్నతస్థితి పొందుతుంది. లేనిపోని అహంభావాలు పెట్టుకొని మనుష్యులు తామూ నాశనమౌతారు, ఇతరులనూ నాశనం చేస్తారు.

ఏమిటీ తనకీ ఆలోచనలు. ఈలాంటి ఆలోచనలే తనకీమధ్య. వీని అన్నింటికీ కారణం పద్మాలు. పద్మాలు తనకు, చిన్నతనాన నుండీ ఓ దేవకన్యలా దర్శనం ఇచ్చేది. ఆమెకు తగిన భర్తకావాలని తాను యుద్ధానికి పోయినాడు. యుద్ధంవారికి అన్నీ సప్లయి చేసే కంపెనీవారి విషయం అంతాచూసి, తాను యుద్ధంనుంచి రాగానే రొయ్యపప్పు ఎండుచేపల ఎగుమతి కంపెనీపెట్టినది పద్మాలును లక్ష్మీదేవిని చేయడానికే. తన పద్మాలు సౌందర్యదేవత. తన పద్మాలు సరస్వతి. తన పద్మాలు తన జీవితానికి ఆరాధ్యదేవి.

ఏ తిక్కపుట్టిందో తనకు. మదరాసు నగరంలో తన పద్మాలు పట్టిపల్లెపిల్ల అనిపించింది. తనతోపాటు తన పద్మాలు ముందుకు సాగి రావటము లేదనిపించింది. ఈ సినీమా తారలు, ఈ బీచిసుందరులు తన్నేదో మైకంలో ముంచారు. కాస్తయితే తన పద్మాలు తనకు దూరమైపోయి ఉండును. ఆమె గీతాదేవి. తానువట్టి మొరకుడు. ఆమె సంగీతం పాడుతూ ఆ సభలలో వేదికపైన కూర్చుని ఉంటే, తనకు ఆకాశంనుంచి దిగివచ్చిన దేవతామూర్తిలా కనబడేంది. తాను బజారులవెంట వెడుతూ ఉంటే, ఆమె రికార్డులు విన్నప్పుడు, రేడియోలో ఆమె పాడినప్పుడు, దివ్యమైన ఆ గాంధర్వం విన్నప్పుడు తనకప్పుడామె వెలిగిపోయే శరీరంతో ఎదుట నిలుచున్నట్లే అయ్యేది.

పద్మాలూ! సౌందర్యాలరాణీ, దివ్య గాంధర్వాల లోకాలను ఉప్పెనలుగా ముంచే గీతాదేవీ! ఇంత మూర్ఖుడై తాను తన్నేమరిచి పోయేస్థితికి వచ్చాడా?

తానటు సినీమా కంపెనీ పెడతాడట. సుశీలవంటి సీతా కోక చిలకల్ని, భరతపక్షులను కొన సాహసించాడట! ఎంత



MY AMRUTANJAN
నా ది
నా ది
నా ది
నా ది
నా ది
నా ది
There are Millions of "MY's in that MY
Applied to the 46 year old "Pocket Doctor" of INDIA.

దౌర్భాగ్యము. ఏనాటికైనా పతితుడు కాబోయే పురుషునికీ స్త్రీయే చేయి అందిస్తుంది. స్త్రీ వట్టి బిడ్డలకనే పశువు అనుకొన్న ప్రతి పురుషుడూ కూపం నదివంటి పరమ దౌర్భాగ్య కూపంలో కూలిపోతాడు.

విమానం హైదరాబాదులో ఆగి మళ్లీ బయలుదేరింది. నాగపురంలో ఆగింది. అతనికి ప్రయాణంలో పలకరించే వారెలేరు. ఆలోచనలే అతని తోటియాత్రీకులయ్యాయి.

విమానం మహావేగంతో రెక్కలు చాచి వింధ్యపర్వతాలు దాటింది.

3

పద్మావతి న్యూ ఢిల్లీలో దిగగానే ఎదుటకువచ్చి బుచ్చి వెంకట్రావు నిలుచుని ఉన్నాడు. పద్మావతికి తక్కిన సర్వమూ మాయమైనది. ఠీవిగా, రూపమెత్తిన దివ్యత్వంలా ఆమెకు బుచ్చి వెంకట్రావు కనిపించినాడు. రైలులో ప్రయాణం చేసిన తోటి మహిళలు, ఒక దేవికి నమస్కారం చేసినట్లు పద్మావతికి నమస్కరించి, ఆమెను కౌగలించుకొని, కరస్పర్శచేసి తమ తమ ఇండ్లకు ఢిల్లీనుండి వెళ్లపోయే ముందు ఆమెను రమ్మని ఆహ్వానించారు.

పద్మావతి సర్వమూ మరచి వారేమంటున్నారో ఆమెకు వినబడలేదు. ఏదో చిరునవ్వు! ఏదో నిర్వచింపరాని ఆనందం.

ఇంతల్లో ఆమెకు చటుక్కున జ్ఞప్తికివచ్చి, వారికి బుచ్చి వెంకట్రావును కళ్లతోచూపి, సిగ్గుతో "వారే! వారే!" నన్ను కలుసుకోడానికి విమానంమీద ఢిల్లీవచ్చారు!"అని చెప్పింది. వారాతనికి నమస్కరించారు. అతడూ సిగ్గుపడుతూ వారికి ప్రతి నమస్కరించాడు. ఎవరిమగవారు వారికడకు వచ్చారు. మగవారిని ఒకరికొకరు ఆడవారే పరిచయం చేశారు. ఒకరికొకరు నమస్కరించు కొన్నారు.

అందరూ ఒకరిదగ్గిర ఒకరు సెలవు పుచ్చుకొని మళ్లీ కలుసుకుందామనుకొని ఎవరిదారిని వారు వెళ్లిపోయినారు.

ఆమె ఏర్పాటు చేసుకొన్న వారింటికిగాక బుచ్చి వెంకట్రావు తా నేర్పాటుచేసిన హోటలుకు పోదామన్నాడు.

నరసింహమూర్తి మేష్టారునకు తన బిడ్డలిద్దరు ఈ విధంగా కలుసుకోడం వైకుంఠం అబ్బినట్లైనది. సర్వ పవిత్రక్షేత్రాలు ఒక్కసారిగా దర్శించినట్లు అతని ఆత్మపొంగిపోయినది.

నరసింహమూర్తి మేష్టారు జీవితం సంగీత మయం. విశ్వమే గాంధర్వంలో నుంచి ఉద్భవించిందని అతని నమ్మకం. అతడు కలలుకన్న పరమ సంగీతమూర్తి తన శిష్యురాలైన ఈ శైవర్తక బాలికరైు ఉద్భవించింది. అతడు ధనంకోసం ఆదినుంచి ఈ కుటుంబాన్ని నమ్ముకొని మదరాసు రాలేదు. పద్మావతి సంసార మోహంలోపడి ఎక్కడ సంగీతం మరిచిపోతుందో అన్న భయంతో వారు అడగగానే వారివెంటబడి వచ్చాడు. తానింత వండుకొన్నాడు వారికింత పెట్టాడు. వారు తనకోసం మాంసాహారమే మానివేశారు. బుచ్చి వెంకట్రావునకు మాంస భక్ష్యాలపై మనస్సుపోతే మిలిటరీ హోటలులో మంచిదానికి పోయి తినివచ్చాడు. స్త్రీలకున్న పట్టుదల పురుషుల కుండదు. పద్మావతి మాంసమని వేసిందంటే తన జన్మలో మాంసాహారమే ఎరగనిదిగా అయిపోయింది. అందుకనే నరసింహమూర్తి మేష్టారు పద్మావతిని కన్న కూతురుకన్న ఎక్కువగా ప్రేమించుకొన్నాడు.

వారు ముగ్గురూ టాక్సీమీద బుచ్చి వెంకట్రావు ఏర్పాటు చేసిన ఉత్తమమైన ఒక హోటలునకు వెళ్లారు.

రైలుస్టేషను ప్లాటుఫారం మీదగాని, కారులోగాని హోటలులో దిగి తమ భాగంలోనికి పోయినప్పుడుగాని పద్మావతి భర్తతో ఏమీ మాట్లాడ లేకపోయింది. బుచ్చి వెంకట్రావూ భార్యతో ఏమీ మాటలాడలేకపోయినాడు.

నరసింహమూర్తి మేష్టారు మాత్రం ఏదో గ్రహించినట్లు దారిపొడుగునా మాట్లాడుతూనే ఉన్నాడు ప్లాటుఫారంలో.

"ఏమయ్యా బుచ్చి వెంకట్రావూ! మాకన్న ముందు వచ్చేశావే?" అన్నాడు. అందుకు వెంకట్రావు

"అవును!" అన్నాడు.

"అక్కడ మాయమై ఇక్కడ తేలినావా?"

"అవును!"

కారులో డ్రైవరు పక్క ముందు సీటులో కూర్చుని ఉన్నప్పుడు నరసింహామూర్తి మేష్టారు వెనక్కు తిరిగి చూడకుండానే "నిన్ననే వచ్చేసేయగలిగావన్నమాట బుచ్చి వెంకట్రావూ ?" అని ప్రశ్నించాడు.

"అవును ?" అని అన్నాడు బుచ్చి వెంకట్రావు !

"విమానంలో భయం వేయదూ ?"

"వేయలేదు !"

"రెండుమూడు గంటలలో విమానం రాగలిగిందన్న మాట."

"ఊఁ !"

హోటలులో "సామానెక్కడ పెట్టించమన్నావయ్యా బుచ్చి వెంకట్రావూ ?" అని నరసింహామూర్తి మేష్టారు ప్రశ్నించాడు.

"అది నీగది. ఆ గది——"

"సరే సరే !" అన్నాడు మేష్టారు.

ఇద్దరి గదులమధ్యా తనగది ఏర్పాటు చేశాడేమిటి ? అని నరసింహామూర్తి మేష్టారు దిగులుపడి పోయినాడు. తన కొద్ది సామానూ తనగదిలో పెట్టించుకొని, పద్మావతి సామాను పద్మావతిగది అని వెంకట్రావు సైగచేసి చూపించిన గదిలో పెట్టించాడు. గది, గదివెనక పడకగది, పడకగది ప్రక్కన స్నానాలగది. అందులో వేడినీళ్ల కుళ్లాయీ, చన్నీళ్ల కుళ్లాయీ ఉన్నాయి. పడకగదులలో పందిరిమంచం పరుపూ రంగుల శుభ్రమైన దుప్పటీ, బీరువా అద్దం ఉన్న బల్ల, సోఫా, ఓ మంచి కుర్చీ.

అందమైన వస్తువులు అలంకరించి ఉన్నాయి. ఇవన్నీ చూచి నరసింహామూర్తి మేష్టారు ఓ నిట్టూర్పు పుచ్చి "నా కెందుకయ్యా ఇవన్నీని ?" అని అనుకున్నాడు. పది నిముషాలు ఏమిటిది ? అని తలపై చేయిపెట్టుకొని ఆలోచిస్తూ సోఫాలో కూలబడి కూర్చుని ఉన్నాడు. ఏదో జ్ఞాపకం వచ్చిన వానిలా తువాలూ, నలుగుడుపిండీ, నూనే తీసుకొని స్నానాల గదిలోనికి పోయాడు.

రమ్మని టెలిగ్రాం ఇవ్వగానే వచ్చాడు ; బుచ్చి వెంకట్రావు మనస్సు మారింది అని నరసింహామూర్తి మేష్టారు పొంగిపోయాడు. హా ! వారిరువురకు ఈ విడి గదులు ఏర్పాటేమిటి ? వచ్చినప్పటినుండి ఇంతవరకూ వారిరువురకూ మాటలే లేవే ? పూర్ణమైన ఆనందంతో మాట్లాడుకోలేక పోయారా ? మొదట ఒకరిని ఒకరు చూడగానే వారిరువురు ముఖాలు వికసించాయి. తాను చూడనట్లు నటిస్తూ జాగ్రత్తగా పరిశీలిస్తూనే ఉన్నాడు. బుచ్చి వెంకట్రావుకూ సుశీలకూ ఎంతవరకూ సాగింది ? సంబంధం హద్దుదాటితే ఎందుకు వచ్చినట్లు ఈతడు ? భార్యగనక అధికారం చెలాయించడానికా ? అయితే భార్యను పరీక్ష పూర్తిచేసుకోనీయకుండా తీసుకు పోతాడా ? అయితే ఇంత కర్చయ్యే ఈ హంగామా ఎందుకు ? ఆడవారి మనస్సు బ్రహ్మకే అర్థం కాదన్నారుగాని మగవారి మనస్సులు వారికే అర్థం కావు. తాను భగవంతుని ప్రార్థన చేయడం తప్ప గత్యంతరం ఏముంది ?

౪

తన గదిలోకి వెళ్లింది పద్మావతి. స్టేషను ప్లాటుఫారంలో తన బావను చూడగానే ఆమెకు పట్టరాని ఆనందం కలిగింది. చిన్నతనంలో ఒకసారి తన బావ సముద్రానికి బలి అయిపోయాడు అన్నప్పుడు తన ప్రాణమే పోయినట్లయి, తనకీ ప్రపంచమే లేదనుకుని, తానుకూడా సముద్రానికి బలి అయిపోదామని నిశ్చయించు కొన్నప్పుడు, బావ దొరికాడు, బ్రతికి ఉన్నాడు రెండు రోజులలో వస్తాడు అని వార్త విన్ననాటి అద్భుతానందం కన్న ఈ నాడు తన కెక్కువ ఆనందం కలిగిందే ! ఆ వెంటనే బావ ఏదో విధంగా ఉంటే తాను మాట్లాడలేక పోయింది. ఏదో అధోలోకాలకు క్రుంగిపోతున్నట్లు తనకు ఆపరాని నిస్పృహ కలిగింది. తనకీ విడిగా గది ! బావకు తనపై ప్రేమే పోయిందా ? బావ తన్నిక ప్రేమించడా ? తనకీ సంగీతం ఎందుకు ? ఈ చదువులు పరీక్షలు ఎందుకు ? రమ్మనగానే వచ్చాడే ? ఎందుకు ? కళ్లనీళ్లు తుడవడానికా ? ఆమెకు వెక్కి వెక్కి ఏడ్పువచ్చింది. ఆ పందిరి మంచంపైన వాలిపోయింది.

అటు బుచ్చి వెంకట్రావుకు ఆశ్చర్యం కలిగింది. పద్మావతికి తనపై కోపం తీరలేదని అనుకున్నాడు. ఆమె మాట్లాడదు, అంత మౌనం. తాను సిగరెట్లు అవీ కాలుస్తూ ఉంటాడుగదా అని ఆమెకు ప్రత్యేకగదీ అవీ ఏర్పాటు చేశాడు. ఒక్కమాట మాట్లాడేదు. తన కెందుకు రమ్మని పెలిగ్రాం ఇచ్చినట్లు, తన దేవి పద్మావతి ఇక దూరమై పోతుందా? ఇక్కడనుండి తన బ్రతుకు తెల్లవారి పోతుందా? అతడు సిగరెట్టుపైన సిగరెట్టు కాలుస్తున్నాడు. ముందుగదిలో ఒక సోఫాకుర్చీపై చదికిలంబడి కన్ను మూశాడు.

ఒకసారి మహామారిలా ఎక్కడనుండో తప్పు అభిప్రాయం కలిగినప్పుడు, ఆ తరువాత అందుకు సంబంధించిన వారి వర్తనమంతా ఆ భావానికి శ్రుతి అయిపోతుంది. ఆ తప్పు అభిప్రాయం ఇంకా గాటుమై పోతుంది.

ఆ ముగ్గురూ ఆ రోజూ ఆ మర్నాడూ ఏలా గడిపారో? ఆ మహానగరంలోని, ఆ చుట్టుప్రక్కల విచిత్రాలు ఏలా సందర్శించినారో? కుతుబ్ మీనార్, లాల్ ఖిల్లా, జుమా మసీదు, ఫత్తేపూర్ సిక్రీ పైత్యరోగి నోట భష్మ్యా అయ్యాయి. మహాత్మాజీ చైత్య ప్రదేశమైన రాజఘాట్ దివ్యక్షేత్రంకడ పద్మావతి గుండెలవియగా రోదించింది. బుచ్చి వెంకట్రావునకు కన్నుల నీరు తిరిగింది. నరసింహ మూర్తి మేష్టారు ఆడదానిలా వాపోయినాడు.

మహాత్ముడు అవతారపురుషుడు. దుఃఖార్తులైన సర్వ మానవుల బాధలూ వారించి తన బ్రతుకులో ఆస్వాదించుకొన్నారు. బీదతనం వల్ల, కడుపునకు ఒక కణమైనా లేని దౌర్భాగ్యంవల్ల ఒక కన్ను నుండైనా ఒక్క బొవ్వబిందువైనా రాలినవాడు తక్కినవారి బ్రతుకులు వృధా అనీ, ఆ బ్రతుకులు హింసా పూరితాలనీ ఆయన బోధించాడు. ఆయన శిష్యులే నేడు రాజ్యభారం వహించి, దీనమానవుల నుండి కళ్లనుండి రక్తాశ్రువుల మహాఝురులుగా ప్రవహింప చేస్తున్నారని నరసింహమూర్తి మేష్టారు గజగజలాడిపోయి నాడు.

ఈ అవతారము, ఈ దైవస్వరూపుడు కోరి అవతారం చాలించింది మనుష్యుల కర్కశ హృదయాలు చూచే కదా! ప్రేమలు ఉద్భవించని, ప్రేమలు ఎండిపోయిన మనుష్యులే మహాత్ముని గుండెలో రివాల్వరు పేల్చినారు. "ఓ ప్రభూ! నువ్వు ప్రేమ సముద్రానివి! ఓ పరమకరుణా మూర్తీ నీబ్రతుకే ఒక ధర్మ విశ్వం!" అని వెంకట్రావు వివశుడై ఆ పవిత్రక్షేత్రం ఎదుట సాష్టాంగము పడినాడు.

వారందరూ లేచి ఈవలికి వచ్చినప్పుడు వెంకట్రావు భార్య దగ్గిరకుపోయి "పద్మా! నాపైన ఇంకా కోపం తీరలేదా?" అని ప్రశ్నించినాడు. పద్మావతి కన్నుల నీరు తోనే అతనిమోము ఒకసారి ఆశ్చర్యంతో చూచి "కోపం ఏమిటి బావా?" అన్నది.

"వచ్చినప్పటి నుండీ ఏదో ఆలా ఉన్నావేమి?"

ఆ బాలిక కన్నులు గంగా యమున లయ్యాయి. "బావా! బావా! నిన్ను—నిన్ను—ఓ నిముషమైనా—వదిలి...ఉండలేను. నాకీ పరీక్షలూ వద్దు... ఈ...ఈ...సంగీతమూ...వద్దు!...నీ కింత చాకిరీ చేసు కుంటూ...ఉంటాను."

"అదేమిటి పద్మా!"

"బావా! నువ్వే ... నువ్వే ... నాకు ... మహాత్ముడవు...నాపైన నీకు ... నీకు ... ప్రేమ ... పూర్తిగా పోయింది...అని—అని—"

"ఓసి వెఱ్ఱిపిల్లా! నీకోసం నేను బ్రతికి ఉన్నాను. సముద్రంలో నా పడవ ఆలా దరీ అంచులేకుండా కొట్టుకు పోతూ నీమూర్తి...అందాలనీ నువ్వు...నా ఎదుట ప్రత్యక్షం అవుతూ...నాకు సరియైన దారి చూపించింది. నీ కోసం యుద్ధానికి వెళ్లాను. ఆ యుద్ధంలో నీ ఆలోచన, నువ్వు నాకోసం పెట్టుకొని ఉన్నావన్న ఆలోచన నాకు ఏనుగుబలం, సింహం శక్తి ఇచ్చినాయి. నువ్వే నన్నెప్పుడు కాపాడు కొంటున్నావు అన్న గాఢమైన నమ్మకంతో ముందుకు చొచ్చుకు వెళ్లేవాడిని."

"నా...నా...మీద...నీప్రేమ ఏమీ పోలేదు?"

"ఏలా పోతుంది. పోలేదుకదా మరీ కోటిరెట్లు పెరిగి పోయింది. నువ్వుకోరితే అన్నీమాని మన ఊరు ప్రయాణం కడ్తాను."

ఆమె కన్నులు వెలిగిపోయాయి. అప్పుడే పాల సముద్రంలో దివ్యకమలంతో ఉద్భవించిన లక్ష్మిలా ఆమె తేజరిల్లిపోయింది. ఆమె పదిమంది చూస్తున్నారని సిగ్గయినా లేకుండా భర్త పాదాలకడ మోకరిల్లి నమస్కరించింది. వెంకట్రావు ఆమెను లేవనెత్తి హృదయాని కదుముకొన్నాడు. సంధ్య చీకట్లు ఆవరిస్తున్నాయి. రాజఘాట్ పవిత్ర చైత్యంపై సాయం సంధ్యాదేవి అరుణకాంతులు వెలిగించింది.

నరసింహమూర్తి మేష్టారు తనలో ఒక నూతనానందం పాలవెల్లువలా పొంగిపోగా ఆ దంపతులను యమునానది తీరాన్నే వదిలి తాను రాజఘాట్ కడ ప్రార్థిస్తూ కూర్చున్నాడు.

చీకట్లు ఆవరించాయి. జగమంతా దీపావళిలా దీపాలతో నిండింది.

“ పద్మా ! ”

“ బావా ! ”

“ నువ్వు బి. యే., కూడా పూర్తిచేయాలి ! ”

“ మీరు తలపెట్టిన సినీమా పూర్తి చేయండి ! ”

“ మనకథే కొంచెం మార్చి, పేరులు మార్చి తీయిద్దాము. ”

“ ఛా ! సిగ్గు కాదండీ ! ”

“ నా గీతాదేవి ! నా ఆత్మలో అధి వసించి ఉన్న పద్మా ! ”

ఆమె అతని ఒడిలో తలనుంచి అతని పాదాలు హృదయానికి అదుముకొంది.

జాజిపూల పరిమళాలు జగమంతా నిండిపోయాయి.

“ ఓం అసతోమా సద్గమయ !
తమసోమా జ్యోతిర్గమయ
మృత్యోర్మా అమృతం గమయ. ”



# నిష్ఫల వైరాగ్యం—

శ్రీ ఆర్. సోమసుందర్

అర్ధరాత్రి...సంసార విరక్తుడైన ఒక సాధకుడిటు అన్నాడు—“ ఈశ్వరాన్వేషణకై సంసారమును పరిత్యజించుటకిది యెంతటి యుత్తమ సమయం ! అబ్బా ! నన్నెవ్వరు యింతవరకూ మాయాజాలంలో పడద్రోసినారు ? ”

ఈశ్వరుడు నర్మోక్తిలో ‘ నే ’ నన్నాడు. కాని భావి విరాగి ఆ పలుకును ఆకర్ణింపలేదు...

పాన్పుకొకమూల బిడ్డను యెదకదుముకొని అతని భార్య దీర్ఘసుషుప్తిని మునిగియుంది. వారిని భావి విరాగి పరికించి—“ నన్ను యింతవరకూ మూఢుని గావించిన వీరంతా యెవరు” ని మరీ పలికినాడు.

“ అంతా నేనే ”—అని వాణి జవాబిచ్చింది. కాని అతడు ఈ పలుకులను కూడ వినలేక పోయినాడు.

కలలో కెవ్వుమని కలవరించి బిడ్డ తల్లిని హత్తుకొని ఆమె ఒడిలో దూరింది.

“ ఓయి మమతాహీనుడా ! నిలు, నిలు. నీ సంసారమును పరిత్యజింపకు ”—మని ఈశ్వరుడాదేశించాడు. కాని విరాగి ఆ ఆజ్ఞనుకూడ వినలేదు.

జగదీశ్వరుడు నిట్టూర్చినాడు. “ నన్ను త్యజించి నన్నే అన్వేషించుటకై నా దాసుడెందుకో సంచరింప వాంఛించుచున్నాడు ”—అని వాపోయినాడు.

—గురుదేవు రవీంద్రుడు



# "తీరిక సమయాల్లో లలిత కళలు"

* శ్రీమతి పి. సుభద్ర *

ప్రపంచంలో భారత దేశం లలితకళల విషయంలో పేరు ప్రతిష్ఠలు సంపాదించింది. మన పూర్వీకుల అపార కృషిని కొంత కాలం మనం విస్మరించినా, తిరిగి కళాభ్యాసనకు పూనుకోడం భావి అభ్యున్నతికి శుభ సూచకం.

ఒకనాడు భారత దేశం కళాకౌశలానికి పుట్టినిల్లు అనిపించుకొంది; మన లలితకళలు మహోన్నత శిఖరాలను అందుకొన్నవి; మన కళానైపుణ్యాన్ని కళ్లార చూచి వెళ్లుటకు విదేశీయులు మన కళాకేంద్రాలకు యాత్రలు సాగించేవారు.

తీరిక సమయాల్లో స్త్రీలు పూరక ప్రొద్దుపుచ్చడంకంటె కొన్ని లలితకళలను అభ్యసించి మనోవికాసాన్ని పొందడం సముచితంగా వుంటుంది. చూడండి—ప్రతి గృహిణి సులభంగా అభ్యసించగలిగిన విద్యలు ఎన్నో ఉన్నాయి. వీటికి చెప్పుకో దగినంత పెట్టుబడిగాని, పరికరాలుగాని అవసరం లేదు. ఒక కుట్టుపని విషయం పరిశీలిద్దాం. దీనికి ఏమేమి కావాలి? సూదులు, నూలుదారం, ఉల్లు యింతేగదా? వీటితో ఎంతో అందమైన వస్తువులు తయారు చేయవచ్చును గదా? పిల్లలకు ఈ అల్లిక పని సులభంగానే నేర్పవచ్చు. కళాదృష్టితో ఈ విద్యను అభ్యసిస్తే ఎంతో ఉత్తేజకరమైన వస్తువులను తయారుచేయడానికి వీలుంటుంది. గృహాలంకరణానికి శోభనుకూర్చే కర్టనులు, మేజాగుడ్డలు, పడకల మీద దుప్పట్లు, పిల్లల ఉడుపులు మరి ఎన్నో విధాలైన బట్టల మీద కళాకౌశలాన్ని ప్రదర్శింపవచ్చు. వీటి తయారి వల్ల కొంతవరుమానాన్ని సంపాదించి, తద్వారా కుటుంబ ఆదాయాన్ని పెంపుచేసుకోవచ్చు. సరైన దృష్టితో యీ విద్యను అభ్యసిస్తే అభ్యాసకుల దృక్పథంలో కళాకాంతులు వినూతనమైన వెన్నో పొడసూపక మానవు.

విశ్రాంతి సమయాల్లో స్త్రీలు తమ కుటుంబాలకు కావలసిన బట్టల్లో కొంతైనా సంపాదించడానికి శ్రమించాలి. యీ విషయమై మహాత్మాగాంధి ఒకప్పుడు యిలా అన్నారు: "నన్నడిగితే స్త్రీ విధులలో నూలు వడకడం ముఖ్యమైంది అంటాను. పురుషుడు పొలాలుదున్ని పండిస్తే, స్త్రీ నూలు వడికి బట్టలు నేయిస్తుంది. ఈ విధంగా స్త్రీ పురుషులు జీవిత రంగంలో అన్యోన్య సహాయం చేసుకుంటూంటే దేశం సుభిక్షంగా ఉంటుంది. నూలు వడకడం దేశాభ్యుదయానికి ముఖ్యం. తద్వారా స్త్రీలు దేశసేవ చేస్తున్నారన్నమాట." అంటే ఖద్దరు పరిశ్రమకు స్త్రీ వెన్నెముక యని వారి అభిప్రాయం.

సంగీతం అతి చక్కని విద్య. స్త్రీలు సహజంగా మంచి శారీరాన్ని కలిగి వుంటారు. సంగీతాభ్యసనంలో ఒక ఆధ్యాత్మిక ఆనందం మేళవిస్తుంది—కళారాధకులకు కలిగే ఆనందం శ్రోతకుకూడ లభిస్తుంది. జీవితానికి వికాసాన్ని, ఆనందాన్ని యివ్వగలిగే శక్తి సంగీతానికి అద్వితీయంగా వుంటుంది. మన కర్నాటక సంగీతశాస్త్రం పునరుజ్జీవింప చేయబడే మంచిరోజులు వస్తూ వున్నాయి. మన త్యాగరాజు పెంచిన సంగీత తరువు మహా వృక్షమై తన తియ్యని ఫలాలను ఆంధ్ర దేశానికేగాక, అరవదేశానికంతా అందజేసింది. ఆ మహనీయుని రచనలు, మన సంగీతానికి స్వాభావికమైన భావసంపదను, కళారూపాలను ప్రతిబింబిస్తున్నాయి. కళ స్వేచ్ఛగా అభివృద్ధి పొందిననాడే యిటువంటి వైవిధ్యమూ, సృజనాత్మక భావశబలత రూపొందుతాయి. భారత పౌరుని కదలించే విషయాలు—శాంతి, నిర్మాణాత్మక కృషి—మన సంగీతకళలో ప్రతిబింబించాలి. మన సంగీత రచనలు నూతన భావాలకు, నవనవోన్మేషమైన సృజనాత్మక చిత్రణకూ, గాఢమైన సజీవ వ్యక్తీకరణకూ పేరుపడ్డవిగా వుండాలి.

సంగీతంలో వుండే మహావిశేష మేమంటే మానసికంగా ఏ వ్యక్తి అయినా ఏ విధమైన సంగీతం నచ్చితే దాన్నే అభ్యసనం చేయవచ్చు. మగవారికంటే మగువలు వ్రేళ్లతో సున్నితంగా వాయిద్యాలను పలికించడంలో ప్రతిభను చూపగలరు. ప్రపంచములో ఎన్నో వందలరకాలై

వాయిద్యాలున్నాయి కదా? కాని మన వీణకు సరిపోల్చ గలిగిన వాయిద్యం ఒక్కటైనా వుందా? వీణకు వీణేసాటి. బ్రహ్మనాదాన్ని ప్రతిబింబించే మహా ప్రభావం దీనిలో వుంది. ఇట్టి పవిత్ర వాయిద్యాన్ని చేపట్టగలిగిన గృహిణి జీవితమే సార్థకం. మన నవనాగరిక హార్మోనియాన్ని ఎంత సిద్ధహస్తులు వాయించినా సరే వీణ పలుకును పలికించ గలరా? నాదస్వరం, పిల్లనగ్రోవి, ఫిడీలు, మృదంగం, కంజీర, వాయిద్యాలు మనసును ఎంతో రంజింప జేస్తాయి. ఏదో ఒక వాయిద్యాన్నయినా అభ్యసించి కళోపాసకులం కావడం మన పవిత్ర ధర్మం.

నాట్యం లలితకళలకు రాణివంటిది. ఆవేశం, ఊహ, విజ్ఞానం వున్నవారు యీ విద్యను ఆరాధిస్తే దానిశోభ సర్వజనామోదాన్ని పొందగలగడం తప్పనిసరి. ఇది శారీ రకంగానే గాకుండా మానసికంగా గూడ వికాశాన్ని కలిగిస్తూంది. నేడు మన సీమలో భరతనాట్యంలో అభిరుచి జాస్తి అవుతున్నది. మన బస్తీలో వుండే స్త్రీలకేగాకుండా, గ్రామాల్లో వుండే మగువలకు కూడ తీరిక సమయాల్లో అభ్యసించడానికి అనువుగా సంగీత, నాట్యమందిరాలు నెలకొల్పాలి. కళాదృష్టితో చూస్తే మన భరతనాట్యానికి సరిపోయినది ప్రపంచంలో మరేదేశంలోగాని లేదనే చెప్పాలి. అంచేతనే దాని కౌశలాన్ని చూచిన విదేశీయులు ముగ్ధులై పోతున్నారు. ఈ దశాబ్దంలో మనదేశంలో నాట్యకళకు మంచి ప్రాముఖ్యత ఏర్పడింది. ప్రతి సీమలోను నాట్యకళారాధకులు వుంటున్నారు. పరదేశాల కెళ్లి మన కళాప్రౌఢిమను ప్రకటించే శక్తి సామర్థ్యాలుగల యువతు లనేకమంది నేడు రంగస్థలంలో వున్నారు.

స్త్రీలు తీరిక సమయాల్లో శిల్పం, చిత్రలేఖనం ద్వారా పల్లె ప్రజలకు కావలసిన కళాన్విత వస్తుసామగ్రిని కూడ తయారు చేయవచ్చు. ఈ లలిత కళా పరిశ్రమలో స్త్రీకే ప్రత్యేకత వుంది. స్త్రీ సహజంగా కళాస్వరూపిణి—ఆనందదాయిని—ఆమె హస్తస్పర్శలోనే కళ పుడుతుంది. కృష్ణాజిల్లాలోని కొండపల్లి బొమ్మలు, ఏలూరు తివాసీలు చెన్నపట్టణం బొమ్మలు, మైసూరు సిల్కుచీరలు, బందరు కలంకారీ అద్దకం, తిరుపతి చందనపు బొమ్మలు, తిరువాన్కూరు, విశాఖపట్టణపు దంతపు చెక్కడాలు—స్త్రీలు పనిచేస్తూన్న లలితకళా పరిశ్రమలకు యింతకన్నా ప్రత్యక్ష నిదర్శనాలు ఏమికావాలి? ఈ విధంగా మన దేశంలో స్త్రీలు సంగీతంలో, చిత్రలేఖనంలో, నాటక కళలో, క్రీడలలో తమతమగల సామర్థ్యాన్ని పెంపొందించు కోవాలి.

నిజమైన కళ ప్రజల ఆత్మనూ, వారి అంతర్గత మనోభావాలను, ఆశయాలను, ప్రతిబింబిస్తుందని ఒక పురాతనమైన సూక్తివుంది. స్వభావంలోను, స్వరూపంలోను, వైవిధ్యం గలిగిన లలిత కళలలోని ఉత్తమ రచనలు నేటి జీవితంలో గల ముఖ్యఘటనలను ప్రతిబింబించాలి. ఇవన్నీ మన దేశ ప్రజల జీవితానికీ, ఆదర్శాలకు సంబంధించిన స్పష్టమైన రూపచిత్రాన్ని చూపాలి. శాంతి! ప్రతి భారత స్త్రీ హృదయకుహరంలో ప్రతిధ్వనించేది యిదే. కళారచనలు ఆనందాన్ని, శాంతియుతమైన కృషిని ప్రతిబింబించాలి. శాంతి! మన కళలో సాధారణంగా కానవచ్చే ముఖ్యాంశంగా వుండాలి. శాంతికి అంకితం చేయబడిన చిత్రాలు తక్కిన వాటన్నిటికంటె, మన కళాకారులకు ప్రజలతోగల సన్నిహిత సంబంధాన్ని వ్యక్తపరచుతున్నాయి. దివ్య శాంతిగానం—మన కళకు చుక్కాని.

భారత నారీమణులు పరిశ్రమిస్తే లలితకళలో సాధించ రానిది అంటూవుండదు. అంచేతనే ఓ మహాకవి "ముదితల్ నేర్వగరాని విద్యగలదే ముద్దార నేర్పించినన్" అని సత్యాన్ని చాటి చెప్పారు.

జై భారత్

(ఆలిండియా రేడియో సౌజన్యంతో.)



# శాపం

* శ్రీమతి ఎ. మంగతాయారు *

[కుళ్లు, కపటాలకు, మాయ మోసాలకు నిలయా లయ్యాయి గ్రామాల్లోని నేటి రేషను షాపులు. సక్రమ పద్ధతిలో ప్రభుత్వము రేషను అమలు జరుప లేకున్నారు. అన్యాయాక్రమాలు తొలగించాలంటే ప్రభుత్వము వెంటనే రేషను రద్దు చేయుటయే ఉత్తమమైన మార్గం.........రచయిత.]

సుబ్బారావు, రేషను షాపు గుమస్తా.

చంద్రమ్మ, తూర్పునుంచి క్రొత్తగా వచ్చిన హరిజన స్త్రీ.

సుబ్బారావు : ఛీ, ఛో, అవతలికి పతుందా లేదా? ఎందు కంత అబద్ధాలు.

చంద్రమ్మ : నూవ్వా, నేనా అబద్ధమాడేది. 5 రు॥లు పుచ్చుకు నేదంటావు. మాలోళ్లంగదా అని యిట్టం వచ్చినట్టు బొంకేత్తున్నావు. మాకు కులం ఫధానం గాదు. గునమే పధానం.

సు : అయితే నేనే అబద్ధ మాడుతున్నానంటావా. యింత ట్లోకే ఎక్కడెట్టాను. నువ్వేచూడు. నిజంగా యిస్తే ఆ పెట్లోనే పడేద్దును. నువ్వివ్వాలేదు. నేనెక్కడా పెట్టాలేదు. అల్లరి చేయక మర్యాదగా అవతలికి నడు లేకపోతే గెంటేస్తాను.

(సుబ్బారావు బియ్యం మూట లాక్కున్నాడు)

చం : బాబోయ్. సుబ్బారావుగోరు. నాను సత్తెంగా సెపుతున్నా. నా యిద్దరి బిడ్డ పమాణంగా నా నిచ్చి నాను. రెండు రెండు రూపాయిల కాయితాలు ఓ రూపాయి యిచ్చినాను. నేదంటారేంటి బాబు?

(చంద్రమ్మ గొల్లుమని ఏడవటం మొదలెట్టింది)

రేషను షాపు చుట్టూ జనం పోగడ్డారు. (చంద్రమ్మ చెప్పుకోవడం మొదలెట్టింది.)

చం : బాబయ్యా. నాయం సొప్పండి. డబ్బేందే బియ్యం ఎలా కొల్చినారు. బియ్యం మూట కట్టుకుంటున్నాను బాబు. మూట నాక్కుని, నువ్వు డబ్బీనేదు ఎలా పట్టు కెడతవాంటున్నాడు నూడండి బాబు. నాకు సత్తెమే పధానం.

సు : నీ యేడుపుల కెవరూ దడవరు. ముందవతలికి నడు. నాపని చెడుతూంది. ఇదేం గోలండీ. ఎంత మందికి బియ్యం యివ్వటంలేదు. డబ్బు పుచ్చుకోవటం లేదు. యిలాంటి గొడవెప్పుడేనా వచ్చిందా? పోనీ నేనొక్కడనే వున్నానుటండీ, పంతులు లేడూ యిక్కడ. యిలాంటి దాన్నెక్కడా చూడలేదు.

చం : ఆలకించండి బాబయ్యా. మా మనిషికి వంటో సుఖం నేదు. సంటిబిడ్డ తల్లినైనా నానే పన్లో కెల్తున్నాను. 10 రోజుల కూలి పెద్దయ్యగోరు తిప్పి, తిప్పి, ఈరోజే యిచ్చినారు బాబు. మా మనిషికి తెగు లొచ్చినప్పటి నుంచీ పూటతింటే పూట నేదు. నాయంగా యిత్తేనే యిచ్చాడు — లేకపోతే......(చంద్రమ్మ మాటన బోయింది. ముఖం ఎఱ్ఱబారింది. మనస్సొక్కమాటు మారింది. యింకేమీ మాటన్లేకపోయింది) బాబా యిదంతా నాబిడ్డ ఖరమం అంటూ కళ్లనీళ్లు తుడుచు కుంది.

వచ్చిన వాళ్లు చంద్రమ్మని నిజంగా యిచ్చావా అనే వాళ్లొకరు, ఎక్కడేనా పారేసుకున్నావా అనేవాళ్లొకరు. సుబ్బారావుని మాత్రం ఎవరూ ఏమన లేకపోయారు. ఆ ఊరి పెద్దలందరకు, ధనవంతులకు, ఎక్కువగ పంచదార కావా లన్నా బియ్యం కావాలన్నా అతనిదే సప్లయి. ఇదేటయి ములో ఆ గ్రామంలో ధనవంతులు, అయ్యంగార్లు, కర్ణం గారు బస్సుకోసరం వెడుతూ ఈ గొడవచూసి కొట్లోకెళ్ల

బోయారు. చంద్రమ్మ కర్ణంగారి కాళ్ల మీదపడి ఏడుస్తూ.

చం: సూడండి బాబా మీరు పెద్ద బాబులు. నాయం సెపుతారు. 5 రూపాయ లిచ్చినాను. ఈ నేదంటాడు.

కర్ణంగారు: ఏయ్ నడు నడివతలికి. అదెక్కడ మఱచి పోయావో. బుద్ధుందా లేదా? పైగా యిదంతా అల్లరి చేస్తున్నావు.

చం: ఆ! మీరుకూడా యిదేమాటా. నాయం సెపుతారను కున్నా.

(అంతవరకూ ఏడుస్తున్న చంద్రమ్మ ఒక్కమాటు రౌద్రరూపం దాల్చింది. అన్యాయ పిశాచాలు ఆమెకళ్ల యెదుట నాట్యం చెయ్యడం సహించలేక పోయింది.)

చం: అవును బుద్ధి నేదు. అంతా వుల్లు. సత్తెం నేదు. నాయం నేదు. మీలాంటి పెద్దలే ఈసెల కీసెల పణద్దార, బత్తాలకు బత్తాలు బియ్యం మాలాంటోళ్ల నెత్తికొట్టి యింటికి జేరేసుకుంటరు. ఏం జయం బాబు మీకిది. అందుకనే మీరునాయం సెప్పనేరు. మీలాటి కామందుల బలం మాముకుంటే ఈన మమ్మల్ని మాయసేసి మోసం జేత్తుండరు.

బాబూ, సుబ్బారావుగోరు. నానెప్పుడూ ఒవర్నీమాట న్నేదు. నామాటకే సత్తెంవుంటే, నానే నిజం సెపితే నారెక్కల కట్టం తీసుకున్నందుకు, తెల్లారేసరికి భూమంతుని మాత్తెం కనిపిత్తందిసూడు. నామాటకు తిరుగునేదు.

అయ్యంగారు: ఒరేయ్ వెంకన్నా, దీన్ని రెక్కట్టుకు గెంటురా. మహా పోగరు మోతుదానిలావుంది.

చం: బిడ్డనోటి కాడ కూడు పడగొట్టినరు. (అంటూ చంద్రమ్మ వెనక్కు తిరిగి చూడకుండా వెళ్లిపోయింది.)

మర్నాడు సుబ్బారావు మూడవ కూతురుకు అకస్మాత్తుగా పిల్లలకొచ్చే జబ్బు వచ్చింది. డాక్టరు పెదిమ విరచాడు. సుబ్బారావు భార్య భోరున ఏడ్చింది. సుబ్బారావుకు చంద్రమ్మ జ్ఞాపకం వచ్చింది. న్యాయదేవత నవ్వింది.



# ఏది అభ్యుదయ మార్గము?

* శ్రీమతి పి. సుశీల *

ప్రస్తుత మధ్యతరగతి కుటుంబాలలో సంస్కరణ అంటే సరిపోదేమో అనుకుంటా! ఆడపిల్లల వివాహాలలో జరిగే అవకతవకల మూలంగా కలిగే అసంతృప్తి ఒక వంక; నాగరికతా చిహ్నమైన చదువు చదివించాలనే ఆశయాలు మనసులో బాధిస్తాంటే, విద్యాభివృద్ధికి దారితీయడాన్కి కుటుంబాలలో వెనుకపడిన అభివృద్ధి నిరోధక వ్యక్తులవలన వచ్చే అడ్డంకులను తట్టుకునే శక్తికోరకు పెనగులాట మరి యొక వంక, బాధిస్తూ వుంటాయి. ఇంక మూడోవిషయం సమాజంలో పెద్దలు నిర్వహించే బాధల్యే ఒకటివుంది కనుక, ఆర్థిక పరిస్థితులు చక్కగా లేకపోవడంవలన నిర్ణీత వయస్సురాగానే ఒక అయ్యచేతిలో స్త్రీని పెట్టి బాధ్యత ఒదిలించుకునే ప్రయత్నం. ఇన్ని ప్రతిబంధకాలవలన మరొక గత్యంతరం లేక మధ్యతరగతి కుటుంబ మర్యాదలు, సాంప్రదాయాలు, దృష్టిలో పెట్టుకొని భవిష్యత్తు నిర్ణయించవలసి యుంటుంది.

ఏమనండి, సమాజములో ఆడవాళ్ల ఆర్థికపరిస్థితులు, అభివృద్ధికాలేదు! చదువుకొన్న స్త్రీలైనా కొద్దిమంది. పైగా చదువుకున్న స్త్రీలలో, ఉద్యోగము నిర్వహించే స్త్రీలెంతమంది అంటే వేళ్లమీద లెక్కించ వచ్చును గదా! ఆ కొద్దిమందైనా, స్వతంత్ర ఆర్థిక జీవనంకొరకు సమాజాభి వృద్ధికి ఏదో ఒక పాత్రను నిర్వహించుతూ వుండడం అభ్యుదయమే!

అంత మాత్రము అభ్యుదయమని తలచి ఊహించే వాళ్లు, ప్రోత్సహించే వాళ్లు కొద్దిమంది ఉన్నా సముద్ర ములో కాకిరెట్టలా వాళ్ల కంఠం ఎవరికి వినిపిస్తుంది.

అనైక్యత, అసౌఖ్యతచేత, ఆ నాలుగు గోడలే ప్రపంచ ప్రాకారాలుగా భావిస్తూ స్త్రీలకు ఆ స్థానమేవుచితమని అను కుంటూ, అందుకుగాను సమాజ ప్రతిబంధకాలు బిగిస్తూ, జరిగే అవకతవకలకు కర్మసిద్ధాంతాన్ని స్త్రీ జాతి నెత్తిని రుద్ది తమయొక్క విశ్రాంతి స్వేచ్ఛలకోసం క్లబ్బులు, పార్కులు, సినిమాలుచుట్టూ లేదా, జార గృహాల చుట్టూ తిరుగుతూ, అదే పెద్ద సంస్కరణగా భావిస్తూన్న ఈనాటి నవనాగరీక వ్యక్తులు స్త్రీ జాతి అభివృద్ధి కొరకు పీసమైన కృషి చేయ డంపోయి, వీరైతే ఒకరాయి స్త్రీ మీద (అపనిందలు) వేద్దామనుకునే ఈనాటి సంస్కరణే చాలామందికి పురుషు ల్లో కనిపిస్తూంది. వీరితోపాటు సమాజంలో సనాతనంగా కరడు గట్టుకుపోయిన స్త్రీలు, ఈ పరిస్థితుల్లో కొట్టుకు పోయి స్త్రీ స్థానం నాల్గుగోడలనే సిద్ధాంతాన్ని బల పరుస్తున్నారంటే ఆశ్చర్యమేమీ లేదంటాను!

అభివృద్ధి నిరోధకులు తమ స్వార్థానికి అడ్డు తగిలే ప్రతీ సమస్యా సమాజంలో పెద్ద తప్పుగా భావిస్తారు. గోరంతలు కొండంతలుగా చిత్రిస్తారు. ఇటువంటి సమాజ వాతా వరణంలో కూడా అనేక కుటుంబాల్లో చొరవగలిగిన కొంతమంది పురుషులు తమ కుటుంబంలోని స్త్రీల పాత్రగుర్తించి వారి అభివృద్ధికొరకు విజ్ఞానంకొరకు పాటు పడుతున్నందుకు చాలా సంతోషించ వలసినదే! కాని ఇంకా కొన్ని చిక్కులలో సతమత మవుతూన్న కుటుంబాల పరిస్థితి చూద్దాం!

అమ్మాయిని ఉద్యోగములో తన భవిష్యత్తును తాను నిర్ణయించు కొనడాన్కి తన వ్యక్తిత్వముతో పాటు ఆర్థిక స్వతంత్రము కల్పించాలా? లేదా? నిర్వచనమైన సనాతన సమాజాచారాలలో కొట్టుకు పోవడమా? ఏది వాంఛ నీయం? అనే సమస్యలతో సమాజంలోని చాలా కుటుంబాలు సతమతమవుతున్నాయి.

ఈ రోజుల్లో ఆడపిల్లలను కొద్దో గొప్పో అందరూ చదివిస్తూనే వున్నారు. అయితే చదివిన వాళ్లంతా, ఉద్యో గాలు నిర్వహిస్తున్నారా? లేదు. అంతా చదివించడంలో గల ఆంతర్యము ఏమీ లేకపోవచ్చును. అమ్మాయికి ఏ పెద్ద చదువుచదివిన మొగుడో వస్తాడనో లేక కుటుంబ గౌరవం కొంత పైకివస్తుందనో అంతే. అయినా ఇవీదీ ఒక మెట్టు ముందుకు రావడమే! ఇది సమాజములో అంతర్గతముగా పొందే పరిణామాలలో, ఒక దశకువచ్చి అంతకంటె ముందుకు పోవడాన్కి దారులులేక అక్కడితో ఆగిపోవలసి వస్తూంది.

# ఏది అభ్యుదయ మార్గము?

ఆ అడ్డును విచ్ఛిన్నంచేసి సరిహద్దులను దాటి ఇంకొక అడుగు ముందుకు వేసే వుదాహరణలు వున్నాయి. సంస్కరణ, సమాజ మర్యాదలు, ఈ రెంటిలో ఏది ప్రాధాన్యత వహిస్తుంది, అనడంలో, కుటుంబ మర్యాదలు సమాజ అడ్డంకులే ప్రాధాన్యత వహిస్తున్నాయి. అమ్మాయిలే తీరా వుద్యోగము చేస్తుంటే సమాజం ఇచ్చే దీవెనలతో (నిందలు) సరైన సంబంధం కుదురదేమో ననే బెంగ కూడా వుంది. ఆడపిల్లలుగల మధ్యతరగతి కుటుంబాలు స్త్రీ ఆర్థిక ప్రతిపత్తికి కృషిచేయాలంటే, ఇన్ని తీరని సమస్యలు! వీనిలో ఆలోచిస్తే ముందడుగా, వెనుకడుగా అనే సమస్య చదువుకొన్న స్త్రీల విషయంలో ప్రత్యక్షమౌతూంది.

అందుకనే స్త్రీల దృష్టిలోకూడ, స్త్రీ చదువులో వెనుకబడ్డా వుద్యోగం చెయ్యాలా ఊళ్లేలాలా? అనే కనీసపు అభిప్రాయంవుంది. ఇంకో చిన్న విషయం, స్త్రీని డబ్బుపెట్టి చదివించినా, మళ్లా వరకట్నాలు తప్పవాయె, మగవాడిని చదివిస్తే కలిసివస్తుంది అనే ధోరణిలో ఆడపిల్లకు ఏదో నామమాత్రపు విద్యతో స్వస్తి చెప్పిస్తున్నారు.

ఈ రెండూ నిర్వహించిననాడే దేశాభ్యుదయానికి దోహదం ఇస్తుంది స్త్రీల ఆర్థికస్థితి ఆనాడే చక్కబడుతుంది. చరిత్రలో స్త్రీలు నిర్వహించిన పాత్రలను గురించి ఈనాడు మనం పురాణాల్లో కట్టుకథలవలె చదువుకు ఆనందించడమేగాని, అనుకరించుట జరుగుట లేదు. ఆ నాటి స్త్రీల కార్యదక్షత మనలను ముగ్ధులను చేస్తూంది.

పైగా అది సత్యకాలం కనుక చెల్లిందనవచ్చు. లేదా ఆ వుద్యోగాలకు పొట్ట చేత్తో పట్టుకున్న వాళ్లకే చెల్లిందనచ్చు. ఈ నిర్వచనాలు చేస్తో, స్త్రీ ఆర్థికహక్కులు అనుభవించలేదని మర్యాద భంగం అనే సాకులతో స్త్రీకి పరిధులు ఏర్పడ్డాయి. క్రిష్టియన్ మతములో చూడండి. ముందు స్త్రీకి పురుషునితో సమానంగా ఆర్థిక అభివృద్ధికి దోహద మిస్తారు. వివాహాలు కూడా అటువంటి స్త్రీలకే కట్నకానుకల బాధ లేకుండా అవుతాయి. ఈ పద్ధతి మనం మెచ్చుకుంటాం. అయితే ఆచరణలో జరిగేది ఇందుకు వ్యతిరేకము.

మన మధ్యతరగతి కుటుంబాలలో తాండవిస్తున్న దరిద్రానికి హేతువు, ఒకరిమీద పదిమంది ఆధారపడి వుండడమే! ఈ ఆర్థిక సమస్యతోపాటు వివాహ సమస్య ముడిపడి వుండడం, వేలకువేలు కొంపా గోడీ అమ్ముకుని ఆ అల్లుడిగార్ని కొనుక్కు తెచ్చుకుంటే వారి అభిరుచులకు నెగ్గితే సరి, లేకపోతే కాపరాలుచెడి, ఆ పిల్లను మళ్లా తమ బాధ్యతల్లోకి తీసుకుని అనేక విపరీత పరిస్థితులకులోను కావలసి వస్తోంది.

ఇటువంటి పరిస్థితుల్లో శ్లేష్మంలోపడిన ఈగవలె కొట్టుకుంటు ఈ రోజున ప్రధాన సమస్యగా పరిణమించిన వాటిని పరిష్కరించడానికి ముందుకు రావడం అభ్యుదయము కాంక్షించడంతో పాటు, స్త్రీ జాత్యభివృద్ధికి దోహదము కాదా!

ప్రస్తుత అధునాతన సమాజ పరిస్థితుల్లో వరకట్నాలు, అల్లుడిగారికే కాక, లాంఛనాల రూపంలో వియ్యపు రాలుగారు, ఆడబడుచులకు కూడా రేట్లువిపరీతంగా పెరిగిపోయాయి. ఇటువంటి పరిస్థితులు సమాజాభివృద్ధికే తీరని చిక్కుగా పరిణమించాయ్! ప్రభుత్వం వరకట్నాలు నిషేధించినా, ఈనాడు, కంట్రోల్స్ వస్తువులమీద వున్నా బ్లాక్ మార్కెట్ ఎల్లా బాహాటంగా సాగిపోతూందో, అల్లాగా చట్టము వున్నా కట్నాల బ్లాక్ మార్కెట్ ధరలు రోజురోజుకు పెరిగిపోయి, చితికిపోయే కుటుంబాలను, నేలమట్టం త్వరగా చేస్తున్నాయ్!

ఈ సమస్య పరిష్కరించడం ఆడపిల్లలను ముందుకు వచ్చి చదివించడం వరకే కాక అవకాశాలున్నంతవరకు, వివిధవృత్తులలో వారుజేరి, ఆర్థిక స్వాతంత్ర్యం పొందే విధానాన్ని ప్రోత్సహించటం, అప్పుడుగాని సమాజము ఉన్నతిని పొంది, వివాహము మొదలుగాగల అన్ని సమస్యలూ పరిష్కరింపబడేవు. (ముఖ్యంగా ఆర్థిక చిక్కులను తొలగించుకోడానికి కూడా)

"దేశ సౌభాగ్యానికి ఆర్థిక విధానం ఎంత గీటురాయో, కుటుంబ గౌరవ మర్యాదకు ముఖ్యంగా నైతిక జీవితానికి ఆర్థిక స్వాతంత్ర్యము అంత ముఖ్యమనడంలోసందేహములేదు."

మన దేశానికి ఆర్థిక స్వతంత్రం లేక పోవడంవల్ల పెట్టుబడి దేశాలకు ఏ విధంగా దాసోహమనవలసిన వస్తోందో అవిధంగానే, స్త్రీలకు విజ్ఞానమున్నా ఆర్థిక ప్రతిపత్తిలేని మూలంగా, సమాజ వాతావరణానికి బలి కావలసి వస్తోందంటే ఆశ్చర్యం లేదు!



# కీ. శే. శ్రీమతి రుక్మిణీ లక్ష్మీపతి

* శ్రీమతి కనకమ్మ, శ్రీమతి లక్ష్మీబాయమ్మ *

భారత జనని నేడు మరియొక ఉత్తమ పుత్రికా రత్నాన్ని కోల్పోయింది. స్వాతంత్ర్య యోధులైన వీరయోధులలో ఒక సాధ్వీమతల్లి అస్తమించింది. సరోజినీ దేవివంటి నాయకమణులస్తమించిన కంటితడి ఆరకముందే సోదరి శ్రీమతి ఆచంట రుక్మిణమ్మగారి నిర్యాణవార్త మమ్ములను గాఢ విషాదంలో ముంచింది. దక్షిణావనికే కాదు, భారత భూమికేయిది తీరనికొరత. ఆమె ధన్యజీవి.

శ్రీ రుక్మిణమ్మగారు గొప్ప విదుషీమణి. భారత స్వాతంత్ర్య సమరములో ఆమె నిర్వహించిన పాత్ర అమోఘమైనది. ఆమె సేవా త్యాగములు ఆదర్శనీయములు. మహిళాభ్యుదయమునకు ఆమె చేసిన కృషి అపారము. దేశ సేవలో అడుగు పెట్టినది మొదలు తుది క్షణము వరకు ఆమె ప్రజాహితము కొరకే తనకాలము వెచ్చించినది. జాతీ యోద్యమములు వేనియందును ఆమె వెనుకాడలేదు. కర్తవ్యమును ఎన్నడును ఏమరలేదు. సర్వవిధాల దేశానికి సంఘానికేగాక కుటుంబానికి కూడ ఉత్కృష్ట సేవ చేసి కీర్తి శేషురాలైన ఉత్తమయిల్లాలు. దేశ కల్యాణానికి జీవితాలు అంకితం చేసికొన్న చరితార్థులలో ఆమె యొకరు. స్వాతంత్ర్య వీరనారీమణులైన భారత స్త్రీలలో ఆమె శాశ్వతముగా వెలుగొందగలరు.

మా కామె కేవలము సోదరివంటిది. ఆ ఆత్మీయమైత్రి చిరస్మరణీయమైనది. జైలులో వారు అతి సన్నిహిత మిత్రులలో ఒకరుగా ఉండేవారు. ఈ విషాదవార్త వినగానే అవి అన్నీ కళ్లకు గట్టునట్లయినవి.

శ్రీ రుక్మిణీ లక్ష్మీపతిగారిది మంచి సంస్కార కుటుంబము. వారియిల్లు వచ్చే పోయేవారితో ఎప్పుడూ కలకల లాడుతూ వుండేది. బంధుమిత్రులకు, అతిథి అభ్యాగతులకు వారు స్వయంగా చేసే సత్కార మర్యాదలు ఎంతో ఆదరణీయమైనవి. బీదలపై ఎంతో ప్రేమ వాత్సల్యాలు చూపేవారు. వారి అండచేరి బ్రతుకు తెరువు పొందిన వారూ, వారి నాశ్రయించి ఉన్నతి చెందినవారూ ఎందరో యున్నారు. ఆమె నిరాడంబరము శ్లాఘనీయము.

ఆమె ఎన్నో పదవులు నిర్వహించినారు. శాసన సభలు ఎన్నికలలో తొలిసారిగా పాల్గొని గెలుపొందిన మొదటి స్త్రీ ఆమె. మద్రాసు రాజ్యాంగములో మంత్రిపదవి నిర్వహించిన ఏకైక మహిళామణి కూడ ఆమెయే. ఇంకను మద్రాసు అన్నామలై యూనివర్సిటీల సెనేటు సభల యందును, అనేక ప్రజా సంస్థలలోను, ప్రభుత్వ కమిటీల లోను సభ్యురాలై విశేష కృషి చేసినది. తన మంత్రిత్వ హయాములో పట్టుదలవహించి మద్రాసు ఎల్. ఐ. ఎమ్. స్కూలును కాలేజిచేసి మెప్పు పొందినారు.

ఏ సభలకైనా అధ్యక్షులుగా రాక తప్పదని ఆహ్వానిస్తే శాంతంగా అంగీకరించి విచ్చేసేవారు. వేదికపైని లిస్తే ఇక సింహగర్జనమే. చక్కని వక్త. ఆధారావాహినికి ప్రేక్షకులు ముగ్ధులు కావలసిందే. అంత చక్కని ఇంగ్లీషుమాట్లాడ గలవారు పురుషులలో నైతము అరుదు.

జాతీయ అంతర్జాతీయ రంగాల్లో ఆమె అత్యంతమూ పేరు ప్రతిష్ఠలు పొందినది. అంతర్జాతీయ మహిళా సభల్లో ఆమె ప్రాతి నిధ్యం భారతభూమికి కీర్తి తెచ్చింది. ఆమె ఎంత విద్యావతియో అంత స్నేహమయి. ఎంత త్యాగ శీలయో అంత సేవావ్రత. మహిళా లోకానికి మాన నీయ మైన చక్కని సంస్కృతీ జీవనాన్ని ప్రదర్శించి ఇహలోక యాత్ర చాలించారు. నిండు జీవితమున షష్ఠి పూర్తిగడచి ఆ పండు ముత్తైదువు బిడ్డలముందు భర్తముందు ఉల్లాసముగా వెళ్లిపోయినారు. ప్రశాంతముగా కన్నుమూసి భారత స్త్రీ కోరుకునే పరమ పదవి ప్రాపించింది ఆ పుణ్యవతి.

అసత్తునుండి సత్తుకు, తమస్సునుండి జ్యోతిస్సుకు మృత్యువునుండి అమృతమునకు నిర్గమించిన ఆ పవిత్రాత్మకు సర్వదా జోహార్లు:



# వనలక్ష్మి

* శ్రీమతి అయ్యగారి రాఘవమ్మ *

వనలక్ష్మీ! నినుగన్న నేమొ కొ మదిన్ వేవేడుకల్ పుట్టు నీ
కనుసన్నన్ వశియించి నాకలుగు గాథల్ చెప్పుకొందమ్మరో;
యని నిన్నే మనసారగాఁబిలువఁగా నౌత్సుక్యతంజెందు; శ్రీ
వనితా నీదు కరాబ్జమెంత మృదువమ్మా; తెల్పశక్యంబొకో;
ఈ వేలేక నె యున్న నీ జగమెడా రేగాదె; ఓతల్లి! నీ
పూవుల్గుత్తుల రంగు సౌరభములున్ పోషించి వర్ణింప, నా
భావాడంబర వీధి, చాలదిఁక నిన్భావించి కన్మోడ్చెదన్
దేవీ; సందియమేల రమ్మికను హృద్గేహాన పూజించెదన్:

చిన్నారి పొన్నారి చిఱుతగూండ్లను కట్టు
కొని వశించెడు పక్షికులములెన్నొ
పాంథులాహార పానీయముల్ సేవించి
చల్లగా నిద్రింత్రు చల్లగాలి
ముదముతో నిన్గొల్చి మ్రొక్కుచునుందురు
అతివలు గొందఱారాధ్యవనుచు
ధన్యోస్మి యనుచుంద్రు తల్లి నీ నీడల
సుఖముగాంచెడి యోగిశుభగులెల్ల

అందఱకు నన్ని విధముల నన్ని పోట్ల
నలరి సృష్టిలో నే ముఖ్యాకలనఁ గాంచి
యున్న నీ జీవితంబున నోర్మినెంచి
మ్రొక్కుగురటన్న నెందు సక్కజము గలదె:

కొమ్మ సందులలోన రహస్యలన్ దాచుచు
కాయలఁగని వాని గాఁవమున
బంగారురంగున పచ్చగా పండించి
చతురుత్సవములఁ జాతుఁజేసి
బిడ్డలారా! రండు; ప్రీతితోఁ గొనుడంచు
అందిచ్చుచుండెదు నమితప్రేమ
కోసుకోరరాగో! కూర్మి నాబిడ్డల
టంచు నెంచెదో; అహో మించుగూర్మి

వంగియేయుందు పండ్లతో పొంగుమీర
మధురమధుర మహారసముల మరచి నిన్ను
హాయిగా గ్రోలుచుందురు అమృతమూర్తి
తెలియగలరమ్మ ఏరు నీదివ్య మహిమ:

తెగవేయన్గమ కించువానిఁగనియున్ తీవ్రంబుఁ జూపిం
ప వీవుగదా! సరిదానికేమి; మఱివానిన్గూడ నే మాత్రమున్
వగలన్ జెందఁగనీక నీడలను నాహ్వానించి పూపండ్లతో
తగవిందుల్ పచరింతువీవినతి కాత్మన్ మ్రొక్కెదన్ నమ్రనై:






# కిరణ్ సాహస కృత్యాలు

* వి. కృష్ణమూర్తి *

[వెనుకటి సంచికలో—రత్నాల వ్యాపారియైన కిరణ్ అధిక ధనాన్ని ఆర్జించి ప్రపంచయాత్ర ప్రారంభిస్తాడు. స్నేహితుడు పాజ్ ఓడలో దొంగలుంటారు జాగ్రత్త యని హెచ్చరిస్తాడు. అరేబియన్ సీలో ఓడ ప్రయాణం సాగిస్తూంటే, స్నేహితుని మాటలు స్మరిస్తూ, భయపడ్తూనే ప్రయాణం చేశాడు. కొన్ని రోజులకు ఓడ ఏడన్ రేవును జేరింది. తరువాత——]

కిరణ్ కూడా దిగాడు. తను ఏడన్ లో ఏమేనా కొందామనుకొన్నాడు. కొంతడబ్బు తీసుకొని దిగాడు. తనకి కావలసినవన్నీ కొనుక్కొని ఓడలోకి వచ్చాడు. తాను కొన్న సామాన్లను పెట్టెలో పెట్టాలనుకొన్నాడు. పెట్టె తాళాన్ని తీయబోయాడు. ఆశ్చర్యం!



తాళం తీసివుంది! ఎవరు తీశారు? సందేహంగా పెట్టె తీశాడు. విపరీతం! తాను తెచ్చిన బట్టలు మాయమైనయ్! వెంటనే ఓడ అధికారికి యీ సంగతి తెలిపాడు.

"మీరు ఓడ దిగే ముందు జాగ్రత్తచేసి వెళ్ల కూడదూ? ఇప్పుడిలా అనకపోతే?" అన్నాడు ఓడ అధికారి.

"నేను చాలసార్లు ఓడలో ప్రయాణం చేశాను. ఎన్నో చోట్లలో దిగాను; ఒక్కసారీ యిల్లాగ జరగలేదే!" అన్నాడు కిరణ్.

ఓడ అధికారి తనచేతనైనంత ప్రయత్నాలు చేశాడు. కాని కిరణ్ బట్టలు దొరకలేదు.

"పోనీ! నాకున్న ధనంలో యీ వస్త్రాలు పోతే ఒక లెఖ్ఖా? ఇకమీదనైనా జాగ్రత్తగా వుంటా" ననుకొన్నాడు కిరణ్....

మళ్లీ ఓడ బయల్దేరింది. ఎఱ్ఱ సముద్రంమీద పోతూంది. చాల రోజులకి స్పెయిన్ చేరింది.

కిరణ్ ఎక్కడికి పోతున్నాడో చెప్పటానికి మఱచా. దక్షిణ అమెరికాకి పోతున్నాడు. అక్కణ్ణించి వరుసగా ప్రపంచ ప్రయాణం చేసుకొంటూ తన దేశాన్ని చేరాలనుకొన్నాడు.

తన బట్టలు దొంగతనం పోయాక కిరణ్ చాల జాగ్రత్తగా వున్నాడు. తన సామాన్లలో ముఖ్యమైన దాన్ని—డబ్బును—చాల మెలకువతో చూస్తున్నాడు. ఎంతవరకు తన జేబుల్లో వుంచుకో వచ్చునో అంతవరకు తన జేబుల్లో వేసుకున్నాడు. తక్కిన ధనాన్ని ఎవ్వరి కండ్లా పడకుండా పెట్టాలి. ఎక్కడ పెట్టేది? ఆలోచించాడు: మంచి ఆలోచన తట్టింది. ఆ డబ్బు లుంచిన పెట్టెను గదిలో ఒక మూలలో వున్న లైఫ్ బోట్ (Life Boat) లో పెట్టేడు. తర్వాత దానిపైన తన పరుపుని పఱచాడు. రాత్రి దాని మీాదే పడుకొనేవాడు.

తాను తన దేశం విడిచి చాలరోజులు గడిచాయ్. ఓడ దక్షిణ అమెరికా—ఆఫ్రికాల మధ్య అట్లాంటిక్ సముద్రంలో పోతూంది.

ఒక రోజు రాత్రి కిరణ్ గాఢ నిద్రలో వున్నాడు. స్వప్న సామ్రాజ్యములో షికారు చేస్తున్నాడు. ఏవేవో కూతలు వినబడ్తున్నయ్. గాఢ నిద్రలోవున్న కిరణ్‌కి నిద్రాభంగం కలగ లేదు.

కిరణ్‌కి చలిగాలి తగిలింది. ఎప్పుడూ లేని చలికి కారణం ఏమో! పెట్టెలోంచి కంబళి తీయాలనుకున్నాడు. కన్ను తెఱచాడు—విపరీతం!! కిరణ్ "ఇదంతా కలకాదు కదా! మనం యెక్కడ వున్నాం!" అనుకొన్నాడు. ఏమంటే తాను నడి సముద్రంలో వున్నాడు. ఓడ యేదీ! చుట్టూ సముద్రం!! తాను Life Boat లో వున్నాడు. కిరణ్‌కి బోధపడింది. ఓడ సముద్రంలో మునిగి పోయింది. తాను విన్న కూతలు ఓడలోనివాళ్లవి. తాను Life Boat లో పడుకున్నాడు. కాబట్టి తప్పించుకొన్నాడు. లేకుంటే ఈపాటికి సముద్రంలో మునిగేవాడే కదా! ఆ రోజు ఏడన్‌లో దొంగతనం జరక్క పోతే తన గతి అంతేగా! ఆ దొంగతనం తన మంచికే అయింది. "అంతయు మన మేలునకే" అన్న పెద్దల మాటలు వృథాగా పోతాయా?

"ఆహా! దేముడా! సముద్రంలో మునిగి చచ్చేవాడ్ని విచిత్రంగా బ్రతికించావు. ఇంకా ఎన్ని విచిత్రాలు చేస్తావో కదా!" అనుకొన్నాడు అతను.

తెలతెల వారుతోంది. తానెక్కడ వున్నాడో కిరణ్‌కి అంతా అయోమయంగా వుంది. ఎన్ని రోజులకైనా ఒక దీవి చేరుకుంటామనుకొన్నాడు. కాని అన్ని రోజులవఱకు ఆహారం ఎల్లాగ? తిండిలేక 10 దినాలు వుండొచ్చు. ఆ 10 దినాల్లోనే ఒక దీవిని చేరితే బాగుండునని దేవుణ్ణి ప్రార్థించాడు. చచ్చేవాణ్ణి బ్రతికించిన దేవుడు తనకి ఆహారం యివ్వకపోతాడా అని ధైర్యం తెచ్చుకొన్నాడు.

నాలుగు రోజులు గడిచాయ్. దీవి చేరుకోనే ఆశ పీడిస్తోంది కిరణ్‌ని. అలా ఆకాశం వేపు చూస్తో ఏమో ఆలోచిస్తున్నాడు. పాపం ఓడలోని వాళ్లందరు చచ్చారో కదా! అనుకొన్నాడు. ఐదవ రోజు ఉదయం దూరంగా

ఒక చిన్న దీవి కనబడింది. కిరణ్ సంతోషించాడు. Life Boat తిన్నగా అక్కడికే పోతుందని నమ్మటానికి లేదే! ఐనా చేరగలమని కిరణ్ నమ్మాడు.

కిరణ్‌కి ఐదు రోజులనుండి తిండి లేదు. కృశించి పోయాడు. దీవి చూడగనే సంతోషించాడు. "సంతోషం సగం బలం" అన్నారు మన పూర్వులు. అల్లే అతనికి సగంబలం వచ్చింది. లైఫ్‌బోట్ మెల్లగా ఆ దీవిని చేరింది. కిరణ్ "అమ్మయ్య! బతికా" మనుకొని తన పడవను ఆ దీవిలోకి లాగేడు తాను దిగి. కాస్త సేపటికి భూకంపంలాగ ఆ దీవి అదిరింది. కిరణ్ బెదిరాడు. అది దీవికాదు. ఒక పెద్ద చేప! తన దేహం మీద స్పర్శకలిగే సరికి కదిలింది. కాని కిరణ్‌కి ఏ అపాయం కల్గలేదు. ఆ చేప యీద సాగింది. పడవకన్న చాల రెట్లు వేగంగా పోతూంది. దాని వీపుమీద కిరణ్, తన పడవ (Life Boat) పోతున్నారు. అతను ఎంత సంతోషించాడో అంత దుఃఖించాడు.

కిరణ్‌కి ఒక మేలు కలిగింది. ఏమంటే ఇప్పుడు ముందటికన్నా వేగంగా పోతున్నాడు. తన బోట్‌లో చూచాడు. డబ్బు వుంది. ఆకలి వేస్తోంది. ఎంత డబ్బుండి యేం లాభం? తన ఆకలి తీరిందా? పాజ్ చెప్పినట్లు పంచభక్ష్య పరమాన్నాలు తింటూ హాయిగా బొంబేలోనే వుండిపోయివుంటే ఎంత బాగుణ్ణను కొన్నాడు. కాని యిల్లాగ ఔతుందని యెవరికి తెలుసు? ఇంకా ముందు ఏం జరుగుతుందో కూడా ఎవరికి తెలుసు?

అల్లాగ ఆ చేపమీద ప్రయాణం చేస్తున్నాడు. సాయంత్రం ఐంది. తిండిలేదు. నిద్ర పోదామని తన బోట్‌లో పడుకున్నాడు. నీరసంగా వున్నమూలాన నిద్రపోయాడు.

చీకటి పడుతోంది. కిరణ్‌కి ఏవో మాటలు వినవచ్చె. కళ్లు తెరిచాడు. తానేదో దీవిలో వున్నాడు. చుట్టూ ఎవరో మనుష్యులున్నారు. ఒక మూలలో తాను వచ్చిన చేపవుంది. కిరణ్‌కి ఏమీ అర్థం కాలేదు. లేచి కూర్చున్నాడు. ఆ దీవిలో వున్న వాళ్లు తనకు ఆహారం ఇచ్చారు; తిన్నాడు. తనకళ్లను నాల్గు వైపులా ప్రసరింపజేసాడు. అందులో తనకి పరిచితమైన ముఖాలు రెండు కన్పడినయ్! వ్యాపారం చేసేప్పుడు వాళ్లతో పరిచయం ఐంది.



"మీరిక్కడికి ల్లాగ వచ్చారు?" అన్నాడు కిరణ్ ఆ పరిచితుల్ని చూచి.

"ఇప్పుడు నీవెల్లా వచ్చావో మేం కూడా అల్లాగే—అదుగో (ఆ చేపనిచూచి) ఆ చేప మీదనే వచ్చాం." అన్నారు వాళ్లు.

"ఆ చేప విచిత్రంగా వుందే!"

(ఇంకా వుంది)

★

# చిట్టి తల్లి

*** పీలా మల్లేశ్వర్ ***

అందుకొన రావేమి అందాల తల్లి
అందొస్తె నీ యంద మెవరు తీయాలి ?
పరుగు పరుగున రావె మా పాలవెల్లి
పాలు పండ్లును దెత్తునే పట్నమెళ్ళి
చెంగు చెంగున గెంతు చిట్టి నా తల్లి
చిరునవ్వు చూపవె చిన్న నా రాణి
బాలచంద్రుని మోము బాల మా పాప
బంగారు బంతులు బాబు తెచ్చాడు.
నయగారములు వెలుగ, నయనాల తల్లి
జడలోకి దెచ్చెదను నే జాజిమల్లి.

పరువెత్తబోకు ; నే పాముజడలల్లి
విరులెల్ల తురిమెదను రా పుష్పవల్లి,
ముద్దు చేతులు ఊపు ముత్యాలచుక్క
పట్టుబట్టలు దెచ్చె పెద్ద మీ యక్క.
చిలుక పలుకులు నుడివె చిలుకమ్మ లెల్ల
నీ బోసి మోము కడవాడ వలసిందే!
చెంగు చెంగున రాగ సిగ్గేమి తల్లి ?
పెళ్ళికొడుకుని దెచ్చి నే జేతు పెళ్ళి.
ముంజేతు లందీయమురిపె మా తల్లి !
చిరు చేతులెత్తవే చిట్టి నా తల్లి.

★

# నవ్వులు—పువ్వులు

మేష్టరు : ఏమిరా అబ్బాయ్! శేరు శనగలు నానేస్తే రెండు శేర్లవుతాయి. కుంచెడు నానేస్తే రెండు కుంచాలవుతాయి. అయితే 50 గింజలు నానేస్తే ఎన్నవుతాయ్!

కుఱ్ఱాడు : వందవుతాయండి.

* * *

మేష్టరు : ఈ లెక్క ఎలాచేస్తావురా ? నువ్వే!

కుఱ్ఱాడు : తెలీదండి.

మే : అయితే తెల్సుకోవాలి !

కు : తెలిస్తేకదా !

మే : మొన్న పరీక్షలో 60 మార్కులొచ్చాయ్. ఏ వెధవదగ్గర కాపీకొట్టేవురా వెధవా ?

కు : మీ కుఱ్ఱాడిదగ్గరేనండీ !

★

# ఉద్బోధ

*** శ్రీ యస్. టి. సుదర్శనాచార్య ***

రారమ్మ ! రారమ్మ ! లేచిరారో
సకలైక ముస్లిం హిందూ మ తల్లులారా ! ॥రా॥
రారమ్మ లేచిరారో
రారమ్మ మంగళమ్మీయరారో
మన భారతికి నిత్య శుభమంగళ మీయరారో॥రా॥
మన భారతీవధువు స్వాతంత్ర్యవరుని కోరే !
మన భారతీవధువు స్వాతంత్ర్యవరుని చేరే ॥రా॥

స్వాతంత్ర్య సమరాన సమసిపోయిన సుమాల
మనవధువు జడగుప్పరే
మనశౌర్యమేయొప్పగా ! ॥రా
ఆశలో జనియించి, ఆశలో ప్రభవించి
ఆశలోనే నాశమా మన వీరనారుల
ఆశీస్సులే హారతీ ! మనభారతికి నిత్య
శుభహారతీ ॥రా

★

# ఆంధ్ర మహిళా సభలో

# దసరా వుత్సవములు

అక్టోబరు 8, 9, 10 తేదీలలో ఆంధ్ర మహిళా సభలో, దుర్గాష్టమి, మహానవమి, విజయ దశమి పండుగలు యథాప్రకారంగా, దేవీపూజ, బొమ్మల కొలువు, పేరంటములు, వినోద కాలక్షేపములతో జరిగిపోయినవి. ఆటలు, పాటలు, వివిధ భాషలలో వక్తృత్వము, నాటకములలో పోటీలు జరిగినవి. గెల్పొందిన వారికి విజయ దశమినాడు పెదపవని జమీన్‌దారిణిగారు ఆంధ్ర మహిళా సభ తరపున బహుమానములను పంచిరి.

## వక్తృత్వ పోటీలు

1-10-51 సోమవారం మధ్యాహ్నం 2 గం॥ నుండి ఇంగ్లీషులో ఈ క్రింది విషయములపై వక్తృత్వ పోటీలు జరిగినవి.

| విషయములు : సీనియర్ శాఖకు | సీనియర్ శాఖ | పరీక్షాధి పతులు : |
|---|---|---|
| 1. హిందూ దేశములో ఆహార సమస్య.<br>2. నీవు శాసన సభలో రానున్న ఎన్నికలలో సభ్యురాలుగా నిలబడిన నీ వోటు దారునికి ఏ విధముగా చెప్పెదవు.<br>3. చలన చిత్రములు మన జీవితములను ఏ విధముగా మార్చును.<br>4. హిందూ దేశమునకు సామాన్య భాష.<br>5. గాంధీజీ బోధనలు. | ప్రథమ బహుమతి<br>సుమంగళీ చెట్టియార్<br><br>ద్వితీయ బహుమతి<br>యస్. పద్మావతి | శ్రీమతి ఎస్. కమలగారు.<br>శ్రీమతి కమలా జీవనాథంగారు.<br>శ్రీ శంకర్ నారాయణగారు. |

| విషయము : | జూనియర్ శాఖ | పరీక్షాధి పతులు : |
|---|---|---|
| జూనియర్ శాఖకు<br>ఏదో ఒక పద్య భాగమును భావ యుక్తంగా తప్పులు లేకుండా కంఠత చెప్పుట. | ప్రథమ బహుమతి<br>ఎస్. భానుమతి<br>ద్వితీయ బహుమతి<br>జి. శకుంతల<br>ప్రత్యేక బహుమతి<br>జయశ్రీ | శ్రీమతి ఎస్. కమలగారు.<br>శ్రీమతి కమలా జీవనాథంగారు.<br>శ్రీ శంకర్ నారాయణగారు. |

3-10-51 తేది బుధవారం మధ్యాహ్నం 2 గంటలకు హిందీలోను, తమిళంలోను, ఈ క్రింది విషయములపై వక్తృత్వ పోటీలు జరిగినవి.

| విషయములు : | హిందీ | పరీక్షాధిపతులు : |
|---|---|---|
| సీనియర్ శాఖ<br>1. స్త్రీలపై పాశ్చాత్య నాగరికత యొక్క ప్రభావం.<br>2. ఆభరణములవలన కలిగే లాభ నష్టములు.<br>3. మనో వినోదాలు — ఉత్తమ సాధనలు.<br>4. హిందూదేశంలో ఆహారసమస్య.<br>5. సంఘసేవ—స్త్రీల యొక్క కర్తవ్యము. | సీనియరు శాఖ<br>ప్రథమ బహుమానం<br>కే. నిర్మల<br>ద్వితీయ బహుమానం<br>యస్. నిర్మల | శ్రీమతి నూతలపాటి శారదా దేవిగారు.<br>శ్రీమతి ఆర్. శకుంతలగారు.<br>శ్రీ జనార్థ శర్మగారు. |
| జూనియర్ శాఖ<br>ఒక వచనము ఇచ్చి దానిని భావ యుక్తముగా కంఠత చెప్పుట. | జూనియర్ శాఖ<br>ప్రథమ బహుమతి<br>ఎ. రాజేశ్వరి<br>ద్వితీయ బహుమతి<br>కుసుమ పటేల్ | |

## దసరా వుత్సవములు

### తమిళం

| విషయములు : | | పరీక్షాధిపతులు : |
|---|---|---|
| **సీనియర్ శాఖ** | **సీనియర్ శాఖ** | శ్రీమతి కమలా జీవనాథంగారు. |
| 1. స్త్రీలయొక్క ఘనత | ప్రథమ బహుమానం — బి. సరస్వతి | శ్రీ శంకర్ నారాయణగారు. |
| 2. స్త్రీలు రానున్న ఎన్నికలలో పోటీ చేయుదురా ? | ద్వితీయ బహుమానం — యస్. పద్మావతి | శ్రీ కె.వి. రాజగోపాల అయ్యర్. |
| 3. గాంధీజీ బోధనలు. | | శ్రీ మురుగ విశాఖనంబిగారు. |
| 4. చలన చిత్రములు ఏ విధంగా మంచికై ఉపయోగింపబడును. | | |
| 5. ఆహార సమస్యను ఏ విధంగా తీర్చెదరు. | | |
| **జూనియర్ శాఖ** | **జూనియర్ శాఖ** | |
| విషయము : ఒక వచనభాగమును భావయుక్తముగ, కంఠత చెప్పుట. | ప్రథమ బహుమానం — సుందరవల్లి | |
| | ద్వితీయ బహుమానం — వి. ఆర్. కాంతి | |

### 5-10-51 తేది తెలుగులో వక్తృత్వ పోటిలు జరిగినవి.

| విషయములు : | | పరీక్షాధి పతులు : |
|---|---|---|
| **సీనియర్ శాఖ** | **సీనియర్ శాఖ** | శ్రీమతి వారణాసి యశోదగారు. |
| 1. భాషా ప్రయుక్త రాష్ట్ర విభజనము సంకుచిత దృష్టికి దారి తీయునా ? | ప్రథమ బహుమానం — టి. శారద | శ్రీమతి కామరాజు మైత్రేయిగారు. |
| 2. హిందూ ధర్మశాస్త్ర క్రోడీకరణ బిల్లువలన హైందవ కుటుంబ వ్యవస్థ తారుమారగునా ? | ద్వితీయ బహుమానం — బి. సత్యవతి | శ్రీ కె. సుందరరామశాస్త్రిగారు. |
| 3. లలిత కళలలో కవిత్వమునకు గల స్థానము. | | |

విషయము :

జూనియర్ శాఖ

1. అహింసా సిద్ధాంతములు దైనందిన జీవితములో నెంతవరకు నాచరణీయములు.
2. కుటీర పరిశ్రమలా? యంత్రములా? దేశోన్నతిని పెంపొందించునవి?
3. సమ్మెలు సమర్థింప వచ్చునా?
4. విద్యార్థులు రాజకీయములలో పాల్గొనవచ్చునా?
5. కవియా? దేశభక్తుడా? ఎవ రెక్కువ దేశమునకు మేలు చేయుదురు?

జూనియర్ శాఖ

ప్రథమ బహుమానం

కె. రాజ్యలక్ష్మి

ద్వితీయ బహుమానం

ఎ. లక్ష్మీకామేశ్వరి

పరీక్షాధి పతులు :

శ్రీమతి వారణాసి యశోదగారు.

శ్రీమతి కామరాజు మైత్రేయిగారు.

శ్రీ కె. సుందర రామశాస్త్రిగారు

జూనియర్ శాఖ

వచనం కంఠత వప్పచెప్పుట.

జూనియర్ శాఖ

ప్రథమ బహుమానం

కె. ప్రమీల

ద్వితీయ బహుమానం

వి. రామమ్మ

# సంగీతములో పోటీలు

4—10—1951

సీనియర్ శాఖ

వీణ వాయిద్యము

సీనియర్ శాఖ

ప్రథమ బహుమానం

మీనాక్షీసుందరం

ద్వితీయ బహుమానం

జి. శకుంతల

ప్రత్యేక బహుమానం

యం. శ్రీనివాసమ్మ

(తరువాయి 53-వ పేజీలో)

పరీక్షాధి పతులు :

శ్రీమతి కె. భానుమతి అమ్మగారు.

శ్రీమతి వి. లీలావతిగారు.

శ్రీమతి ఎ. సరస్వతిగారు.

# కథ అడ్డం తిరిగింది

(24-వ పేజీ తరువాయి)

పిన్ని యిచ్చిన డబ్బులు కూడబెడితే వచ్చిన పది రూపాయిలు—తనవద్ద నున్న ఆస్థి.

చేతిలో నున్న పది రూపాయిల ఆస్థితోటి ముక్తేశ్వరంలో నున్న మేనత్త గారింటికి బస్సెక్కాడు తాను. ఇదివరకు మేనత్త గారింటినుండి నాన్న తనను తీసుకు వచ్చేసరికి తనకు 5 సంవత్సరాలుంటాయి. ఆ తరువాత తన మేనత్త రెండు మూడుసార్లు వచ్చి 'అబ్బాయిని చూడాలని వచ్చాను' అని పెంచిన ప్రేమ కనబర్చేది. ఆమె వచ్చినప్పుడల్లా తన చేతిలో ఒకటి రెండు రూపాయిలు పెట్టి వెళుతూండేది. కాని 4 సం|| క్రితం ఆమె భర్త చనిపోయాడు. అప్పటినుండీ ఆమె గ్రామం విడిచి ఎక్కడికీ వెళ్లలేదు. ఆమె భర్త చని పోయినప్పుడు మాత్రం తన తండ్రి అక్కగారిని పరామర్శించడానికి వెళ్లి రెండు దినాలుండి వచ్చేశాడు.

ముక్తేశ్వరం చేరాక కనిపించిన వారందరినీ తన మేనత్త గారిల్లెక్కడని అడిగాడు. చివరకి మట్టి గోడలతో నున్న ఒక చిన్న తాటాకుల యిల్లు చూపిస్తూ 'అదేనండి రాధమ్మ గారిల్లు' అని చూపాడొక రైతు. తిన్నగా లోపలికి వెళ్లేసరికి పదేళ్ల మ్మాయి ఎదురుగా వచ్చింది. తనను చూడ గానే లోపలికి పరుగెత్తి అమ్మా 'ఎవరో వచ్చారే' అంటూపోయి రాధమ్మతో చెప్పింది. వంటింట్లోంచి ఇవతలికి వస్తూనే రాధమ్మ తనను చూచి ఒక్కసారి ఆశ్చర్యంగా 'ఎన్నాళ్లకు కనిపించావు నాయనా! అందరూ క్షేమమేనా? అమ్మాయి! బావకు చెంబుతో మంచినీళ్లు తెచ్చియ్యమ్మా' అని మణికి పురమాయించింది.

కాళ్లు కడుగుకోనే లోపల రాధమ్మ తన కూపిరి సలుప నీయకుండా లక్ష కుశల ప్రశ్నలు కురిపించి . 'పెట్టె యినా పట్టుకు రాలేదు—ప్రయాణ మరచేత పెట్టుకునా వచ్చేవు? పది రోజులుండ కుండానే వెళ్లిపోతావా?' అన్నది. ఆప్రశ్నకు తాను సరియైన జవాబు చెప్పనే లేదు.

క్రమంగా ఎలాగైతే నేం? తనను ప్రశ్నమీద ప్రశ్న వేసి తాను యింట్లో నుండి పారిపోయివచ్చిన సంగతి తెలుసుకుంది.

'చెప్పకుండా వచ్చేశావా బాబూ—ఇంట్లో అమ్మా నాన్నా వెతుక్కోరూ!' అని కాస్త నెమ్మదిగా మందలించింది.

ఆ మరుదినమే తనతో చెప్పకుండానే "అబ్బాయి! యిక్కడకు వచ్చాడు. దిగులుపడవద్దు" అని పోస్టుకార్డు వ్రాసి పడేయించింది తన అన్నగారికి. అయితే ఆమె తన అన్నగారు వచ్చి కొడుకును తీసుకు వెళతాడనుకుంది. కాని అలా జరగలేదు. తాను మేనత్త గారింటికి వచ్చిన ఆరు మాసములకు మాత్రం నాన్నవచ్చి ఒక్కసారి చూచి వెళ్లాడు. అప్పుడు తనను 'ఏంరా బాగున్నావా!' అని మాత్రమే అన్నాడు."

ఒక పెద్ద కెరటం కాళ్లవరకు వచ్చి పంచెను తడిపింది. దాసు గబుక్కున లేచి తడిసిన పంచె అంచులను పిండుతూ కొంచెం వెనక్కి జరిగి కూర్చుని మళ్లీ సిగరెట్టు వెలిగించాడు......

'తన జీవితంలోని రెండవ అంకం త్వరగానే ముగిసిపోయింది. తాను మేనత్త గారింట్లో రెండు సంవత్సరాలు మాత్రమే ఉన్నాడు. ఆ ఉన్న రెండు సంవత్సరాలు మాత్రం బాగానే వినియోగించుకున్నా ననుకున్నాడు. గోదావరి ఒడ్డుకీ పొలాల్లోకీపోయి ప్రకృతిని చిత్రిస్తూండటం ఆతని నిత్యకృత్యం తాను వేసిన బొమ్మలలో కొద్ది తప్పులున్నా అప్పటికీ ఎందరో మెచ్చుకొనేటట్లు వేశేవాడు తాను. అతడు వెళ్లిన కొన్నాళ్లకు మాత్రం "చదువు సంధ్యలు లేకపోతే ఈ కాలంలో కడుపు గడవటం ఎలాగ నాయనా? అందులో మగపిల్లవాడి వాయెను" అని రాధమ్మ ఒకటి రెండు సార్లతనిని మందలించింది. కాని దాని కతడేమీ జవాబు చెప్పలేదు. ఆ తరువాత ఇక ఆమె ఆ ఊసే ఎత్తలేదు.

నిజానికి తన మేనత్తది కూడా చితికిపోయిన సంసారం. ఆమె భర్త చనిపోయే టప్పటికి ఆమెకు మిగిలినదా పూరి కొంప, నాలుగు ఎకరముల మాగాణి మాత్రమే. ఆ స్వల్ప ఆస్థితో ఆమె తవ కూతురిని పెంచుకోవడమే కష్టంగా జరుగుతూంది. అందుచేత తాను అచ్చటికి వెళ్లడం కూడా ఆమెకు బరువే. ఈ సంగతిని గ్రహించేకే అతడు అచ్చటి

నుండి వచ్చేయడం జరిగింది. రోజులెంత గడ్డుగా గడుస్తున్నా వాళమ్మ తనకయ్యేఖర్చు కెన్నడు విసుగుకోనైనా లేదు. తాను బయలు దేరేముందు 'నేను వెళ్లి పోతాను' అని చెప్పినప్పుడు 'మీయింటికా నాయనా?' అన్న దామె— "కాదు ఎక్కడి కయినా పోయి నా బ్రతుకు నేను బ్రతుకు తాను" అన్నాడు.

"అలా బ్రతక గల్గితే సంతోషమే. కాని నాయన్న చాంట్లో ఇంత పెట్టటానికేమీ అభ్యంతరం లేదు. మధ్యలో మీ నాన్న వచ్చి తీసుకు వెళ్లబట్టి కాని లేకపోతే పుట్టిన నాటినుండి యిక్కడ పెరగవలసిన వాడవేగా" అన్న దామె. కాని నేను వెళ్లిపోతానంటే ఎక్కువ అభ్యంతర మేమీ పెట్టలేదు.

సీటి మీద నుండి గాలి విసురుగా కొడ్తూంది. గాలికి లేచిన ఇసుక మీద పడింది. కళ్లల్లో కూడా పడింది. దాసు మళ్లీ ఈ ప్రపంచంలో కొచ్చేడు. రెండవ ఆట సినిమా యింకా ఆడుతూనే ఉంది. ఒక రిద్దరు రిక్షా బండివాళ్లు కాళీ బండ్లు నీడ్చుకుంటూ బీచిరోడ్డంట పోతున్నారు. దాసు చేతిలో ఉన్న సిగరెట్టు అతనికి తెలియకుండానే ఆరిపోయింది. మళ్లీ అతడు మామూలు ఆలోచనలో పడ్డాడు. తన జీవితంలోని వెవ అంకం ఎలా ప్రారంభ మయిందీ నెమరువేయ సాగాడు.

మేనత్త గారింటినుండి తాను తిన్నగా విశాఖపట్టణమే వచ్చాడు. వస్తూనే సత్రంలో బసచేశాడు. వచ్చిన రెండు మూడు దినాలకే ఆ ఊళ్లో 'ప్రణయిని' అనే క్రొత్త పక్ష పత్రిక ప్రచురిస్తున్నారనీ. దానికి ముఖచిత్రం తదితర చిత్రాలు వ్రాసియివ్వగల చిత్రకారుని కొరకు చూస్తున్నారనీ విన్నాడు. 'ఇంకేం' తనకు కావలసినదే అది. తన చిత్రకళకు కాస్త ఆదరణ చూపించి తన పొట్టగడచిపోయే మార్గం చూపిస్తే అంతకన్న తనకు గావలసినదేమీ లేదు. హాయిగా చిత్రాలు గీసుకుంటూ కాలంగడిపేయ గలడు. వెంటనే ప్రణయిని సంపాదకునకు తాను అదివరకు వేసిన చిత్రాలన్నీ చూపించి తాము కాస్త చేయూత నిస్తే ఇంకా అభివృద్ధి చేసికొన గలనని చెప్పాడు. పత్రికలో కావలసిన అన్ని బొమ్మలూ తాను చిత్రించి యివ్వడానికి వారు తనకి నెలకేబది రూపాయిలు యిచ్చుటకు నిర్ణయమైనది. మొదటి రెండు సంవత్సరాలు సత్రంలోనే కాలక్షేపం చేశాడు. ఆ రెండు సంవత్సరాలలో తాను సేకరించిన ధనంతో కలకత్తా వెళ్లి సంవత్సరం పాటు శాస్త్రోక్తంగా చిత్రకళ నభ్యసించాడు. తరువాత తిరిగి విశాఖపట్టణమే వచ్చేశాడు. ఆ తరువాతే మహరాణీ పేటలో ఇల్లు అద్దెకు తీసుకొనడం జరిగింది. మరికొంత కాలానికి ఎదురింటిలో రూము తీసికొని ఉంటున్న కాలేజీ స్టూడెంటు విశ్వంతో పరిచయం కల్గడం జరిగింది. అప్పటికి దాసు తన పూర్వ జీవితంలోనుండి ప్రస్తుతం లోనికి రాగలిగేడు. సినిమా రెండవ ఆట విడిచిపెట్టేరు. జనం గొల్లుమంటూ బయటికి వస్తున్నారు. దాసుకూడా 'ఊ 12 అయింది కాబోలు' అనుకుంటూ లేచి యింటి ముఖం పట్టాడు.

త్రోవలో అతడు మళ్లీ ఒక్కసారి తన వెనకటి జీవితం లోకి వెళ్లాడు. తాను మేనత్త గారింట్లో ఉన్నప్పటికి మణి చాలా చిన్నపిల్ల. చక్కని ఉంగరాల జుట్టు—పచ్చని దేహచ్ఛాయతో తీర్చి దిద్దినట్లున్న ముఖ లక్షణాలతో ఆ చిన్న మణి తనను 'బావా' అని ముద్దుగా పిలవడం అతనికి గుర్తుంది. చదువు సంధ్యలు లేక పోయినా మణి చాలా చురుకైన పిల్ల. తనంటే ఎంతో అభిమానంగా ఉండేది. తాను డ్రాయింగు పుస్తకం గంగులపెట్టి పట్టుకొని ఎక్కడకో పొలాలంట పోయి ప్రొద్దు పోయిన దాకా తిరిగి రాకపోతే వీధరుగు మీద కూర్చుని తన రాక కొరకు ఎదురు చూస్తుండేది. తాను యింట్లోకి వెళ్లగానే 'యింత సేపు బొమ్మలే వేస్తున్నావా? బావా! చీకటిలో నీకెలా కనిపిస్తుంది,' అనేది అమాయకంగా.

ఇంతకీ మణి తనకిప్పుడెందు కలా వ్రాసింది? నిజంగా తన మేనత్తకు తనను చూడాలని ఉంటే, 'ఇబ్బందిగా ఉన్నది' అని వ్రాసింది—బహుశ డబ్బుకై ఉంటుంది. ఆమె తన కొరకు ఎంతో ఖర్చు చేసింది. ఇప్పుడు తన నుండి ఏమైనా సహాయం ఆశించి ఉంటుంది. ఏదో కొంత డబ్బు పంపిస్తే సరి. తాను వెళ్లడం అనవసరం, అనుకుంటూ యిల్లు చేరాడు దాసు.

(ఇంకా వుంది.)

★

# గేయ కవిత్వానికి సమాదరణ

* శ్రీ వసంతరావు రామకృష్ణరావు *

శాస్త్ర పరిజ్ఞానం, సాహిత్య విజ్ఞానం—ఈ రెండూ సాంఘిక జీవనంలో అధికతరమైన ప్రభావాన్ని ప్రదర్శించే రెండు బలవత్తరమైన విభిన్న శక్తులు. ప్రకృతి తత్వపరిశోధనాసక్తి ఫలితంగా పరిణామాలు వచ్చాయి. సంఘంలో శాస్త్రజ్ఞానం, విమర్శనాసక్తి, వృద్ధి చెందుతున్నాయి. వీటిఫలితంగా భావనా ప్రాధాన్యమైన కవిత్వానికి శక్తి సన్నగిలి పోతూంది. ఈ విషయం నిరూపించడానికి పాశ్చాత్య దేశాలలో సారస్వతముపై అధికారమును స్థిరపర్చుకొనిన శాస్త్రవిజ్ఞాన ప్రభావమే ప్రబల నిదర్శనము.

మనోమోహనమైన దివ్యానుభూతికి స్థానమైన కావ్య ప్రపంచంలో, భావనావ్యాపారముకన్న మేధోవ్యాపారముతో గూడిన శాస్త్రపరీక్ష అభివృద్ధి కావడంవల్ల, కవితోద్యమానికి ప్రతీకారచర్య కలిగింది.

ఈ ప్రతీకారచర్య ఫలితంగా పాశ్చాత్య దేశాలైన, ఫ్రాన్సు, జర్మనీ, ఐర్లాండులలో ఒక నూతనమైన కవిత్వ తత్వము అవతరించింది. ఈ నూతన కవిత్వము అంతకు పూర్వమునుండి సాంప్రదాయముగా వచ్చుచున్న కవి సమయములను పాటింపక, యేదోయొక అగాధమైన, అనంతమైన సూక్ష్మప్రకృతినిగూర్చి, అందు నిబిడీకృతమై యున్న అనిర్వచనీయమైన సత్యమును, సౌందర్యమును, సాంకేతికముగా వెల్లడించుటచే ఈ తరగతికవులను సాంకేతిక కవులని ప్రజలు వ్యవహరింపసాగిరి.

పాశ్చాత్య కవితోద్యమములలో సాంకేతిక కవులు నిర్వహించిన పాత్ర చాల ప్రధానమైనది. ఈ కవులు తమ కవితా తత్త్వములో, అగాధమైన ఊహాతీతమైన ఆధ్యాత్మిక విషయాలను ప్రదర్శించుచు సాంకేతికమైన జీవితమందలి సౌందర్య రసభరిత విషయాలను, సత్యాలను, సంకీర్తనము చేయుటచే, ప్రజలు వీరిని మర్మకవులని పిలువసాగిరి.

ఆంగ్ల కవితా సాంప్రదాయానికి చెందిన జేమ్సు. హెచ్. కజిన్సు, ఈట్సు, సిమన్సు మున్నగువారు మర్మకవులు— యూరపు ఖండమందలి దేశాలలోని సాంఘిక చైతన్యమునకు, మర్మకవులు కొనసాగించిన మర్మ కవితా సాంప్రదాయములే కారణమనుటలో అతిశయోక్తిలేదు.

మర్మ కవిత్వము గేయరూపంలో (Lyric), గాన ప్రాధాన్యంతో కూడికొని ఉంటుంది. మర్మకవులు భాషకూ, భావాలకూ సమానమైన ప్రాముఖ్యమిచ్చి, గానాన్వితముగా ఈ గేయాలను రచించారు. పాశ్చాత్య సారస్వత క్షేత్రంలో మొదటిలో గేయ కవిత్వానికి తగిన సమాదరణ లభించలేదు. కాని, కాలక్రమములో గేయాల ప్రతిభ ప్రజలను ఆకర్షించింది.

సమకాలీనమైన పరిస్థితులను దాటి భావనాశక్తి మూలంగా, అనంత సౌందర్యాన్ని సందర్శించి, తన ఆత్మానుభూతిని, సంకీర్తనము చేసికొని, మర్మకవులు అవ్యక్తమైన ఆనందాన్ని రచనలలో ప్రసరింపచేసారు.

ఆంధ్ర సారస్వతానికి, ఆంగ్ల సారస్వతంతో సంబంధం, సన్నిహితత్వం ఉన్నాయి. భారతీయ నాగరికతలో, ఆంగ్లనాగరికత కలిసినట్లే, ఆంధ్ర సారస్వతంలో ఆంగ్ల సారస్వతప్రభావం గోచరిస్తుంది. ఈ విషయం నిరూపించడానికి అనేక కావ్యాలను నిదర్శనముగా చూపించవచ్చును. అయితే ఒక విషయం ఏమిటంటే, ఆంగ్లభాషాప్రభావం ప్రత్యక్షంగా ఆంధ్ర సారస్వతంలో ప్రతిఫలించలేదు. కాని, గేయకవిత్వమునకు సంబంధించినంతవరకు, ఆంగ్లభాషా ప్రభావం అనివార్యమైనదన్న విషయం అందరూ అంగీకరిస్తారు.

ఆంధ్రులకు గేయరచనా విధానం ప్రాచీనమైనదే—వేదములు ఉదాత్తానుదాత్తాది స్వరాలతో చదువునపుడు శ్రుతిహితంగా ఉండి, గేయరూపాన్ని ప్రదర్శిస్తున్నాయి. అంటే, గేయరూపం కవిత్వావతరణమైన నాటినుండి, నేటివరకు ప్రచారంలో ఉన్న విషయం ప్రత్యక్షంగా గోచరిస్తూంది.

కాని గేయ ప్రతిభ అనేక రూపాలలో పరిణామం చెందినది. గేయాల ప్రతిభ అనాగరక జాతులలో విలక్షణమైనస్థానం అందుకొనినట్లు మనకు కనిపిస్తుంది. గ్రామ్య

# గేయ కవిత్వానికి సమాదరణ

సారస్వతంలో, గేయాలకుగల ప్రచారం, గ్రామ్యజీవన రంగంలో ప్రత్యక్షంగా మనకు కనిపిస్తుంది. నేడు వెలువడుతున్న గేయాలలో, రచనాపద్ధతులలోను, ఆదర్శాలలోను, భావాలలోను, కవితా సాంప్రదాయాలలోను అనేకమైన మార్పులు కనిపిస్తున్నాయి.

నేటి మన గేయ కవిత్వానికి మూలపురుషుడు రవీంద్రుడు—ఆంధ్ర సారస్వతం, బెంగాలీ సారస్వత పుష్పంలోని పరిమళాన్ని ఆస్వాదించి, తానుకూడ పరిమళాన్ని ఆఘ్రాణించుకొంది.

రవీంద్రుడు బాల్యంలో ఇంగ్లీషు కావ్యాలు విశేషంగా చదివేడు—ఆంగ్లకవులు కీట్సు, షెల్లీ, బ్రౌనింగులు వ్రాసిన కవిత్వాన్ని అవగాహన చేసికొన్నాడు. సౌందర్యాన్ని, మూర్తీభవింపచేసి, ఆ రూపాన్ని పోషించిన కీట్సు కవిత్వంలోని లయారూపకమైన రామణీయకత, రవీంద్రునికి మనోమోహనమైన దివ్యానుభూతిని ప్రసాదించింది. షెల్లీ గీతాలలో ఆధ్యాత్మిక ప్రభావంకూడా అతని నాకర్షించింది. వీరి రచనలతోపాటు, కాళిదాసు కవిత్వాన్ని కూడా రవీంద్రుడు ఆస్వాదించాడు. రవీంద్రుడు ఒక గొప్ప కళా తపస్వి—బ్రహ్మ సమాజమునకు చెందినవాడు. తన ప్రతిభా వ్యక్తిత్వ ఫలితంగా, బెంగాలీ గీతాలు వ్రాసి, బెంగాలు సారస్వతంలో సంచలనం కలిగించాడు.

ప్రాచ్యపాశ్చాత్యమనస్తత్వాలకు సంధిస్థానమైన బెంగాలు గీతాలు తొలుత ప్రజలలో ఆందోళన కలిగించాయి. కాని ఆంధ్రదేశమందలి యువకవులు కొందరు పురాతన సంప్రదాయాలను విడిచిపెట్టి రవీంద్రుని కవితా తత్త్వాన్ని ఆదర్శంగా తీసికొని, నూతనంగా గేయరచనా కార్యక్రమాన్ని అవలంబించి, తమ రచనావిధానాలలో క్రొత్త త్రోవలు చూపేరు.

అప్పుడు వెలువడ్డ గేయాలలో జీవగానం ప్రతిధ్వనించింది. నవ్యత తాండవించింది. కవితా తత్వం ప్రగమన దృక్పథాన్ని సూచించింది. యువకవుల రచనా వ్యాపారం ప్రచారమై సాంఘిక జీవనంలో నూతన సంచలనం కలిగించింది.

గేయకవిత్వానికి తగిన సమాదరణ నేడు విశేషంగా లభిస్తూంది. మాత్రాఛందస్సులో వింతగమనం కొందరు చూపించారు. గేయ కవిత్వంలో భావనేంద్రజాలం కళా కౌశలంతో కూడుకొని ఉంది. కళ, కళకోసమే కాదు. కళ మానవులకోసం అనే విషయాన్ని బహిరంగంగా ప్రచారం చేస్తూ పలువురు గేయాలు రచించి గేయ రచనా పద్ధతిలో కృతహస్తులయ్యారు. నండూరివారి యెంకిపాటలు జన సామాన్యంలో ఏ విధంగా ప్రచారమైనదో అందరూ ఎఱిగినదే. నిర్దుష్టమైన కళాదృక్పథంతో కూడిన గేయరచనా విఖ్యాతికి తగిన సమాదరణ లభింపజేయటానికి అందరూ కృషిచేయాలి.

యువకులు నేటి గేయకవిత్వంలో మెఱుగులు, మెఱుపులు చూపుతున్నారు. కాని, కొన్ని సందర్భాలలో అనవసర పదాడంబరత్వం, అసందర్భమైన ఆక్రోశం, అసహజమైన ఆవేశం గోచరిస్తున్నాయి. ఈ విధమైన కవితా సాంప్రదాయం, కొంతవరకు అనివార్యమైన హృదయోద్వేగంగా భావించినప్పటికీ, శ్రుతిమీరిపోయిన కారణం వల్ల ఆకర్షణాశక్తి కోలుపోతున్నదనే విషయాన్ని గ్రహించాలి.

నేటి పత్రికా ప్రపంచంలో నవ్య పద్ధతులను చూపించి, గేయ రచనా కార్యక్రమాన్ని కొనసాగిస్తూన్న యువకవులకు, ప్రోత్సాహమూ, సమాదరణా, లభించేట్లు, ఆంధ్రులు తగిన పరిస్థితులను కల్పించవలసివుంది.



అక్టోబరు 2వ తేదీని, గాంధీ జయంత్యుత్సవ సందర్భములో, మైలాపూరు ఎకడమీ వారిచే, మణీ ట్యూటోరియల్ కాలేజీలో జరిపింపబడిన నూలు వడకు పోటీలో, ఆంధ్ర మహిళా సభ పారిశ్రామిక విద్యాలయపు విద్యార్థిని నాగలక్ష్మి ద్వితీయ బహుమానమును బడసినది.

## ద స రా వు త్స వ ము లు

(48-వ పేజీ తరువాయి)

కర్ణాటక గాత్రము

జూనియర్ శాఖ

ప్రథమ బహుమానం
పి. రాజేశ్వరి

ద్వితీయ బహుమానం
జి. శకుంతల

ప్రత్యేక బహుమానం
శ్రీలత

పరీక్షాధిపతులు :
శ్రీమతి కె. భానుమతి అమ్మగారు
శ్రీమతి వి. లీలావతిగారు
శ్రీమతి ఎ. సరస్వతిగారు

# చే తి ప రి శ్ర మ ల లో పో టీ లు

## 2-10-51 తేది మంగళవారం నూలు వడకుట

నూలు వడకుట

సీనియర్ శాఖ

ప్రథమ బహుమానం
బి. మీనాక్షి

ద్వితీయ బహుమానం
కౌసల్య

పరీక్షాధిపతులు :
శ్రీ ఎన్. వి. గోవిందయ్యగారు

## నే త ప ని

పని
సీనియర్ శాఖ
15 ని॥ కాలపరిమితిలో
చిన్న తువాలును నేయవలెను.

సీనియర్ శాఖ

ప్రథమ బహుమానం
అన్నపూర్ణ... 

పరీక్షాధిపతులు :
శ్రీ ఎన్. వి. గోవిందయ్యగారు

జూనియర్
నవారును 10 ని॥ కాలపరిమితిలో
నేయవలెను.

జూనియర్ శాఖ

ప్రథమ బహుమానం
బి. సత్యనారాయణమ్మ

పరీక్షాధిపతులు :
శ్రీ ఎన్. వి. గోవిందయ్యగారు

# ద స రా  వు త్స వ ము లు

## 4-10-51 తేది దుస్తులు కత్తిరింపులు, కుట్టుపని

| పని | బహుమానములు | పరీక్షాధిపతి |
|---|---|---|
| సీనియర్ శాఖ<br>ఒక జాకట్టును 3 గంటలలో కొలతల ప్రకారం కత్తిరించి, డ్రాఫ్టు చేసి, మిషను కుట్టుట. | సీనియర్ శాఖ<br>ప్రథమ బహుమానం<br>బి. సత్యనారాయణమ్మ<br>ద్వితీయ బహుమానం<br>టి. వేదవల్లి | పరీక్షాధిపతి :<br>శ్రీమతి యమునాబాయి |
| జూనియర్ శాఖ<br>ఒక ఫ్రాకును 3 గంటల కాల పరిమితిలో కొలతల ప్రకారం కత్తిరించి డ్రాఫ్టుతీసి టాకింగు చేయుట. | సీనియర్ శాఖ<br>ప్రథమ బహుమానం<br>కె. రోహిణి<br>ద్వితీయ బహుమానం<br>కె. భగీరతి | పరీక్షాధిపతి :<br>శ్రీమతి యమునాబాయి |

## రంగులు వేయుట, అద్దకపు పని

| పని | బహుమానములు | పరీక్షాధిపతులు |
|---|---|---|
| పద్ధతి ప్రకారము ఒక గుడ్డకు రంగువేసి, పువ్వులు అద్దుట. | ప్రథమ బహుమానం<br>సి. ప్రసూనాంబ<br>ద్వితీయ బహుమానం<br>వి. యమ్. మల్లికాభూషణం | పరీక్షాధిపతులు :<br>శ్రీ కామేశ్వరరావు |

## ఎంబ్రాయిడరీలో పోటీలు

| పని | బహుమానములు | పరీక్షాధిపతులు |
|---|---|---|
| పని<br>సీనియర్ శాఖ<br>కలర్ ఎంబ్రాయిడరీ 3 గంటల కాల పరిమితిలో డిజయిన్ పూర్తి చేయుట. | సీనియర్ శాఖ<br>ప్రథమ బహుమానం<br>కె. భగీరతి<br>ద్వితీయ బహుమానం<br>బి. సత్యనారాయణమ్మ | పరీక్షాధిపతులు :<br>శ్రీమతి జగదాంబాయి<br>శ్రీమతి సుగుణా రగడే |
| జూనియర్ శాఖ<br>కలర్ ఎంబ్రాయిడరీ 3 గంటల కాల పరిమితిలో డిజయిన్ పూర్తి చేయుట. | జూనియర్<br>ప్రథమ బహుమానం<br>టి. వేదవల్లి<br>ద్వితీయ బహుమానం<br>కె. రోహిణి | పరీక్షాధిపతులు :<br>శ్రీమతి జగదాంబాయి<br>శ్రీమతి సుగుణా రగడే |

## దసరా వుత్సవములు

# తరగతుల వారీగా నాటకములలో పోటీలు

### 8, 9 తేదీలలో జరిగిన నాటకములలో గెలుపొందినవారు

| | | |
|---|---|---|
| తమిళ డ్రామా :<br>ఒబీడియన్‌ట్<br>సోము, బాల భాగవతార్ | **తమిళం**<br>ప్రథమ బహుమానం<br>ఎస్. పద్మావతి, కె. వాణి<br>ద్వితీయ బహుమానం<br>ఎ. రాధ, ఎమ్. ఆర్. నిర్మల. | |
| హిందీ డ్రామా :<br>పాయిజన్ పేకెట్టు, వీచ్ | **హిందీ**<br>ప్రథమ బహుమానం<br>శకుంతల, కె. నిర్మల<br>ద్వితీయ బహుమానం<br>జయశ్రీ, కుసుమ్‌పటేల్ | పరీక్షాధిపతులు :<br>శ్రీమతి ఎ. శారదాదేవిగారు<br>శ్రీ శంకర నారాయణగారు<br>శ్రీ బాలచంద్రయాప్టే |
| ఇంగ్లీషు డ్రామా :<br>ది ఎండ్ ఆఫ్ ది బిగినింగు | **ఇంగ్లీషు**<br>ప్రథమ బహుమానం<br>సుమంగళీ చెట్టూర్<br>ద్వితీయ బహుమానం<br>నళినీకత్రీ | |



ప్రధాని నెహ్రూ వధూవరుల నభినందించుచున్న చిత్రము.

ఢిల్లీ నగరంలో లీల పెండ్లి అతి వైభవంగా జరిగింది. ది 11-10-51న శ్రీమతి దుర్గాబాయిగా రొసగిన అల్పాహార విందుకు, కేంద్ర మంత్రులు, పార్లమెంటు సభ్యులు, ప్రభుత్వ ఉన్నతోద్యోగులు, పురప్రముఖులు, పలువురు వచ్చి, వధూవరుల నాశీర్వదించినారు.

# ద స రా వు త్స వ ము లు

9-10-51 తేది మంగళవారం సబ్ జూనియర్, జూనియర్, సీనియర్, పారిశ్రామిక శాఖ, ప్రింటింగు, డైయింగు, తరగతులకు జరిగిన నాటకపు పోటీలు, అందు విజయమును పొందినవారు.

| తరగతి / నాటకం | బహుమానములు |
|---|---|
| సబ్ జూనియర్ : రత్న మాణిక్యాలు | ప్రథమ బహుమానం కృష్ణవేణి<br>ద్వితీయ బహుమానం జి. శకుంతల |
| జూనియర్ : పెళ్లి చూపులు | ప్రథమ బహుమానం ఎస్. రాజ్యలక్ష్మి<br>ద్వితీయ బహుమానం జి. హైమవతి |
| సీనియర్ : సంఘ పిశాచి | ప్రథమ బహుమానం ఎ. సి. యశోధ<br>ద్వితీయ బహుమానం పి. రాజేశ్వరి |
| పారిశ్రామిక శాఖ : తెలుగు బిడ్డ | ప్రథమ బహుమానం కె. రోహిణి<br>ద్వితీయ బహుమానం వి. రామమ్మ |
| డైయింగు, ప్రింటింగు శాఖ : దొంగ పెద్ద మనిషి | ప్రథమ బహుమానం సి. ప్రసూనాంబ<br>ద్వితీయ బహుమానం ఝాన్సీ |

పరీక్షాధిపతులు :

శ్రీమతి జి. లక్ష్మీకాంతమ్మగారు

శ్రీ జి. సూర్యనారాయణగారు

శ్రీ ప్రకాశరావుగారు

రత్న మాణిక్యాలు నాటకాన్ని ప్రదర్శించిన సబ్ జూనియర్ తరగతి వారికి నాటకపు షీల్డు యియ్యాయబడినది.

## దసరా వుత్సవములు

## ఆటలలో పోటీలు

28-9-1951, 29-9-1951 లలో విద్యార్థినులకు, సభ్యురాండ్రకు, వారి పిల్లలకు వివిధ ఆటలలో పోటీలు జరిగినవి.

### విద్యార్థినుల షీల్డు

బంతి ఆట, పొటెటో పందెము, జండా పందెము, యీ మూడింటిలో హీరాదళము గెలిచి షీల్డు పొందినది.

### విద్యార్థినుల సీనియర్ శాఖ

| ఆట | ప్రథమ బహుమానం | ద్వితీయ బహుమానం |
|---|---|---|
| మూడుకాళ్ల పరుగు | పుష్పాగాంధీ, కె. రాజ్యలక్ష్మి | ఎన్. పద్మ, కె. నిర్మల |

### విద్యార్థినుల జూనియర్స్

| ఆట | ప్రథమ బహుమానం | ద్వితీయ బహుమానం |
|---|---|---|
| మూడుకాళ్ల పరుగు | శశికళ, మోహిని | జయశ్రీ, బి. ఎస్. ప్రభ |

## సంభ్యురాండ్రు వారి పిల్లలకు

### సీనియర్ శాఖ

| ఆట | ప్రథమ బహుమానము | ద్వితీయ బహుమానము |
|---|---|---|
| రొట్టె తినే పందెము | జి. లీల | శ్యామలా రగడే |
| పరుగెత్తు పందెము | శ్రీ లత | ప్రమీళ |
| మ్యూజికల్ చెయిర్స్ | శ్యామలా రగడే | ఊర్మిళ |
| మూడుకాళ్ల పరుగు | సుచరిత, శ్రీ లత | లీల, ప్రమీళ |

### సీనియర్ శాఖ

| ఆట | ప్రథమ బహుమానము | ద్వితీయ బహుమానము |
|---|---|---|
| నిమ్మపండూ, చంచా | కె. సి. అన్నపూర్ణ | ఇందిరా గోపాల్ |
| ఎల్జిబత్ ఆట | కె. సి. అన్నపూర్ణ<br>ఇందిరా గోపాల్ | జయలక్ష్మి, రమాదేవి |
| బుక్కు బేలన్సింగ్ | ఆర్. రంగనాయకమ్మ | రాధాబాయి |
| మ్యూజికల్ చెయిర్స్ | ఎ. సరస్వతి | జి. పాపాయి |
| సూదీ దారం | జి. పాపాయి, రమాదేవి | కె. సి. అన్నపూర్ణ<br>ఇందిరా గోపాల్ |

# దసరా ఉత్సవములు

దసరా కార్యక్రమాలు నిర్విఘ్నంగా జరిగి పోయాయి. కార్య నిర్వాహక వర్గసభ్యురాండ్రు, సభ్యురాండ్రు, ఉపాధ్యాయినీ ఉపాధ్యాయులు, విద్యార్థినుల తోడ్పాటుతో యీ కార్యక్రమాన్ని జయప్రదంగా జరిపించారు. దేవీపూజ, కొలువు, పేరంటం క్లబ్బుశాఖా సభ్యురాలు శ్రీమతి కస్తూరి రుక్మిణమ్మగారు, వక్తృత్వపు పోటీలు సారస్వతశాఖ వారైన శ్రీమతి అచ్యుతిని గిరిజ, శ్రీమతి గిడుగు లక్ష్మీకాంతమ్మ గారలు వివిధ తరగతులు ఉపాధ్యాయినీ ఉపాధ్యాయుల సహకారంతో నిర్వహించారు. తమిళ విద్యార్థినుల సంఖ్య అధికముగా నుండుటచే, యీ సంవత్సరము తమిళములో వక్తృత్వపు పోటీలు క్రొత్తగా ప్రారంభింప బడ్డాయి. క్రీడాశాఖ సభ్యురాలు శ్రీమతి రత్నావళిగారు, సభ్యురాండ్రకు, విద్యార్థినులకు గూడ ఆటలలో పోటీలు జరిపించి నారు—కళాశాఖవారు శ్రీమతి కమలాబాయి, కమలామణి గార్లు, నాటకముల పోటీలు, శ్రీమతి సుబ్బలక్ష్మమ్మగారు సంగీతపు పోటీలు ఏర్పాటు చేశారు. ఇదీగాక, యీసారి, చేతి పరిశ్రమలలో పోటీలు ఒక క్రొత్త విషయము. నూలు వడకుటలోనే గాక, నవారునేత, తువాలునేత, కుట్టు, ఎంబ్రాయిడరీ, రంగు అద్దకపు పనులలో కూడ పోటీలు జరిగినవి. శ్రీమతి కస్తూరి గంగనారాయణమ్మగారు, ప్రాథమికశాఖ ఉపాధ్యాయ వర్గ సహకారంతో యీ పోటీలు జరిపించారు.

పండుగలు మూడు రోజులలో, చేతిపనుల ప్రదర్శన మొకటి జరిగినది. విద్యార్థినులు నేసిన బట్టలు, కుట్టిన వివిధ రకముల దుస్తులు, అల్లిన అల్లికలేగాక, కొందరు సభ్యురాండ్రుకూడ తయారు చేసిన వస్తువులను ప్రదర్శించిరి. విజయ దశమినాడు పిల్లలనృత్యం, నృత్యోపాధ్యాయిని శ్రీమతి సాంబ్రాజ్యంగారి కృషి ఫలితం.

వివిధ పోటీలకూ, పరీక్షాధి పతులుగా, మేము కోరినంత మాత్రంలో అంగీకరించి, సహకరించిన విజ్ఞులందరకు మా కృతజ్ఞత. విజయ దశమినాడు బహుమతులు పంచుట కంగీకరించిన శ్రీపవని జమీందారిణీగారికి, వివిధ శాఖలలో కృషి చేసిన కార్య నిర్వాహక సభ్యురాండ్రకు, ఉపాధ్యాయినీ ఉపాధ్యాయులకు, తదితరులకు మా కృతజ్ఞత.

కార్యదర్శినులు.
ఆంధ్ర మహిళా సభ.





అల్పాహార విందు సమయంలో
పెండ్లికూతురు లీల, శ్రీమతి కుట్టీ శివరామ్,
శ్రీ ప్రకాష్, శ్రీ గాడ్గిల్ మున్నగువారితో.




## "ఇదా స్వరాజ్యం"

రచన: యస్. టి. సుదర్శనాచార్య.

చిరునామా—127 రాయపేట హైరోడ్,

మైలాపూరు, మద్రాసు.

ఇది హిందూ ముస్లిమ్ సమైక్యతావశ్యకతను తెలిపే సాంఘిక విషాదాంత నాటకం. హైదారాబాదు పరిస్థితుల నాధారముగా జేసికొని, ఈ పుస్తకం రంగస్థలముపై ప్రదర్శించుటకు వీలుగా వ్రాయబడినది.

గ్న కాలంలో హైదరాబాదు అల్లరులకు గురియైన నే మహమ్మదీయ బాలిక, రెహానా, కాంది తో చేరి బెజవాడవచ్చి ఆకలి మంటచే తిరుగుతూ ఛాందస బ్రాహ్మణుని ఇంటి అరుగుపై విశ్రమించగా, ఆ యజమాని వెళ్లగొడతాడు. నెమ్మదిగా వస్తూంటే, ఆ ఇంటి యజమాని ఏకైక పుత్రుడు, విద్యార్థి "రవితో" హానాకు పరిచయం కలుగుతుంది. పరిచయం ప్రణయంగా మారి, రవి సంఘాన్ని, తండ్రిని ధిక్కరించి, రెహానాను పెండ్లి చేసుకుంటాడు. హైదరాబాదు భారత యూనియన్‌లో చేరిన అనంతరం, అచటికి పోయి రవి ఉద్యోగంలో ప్రవేశించి రెహానాతో కులాసాగా ఉంటాడు. హిందూ సంపర్కం చేసిందని, అక్కడ ఒక మహమ్మదీయ పెద్ద, రవిని హత్యచేస్తామని రెహానాని బెదరిస్తాడు. రవిని అలక్ష్యంగా చూస్తే అతనే వదలి పెడతాడని రెహానాకు సలహా నిస్తాడు. రెహానా నడతచూచి రవి వ్యాధిగ్రస్థుడయి, తండ్రివద్దకు పోగా, తండ్రి తరిమేస్తాడు. రెహానామీద ప్రేమతో, రవి తిరిగి హైదరాబాదు వస్తూంటే, రవిని హత్యచేస్తారు. ఇది తెలిసి రెహానా వస్తూంటే, ఒక రజాకర్ ఆమెను చంపేస్తాడు.

కథ సంగ్రహంగా ఇది. తెరతీయగానే జ్యోతిష్కాంతు డొస్తాడు. దీనికి, కథకీ ఏమీ సంబంధంలేదు. ప్రియురాలి కోసం భావకవి విలాపం బాగుగా చిత్రించినను, జ్యోతిష్కాంతుని పాత్ర మొదటిలోనే ప్రత్యక్ష మగుట అసమంజసం. రవి తండ్రీ పాత్రపోషణలో 'డ్రామటిక్ కాంట్రాస్ట్' కనపడదు. మరణావస్థలో దీనుడైవచ్చినకొడుకు పట్ల—అందులోనూ ఏకైక పుత్రుడు—ఏ తండ్రియూ అంత కఠినంగా నుండడు. మాతృ ప్రేమను చూపు తల్లి పాత్ర సహజంగానే ఉంది.

రెహానాను నిష్కల్మష హృదయగా చిత్రించి, ఆమెకు నీచతనం ఒడిగట్టడం పొరపాటు. రెహానా రవిని మనసారా ప్రేమించింది. తర్వాత, ఒక ఫిలిం ప్రొడ్యూసర్, సినీమాలో చేరిపిస్తానని వేయిరూపాయిలు నెలకిస్తారని చెప్పగానే, రవి తన కిష్టంలేదని చెప్పినా, రెహానా అతని మాటలని తిరస్కరిస్తుంది. మహమ్మదీయ పెద్ద వచ్చి రవిని అలక్ష్యంచేస్తే అతడే పోతాడని చెప్తే, తన కిష్టంలేకనే ఆ పని చేస్తుంది.

రవి పాత్రను రచయిత బాగానే చిత్రించారు. నాటకం రచనాశైలి రంగస్థలానికి వీలగునట్లే వుంది. అందలి పాటలు కూడా ఆయారంగాలకు తగినట్లుగానే వున్నాయి.

*  *  *

# గ్రంథ సమీక్ష

## "ఎదురుగాలి"

శ్రీ నూరి, సాహిణీ పబ్లికేషన్స్ః
బకింగ్‌హామ్‌పేట, విజయవాడ. వెల రు. 1-8-0

రవీంద్రనాథ మైత్ర వ్రాసిన బెంగాలీ గ్రంథానికీ పుస్తకం అనువాదం. సామాజిక జీవితంలో మానవులకు కలిగే కష్ట నిష్టూరములను, అపవాదులను ఈ నవల తెలియబరుస్తుంది.

యాదవ భట్టాచారి ఒక జమీందారు. గంగూలీ అతని మిత్రుడు, ఎస్టేటు మేనేజరున్నూ. లక్ష్మిగంగూలీ పుత్రిక. మొదటినుండీ తన ఎస్టేటు వ్యవహారాలను చక్కబెట్టి వృద్ధిచేసిన గంగూలీ చనిపోగా అతని కుటుంబాన్ని పోషిస్తున్న ఆ జమీందారుని సంఘం ఈర్ష్యాభావంతో ఎట్టి అపవాదులకు లోనుచేయునో ఈ నవల వ్యక్తపరుస్తుంది. జమీందారు తదనంతరం అతని ఏకైక పుత్రుడు, రమేశ్, కూడా సంఘాన్ని లెక్కచేయక తన లక్ష్యాన్ని కాపాడి లక్ష్మిని వివాహం చేసుకుంటాడు.

ఈ నవలలో లక్ష్మి, రమేశుల పాత్ర బాగుగా చిత్రింప బడినది.

—గి. లక్ష్మికాంతమ్మ.



## ఆంధ్ర మహిళా సభ

# గాంధీజీ జయంతి

అక్టోబరు 2-వ తేదీని 3 గం|| నుండి, 5 గం|| వరకు, సభ విద్యార్థినులు, సభ్యురాండ్రు, ప్రార్థనలతో, నూలు వడికిరి. శ్రీ కె. బాలకృష్ణారావుగారు, శ్రీమతి కె. రమాదేవి గారు జాతీయ గీతములను పాడిరి.

తదనంతరము జరిగిన సభలో, అధ్యక్షులైన శ్రీ శొంఠి వెంకట రామమూర్తిగారు ఉపన్యసిస్తూ, ఆధ్యాత్మిక శక్తి యొక్క ఔన్నత్యాన్ని ఋజువుచేస్తూ, భారత జాతి యొక్క కీర్తిని దేశదేశాల వెదజల్లినది గాంధీజీయేయనీ, మత ప్రవక్తలకువలె, తమ సిద్ధాంతాలకు విపుల ప్రచారం చేయగల్గిన శిష్యవరులు ఏ వినోబాభావే, స్వామి సీతా రాములవంటివారు తక్క, పెక్కుమంది లేకున్నా, సామాన్యుని అభ్యుదయానికి గాంధీజీ స్వయంగా చేసిన కృషివల్ల, దేశదేశాల సామాన్య ప్రజకు ఆయన ఆత్మీయుడ య్యాడనీ చెప్పారు.

శ్రీ పందిరి మల్లిఖార్జునరావు, శ్రీమతి శారద, శ్రీమతి సత్య వతిగార్లు గాంధీజీ సిద్ధాంతాలు, ఉద్బోధలు, ప్రజాకర్త వ్యాలను గూర్చి ఉపన్యసించారు. చిరంజీవి గిడుగు భారతి జాతీయ గీతాలు, జనగణమన గానంతో సభ ముగిసింది.

## ఆంధ్ర మహిళా సభ

## "చిట్టి తల్లుల భరత నాట్య ప్రదర్శనము"

దక్షిణ హిందీ ప్రచార సభవారు, ఇటీవల జరిపించిన 'సాంస్కృతిక సప్తాహము' 21—10—'51 న, గోకలే హాలులో, తెలుగు భాషా ఉత్సవముతో ప్రారంభమైనది. ఈ సందర్భములో, ఆంధ్ర మహిళా సభ నృత్యశాఖ విద్యార్థినులు లాసంగిన భరత నాట్యము, రసలీల, గడ్డికోత యిత్యాది జానపద నృత్య ప్రదర్శనము, సభికుల అభినంద నాలను అందుకున్నది. సర్. ఎమ్. సిటి. ఎమ్. హైస్కూలు సీనియర్ తెలుగుపండిట్ విద్వాన్ మంకాల శ్రీపతిగారు "సుశబ్దోచ్చారణతో గూడిన గానము, చిట్టి తల్లుల ముద్దు లొలికెడి హావభావ ప్రకటనలతో గూడిన భరత నాట్య ప్రదర్శనము నిరుపమానమై, నన్ను ముగ్ధుని జేసినవి—లలిత కళలను తెలుగు బిడ్డలకు నేర్పుతూ, తెలుగు మహిళల కళా కౌశలమును పెంపొందించుచున్న ఆంధ్ర మహిళా సభ ఆచంద్ర తారార్కమై వెలయు చుండును గాక" యని, నృత్యోపాధ్యాయిని శ్రీమతి సామ్రాజ్యంగార్కి లిఖిత పూర్వకముగా తమ అభినందన ములను తెలియపరచిరి.



ఇంపు అయినటువంటి వాయిలు సంపద.




ది ఖటావ్ మకన్జీ స్పిన్నింగ్ అండ్ వీవింగ్ కంపెనీ, లిమిటెడ్.
మిల్లులు : బయికలా, బొంబాయి. ఆఫీసు : లక్ష్మీబిల్డింగ్, బల్లార్డుపియర్, ఫోర్టు, బొంబాయి
బట్టల షాపు : మూల్జీ జేతా మార్కెట్, గోవింద్ చౌక్, బొంబాయి 2.



వాహినీవారి ' మల్లీశ్వరి 'లో భానుమతి




Edited and published by G. Durgabai, M.A., B.L., at the Andhra Mahila Sabha, Mylapore, Madras.
Printed by M. Satyanarayana at the H. Prachar Press, 12, Thanikachalam Chetty Road, T'Nagar, Madras.




మద్రాస్ హాండ్‌లూం వీవర్స్ ప్రావిన్షియల్
కో-ఆపరేటివ్ సొసైటీ లిమిటెడ్
ఎగ్మూరు :: మద్రాసు

RUNNING TO CROWDED HOUSES ALL OVER ANDHRA

నవంబరు 14 వ తేది విడుదల

# ఆదర్శం

మాడర్న్ థియేటర్స్
తయారు

డైరెక్షన్
జి.ఆర్.రావ్

పూర్ణా రిలీస్...

POORNA RELEASE

# ఆంధ్రమహిళ

సంపుటి 8 :: డిసెంబరు '51 :: సంచిక 8

ముఖచిత్రము : తపస్విని

చిత్రకారిణి : శ్రీమతి తాడికొండ రాధావసంత



సంపాదకురాలు : శ్రీమతి దుర్గాబాయి, యం. యే., బి. యల్.

సహసంపాదకురాలు : శ్రీమతి చెన్నఘంటమ్మ, యం. యే., యల్. టి.

ఆంధ్ర మహిళా సభ, మైలాపూర్

సంవత్సర చందా — ఆరు రూపాయలు

ఆంధ్ర దేశమంతటా
విజయవంతముగా నడుచుచున్న
అద్భుత తెలుగు చిత్రం



ఎనెస్‌కె వారి

# పెళ్లికూతురు

చమ్రియా
రిలీజ్

డైరెక్టర్
N.S.కృష్ణన్




సంపుటి 8 డిసెంబరు 1951 సంచిక 8

# ఎన్నికలు - స్త్రీలు

మన రాజ్యాంగ రీత్యా ఎన్నికలలో పోటీ చేయుటకు స్త్రీలకు పురుషులతో సమానమైన హక్కు గలదు. అయినప్పటికీ, పోటీ చేయుచున్న మహిళల పట్టీని (ఇదే పత్రికలో మరియొక చోట పోటీ చేయుచున్న మహిళల పట్టీ ప్రచురింపబడ్డది.) పరీక్షిస్తే వీరి సంఖ్య అతి స్వల్పమని తెలియుచున్నది. రాష్ట్ర ప్రజాసభకైతేనేమి, యూనియన్ ప్రజాసభకైతేనేమి, రమారమి 4000 మంది అభ్యర్థులు. ఎక్కడచూచినా ఒక్కొక్క స్థానానికి కనీసం ఆర్గురైనా పురుషులు పోటీచేస్తున్నారు. ఏవో చెదురుగా కొన్ని స్థానాలకు దక్క ప్రతి ఒక్క సీటుకూ, దేశంలో ముఖ్య పార్టీయైన కాంగ్రెసుపార్టీ తన అభ్యర్థులను నిలబెట్టూ ఉంది. అయితే, యిందులో కాంగ్రెస్ అభ్యర్థులైన స్త్రీలు 30 మందికూడా లేరు. ఇతర పార్టీల అభ్యర్థులంతా కలిసి కొంచ మించు మించు మరొక 30 మంది ఉంటారు. ఇందు మూలంగా, స్త్రీల ప్రాతినిధ్యం చాలా తక్కువ అని తీర్మానించుకోవాలి.

ఇదివరలో ప్రజాసభలలో నున్న స్త్రీలందఱూ కాంగ్రెసుపార్టీ అభ్యర్థులుగానే నిలబడు తున్నారు, అక్కడక్కడ చెదురుగా ఎవరో తక్క పార్టీ మార్చుకోలేదు. వీరంతా గతంలో వారి పాత్రలు శాయశక్తులా నిర్వహించుకున్నారు. అందులో కొందఱు ముఖ్యంగా ఎక్కువ కష్టపడి, పురుషులకన్న ఎక్కువ సమర్థతతో శ్రద్ధాసక్తులతో, రాజ్యాంగ నిర్మాణములో, శాసన నిర్మాణంలో పనిచేశారని కీర్తి ప్రతిష్టలను సంపాదించి, మహిళలకు ఆదర్శాలుగా నిలచారు. కొందరు అలంకరణార్థం ఆసనాల నధిష్ఠించారన్న పేరుపొందినా, పురుష ప్రతినిధులలో మాత్రం నూటి కొంతమంది సమర్థులు గనుక!! కుర్చీలలో కునికిపాట్లు పడ్డారన్న హాస్యానికి పాలుపడ్డారు గాని కొందఱు సోదరీమణులు, కుర్చీలక్రింద గోతులు త్రవ్వారన్న అపకీర్తి మాత్రము పొందలేదు.

కలహాలకు కాలు దువ్వారనిగాని, స్వార్థానికని ప్రజాహితవును దిగమింగారనిగాని, కీలక స్థానాలలో ఇరుక్కొని, లంచాల రూపంగా ప్రజల రక్తాన్ని పిండారనిగాని, ఒక్క యువతియు అప్రతిష్ఠకు గురి కాలేదు. ఇవాళ్ల తమకు ఓటివ్వమని అడిగితే, అడయారులో బంగళా ఎవరి సొమ్ముతో కట్టావనిగాని, ఫలానా సినీమా కంపెనీలో షేర్లు ఎట్లా సంపాదించావనిగాని, నీభార్య మెళ్లో జవాహరి అంతా, ఏ నాగ్రేళ్లలో ఏ గనినుండి తవ్వి తీశావనిగాని అనిపించుకునే అథమ స్థితిని ఏ స్త్రీ అభ్యర్థియు పొందలేదు. సమర్థత ఉన్నంతవరకు, పదవు ప్రతిష్ఠలను ఆశిస్తూ, నీతి నియమాలకు బద్ధులై కార్యభారాన్ని నిర్వహించి, మహిళా సామాన్యాని కొక నైతికంగా ఉన్నతమైన స్థానాన్ని నిర్మించారు. వీరు తిరిగి అభ్యర్థులుగా నిలవటం చాలా అవసరమైన విషయం. వీరందఱూ గెలుపొంది, రాజ్యాంగ రథగమనంలో తమ వెనుకటి అమూల్య అనుభవాలను ఉపయోగించి, ప్రజలకు తోడ్పడతారని ఆశిస్తున్నాము.

ప్రస్తుతము ఉన్న రాచకీయ రభసలో, క్రొత్త స్త్రీలు పాత్ర వహించటానికి వెనుకాడుతున్నారు—అవకాశవాదులు రోజు కొక పార్టీకి పునాదులు వేయటంతో ఊసరవెల్లులవలె సమయానుకూలంగా తమ ఆశయాలను మార్చుకోవటంతో—వ్యక్తులలో నమ్మకం క్షీణించి, తన్మూలంగా, వారి పార్టీమీద అభిమానం తగ్గి, పార్టీ భవిష్యత్తును గూర్చిన సందేహాలు ప్రబలి, రాచకీయ రంగమనేది వ్యక్తిగత స్వలాభాలను వలవేసి పట్టుకొనే అపార పారావారమనే అభిప్రాయం కలిగిస్తూ ఉంది. పోనీ, అందులో ప్రవేశ మేర్పరచుకుని, అభ్యుదయాన్ని సాధిద్దామని ఏ స్వతంత్రురాలైనా ఆశిస్తే, పార్టీ విధానాల ఒత్తిడిలో తన ఒంటి కేక ఎడారిలోని అరుపువలె ఎవరి చెవుల సోకగలదు?—అక్కడకూ, ఏదో వీలైనంతవరకూ పోరాడదామన్నా, అభ్యర్థిత్వాన్ని నిలుపుకోటానికి కావలసిన పాతిక వేల కనీసపు రొక్కాన్ని ఏ విధంగా వ్యయపరుస్తుంది? అందులోనూ, తండ్రి కాంగ్రెసు, తనయుడు కమ్యూనిస్టు అయితే, మధ్య తల్లి ఏ పార్టీకి తన ఓటిస్తుంది? ఏ పార్టీకని తను నిలుస్తుంది? బావ, మరది వ్యతిరేక పక్షాలలో హోరాహోరీగా విత్తాన్ని వెచ్చిస్తే, మరదలు మాణిక్యం మూడో పక్షంలో మాటలు విప్పగలదా? ఈ చిక్కులన్నీ లెక్కించుకొని, విస్తుబోతూ, వివేకాన్ని చిక్కబట్టుకుని, విరమించుకున్నారు స్త్రీలు చాలాభాగం ఎలక్షన్ పోటీలనుండి.

ఏదో—అదీ మన మంచి కేనంటాం మేము. ఇంత రభసకు కారణం వ్యక్తులలో వివేకము, సంస్కారము క్షీణించడంవల్ల—దీనిని గూర్చిన ఉద్బోధ శాసనసభలలో బల్ల గ్రుద్దులద్వారా కాకుండా, గృహంలో, దైనందిన కార్యక్రమలలో, చిన్న సభలలో, సాధారణ సమావేశాలలో,

పాఠశాలలలో జరుగాలి. ఇటువంటి నిర్మాణం చేయటానికని, స్త్రీలు తమ తమ స్థానాల్లో, గృహిణులుగా, ఉపాధ్యాయినులుగా, సంస్థల నిర్వాహకులుగా ఉండిపోయి, రాజకీయాల్లో యింకా కొంతకాలం వరకు దిగకుండా ఉండటంకూడ ఒక రకంగా దేశాభ్యుదయాన్కి కారణం కాగలదు—అందువల్ల, ఎక్కువమంది స్త్రీలు ఎన్నికలలో పోటీలు చేయకపోవటం తాము అసమర్థులమనిగాదు, శాసన సభలద్వారా జరుగలేని మానవ మనస్తత్వ నిర్మాణం, మానవ సంస్కారం, నిశ్శబ్దముగా వెనుక నిలచి సాధిద్దామనే మహత్తరాశయముతో నని మేము తలంచుచున్నాము.



మదరాసు డిప్యూటీ మేయరు

## శ్రీమతి అహల్యా సంతానం

డిప్యూటీ మేయరు పదవి నలంకరించటానికి యీమె ప్రథమ స్త్రీ. ఈమెది సంఘ సేవలో ఆరితేరిన చెయ్యి. స్త్రీల ఆరోగ్యము, శిశువుల రక్షణ, స్లమ్‌క్లియరెన్సు, వీరి అభిమాన కార్యక్రమము. వయస్సులో చిన్నలయ్యూ, సేవలో అనుభవము సంపాదించిన వీరు, తమ భాధ్యతను చక్కగా నిర్వర్తించగలరని ఆశించుచున్నాము. ఉన్నత పదవిని పొందిన వీరిని మహిళాలోకము అభినందిస్తుంది.



## డమ్ డమ్ విమాన ప్రమాదం

"దినదిన గండం, నూరేళ్లాయుస్స" ని మన పెద్దలు సామెత చెప్పేవారు. ఎప్పటికన్నా ప్రస్తుత కాలంలో ఇందలి వాస్తవికత ఎక్కువగా బుజువౌతూంది. ఒక్కొక్క పరిశోధన ద్వారా ఒక్కొక్క విజయం సంపాదించుకుంటూంటే, దాని వెనువెంటనే ఒక్కొక్క ప్రమాదం తయారవుతూంది. నవంబరులో జరిగిన విమాన ప్రమాదం వంటివి కొంచమించు ప్రతి దినమూ ఎక్కడో జరుగుతూనే ఉండటం వింటున్నాము.

డమ్ డమ్ ప్రమాదంలో అశువులను బాసిన వారందఱూ ప్రముఖ వ్యక్తులు. బొంబాయి ఆంధ్రులలో ప్రసిద్ధి జెందిన శ్రీ శిష్ట్ల వెంకటరావుగారు, వార్తా పత్రికలవారి ఆదర్శం శ్రీ దేశబంధు గుప్తాగారు, కంట్రోల్డు కమోడిటీస్ డైరెక్టరు శ్రీ విశ్వనాథ అయ్యరుగారు, ఇంకా తదితరులు, ముఖ్యమైన కార్య క్రమాలపై కలకత్తా జేరబోతూ ప్రమాదములో చిక్కుకున్నారు. వారి మృత్యువు వలన వారి వారి శాఖలలో తీరని లోటు ఏర్పడినదనుట వాస్తవము. వారి అకాలమృతికి మా ఆంధ్ర మహిళ సంతాపాన్ని తెలుపుతూ ఉంది.



# ప్రస్తుత పరిస్థితులు

❋ శ్రీమతి అచ్యుతుని గిరిజ ❋

**అయ్యా వోటు, అమ్మా వోటు :**

చెవిలోని జోరీగ, కంటిలోని నలుసు, కాలి ముల్లు— అశ్రద్ధ చేయటానికి వీలులేని విషయాలు. వెంటనే వాటి సంగతి కనుక్కుంటేనే సుఖం. ప్రస్తుతం ఆ జాబితాలోకి చేరుతారు ఎలక్షన్లకు హాజరవుతున్న అభ్యర్థులు కూడ. ఎక్కడ చూసినా వీళ్ల గొడవే. అయ్యా వోటు—అమ్మా వోటు. తెల్లవారి లేస్తే యింటికి హాజరు. పోనీ యిల్లు తప్పించుకుని యే బీచికో, పార్కుకో షికారు వెళ్తే మన కన్నా ముందు వీళ్లే హాజరు. స్వర్గానికి పోతే అక్కడకూడ దేవేంద్ర పదవికి ఎన్నికలు జరుగుతూ వుంటవేమోనని భయంగా వున్నది. పోనీ ఆ యివ్వతలచుకున్న వోటు యేదో యిచ్చి పంపిస్తే నిశ్చింతగా మన పనిపాటలు మనం చూసుకో వచ్చును గదా అని అనుకుంటే అట్లా యివ్వటానికి సాధ్య పడదు గదా. ఏమిటి చేయటం?

మనలో మాట కుమండీ. మొన్న నొక పెద్ద మనిషి మా యింటికి వచ్చాడు. యోగ క్షేమాలయిన తర్వాత ఆయన, "అన్నట్టు ఒక శుభ వార్త చెప్పాలి. మీరంతా కాంగ్రెసు అభిమానులే కదూ" అన్నాడు. ఇంగువ కట్టిన గుడ్డ న్యాయంగా, అందరి హృదయాల్లోను కాంగ్రెస్ అభిమానం జీర్ణించుకుపోయిన మాట కాదని యెట్లా అనగలం? అవునన్నాం. వెంటనే ముసిముసి నవ్వులు నవ్వుకుంటూ "మా వాడు అంటే మా అన్న కొడుకు మీకు తెలుసుగా. వాడు కాంగ్రెసు తరఫున నిలబడుతున్నాడు. మీరందరు......" యేదో చెపుతునే వున్నాడు. కలయో వైష్ణవ మాయయో మాకు అంతు పట్టలేదు. ఏమైనా భ్రమలో వున్నామేమోనని తెల్ల ముఖాలతో ఒకరి వంక ఒకరు చూసుకున్నాం. ఖద్దరు నూలుతో నేస్తారో జనప నారతో నేస్తారో అనే విషయం ఆ అభ్యర్థికి అటు యేడు యిటు యేడు తరాలవరకు తెలియదంటే నమ్మండి. గాంధీగారి వుద్యమాల సంగతి అడక్కపోవటం మంచిది. "ఇంకా వోట్ల విషయమై యేమీ తేల్చుకోలేదండి" అని చెప్పి నెమ్మదిగా అయనన్ను వదలించుకున్నాం అప్పటికి.

ఇటువంటి మహానుభావులు ప్రత్యేకించి యీ పార్టీలోనే వున్నారని మాత్రం అపోహ పడకండి. చిత్తశుద్ధి యెంత మాత్రం లేనివాళ్లు పదవుల కోసం, సరదా కోసం యే రంగు అయినా పూసుకుని, యే వేషమైనా వేసుకుంటారు. త్రికరణ శుద్ధిగా నమ్మిన ఆశయాలు అంటూ లేనివాళ్లు సమయానుకూలంగా యే పలుకులైనా పల్కిస్తారు. వాళ్ల కల్లా యేదో వొక బురఖా కావాలి. అంతేకాని వుచితా నుచితాలతో సంబంధం వుండదు. ఇటువంటి రంగుబొమ్మలు ప్రతి పార్టీలోను వుంటాయ్. పక్కన వున్న కీ సహాయంతో అమ్మా వోటు, అయ్యా వోటు అని అంటాయ్. కాని మనం చిన్న నవ్వు నవ్వుకుని పక్కకు తప్పుకోవాలి.

అమ్మా వోటు—అయ్యా వోటు అనగానే కరగిపోకండి. వాళ్ల మాట వైఖరి, మనిషి నడవడి కూడ గమనించాలి. ఒక నిశ్చితమైన కార్యక్రమం, పథకం పెట్టుకొని "యివి మీకు చేయగలం" అనేవాళ్లను కొంతవరకు నమ్మవచ్చు. "ఇది మాత్రమే మేము చేయటానికి సంకల్పించుకున్నాం. పూటకో రంగు, మనిషికో మాట మా పద్ధతి కాదు" అని తేల్చి చెప్పగల వాళ్లు వుత్తములు. అంతేగాని అడిగిన దాని కల్లా సరేననే వారికి మాత్రం వోటే యివ్వకండి. వాళ్లు అసలు నక్కబావలు. అంతా హుళక్కి చేయగలవాళ్లు. ఈ మధ్య నొక పెద్ద మనిషి ఆడవాళ్ల సభలో మాట్లాడుతూ "అసలు హిందూ కోడ్ బిల్లు ప్యాసయితేనేగాని మన దేశానికి ముక్తి లేదని నమ్మండి" అన్నాడు, హిందూ కోడ్ బిల్లు ప్యాసయితే లాభం తట్టలతో చేరవేసుకునేది స్త్రీలే నన్నట్లుగా. ఇంకొక సనాతనపరుల గుంపులో కూర్చుని బీచిలో మాట్లాడుతూ "హిందూ కోడ్ బిల్లు ప్యాసు చేయ తలచుకుంటే యీ పాటికే జరిగి పోయేదండీ. అంత సులువుగా ధర్మ శాస్త్రాలు మనంటి పులులు అక్కడ వుండగా వీసం పక్కకు జరగవని నమ్మండి" అనటం విన్న వాళ్లు చాలా మంది వున్నారు. ఇటువంటి చురుకైన నాలిక కలవాళ్లు యీడిగవాళ్ల దగ్గర కల్లుగీతకు అనుమతి

యిప్పిస్తామని చెప్పినా, వేశ్యమాతల దగ్గర భోగం మేళాలు అమలులో పెట్టిస్తామన్నా ఆశ్చర్యం యేమున్నది? అందుకని అడిగిన దానికల్లా తలవూపేవాళ్లను అసలే నమ్మకండి.

ఏ క్షేత్రంలోనైనా మునుపు, దేశానికి, సంఘానికి—సేవ, త్యాగం చేసిన వాళ్లను ఎన్నుకోండి. ఒకసారి సేవకు, త్యాగానికి అలవాటు పడినవాళ్లు యిప్పుడు తోక ముడవరు. కాదా చక్కని విద్యా సంస్కారాలు వుండి, చిత్తశుద్ధితో దేశసేవ చేయాలన్న వుత్సాహంతో ముందుకు వచ్చినవాళ్లకు చేయూత నివ్వండి. మన వ్యక్తిగత ఆశయాలకు, నిలబడిన పార్టీ బురఖాకు పొత్తు కుదరక కేవలం అదొక పన్నాగమని తోస్తే మాత్రం వూరుకోండి. ఈనాడు పార్టీకన్నా వ్యక్తిగతమైన సామర్థ్యం అవసరం. సమర్థులైనవాళ్లు, వాళ్ల కాళ్ల మీద వాళ్లు నిలబడి ప్రభుత్వ రథాన్ని ముందుకు లాక్కుని వెళ్తారు. మనిషిలో బలం లేకపోతే బురఖా బరువుకు అణగారి, రథ గమనానికే అడ్డు పడుతారు. అందుకని అయ్యా వోటు—అమ్మా వోటు అని వినపడితే పరీక్షగా చూడండి. శ్రద్ధగా వినండి. చివరకు అన్నీ మనసులో నెమరువేసుకొని సామర్థ్యం గలవాళ్లకు వోటు వేయండి. వయసును పట్టి, విద్యను పట్టి వచ్చిన వోటింగు హక్కును సార్థకం చేసుకుంటేనే ఎన్నికల ప్రయోజనం.

## మనం ఆంధ్రులం :

మనం అచ్చమైన ఆంధ్రులం. కాదని యెవరనగలరు? దేశమంటే మట్టి కాదోయి, దేశమంటే మనుష్యులోయి అని ఆంధ్ర కవి గురజాడ ప్రబోధించిన మాట నిజమే. కాని ఆంధ్రుల దృష్టిలో దేశమంటే దేశమే. దేశ సేవలోను, త్యాగంలోను; ఆంధ్రోద్యమంలోను తల పండిపోయింది ఆంధ్ర కేసరికి. ఈ నాడు కూడ తరగని శౌర్యంతో కార్యక్షేత్రంలో ప్రచార్లు చేస్తున్నది వృద్ధ కేసరి. ఆయన్ను ఒక ముఖ్య నాయకుడుగా మనసులో భావించుకుంటూనే వున్నారు. కాని క్రియల్లో ఆయన పేరు పార్టీలతోను, పదవులతోను కలుపుతున్నారు. త్యాగమంటే తెలియని వాళ్లు విమర్శనకు పూనుకుంటున్నారు. ఇది అచ్చమైన ఆంధ్రుల లక్షణ మంటాను.

ఆంధ్రులకు ఇలవేల్పు కోదండరాముడు. ఆయన లక్షణంగా పట్టాభిషేకం చేసుకుని యువరాజుగా భాగ్యభోగ్యాలు అనుభవించవలసిన తరుణంలో సమస్తం పోయి చివరకు అడవుల పాలయినాడు. ఆయన అడుగు జాడల్లోనే నడుస్తున్నారు ఆంధ్రులుకూడ. వాళ్లకు రాష్ట్రం లేదు, రాచరికంలేదు, తగిన ప్రాతినిధ్యం అంతకు ముందే లేదు. ప్రతివాడు వీళ్లను బుట్టలో పెట్టేవాడే. ప్రతివాడు దబాయించేవాడే. కాకపోతే ప్రజా స్వామ్యానికి, సమానత్వానికి, వ్యక్తిగత హక్కులకు హామీనిచ్చే రాజ్యాంగాన్ని తయారు చేసి, యికముందు కూడా రాచరికానికి సాగిద్దామని కుతూహలపడుతూవున్న కాంగ్రెసు పక్షంవారు, మద్రాసునుండి ఎలెక్షన్లకు అభ్యర్థులుగా నిలబెట్టిన ఎనిమిది మందిలోను ఆంధ్రుడు ఒక్కడేనంటే అర్థ మేమిటి? ఆ ఒక్కరి అభ్యర్థిత్వం కొన్ని కారణాల చేత ఎలక్షన్ కమీషనర్ త్రోసివైచినారు. బజారు బజారుకు, వీధి వీధికి, ఎక్కడ పట్టినా, పట్టణంలో ఆంధ్రుల జనాభా ఎక్కువై పోతున్నవి. ఇంచుమించు పట్టణ జనాభాలో ఆంధ్రుల సంఖ్య నూటికి 40కి తగ్గదు. ఇంత మంది ఆంధ్రులకూ ప్రతినిధులుగా కనీసం ముగ్గురాంధ్రులైనా ఉండవద్దా! కృష్ణా నది నీరు మదరాసులోని ఆంధ్రుల ఉపయోగార్థము కూడానని పెన్నారు ప్రాజెక్టును సమర్థించే పురుషోత్తములంతా ఆంధ్రుల ప్రాతినిధ్యం మాట మాత్రం విస్మరించారేమి? అదేమంటే విచారించవలసిన నెహ్రూ వంటి పెద్దలకు తీరిక లేదట. రాముడు భద్రాచలంలో ఉండిపోవటాన భరతన్న పెద్దరికం—

అయినా, రేపు పోలింగనగా తక్క తెలుగునాటు పర్యటనకు కాంగ్రెసు అధ్యక్షునికి ముహూర్తము కుదురదటు—ఏమిటో యీ నిర్లక్ష్యం!! యీ ధీమా!! అమాయిక ఆంధ్ర ప్రజను అడగక పోయినా ఓటు తమకేననా? ఓస్ వీరి సమర్థన ఉంటే ఎంత, లేకపోతే యెంత అని ధిక్కారమా? ఆంధ్రుల సమస్య నొకదానినైనా తీర్చలేక పోయినందుకు ముఖము చెల్లకనా! కానోపు!! అంతా అయ్యాక వెళ్తే సరి—పూల మాలలు వేయించుకొని, ఒకేమారు జేజేలు చెప్పించుకోవచ్చు.

# ప్రస్తుత పరిస్థితులు

అయినా, ఆంధ్రుల కందఱూ సలహా లిచ్చేవారే—ఇతర దక్షిణాది వారితో భాగ్య భోగ్యాలు పంచుకోకపోయినా, ఆహారకాటకం పంచుకోమని అధికారుల సలహా—పంచుకోపోతే బలవంతంగా పంచుతారు. జాగ్రత్త! బంగారు పంటలు పండేది మన తెలుగు గడ్డ—బియ్యం కరువని భోజన పద్ధతులు మార్చుకోవాలట మనమంతా—మన రాష్ట్రం మేదో మనకు విభజిస్తే, మనం బియ్యమే తింటామో, గడ్డే తింటామో, అసలే తినమో! మన బియ్యాన్ని రవాణా చేస్తూ, మనం చేప, జల్ల ఆకు, అలం తినాలట—ఏమి న్యాయం!! అదేమంటే అనాగరీకులం మనం—అంత అదృష్టం మనకు పట్టి మన కోదండరాముడు రాజధానికి వెళ్లి పట్టాభిరాముడయిన నాడు మనం కూడా పెత్తనం చేతాం—రోజుకు అరపౌను ఆవకాయ, అరపౌను గోంగూర పచ్చడి మాత్రమే రేషను ఏర్పాటు చేసి, ప్రజలు తిండి పద్ధతి మార్చాలంటే సరి—బర్మా బియ్యం అప్పుడు బళ్లతో వచ్చి పడతయ్—గడుసువాళ్లదే కాలం సుమండీ.

ఆంధ్రులకు చుట్టరికం కన్నా స్నేహం ఎక్కువ ముఖ్యమైనది. ఇదివరలో ఆంధ్రులకు ఆంధ్రేతరుడయిన టాండనుకు పోటీ వచ్చినప్పుడు మన మహర్షి "టాండన్ నా స్నేహితుడు, కాబట్టి నా వోటు ఆయనకే" అన్నారు. ఇందులో మహర్షి పొరపాటు యేమీ లేదు. ఆంధ్రుల పుటక తీరు. ఒక ఆంధ్రుడు పెద్ద హోదాలోనో పదవిలోనో వున్నాడనుకోండి. వెంటనే మూడో ఫారం చదివే కుర్రాడు కూడా "అరే వాడా! వాడి మేనమామ వూరు మా వూరి పక్కనే" అంటాడు. అదొక పెద్ద తప్పని ఆ కుర్రాడి భావం కాదు. కాని అంత లోకువ తనవారంటే. అంత నిర్లక్ష్యం. ప్రతి పరాయివారిని గౌరవించి నెత్తిన పెట్టుకుంటారు. వెర్రి బాగులవాళ్లు ఆంధ్రులు.

మొన్నను మద్రాసులో ఆంధ్ర రచయితలంతా ఒక చోట సమావేశమైనారు. ఒక సంఘంగా నిలబడదామని నిశ్చయించుకున్నారు. ఆ సంఘానికి పేరు, సంఘ ఆదర్శ ఆశయాలు, చందా వివరాలు మొదలయినవి యింకా తల పెట్టనే లేదు. అప్పుడే రచయితల ఆర్థిక సమస్యలను తీర్చటం సమస్య వచ్చింది. ఆ సమస్య తీర్చే విధానంలో అభిప్రాయ భేదాలు వచ్చినవి. వాదం వితండవాదం కాబోతుండగా సర్దుకున్నారు సోదరులు. ఇదంతా ఆంధ్ర ప్రతాపమే నంటాను. ఏమైనా అనండి. మనం ఆంధ్రులం. మంచి గానివ్వండి. చెడ్డ కానివ్వండి. మన గుణ గణాలు, మన అలవాట్లు, మన కోరికలు, మన వుద్దేశాలు వేరు.



# హైమంతి

* భాస్కర్ *

ఓ గులాబి! నావలె నీవు నోర్చెదవొకో?
మాపు మాపెల్ల కన్నీళ్ళ మాటులేక:
తెల్లవాఱు సరికి నీవు దివ్యవర్ణ
భాసి వౌదువు-నా మోము వాడి యుండు.

సుందరీ మంజులాధర శోభనొందు
అరుణ రేఖలపైని నేత్రాంబు కణము
లచ్ఛమౌక్తిక కాంతుల నతకరించి
సప్తవర్ణ ప్రభా సమాశ్రయణమౌను.

కాని, నా మోము కన్నీళ్ళ కాకలోన
భస్మమై నేవడమ్మును బాసియుండు;
నిన్ను వలె నన్ను నల్వురు నెన్న కున్న
పోయెనే! వింతగా చూతు రోయి మిగుల.

నీకు హేమంత మొక్కటే; నాకు బ్రదుకు
సర్వమొక దీర్ఘ హేమంత మూర్వి పైని;
నవ్వకుము నన్ను చూచి మానవుల రీతి,
నవ్వ పాలయితిమి నేను-నా మనస్సు.





# రాజకీయాలు

శ్రీ గొల్లమూడి రామచంద్రరావు

నవంబర్ నెలలో చెప్పుకోతగ్గ ప్రముఖ సంఘటనలు ఇవి—కాశ్మీర్ సమస్యపై మళ్లీ 6 వారాలపాటు మధ్యవర్తిత్వం జరపవలసిందని ఐక్య రాజ్య సమితి తన ప్రతినిధి గ్రాహంను ఆదేశించటం, నేపాల్‌లో 100 సం॥ల నుంచీ అధికారంలో ఉన్న రాణాల అధికారం తొలిగిపోయి మితవాద కాంగ్రెసు వర్గం అధికారంలోకి రావటం, కొరియాలో యుద్ధ విరమణ సమస్యమీద తాత్కాలికంగా ఒక విధమైన ఒప్పందం కుదరటం, పశ్చిమ రాజ్యాలు, సోవియట్ యూనియన్ ఆయుధాల తగ్గింపుకి విడి విడి పథకాలను సూచించటం, సైప్రస్, మాల్టా, ఏడెన్, హాండ్యురాస్ మొదలైన ప్రాంతాలమీద బ్రిటిష్ ఆధిపత్యాన్ని ఆయా ప్రాంతాలవారు సవాలు చేయటం.

నవంబర్ 10వ తేదీన భద్రతా మండలి కాశ్మీర్ వివాదంపై చర్చ జరిపి మరి ఆరు వారాలపాటు మధ్యవర్తిత్వం జరిపి చూడవలసిందని తమ ప్రతినిధి గ్రాహంను ఆదేశించింది. ఆయన ఉభయ ప్రతినిధులతోనూ సంప్రదింపులు జరుపుతున్నారు. లియాకత్ అలీఖాన్ హత్య సందర్భంలో పాకిస్తాన్ ప్రజల్లో కలిగిన హృదయోద్వేగమూ, భారత ప్రజలు వెలిబుచ్చిన సానుభూతీ కాశ్మీర్ సమస్యా పరిష్కారాన్ని సులభం చేయవచ్చునేమో నన్న ఆశ కొందరికి కలిగింది కాని తరవాత సంఘటనలు ఆ ఆశను తొలగించినవి.

ఇండియా పాకిస్థాన్‌లు ఒకరిపై ఒకరు దండెత్తబోమని హామీ ఇస్తూ ఒప్పందం చేసుకోవాలనీ, ఇండియాలో చేరిన కాశ్మీరుకు కూడా ఈ హామీ వర్తించాలనీ భారత ప్రధాని నెహ్రూ ఈ నెల మొదటి వారంలో సూచించారు. దానికి పాక్ ప్రధాని నజీముద్దీన్ 7వ తేదీన జవాబిస్తూ కాశ్మీర్ సమస్య తేలనంతవరకూ అటువంటి ప్రతిపాదనల వల్ల ప్రయోజనం ఉండదని సూచించారు. తూర్పు బెంగాల్ నుంచి హిందువులు భారతదేశానికి ఇంకా ఎక్కువగా వస్తూనే ఉన్నారు. సింధు (పాకిస్థాన్) రాష్ట్రంలో హిందువులకు జరిగే అన్యాయాల విషయమై పాకిస్థాన్ రాజ్యాంగ పరిషత్తులో హిందువులు తెచ్చిన ప్రతిపాదన తోసివేయబడ్డది. కాశ్మీర్ ప్రధాని అబ్దుల్లాను ఆయన విమానం నడిపే పైలటుకు లంచమిచ్చి పాకిస్థానుకు ఎత్తుకపోవాలని కుట్రకూడా జరిగింది.

పాకిస్థాన్, అమెరికా, బ్రిటన్‌లు అంత హంగామా చేసినా, చివరకు కాశ్మీర్ రాజ్యాంగ పరిషత్తు ఈ నెలలో సమావేశమై తాత్కాలిక రాజ్యాంగాన్ని ఏర్పాటు చేసింది. కాశ్మీర్ భవిష్యత్తు ఇండియాలోనే ఉన్నదనీ, తమ వాక్యాన్ని ప్రపంచం యావత్తు పాటించే రోజు రాక తప్పదనీ పరిషత్తు నాయకులు స్పష్ట పరిచారు.

* * *

ఈ ఏడాది మొదట్లో నేపాల్ కాంగ్రెసు వాదులు రాణాల పరిపాలనను నిర్మూలించటానికి సాయుధ విప్లవం బయలుదేర దీశారు. చివరకు భారత ప్రభుత్వ మధ్యవర్తిత్వంవల్ల, మంత్రి వర్గంలో రాణా వర్గానికీ, కాంగ్రెసుకూ మంత్రి వర్గంలో సమాన స్థానాలు ఉండేట్లూ, పాత ప్రధాని మోహనషంషేర్ జంగ్ ఇకముందు కూడా ప్రధానిగా ఉండేట్లూ, ఇక నుంచీ ప్రజా స్వామిక సంస్కరణలను ప్రవేశ పెట్టటానికి నిశ్చయించ బడ్డది. మహారాజు ఒక సలహా మండలిని ఏర్పాటు చేయగా దానికి ప్రధాని విముఖతను చూపించారు. అంతేకాక రాణా వర్గంలో అతి వాదులూ, నేపాలీ కాంగ్రెసులో తీవ్ర వాదులూ

కూడా దీనిని ప్రతిఘటిస్తున్నారు. దేశంలో శాంతి అనేది లేకుండా పోయింది. రాణా వర్గం, కాంగ్రెసు వర్గం ఉభయులూ ఎక్కువ ప్రాబల్యాన్ని సంపాదించ ప్రయత్నించారు. ఈ తగాదాలు అంతకంతకూ పెరిగి కాంగ్రెసు మంత్రులు 11వ తేదీన రాజీనామా ఇచ్చారు. 13వ తేదీన ప్రధాని రాజీనామా ఇచ్చారు. 14వ తేదీన కాంగ్రెసు అధ్యక్షుడు మాతృకా ప్రసాద్ కోయిరాలా నాయకత్వాన మంత్రి వర్గం ఏర్పడ్డది.

ఈ మంత్రి వర్గం రాణా వర్గానికి చెందిన గూర్ఖాదళ్ నాయకులనుకూడా ఖైదునుంచి విడుదల చేసింది కాని వామ పక్ష నాయకుడూ, సాయుధ విప్లవంలో ప్రముఖ పాత్ర ధరించినవాడూ అయిన కె. ఎన్. సింగ్‌ను మాత్రం విడుదల చెయ్యలేదు. కమ్యూనిష్టు దేశాలకు పొరుగునే ఉండి, పాకిస్థాన్ పోటీ ఏర్పడిఉన్న కాశ్మీర్‌లో నిజమయిన ఆర్థిక ప్రజా స్వామిక సంస్కరణలు ఏ విధంగా త్వరత్వరగా జరిగిపోతున్నవో అదే విధంగా నేపాలులో కూడా జరక్కపోతే, నేపాల్‌లో మరొక విప్లవంవచ్చినా ఆశ్చర్య పడనక్కర్లేదు.

*          *          *

ఆచార్య వినోబా భావే ఇటీవల తెలంగాణా అంతటా పర్యటన చేసి తెలంగాణా సమస్య, భూమి సమస్యే ననీ, ఆ సమస్యను ఇప్పుడు తెలంగాణా ఎదుర్కొంటే, రేపు యావద్భారతదేశమూ ఎదుర్కోవాలనీ హెచ్చరించారు. భూస్వాములు బుద్ధి పూర్వకంగా తాము స్వయంగా సాగు చేయని భూములను భూమి లేని రైతులకు ఇవ్వకపోతే, భయంకర విప్లవంతో రక్తపాతం తప్పదని హెచ్చరించారు.

కాంగ్రెసువారు కూడా భూమిని దున్నేవారికే ఇస్తామని చెపుతున్నారు కనుకనూ, కాశ్మీర్‌లో పరిహారం ఇవ్వకుండానే భూస్వామ్యాల రద్దుకు అంగీకరించారు కనుకనూ, ఏదో విధంగా రైతులకు పంపిణీ జరిగిన భూమిని వారికే ఉంచితే ఆ సమస్య పరిష్కారం కావటమేకాక, వినోబా భావే కోరినట్లు శాంతియుత విప్లవానికి అది అంకురార్పణ చేయకలుగుతుంది. కాశ్మీర్‌లో గుర్తించని భూస్వాముల పరిహారపు హక్కును మిగిలిన రాష్ట్రాల్లో—ముఖ్యంగా వెనకబడ్డ ప్రాంతమయిన తెలంగాణాలో—ఎందుకు పాటించాలో అర్థంలేదు. కాశ్మీర్ ప్రత్యేక పరిస్థితిని ఎవరయినా కారణంగా చెప్పినా అది తృప్తికరంగా ఉండదు. ఎందువల్లనంటే కాశ్మీర్ 'ప్రత్యేక పరిస్థితి'—అంటే పాకిస్థాన్ పేచీ—తొలగి పోయినప్పుడు, కాంగ్రెసు వారు తిరిగీ కాశ్మీర్‌లో కూడా 'పరిహార సమస్య'ను లేవదీస్తారా అని సవాలు చేయవలసి వస్తుంది. కాశ్మీర్ ఎంత ప్రత్యేక పరిస్థితిలో ఉన్నదో తెలంగాణాకూడా ఇంచుమించు అట్లాగే ఉన్నదని భారత ప్రభుత్వం గుర్తిస్తే, తెలంగాణాలో సమస్య అనేదే ఉండదు.

*          *          *

నాలుగు నెలల నుంచీ కొరియా యుద్ధ విరమణకై జరుగుతున్న సంప్రదింపులు ఈ నెల 27వ తేదీన ఒక రూపానికి వచ్చినవి. ప్రస్తుత యుద్ధ రంగరేఖను యుద్ధ విరమణ రేఖగా గుర్తించటానికి ఉభయ పక్షాలూ అంగీకరించారు. అయితే డిసెంబర్ 27 నాటికి పూర్తి యుద్ధ విరమణ ఒప్పందం కుదిరితేనే దీనిని సరిహద్దుగా గుర్తించటం జరుగుతుందని చెప్పబడ్డది. అంతే కాదు. అప్పటివరకూ యుద్ధం యధావిధిగా జరుగుతూ ఉండాలని మిత్ర ప్రతినిధులు పట్టు పట్టుగా కమ్యూనిస్టులు అంగీకరించారు. ఈ షరతులను చూస్తే అసలు ఈ ఒప్పందంవల్ల ఫలితం ఆట్టే ఉండేట్లు కనిపించదు. 30 రోజుల్లో ఒప్పందం కుదురుతుందన్న నమ్మకం ఏ మాత్రం ఉన్నా, ఈలోపల అనవసర రక్త పాతం జరపటానికి మిత్ర ప్రతినిధులు పట్టు పడతారని తోచదు. ఒక్కొక్క వారానికి కొన్ని వేల మంది అనవసరంగా చావటానికి ఎవ్వరూ ఒప్పుకొనకూడదు.

అమెరికా చిత్త శుద్ధిని శంకించటానికి మరి కొన్ని కారణాలు ఉన్నవి. (1) కమ్యూనిస్టులు కొన్ని వేలమంది అమెరికన్ ఖైదీలను చిత్రవధ చేసినట్లు పుకార్లు పుట్టించటం (2) యుద్ధ విరమణ సాగకపోతే మంచూరియా మీదనే దెబ్బ తీయాలని అమెరికన్ విమానబల సర్వసేనాని వాండెన్ బెర్గ్ ప్రకటించటం (3) అమెరికన్ ఉద్యోగుల్లో తీవ్ర కమ్యూనిష్టు వ్యతిరేకీ, జపాన్ ఒప్పందానికీ, ఆస్ట్రేలియా-

న్యూజిలాండ్-అమెరికాల ఒప్పందానికీ, కమ్యూనిస్టు ఆరోపణను పట్టి కొరియా యుద్ధానికి కూడా కారకుడయిన జాన్ డలెస్ టోక్యో వెంచేయటం. ఇదే సమయంలో అమెరికా ఉప విదేశాంగ మంత్రి, ఉపాధ్యక్షుడు కూడా టోక్యోకి వెళ్లారు.

అమెరికా కొరియా యుద్ధం ద్వారా చైనాని కదలకుండా ఉంచి, మలయా, ఇండోచైనా, సయాంలలోనూ, ఆఖరికి బర్మాలోనూ కూడా ప్రత్యక్ష జోక్యం కలిగించుకుని, కమ్యూనిస్టు ప్రమాదం పేరుతో వాటి సంపదలను అనుభవించటానికి ప్రయత్నించ వచ్చునేమో ననిపిస్తున్నది. పర్షియా నూనె జాతీయకరణ కార్యక్రమాన్ని వ్యాపార పోటీతో కూలదీయటానికీ, ప్రపంచ నూనె వ్యాపారాన్నంతా కబళించటానికీ గాను 22 అమెరికన్ నూనె కంపెనీలు ప్రపంచ కంపెనీలన్నిటినీ ఏకం చేయటానికి ఒక పథకం వేసి ప్రెసిడెంట్ ట్రూమనుకు సూచించినవి. వేసంగి నాటికి 40 డివిజన్ల సేన సిద్ధం చేయటానికి అట్లాంటిక్ దేశాలు నిశ్చయించినవి.

* * *

ఈ నెలలోనే ప్రపంచ సామరస్యానికి అనేక సూచనలు వచ్చినవి. అగ్రరాజ్యాలు అయిదూ కలిసి శాంతి ఒప్పందం చేసుకోవాలని కమ్యూనిస్టు చైనా, సోవియట్ యూనియన్, ఫ్రాన్సు అధ్యక్షుడు ఓరియోల్ మొదలైనవారు సూచించారు. శాంతికోసం తాను స్టాలిన్, ట్రూమన్‌లను కలుసుకోగోరుతున్నట్లు బ్రిటిష్ ప్రధాని చర్చిల్ ప్రకటించారు. సోవియట్ యూనియన్, పశ్చిమ రాజ్యాలు విడివిడిగా ఆయుధాల తగ్గింపు ప్రతిపాదనలను చేసినవి. అగ్రరాజ్యాల ఆయుధ తగ్గింపు సూచనలు క్రియలోకి రావటం అసాధ్యంగా కనిపిస్తున్నందువల్లనూ, ప్రపంచ అశాంతికి మూల కారణమయిన దారిద్ర్యాన్ని కొంతవరకు తొలిగించవచ్చును కనుకనూ, అగ్ర రాజ్యాలు తాము ఆయుధ నిర్మాణానికి వెచ్చించే ధనంలో కొంత భాగాన్ని తీసి, వెనక పడ్డ దేశాల సహాయానికై వినియోగించాలని భారత ప్రతినిధి బి. ఎన్. రావుగారు 26వ తేదీన సమితికి సూచించారు. ఆయుధ నిర్మాణంవల్ల తమ దేశాలు ఆర్థికంగా దెబ్బ తినగలవని భయపడుతున్న అమెరికా మిత్ర దేశాలు కొన్ని దీనికి మద్దతు ఇస్తున్నట్లు యు.పి.ఐ—ఫ్రాన్సు ప్రెస్ విలేఖరి సూచిస్తున్నారు.

* * *

ఈజిప్టులో నానాటికి బ్రిటిష్ విద్వేషం ప్రబలిపోతున్నది. పర్షియా ఈ నెల 6వ తేదీన రష్యాతో సరిహద్దు ఒప్పందాన్ని చేసుకున్నది. ఇదివరకు కమ్యూనిస్టు చైనాకు సమితి సభ్యత్వం ఇవ్వరాదని వాదించిన ఈజిప్టు, 6వ తేదీన సమితిలో ఆ అంశానికి అనుకూలంగా వోటు చేసింది. పర్షియా వాణిజ్య ఒప్పందాలు చేసుకున్నట్లే ఈజిప్టుకూడా రష్యాతో వాణిజ్య ఒప్పందాలు కుదుర్చుకున్నా ఆశ్చర్యంలేదు.

పశ్చిమ రాజ్యాల రక్షణ ప్రతిపాదనలు తనమీద దెబ్బ తీయటానికే ననీ, మొదటినుంచీ ఆ దేశాల జాతీయాశయాలను బలపరుస్తున్న తనవల్ల ఆ దేశాలకు ప్రమాదం లేదనీ, కనుక ఆ ఒప్పందంలో జేరితే వైర చర్యగా పరిగణిస్తానని రష్యా మధ్య ప్రాచ్య దేశాలకు హెచ్చరిక చేసింది. ఆ సందర్భంలో రష్యా పశ్చిమ రాజ్యాలు మధ్య ప్రాచ్య దేశాలను ఆక్రమించుకుని దోచుకుంటున్నట్లు ఆరోపించింది. ఆ అంశాన్ని పశ్చిమ రాజ్యాలు కావాలన్నా నిరాకరించలేవు.

* * *

బ్రిటన్ దోపిడీని పర్షియా, ఈజిప్టులు సవాలు చేసినట్లే, ఇరాక్ సౌమ్యంగా కోరినట్టే, ఇతర దేశాలు కూడా కోరుతున్నవి. ఏడెన్ను వదలిపొమ్మని యెమెన్ రాజ్యమూ, హోండ్యురాస్‌ని వదలిపొమ్మని గ్వాటిమాలా (మధ్య అమెరికా ప్రాంతం), సైప్రెస్‌ని వదలిపొమ్మని సైప్రెస్ ప్రజలూ, తమని మరొక యుద్ధంలోకి దించవద్దని మాల్టా ప్రజలూ కోరుతున్నారు. మలయాలో బ్రిటిష్ వ్యతిరేక విప్లవకారులు అంతకంతకూ విజృంభించటం వల్ల తమ అత్యుత్తమ సేనాని మాంట్‌గోమరీని అక్కడికి పంపాలని బ్రిటన్ ఆలోచిస్తున్నది.

సూయజ్‌ని బ్రిటన్ వదలాలంటే సుడాన్‌నూ, ఆఫ్రికా వలసలనూ, మలయానూ వదులుకోవాలి. ముడి పదార్థాలను సప్లయిచేసే ఆ దేశాలను బ్రిటన్ వదులుకోదు కనుక సూయజ్‌నూ వదలుకోదని చెప్పాలి. దీని పర్యవసానం ఏమిటో ముందు తెలుస్తుంది.



వివిధ నియోజక వర్గాలనుండి వివిధ రాజకీయ పక్షాల తరపున వివిధ రాష్ట్రాలనుండి

యూనియన్ ప్రజా సభకు

# రానున్న ఎన్నికలలో పోటీ చేస్తున్న మహిళలు

| నియోజక వర్గం | అభ్యర్థి | రాజకీయపక్షం |
|---|---|---|
| **ఆంధ్ర రాష్ట్రం** | | |
| రాజమండ్రి | శ్రీమతి గుమ్మిడిదల దుర్గాబాయిగారు యం.ఏ., బి.యల్., ఎం. పి. | కాంగ్రెస్ |
| ఏలూరు | ,, సి. అమ్మన్నరాజా బి.ఏ., బి.ఎల్. యం. ఎల్. ఏ. | ,, |
| విజయవాడ | ,, రాజ్యం సిన్‌హా | ,, |
| ,, | ,, జి. భారతీదేవి | కె. ఎమ్. పి. |
| **తమిళనాడ్** | | |
| చెంగల్‌పట్ | ,, సామి జగదాంబాల్ | సోషలిస్టు |
| దిండిగల్ | ,, అమ్ముస్వామినాథన్ | కాంగ్రెస్ |
| తిరువళ్ళూర్ | ,, మరగతం చంద్రశేఖరన్ | ,, |
| చెంగల్‌పట్ | ,, మీనాంబాల్ శివరాజ్ | షెడ్యూల్డ్ |
| తిరిచురపల్లి | ,, కమలమ్ రాజం | ,, |
| **యు. పి.** | | |
| లక్నో | ,, సావిత్రీభార్గవ | కె. ఎమ్. పి. |
| ,, | ,, విజయలక్ష్మీపండిట్ | కాంగ్రెస్ |
| ,, | ,, శాంతాదేవి | రామరాజ్య పరిషత్ |
| ,, | ,, గంగాబాయిదేవి | కాంగ్రెస్ |
| ,, | ,, సుశీలా నాయర్ | హిందూ మహా సభ |
| గోరకుపూర్ | ,, సుచేతా కృప్లానీ | కె. ఎమ్. పి. |
| సితాపూర్ | ,, ఉమా నెహ్రూ | కాంగ్రెస్ |
| మీరట్ | ,, కమలాచౌదరి | ,, |

(మిగతా 39-వ పేజీలో)



# సంస్కర్త

* * *

నాటిక

* * *

* శ్రీ ఆయపిళ్ల రామారావు *

[కాస్త చదువుకున్న స్త్రీ కంటపడితే ఆమె అందాన్ని, చందాన్ని, శీలాన్ని కూడ విమర్శించటం, చివరికి ఆమెలో సత్ప్రవర్తన ఉండదనుకోవటం అలవాటయి పోయింది. ఇంక, అందమైన స్త్రీ కనుపించిందా అంటే కనుచూపుమేర వరకూ అల్లా చూస్తూండటమే పరిపాటి. అల్లాంటి వాళ్లను గూర్చి ఉద్దేశింప బడిందీ నాటిక —

రచయిత]

పాత్రలు

బాబ్జీ — నిర్మల

నటేశం — మంగాలు

గోపాలం

ఒకటి

('నేషనల్ సేల్స్ కార్పొరేషన్' లో — టేబిలు, రెండు కుర్చీలు చక్కగా అమర్చబడి వుంటాయి. టైప్ మెషీన్ల చప్పుడు. కాలింగ్ బెల్ చప్పుడు — వెనుక చిన్నచిన్న మాటల శబ్దం. బాబ్జీ కూర్చొని File తిరగేస్తూంటాడు.)

(ప్రవేశం నటేశం)

బాబ్జీ : హల్లో నటేశం! ఏం ఇవాళ వేగం వచ్చేశావు! ఆఫీసు శలవా ?!

నటేశం : ఆఁ ఏం లేదు. కాస్త వంట్లోనో ఇంట్లోనో చికాగ్గా వుంటే C. L. పెట్టేస్నే.

బా : అదృష్టవంతుడివి. తల్చుకుంటే శలవు దొరుకు తుంది. నా సంగతి చూడు! వారానికి ఒక్కరోజు తప్పించి మున్నూటఅరవై రోజులూ ఉదయం నుంచి రాత్రివరకూ ఇల్లా కొట్టుకోవలసిందేగా! అదేనా, గవర్నమెంటు ధర్మంవల్ల బలవంతంగా మూయించ బట్టిగాని లేకుంటే అది కూడా తప్పదు.

న : ఎవరిమట్టుకు వాళ్లకట్లాగే తోస్తుందబ్బాయి. సరేకాని నీ పెళ్లి మాటేంచేసేవు! కుదిరిందా ఏమైనానా ?

బా : ఏం పెళ్లి పోనిస్తూ — నేననుకున్న ప్రకారం జరిగిస్తేగా మావాళ్లు !

న : ఏదో పెద్ద సంస్కర్త నవుతానంటావు. ఇంతకూ నీకు నచ్చిన 'యంగ్ విడోవో, విడాకులిచ్చిన అనాఘ్రాత పుష్పమో దొరకాలిగా! పోనీ ప్రయత్నమైనా చేయ వాయెను, ప్రయత్నిస్తే దొరక్క పోతారా ?

బా : మానవ జన్మ ఎత్తేక ఒక్క సంస్కరణకేనా తెగించక పోతే ఎట్లా! చూస్తున్నాన్లే. ఈసారి ప్రాణం పోయినాసరే నేననుకున్నది చేసి తీరుతాను. అసలు

మా నాన్నగార్కి కూడ సంస్కరణంటే ఇష్టమే. కాని ఆయన కట్నం తీసుకోకుండా మావాళ్ల పిల్లనే చేసుకుంటేచాలు ఓ పెద్ద సంస్కరణ చేసినట్లే అంటారు. చేసిచేసి అంత చిన్నపనితో ఎల్లా తృప్తిపడేది!

న: పోనీ ఆ పనే చేయకూడదూ? ఆ తరవాత చేయాలనుంటే ఎన్నిలేవు! పెళ్లి విషయంలో యీ చిన్న సంస్కరణతో ప్రారంభించి, ఇతరమైనవి ఆ తరువాత చేయవచ్చును. కాదా అంటే తక్కిన సంస్కర్తలకి ఆయా విషయాల్లో సహాయ పడరాదూ! ఈ రోజుల్లో కట్నం పుచ్చుకోవటం మానేయటం తక్కువ సంస్కరణటయ్యా! కావాలంటే నీ పిల్లలచేత పెద్దపెద్ద సంస్కరణలను చేయించవచ్చును లే.

బా: అబ్బాయి. నాకు తగిన అవకాశం లభించే సూచన కనిపిస్తూందోయి. చూడు! ఈ మధ్యనే మా షాపులో ఎపాయింటైన 'సేల్సుగర్ల్' నిర్మల ఎంత చక్కని పిల్లో!

న: అవునవును! ఆ కుడిచేతిమూల! చీరల డిపార్టుమెంటులోనేగా! తెల్లగా, వుంగరాల జుట్టుతో వుంటుంది. చల్లని మాటల్తో మంచి అమ్మకాన్ని చూపిస్తుంది—ఆమే గదూ!

బా: ఆమే! 'ట్రెయిన్డు సేల్సుగర్ల్' తనవద్దకు వచ్చిన ప్రతీకష్టమరుచేత ఒక్క చీరైనా కొనిపించి తీరుతుంది. ఆమె మాటలంత బాగుంటాయి.

న: ఇంతకూ ఆమెను పెళ్లాడితే ఏ విధమైన సంస్కరణ చేసిన వాడివవుతావూ?

బా: ఏవిధమో ఇంకా తెలీలేదు. ఏదో ఒక విధమైనది విధిగా జరిగే తీరుతుందనుకో.

న: (అనుమానంగా) ఆమెను కదిపేవా ఎప్పుడైనా!

బా: కదపడమేమిటి! రోజుకధమం నాల్గైదు సార్లేనా ఆమెతో మాట్లాడుతూంటాను. ఎప్పుడూ చిరునవ్వుతోనే మాట్లాడుతుందినాతో. ప్రతిరోజూ డబ్బు జమచేసే సమయంలో నాతో చలాకీమాటలు కూడా ఆడుతుంది.

న: ఒకవేళ రకం వారీ సరుకేమో!

బా: అదే నాక్కావలసింది. దేశంలో వ్యభిచారం మితిమీరుతోంది. అందుక్కారణం వ్యభిచరించేవాళ్లని పెళ్లి చేసుకోవాలని నిర్బంధించక పోవటమే. దుర్వృత్తిలో వున్నవాళ్లని సన్మార్గంలోకి దింపటం ఒక పెద్ద సంస్కరణ గాదూ! ఆమెకు బోధపరుస్తాను. ఒప్పిస్తాను. పతివ్రతని చేస్తాను. దీక్షపడతాను.

న: అయితే కోవిలవీధి వెళ్లరాదూ! అక్కడో సంఘం లేవదీసి సేవచేయవచ్చునే!

బా: ముందు నేను ఆచరణలో పెట్టనీ. తరువాతకి తక్కిన పని చేద్దాం.

న: ఏమోరా! అందరాని పళ్లేమో అని నా వూహ.

బా: నీ కన్నీ అల్లాంటి సందేహాలే. ప్రయత్నిస్తే ఎందుకు నెగ్గలేం. నీకు జ్ఞాపకం వుందీ! చిన్నతనంలో నేను విడని మల్లెమొగ్గల్ని నలిపి రెక్కలు విడదీసి పువ్వుల్ని చేసేవాణ్ణి. నువ్వు నన్ను చూసి నవ్వుతూండే వాడివి. ప్రయత్నిస్తే సాధ్యం కాని పని వుందా?

న: అసహజమైన పనులని తలపెట్టి నిరాశచెందేకన్న అందుబాటులో వున్నవాటిని ఆచరణలో పెట్టాలని నా వుద్దేశం.

బా: ఇందులో అసహజం ఏమీ లేదు. చూపిస్తాను కదూ!

న: నీ యిష్టం. నేను వెళ్తున్నా. మళ్లీ రేపు కలుస్తాను.

## రెండు

(అదే షాపులో)

(నిర్మల బాబ్జీవద్దకు వస్తుంది.)

నిర్మల: నమస్కారం మేనేజరుగారూ!

బాబ్జీ: నమస్తే! ఏమిటివిశేషం. (ముఖంలో కంగారు కనపరుస్తూ.)

ని: రొక్కం జమ తీసుకుంటారా!

బా: మీ అమ్మకం చాల ప్రోగ్రెస్‌లో వుంది. అంతటి విశేషమైన ప్రజ్ఞవున్న వాళ్లు అరుదు.

ని: నాలో ఏముందీ! అదంతా నేను అమ్మే సరుకు లోనూ వుంది.

బా: సరే! అది ఇట్లా యివ్వండి. (లెక్కించి) నాలుగు వందల యాభై. గుడ్, రసీటు తీసుకోండి...(జంకుతో) చూ...డు...నిర్మలా!...నాకు...ఒక్క సందేహం వుంది. అది తీర్చగలరా!

ని: (నవ్వుతూ) మీలాంటి వాళ్లకు సందేహాలుండటం ఆశ్చర్యమే. అడగండి చూదాం.

బా: ఆహాఁ...(మెల్లగా) మరేమీ లేదు...(జంకి) ప్రయత్నిస్తే సాధ్యంకాని పనులేమైనా వుంటాయా?

ని: (నిశ్చలంగా) అదేనా! ఆ పనులనుబట్టి సాధ్యాలూ అసాధ్యాలూ కూడ వుండవచ్చు.

బా: అయితే...నాకు చిన్నతనంనుంచి సంఘ సంస్కరణంటే చాల ఇష్టం. నేనే ముందు ఆచరణలో పెట్టాలని నా కోరిక.

ని: మంచి ఉద్దేశమే! కాని...

బా: నాకు తెలుసు మీరుకూడ నాతో ఏకీభవిస్తారని... చూడండి...మాటకి వ్యభిచారం ఈ రోజుల్లో సానుల నుంచి సంసారులకి కూడా ప్రాకుతూంది. తిండికో గుడ్డకో, వేషానికో ఏదో ఓదానికి ఎంతో అందమైన వాళ్లూ పతివ్రతలు కావలసిన వాళ్లూ లొంగిపోయి వ్యభిచరిస్తున్నారు.

ని: (జాలిగా) అవును పాపం.

బా: అల్లాటి వాళ్లను ఉద్ధరించాలని నా కోరిక. ఆ పరిస్థితుల్లోవున్న ఆమెను నేను పెళ్లిచేసుకుని ఒక ఉదాహరణ చూపించాలని నేను ఆతృత పడుతున్నాను.

ని: అందుకు తెగించ గలిగితే మంచి ఉద్దేశమే.

బా: తెగించటు మేమిటీ! యీ క్షణంలో కూడ సిద్ధంగా వున్నాను. నన్నెవరూ అడ్డుపెట్టలేరు.

ని: బాగానేవుంది. క్షమించండి. అవతల కస్టమర్సు కనిపెట్టుకొని ఉంటారు. వెళ్తాను.

(తెర)

## మూడు

(అదే షాపులో బాబ్జీ, నటేశం కూర్చొని వుంటారు)

న: ఏమోయి! ఎంతవరకు వచ్చింది నీ సంస్కరణ?

బా: దారిలోకొస్తూంది రా. ఆమెకూడ నాతో ఏకీభవిస్తోంది. నా సూచనల్ని ఆమోదిస్తూంది కూడా. అయినా నోరువిడిచి అడగటానికి జంకుతున్నాను.

న: జంకెందుకు. ఆమె సిగ్గుపడుతుందనా! ఆమెకు నిత్య కల్యాణమేగా! ఈ మాత్రం దానికి భయపడేవాడివి నువ్వేం ఆచరణలోకి పెడతావోయి. అన్నట్లామె ఇవాళ సీట్లో కనుపించలేదే!

బా: లేదు. ఈసారి అడిగేస్తాను. ఆమె నాలుగు దినాలు శలవు పెట్టింది. రానీ, నావుద్దేశాన్ని బయలెట్టేస్తాను.

న: నాలుగు దినాలు శలవెందుకు పెట్టిందీ! ఎంగేజ్ మెంట్సు హెచ్చయ్యాయేమో పాపం!

బా: లేదు రా! వంట్లో బాగులేదని కారణం వ్రాసింది.

న: అయితే ఇంకేం. డాక్టర్ల వెనకాల తిరుగుతూందేమో! అలాటి వాళ్లకు మామూలేగా! బాబ్బాబు. అది మాత్రం జాగ్రత్త. సంస్కరణమాట దేముడెరుగును గాని నువ్వుకూడ హాస్పిటలుకు వెళ్లటం తటస్థిస్తే మంచి సంస్కరణే అవుతుంది.

బా: అంత తెలివితక్కువ వాణ్ణట్రా. అవన్నీ కనుక్కుంటాగా.

న: సరే నీ యిష్టం. నేను వెళతా.

బా: ఏం ఇవాళింత వేగంగా వెళ్లిపోతున్నావు?

న: కొంచెం పనుందోయి. వస్తానుగా.

(నటేశం వెళుతూండగా తెర)

## నాలుగు

(నాలుగు రోజులు గడిచేక అదే షాపులో బాబ్జీ కూర్చుని వుంటాడు.)

ని: (ప్రవేశించి) నమస్కారం బాబ్జీగారూ.

బా: నమస్తే. ఎల్లావుంది వంట్లో. అబ్బ...చాల నీరసంగా కనుపిస్తున్నారే...

ని : (కొంచెం సిగ్గుతో) అవునండి.

బా : డాక్టర్ని కన్సల్టు చేసేరా, లేదా నేను ఏర్పాటు చేస్తాను. డాక్టరు నీలాచలం నాకు మంచి ఫ్రెండ్. ఇంకా నాలుగు రోజులు రెస్టు తీసుకుంటే బాగుంటుంది. కాగితం ఇవ్వండి ప్రొప్రయిటరు గారితో చెప్పి శెలవు ఇప్పిస్తాను.

ని : (చాల సిగ్గుతో) డాక్టరు అవసరం లేదండి. మీ దయకు చాల సంతోషం.

బా : అయితే మీ అస్వస్థతకి కారణం!...మరేమీ అనుకోరుగకద! (ఖండితంగా) అదిగాని ప్రెగ్నెన్సీయా!

ని : (సిగ్గుతో ఊరుకుంటుంది).

బా : (కొంచెం ఆవేశంతో) ఇకనేం! నేననుకున్నట్టే అయింది. అయినా భయపడనక్కర్లా. ఆ భారమంతా నాది. మీ రెంతమాత్రం సంశయించ నక్కర్లేదు. ఇదుగో...వినండి నా మనస్సులోని భావాల్ని ఇదివరకే మీకు తెలియజేసేను. మీ కభ్యంతరం లేకుంటే యీ క్షణంలో మిమ్మల్ని వివాహం చేసుకోటానికి సిద్ధంగా వున్నాను.

ని : (గాభరాతో) బాబ్జీగారూ!

బా : (నిర్మలమాటకు అడ్డువచ్చి మరికొంచెం ఆవేశంతో) మరేమీ అనకండి. నాకన్నీ తెలుసు. సంఘానికి నేను జంకే వాణ్ణికాను. మీరు ఊc అంటే అన్ని ఏర్పాట్లు చేయిస్తాను...చూడండి నిర్మలగారూ మీరు తొందరపడి అమాయకంగా మరే ఇతరపనికీ ప్రయత్నం చేయకండి. వ్యభిచారంయొక్క పరిణామాల్లో ఇదోటి. ఎంతోమంది కలకల్లాడే బిడ్డల్ని అల్లా నశింపచేస్తారు. మీ భావి మీరాలోచించుకోండి. నన్ను పెళ్లిచేసుకుంటే ఆ భారం అంతా నేను భరిస్తాను. మీలాంటి వాళ్లు వివాహం చేసుకుంటేనే మనసంఘం బాగుపడుతుంది.

ని : (శాంతంగా) ఓహో! మీరు నన్ను పెళ్లిచేసుకుంటానంటారా! (వెటుగా నవ్వుతుంది)

బా : (ఇంకా తొందరగా) నిజంగా అంతే నిర్మలా, నా మాట విను. మనకిద్దరికీ అఖండ సన్మానం జరుగుతుంది. లోకం హర్షిస్తుంది. సంఘంలో మనపేర్లు చిరస్థాయిగా వుంటాయి. ముఖ్యంగా బిడ్డ సంగతి ఆలోచించు.

ని : (బిగ్గరగా నవ్వుతుంది)

బా : ఆc. నవ్వుతున్నావా! నిర్మలా! అల్లాంటి వాటికి నువ్వెంత అలవాటు పడినా చూడు (మెల్లగా) నిర్మలా ఇది నువ్వు చాల సీరియస్‌గా ఆలోచించవలసిన సంగతి. నువ్వు చెయ్యబోయే పనిలో ఏదైనా ప్రమాదం వస్తుందనుకో. నీవంటి సౌందర్యవతి రూపుమాసి పోవలసిందేనా. అమూల్యమైన బిడ్డని కాపాడాలన్న జాలి వహించవూ! (ఇంకా మెల్లగా) ఈ సంగతి ఇంకెవరికీ తెలియనియ్యకు. పెళ్లయ్యాక నావల్లే అయిందని చెప్పవచ్చును. అందువల్ల నీకూ నాకూ కూడ చెడుపేరు రాదు. ఊc అను నిర్మలా.

ని : (మరింత బిగ్గరగా నవ్వుతుంది)

బా : (తొందరగా) నిర్మలా నువ్వు నేనన్న మాటల్ని పెడచెవిని పెడుతున్నావు. మంచిది కాదు సుమా!

ని : (ఆపుకో లేనంతగా నవ్వుతూనే వుంటుంది)

బా : నీకు నామాటలు హాస్యంగా వున్నాయా (నిస్పృహతో) నీలాంటి వాళ్లకు నే నేవిధంగా నచ్చచెప్పాలో తెలియటంలేదు. నామాటవిను నిర్మలా.

ని : (నవ్వు ఆపుకుంటూ) భేష్! బాగుంది (ప్రశాంతంగా) బాబ్జీ! నన్ను పెళ్లాడా అనుకుంటున్నారు కదూ మీరు.

బా : ముమ్మాటికి నిజం నిర్మలా! దానికి ఎన్ని అడ్డంకులొచ్చినా లెక్కచెయ్యను.

ని : సరే: బాబ్జీ అయితే నాతో రండి మాట్లాడుదాం.

బా : ఇదిగో! నడు. (పక్కకుచూసి) ఓయి నీలాద్రీ! ప్రొప్రయిటరుగారు వస్తే బయటకు పనిమీద వెళ్లేనని చెప్పు.

(ఇద్దరూ వెళుతూండగా తెర.)

# నేడు మీరు మెక్లీన్‌తో పళ్లు తోముకున్నారా?



మెక్లీన్స్ పెరాక్సైడ్ టూత్‌పేస్టుతో మీ పళ్లను, ఇగుళ్లను కాపాడుకొండి. దీనిలో పళ్లను అరగదీసే ప్రమాదకరమైన వస్తువు లేవీలేవు. ఇది అతిమృదువుగా మీ పళ్లను నిగనిగమెరిసేటట్లు శుభ్రపరిచి, నోటిలోబయలు దేరునట్టి దంతక్షయానికి మూలకారణమైనట్టి ప్రమాదకరమైన ఆమ్లాలను విరిచివేసి దంత క్షయాన్ని నివారిస్తుంది. మెక్లీన్స్ పెరాక్సైడ్ టూత్ పేస్టు మిక్కిలి పరిశుభ్రమైనది, వాడునపుడు ఆహ్లాద మొసగుతుంది — అందుకే ప్రపంచమంతా లక్షలకొలది ప్రజలు నిత్యం రోజూకు రెండుసార్లు మెక్లీన్స్‌తో పళ్లు తోముకుంటారు.

"నా పళ్లు ముత్యాల వలె మెరిసి పోతున్నవి కనుక నేను ఏ టూత్ పేస్టును వాడుతున్నానో తెలియ పరచవలసిందని ఈ వారంలో వేర్వేరు వ్యక్తులు ముగ్గురు నన్ను అడిగియున్నారు"

## నేడే మెక్లీన్స్‌ను కొనండి!




MTY-5 TEL.

వ్యాపార విచారణకు వీరికి వ్రాయండి :— జె. యల్. మోరిసన్, సన్ అండ్ జోన్స్ (ఇండియా) లిమిటెడ్., మహాలక్ష్మి ఆలయమునకు ఎదురుగా, వార్డెన్ రోడ్, బొంబాయి 26.

## ఐదు

(నిర్మల ఇంటిముందు బాబ్జీ నిర్మలా ప్రవేసిస్తారు)

నిర్మల : (తలుపు తడుతూ) మంగాలూ ! తలుపు తియ్యి.

మంగాలు : (లోనుండి) అమ్మా యిదిగో వస్తున్నా (తలుపు తీసి) ఏవమ్మా ఈ వేళింత వేగంగా వచ్చేసేరు.

ని : ఏం లేదు వెళ్లి త్వరగా కాఫీ ఫలహారంచేసి తీసుకురా. (బాబ్జీతో) రండి లోనికి (మంగాలుతో) ఆయన యింట్లోవున్నారా మంగాలూ !

మ : (వెళ్లిపోతూ) ఇప్పుడే బయటనుంచి వచ్చేరమ్మా.

గోపాలం : (లోనించి వస్తూ) ఏం నిర్మలా త్వరగా వచ్చేశావ్ ? వంట్లో ఏమీ బాధ లేదుగద ! ఆదివారం పార్టీకి అన్ని ఏర్పాట్లూ చేసేను. నీ తరపున ఎవరెవర్ని పిలవాలో ఎడ్రసులిచ్చేయి. హాఁ... మరచాను. నిన్న తెచ్చిన 'నెక్లెస్' నీకు నచ్చిందా ! లేకుంటే అది వాపసుచేసి ఇంకోటి తెస్తాను...మాటల సందట్లో మరచాను. ఈయనెవరో నేను తెలుసుకో వచ్చునా ?

ని : ఈయన మాకంపెనీ మేనేజరుగారు. Mr. బాబ్జీ.

గో : చాల సంతోషం. నమస్కారం బాబ్జీగారూ. క్షేమమా !

బా : (అయోమయంగా) నిర్మలా... ఈయన...

ని : ఈయనే నండీ నాపతిదేవుడు Mr. గోపాలం, B.Sc. ఇన్సూరెన్సు బిజినెస్ చేస్తున్నారు. చాల మంచివారు. ఆదర్శ పురుషులు. (భర్తతో నవ్వుతూ) విన్నారా ! నన్ను బాబ్జీ మారేజ్ చేసుకుంటారట !

బా : (స్థబ్దుడై) న...నమస్తే Mr. గోపాలం (నిరాశతో) నిర్మలా...

ని : ఆఁ ! Mr. బాబ్జీ క్షమించి ముందు వెనుకలు చూసుకోకుండా ముందంజ వేయబోకండి. మీరు సంస్కర్తలు కావటానికి ముందు చాలా నేర్చుకోవాలిసుంది. ఎదటివారిసంగతి పూర్తిగా తెలిసికోకుండా తెలివి తక్కువగా ఎన్నడూ మీ సంస్కరణాభావం ప్రయోగం చెయ్యకండి. (మరికొంచెం ఆవేశంతో) సంస్కర్తలట, సంస్కర్తలు. నాకు బదులు ఒక కురూపి వుంటే మీ సంస్కరణాభిలాష ఆమెపైన వుంటుందా ! స్త్రీ కొత్త చదువుకుని ముందుకువస్తే ఆమెను వ్యభిచారిణిగా తలచటమేనా! స్త్రీ విద్యని ప్రోత్సహించే వాళ్లూ మీరే, చదువుకున్న స్త్రీని తప్పుగా భావించే వాళ్లూ మీరే, కళ్లుతెరచి ఇకముందు జాగ్రత్తగా ప్రవర్తించాలని తెలుసుకోండి. నేను శెలవులోవున్న నాలుగు రోజులూ మీ స్నేహితుడు నటేశం వచ్చేడా మీ షాపుకు. అవసరం వున్నా లేకపోయినా రోజుకోసారేనా నావద్దకు రావటం క్రొత్త చీరతోనైనా వచ్చావయా అని పలకరించటం అతని కలవాటు. మూర్ఖుడు.

గో : చాలు నిర్మలా సంగతి నాకు అర్థమయింది. ఆయన కూడ ఇప్పటికి తెలుసుకునే వుంటారు. ఇకనుండి ఆయన నిన్ను సోదరిగా భావిస్తారు లే. ఏం Mr. బాబ్జీ!

బా : చెల్లీ !

ని : ...............

బా : నన్ను క్షమించమ్మా. తెలివితక్కువగా నే నన్న మాటలకు సిగ్గుపడుతున్నాను.

ని : అవన్నీ మరచిపో బాబ్జీ.

గో : నిర్మలా, ఇంటికి వచ్చిన పెద్ద మనిషిని గౌరవం చెయ్యక్కర్లా. లోనికి దయచేయండి బాబ్జీ. (నిర్మలతో) మంగాలును పిల్చి మంచి రిఫ్రెష్‌మెంట్ ఇప్పిస్తూ.

ని : ఆ ఏర్పాట్లు ముందే చేశాను.

మ : (లోనుండి) హాలులో 'ట్రే' సిద్ధం చేసేనండి.

గో : ఇంకేం నడవండి లోనికి.

(తెర)

(సమాప్తం)



# అల్లుళ్ళ ఆకలి

* " మృణాళిని " *

" ఈ దసరాకి మైసూరు వెడదామనుకొంటూ ఉండేగా మీ ప్రేమపూర్వకమయిన జాబు చేరింది. మీ కార్డుచూచిన మరుక్షణంలో ప్రయాణాన్ని విరమించుకున్నానంటే మీరు నమ్మాలి. అయితే నా ప్రయాణాన్ని విరమించుకోనేందుకు ముఖ్యంగా రెండు కారణాలున్నై.

అందులో మొదటిది : నా సంసారపు ఖర్చుల నిమిత్తమై నేను చేసిన అప్పు సుమారు వెయ్యి రూపాయలవరకూ అయింది. అది తీర్చటానికి మీరు చేసే సహాయం ఎంత? ఎలా అయినా మీరు ఏడెనిమిదివందలు సర్దుబాటు చేస్తే తరువాయి మనం చూసుకోవొచ్చు.

రెండోవిషయం : ఇకనుండి నేను ఉద్యోగం చేయ దలుచుకోలేదు. ప్రపంచయాత్ర చేయాలని సంకల్పించుకొన్నాను. అథమం ఆసేతుసీతాచలం అయినా తిరిగి రావాలని ఉన్నది. ఈ సందర్భంలో మీ అమ్మాయినీ, మనవరాల్నీ మా యింట ఉంచటంకంటే మీ యింటనే ఉంచటం శ్రేయస్కరం. ఈ ప్రయాణం ఖర్చులక్రింద నాలుగయిదు వందలు సర్దవలసి ఉంటుంది. మొత్తంమీద పదిహేనువందలకు తక్కువ కాకుండా రొఖ్ఖం మీవద్ద జాగర్త పెట్టి, నేనువచ్చిన మరుక్షణంలో, నేను అడగకుండా, అతిరహస్యంగా మీ అమ్మాయిద్వారా నాకు అందజేయాలి. మరువకండి. డబ్బుమాత్రం మరువకేండి. సెలవు "

2

" మీరెలాగూ ఉత్తరం వ్రాస్తారనీ, పండక్కి మేమెలాగూ రావాలనీ అనుకొంటూనే ఉన్నాం. మీ మనవడు 'తాత' 'తాత' అంటూనే ఉన్నాడు. తప్పకుండా వస్తాం. మీరు మాకు ఏం లోటు చేసారని రాకుండా ఉంటాం.

అయినా ఒక్క పొరపాటు చేసారు సుమండీ! మానాన్న శుద్ధలోభి అని మీకు తెలుసు. అత్తారింటికి వెళ్తానంటే మహారాజులా వెళ్ళమంటాడు. డబ్బడిగితే మొండిచెయ్యి తిప్పుతాడు. ఈ సంగతి మీకు తెలీదనుకుంటాను. తెలిసిఉంటే మీరు రాకపోకల ఖర్చులు M. O. ద్వారా పంపి ఉందురు. ఇక్కణ్ణుంచి మాకు రాను యాభై రూపాయలూ, పోను యాభై రూపాయలూ కలిసి వందరూపాయలు ఫస్టు రైలుఖర్చులు. అక్కడికీ అభిమానం వదులుకొని సెకండు క్లాసులో వస్తే, వందరూపాయలు దారి ఖర్చులయితే యింకో వంద పై ఖర్చవుతుందని మీకు తెలుసు. కనుక యింకా పండుగకి అయిదు రోజుల వ్యవధి ఉన్నది కనుక యిప్పుడే M. O. ద్వారా రెండు, మూడు వందలు పంపగోర్తాను. ఒకవేళ సాదా మనీఆర్డర్ ఆలస్యం అవుతుందంటే టెలిగ్రాం ద్వారా పంపండి. మరోలా భావించకండి. మీ అమ్మాయీ, మనమడూ క్షేమం— ఉంటా "

3

" తమరు వ్రాసిన పిలుపు కార్డు చేరింది. తప్పకుండా రమ్మన్నారు. ఏమీ అభ్యంతరంలేదు. కాని తమరు ఒక్క విషయం మరచిపోతున్నారు. గడచిన ఆగస్టులో నా పెళ్లి అయింది. అప్పుడు అలకపానుపుమీద వాగ్దానం చేసిన 'హంబర్ సైకిల్' అండ్ 'గ్రామోఫోన్' ఇంతవరకూ తమరు కొని నాకు అంద జేయలేదు.

మీరు గౌరవస్థులనీ, మర్యాద కలవారనీ యింతవరకూ చూసాను. ఆగస్టు దాటింది. సెప్టెంబరు దాటింది. అక్టోబరు దాటుతున్నది. గ్రామోఫోన్ ఆలస్యమయినా సైకిల్ త్వరగా యిస్తారనుకొన్నాను. మొన్న సెప్టెంబరు పరీక్షలకు ఎంత బాధపడ్డాను. దానవాయిపేటనుంచి చచ్చినట్టు కాలేజీవరకూ నడిచివచ్చాను. అలాఅయినా ఓ పేపరుకి

ప్రైమ్‌కి అందుకోలేక పోయాను. మిగిలిన పేపర్లు ఎంత గొప్పగావ్రాసి ఏం లాభం? సెప్టెంబరుకి పడిన శ్రమంతా వృథా. మళ్లీ మార్చికి వెళ్ళాలి. ఇంతకీ కారణం? మీరు సకాలానికి 'సైకిల్' అందచేయక పోవటం.

అందుచేత యీసారి పండుక్కి— నేను వచ్చేటప్పటికి సైకిలు, గ్రామోఫోను సిద్ధం చేయించండి. పయిగా సెప్టెంబరులో పరీక్షపోయే కారణంగా నేను యింక యింటికి వెళ్ళదలచుకోలేదు. మార్చి పరీక్షలయాక ఏకంగా నాభార్యతో మాయింటికి వెడతాను. కనుక అక్టోబరు, నవంబరు నెలలలో ముహూర్తంచూసి కార్యం చేయటం అవసరం.

పోగా, జనవరినుండి నేను కాకినాడలో ఉండి చదవదలుచుకొన్నాను. మా ఇద్దరికీ అయ్యేఖర్చుకూడా మీరే భరించాలి. ఈ విషయాలన్నీ నేను వచ్చేటప్పటికి సర్దుబాటు చేయనిపక్షంలో ఈ జన్మకు మీ అమ్మాయికీ— నాకూ ఏవిధమయిన సంబంధమూ ఉండదు. తాపీగా ఆలోచించుకొని, నా అభివృద్ధిని కోరుతూ నాకు తగిన ఏర్పాటులు చేయించండి.

చిత్తగించవలెను—"

[ఆడపిల్లను కన్న తండ్రికి జరిగే యీ సన్మానాలు చేసే వాళ్ళందరూ కాలేజీ చదువులు చదివే వాళ్ళేననీ; భావి భారతదేశాన్ని అభ్యుదయ పథాన పురోగమింప జేసేవారనీ మనం మరచిపోకూడదు.]



# కథ అడ్డం తిరిగింది

*  "శ్రీ"  *

[రామదాసు ఒక చిత్రకారుడు. ఒక రోజున తన మేనత్త రాధమ్మగారి కూతురు మణి దగ్గరనుంచి, తన మేనత్తకు చాల జబ్బు చేసిందని, వాళ్లింట్లో చాల ఇబ్బందిగా ఉందని, ఒక ఉత్తరం వస్తుంది. దాసు ఆరోజు, విశ్వం అనే స్నేహితుడితో సినిమాకు వెళ్లి, అక్కడ నుండి తాను ఒంటరిగా సముద్రతీరానికి వెళ్తాడు. అప్పుడు తనకు తన పూర్వపు జీవితమంతా స్మృతి పథానికి వస్తుంది.

దాసుకి చిత్రకళమీద ఆసక్తి ఎక్కువ అవుతున్న కొలదీ, చదువుమీద శ్రద్ధ తగ్గిపోతూ ఉంటుంది. కనుక తన తండ్రి దాసుకి చదువు అబ్బటం లేదని చీవాట్లు పెడ్తాడు. దాసు, తన తండ్రి చీవాట్ల నుండీ, తన సవతితల్లి అధికారము నుండీ తప్పించుకొని, స్వేచ్ఛగా జీవించటం కోసం ముక్తేశ్వరంలో ఉన్న తన మేనత్తగారింటికి పారిపోతాడు. తను మేనత్తగారింట్లో, తన చిత్రకళను అభివృద్ధి చేసుకొంటాడు. కొంత కాలానికి దాసు, తను, చితికిపోయిన మేనత్తగారి సంసారానికి ఒక బరువని గ్రహించి, అచ్చటినుండి విశాఖపట్టణం వచ్చేస్తాడు. దాసు, దైవ వశాత్తూ "ప్రణయిని" అనే ఒక పత్రికకు, చిత్రకారునిగా ఎన్నుకొనబడ్తాడు. విశాఖపట్టణం లోనే, మహారాణీ పేటలో, దాసు ఒక గది అద్దెకి తీసుకొని ఉంటాడు. కొంతకాలానికి ఎదురింటి రూములోనున్న కాలేజీ స్టూడెంటు విశ్వంతో పరిచయం కలుగుతుంది.

దాసు, మణి తనకు ఎందుకలా ఉత్తరం వ్రాసిందా అని ఆలోచిస్తో ఉంటాడు.]

## 3

దాసు మర్నాడు ప్రొద్దుటే లేచి కాలకృత్యాలు తీర్చుకొని కాఫీ త్రాగేసరికి 8 గంటలయింది. 'పోస్టాఫీసుకు వెళ్లి మనియార్డరు చేయాలి. ఎంత చేస్తే బాగుంటుందో' అని ఆలోచనలో పడ్డాడు దాసు. ఇక్కడ దాసును గురించి మరికొంత తెల్సుకోవాలి.

మేనత్తగారిల్లు విడిచి వచ్చిన తరువాత ఈ 7, 8 సంవత్సరాలలోను దాసు చిత్రకారునిగా చాలా పేరు సంపాదించాడు. చాలా పత్రికలకు తన చిత్రాలు పంపుతూంటాడు. ఇంకా ఎంత మందో తన చిత్రాలు పంపమని కోరుతూంటారు. పెద్ద సంసార బాధ్యతేమీ లేనందున అతడు సంపాదించుకొన్నదతనికి పుష్కలంగా సరిపోతూంటుంది. అప్పుడప్పుడు సినిమాలకి, సిగరెట్ల ఖర్చు తప్ప అతనికెక్కువ యితర ఖర్చులు కూడా లేవు. అతడెప్పుడూ సామాన్యమైన పంచ, బెంగాలీ షర్టు ధరిస్తూంటాడు. భోజనం హోటులు నుండి తెప్పించుకుంటాడు. కాఫీ మాత్రం స్టవు వెలిగించుకొని తనకు తానే చేసికొంటాడు.

దాసు ప్రస్తుతముంటున్న యింట్లో రెండు గదులు, వసారా, మధ్య చిన్న గచ్చువాకిలి, మళ్లీ పెరటి వసారా, ఒకచిన్న కొట్టుగది ఉన్నాయి. అతడి మట్టుకది ఎక్కువే. కాని అంతకన్న చిన్న యిల్లు దొరక్క పెద్దది తీసికొని

ఉండడం యిష్టం లేక, ఆ యిల్లంతా తన క్రిందే ఉంచేసు కున్నాడు.

దాసు యిల్లెప్పుడూ పరిశుభ్రంగా ఉంటుంది. సామాను లన్నీ చక్కగా అమర్చబడి ఉంటాయి. అతని గదిలో, అతడు వేసినవి, మరికొందరు యితర చిత్రకారుల చిత్రాలతో అలంకరింపబడి ఉంటుంది. ఒక ప్రక్క నొక ఈజీ ఛెయిరు, రెండు కర్ర కుర్చీలు, ఒక టేబిలు ఉంటాయి. టేబిలు మీద రంగులపెట్టె, కుంచె వగైరా సామాను లుంటాయి. మరొక ప్రక్క బీరువాలో ఖరీదయిన అనేక పెద్ద పెద్ద గ్రంథాలుంటాయి.

చిన్నతనంలో తండ్రి తనను చదువుకోమని ఎంత ప్రోత్సహించినా దాసు వినిపించుకోలేదు. కాని పెద్ద వాడయినాక ప్రతి వ్యక్తికీ సాహిత్యంలో కూడా కొంత ప్రవేశముండాలి అనే విషయం గ్రహించేడు. అప్పటినుండి అతడు ఎన్నో తెలుగు, ఇంగ్లీషు గ్రంథాలు చదవడం మొదలు పెట్టాడు. తాను మొదట్లో సంపాదించిన డబ్బులో చాలా భాగం షెల్లీ, బైరన్ మొదలగు రచయితల గ్రంథాలకి ఖర్చు పెట్టాడు. త్వరలోనే సాహిత్యంలో తన కున్న కొద్ది జ్ఞానాన్ని వృద్ధి చేసికొన్నాడు.

దాసు కిప్పుడు సాహిత్య లోకంలో తెలియని విషయం లేదు. తెలుగు, ఇంగ్లీషులలోని గొప్పగొప్ప రచనలన్నీ అతడు చదివినవే. సాహిత్యం కళకు ఎంత సన్నిహితమై నదో, కళలేని సాహిత్యం ఎంత చప్పగా ఉంటుందో అతడు చర్చిస్తూంటాడు. కళాజగత్తులో ఆధునిక రచనలకూ పూర్వ రచనలకూ ఉండే స్థాన బేధాన్ని గూర్చి తర్కిస్తూంటాడు.

అయితే అతనికి రష్యాలో విప్లవ దినాల్లో కళ ఎంత సన్నగిల్లి పోయిందో తెలును. కాని ప్రస్తుత రాజకీయ పరిస్థితు లేమిటో తెలియవు. రాజకీయ వేత్తలు, మత ప్రవక్తలు కళను ఎంత కర్కశంగా నలిపివేశారో అని విచా రిస్తాడు. కాని దేశంలో కరువు ఎందుకు వచ్చింది అని ఆలోచించడు. హర్షుని కాలంలో కావ్య జగత్తులో కళకెంత ఉత్కృష్ట స్థానం లభించినదీ, ఆధునిక యుగంలో కళా ప్రాముఖ్యత ఎంత పడిపోయినదీ చెప్పగలడు. కాని కస్తూరిబా గాంధీ ఎప్పుడు చనిపోయిందో, గాడ్సే మరణ ఫలితమేమైనదీ అక్కర లేదతనకి. ఇబ్సెన్ నాటకాలు కేవలం ప్రబోధ సాధనములనీ, అందులో కళ పూర్తిగా క్రింది మెట్టుకు దిగిపోయిందనీ, బెర్నార్డ్‌షా నాటకాలు పూర్తిగా నీతి బోధకాలనీ, కళను ఉత్తమాదర్శంగా పెట్టుకోని సాహిత్యం వాసనలేని పూవు వంటిదనీ అంటూంటాడు.

అతడెప్పుడూ వార్తా పత్రికలకు డబ్బు వృథా చెయ్యడు. కాని కొన్ని పక్షపత్రికలకు మాత్రం సాహిత్యం, కళ చేతులు కలిపి సాగిననాడు దేశ సంస్కృతికి, దేశాభ్యున్నతికి ఎంత తోడ్పడగలవో వివరిస్తూ ఉపన్యాస ధోరణిలో వ్యాసాలు వ్రాస్తూంటాడు.

దాసుకి ఊరిలో పత్రికాధిపతులు తప్ప పరిచయస్థులని చెప్పుకోదగ్గవారు బహు తక్కువ. స్నేహితుడని చెప్పుకో దగ్గవాడొక్క విశ్వం మాత్రమే. తాత్కాలికంగా పరిచయ మైనది—సరే పరిచయంగా ఉండొచ్చు—అంతేకాని ఒకరి పరిచయం కొరకు ప్రాకులాడే మనిషి మాత్రం కాడు దాసు. ప్రపంచంలో ఎవ్వరినీ లక్ష్యపెట్టనివారిలో అత డొకడు. 'పోయిన వస్తువుకొరకు విచారించడం బుద్ధి తక్కువ. దొరకిన వస్తువును పోగొట్టుకునేంత నిర్భాగ్యు డింకొకడుండడు—అందని వస్తువు కొరకు అర్రులు సాచడం అవివేకం' అంటుండతని మతం. దాని కనుగుణంగానే ఉంటుందతని ప్రవర్తనకూడా.

"ప్రస్తుతమొక రూ 30 లు మనియార్డరు చేస్తాను. అవసర మయితే మళ్లీ వ్రాయమని వ్రాస్తాను" అను కుంటూ పోస్టాఫీసుకు బయలుదేరాడు దాసు.

## 4

ఆ దినం ఆదివారం. ఆకాశమంతా దట్టంగా మబ్బువేసి ఉంది. దాసు వీధి కిటికీలో కూర్చుని మేఘావృతమైన ఆకాశాన్ని తిలకిస్తున్నాడు. క్రమంగా ఆకాశం నల్ల బడింది. పెద్ద వర్షం ప్రారంభమయింది. దాసు సిగరెట్టు ముట్టించాడు. చెదరిన నీటి తరంగాల్లాగ అతని మెదడులో ఎన్నో ఆలోచనలు పరుగులెడుతున్నాయి.

# కథ అడ్డం తిరిగింది

ఇంతలో వీధిలో బండి చప్పుడయింది. దాసు యింటి ముందు ఒక జట్కాబండి ఆగింది. బండివాడు వచ్చి 'బాబూ రామదాసు గారంట, వారి యిల్లు ఇదేనా?' అన్నాడు. 'అవును—ఎందుకు?' అన్నాడు దాసు ఆశ్చర్యంగా చూస్తూ—'ఎవరో అమ్మగారు వచ్చారు' అంటూ బండివాడు—'అమ్మా! దిగండి ఈ యిల్లే' అన్నాడు. బండిలోనుండి చాలావరకు తడిసిన వస్త్రాలతో 18 సం॥ ల యువతి దిగింది. బండివాడు ఒక పెట్టె, పరుపు గోనెసంచితో కొన్ని సామానులు తీసి లోపల పెట్టి, అద్దె పుచ్చుకొని వెళ్లిపోయాడు.

దాసు ఆమెను చూసి ఒక్కసారి నిర్ఘాంత పోయాడు. చక్కని విగ్రహం, సంస్కారం లేని జుట్టు—మాసిన తెల్ల చీర—వంటి నేవిధమైన అలంకారాలు లేని ఆ అపరిచిత వ్యక్తి ఎవరా! అని దాసు విస్తుపోయి చూస్తున్నాడు.

ఆమెలోపలికి వస్తూనే 'జ్ఞాపక మున్నానా బావా?' అన్నది.

'ఎవరు మణీ!' అన్నాడు మరింత ఆశ్చర్యంగా—

ఆమె ప్రస్తుత వేషం, అనుకోకుండా హఠాత్తుగా ఇలా రావడం అన్నీ ఒక్కసారి గాభరా పెట్టాయి. కొంత సేపటివరకు అతడు తనను తాను సంబాళించుకోలేక పోయాడు.

'అమ్మ క్షేమమా!' అన్నాడు కొంతసేపటికి.

'అమ్మ చనిపోయి 14వ దినం. నీ డబ్బు అందేసరికే ఆమె చనిపోయింది. కాని నువ్వు పంపిన డబ్బు చాలా అవసరమయిన సమయంలో అందింది.'

ఆమె కళ్లంట నీళ్లు బొటబొటా రాల్తున్నయి. దాసుకి అంతా అయోమయంగా ఉంది. ఆమె నెలా ఓదార్చాలో తెలియలేదు.

కాని కొంతసేపటికి ఆమే కళ్లు తుడుచుకొని 'అమ్మ నిను గురించి చాలా అనుకుంది.—నువ్వు మా యింటినుండి వెళ్లిపోయిన కొన్ని దినాలనుండే నిన్ను చూడాలనుంది అనుకునేది. ఆ తరువాత నన్ను నీకిచ్చి పెళ్లిచేయాలనే ఉద్దేశ్యంకూడా ఉండేది. కాని నీవెక్కడున్నావో కూడా తెలియలేదు మాకు. ఎవరో నువ్వు కలకత్తా వెళ్లేవని చెప్పేరు. చాలాకాలం నీ ఉనికిని తెల్సుకుందామని ప్రయత్నించి చివరకి నీ పత్తా తెలియక 2 సం॥ క్రితం నాకు పెళ్లిచేసింది. నా పెళ్లినాటికే మా ఆయనకి వయస్సు మీరింది. పెళ్లవగానే మా ఆయన నన్ను తీసుకు వెళ్లాలనుకున్నారు. కాని అమ్మకు అప్పటికే కొంచెం సుస్తీగా ఉంది. 'నాకు వంట్లో బాగుండలేదు. కొంచెం నెమ్మదించాక పిల్లను దిగ బెడ్తాను, అన్నదమ్మ. కాని మరి రెండు నెలలకే మా ఆయన చనిపోయారు. ఆ తరువాత అమ్మకు జబ్బు క్రమంగా హెచ్చయింది. కొలది దినాలక్రితమే నీవు ఇక్కడున్నావని తెలిసి నీకు ఉత్తరం వ్రాసేను. కాని నీకు ఒకసారివచ్చి అమ్మను చూచేందుకు దయలేక పోయింది. ఆమె చనిపోయేముందు కూడా నిన్ను తల్చుకుంటూ చనిపోయింది.... నేను యిష్టముంటే మా అత్తవారింటికి వెళ్లవచ్చును. అక్కడ మా మరుదులున్నారు. నన్ను బాగానే చూస్తారనుకుంటాను. ఒకటి రెండుసార్లు రమ్మనమని ఉత్తరాలు వ్రాశారుకూడా. కాని నాకు వెళ్లాలని లేదు. అందుకని యిక్కడకు వచ్చేశాను.'

ఆమెను ప్రశ్నించకుండానే చెప్పిన ఈ చరిత్రంతా విని దాసుకు ఏమనాలో తెలియలేదు. అతడలాగే ఆమె ముఖం లోకి చూస్తున్నాడు.

ఆమె మళ్లీ అందుకుని—'బావా! ఒకవేళ లోకం ఏమైనా అనుకుంటుందేమో అనేభయం ఉంటే చెప్పు. నువ్వు చాలాకాలంక్రితమే లోకానికి వెరవనని యింటి నుండి వచ్చేశావు. నీవు పొమ్మన్నా కూడా యిక్కడ భీష్మించుకుని కూర్చోను. కాని పొమ్మంటావనే భయం లేదు.' అన్నది.

దాసు దానికికూడా ఏమీ జవాబు చెప్పలేదు.

'నాకు పొట్టగడవక నీ దగ్గరకు రాలేదు. మా అమ్మ తన పేరనున్న నాలుగు ఎకరాలలో ఒక ఎకరం మాత్రమే అమ్మి పెండ్లిచేసింది నాకు. మిగిలిన 3 ఎకరాలమీద వచ్చే కొద్ది ఆదాయంతో నా పొట్ట గడవకపోదు. కాని నీ దగ్గరకి వచ్చేయాలని బుద్ధిపుట్టి వచ్చేశాను. నీవైనా యిక్కడ ఏం సుఖపడుతున్నావని—సత్రంభోజనం మఠంనిద్ర. ఇకమీద

సీకాబాధలేదు. ఇంట్లోనున్న నాలుగు పాత్రలు తెచ్చేశాను. కావలసిన సామగ్రి కొని పడేస్తే ఇంత వండి పెడతాను. ఇంతకన్న నేనేం చెప్పలేను.' అంటూ మరి జవాబు కొరకైనా చూడకుండా ఆమె తన పెట్టెలోని పాడిచీర ఒకటి తీసికొని బట్టలు మార్చుకుందుకు కాబోలు పెరటింటి లోనికి వెళ్లింది.

దాసు ఆమె వెళ్లగానే గట్టిగా సిగరెట్టుపీల్చి 'ఊ' అని పొగవదుల్తూ నిట్టూర్చాడు.

వర్షం కొంచెం వెలిసింది. కాని చిన్నజల్లు మాత్రం పడు తూంది. గాలి బాగా వీస్తూండేమో కిటికీలోంచి వాన తుంపరలు దాసు ముఖంమీద పడ్తున్నాయి. అతడలాగే ఒక్కడుగైనా కదలకుండా నిల్చున్నాడు—పగిలిపోయిన గాజు పెంకుల్లాగ అతని మెదడులో ఎన్నో భావాలు మెరసి అదృశ్యమౌతున్నాయి.

ఇంతలో మణి బట్టలు మార్చుకొని తడిసిన జుట్టును ఒక చింకి గుడ్డతో తుడుచుకుంటూవచ్చి 'జల్లు కొడుతున్నట్లుంది అక్కడే నిల్చున్నావేం?' అన్నది.

'ఆఁ్ఛే వర్షం వెలిసి పోయింది. సరే ఇవ్వాళకి హోటలు నుండి భోజనం తెప్పిస్తాను. రేపు కావలసిన సామగ్రేమిటో చెపితే తెప్పిస్తాను. నేనలా బయటికి వెళ్లివస్తాను పనుంది. లోపల గడియవేసుకో' అని గొడుగు తీసికొని బయటికి వెళ్లాడు.

## 5

మణివచ్చి రెండు నెలలయింది. ఇప్పుడు దాసు కింటి గొడవేమీ అక్కరలేదు. వేళకి భోజనం కాఫీ వగైరాలను మణి సిద్ధంచేసి పెడుతుంది. అతడికి తోచినంత సేపు బొమ్మలు గీసుకుంటూనో, పుస్తకాలు చదువు కుంటూనో కూర్చుంటాడు. లేదా బయటి కెక్కడికైనా వెళతాడు. రాత్రి మాత్రం 10 గంటలలోపునే యింటికి వస్తాడు. అతడు తన గదిలో నిద్రపోతాడు. ఆమె పెరటి వసారాలోనో, గదిలోనో నిద్రపోతుంది. అతడు ఉదయాన్నే బజారు వైపుకు వెళ్లేటప్పుడు ఇంట్లోకి కావలసిన సామగ్రి ఏమున్నా ఆమె చెప్తూంటుంది.

దాసుకు యిప్పుడిప్పుడే ఒక విధమైన సంసారిక జీవితపు రుచి తెలుస్తున్నట్లయింది. కాని ఒక్కొక్కప్పుడు మాత్రం తనకు అనవసరమైన బాధ్యత నొకదానిని నెత్తిమీద రుద్దుకున్నట్లు బాధపడతాడు. నిజానికి మణి తనకు కావలసిన విధంగా ప్రవర్తించడానికి ప్రయత్నిస్తుంది. అతడి రుచుల కనుగుణంగానే వర్తిస్తుంది. అయినా ఒక్కొక్క నాడతడు చాలా చిరాకు పడతాడు.

మణి వచ్చినప్పటికి విశ్వం సెలవుల కింటికి వెళ్లాడు. అతడు 15 దినముల క్రిందటే వచ్చేడు. వచ్చిననాడే దాసు యింటికి వచ్చాడు. అప్పుడే మణిని గూర్చి దాసు పరిచ యం చేశాడు. ఈ కొద్ది దినములలోనే అతడు మణితో చాలా చనువుగా మాట్లాడటం మొదలు పెట్టాడు. మణి మొదట్లో భయపడినా క్రమంగా ఆమెకూడా బాగా మాట్లాడటం నేర్చుకుంది. అప్పుడప్పుడు దాసు యింట్లో లేకపోయినా విశ్వం వచ్చి మణితో 'హాస్కు' వేసి వెళు తూండటం మామూలయింది.

ఆ దినం సాయంత్రం 4 గంటలకే దాసు కాఫీ త్రాగి బయటికి వెళ్లాడు. మణి అప్పుడే కత్తిపీట ముందువేసుకొని వంకాయలు తరుగుతూంది.

'దాసు లేడా!' అంటూ వచ్చాడు విశ్వం.

'లేడు. ఇప్పుడే బయటికి వెళ్లాడు.' అన్నది మణి.

'అప్పుడే వంట ప్రయత్నమే. ఏం ఈమధ్య దాసుకు ఆకలి ఎక్కువయిందా?'

'అబ్బే! ఏ పదిగంటలకో వచ్చి ఆ చల్లారిన మెతుకులు కాని తినడు. కాని త్వరగా వంటముగిస్తే తీరుబడిగా కూర్చో వచ్చుగా.'

'అవును కాని! ఎన్నోసార్లు అడుగు దామనుకున్నాను. నువ్వలా తీరుబడిగా కూర్చోక పోతే ఏవైనా పుస్తకాలు చదువరాదూ?'

'నాకు మీలా చదువు వస్తేగా పెద్దపెద్ద పుస్తకాలు చదువడానికి. ఏవో మా పుస్తకాలు చదువుతూంటాను'

'మీ పుస్తకాలంటే లంకాయాగం, కుశలవ కథానా? నీ కింత చిన్న వయస్సులో అర్థంలేని ఈ వైరాగ్యమేమిటి.

ఇప్పుడు ముసలమ్మలు కూడా ఆ రకపు పుస్తకాలు చదవటం మానివేశారు తెల్సునా? పతివ్రత కథలు చదివినంత మాత్రాన సంస్కారమెలా వస్తుంది. సంస్కారం కావాలంటే సంఘ పరిస్థితి తెల్సుకోవాలి. దానికి నవలలు, సినిమాలు ఉత్తమ సాధనాలు' అన్నాడు అతడికున్న విజ్ఞానమంతా ఒక్కసారి వెళ్లగ్రక్కేననే రీవితో.

"ఏమో సంస్కారమంటే నాకు సరిగా అర్థం తెలియదుకాని, బావ అప్పుడప్పుడు చెప్తూంటాడు. సంస్కారమంటే విశాల దృష్టికల్గి ఉండడమని, దానిని నేర్చుకుందుకు ప్రపంచాన్ని సరిగ్గా గమనించడం అర్థంచేసికొనడం సాధనాలని." అన్నాడు.

'అబ్బో! మీ బావ ఇంత మాత్రం పాఠంకూడా నేర్పాడా ఏం. అతడనినది నిజమే కావచ్చు కాని ప్రపంచమనేది ఒక గదిలో కూర్చోని గమనించ దగ్గంత చిన్నది కాదు. అందుకని ప్రపంచాన్ని సూక్ష్మంగా చిత్రింపగల సాధనాలు చూసుకోవాలి. అట్టివాటిలో పుస్తకాలు, సినిమాలు అందుబాటులో ఉన్నాయి. ఇంతకీ మీ బావ నిన్నెప్పుడు సినిమాకైనా తీసికెళ్లడేం. పాపం ఇంట్లో ఒక్కర్తెవు ఉంటే ఏం తోస్తుంది?'

"సినిమాలు చూస్తే పాడయి పోతారని అమ్మ చెప్పేది. వారం దినముల క్రిందట ప్రక్కింటి వాళ్ల రుక్మిణి సినిమాకు వెళుతూ నన్ను కూడా రమ్మన్నది. బావకూడా వెళ్లమన్నాడు. కాని నేనే వెళ్లలేదు."

విశ్వం ఒక్కసారి గట్టిగా నవ్వాడు 'నీ అమాయకత్వాని కేమనాలో తెలియదు. ఎన్నో పుస్తకాలు చదివాను. విజ్ఞానవంతుడనని విర్రవీగుతాడే మీ బావ. నిన్నా పరిస్థితిలో ఉంచినందుకు సిగ్గుపడడూ. తన చెప్పుచేతలలో ఉన్న ఒక వ్యక్తిని సంస్కరించలేకపోతే ఇంకెందుకతని విజ్ఞానం!' అన్నాడు.

"అవును అలాగ చేయలేక పోవడం శోచనీయమే— కాని సంస్కరించగల వ్యక్తి ఉన్ననాడు నేను గర్వపడతాను," అన్నాడు అప్పుడే వచ్చిన దాసు ముఖాన్ని పట్టిన చెమట తుడుచుకుంటూ.

విశ్వం త్రుళ్లిపడి వెనకకు తిరిగి 'వచ్చేసేవుటోయి! ఇదేమిటి ఇవ్వాళ యింత త్వరగా బయటికి వెళ్లావు?' అన్నాడు.

"ఆ! వెళ్లవలసి వచ్చింది—నేనీ మధ్య ఒక పత్రిక పెడదామనుకుంటున్నాను. కేవలం చిత్రరచన మీద—సంఘంలో చిత్రకళకు ఎలాంటి స్థానముండవలసిందీ, చిత్రకళకు సంస్కృతితో ఎంత సన్నిహితత్వం ఉన్నదీ చర్చించే వ్యాసాలతో ఒక మాస పత్రిక నడిపించాలనుకుంటున్నాను. దాని విషయమై కొందరు పెద్ద మనుష్యులతో మాట్లాడా అని వెళ్లేను."

'ఏమిటోయి! చిత్రకళకీ సంస్కరణకీ ముడి పెట్టున్నావు! అయితే సౌందర్యోపాసకులంతా సంస్కారులే అంటావా?'

"దేవుని కొల్చేవారంతా నిజమైన భక్తులేనా? అలాగే సౌందర్యోపాసకులంతా సంస్కారులనలేను. నిజమైన సౌందర్యోపాసన తప్పకుండా సంస్కారాన్నిస్తుంది. సౌందర్యోపాసనంటే కేవలం రూప సౌందర్యోపాసన అనీ, ఆ సౌందర్యోపాసన కామతృష్ణకు ఒక అనుభూతి అనీ, అనుకునే వారికి సంస్కారమంటే ఏమిటో చెప్పడం చాలా కష్టం. ప్రకృతిలో సౌందర్యమనేది ఆకార, గుణ, క్రియా రూపములలో ఏ ఒక రూపములోనైనా గోచరిస్తుంది. దానిని రకరకాల పరిశీలించవచ్చు. ప్రతి వస్తువులోను అంతర్భూతమైఉన్న సౌందర్యాన్ని పట్టి వెదికి దానికి విలువ నివ్వటమే నిజమైన సంస్కారం—"

'ఒక పత్రిక ద్వారా ప్రజా సమూహానికే సంస్కారమంటే ఏమిటో తెలియచేయాలనే పెద్ద ఆశయాలు కలవాడివి, నీ యింట్లోనే ఉన్న ఒక సంస్కార విహీనను ఎందుకు దారిలో పెట్టరాదు?'

"నేను పత్రిక పెట్టానంటే అది కేవలం నా అభిప్రాయాలను అందుకొని యితర రచయితల అభిప్రాయాలను వ్యక్తం చేయడానికేకాని, ప్రజా సమూహాన్ని ఒక్కసారి రెచ్చగొట్టిగాని, నా అదుపాజ్ఞలలో పెట్టిగాని సంస్కరిద్దామనే అభిప్రాయం కాదు. పత్రిక చదివి దానిలోని సత్యానికి

విలువ నివ్వగల మనిషి క్రమంగా దాన్ని ఆదరిస్తాడు. అప్పుడు తనను తానే సంస్కరించుకోగలడు. ఇంతకీ మణిలో సంస్కారం లేదని నీ అభిప్రాయం. కాని ఆమెలో నీ వనుకున్న కంటె ఎక్కువ సంస్కారమే ఉంది. అయితే ఆమె సినిమాలకి వెళ్లదు—కొవ్వలివారి నవలలు చదవదు. అదే ఆమెకు సంస్కారం లేని లోపం. సరేలే ఇంతకీ నా అభిప్రాయాలకు ప్రాముఖ్యతనిచ్చి వాదించే స్వభావం కాదు నాది. నీవన్నట్లు ఒక వ్యక్తిని సంస్కరించడం నాకు చాతకాక పోవచ్చు. కాని నీ వెందుకు చేయరాదాపని ?" అన్నాడు దాసు.

విశ్వం కళ్లలో ఒక్క మెరపు మెరసి నట్లయింది. 'తప్పకుండా ఆమెను ఇంతకన్న మంచి త్రోవలో పెట్టాలనే ఉద్దేశం ఉన్నది నాకు—కాని......ఆమెపై ఆ మాత్రం స్వాతంత్రం చూపడంలో నీ అభ్యంతరమేమీ ఉండదా ?' అన్నాడు.

దాసు ఒక చిన్న నవ్వు నవ్వి—"ప్రపంచంలోని ప్రతి వ్యక్తికి వ్యక్తిగత స్వాతంత్ర్యం ఉండాలంటాను నేను—ఒక వ్యక్తికి ఇంకొక వ్యక్తి పాఠంచెప్పి సంస్కరించగలడను నమ్మకం లేదు నాకు—ఒక వేళ అలాగ జరిగినా దానిలో స్వలాభం యిమిడి ఉంటుంది. కాని ఆమెపై ఎవ్వరికైనా ఏమాత్రమైనా స్వాతంత్ర్యం ఉన్నదని నే నను కొన్ననాడు, నా కామెపై ఎంత అధికారముందో నీకూ అంతే ఉందని చెప్పగలను. ఇంతకీ మణిని నేనెన్నడు అదుపాజ్ఞలలో పెట్టి దలచుకోలేదు—" అంటూ తువ్వాలు తీసికొని పెరట్లోకి వెళ్లాడు దాసు.

అంతకు ముందే వారి సంభాషణలో నాకేమీ అవసరం లేదను కున్నట్లు తరిగిన కూరతో వంటింటిలోనికి వెళ్ళి పోయింది మణి.

విశ్వం 'నేను వెళ్తున్నానోయి !' అంటూ లేచి వెళ్లాడు.

* * *

ఆరోజు దాసు భోజనం చేస్తున్నప్పుడు వడ్డిస్తూ— 'బావా ! విశ్వం ఏమిటేమిటో చెపుతూంటాడు. నాకు చదువు లేదట. తెలివితేటలు ఉన్నాయట, కాని అవి వినియోగించుకునే సంస్కారం లేదట—అందుకని నేను పుస్తకాలు చదవాలట—ఇంకా ఏమిటేమిటో చెపుతాడు. అవన్నీ నిజమేనంటావా ?' అన్నది అమాయకంగా చూస్తూ మణి.

దాసు ఆమె ముఖం వైపు చూడకుండానే—"ఇలాంటి విషయాలు ఒకరి అభిప్రాయాల ననుసరించి ప్రవర్తించేవి కావు మణీ ! ప్రపంచాన్ని చూస్తూ అందు కనుగుణంగా నీ బుద్ధికి తోచిన రీతిని విషయ సమన్వయం చేసికోవాలి—విశ్వానికి నచ్చినవి కొన్ని విషయాలుంటాయి. అవి నాకు నచ్చక పోవచ్చు—నాకు యిష్టమైనవి అతని కిష్టముండవు—అందుచేత నీకిష్టమైన వానినే నువ్వాచరించాలి" అన్నాడు.

'కాని నాకేమీ ఆలోచనలే రావు కదా ! అలాంటప్పుడు ఎలాగ ఆచరిస్తాను ?' అన్నదామె మజ్జిగ పోస్తూ !

"నీ కాలోచనలు రాకపోతే యింకొకరు చెప్పిన విషయాలు ఎంతవరకు ఆచరణీయములు అని ఆలోచించడం నేర్చుకో—క్రమంగా నీ అంతట నీవే ఆలోచించడం కూడా అలవాటవుతుంది."

'ఏమో ! ఒక్కొక్కప్పుడు నాకు విశ్వం ఎంతో మంచి వాడనిపిస్తుంది. మరొకప్పుడు అతనితో మాట్లాడటమే ఏదో పాపం చేసినట్లనుపిస్తుంది. అతడు మనింటికి రాకుండా ఉంటేనే బాగుండును !' అన్నది కొంచెం విసుగుగా—

"అబ్బే ! అతడి దగ్గర నీవు భయపడవలసిన అవసరమేమి లేదు. అతడు చాలవరకూ మంచివాడే—" అన్నాడు భోజనం ముగించి లేస్తూ—

[ఇంకావుంది]



# కడుపు తీపి

★ శ్రీ ఇసుకపల్లి లక్ష్మీనరసింహశాస్త్రి ★

"బస్తీలో వుద్యోగం. ఎన్నాళ్లు హోటల్లోపడి అఘోరిస్తాడు. పూటకూళ్లతిండి పడుతుందా చేస్తుందా! పెళ్లంటూ చేస్తే ఆ యిబ్బంది తీరిపోతుంది అని, యెవరూ పిల్లనిచ్చేవాళ్లు లేకపోతే, మా అన్నయ్యను బ్రతిమాలి మేనరికంచేశా. ఇప్పటిరోజుల్లో యకరం వుండగానే రెండువేలు యిస్తావా అని అడగటానికి. పదెకరాలున్నా, మావాడి పెళ్లినిగురించి దిగులేపడ్డాము. ఆ రోజులు అవి. క్రొత్తగా కాపరం. ఏం వెలగపెటతారో బస్తీలో అని, మా ముసలమ్మని బ్రతిమాలి అక్కడకు పంపించా. ఇట్టే వారం గడిచిందోలేదో ముసలమ్మకు జబ్బుగావుందని కబురు. అప్పటికప్పుడు నురుగులు కక్కుకుంటూ వెళ్లాను. నేను వెళ్లేటప్పటికి, కోడలమ్మ మంచంమీద పడుకుంది. ఆ రాత్రినుంచే జ్వరమట. ముసలమ్మ మూలుగుతూ ఓ మూలపడుకుంది. అబ్బాయి ఆఫీసుకు వెళ్లాడు. పిలుస్తే పలికే దిక్కులేదు. తల్లి అన్నతర్వాత తప్పుతుందా! వాడు యివ్వాళ నువ్వేమిచేశావు అని అడిగాడు. గాని! వుపచారంచేస్తూ వారంరోజులు గడిపా. ముసలమ్మకు కొంచెం వోపిక వచ్చిందికదా అని యిట్టేయింటికి వస్తే, వెంటనే టెలిగ్రాం ముసలమ్మ చచ్చిందని. మళ్లీ ఆ బండిలోనే వెళ్లా. ఎవరికోసం! అంత చెయ్యబట్టే యివ్వాళ యిట్లా అంటున్నాడు. ఇన్నివిధాల కష్టపడ్డానమ్మ, నాకు యింకెవరున్నారు ఈ కొడుకు కోడలే గదా! ఇంత చేశానే తల్లి అనే విశ్వాసం వాడికి కించిత్తయినా వుందీ! ఇంతకీ యింత మమకారం నెత్తి అణిచింది. ఇప్పుడు నేను చిల్లిగవ్వకు పనికిరాకుండా వున్నాను. వాడెంతంటె అంత. వాడేది చెపితే అది. తనకు మంచిచెప్పాననే ధ్యాస లేకపోతే! వారు పోయేనాటికి రాజశేఖరం నాలుగు నెలలవాడు. అప్పటినుంచి మొగుడు పోయాడనే దుఃఖంలో యెన్ని కష్టాలుపడ్డానో, యెంత చాకిరిచేశానో భగవంతుడికెరిక. కొంతకాకపోతే కొంతైనా ఆ దుర్గమ్మకు తెలుసు. ఈ నాటికి మనుమలు మనమరాళ్లు అంటూ యేర్పడ్డ తర్వాత, నేను దమ్మిడీకి పనికిరాకుండా పోయాను. వచ్చినకష్టము రానేవచ్చింది. ఇప్పుడు వీళ్లని చూసన్నా సంతోషిద్దామనుకుంటే యిట్లా తయారయ్యాడు" అంటూ తన గోడంతా చెప్పుకుంది కామమ్మ ప్రక్కయింటావిడతో.

ఇంతలో పారిజాత గబగబ పరిగెత్తుకుంటూ వచ్చింది బళ్లోనుంచి. ఆ రావటంలో యెదురుదెబ్బ తగిలి ముందుకు పడింది. కొంచెం నెత్తురుకూడ వచ్చింది. "అమ్మో! ఎంత దెబ్బతగిలిందే" అంటూ కామమ్మ గబగబ మనమరాలిని లేవదీసి వళ్లోకి తీసుకుంది. అప్పుడే ఆఫీసునుంచి వచ్చిన రాజశేఖరం ముఖం చిటచిట లాడించుకుంటూ యింట్లోకి వచ్చాడు. తల్లిదగ్గరవున్న పారిజాతను వక్కలాగులాగి, "నీ మూలానే యిది యింతపాటుపడింది. సుభద్రను బళ్లోకి వెళ్లనీకండా చేశావు. కొంపకి అనిష్టంగావుంది. నా యింట్లో వుండక యెక్కడికేనా లేచిపో. తిండికి డబ్బు పంపిస్తూ వుంటా" అంటూ గదమాయింపుగా కసిరాడు తల్లిని.

"ఎంతసేపు సమానంగావున్నా రెచ్చిపోతోంది. నీ యిల్లేమిటి? ఎంతచేస్తే యింత అయ్యావు! నీకు నోరెట్లా..." అంటూ వుండగానే, రాజశేఖరం ప్రక్కనవున్న చెంబును తీసుకొని తల్లిమీదకు విసిరాడు. అయ్యో! అంటూ భరణి అడ్డువెళ్లింది. ఆ దెబ్బ కాస్త భరణిముఖాన తగిలింది.

"అమ్మో! ఎంత నెత్తురు వస్తోందే! నువ్వెందుకు అడ్డం వచ్చావమ్మ. ఆ దెబ్బనాకు తగిలితే వాడి కసన్నా తీరేది. అనవసరంగా యెంత దెబ్బతిన్నావమ్మ" అంటూ వోదార్చింది కామమ్మ, కోడలి జుట్టు నిమురుతూ.

'అత్తయ్యా, నే నేకనక అడ్డంరాకపోతే అంత దెబ్బ నీకు తగిలేదేనా' అంటూ వాపోయింది భరణి.

"ఈ కొంపలోంచి నే నన్నా లేచిపోతే బాగుంటుంది. పీడ" అంటూ బుజాన వుత్తరీయం వేసుకుని గడపదాటాడు రాజశేఖరం.

సుభద్ర 'నాన్న! యెక్కడికి' అని అరచింది బిగ్గరగా.

'నాన్నా!' అనే సుభద్ర పిలుపు రాజశేఖరం చెవుల్లో మారుమ్రోగింది. ఆ శబ్దం పెద్దబరువుగల ఓ రాయిని తన గుండెమీదనుంచి తీసినట్లనిపించింది. ఆ నాన్నా అనే అమాయకపు పిలుపు తన పితృత్వాన్ని పులకరింపచేసింది. ఆ నాన్నా అనే శబ్ద తరంగాలు తన ప్రతివక్క నాడిలో వోలలాడి, గుండెదగ్గర యేదో రహస్యము చెప్పినట్లనిపించినాయి. ఆ నాన్నా అనేశబ్దం తనముందు ఓ పెద్ద అఖాతాన్ని త్రవ్వింది. ముందుకు వెళ్లటానికి వీల్లేదు.ఆ నాన్నా అనే శబ్దంలో ఓ అనంతమైన వెలుగు ప్రస్ఫుటంగా గోచరిస్తోంది. తన నాలిక యెక్కువసేపు మౌనం వహించలేకపోయింది. "అమ్మా!" అని ఓ వెఱ్ఱికేక వేసింది. తన హృదయాన్ని యిన్నాళ్లనుంచి ఆవరించిన తమస్సు యివ్వాళ తొలగినట్లనిపించింది. చీకటిపోంగానే వెలుగు, ఆ వెలుగులో "సుభద్ర నీకెంతో, నువ్వు నీ తల్లికి అంతకావా" అని ప్రతిధ్వనించింది.

"అమ్మా" అంటూ కామమ్మ కాళ్లమీదపడ్డాడు రాజశేఖరం. క్షమించు అనే మాట అనటానికి కూడ సిగ్గుపడుతోంది హృదయం. కామమ్మ వణికిపోయింది. "లే నాయనా" అంది.

"నాయీ పాపపుకళ్లు నీ ముఖం చూడలేవు. నేను చేసిన ప్రతి అపచారము క్షమించానంటేనే నేను తలెత్తేది." అన్నాడు పట్టుబిగువున.

"నువ్వు చేసిందేముంది నేను క్షమించటానికి. చిన్నతనం నాయనా తెలియదు. పెద్దదాన్ని నేను చెపుతున్నాగా. లే నాయనా" అంటూ రెండు చేతులుపట్టుకుని లేవతీసింది కామమ్మ కొడుకుని. ముప్ఫయి యేండ్లకు మళ్లీ అమ్మవళ్లో రాజశేఖరం కూర్చున్నాడు.

'దానికెంత దెబ్బతగిలిందో చూడు. నీ సుఖమే నా సుఖం నాయనా! నీకంటె నాకెవరున్నారు? నువ్వది గ్రహించుకో లేదు' అంది కామమ్మ జుట్టునిమురుతూ.

'అమ్మ' అని వక్కమాటే వస్తోంది రాజశేఖరం నోట్లోనుంచి.

"నాన్నా, మీ అమ్మవళ్లో నువ్వు కూర్చున్నావుగా. నీ వళ్లో నేను కూర్చుంటా" అంటూ పారిజాత వచ్చింది. 'రా' అంటూ రెండుచేతులు జాపాడు.

భరణి కన్నీటిధారలు ఆ స్మితవదనానికి వన్నె తెచ్చినాయి.





# సిగ్గు! సిగ్గు!

* శ్రీమతి దేశిరాట్ విజయలక్ష్మి విరాట్ *

తనతో కూడా దుకాణాలన్నీ తెగ త్రిప్పాడు పినాకి—

ఒకచోట రిస్టువాచీకి గొలుసు కొన్నాడు. ఆరు గజాల సిల్కు—పాప్లీన్ ఖరీదుచేసి పుచ్చుకున్నాడు. వాసన నూనె సీసా, కాలికి జత స్లిప్పర్స్!

'ఫిల్ముకి రావోయ్, పోదాం!' అన్నాడు నాతో—

'క్షమించు పినాకీ! నెల రోజులవరకూ ఫిల్ముకి పోనని ఒట్టు పెట్టుకున్నాను. ఏమంటే ఫిల్ముకి పోతే నిద్ర చెడుతుంది. నిశ్శ్వాక చేస్తుంది. తర్వగా లేవను. ఉదయ పర్యటన జరగదు. ఇక ఆరోగ్యం సరిఅయ్యే దెట్లా? ఈ సారికి నన్ను విడిచిపెట్టు బాబూ!' అని బ్రతిమాలు కున్నాను.

అదేకాక, అసలు సంగతి: డబ్బు ఖాతిరీలేని ఏ పినాకి వంటివాడో ఫిల్ములు చూడాలిగాని, నాకెందుకు చెప్పండీ? 'మ్రింగడానికి మెతుకుల్లేవు; మీసాలికి సంపెంగ నూనె కూడానా?' అన్నారట.

పినాకి ధర్మమా! అని అట్టే బలవంత పెట్టలేదు. వెంటనే వదిలేశాడు. గప్పున యింటికి వచ్చి, భోజనం చేసి, దుప్పటీ ముసుగులో దూరిపోయాను.

సాధారణంగా రాత్రుళ్లు చదివే అలవాటున్న నేను, గత పది రోజులనుండీ పుస్తకం పట్టడం మానుకున్నాను. పట్టరాదని 'ఖిమగ్రత్న' సలహా.

సునీథ 'మూడు' ని 'అయిదు' గా విన్నది. త్వర త్వరగా దుప్పటీ లాగి పారేసి, 'లేవరేమండీ?...అయిదు కూడా కొట్టారే! పర్యటు నెప్పుడు చేస్తారు?' అని హెచ్చరించింది.

హడావిడిగా లేచి, పైమీద ధోవతితో చేతిబెత్తంతో పర్యటన ప్రారంభించాను.

రోజూ ఒకే దిక్కుకి వెళ్లడం అంత ఉత్సాహకరంగా వుండదు. నిన్న ఈశాన్య దిక్కుకి వెళ్లాను. ఈసారి వాయవ్యానికి పోదామని బుద్ధి పుట్టింది.

మెరుపుకి మల్లే వీధులు తిరిగి నడుస్తూండగా ఎవరింటి లోనిదో గోడవాచీ మూడున్నర వినిపించిది. శీతకాల మేమోచలి మిక్కుటంగా వుంది. గుండెలు గజగజా వణుకు తున్నవి.

చవటు పెద్దమ్మ సునీథ 'చంపింది కదా!' అను కున్నాను. ఆమెకి షదివేల పూజా పునస్కారాలు లోలోపలే అయి పోయినవి.

సునీథ మాత్రం చేద్దామని చేసిందా? భర్త ఆరోగ్య సంపాదనే పరమోద్దేశంగా నన్ను త్వరగా మేల్కొలిపింది. పర్యటనకి వెళ్లమన్నది.

చీకటి గాఢంగా వున్నది.

సందు మలుపు తిరిగేసరికి సూటిగా కొళాయి ప్రాంతంలో నల్లని నీడలా ఏదో కనిపించింది.

నీడకాదు—నీడ! యౌవనంలోవున్న స్త్రీ! పద్ధెనిమి దేళ్ల పడుచు. ఇంత గాఢమైన చలిలో, రాత్రి జనసంచార శూన్యంగా వున్న సమయంలో, నీటికెందుకు చెప్మా? వచ్చిందమ్మాయి!

—ఏ దొంగైనా, దుర్మార్గుడైనా, భయపెట్టి నిలవేసీ, ఆభరణాలు దోచుకుని బలాత్కారిస్తే? ఏం చేద్దామను కున్నదో—పిచ్చిపిల్ల!

—తెల్లారేక రాకూడదా? ఇప్పుడేం నీటికెద్దడి లేదే! చక్కగా కావల్సినన్ని బిందెల నీళ్లు తీసుకుపోవచ్చునే!

వింతపడ్డాను.

స్త్రీలెవరూ అంత చీకట్లో వ్యవహరించవల్సిన పనిలేదు. నాలుగున్నరప్పుడంటే కొంచెం అర్థంవున్నది. కాని, మూడున్నరకే ఈమె గృహం బయల్దేరిందే!

ఎవరిపిల్ల అయివుంటుందికదా సుకుమారి! వారికేం బుద్ధిలేదో! వయస్సులోవున్న అమ్మాయిని నిశీథ సమయంలో బయటికి పంపడానికి! ఎంత ఆలోచన్లేదో!

—ఆమెని గుర్తిద్దామనే కోరికతో రెండడుగులు ముందుకేశాను.

—ఆమెకూడా బిందె చక్కపెట్టుకుని రెండడుగులు ముందుకేసింది.

—నేను గమన వేగాన్ని హెచ్చించి ఆమెని కలుసుకో బోయాను.

—ఆమెకూడా గమనవేగాన్ని హెచ్చించి, ముందుకే నడుస్తున్నది. ఆ నడక నడక కాదు. ఒక విధమైన పరుగు!

నన్ను చూసి భయపడి పారిపోతున్నదేమో అని అనుకున్నాను.

'పిలుద్దామా!' అన్న ఊహ తట్టింది. కాని, మానుకున్నాను. భయస్థురాలికి మరింత భయంకరంగా వుటుంది నా పిలుపు!

ఆమె స్త్రీ! స్త్రీలు నడవలేనంత వేగంతోపోయి ఆమెని కలుసుకున్నాను. ఎగా దిగా చూశాను.

కళ్లు సిగ్గు పడ్డాయ్! నీళ్లు కార్చినాయ్. చూసిన పాపం కళ్లు పొడుచుకున్నా జన్మజన్మాలికీ పోదు. ఎందుకు చూశాను? ఎందుకు నిరుద్దేశంగా నామట్టుకు నేను పోయాను కాను?

ఆమె దొంగల్ని చూసి భయపడి పారిపోవడంలేదని అప్పటికి గ్రహించాను. ఆమె భయం, పరుగు—అంతా! పమిటలేని తనను ఎవరు చూసి పోతారోననే!

కటిభాగాన్ని చుట్టుకుని మాత్రం ఒక తువ్వాలుంది.

ఎవరో పేదవారి పిల్ల. కరువుకాలంలో బట్టలు కొనుక్కునేందుక్కా చేత కానీ లేని పిల్ల! వివస్త్రంగా వుంటున్నది. చీకట్లో అందుకే నిగూఢంగా నీళ్లకి వచ్చింది. (ఆ సమయంలోనైతే తన్నెవరూ చూడరుకదా అనే ధైర్యంతో—అక్కడికీ మనసులో కొంత దిగుల్తో.)

దోవతి యిద్దామా? అనుకున్నాను. ఇవ్వలేక పోయాను. ఆమెని సమీపించడం నావల్ల కాకపోయింది. నడక తగ్గించాను.

ఆమె తిన్నగాపోయి ఒకింట్లో దూరింది.

—ఎవరిల్లు? ఎవరిల్లు? పినాకి తాలూకు యిల్లుకాదు! పినాకి కీమె ఏమవుతుందో!

తనకో చెల్లిమాత్రం వుందని ఎప్పుడో పినాకి చెప్పినట్లు స్మృతి. ఆమె ఈమె అవునా కొంపదీసి!

అయితే పినాకిని చెప్పుచ్చుకుని పళ్లు రాలగొట్టాలి! పిల్ల నిట్లు చూస్తున్నాడా లుచ్ఛాకోర్! తాను సిల్కు దుస్తులతో ముస్తాబవుతున్నాడే పూల రంగడిలా!

పర్యటన ముగించుకుని వచ్చి పినాకి యింట్లో దూరాను. పినాకి కాఫీ యివ్వబోయాడు. 'నీయింట్లో త్రాగ' నని చెప్పి విషయం గూర్చి అడిగాను నిష్కర్షగా—

పినాకి ముఖం పాలిపోయింది. సిగ్గుతో క్రిందికి వాలిపోయింది.

పినాకి బొంగురు గొంతుకతో అన్నాడు. "నా ఆదాయం ఎంతో నీకు తెలుసుకదట్రా! నేను బయట తిరగక తీరదు! దుస్తులుండి తీరాలి. లేకపోతే నన్ను నీచంగా చూస్తారు తోడివాళ్లు. ప్రపంచంలో 'మర్యాద' వేషాన్ని బట్టి వుంటుంది. వేషం ఎంత మంచిదైతే అంతగొప్ప 'మర్యాదా' ఇస్తుంది ప్రపంచం. ఆ సిల్కు దుస్తులన్నీ అందుకోసమే!"

"చెల్లి మర్యాదావ్యయం చేసి, మర్యాదా ఆర్జించుకుంటున్నావా? పినాకీ!" అన్నాను—కోపంగా!



కార్మికులు పుచ్చుకునే కరువు భత్యంలో సగం కాలిజోళ్లకు, మరిసగం కళ్లజోళ్లకు—కాస్తో కూస్తో మిగిలితే గోల్డుఫ్లేక్ సిగరెట్టుకూ, సినీమాలకూ—ఆలుబిడ్డల ఆకలి, తమ ఆరోగ్యం—ఇవి తరువాత విషయాలు వీరికి—పాశ్చాత్య నాగరికత ప్రసాదించిన అస్వాభావిక జీవిత పరిమాణం యీ పై పై మెరుగులు—

# మన సంఘములోని కొన్ని దురాచారములు

## (Prospective Grooms Inspecting Brides)

* శ్రీమతి ఎమ్. పద్మావతమ్మ *

కాలము మారుచున్నది. దురాచారములు మారవు. అవి నాటుకొని పోవుచున్నవి. పెండ్లిండ్ల విషయములలో చూడండి మరి. ఎన్ని అవమానములో అమానుషములో. వీటిని నిర్మూలించటానికి సంఘము పూనుకొనవలయును. ఇప్పటి వ్యవహారాలను చూస్తే పాతకాలపు స్వయంవర పద్ధతి చాల శ్రేష్టమని తేలును. సమానపు హక్కులను చాటించు యీ కాలములో, స్త్రీలోకమునకు మాత్రమే కట్టుదిట్టములు.

పెండ్లి కుమార్తెకు మాత్రమే పరీక్షలు. ఆవును సంతలో కొనునప్పుడు, దాని పళ్లు, ముడులు, ఈత, పోత, రంగు, కొమ్ము వంపులు, అన్ని విషయములు గమనించునటుల, మన పిల్లల్ని పెండ్లిచేసుకొన గోరువారు, అన్ని పరీక్షలను జేయుదురు. పెండ్లికుమారునికి పరీక్షలే లేవు. కడకు వాడు క్లాసు పరీక్ష గూడ తప్పియుండవచ్చు. అయినను యెందరు యువతులనో పరీక్షించు Examining Board నకు వాడు అధ్యక్షుడు. ఏమి విపరీతము! సమాన హక్కులు, సమాన బాధ్యతలని ఘోషించు యీ కాలములో సంఘము పెండ్లిండ్ల విషయములో స్త్రీలకు జేయు అవమానమును గమనించి, అక్రమములను యరికట్టి సరిదిద్దవలయును.

దేశమునకు దాస్య విముక్తి వచ్చినది. స్త్రీ సంఘమునకు మాత్రము దాస్యము శాస్వతము. మన సోదరీమణులు గవర్నర్లుగా పనిజేసి యున్నారు. రాయబార్లుగా, యున్నారు. కేంద్ర ప్రభుత్వ మంత్రి వర్గములో యున్నారు. సామాన్య స్త్రీకి మాత్రము స్వాతంత్ర్య భిక్ష యుబ్బలేదు. వరకట్న పిశాచమును, బహుభార్యా విధానమును ఎదుర్కొన్న సంఘము కొన్ని దురాచారములను యెదుర్కొను టకు సంసిద్ధపడవలయును. మన సోదరీమణులు వివాహ యుక్తవయస్సునకు రాగానే, వారికెన్ని పరీక్షలు! వాటిని కొన్నింటిని వర్ణించిననేగాని వాటి యవమానము మనస్సునకు సోకదు.

ఒకరింట్లో పెండ్లికి యువతి యున్నదని తెలిసినతోడనే, మొదటి యవసరము, ఆమె అన్ని సమయములలో చూచుటకు వచ్చినవారికి యందుబాటులో యుండడము. ఏ తరుణములో ఏ పురోహితుడో, పెండ్లి వ్యాపారపు దలాలియో దిగబడును. తల్లిదండ్రుల సందర్శించి పెండ్లి కుమార్తెను 'చూడ' నుద్దేశించును. మరి దానితో యింటిలో హడావిడి. పిల్లను శృంగారించు ప్రయత్నములు, కాఫీ ఫలహారముల తయారు, చందన తాంబూలాదులు, పరస్పర సంప్రతింపులు, వచ్చిన వ్యక్తులు తొందరపడడము, మరి కొండింట్లలో అవసరవ్యవహారములున్నవనడం జరుగుతుంది. పెండ్లి కుమార్తె కానున్న యువతిని రంగములోని కీడ్వడము, ఆవిడ చేత, త్రోవనుబోవు ప్రతి మానవునికి సాష్టాంగ నమస్కారము చేయించడము, Public Service Commission Interview లోవలె ప్రశ్నోత్తరములు గావించడము, పాట పాడించడము, ఆట ఆడించడము, జరుగుతుంది. నఖశిఖ పర్యంతం కల్య పరీక్ష, అందుపై వచ్చినవారు వారి అనుగ్రహమును లేఖ పూర్వకముగా తెలిపెదమని అనుగ్రహించటము జరుగుతుంది. స్త్రీకి పెండ్లికంటె గత్యంతరము లేదని సిద్ధాంతము. ఆ పెను ఆర్థిక స్వతంత్రము లేదాయె. ఆజన్మాంతము పరాధీనమే. అన్యతమాడియైన వివాహము చేకూర్చుట పుణ్యకార్యమని సంఘము తలుస్తుంది.

నవనాగరికులు కొందరు, యీ యవమానమును మరింత జేయుటకు కాబోలు, యువతులను తమతో సినిమాలకు, పార్టీలకు పంపమని కోరటం మనము ఒప్పుకోడంకూడ జరుగుతుంది. W. M. Thackeray యను ఇంగ్లీషు నవలా రచయిత 19వ శతాబ్దములో English సంఘములోని

దురాచారములను, Vanity Fair, Newcomes లలో కడు విశదముగా వర్ణించి యున్నాడు. కడకు యొక యువతి యీ బాధల కోర్వలేక తన దుస్తులకు యీ విధముగా చీటి నొకదానిని యతికించు కొన్నది. "For sale to the highest bidder in the matrimonial market." వివాహపు సంతలో యెక్కువ పాటదారునికే అమ్మక మని—విద్యాగంధముగల యువతులు సహితము తీవ్ర పరీక్షలకు లోనుగావలసినదే.

సమాన హక్కులకై కృషిసల్పి, తీవ్ర పోరాటము జరుపు యీ దినములలో, వివాహ విషయములో ద్వంద్వనీతి (Dual Morality) ప్రయోగించటము కేవలము అన్యాయము. మహిళాలోకం దీని నిర్మూలమునకు సిద్ధ పడవలయును. కొందఱు అవనీతిపరులైన యువకులు పెండ్లి కుమార్తెలను పరిశీలించి, పరీక్షించు వినోదమును మనసార అనుభవింపజూచి, అందఱిండ్లకు విందులకు పోవడము Fashion, రివాజు అయింది.

మన దేశాచారముల ననుసరించి, ప్రాచీన స్వయంవర పద్ధతియే శ్రేష్ఠము, న్యాయము. వరుడు, వాని బంధువులు, స్నేహితులు కన్యను పరీక్షించు రీతి, కన్య యేల వరుని అర్హతా అనర్హతలను తీర్మానించుటకు అవకాశము కల్పించరాదు? వాని యోగ్యతా పత్రముల పరిశీలించి, వాని సుగుణ, దుర్గుణముల నిర్ణయించి, తగునో తగదో యని తీర్మానించు అవకాశములు యేర్పరుపవలయును. వివాహ పద్ధతుల సవరించవలయునేగాని, వివాహ యాచారముల సరిదిద్దవలయునేగాని, ఆ సంస్థను నిర్మూలించరాదు. Registered వివాహములు జేసికొనువారు సహితము కట్నములు శుల్కములు బ్యాంకులో సర్దుబాటు జేసిన తరువాతనే చేవ్రాలు చేయుట సహజమయినది. వివాహ పుటాచారములలో అందఱకు సమానహక్కులు గల్పించుట, సంఘ శ్రేయమునకు, సౌఖ్యమునకు, శాంతి గౌరవములకు, సౌభాగ్యమునకు యతి యవసరము. మొగ పెండ్లివారిదే పై చెయ్యి, వారు గీచినదే గీటు, పెట్టినదే భిక్ష యనటము స్త్రీజాతికి యవమానము, యగౌరవము. దురాచారముల నిర్మూలింపనిచో, దేశాభివృద్ధికి విరుద్ధముగా నడచినవారగుదుము.

స్త్రీ సమాజము యీ విషయమై తీవ్రాలోచన జరుపవలయును. వరశుల్క నిర్మూలనమునకు, వధువు హక్కులను రక్షించుటకు దీక్ష బూనవలయును. పెండ్లియొక్క లాభనష్టములను, వధూవరులిద్దరు సమానముగా భరింపవలయును. భార్యాభర్తలు గాబోవు యిరువురికిని సమాన బాధ్యత యుండుట గమనించనగును.

నవీన పద్ధతుల ననుసరించి, పెండ్లి కుమారుడును శీలము గలవాడు, అంటువ్యాధులు లేనివాడు, మంచి యాశయములు గల యువకుడని, నిరూపించు పద్ధతు లుండవలయును. ముందు కాలములో దగ్గర బాంధవ్యము గలవారితోనో, బాగుగా యెరిగిన కుటుంబములతోనో వివాహ సంబంధములు జేసికొనెడివారు. అవి యన్నియు మారి, నూత్న సంబంధములకు మనము సాహసించునపుడు మన యాచారములును మారవలయును. దుర్నీతిపరుని వరునిగా ఒక యువతి మెడకంట గట్టుట మహాపాతకము. యువతీ, యువకుల భావి క్షేమమునే మన దృష్టిలో యుంచుకొని సంఘ మేమనునా యని వెఱువ నవసరములేదు. సంఘ బహిష్కరణ, ఆచార్య పీఠముల ఆంక్షలు గమనింప యవసరములేదు.

దంపతులు క్షేమముగా, సుఖముగా యుండవలయునన్న, యిరు పక్షములవారికి స్వేచ్ఛ, స్వాతంత్ర్యము, ఆత్మగౌరవము యుండవలయును. వాటికేలాటి ఆటంకములు కలుగజేయరాదు. పరస్పరానురాగము, అన్యోన్యప్రేమ, గౌరవము యుండవలయును. వాటికేలాటి ఆటంకములుండరాదు. ఆత్మ గౌరవము పవిత్ర దాంపత్యమునకు పునాది. దానిని గమనించని సంఘము యిసుకదిబ్బలపై సౌధముల నిర్మించువాని గతిని పొందును.



జనాభా లెక్కలలో స్త్రీల సంఖ్య పెరిగిపోయిన సూచనలున్నాయి. అంటే పెండ్లికొడుకుల మార్కెట్ రేటు మరీ పెరుగుతుందన్న మాట— మహిళల ముక్తి వారి మనస్థైర్యములోనే వుంది.

# తెలుగు రచయితల సంఘం

చెన్నపట్నంలోని ప్రముఖ ఆంధ్ర రచయితలు నవంబరు 11వ తేది సాయంకాలం "కిన్నెర" కార్యాలయంలో సమావేశమై ఆంధ్ర సాహిత్య అభివృద్ధికి కృషి సాగించడం నిమిత్తం "తెలుగు రచయితల సంఘం" అనే పేర ఒక సంస్థను నెలకొల్పారు. ఈ సమావేశానికి శ్రీ నార్ల వెంకటేశ్వరరావుగారు అధ్యక్షత వహించారు. ప్రముఖ రచయితలందరు సభకు హాజరయ్యారు. శ్రీ పందిరి మల్లికార్జునరావుగారు సభ్యులకు స్వాగత మిచ్చారు.

అధ్యక్షులు శ్రీ నార్ల వెంకటేశ్వరరావుగారు.

"రచయితలు నేడు భుక్తి కోసం వేరు వృత్తి చేసుకోవలసినట్లున్నది. వారు తమ కాలాన్ని పూర్తిగా సాహిత్యోత్పత్తి వికాసాలకై వినియోగించలేక పోతున్నారు. కేవలం రచనల ద్వారానే జీవితం గడుపుకోవడం కష్టతరమవుతున్నది. ఈ పరిస్థితి ఉత్తమ సాహిత్య సృష్టికి విఘాతం కలిగిస్తున్నది. ఇలాంటి సమావేశాల ద్వారా పరస్పర భావ వినిమయం చేసుకొని, సాహిత్య విమర్శనా రీతులను పెంపొందించుకొనడానికి వీలున్నది. సక్రమంగా ఇతర దేశాల రచయితల వలె మనం సాహిత్య కృషికి దోహద మివ్వవలసి వుంటుంది. రచయితలు 150 మందికి పైగా ఈ ఊళ్లో నున్నారు. వీరందరు వాటాదార్లుగా చేరితే సులువుగా, ఒక సహకార సంస్థగా జేరి ఆ సంస్థ పక్షంగా ప్రచురణలు సాగించవచ్చు," నని ప్రసంగించారు.

విద్వాన్ విశ్వంగారు సంఘ కార్యకలాపాలను వివరిస్తూ ఇలా అన్నారు:—"మన సంఘం రచయితల సాహిత్య కృషిని మరింత సునిశితం చేయుటకు, యువ రచయితలను ప్రోత్సహించి కొత్త ఉత్తమ రచనలు వెలువడుటకు తోడ్పడవచ్చు. అలాగే ప్రజలలో సాహిత్యాభిరుచిని పెంపొందేట్టు కవి సమ్మేళనాలు, ప్రాచీన నవీన కాలపు రచనా నాటక పఠనాలు మొదలైనవాని ద్వారా పని చేయవచ్చును. చిన్న చిన్న కమిటీలుగా— కవిత్వం, నవల, నాటకం— ఏర్పడి సూక్ష్మంగా వివరంగా ఆయా శాఖలపై చర్చలు సాగించవచ్చును. ప్రత్యేక వ్యాసాలు చదివించవచ్చును."

తరువాత రచయితల సమస్యలను గూర్చి పలువురు చర్చలు జరిపిరి.

చర్చానంతరం విశ్వంగారు సంఘముసాయిదా నియమావళిని సభలో ప్రతిపాదించారు.

సభ్యత్వ రుసుం ఏటా ఒక రూపాయి. సంఘం ఆశయాలలో సంవత్సరానికి కొక సారైనా "రచన" అనే పత్రికను వెలువరిస్తూ వర్తమాన సాహిత్యాన్ని వివరంగా, సమగ్రంగా సమీక్ష చేయాలని, సాంకేతిక పుస్తక కార్యాలయాన్ని ఏర్పరచాలని కూడా అన్నారు.

నియమావళి ఏకగ్రీవంగా ఆమోదితమైన తర్వాత క్రింది కార్యవర్గాన్ని ఎన్నుకున్నారు.

అధ్యక్షుడు:—శ్రీ నార్ల వెంకటేశ్వరరావు.

ఉపాధ్యక్షులు:—శ్రీ దేవులపల్లి కృష్ణ శాస్త్రి, శ్రీ శ్రీ, శ్రీ కె. కుటుంబరావు, శ్రీమతి నాయని కృష్ణకుమారి.

కార్యదర్శులు:—విద్వాన్ విశ్వం, పందిరి మల్లికార్జునరావు.

సభ్యులు:—శ్రీ మల్లంపల్లి సోమశేఖర శర్మ, పిలకా గణపతి శాస్త్రి, ఆరుద్ర, అనిసెట్టి సుబ్బారావు, అడివి బాపిరాజు, తుమ్మల వెంకటరామయ్య, చలపతీశ్వరరావు, చన్నఘంటమ్మ, అచ్యుతుని గిరిజ, గోఖలే, వట్టికొండ రంగయ్యగార్లు.

సహకార సంఘ నిర్మాణ విషయమై ఆలోచించి రిపోర్టు చేయుటకు ఒక ఉపసమితి నియమింప బడింది, చలపతీశ్వరరావు, చెంచయ్య, కుటుంబరావు, బైరాగిగార్లతో.

శ్రీ పందిరి మల్లకార్జునరావుగారు రచయిత లందరు ఉత్సాహంతో సంఘ నిర్మాణానికి పూనుకున్నందుకు అభినందిస్తూ ఈ విషయంలో కృషి చేస్తున్న విశ్వం, నార్ల, కుటుంబరావుగార్లకు అభినందనాలర్పించడంతో సభ సమాప్తమైనది.

*　　*　　*

## తెలుగు రచయితల సంఘం

తెలుగు రచయితల సంఘం కార్య నిర్వాహక వర్గమూ, సాధారణ సభా 25-11-'51 సాయంకాలం కిన్నెర కార్యాలయంలో సమావేశ మైనది.

కవిత్వం, కథలు, నాటకం, విమర్శ మున్నగు వానిలో పఠన, ఉపన్యాసములు ఏర్పాటు చేయుటకు ఉపసమితులు నియామక మైనవి.

సంఘ పుస్తకాలయానికి ప్రతి రచయితా తన పుస్తకాల నివ్వవలెనని, మిగత ఉదారులను ప్రచురణ కర్తలను కూడ పుస్తకాల నభ్యర్థించవలెనని, నిశ్చయించారు.

శ్రీ శ్రీ, ఆరుద్ర, సవ్యసాచిగారలు తమ రచనలను, ఉమా మహేశ్వరులుగారు సౌందర నందంలోనుండి కొన్ని ఘట్టాలను చదివి వినిపించారు. కొడవటిగంటి కుటుంబరావు గారు తమ కథా రచనను గూర్చి వివరించారు. విద్వాన్ విశ్వం తమ డైరీలోనుండి కొన్ని భాగాలను చదివారు. మా అంజనేయులుగారు ఏక పాత్రాభినయం చేశారు.

శ్రీ మల్లికార్జునరావుగారు సభ్యులకు వందన సమర్పణం చేసి ఇలాగే సమావేశాలన్నిటిని జయప్రదం చేయవలెనని కోరారు.



# అంతరంగస్థాయి

## కొన్ని గీతికలు

* శ్రీ కవికొండల వెంకటరావు *

ఇక్కడ కెరటాల్
గ్రక్కున కొట్టెన్
చక్కని రాలన్,
మక్కువ నేలన్
నాచది లేచెన్
పూచిన విధమై;
ఏ! చిరంతనస్మృతి
ఎద కెత్తెన్;
వీచే గాలికి
వెట్టిగఁ గదులు,
నాచది గరుత్మణి
మేచక కాంతిన్
కాచెను; తోడ్తో
మూచెన్ గెరటాల్:
కన్నా? దాన్నా

*  *  *

ఇక్కడ కొండలు గలవు,
కొండల లోయలు గలవు;
లోయలగుండా సూర్యం
డస్తమయుండై కొలిపెన్
అద్భుతముగ నెఱకాంతి;
ఎత్తుగ మెట్టన్ నిలబడి
వీక్షించుచునే సాక్షిగ.

*  *

ఏరాడ కొండంతో
పచ్చగా నున్నాది!
దాని ప్రక్కాకడలి
స్వేచ్ఛగా నున్నాది!
ఉచ్ఛలంబై మనం
బాశ్చర్య మొందగా!
పాతదైనా తాడి
పాతింది తననీడ!
పొరమావల చూడఁ
గాఁబోలు నీడకే.



## రానున్న ఎన్నికలలో పోటీ చేస్తున్న మహిళలు

(18-వ పేజీ తరువాయి)

| నియోజక వర్గం | అభ్యర్థి | రాజకీయపక్షం |
|---|---|---|
| **బొంబాయి** | | |
| బొంబాయి | శ్రీమతి కాశీబాయి అవసావా | సోషలిస్టు |
| ,, | ,, కమలాదేవి చటోపాధ్యాయ | ,, |
| ,, | ,, విమలాబెన్ మెహతా | ,, |
| ,, | ,, జయశ్రీ రాయ్‌జి | కాంగ్రెస్ |
| కైరా | ,, మణిబెన్ పటేల్ | ,, |
| **మహారాష్ట్ర** | | |
| పూనాసౌత్ | ,, ఇందిరాబాయ్ మయ్‌దేవో | ,, |
| **రాజస్థాన్** | | |
| టంక్ | ,, రతన్ శాస్త్రి | ,, |
| **పశ్చిమ బెంగాల్** | | |
| గహటాల్ | ,, మైత్రేయి బోస్ | ,, |
| హుగ్లీ | ,, రేణుకారే | ,, |
| **హైద్రాబాద్** | | |
| కరీమ్‌నగర్ | ,, లీలావతినాథ్ | సోషలిస్టు |

## రాష్ట్ర శాసన సభలకు

| నియోజక వర్గం | అభ్యర్థి | రాజకీయపక్షం |
|---|---|---|
| **ఆంధ్ర రాష్ట్రం** | | |
| కంకిపాడు | శ్రీమతి ఈడుపుగంటి రత్నమాంబ | కాంగ్రెస్ |
| గుడివాడ | ,, వి. సీతామహాలక్ష్మమ్మ | ,, |
| పత్తిపాడు | ,, టి. కోటమ్మ | ,, |
| పొన్నూరు | ,, గొర్గినేని భారతీదేవి | లోక్ పార్టీ |
| నెల్లూరు | ,, టి. వి. కమలాబాయి | స్వతంత్ర |
| మదనపల్లి | ,, ఆర్. రత్నాబాయి | కాంగ్రెస్ |
| మడకసిర | ,, వై. వెంకటశివమ్మ | ,, |
| చంద్రగిరి | ,, వి. కె. లలితకుమారి | స్వతంత్ర |
| బళ్లారి | ,, ఎ. సుమంగళమ్మ | కాంగ్రెస్ |

## రానున్న ఎన్నికలలో పోటీ చేస్తున్న మహిళలు

| నియోజక వర్గం | అభ్యర్థి | రాజకీయపక్షం |
|---|---|---|
| **హైద్రాబాద్** | | |
| దేవర్‌కొండ | శ్రీమతి సీతాకుమారి | కాంగ్రెస్ |
| కిన్‌వాట్ | ,, లలితా తీర్థ | ,, |
| బన్‌స్‌వాడ్ | ,, సంగం లక్ష్మీబాయి | ,, |
| వైజయ్‌పూర్ | ,, ఆషాబాయి వాగ్‌మారి | ,, |
| ఆట్‌మకూర్ | ,, శాంతాబాయ్ తల్‌పలికర్ | ,, |
| బిల్లోలి | ,, శకుంతలాబాయ్‌సేల్ | ,, |
| జగ్‌తియాల్ | ,, ఇందిరాదేవి | ,, |
| అల్లేరు | ,, ఆరుట్ల కమలాదేవి | ,, |
| రామయ్యపేట | ,, పర్‌సా శారదాదేవి | ,, |
| వన్‌గి | ,, షా అన్‌బేగం | కాంగ్రెస్ (పోటీలేకుండా) |
| **మద్రాసు సిటీ** | | |
| మద్రాసు | ,, ఎ. శకుంతల | స్వతంత్ర |
| ,, | ,, వి. జయలక్ష్మిగారు | ప్రజా పార్టీ |
| ,, | ,, యమునాబాయిగారు | స్వతంత్ర |
| ,, | ,, ఇంద్రాణి బాలసుబ్రమణ్యంగారు | జస్టిస్‌పార్టి |
| ,, | ,, డాక్టరు శకుంతలగారు | స్వతంత్ర |
| బొంబాయి | ,, లీలావతి బాన్‌కర్ | కాంగ్రెస్ |
| ,, | ,, కాశీబాయ్ సతీ | ,, |
| ,, | ,, కృష్ణాహతి సింగ్ | సోషలిస్టు |
| మైసూర్ | ,, హమిదా హబిబుల్లా | స్వతంత్ర |
| దిండిగల్ | ,, మేరి అర్పుతం అమ్మాళ్ | కాంగ్రెస్ |
| ఆర్కాటు | ,, టి. కె. మనోన్‌మణి | స్వతంత్ర |
| తిరుచూర్ | ,, లీలా దామోదరన్ | కాంగ్రెస్ |
| తిరుచున్‌గడి | ,, రాధాబాయి సుబ్బరాయన్ | ,, |
| అంబసముద్రం | ,, లక్ష్మీశంకర్ అయ్యర్ | ,, |

వార్తా పత్రికలలో ప్రచురించినంతవరకు—మాకు లభ్యమైన వివరాలు.




# కిరణ్ - సాహస కృత్యాలు

*** వి. కృష్ణమూర్తి ***

[కిరణ్ ఏడెన్‌లో ఓడదిగి తనకి కావలసిన సామాన్లు కొనుక్కొని, తిరిగివచ్చి, తన పెట్టెలోని దుస్తులు మాయమవటం చూసి, చాల ఆశ్చర్యపోతాడు. కాని, అప్పటినుండి తన సామానులను చాల జాగ్రత్తగా చూసుకుంటాడు.

కిరణ్ దక్షిణ అమెరికాకి పోతున్నాడు. అక్కడనుండి వరుసగా ప్రయాణం చేసుకుంటూ తన దేశం చేరాలనుకున్నాడు. తన డబ్బును పట్టినంత జేబులో పెట్టుకుని, మిగత ఒక పెట్టెలో పెట్టి, ఆ పెట్టెను ఒక లైఫ్‌బోట్ (Life boat) లో ఉంచుతాడు.

ఒక రోజు కిరణ్‌కు చలివల్ల నిద్రాభంగం కలుగుతుంది. ఆశ్చర్యంతో చుట్టూ చూస్తే, ఓడ మునిగినట్లూ, తను ఎట్లాగో తప్పించుకొని లైఫ్‌బోట్లో సముద్రము మీద తేల్తున్నట్లు తన కర్థమవుతుంది.

కిరణ్ అట్లాగా ఐదు రోజులు ప్రార్థన చేసుకుంటూ గడుపుతాడు. ఐదవరోజు ఉదయం ఏదో ద్వీపంలాగ కనిపిస్తుంది. లైఫ్‌బోటు ఆ దీవిలాగ ఉన్న ఒక చేపమీదికి చేరుకుంటుంది. కిరణ్‌కి చాల భయమేస్తుంది. కాని ఆ చేప అతనిని మునుపటి కంటె వేగంగా తీసుకుపోతుంది. చీకటి పడ్తుంది. కిరణ్ నిద్రనుండిలేచి చూడగా తను ఒక దీవిచేరి ఉంటాడు. తనచుట్టూ మనుష్యులు ఉంటారు. అందులో రెండు తనకు పరిచితమైన ముఖములే. కిరణ్ వారివల్ల వారందరూ తనలాగే ఆ విచిత్రమైన చేప మూలంగా ఆ దీవి చేరేరని తెలుసుకుంటాడు. వాళ్లు ఆహారం ఇచ్చి, సంగతులు చెప్తారు.]

" అది నిజమైన చేపకాదు. చెక్కతో చేయబడ్డది. ఎవ్వరేనా ఓడ మునిగి చచ్చిపోతుంటే వీళ్లు ఈ చేపను—2 మనుష్యుల్తో నింపి— అక్కడికి పంపుతారు. ఆ మునిగే వాళ్లెవరేనా యీ చేపమీద ఎక్కుతోనే మళ్లా వెనక్కితిరిగి ఆ మనుష్యుల్ని యీ దీవికి తెస్తారు. బాగా ఆహారం ఇస్తారు. వీళ్లకి డబ్బు యిచ్చామంటే మనం ఎక్కడికి పోవాలో అక్కడ దిగబెట్టి వస్తారు."

"మరి మీరెందుకు మీ వూళ్లకి పోలేదే!"

"మా దగ్గిర డబ్బులేదు. డబ్బిస్తేగాని మనల్ని ఎక్కడకు పోవాలో అక్కడ దిగబెట్టరు:

సేవకుల మల్లే చూస్తారు. నీ గతికూడా అంతే నేమో!"

"కాదనుకుంటాను. నా దగ్గిర డబ్బుంది. మిమ్మల్నికూడా తప్పిస్తాను."

వాళ్లకి ఆశ్చర్యం ఐంది. సంతోషంకూడా కలిగిందని చెప్పనక్కరలేదు.

కిరణ్‌కి ఆ దీవిలోనివాళ్ల భాష తెలియదు. ఐనా అతని స్నేహితులకి బాగా అలవాటయింది, అక్కడే వున్నారు కాబట్టి. ఆ స్నేహితుల్తో యిల్లా అన్నాడు!

"మీకు వీళ్ల భాష వచ్చును కదా! మనల్ని యిండియాకు తీసుకుపొమ్మనండి. అక్కణ్ణించి మీరు మీ దేశాలకి పోవచ్చును."

వాళ్లు సరే అన్నారు. ఆ దీవివాళ్లొప్పు కున్నారు. కాని ఎక్కువ డబ్బడిగారు. కిరణ్‌కి ఆ డబ్బు ఎక్కువగా తోచలేదు. జేబుల్నుంచి తీసియిచ్చాడు. ఈయన చాలా ధనవంతుడులా వున్నాడు, కాస్త యెక్కువ అడగలేకపోయామే అని ఆ దీవివాళ్లు విచారించారు.

సరే, కిరణ్ అతని స్నేహితులు చేపలాంటి పడవలోపల యెక్కారు. చేపలో ఆ దీవివాళ్లు 4 గురు ఎక్కారు. ఆ నలుగురూ పెద్ద పెద్ద బాకులు రెండూ, పిస్తోళ్లు, కావలసిన ఆహారం తీసికొని యెక్కారు.

ఒక చిక్కు వచ్చింది. ఆ పడవవాళ్లు కిరణ్ తెచ్చిన బోటును ఎక్కించుకో లేమన్నారు. కిరణ్ ప్రాణమంతా ఆ బోటే కదా! తన డబ్బంతా అందులోనే కదా వుంచాడు!

"పోనీ చేపపైనఐనా వుంచనీయండి" అని కోరాడు. "ఆ బోటుపై అంత ప్రాధాన్యం ఎందుకు చూపుతున్నాడు? అందులో ఏమో వుండాలి," అన్న సందేహం ఆ దీవివాళ్లకి కలగ లేదు, వాళ్ల బుర్రలు చదును కాబట్టి.

"సరే" అన్నారు. కిరణ్ ఆ బోటును చేప పైన పెట్టాడు. దానిపైనే తన స్నేహితులూ, తానూ కూచున్నారు. చేప లోపలి భాగంలో పడవవాళ్లు (అంటే ఆ దీవివాళ్లు) వున్నారు.

చేప చాల రోజులు ప్రయాణం చేసింది. పడవవాళ్లకి చెడ్డబుద్ధి కలిగింది. వాళ్ల భాషలో ఇల్లా మాట్లాడుకొన్నారు:

ఒకడు: ఒరేయ్, వీళ్లు చాల ధనవంతులుగా వున్నారు. వీళ్లని చంపి వీళ్ళ డబ్బు పుచ్చు కొని ఉడాయిద్దాం.

మరొకడు: అవునురా, మరి యెల్లాగ చంపటం వీళ్లని?

3-వ వాడు: వద్దురా పాపం! వాళ్లని చంపొద్దు. మన కర్తవ్యం మనం చేద్దాం. వీళ్లని చంపటానికి నే నొప్పుకోను.

4-వ వాడు: నిజం మనం న్యాయంగా నడుచుకుంటే దేవుడు న్యాయం చేస్తాడు. మనకీ దుర్వ్యాపారం వద్దు. వీళ్లని దిగబెట్టేసి మనం మన దీవికి వెళ్దాం.

1-వ వాడు: నీ కిష్టం లేకపోతే నీవు చం పొద్దు. మేమే వాళ్లని చంపి, డబ్బును—మేమే—తీసుకొంటాం.

2-వ వాడు : అంతే. మీా కిష్టం లేదంటే మీారు హాయిగా పడవ నడపండి. మేం వాళ్లని చంపి, డబ్బును తెస్తాం.

3-వ వాడు : ఛీ వెధవా! అన్యాయంగా వాళ్లని చంపుతున్నావురా! ముందు నిన్నే చంపేయాలి—అని రెండవవాడ్ని బాకుతో పొడిచేశాడు. మొదటివాడు ఉద్రేక పూరితుడయ్యాడు.



"వాణ్ణి చంపుతావురా...." అని 3-వ వాణ్ణి చంపేశాడు. ఇక మిగిలింది ఇద్దరే! ఈ గోలంతా కిరణ్‌కి గాని, స్నేహితులకిగాని తెలియలేదు. ఏవో గోలలు విన్నారుగాని వాళ్లేదో మాట్లాడుకుంటున్నారని అనుకొన్నారు.

"ఇప్పటికేనా వప్పుకొని నాకు సహాయం చేసావా—సరి—లేదా ఇదుగో చూడు" అని మొదటివాడు (వీని పేరు గాంట్) నాలుగవవానికి (వీని పేరు మార్క్స్) బాకు చూపాడు. వానికేమీా తోచలేదు. ఈ క్రూర కార్యానికి అతని మనస్సొప్పుకొనలేదు. కిరణ్‌ని, అతని స్నేహితులను రక్షించాలనుకొన్నాడు. ఎల్లాగ రక్షించగలడో!

"నేను వొప్పుకున్నాను. వాళ్లని చంపేశి వస్తాను." అన్నాడు మార్క్స్ రెండు పిస్తోళ్లు తీస్తూ.

"నీవు మంచి వాడివి! సరే. నీవు ఒకడివి, వాళ్లు ముగ్గురు ఎల్లాగ చంపుతావు?" అన్నాడు గాంట్.

"అదెంత పని! వాళ్లవద్దకుపోయి ప్రీతిగా మాట్లాడి హఠాత్తుగా పిస్తోళ్లతో ఇద్దర్ని కాల్చేస్తాను. ఇంతలో నీవు వచ్చి మిగిలిన ఒక్కణ్ణి చంపేయ్."

"మెదడంటే నీదే మార్క్స్! కాని నేను కూడా వస్తే పడవ నడిపే దెవ్వరు?"

"నేను ఇద్దర్ని చంపేశి వస్తాను. నేను వచ్చిన తర్వాత నీవు వెళ్లి ఇంకోణ్ణి చంపేయ్. నేను పడవ నడుపుతుంటాను. అంతతో పీడ వదుల్తుంది."

"సరే, వెళ్లు."

మార్క్స్ మనస్సులోని విషయం గాంట్‌కి తెలీలేదు. గాంట్‌కేమిటి; మనకికూడా తెలియదు!

మార్క్స్ పిస్తోళ్లు తీసుకొని పడవ పై భాగానికి వచ్చాడు. కిరణ్ స్నేహితుడు ఇల్లాగ అడిగాడు. "ఏం వోయ్! వచ్చావ్!"

మార్క్స్ రహస్యంగా ఇల్లా అన్నాడు.

"వింట్! (కిరణ్ స్నేహితుడి పేరు) మెల్లగా మాట్లాడు. నేను వచ్చినదానికి కారణం లేకపోలేదు. వా స్నేహితులు మిమ్మల్ని చంపాలని

ప్లాా వేశారు. నేను, ఇంకొకడు వద్దన్నాం. వాళ్లిద్దరూ వినలా. పెద్ద పోట్లాట జరిగింది. మీకు తెలియలేదేమిటి ? ”

“ అబ్బే! గోల వినింది గాని అది పోట్లాట అని అనుకోలేదు.”

“ సరే విను. పడవలోపలఒక్కడుమాత్రం— నేను కాక—బ్రతికి వున్నాడు. మిమ్మల్ని చంపి రమ్మని నన్ను పంపాడు. ఇదిగో చూడండి. ఈ పిస్తోళ్లు మీ దగ్గిర వుంచుకోండి. నేను పోయి మిమ్మల్ని చంపానని చెప్తాను. అప్పుడు వా డిక్కడికి వస్తాడు. మీరు పిస్తోలును పేల్చి వాడిని చంపేయండి. ”

అని ఆ పిస్తోళ్లు వాళ్లకి ఇచ్చేసి తాను పడవ లోపలి కెళ్లాడు మూర్న్.

మూర్న్ వొక తెలివితక్కువ పని చేశాడు. పిస్తోలు చప్పుడు కాలేదు కదా, ఐనా కూడా గాంట్ దగ్గిరికెళ్లి యిల్లా చెప్పాడు. “ గాంట్ ! ఇద్దర్ని చంపేశాను. ఇంకా వొక్కడు బాకీ వున్నాడు. వాణ్ణి నీవుపోయి చంపేయి. నేను పడవ నడుపుతూంటాను.”

గాంట్‌కి సందేహం కలిగింది. “ పిస్తోలు చప్పుడేకాలేదే! ఎల్లాగ చంపావు ? ” అన్నాడు.

మూర్న్‌కితన తెలివి తక్కువ పని తెలిసింది. ఏమీ బదులివ్వలేదు. గాంట్‌కి కోపం వచ్చింది. “ నిజం చెప్పు వాళ్లని చంపావా లేదా ? ”

“ ................ ”

“ నిన్నే, మాట్లాడవేం ? ”

“ ................ ”

“ ఇంత పొగురెక్కిందా ? నీ మాట అబద్ధ మేనా ? ”

“ ................ ”

“ ఐతే వాళ్లని చంపలేదన్నమాట. చూడు నిన్నేం చేస్తానో ” అని మూర్న్ పైన దూకాడు.

“ అయ్యో ! చచ్చాను ! ! ”

మూర్న్ చచ్చాడు.



ఇక్కడ పడవపైన వున్నవాళ్లకి ఆ కేక వినపడింది. పిస్తోళ్లు తీసికొని వింట్ పడవలోకి వెళ్ళాడు. గాంట్, మూర్న్ పీక పిసికేసి అప్పుడే చేయి యెత్తుతున్నాడు. ఇంతలో వెనకనించి పిస్తోలుగుండు అతని వీపుకు తగిలింది. రెండు గుండ్లు తగిలాయ్. గాంట్ పని ముగిసింది.

పడవ నడిపేవాళ్లెవరూ లేరు. కిరణ్ తన Life Boat ని చేపలోకి తీసుకెళ్ళాడు. అక్కడ నలుగురి శవాలు పడివున్నయ్. వాటిని తీసి సముద్రంలో పారేశారు కిరణ్‌వాళ్లు. తమ ప్రాణాపాయము తప్పినందుకు సంతోషించారు. కిరణ్ తన కథనంతా చెప్పి వింట్‌ని చూస్తూ ఇలాగ అన్నాడు.

"వింట్! నీవు ఆ దీవికెలా వచ్చావో చెప్ప లేదే!"

"ఔను చెప్పలేదు—ఎవ్వరికీ చెప్పలేదు. తీరిక వుంటే కదూ!"

"ఇంకా నెల్సన్‌కి కూడా చెప్పలేదా?" (నెల్సన్ ఇంకొక స్నేహితుని పేరు.)

"ఊ హూఁ. లేదు. ఆ దీవిలో కలుసుకున్నాంగాని సావకాశంగా మాట్లాడ నిచ్చారా ఆ దీవి వాళ్లు? ఏదో చాకిరీ చెప్పి చేయించే వారు. ఇప్పుడు నీవు రాకపోయివుంటే మేమింకా కష్టపడేవాళ్లం. నీ వుపకారం ఎన్నటికీ మరువము. నేను నా కథ నెల్సన్‌కి చెప్పలేదు, నెల్సన్ తన కథ నాకు చెప్పలేదు."

"సరే వింట్! నీ వా దీవికెలా వచ్చావో చెప్పు."

"చెప్తా. నెల్సన్, నీవుకూడా వింటున్నావు కదూ!"

[వచ్చే సంచికలో వింట్ కథ]



## నవ్వు మాటలు

తండ్రి: ఏంరా రామం పరీక్షలో మార్కులన్నీ బాగా వచ్చాయా?

రాము: ఓ అంతా నూటికి పైననే వచ్చింది నాన్న.

తండ్రి: అలాగా! ఏది చూపెట్టు.




* * *

ఒకాయన: ఎందుకండి మీ పిల్లవాడు అస్తమానం ఏడుస్తుంటాడు?

పిల్లవాని తండ్రి: ఏం చేయటం, ఏడవవద్దని ఎన్నిసార్లు చావదన్నినా ఏడుస్తునే ఉంటాడండి.

* * *

పాలవాడు: (ఇంటి ఆవిడను చూచి) ఏమండి అమ్మగారు మన ఆవుపాలను నిన్న పోలీసులు పరీక్షించారండి.

ఇంటావిడ: ఆలాగా ఏదైనా కనిపెట్టారా.

పాలవాడు: (మతిమరుపుగా) ఏమండీ, ఏమంటున్నారు.

ఇంటావిడ: దాంట్లో పాలు కనిపెట్టారా అని.

* * *

పుస్తక వ్యాపారస్తుడు రామువాళ్ల నాన్నని చూచి: ఏమండీ యీ కీ నోట్సు మీ అబ్బాయికి కొని ఇవ్వండి. 100 కి 50 మార్కులు నిశ్చయం.

రాము: అలాగయితే 2 కొనివ్వండి నాన్నా.

—టి. ఆర్. రామకృష్ణ.



# ....“బాలశక్తి”....

* మండ మల్లికార్జునరావ్ *

మనమంతా బాలురం!
పసి బాలురం!
కసి యువకులం!
భరతమాత పుత్రులం!
భావిదేశ పౌరులం!
నవభారత వీరులం!
శౌర్య వీర్య శూరులం!
మనమంతా బాలురం!

మనం బలశాలులం!
ఘన త్యాగ శీలులం!
భావి భరతదేశ—....
భాగ్యం మనదేనండి!
ఏ నాటికైనా—!
ఏ మాట విన్నా—!
జయం మనదే—వి
జయం మనదే!
మనమంతా బాలురం!

బాపూజీ—అహింస—
కథలన్నీ అందరికీ—!
వచ్చి—వచ్చి—!
కూర్చి—కూర్చి—!
నేర్చి—నేర్చి—!
బోధన చేద్దామ్
మనమంతా బాలురం!

శాంతి కోసం—
పాటు పడదాం!
కట్టు కడదాం!
పట్టు పడదాం!
శాంతియే బోసి—
తాతాశయం!
చూపిద్దాం—బాలశక్తి!
కనబరుద్దాం—బాలయుక్తి!
మనమంతా బాలురం!

నిర్మిద్దాం!
నిర్మిద్దాం—అతి
పేర్మితో—అతి
కూర్మితో నిర్మిద్దాం!
ధర్మదాతలం—....!
నవభారత—....
భావి నిర్మాతలం!
దేశ నిర్మాతలం!
విశ్వ నిర్మాతలం!
మనమంతా బాలురం!

త్రివర్ణ—ధర్మ
చక్రపు జెండా!
అనంతాకాశాన—
ఎగరేద్దాం....!
ఎగరేద్దాం—
కాంగ్రెసు జెండా!!!
మనమంతా బాలురం!

★

# లేడి

* ధవళ నాగేశ్వర్ *

ముద్దుల మురిపేల
చిన్నారి ఓ! లేడి
రంగు రంగుల వింత
రతనాల వగలాడి....
చూపరుల మనసులను
త్రుటిలో బంధిస్తావు
అడవంత నీ హక్కు
స్వాతంత్ర జీవి....
పొదరిండ్ల నీడలో
చిదురుతూ, బెదురుతూ

చంగు చంగున దూకు
చిలిపి బంగరు లేడి....
అందాల నీ పరుగు
ప్రకృతికి కనుదిరుగు
ఎచ్చోట నేర్చావె
ఈ కళను ఓ! లేడి....
వెరపు చూపులతోడ
మిరుమిట్లు గొలుపుతూ
నా దరికు ఒకసారి
రావె! వగలాడి....




MY AMRUTANJAN
SOVEREIGN REMEDY
There are
Millions of "MY's"
in that
MY,
Applied to the 46 year old
"Pocket Doctor" of INDIA.

# సినిమా పరిశ్రమ

* శ్రీమతి అద్దేపల్లి శ్యామలాదేవి *

ప్రపంచమునందెన్నియో కళలు గలవు. చిత్రలేఖనము, సారస్వతము, సినిమా నటన ఇత్యాదులన్నియు కళలే. కళ యనునది యధోగతియందున్న ప్రపంచమంతయు విచారింప వలెను. కళలు ఏ దేశమున అభివృద్ధిజెందియుండునో యా దేశము గర్వించదగినది. సినిమా కళ మానవ శ్రేయోదాయకము, మానవ మార్గదర్శకము.

సినిమాకళ యను దానిని గూర్చి వివరించునపుడు యా కళ పూర్వ ముండెడిదా? లేదా? యను విషయ మాలోచింతము. దానికి సమాధానము "లేదు" అను విషయము రూఢి యగుచున్నది. తోలుబొమ్మలాట లుండెడివి. బయస్కోపులనునవి యుండెడివి. ఆ కాలమున అవియే గొప్పవి యనుకొనియెడివారు. సినిమా వచ్చిన తదుపరి దానిని చూచువారే లేకపోయిరి. శాస్త్ర పరిశోధనవలన శాస్త్రకారులు పెక్కు కార్యములు సాధించిరి. సినిమా కళను కూడ సాధించిరి. మాటలు లేని సినిమాలు (Silent Pictures) ముందు వచ్చెను. తదుపరి మాటను ఆటను జతగూర్చి, మాటలాడుచు ఆటలాడు సినిమాలు రాదొడంగినవి.

సినిమాలు మానవునికి ఎన్ని విధముల నుపకరించుచున్నవి యన, మానవుడు యలసి శ్రమనొందుచున్న, వానికి విశ్రాంతి, వేడుకను యిచ్చి ఆనంద పరుచుచున్నవి. సాంఘికాచారములలో యున్న లోపములను ఖండించి తెరమీదను చూపి, సాంఘిక ధర్మమునకు దారిచూపుచు, సాంఘిక పునర్నిర్మాణమునకు తోడ్పడుచున్నవి. పురాణ గాథలచే సంఘములోగల అవినీతిని నిర్మూలించి నీతికి, దయకు, ధర్మమునకు, శాంతికి గల ప్రాధాన్యమును వివరించి మానవుని నడతయందు మార్పు తీసుకొని వచ్చుచున్నవి.

ముందు ముందు ప్రభుత్వము ఈ కళను బాలుర చదువును వృద్ధిచేయుటకై వినియోగించి దానినుండి బాలురను అభివృద్ధిలోనికి తీసుకొనిరా ప్రయత్నించుచున్నారు. అందులకు మనము గర్వించి, ఆనందింప వలసియున్నది. కొన్ని పట్టణములలోని ఉన్నత పాఠశాలలలోను, కళాశాలలో గూడ ప్రస్తుతము కొన్ని సినిమాలతో, బాలబాలికలకు పాఠమును బోధించునట్లు ప్రభుత్వమువారు చేసిరి. దీనివలన విషయము బాగుగ మనసులో నాటుకొనుటయే గాక, విద్యార్థులకు చూచుటకు అభిలాషగను, ఉత్సాహముగను యుండును.

ఈ కళలోని నష్టములనుగూడ వివరింపవలసి యున్నది. ఈ కళ నిర్మాతలవలన నష్టములను ముందు పేర్కొనవలెను. నిర్మాతలు వ్యవహార దృష్టితోనేగాని, కళా దృష్టితో చిత్రములు తీయుటలేదు. యెట్టిదో ఒకయట్టి చిత్రమును తీసి ప్రేక్షకుల నెత్తినికొట్టి ధనము గుంజుకొనుచున్నారు. సాంఘిక, పౌరాణిక చిత్రములు తీయుచున్నను వారు మానవునికి కావలిసిన కట్టుబాట్లకు ప్రాముఖ్యత నిచ్చుట మాని, నాయికా నాయకులకు, తదితరులకు నసహ్యాకరముగ వేషములు వేసి ధనము లాగుచున్నారు. కథయందలి నీతికిగాక, యవినీతికి ప్రాధాన్యము నిచ్చుచున్నారు. కళను నాశనము చేసి వర్తక మభివృద్ధిచేయుచున్నారు. వారికి అర్థమే ప్రధానము, ఇట్టి యవినీతిపరులను సినిమా ప్రపంచమునుండి వెడల నడచిన, ప్రజలు ఇట్టి స్వార్థపరులకు ప్రపంచముననే యెక్కడను స్థానము లేకుండ జేసినయెడల ఇట్టి కళా వేరు పురుగులు నశింతురు. ఈ దుర్మార్గులు ప్రజల ప్రవర్తనము పాడుచేయుచున్నారు. యువకులను వధ చేయుచున్నారు. అనేక యువకులు సినిమాలను చూచి దుర్వ్యసనములకు

---

నైతిక ప్రబోధం, విజ్ఞాన ప్రచారం, మానసిక వినోదం, ప్రజలకు కలిగించగల్గే చిత్రాలే, ఉత్తమ చిత్రాలనుపించుకుంటాయి. ఏ చిత్రంలోనైనా, పై మూడింటిలో కనీసము ఒక్క ఆదర్శమైనా లేని నాడు, నిర్మాతల దోపిడీ వ్యాపారమే ఔతుంది. నాగరిక ప్రజకు అసభ్యమని తోచి, ప్రజా సామాన్యములో చెడుతలపులకు తావిచ్చి, నైతిక ప్రమాణాలను సడలింప జేసేటట్టి చిత్రాలను అరికట్టేవి ప్రభుత్వ శాసనాలూ కావు. సెన్సారుబోర్డులూ కావు. ఆ అరికట్టగల శక్తి ప్రజలలోనే ఉన్నదని ముమ్మాటికీ నొక్కిచెప్పవచ్చు. ఉత్తమ నైతిక దృక్పథం ప్రజలలో కలిగిననాడుగాని, నిర్మాతల మనస్సు ఉత్తమ చిత్రములపైకి పోదు.

సం॥

బలియగుచున్నారు. పైగా ఇంటియందు బాలుబిడ్డలకు తినుట కున్నను, లేకున్నను, తనకు తాను తిన్నను లేక పోయినను సరే! సినిమా మాత్రము చూడకుండ నుండలేడు. అందు వల్ల కల్లు ఇత్యాది దుర్వ్యసనములు రెట్లో సినిమాకూడ అంత దుర్వ్యసనమై పోయినదని చెప్పాలి. దీనివలన లాభము నాస్తి.

"ఈ కళ బాగుపడవలెను. దేశము బాగుపడవలెను." అను కోరిక ప్రజలకున్నచో ప్రజలు, ప్రభుత్వము, తగు చర్య వెంటనే తీసుకొనునట్లు చేయవలెను. ప్రజయే ప్రభుత్వము కాదా! సినిమా కళ ముఖ్యముగ నీతి నియమ బద్ధమై దేశాభ్యుదయమునకు వినియోగింపబడవలెను. అది ఎట్లు? ఒక నాయకుడు తన దేశమునకై ఎట్లు అగచాట్లు పడెనో, ప్రజల కెట్టి యుపదేశములు చేసెనో; ప్రజలలో ఎట్టి స్వతంత్రేచ్ఛగలదో, స్వాతంత్ర్య దేశమెట్లుండవలెనో, యిట్టి ఆదర్శములు పెట్టుకుని చిత్రములు తీయవలెను. నిజమునకు అట్టి చిత్రములను వేనకువేలు తీయవచ్చును. ప్రజలలో ఉత్సాహమును స్వాతంత్ర్యేచ్ఛను, జాతీయతను రేకెత్తించు చిత్రములే చిత్రములు. సుభాస్ చంద్రబోస్ జీవితమును చిత్రముగా తీసినచో ప్రజానీకము సంతసింపవలసినదే!

ప్రజలు అట్టి చిత్రములుచూచి యానందించుటకు వీలగునట్లుగా రేట్లను నిర్ణయింపవలసియున్నది. ఉచిత ప్రదర్శనములను గూడ జరిపించు బాధ్యత ప్రభుత్వముపై యున్నది. ప్రవరుని చిత్రము వంటి చిత్రములును తీయు దర్శకులకు కఠిన శిక్షకు పాత్రులుగా జేసిన, అట్టి చెత్త చిత్రములు రావు. అమాయిక ప్రజ వానికి బలికాదు.

పాత్రధారులగు నాయికా నాయకులు, తదితరులుకూడ ఈ పరిశ్రమకు సహాయపడవలసి యున్నది. వారును మానాభిమానములను విడచి, సినిమా ప్రపంచమున దిగుటచే దర్శకులుకూడ అవినీతిగ వేషములు వేయుటకు వెరువరైరి. ఆ విషయమున దర్శకులకు నటీనటులు బాగుగ సహాయపడు చున్నారు.

కళను రూపుమాపు యుద్దేశ్యము కాక కళ నుద్ధరించవలెనను యుద్దేశ్యముండవలెను. అదియే దేశ సౌభాగ్యము నొనగూర్చగలదు.



# పెళ్లి కూతురు

ఎవెస్‌కే వారి ప్రథమ తెలుగు చిత్రం పెళ్లికూతురు. ఈ సాంఘిక చిత్రంలో బాలయ్య, కృష్ణన్, మధురం, లలిత, పద్మిని ముఖ్యపాత్రలు ధరించారు. దర్శకుడు ఎన్. ఎస్. కృష్ణన్.

ఒక భాగవతారు వుంటాడు. అతనికి కనిపించిన ప్రతి అమాయక స్త్రీని వంచించి చెర్లాట లాడటం పరిపాటి. అతని దగ్గర పాట నేర్చుకునే కుమారి ఒక జమీందారు కూతురు. ఆమెకు చంద్రుడనే తగిన యువకునితో పెళ్లి నిశ్చయమవుతుంది. ధనవతి అయిన కుమారిని దక్కించుకోవాలన్న తలంపుతో తనను పెళ్లిచేసుకోమని భాగవతారు అడుగుతాడు. ఇది తగదని కుమారి మందలించు తుండగా చంద్రుడు వస్తాడు. భాగవతారును కొట్టబోగా ఆమె వద్దని అడ్డగించుతుంది. మాటకు మాట పెరిగి అహం భావంతో కుమారి భాగవతారునే పెళ్లి చేసుకుంటా నంటుంది. చంద్రుడు నిస్పృహతో వెళ్లిపోతాడు. భాగవతారు మునుపు వంచించిన రాధ అనే అనాథ స్త్రీ కథ కుమారికి తెలుస్తుంది. కాని మాట నిలబెట్టుకోవాలన్న పెంకితనంతో ప్రేమలేకపోయినా భాగవతారునే పెళ్లి చేసుకుంటుంది. విముఖత్వం చూపుతుంది. భాగవతారు నడత యింకా పాడవుతుంది. జమీందారు వూళ్లోలేని సందర్భంలో, ఆస్తి తన పేరవ్రాసి యివ్వమని కుమారిని వొత్తిడి చేస్తాడు. చివరకు హింసిస్తూ వుండగా రాధ పోలీసులతో వస్తుంది. పోరాటంలో భాగ్వతారు కిందపడి చనిపోతాడు. కుమారి చంద్రుల పెళ్లి జరుగుతుంది. ఇదీ సారాంశం.

భాగవతారుగా బాలయ్య నటన చాలా మెచ్చతగి వున్నది. మంచి నైపుణ్యంతో నటించటాన ఆ పాత్ర ఎంతో సహజంగాను, సజీవంగాను వున్నది. అతని స్నేహితుడు రాడీ పాత్రకూడ బాగున్నది. సంభాషణలో కొంత యాస కనిపించినా భావ ప్రకటన బాగున్నది. పెళ్లికూతురు కుమారిపాత్ర పద్మిని ధరించింది. ఆమె హావభావాలు అదుపాజ్ఞలలో పెరిగిన గొప్ప యింటి బిడ్డకు చక్కగా తగి వున్నవి. జమీందారు స్థాపించిన అనాథ బాల బాలికా ఆశ్రమానికి పెద్దగా కృష్ణన్ నటించాడు. చవట దద్దమ్మ భర్తగా హాస్యం చిత్రానికి కూర్చక యీ చిత్రంలో కృష్ణన్ దయామయుడైన ఆశ్రమ పెద్దగా చక్కని గుణ పాఠాలు నేర్పే గురువుగా నటించాడు. కాని అతని నూటి అయిన మాటలు, కొంచం అవకతవక పనులు కనపడీ కనపడని విధాన నవ్వు తెప్పించుతవి. కాని 1950—60 ప్రహసనం మట్టుకు చాలా చక్కగావున్నది. దాంట్లో నిశితమైన విమర్శ, ప్రబోధం, అభ్యుదయ భావన, అన్నీ యిమిడి ఎంతో రసవంతంగా ప్రయోజన కారిగా వున్నది. కృష్ణన్ కొంచం ఆలోచించుమని మాట్లాడుతున్నట్లు తోస్తుంది. మొత్తంమీద కృష్ణన్, మధురం ధరించిన పాత్రలు యిది వరకటికన్న కొత్త రకంగా వుంటు, చిత్రానికి చక్కని నాజూకు అయిన హాస్యం కల్పించినవి. నటులను గురించి చెప్పే సందర్భంలో వారు బాగా నటించారు వీరు బాగా నటించారని చెప్పేకన్న మొత్తంమీద చిత్రంలో నటనకు విలువను ప్రాధాన్యతను ఇచ్చారని, నటీనటులందరు శ్రద్ధతో పాత్రపోషణ చేశారని అంటే సరిపోతుంది. సంభాషణలు బాగున్నవి. చిత్రం ఆశ్రమ బాలబాలికల దినచర్యలతో ఆరంభ మవుతుంది. వాళ్ల స్నానపానాలు, చదువుసంధ్యలు, ఆటపాటలు ఎంతోసేపు చూపించుతారు. ఎందుకు చూపుతున్నారో కథతో దానికి యేమి సంబంధము వుంటుందో అని ఎదురు చూస్తు వుండవలసి వస్తుంది. ఆశ్రమవాసులు రాధను రక్షించారని చూపటానికి అంతగొడవ అనవసరం. మేనేజరు రెండవభార్య అయిన విజయకు కొంత చపలత వున్నప్పటికి అంత విచ్చలవిడిగా ఆటపాటలతో షికార్లతో బజారు మనిషిగా చూపటం సరిగాలేదు. రాధ పిల్లవాడు సొంతం చనిపోవటం అనవసరం. బయట పోలీసులు అంత మంది జనంవచ్చి చుట్టుముట్టిన తర్వాత భాగవతారు కుమారిని అంత తీరికగా హింసించటం సమంజసంగా కనిపించదు. చిత్రం మొదటిభాగం కొంత విసుగు కలిగిస్తున్నది. మొదట కొంతసేపు ఛాయాగ్రహణంకూడ సరిగాలేదు.

## పెళ్లికూతురు

మేనేజరును మహాబలిపురంలో జమీందారు కలుసుకున్న ఘట్టం బాగున్నది. ఆ శిల్పాలు శిథిలాలు చూసాలని చూప కుండ కథలో అవసరాన్నిపట్టి మాపుతున్నట్లు చూపటంలో చాలా నైపుణ్యం కనిపిస్తుంది. విజయ చివరిలో రాధపైన కసి తీర్చుకునే ఘట్టం చాలా సరి కొత్తగా వుండటమేకాక మానవ స్వభావాన్ని వెలిబుచ్చుతు తమాషాగా వున్నది. పెళ్లికూతురి వెంకితనం మినహాయిస్తే, నవ్విస్తు, ఆలోచన కలిగిస్తు పెళ్లికూతురు చిత్రం బాగానే వున్నది.

మన్మగళ్ అనే అరవ చిత్రానికి యిది కేవలం డబ్బింగ్ అని ఎక్కడా అనిపించక చక్కగా వున్నది. ప్రయోజనంతో ప్రబోధం చేసే చిత్రం.

—అ. గిరిజ



# తెలుగు భాషా సమితి, మద్రాసు

## (సంస్కృతి సమితి)

## సంస్కృతి మహా సభ

### సంస్కృతి వికాసం—పత్రికలు

తెలుగు భాషా సమితి విజ్ఞానసర్వస్వ ప్రచురణతో పాటు ఆంధ్రుల సాహిత్య, కళాభివృద్ధికి బహుముఖాల తోడ్పడ నిశ్చయించుకొన్నది. సంస్కృతి రంగంలో చైతన్యాన్ని ప్రబోధింపజేయుటకు ఇటీవల ఒక "కల్చరల్ కమిటీ" (సంస్కృతి సమితి) భాషా సమితి ఆధ్వర్యమున ఏర్పడినది. సాహిత్యానికి, కళలకు సంబంధించిన వివిధరంగాలలో నూతన జాగృతిని కల్పించుటకు ఈ కమిటీ నడుంకట్టి పని చేయగలదు.

ఆధునిక సంస్కృతి వికాసానికి పత్రికలు పట్టుగొమ్మలు. మనదేశంలో జాతీయ భావ ప్రాదుర్భావంతో పాటు పత్రికలు కూడా అవతరించినవి. పరప్రభుత్వ దాస్య విచ్ఛిత్తికై భారత ప్రజానీకం నడిపిన స్వతంత్ర సంగ్రామంలో చేదోడు వాదోడుగా మెలగినవి పత్రికలు. నేటి మన పునర్నిర్మాణ దశలో పత్రికల ప్రాముఖ్యము అగణ్యమైనది.

మన జాతీయ జీవనంలోని వివిధ శాఖలలో పత్రికలు నిర్వర్తించిన ప్రముఖ పాత్రను అవగాహన చేసికొనుటకై ఈ కమిటీ ఒక మహాసభను మద్రాసులో డిశంబరు ౨౨, ౨౩ తేదీలలో జరుప నిశ్చయించుకొన్నది.

ఈ మహా సభతో పాటు ఒక ప్రదర్శనం కూడ ఏర్పరచ బడును. అందులో ప్రాచీన, అధునాతన పత్రికల ప్రతులు, ప్రాచీన గ్రంథాల మొదటి కూర్పు ముద్రిత ప్రతులు, "తెలుగు లిపి, ముద్రణ క్రమ వికాసము" ను వివరించే ఛార్టులు (Charts) మొదలగునవి ప్రదర్శింపబడును.

ఈ మహాసభను విజయవంతంగా జరుపుటలో ఆంధ్ర ప్రజలందరూ తోడ్పడగలరని విశ్వసిస్తున్నాము. ప్రదర్శనార్హములైన వానిని పంపి, సాయపడవలసినదని ప్రార్థిస్తున్నాము.

ఇట్లు,
పందిరి మల్లికార్జున రావు,
కార్యకర్త,
సంస్కృతి సమితి, తెలుగు భాషా సమితి.

మద్రాసు,
౧౦—౧౧—౧౯౫౧




## "ఆంధ్ర ప్రజ"

మాసపత్రిక, సంపాదకులు
శ్రీ కంభంపాటి సత్యనారాయణగారు;
పోడార్ ఛాంబర్స్, పార్శీ బజారు స్ట్రీటు,
బొంబాయి—1.

సాలు చందా: రు 4 లు; విడిప్రతి 0-6-0 అణాలు

ఆర్థిక పరిస్థుల ఒత్తిడిచే, తెలుగు వారెంతమందో పై రాష్ట్రాలకు వలసపోయారు. వారి సంస్కృతిలో అనేక మార్పులు కల్గుతున్నాయి. మన సంస్కృతికి వారు దూరమై పోతున్నారేమో కూడా! వారికి తగిన వైజ్ఞానిక సదుపాయాలు లేకపోవడమే దీనికి కారణం.

వారికొక ప్రత్యేక పత్రిక నిజంగా అవసరం. ఈ కొరతని తీర్చడానికి, రాష్ట్రేతరాంధ్రుల "సమస్య అన్నిటినీ పేర్కొని, వీరి ప్రజాజీవితాన్ని ప్రతిబింబించడానికి," "ఆంధ్రప్రజ" ను స్థాపించిన శ్రీ కంభంపాటి సత్యనారాయణ గారెంతయో అభివందనీయులు. మహిళా సమస్యలను పేర్కొని, వారి ప్రధాన కోర్కెలన్నిటిని బలపరుస్తుందని సంపాదకీయంలో వాగ్దానం చేశారు. వీరికి మా "ఆంధ్ర మహిళ" చేయూత నిస్తుంది.

"ఆంధ్రప్రజ" లో అంతర్జాతీయ రాజకీయాలపై వ్రాసిన "నేటి ప్రపంచం," "ఇరాన్ సమస్య" అనే వ్యాసం, అచ్చటి నిజపరిస్థితులని తెలియజేస్తాయి. ఇంకా, శ్రీ మామిడిపూడి వెంకట రంగయ్యగారు వ్రాసిన "ఎన్నికలు," శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్యగారి "శాసన సభలు," శ్రీ కొడవటిగంటి కుటుంబరావుగారి "తెలుగు కళలు" అను వ్యాసాలు చదువ తగ్గవి. వచ్చే సంచికనుండి, ఒక చిన్న కథ చేరిస్తే బాగుంటుంది,

"ఆంధ్రప్రజ"—సామాన్యంగా ఆంధ్రప్రజానీకానికి, ముఖ్యంగా రాష్ట్రేతరాంధ్రులకు ప్రధాన ధ్వనిగా ఎట్టి కష్టాలైన ఎదుర్కొని, వెలువడుతూంటుందని ఆశిస్తున్నాం.

* * *

## అల్లాద్దీన్—మాజిక్ లాంతర్
### బొమ్మల కథ:

కల్పన, రచన, నిర్వాహణ—బుజ్జాయి:
వెల 0-6-0 అణాలు.
వలయుచోటు—బుజ్జాయి పబ్లికేషన్స్,
33 హబిబుల్లా రోడ్, మదరాస్—17

అల్లాద్దీన్ అనే చీనాదేశపు కుఱ్ఱవానికి, ఐంద్ర జాలికు డొకడు ఎర జూపించి, తన స్వార్థంకోసం మోసం చేయ దలచి, చివరికేవిధంగా అంత మొందాడో ఈ చిన్ని పుస్తకం బొమ్మలద్వారా చెపుతుంది. ఇది చిన్నపిల్లలకు ఆకర్షవంతంగా ఉంటుంది. ఇటువంటి బొమ్మల కథలు పిల్లలకు చాలా అవుసరం.

* * *

అమెరికా జీవితములోని
## 'గృహము—కుటుంబము'

యునైటెడ్ స్టేట్సు ప్రచార శాఖవారిచే ప్రచురింపబడిన సచిత్ర సంచిక—అమెరికను కుటుంబ వ్యవస్థకు సంబంధించిన అనేక విషయములు, ఆహార విహారాదులు, కుటుంబ సంరక్షణ, పోషణ, ఇతర లాంఛనాలు, పద్ధతులు మున్నగు వానిని గూర్చి సవిస్తరముగా తెలిసికొనవచ్చు—ఆకర్షవంతమైన త్రివర్ణ చిత్రములు, ఛాయా చిత్రములతో కూడి, సంచిక అమెరికా జీవితమును గూర్చిన లోదృష్టిని కలిగించే టట్టుగా ఉంది. దీని వెల. రు. 0-8-0.

—గి. లక్ష్మీకాంతమ్మ

# గ్రంథ సమీక్ష

## స్వతంత్ర

1951 వార్షిక సంచిక:
ఎడిటర్ శ్రీ ఖాసా సుబ్బారావు,
రాయపేట, మద్రాస్-14
వెల. రు. 1-8-0

సుప్రసిద్ధ పత్రికా రచయిత శ్రీ ఖాసా సుబ్బారావుగారి సంపాదకత్వాన వెలువడుచున్న ఆంగ్ల వారపత్రిక "స్వతంత్ర"కి అయిదేండ్లు నిండాయి. ఈ 1951-వ సంవత్సర సంచిక 'ఆంధ్ర మహిళ' కార్యాలయం చేరింది.

ఈ సంచికలో, ఇండియా భవిష్యత్‌పై ఆండ్రూ రాత్ వ్రాసిన వ్యాసం, మహాత్మా గాంధీపై "నేషనల్ హెరాల్డ్" సంపాదకులు శ్రీ చలపతిరావుగారు వ్రాసిన వ్యాసం, శ్రీ కుందుర్తి ఈశ్వరదత్తుగారి "మెన్ అండ్ మేనర్స్" చదువుటకు పేర్కొనతగ్గవి. ప్రస్తుత హిందూ దేశ రాజకీయాలలో ఆచార్య కృపలానీ ఎట్టి స్థానం అలంకరించ గలడో ఒక ఆంగ్ల వనిత, వీరా బ్రిటన్, ఉద్దేశ్యాలను "ఎ బ్రిటిష్ ఇంప్రెషన్ ఆఫ్ ఆచార్య కృపలానీ" అనే వ్యాసంలో బాగుగా వ్రాయబడింది. శ్రీమతి జయా అప్పసామి వ్రాసిన "ఎమాంగ్ ది చైనీస్" వ్యాసంలో చీనా దేశస్థుల వేష భావాలు, ఆచార వ్యవహారాలు, సంస్కృతి విపులంగా తెలుపబడ్డాయి.

ఇంకను తదితర వ్యాసములు, చిన్న కథలు కలవు.

"హిందూ" పత్రికాధిపతి కె. శ్రీనివాసన్‌పై సైడ్ లైట్సు ఒప్పుగానున్ననూ, 'సాకా'గారు ఆయన్ని ఎక్కువగా పొగడినారేమో ననిపిస్తుంది.

"హిందూ" చాలా పరిశుద్ధమైన పత్రిక అనడంలో ఏమాత్రం సందేహంలేదు. అలా అని, తక్కిన పత్రికలను "రయటస్ ఇన్‌డల్‌జన్స్ ఇన్ ఎక్స్ట్రీమిసమ్" (Riotous indulgence in extremism) (అతి వాదంలో కలహ పూరిత వ్రాతలు) అనడం భావ్యం కాదు.

దేశంలో పత్రికల యందాసక్తి వృద్ధి పొందుతున్న కొలదీ, వేర్వేరు విధములుగా వార్తలను, విశేషాలను పాఠకుల నాకర్షించడానికి అనేక రకములుగా ప్రచురిస్తూ ఉంటారు. ఆ విధంగానే పత్రికలు దినదినాభివృద్ధి పొందుతాయి. అట్టి అభివృద్ధి ద్వారానే ప్రజలలో నున్న మానసిక నిస్తబ్దత నశిస్తుంది. సుప్రసిద్ధ పత్రికా సంపాదకులని పేరొందిన శ్రీ 'సాకా' గారికీ విషయం తెలిసికూడా "హిందూ" తప్ప తక్కిన పత్రికలపట్ల ఈర్ష్యా భావం సూచించడం తగునా?

హిందూ గొప్ప పత్రిక. హిందూ భవనం గొప్ప సుందర భవనం. దీనికి కారకులు శ్రీనివాసన్—దివ్య భవనం తాజ్ మహల్ కట్టిందెవరూ అంటే, వెంటనే షాజహాన్ అంటారు కాని, చెమటోర్చి, రెక్కలు విరుచుకొని, రాత్రింబవళ్లు పని చేసిన ఆ శిల్పులకు, తాపీ పనివారికి, చలువరాయిలు మోసిన పనివారికి ఆ పేరు ప్రఖ్యాతు లివ్వలేదు ఏ చరిత్ర పుస్తకంలో కూడా. అల్లాగే, "హిందూ" ఇంత గొప్ప స్థితికి వచ్చిందంటే శ్రీనివాసన్‌దే ఆ కృషి అని వారిపై రెండున్నర పేజీలు వ్రాశారు కాని, రాత్రింబవళ్లు క్రీడ్ కాపీలు ఎడిట్ చేసి, ముఫసిల్ వార్తలు సరిదిద్ది, తిరిగి వ్రాసి, ఓ. కె. ప్రూఫులు సరిచూసుకొని, పరిశుభ్రంగా ప్రొద్దుటయే టప్పటికి పత్రికను తీసుకొచ్చే ఉపసంపాదకులకుగాని, నగరమంతా చుట్టి వార్తలు సేకరించిన రిపోర్టరులకుగాని, లైనో ఆపరేటర్స్, ఇంపోజిటర్స్ మొదలగువారికి గాని, "సాకా" గారి సైడ్ లైట్సులో స్థానం లేకపోవడం శోచనీయం. వీరి మానసిక శారీరక తోడ్పాటు లేనిదే, ఒక్క శ్రీనివాసన్ ఆర్థిక బలమే "హిందూ"ని ఇంత గొప్ప పరిస్థితికి తీసుకు వచ్చేదా?

"స్వతంత్ర" వార్షిక సంచిక అట్టపై ప్రచురించిన దేవీప్రసాద్ రాయ్ చౌదరిగారు చిత్రించిన "పూర్ణకుంభం" అనే బొమ్మ చాలా వాస్తవికంగా ఉంది. గోఖలే "బ్రహ్మనాయుడు" చిత్రంకూడా పేర్కొన తగినది. ఇంకా తదితర బొమ్మలు, ఫోటోలుకూడా ఆర్టు పేపరుపై రమ్యంగా ఉన్నాయి.

—రామారావు

* * *

Edited and published by G. Durgabai, M.A., B.L., at the Andhra Mahila Sabha, Mylapore, Madras.
Printed by M. Satyanarayana at the H. Prachar Press, 12, Thanikachalam Chetty Road, T'Nagar, Madras.

# ఆంధ్ర మహిళాసభ నృత్యశాఖ

## పిల్లల నృత్యం

ఈ శాఖలో శాస్త్రయుక్తమైన తంజావూరు భరతనాట్యము నేర్పబడుచున్నది.

జూనియర్—సీనియర్ తరగతులలో 3 సంవత్సరముల పరిమితిలో

భరతనాట్యము సంపూర్ణముగా నేర్పబడును.

ప్రవేశ రుసుము—రూ. 2-0-0

సభ్యత్వ రుసుముతో కలిసి

జూనియర్ తరగతికి రూ. 6-0-0 సీనియర్ తరగతికి రూ. 8-0-0

నృత్యోపాధ్యాయిని
శ్రీమతి ఎస్. సామ్రాజ్యలక్ష్మిగారు.

---

# ఆంధ్ర మహిళాసభ

## సంగీతశాఖ

ఈ శాఖలో గాత్రము, వీణ వాయిద్యము నేర్పబడుచున్నది.

క్లాసులు సాయంకాలం 4 గం॥నుండి 7 గం॥వరకు

ప్రవేశ రుసుము—రూ. 2-0-0

సభ్యత్వ రుసుముతో కలిసి

వీణ జూనియర్ శాఖకి రూ. 8-0-0 వీణ సీనియర్ శాఖకి రూ. 13-0-0

గాత్రం జూనియర్ శాఖకి రూ. 7-0-0 గాత్రం సీనియర్ శాఖకి రూ. 11-0-0

సంగీతోపాధ్యాయిని
శ్రీమతి జె. సుబ్బలక్ష్మిగారు.

# ఆంధ్రమహిళ

స్త్రీల సచిత్ర మాస పత్రిక

(స్థాపితము : 1944)



ఘటికాలంకరణ

JANUARY 1952 ANDHRA MAHILA ANNAS 8

వస్తోంది!

ధనవంతుల విరగబాటులు
నిరుపేదల అగచాటులు
తొలగించి
సమాన హక్కును
నిరూపించు

వినోదా వారి
శాంతి

దర్శకత్వం
వేదాంతం రాఘవయ్య



MATA

పూర్ణా రిలీజ్

వినోదా పిక్చర్స్, మెడ్రాస్-17

# సంక్రాంతి కానుక



శోభనాచల వారి

# సాహసం

డైరెక్షన్... మిర్జాపురం రాజా వారు...





# మైసూరు పట్టు బట్టలు

## హెచ్చుకాలము మన్నిక కలవి

మునుపటికంటె ఇప్పుడు మైసూరు సిల్కు వస్త్రములే హెచ్చుగా స్త్రీలు ధరించుచున్నారు. మైసూరు సిల్కులో శ్రేష్ఠమైన చీరెలు, గౌనుగుడ్డలు, రవికె గుడ్డలు మొదలైనవి స్త్రీలకు, పురుషులకుకూడా అవసరమగు సర్వ విధములగు దుస్తులును అధికముగా వాడబడుచున్నవి.

★

మైసూరు సిల్కులు 100 కి నూరు వంతులు స్వచ్ఛమైనవి, కల్తీలేని పట్టువి.

★

## మైసూర్ సిల్క్స్

గవర్నమెంట్ సిల్క్ వీవింగు ఫ్యాక్టరీ, మైసూరు.

---



## అతని ఆనందానికై ఒక సీసాను అందుబాటుగా ఉంచండి!

కడుపులో బాధలేవీ లేనందువల్లనే బిడ్డ ఆనందిస్తున్నాడు. బిడ్డ ఆనందమే తల్లికికూడా ఆనందం.






# గ్రైప్ సిరప్

**ఉత్పత్తిదారులు:**

ది మైసూర్ ఇండస్ట్రియల్ & టెస్టింగ్ లాబరేటరీ లిమిటెడ్; మల్లేశ్వరం, బెంగుళూరు.

**సెల్లింగ్ ఏజెంట్లు:**

బెస్ట్ అండ్ కంపెనీ లిమిటెడ్; పోస్ట్ బాక్స్ నం. 63, మద్రాసు.

# ఆంధ్రమహిళ

సంపుటి 8 :: జనవరి '52 :: సంచిక 9

ముఖచిత్రము : ఘటికాలంకరణ

చిత్రకారుడు : శ్రీ ఎల్. ఎమ్. బాబూ



ఇంకా బాలానందం, పద్యాలూ, గద్యాలూ, సభలూ, సమావేశాలూ, చిత్రసమీక్ష, గ్రంథసమీక్ష.


సంపాదకురాలు : శ్రీమతి దుర్గాబాయి, యం. యే., బి. యల్.

సహసంపాదకురాలు : శ్రీమతి చన్నఘంటమ్మ, యం. యే., యల్. టి.

ఆంధ్రమహిళా సభ, మైలాపూర్

సంవత్సర చందా — ఆరు రూపాయలు



సంపుటి 8 జనవరి 1952 సంచిక 9

# ఎన్నికలు-స్త్రీల బాధ్యతలు

ప్రస్తుతము జరుగుచున్న ఎన్నికలలో స్త్రీలు ఎక్కువగా పోటీచేయకపోవడానికి కొన్ని కారణాలను డిసెంబరు 'ఆంధ్ర మహిళ' సంపాదకీయంలో సూచించాము. ఎన్నికలలో స్త్రీలకుగల ప్రత్యేక బాధ్యతను గూర్చి ఒకమారిప్పుడు హెచ్చరించటం మా ఉద్దేశం.

రాజ్యాంగరీత్యా మనకు పురుషులతో అన్నింటా సమాన హక్కులు లభ్యమయ్యాయి. ఈ హక్కులను అమలు జరుపుకోటానికి పాత శాసనాలను సవరించమని కూడా కోరుతున్నాము. అయితే ఈ హక్కులతోపాటు మనకు కలిగే బాధ్యతలను మనం విస్మరించరాదు.

ప్రస్తుతం మనం జ్ఞాపకముంచుకోవలసినది మనకు వచ్చిన ఓటింగు హక్కు. ఇంత వరకూ స్త్రీలలో ఏ మూలనో అక్షరాస్యులైనవారు, ప్రభుత్వానికి కొంత ఆదాయపు పన్ను కట్టేవారే, ఓటుకు అర్హులై యుండేవారు. ఇప్పుడట్లాగాక, వయోజన ఓటింగు కనుక, 17 కోట్ల భారతీయ ఓటర్లలో దగ్గర దగ్గరగా 9 కోట్ల మంది మనమే ఉన్నాము—జరిగే ఎన్నికలలో ఈ సంఖ్యను బట్టి మన బాధ్యత ఎంత పెద్దదో, ఎంత బలమైనది కాగలదో ఊహించుకొనవచ్చు.

మహాత్ముని ప్రసాదం మనకసలీ రాచకీయ చైతన్యం. అభ్యుదయగాములగు స్త్రీ పురుషుల ధీ, సేవా ఫలితాలు మనకు లభించిన హక్కులు. మనకు కలిగిన చైతన్యం క్షీణించ కుండా, మన హక్కులను విస్మరించకుండా, మన బాధ్యతను నిర్వహించవలసిన శుభ సమయం, ఒక రకంగా పరీక్షా సమయంకూడా ఇది.

స్త్రీ లెంతో ఉత్సాహంగా, ఒక్కొక్క చోట పురుషులకంటే ఎక్కువ సంఖ్యలలో పోలింగు స్థలాలకు వెళ్తున్నారని వార్తలద్వారా వినటం ఎంతో ఉత్సాహం జెందవలసిన విషయం—ఆంధ్ర దేశంలో ఎన్నికలు ప్రారంభమయ్యాయి. ఆంధ్ర నారీమణులు యితర ప్రాంతాలలోని తమ సోదరీమణులకు తీసిపోకుండా, తమ బాధ్యతను గుర్తుంచుకోవాలని ఒక మారు జ్ఞాపకం చేస్తున్నాం—మంత్రులుగా, శాసన కర్తలుగా, మన భవిష్యత్తును నిర్మించగల సామర్థ్యం, యోగ్యత గలవారికి తమ ఓటునిచ్చి ఎన్నుకున్నచో, తమకు లభించిన రాచకీయ హక్కు సార్థకం కాగలదని మరియొకమాటు హెచ్చరిస్తున్నాము.



ఇలాంటి హక్కులను మనం, మన పిల్లలు—అనుభవిస్తామో లేదో—దొరికిన యీ ఓటింగ్ హక్కైనా ఒకసారి వినియోగించుకుందాం అనే ఉబలాటం అందరికీ కలగటం సహజమే మరి. గ్రుడ్డి, గూని, వృద్ధు, కుంటి—ఒకరేమిటి అందరూ, సన్నాహ మౌతున్నారు, తమ ఓటును సద్వినియోగించాలని—గ్రుడ్డిగా కాకుండా!

అబలలు ఆదర్శం చూపెట్టున్నారు. వృద్ధ స్త్రీలు, గర్భిణి స్త్రీలు, విద్యావతులు, చదువురానివారు, పోలింగు స్టేషన్లకు వెళ్లి ఓటులు వేస్తున్నారు. మరి భారత మహిళా సంఘం అబలల తరపున ఒక ప్రణాళికను పెట్టి అమలు జరుపుతారో లేదో అని అభ్యర్థులను ఖండించి అడుగాలనుకుంది.

చెన్నపురివారు దారి తీశారు. ఇటీవల మీటింగు జరిపారు. అభ్యర్థులను వేదికలపై నిలబెట్టారు. మీరేమి చేస్తారో చెప్పమని అడిగారు. కేంద్ర ప్రభుత్వమే అన్నిటికీ కీలకమనుకున్నారు. పార్లమెంటు అభ్యర్థులకే ఆహ్వాన మంపారు. ముందు వెళ్లి ముచ్చటిస్తే తరువాత సముజాయిషీ యిచ్చుకోలేమనుకున్నారు కాబోలు—కొందరు సోదరులు, సమావేశానికి రాలేదు.

అత్యవసర కార్యక్రమమువే ఆహ్వానాన్ని అంగీకరించలేక పోయాననీ, అయితే తనూ, తన పక్షమూ ఎప్పుడూ మహిళతోటివారమేననీ, హిందూ కోడ్ వగైరాలన్నీ ఇక అవలీలగా సాధ్యపడగలవనీ, స్వయంగా వచ్చి మాట్లాడనందుకు మగువలంతా తనను మన్నించి ఓటు తనకే ఇయ్యాలనీ సోషలిష్టు అభ్యర్థిగారు సందేశం పంపించారు—అయితే వారు సాధించే ఘన కార్యాలు ఏవిధంగా చేస్తారో మాత్రం వివరించలేదు.

స్వతంత్ర అభ్యర్థి—వీరు సర్వతంత్ర స్వతంత్రులు లెండి—మళ్ళీ అదే ముక్క—మా అభిమానం అంతా మహిళలమీదే అని—పైగా కాంగ్రెసు గెలుపు సిసలని వారికి తెలుసట—అయితే కాంగ్రెసుతో ప్రతీ విషయంలో డీ అంటే డీ అని పార్టీకి ఏక ఛత్రాధిపత్యం వదలకుండా, బలమైన విరోధిగా ఉండటమే వారి ఉబలాటమట. కాంగ్రెసు తెచ్చిపెట్టింది కరువు, కాటకం, అనారోగ్యం అట—మద్య నిషేధం చట్టంగా ఉండకుండా ఉద్యోగ కావాలట—అయితే, వీరు సాధించే ఆశయాలు ఏ పద్ధతి మీదో మాత్రం ఎవరికీ తెలియదు—అసలు ఆయనకే తెలియదేమో!

ఇంక నిన్న మొన్నటి వరకూ కాంగ్రెసులో ఉండి, కాంగ్రెసుకు ఒక ఎక్స్ట్రా గ్రోత్‌లాగా యివతలకు ఊడి పడ్డ ప్రజాపార్టీవారు, కాంగ్రెసులో పెరిగిన అవినీతి, దుర్మార్గం, అన్నీ ఒకమారు పునరుచ్చారణచేసి, "మహిళల యందు నాకు గల అభిమానం, మహిళలకై నేను చేసిన సేవా యిక్కడ అందరికీ, ముఖ్యంగా, అధ్యక్షులకూ, కార్యదర్శినికీ తెలియదా?" అని తిరిగి ప్రశ్నించారు.

సరే కాంగ్రెసువారు—బహు జాగ్రత్తగా నెమ్మదిగా, కాంగ్రెసులో లోపాలున్న యన్నమాట చక్కగా ఒప్పుకుంటూ, అయితే యీనాలుగేళ్లు గడించుకున్న అనుభవంవల్ల కాంగ్రెస్సే పరిపాలించటానికి తగిఉన్న పార్టీ, హిందూ కోడ్ విషయంలో కాంగ్రెసు ఎప్పుడూ సుముఖంగా ఉన్నప్పటికీ, వారందరూ ఆలోచించేది, హిందూ కోడ్ కన్న స్త్రీలకు ఇంకా ఎక్కువ అభ్యుదయం తేగల సంస్కరణ అనీ (అదియేదో!) ఇంకా ఏవేవో ఇలాగే, పాము చావకుండా, బడితే విరగకుండా అన్నట్టు, చల్లచల్లగా, మెల్లిమెల్లిగా, చెప్పీ చెప్పకుండా, చివరకు ఆయన అభిప్రాయం ఇది అని తేల్చుకోటానికి వీలులేకుండా ప్రసంగించారు.

ఇంకా పైగా—ఈ సారి స్త్రీ లెక్కువగా పోటీ చేయక పోవటం శోచనీయమన్నారు—అది తమ పార్టీ లోపం కాదన్నారు. పరిస్థితులను బట్టి, స్త్రీలు కొంచం జంకారనీ, ముఖ్యంగా వయోజన ఓటింగ్‌వల్ల—వారు పరిచయం చేసుకోవలసిన జనాభా, తిరుగవలసిన వైశాల్యం—వెచ్చించవలసిన విత్తం—ఇవన్నీ వారికంత ప్రోత్సాహకరంగా లేకపోవుటవల్ల వారు వెనుకకుతీశారనీ, ఇంక భవిష్యత్తులో వారు ముందంజవేసే పరిస్థితులు కలుగవచ్చుననీ, చెప్తూ, వేదిక దిగారు—

[అన్నట్టు చెన్నపురి వాస్తవ్యురాలౌకామె, సంఘసేవలో పరిచితురాలు, భారత మహిళా సంఘంలో చిరకాలం సేవచేసింది—విద్యావతి. ఆమె అభ్యర్థిగా నిలువనెంచి, రూ. 50,000లకు మించని వ్యయమైతే

## ఆ షా మా షీ

భరిస్తానన్నారని, పార్టీవారూ హామీనీయక పోవటంతో విరమించు కున్నారనీ మహిళలు చెప్పగా విన్నమాట.]

ఇంక సమాజం వారు మీటింగ్పైతే పెట్టారు—వారి ప్రణాళికను అభ్యర్థుల కందించే ఆరాటమేగాని, చుట్టూ ఉన్న సభ్యులాంధ్రకు అది అందనేలేదు—ఇంతకూ వీరడిగిన దేదో, వారు చెప్పినదేదో తెలియకుండానే, సమావేశము పూర్తి అయింది.

ఇంక మహిళలు ఎవరికి తమ ఓటు నిస్తారో? గ్రుడ్డి వారిని ఉద్యోగులు చేయిపట్టి వేయించవచ్చునట—నడవలేని వృద్ధులు, గర్భిణీ స్త్రీలు ఇత్యాదులు వాహనంమీద వెళ్తారు—వాహనం ఖర్చువరు భరించేదీ చిదంబర రహస్యం అను కోండి—అయితే ఏ అభ్యర్థి ఏ విధంగా తను సూచించే ఆశయాలను అమలులోకి తెస్తాడు అనేది యింకా అయోమయం గానే ఉంది—ఓటర్ల మనస్సులోని యీ అయోమయం తొలగకపోతే—వారిది గ్రుడ్డి ఓటింగే ఔతుందేమో!



## జిల్లా వైద్యాధికారులుగా స్త్రీలు

మదరాసు రాష్ట్రంలో, నలుగురు స్త్రీలు, జిల్లా వైద్యాధికారులుగా నియమింపబడ్డారనుట చాలా సంతోషించదగ్గ విషయము. ఈ రాష్ట్రంలో ఇట్టి ఏర్పాటుస కిదియే విఘ్నేశ్వరపూజ.

రాజ్యాంగంలో, ఉద్యోగాల విషయంలో, స్త్రీలకు పురుషులతో ఎర్పరచిన సమానత్వమే దీనికాధారము.

మదరాసు కస్తూర్బా వైద్యశాలలో, ఫిజిషియన్‌గా ఉన్న శ్రీమతి చొక్కలింగం, అసిస్టెంటు సర్జన్లుగా ఉన్న శ్రీమతి సుబ్బలక్ష్మి, శ్రీమతి మధురనాయగమ్, కుమారి వర్గీస్‌లు, చిత్తూరు, రామనాద్, చంగల్పట్టు, విశాఖ జిల్లాలకు వరుసగా నియమింపబడ్డారు.

వీరు తమ కొత్త స్థానాల్లో, ప్రతిభతో వ్యవహరిస్తూ, స్త్రీ లోకానికి కీర్తి తేగలరని ఆశిస్తున్నాము. ఎక్కువ మంది తెలుగు యువతులు స్త్రీలకు కలిగిన యీ అవకాశాన్ని వినియోగించుకోటానికి కృషి చేయవలెనని హెచ్చరిస్తున్నాము.

—ఆంధ్ర మహిళ

## కీ. శే. శ్రీమతి భోగరాజు రాజేశ్వరమ్మగారు



కాంగ్రెస్ మాజీ అధ్యక్షులు శ్రీ భోగరాజు పట్టాభి సీతారామయ్యగారి ధర్మపత్ని, శ్రీమతి రాజేశ్వరమ్మగారు ది. 19-12-51న దివంగతులైరి. ఈమె కీ. శే. శ్రీ గంజాం వెంకటరత్నంగారి కుమార్తె. నాన్ కోఆపరేషన్ ఉద్యమంలో భర్తకు చేదోడుగా నిలచి, బిడ్డలను బడికి పంపుట కూడా మాన్పి, విదేశీ వస్త్రములను బహిష్కరించి, ఆ నాటినుండి యీ నాటివరకును ఖద్దరుతక్క వేరు వస్త్రములను తాకని పట్టుదలతో జీవించింది. ఆదర్శ గృహిణిగా, అనుకూల పత్నిగా, సంపూర్ణమై, ఆడంబరరహితమైన జీవితాన్ని, యదార్థ వాదం, వినయం, అతిథి సత్కారాది గుణసంపదలతో నిండుగా గడిపినారు.

అంతశ్శాఖా వివాహములను, స్త్రీ పునర్వివాహములను ఈమె ఆమోదించారు. హిందూ కోడ్ సవరణకు కొంతవరకు వీరు సుముఖులే.

సుమంగళిగా కాలధర్మము చేసిన వీరు అదృష్టవంతులనే భావించుచున్నాము. వృద్ధాప్యమున పత్నీ వియోగము సంభవించిన శ్రీ పట్టాభి సీతారామయ్యగారికి, వారి ఇద్దరు కుమారులకు, మనుమలకు, తదితర బంధుమిత్రులకు మా సంతాపమును దెలియజేయుచున్నాము.

—ఆంధ్ర మహిళ



# రాజకీయాలు

* శ్రీ గొల్లమూడి రామచంద్రరావు *

డిసెంబరు నెలలో రాజకీయ రంగంలో మనకు సంబంధించిన ముఖ్య సంఘటనలు ఇవి—కాశ్మీర్ మధ్యవర్తి గ్రాహం 6 వారాలపాటు ఇండియా పాకిస్థాన్‌లతో సంప్రదించి భద్రతా మండలికి కొత్త నివేదిక సమర్పించటం, లిబియాకు నామమాత్ర స్వాతంత్ర్యం రావటం, కొరియా యుద్ధ విరమణ సంప్రదింపుల గడువు ముగిసినా భగ్నం కాకపోవటం, ఈజిప్టు బ్రిటన్‌నుంచి రాయబారిని ఉపసంహరించటం, నైఋతి ఆఫ్రికా సమస్యపై హఠంచేసి దక్షిణాఫ్రికా తాత్కాలికంగా సమితినుంచి నిష్క్రమించటం, దేశంలో ఎన్నికలు ముమ్మరంగా జరగటం, ఆంధ్ర ప్రాంతంలో నెహ్రూ పర్యటన.

*　　*　　*

నాలుగు సం॥ల నుంచీ ఐక్యరాజ్య సమితి చేతుల్లో నలుగుతున్న కాశ్మీర్ సమస్యమీద మధ్యవర్తి గ్రాహం డిసెంబర్ 21వ తేదీన భద్రతా మండలికి ఒక కొత్త నివేదికను సమర్పించారు. జనవాక్య నిర్వహణకు అనుకూల పరిస్థితులను కలిగించే నిమిత్తం కాశ్మీర్‌లో ఉభయ ప్రాంతాలను సైనిక రహితంగా చేయటానికి ఆయన కొన్ని సూచనలు చేశారు. ఒప్పందంమీద సంతకాలు చేసిన 90 రోజుల్లో సైన్యాల్లో అధిక భాగాన్ని ఉపసంహరించటం, ఒప్పందం అమలు జరపటంలో చివరి రోజుకు ముందుగా, జనవాక్య నిర్వాహకుడిని ఇండియా ఏర్పాటుచేయటం, శాంతి భద్రతల రక్షణకూ, జనవాక్య నిర్వహణకూ అవసర మయితే విదేశీ సేనలను నిలపటం అనేవి ఆ సూచనల్లో కొన్ని. ఈ పథకం కింద అజాద్ కాశ్మీర్ సేనలను రద్దుచేయటం చాలావరకు అంగీకరింపబడినప్పటికీ, మిగిలిన అంశాలన్నీ ఇదివరకు ఇండియా తోసివేసినవే.

ఇండియా అధికారవర్గాలు పాకిస్థాన్‌తో సరాసరి సంప్రదింపులు జరపటం మంచిదనే అభిలాషను కనపరచినవి కాని, పాక్ ప్రధాని నజీముద్దీన్ 25వ తేదీన ఒక ప్రకటన చేస్తూ, ఇంక కాశ్మీర్ సమస్యను భద్రతా మండలే స్వయంగా పరిష్కరించివేయాలనీ, ఇండియా తన సేనలను కాశ్మీరు నుంచి తొలగించాలని మండలి ఉత్తరువు చేయాలనీ ఉద్ఘాటించారు. దీనితో పాకిస్థానుతో సంప్రదింపులు జరిపే ఆశలు వెనకపడినట్లే. పండిత నెహ్రూ 27న రాజమండ్రిలో మాట్లాడుతూ కాశ్మీర్ విషయమై ఇతరుల నిర్ణయం ఎప్పటికీ సాగదనీ, పాకిస్థాన్ ప్రధానీ, అతడిని మద్దతు చేస్తున్న ఇతర దేశాల ప్రధానులూ ఈ అంశాన్ని గమనించాలనీ హెచ్చరిక చేశారు.

కాశ్మీర్ రాజ్యాంగ పరిషత్ అధ్యక్షుడు సాదిక్ 23వ తేదీన కాశ్మీర్ వడ్రంగుల మహాసభలో మాట్లాడుతూ గ్రాహం సూచనలను కాశ్మీరీలు సహించరని స్పష్టం చేశారు. బ్రిటన్ అమెరికాలు, చైనా రష్యాలమీద దెబ్బ తీసే నిమిత్తం కాశ్మీర్‌ని స్థావరంగా ఉపయోగించుకోవాలని ప్రయత్నిస్తున్నవనీ, అందుకే పాకిస్థానుకు మద్దతు చేసినవనీ, అది లాభంలేకపోవటంవల్ల 'సమితి ఆధ్వర్యాన కాశ్మీరుకు స్వాతంత్ర్యం' అనే పేరు పెట్టి కాశ్మీరును చేతికిందికి తెచ్చుకోవాలని ప్రయత్నిస్తున్నవనీ ఆయన ఆరోపించారు. అసలు గ్రాహం ప్రయత్నాలన్నీ (గ్రాహం అమెరికా దేశస్థుడు) సంప్రదింపులలో పరిష్కారం కుదరదని చూపించే ఉద్దేశంలోనే జరపబడుతున్నవని ఆయన విమర్శించారు. ఈ అన్ని విషయాలనూ చూస్తే కాశ్మీర్ విభజన ప్రస్తుతం ఉన్నట్లుగా స్థిరపడిపోతుందేమో ననిపిస్తుంది. కీలక ప్రాంత మయిన గిల్గిట్ తమ స్నేహితులయిన పాకిస్థాన్ చేతిలో

నుంచి జారిపోవటానికి బ్రిటన్, అమెరికాలు అంగీకరించవు. ప్రత్యక్షంగా ఇండియామీదకు పాకిస్థాన్‌తో కలిసి దండెత్త టానికి అవి సాహసించలేవు.

* * *

ఇది ఇట్లా ఉండగా అక్కడ అజాద్ కాశ్మీర్‌లోనే అంతఃకలహాలు బయలుదేరినవి. మొదట ఆ 'ప్రభుత్వ' నాయకుడుగా ఉన్న సర్దార్ ఇబ్రహీం స్థానములో చౌదరీ అబ్బాస్ వచ్చాడు. ఇప్పుడు అతడు కూడ తొలగించబడి యూసుఫ్‌షా అనే వ్యక్తి వచ్చాడు. అజాద్ కాశ్మీర్ ప్రభుత్వం రాజీనామా పెట్టింది. పాక్ ప్రధాని స్వయంగా జోక్యం కలిగించుకుని ఈ మార్పులను జరిపించాడు. ఈ అంతఃకలహాలు ఎక్కువ కావటం, ప్రజలకు వారిమీద అసంతృప్తి పెరగటం, జరుగుతున్నదనీ, త్వరలో వారు ఎదురు తిరగ్గలరనీ షేక్ అబ్దుల్లా అన్నారు. స్వతంత్ర పఠానీస్థాన్ను కోరుతున్న పఠాన్ ప్రతినిధులు స్వతంత్ర పఠానీస్థాన్ ఏర్పడిన తక్షణం కాశ్మీర్ సమస్య పరిష్కారం అవుతుందని గ్రాహంకు తెలియజేశారు.

* * *

ఉత్తర ఆఫ్రికాలో ఇదివరకు ఇటలీ వలస రాజ్యంగా లిబియా ఇప్పుడు స్థానిక అమీర్ ఆధిపత్యంకింద 'స్వతంత్ర రాజ్యం' అయింది. 24న అధికారం అప్పగించినట్లు అక్కడ అధికారం నెరుపుతున్న బ్రిటిష్, ఫ్రెంచి ప్రతి నిధులు ప్రకటించారు. అయితే 'కొన్నాళ్ళ' వరకూ ఈ 'స్వతంత్ర' లిబియాలో బ్రిటిష్ సేనలు ఉండటానికే ఏర్పాటు జరిగింది. ఈ 'స్వతంత్ర' దేశానికి బ్రిటన్ ఆర్థిక సహాయాన్ని చేస్తూనే ఉంటుందట. అంటే ప్రస్తుతం ఈజిప్టు, పర్షియాలు ఎటువంటి షరతులను ప్రతిఘటిస్తున్నవో, అటువంటి షరతులతో బ్రిటన్ 'స్వతంత్ర లిబియా'తో కూడా ఒప్పందం చేసుకుని ఉంటుందన్నమాట.

లిబియా మోస్తరుగా, వలసరాజ్యంగా ఉన్న మొరాకో సమస్య అంతకంతకూ తీవ్రంగా పరిణమిస్తున్నది. అక్కడి ప్రజలు ఫ్రెంచి దాస్యం పోవాలని ఆందోళన చేస్తున్నారు. అరబ్ లీగ్ దేశాలన్నీ వారిని సమర్థిస్తున్నవి. అయితే పశ్చిమ రాజ్యాల చెప్పు చేతల్లో ఉన్న ఐక్యరాజ్య సమితి మొరాకో సమస్యను చర్చించాలనే అరబ్ తీర్మానాన్ని తోసివేసి, చర్చను వాయిదా వేసింది.

* * *

సమితి ధర్మ కర్తృత్వం కింద ఉండే ప్రాంతాల గతి ఎట్లా ఉంటుందో నైఋతి ఆఫ్రికా చరిత్ర వివరిస్తుంది. 1914 యుద్ధానికి ముందు జర్మన్ వలసగా ఉన్న ఆ ప్రాంతం ఆ యుద్ధమయిన తరవాత నానాజాతి సమితి ధర్మ కర్తృత్వం కిందకు వచ్చింది. దక్షిణాఫ్రికా ధర్మకర్తగా నియమించ బడ్డది. ఆ ధర్మకర్తగారు ఇప్పుడు ఆ ప్రాంతాన్ని పూర్తిగా దిగమింగి కూర్చున్నారు. ఆ ప్రాంత పరిపాలన వివరాలను తమకు తెలియజేయాలని సమితి కోరినప్పటికీ దక్షిణాఫ్రికా లక్ష్యపెట్టలేదు. ఆ ప్రాంతపు ఆదిమ వాసుల అభిప్రాయాన్ని వినాలనీ, వారి ప్రతినిధులను పంపాలనీ ధర్మకర్తృత్వ సంఘం కోరగా, సమితి సమావేశాలనే తాత్కాలికంగా బహిష్కరిస్తున్నామని 12వ తేదీన దక్షిణాఫ్రికా ప్రకటించింది. కోరియామీదికీ, చైనామీదికీ ఒంటికాలిమీద లేచిన సమితి దక్షిణాఫ్రికా చర్యకు గుడ్లు మిటకరించటం మినహా ఏమీ చేయటంలేదు.

* * *

బ్రిటన్‌నుంచి తమ రాయబారిని ఉపసంహరించటానికి 12వ తేదీన ఈజిప్టు నిశ్చయించుకున్నది. ప్రజలందరికీ ఆయుధాలను సప్లయి చేయటానికి కూడ ఈజిప్టు నిశ్చయించుకున్నది. కైరో యూనివర్సిటీ గెరిల్లాలకు శిక్షణ ఇస్తున్నది. ఈజిప్టు ప్రభుత్వం రష్యాతో ఏవో మంతనాలు జరుపుతున్నది. ఇట్లాగే పర్షియా కూడా తమ దేశంలో ఉన్న అమెరికన్ సైన్య సలహాసంఘానికి స్వస్తి చెప్పాలని ఆలోచిస్తున్నది. నూనె పరిశ్రమను నెమ్మది నెమ్మదిగా నడుపుకుని వస్తున్నది. రష్యాతో మంతనాలు జరుపుతున్నది.

ఈ దేశాల ప్రవర్తనవల్ల ఒకటి తేలుతున్నది. ఇవి ఏదో విధంగా పశ్చిమ రాజ్యాలను హడలగొట్టి తమకు కావలసిన కోరికలను సాధించటానికే ప్రయత్నిస్తున్నవి. అధికారంలో ఉన్న వర్గాలకు పశ్చిమ రాజ్యాల పీడ తొలగాలనే ఉన్నది. అందుకోసం రష్యా సహకారం

తీసికోవాలని ప్రయత్నిస్తున్నవి. అయితే ప్రజలకు అభ్యుదయ వాంఛలు కలక్కుండా ముస్లిం మతోన్మాదాన్ని వ్యాపింపజేయటానికి కృషి చేస్తున్నవి. టెహరాన్‌లో మొసాదిక్ అనుచరులు ఈ నెలలో వామపక్ష సంస్థలమీద భయంకర హింసాకాండ జరపటం దీనికి ఉదాహరణగా తీసుకోవచ్చు.

* * *

కిందటినెల 27న కొరియాలో యుద్ధం స్తంభించినదని చెప్పవచ్చును. ఈ నెల 27లోగా పూర్తి ఒప్పందం కుదిరే పక్షంలో ఆ యుద్ధరంగ రేఖ యుద్ధ విరమణ హద్దుగా ఉంటుంది. ఒప్పందం కుదరటానికి ముఖ్య ఆటంకం ఉత్తర కొరియా విమానాశ్రయాల పునర్నిర్మాణ సమస్యే అయినది. మిత్రరాజ్యాలు అంతకంతకూ పెరుగుతున్న కమ్యూనిస్టు విమాన బలానికి కొంతవరకూ ఆందోళన పడుతున్నారు. యుద్ధ విరమణ సమయంలో తాము సేనలను మార్చి సేనలను తెచ్చుకుంటూ ఉండవచ్చునట. కాని దెబ్బతిన్న విమానాశ్రయాలను కమ్యూనిస్టులు బాగుచేసుకోగూడదట.

కమ్యూనిస్టుల యుద్ధ విరమణ షరతుల అమలును తటస్థ రాజ్యాల ప్రతినిధులు తనిఖీ చేయటానికి అంగీకరించారు. మిత్రరాజ్యాలకు ఈ తనిఖీ చాలక, వైమానిక గస్తీకూడా ఉండాలని పట్టుపట్టారు. ఉత్తర కొరియా వ్యవహారాల్లో మిత్రరాజ్యాలు వేలుదూర్చకుండా ఉంటే ఒప్పందానికి కమ్యూనిస్టులు సంసిద్ధతను చూపిస్తున్నారు. సంప్రదింపులు సాగటానికి అవకాశం కనిపిస్తున్నది.

కొరియాలో మిత్రరాజ్యాల ఉద్దేశాలను సందేహించటానికి అనేక కారణాలు ఉన్నవి. (1) చైనాకు సమితిలో ప్రాతినిధ్యం ఇవ్వ నిరాకరించటం. (2) జపాన్ ఆయుధ ధారణ చేయక తప్పదని అమెరికా ప్రతినిధి డలెస్ 14వ తేదీన స్పష్ట పరచటం. (3) కొరియాలో యుద్ధ విరమణ ఉల్లంఘించబడితే, మంచూరియా మీదనే దెబ్బ తీస్తామని అమెరికా చైనాకు హెచ్చరికలు చేయటం. (4) 1952లో చైనామీద దండెత్తబోతున్నామని పార్మోజాలోని కొమింటాంగ్ గవర్నర్ 26న ప్రకటించటం.

బర్మా, - సయాం సరిహద్దుల్లో అమెరికన్ మద్దత్‌తో జేరిన కొమింటాంగ్ సేనలు ఇదివరకొకసారి చైనాపై దాడి చేసి, దెబ్బతిని పారిపోయి వచ్చినవి. ఇప్పుడు ఈ సేనలకు అదనపు సహాయాన్ని అమెరికన్ యుద్ధ నౌకలు చేయబోతున్నవనీ, దండయాత్రకు అమెరికన్—కొమింటాంగ్ పథకం తయారయిందనీ పెకింగ్ రేడియో ఆరోపించినది. ఒక కోస్తా ద్వీపంమీద కొమింటాంగ్ సేనలు 26న దాడి జరిపినది కూడా.

ఈ కారణాలవల్ల కొరియాలో పామూ చావకుండా, కర్ర విరక్కుండా, వ్యవహారం నడిపి, చైనాను అక్కడ నిలిపివేసి, ఇటుపక్కన చాంగ్‌కై షేకును ఉసికొల్పటమే అమెరికా లక్ష్యంగా కనిపిస్తున్నది.

* * *

దేశంలో ఎన్నికలు చకచక సాగిపోతున్నవి. వచ్చిన ఫలితాలను చూస్తే కాంగ్రెసుకు మొత్తంమీద గెలుపు నస్తుందేమోకాని, ప్రతికూలపక్షాల దెబ్బ తీవ్రంగా ఉండక తప్పదని చెప్పవలసి ఉంటుంది. కొన్ని రాష్ట్రాల్లో ఇతర పక్షాలతోడ్పాటు లేకపోతే కాంగ్రెసు ప్రభుత్వం నిర్వహించలేకపోవచ్చును. అప్పుడు కేంద్రానికి, రాష్ట్రాలకూ తీవ్రమయిన స్పర్థ ఏర్పడుతుంది. రాజ్యాంగంలో కేంద్ర, రాష్ట్ర సంబంధాలకు సంబంధించిన అంశాలను మార్పు చేయటానికికూడా ప్రయత్నాలు జరగవచ్చును. కేంద్రానికి ఇష్టమయిన ప్రభుత్వం రాష్ట్రంలో ఉంటే మైసూరును 319 సూత్రంనుంచి (10 సం॥ల వరకూ కేంద్ర ఆధ్వర్యం ఉండాలన్న నిబంధన) మినహాయించినట్లే, దాని ఇష్టం వచ్చినట్లు నడవనివ్వ వచ్చును. ఇష్టంకాని ప్రభుత్వం ఉంటే పంజాబులోవలె డా॥ గోపీచంద్ భార్గవా ప్రభుత్వాన్ని తొలగించి గవర్నర్ పాలనను ఏర్పాటుచేయవచ్చును.

పండిత నెహ్రూ 26, 27 లలో కాంగ్రెసు ప్రచారం చేస్తూ ఆంధ్ర దేశంలో సంచారం చేశారు. అయితే ఆంధ్ర రాష్ట్రం కావాలనే ప్రజలు శాంతియుతంగా నిరసన ప్రదర్శనలు జరపటానికికూడా అవకాశం లభించలేదు. ప్రత్యక్షంగా ప్రధాని కనిపించినప్పుడు, నిరసన ప్రదర్శనలకు అవకాశం లేనప్పుడు, ప్రజలు సభల్లోనయినా తమ అభిప్రాయాలను వెల్లడించ ప్రయత్నించటం సహజం., దానికి ఆయన చిరాకు పడటం న్యాయంకాదు. ఎన్నికల ప్రచారానికని పర్యటన చేస్తున్న పండిత నెహ్రూ ఆంధ్ర రాష్ట్రం విషయమై విస్పష్టంగా ప్రకటించకుండా, వెనకటి మాటలను వల్లించటం ఆంధ్రులకు ఆశాభంగం కలిగించింది.



# "తెలుగు పత్రికలు"

తెలుగు భాషా సమితి విజ్ఞాన సర్వస్వ ప్రచురణముతో పాటు, సాహిత్యానికి, కళలకు సంబంధించిన వివిధ రంగాలలో, నూతన జాగృతిని కలుగజేయుటకు తలపెట్టినది. దాని యాధ్వర్యమున "సంస్కృతీ సమితి" యేర్పాటైనది. ఈ సమితి పక్షాన యీ నెల 22, 23 తేదీలలో చెన్నపట్నమున శ్రీ రాజాజీ హాలులో పత్రికా ప్రదర్శనము, సభలు జరిగినాయి.

గౌ॥ శ్రీ ప్రత్తిపాటి సత్యనారాయణరావుగారు, శ్రీ నార్ల వేంకటేశ్వరరావుగారు, శ్రీ తాపీ ధర్మారావుగారు, గౌ॥ శ్రీ బచ్చు జగన్నాథదాసుగారు, యీ సమావేశాల కధ్యక్షత వహించారు. పలువురు ప్రసంగించారు.

## ప్రసంగములు

1. శ్రీ కాటూరి వేంకటేశ్వరరావు,
   "పత్రికలు—సంస్కృతి"
2. శ్రీమతి చన్నఘంటమ్మ,
   "స్త్రీల పత్రికలు"
3. శ్రీ విద్వాన్ విశ్వం,
   "పత్రికలు—సాహిత్య ప్రగతి"
4. శ్రీ మల్లంపల్లి సోమశేఖర శర్మ,
   "తెలుగు ముద్రణ—పుట్టు పూర్వోత్తరాలు"
5. శ్రీ నందిరాజు చలపతిరావు,
   "ప్రాచీన పత్రికలు"
6. శ్రీ సి. వి. హనుమంతరావు,
   "పత్రికలు—నేటి పరిస్థితులు"
7. శ్రీమతి న్యాయపతి కామేశ్వరమ్మ,
   "పిల్లల పత్రికలు"
8. శ్రీ గుమ్మలూరి సత్యనారాయణ,
   "శాస్త్ర విషయిక పత్రికలు"
   గూర్చి మాట్లాడారు.

ఈ నాడు పత్రికల బాధ్యత పెరిగింది. అవసరమయినప్పుడు ప్రభుత్వాన్ని విమర్శన చేయడానికి వెనుకాడరాదు. పత్రికలు పెరిగినా మన తెలుగు పత్రికలు భారత దేశములో మూడవ స్థానములోనే యున్నాయి. స్త్రీల కార్థికస్వాతంత్ర్యము లేకపోవుటవలన స్త్రీల పత్రికలు పొందతగిన ప్రోత్సాహము పొందలేక పోతున్నాయి. నేటి స్వాతంత్ర్యములో ఆశించిన వ్యక్తి స్వేచ్ఛా, ప్రకటన స్వేచ్ఛా లేకపోయింది. పత్రికా స్వాతంత్ర్యము నరికట్టే ప్రభుత్వ శాసనము ఎంత త్వరగా తొలిగితే అంత మంచిది. పిల్లల పత్రికలు నడపడానికి బాధ్యత ఎక్కువ కావాలి. వారి మనోవిజ్ఞానాన్ని ఎక్కువచేసే విధానము, పిల్లలకు నచ్చే శైలి కావాలి. శాస్త్ర విజ్ఞానముకూడ గేయాలలోనున్న బాలలు గ్రహించగలుగుతారు. పత్రికా రచయితలకు యీ నాటి పరిస్థితులు తొలగించడానికి ప్రభుత్వము కట్టుదిట్టం చేయాలి. లినోటైపు కనుకూలంగా తెలుగు లిపిని సంస్కరించాలి. వారి యుపన్యాసములలోని ముఖ్యాంశములు ఇవి. గౌ॥ శ్రీ బచ్చు జగన్నాథదాసుగారు, ఆంధ్ర రాష్ట్రము ఎంత త్వరలో నేర్పడి, సరిహద్దు నిర్ణయము ఎంత శీఘ్రముగా జరిగిన రాష్ట్రేతరాంధ్రులకుకూడ అంత మంచిదన్నారు.

## ప్రదర్శనము

ఇందు ప్రాచీన అర్వాచీన పత్రికలు, గ్రంథములు ప్రదర్శింపబడ్డవి. ఈ ప్రదర్శనమొక క్రమపద్ధతిలో నేర్పాటు చేయబడి విషయ గ్రహణాభిలాషుల కెంతో సాయపడుతూంది. లిపి పరిణామము, ఆంధ్రాక్షర వికాసము, లిపుల భేదము, తెలుగుభాషా పరిణామముల గూర్చి చక్కని వివరణ పట్టికల తయారుచేసి పెట్టారు. క్రీ. శ. 750 మొదలు విషయసేకరణ చేయబడ్డది. ఆంధ్ర వాఙ్మయ కర్తల, భాషాపోషకుల, భాషోద్ధారకుల, ఆంధ్ర వాఙ్మయ నవయుగ నిర్మాతల గూర్చి క్రమ వివరాలు కళ్లకు గట్టినట్లు పర్చారు. 1838, 1845, 1875 సం॥ ములలో అచ్చుపడ్డ పుస్తకముల నుంచారు. 1835 సం॥ లో వెలువడ్డ తెలుగు పత్రికా ప్రతి యుంది. రచయితలు, రచయిత్రులు, కవులు, కవయిత్రులు, గేయకారులు పూర్వకాలమునుండి నేటి

(తరువాయి 54 వ పేజీలో)



# పెండ్లి చూపులు

* * *

## నాటిక

* * *

* శ్రీమతి శకుంతల *

### పాత్రలు

నీరద — పెండ్లి కుమార్తె

శారద — పెండ్లి కూతురు చెల్లెలు

కామాక్షమ్మ — పెండ్లికూతురు తల్లి

మీనాక్షమ్మ — కాబోయే అత్తగారు

విశాలాక్షమ్మ — పెండ్లికొడుకు మేనత్త

మధుసూదన రావు — పెండ్లికూతురు తండ్రి

మధుసూదనరావు : తలుపు,....తలుపు ఏమే.....తలుపు తియ్యి.

కామాక్షమ్మ : (లోపలినుండి) వస్తున్నా. (తలుపు తీసిన తరువాత) ఏమిటి ఇంత హడావిడిగా వచ్చారేం ?

మ : ఏమీలేదు. పెండ్లివారు ఇవాళ అమ్మాయిని చూడటానికి వస్తారుట. బజారులో వాళ్ల గుమాస్తా కనబడి చెప్పాడు. ఏదో పనిమీద పిల్లవాడి తల్లి, మేనత్త వచ్చారుట అందుకని...

కా : నాకు తెలుసు. పనిలో పని పిల్లను చూదామని తల్లీ, మేనత్తా వస్తున్నారు. అంతేనా !

మ : అవునుగాని పిల్లల్నిద్దర్ని స్కూలునుంచి పిలిపించు. కాస్త వాళ్లకి ఏమేమి కావాలో చూడు. నేను బయటకు వెడతాను.

కా : రామీ !...రామీ. బడికి వెళ్లి అమ్మాయిల్ని పిలుచుకురా. అర్జంటుగా, ఏదో పని వున్నదని చెప్పు. (భర్తనుద్దేశించి) పెండ్లివారు బలే తెలివికలవారండీ. ఏదో పనిమీద వచ్చినట్లుగా వచ్చి పిల్లను చూస్తారుట.

మ : అసలు వాళ్ల అభిప్రాయం ఎట్లా వుంటుందో.

కా : ఏం. చాలా తృప్తిగానే వుంటుంది. మన పిల్లకేమండి. బంగారు బొమ్మ. నిజంగా దాన్ని రెండు కళ్లా చూస్తే !

మ : నీ పిల్ల నీకు బంగారు బొమ్మే. వాళ్లకు కావద్దూ. అయినా పిల్ల బంగార మెవరికి కావాలే. మామగారు పెద్ద ఉద్యోగస్థుడై వుండాలి. పిల్లకు పెద్ద చదువుండాలి. అన్నింటికంటె ముఖ్యం కట్నం విషయం.

కా : వాళ్లు కట్నం తీసుకోరుటగా. వాళ్లకు పిల్ల నచ్చితే చాలుట.

మ : అట్లాగే అంటారు. కట్నం ఇవ్వకుండా వాళ్ల ఇష్ట ప్రకారం పెండ్లి చేసినతరువాత మన అమ్మాయిని రోజూ "మీవాళ్లు దరిద్రులు. కట్నం ఇవ్వకుండా పెళ్లి చేసారు" అని అనరుటే. అయినా కట్నం తీసుకోకపోతే చాలా గొప్ప కదూ. అందుకని అట్లా అంటారు. రహస్యంగా, లోపాయకారిగా ఇస్తే తీసుకొని గప్ చిప్‌గా వూరుకొంటారు. డబ్బు అక్కర్లేని వాళ్లుంటారా. ఏది ఎట్లా వున్నా ఫలహారాలు, కాఫీలు అన్నీ సిద్ధం చేయించు. దాని అదృష్ట మెట్లావుంటే అట్లా అవుతుంది. తరువాత సంగతి చూద్దాం.

## 2

కా : (సావిట్లోనుండి) ఏమే శారదా ! చాపలు, తివాచీలు పరచి శుభ్రం చేసావుటే ? పెండ్లివారు సరిగ్గా నాలుగు గంటలకు వస్తామని కబురుచేసారు.

శా : అన్నీ చేశానమ్మా. ఇంకా గంట పైగా వుంది. ఎందుకమ్మా అంత తొందర.

కా : తొందర ఏమిటే. కావద్దూ. కాఫీ, ఫలహారం అన్నీ అత్తయ్యను చేయమన్నాను. అవన్నీ తయారయ్యాయో లేదో కాస్త చూడు.

శా : అన్నీ తయారవుతాయి. కాని వూరికే నన్నిట్లా తొందర పెట్టకు. పెండ్లివారికోసమని నన్నిట్లా చంపుకు తినేట్లున్నావే!

కా : అదికాదే. అన్నీ సిద్ధం పెట్టుకుని త్వరగా తల దువ్వుకొని మంచి బట్ట కట్టుకొని, అంతా శుభ్రంగా వుంటే బాగుంటుంది కాని యాబ్రాసులల్లే వుంటే ఏం బాగుంటుందే శారదా.

శా : పోనీ మనకేం. యాబ్రాసుల్ని చూచి పెండ్లివారు వెనక్కి వెడతారు. అంతేనా?

కా : బాగుందమ్మా వరస. చచ్చి చెడి వాళ్లని ఇక్కడికి రప్పించేటప్పటికి తాతలు దిగొచ్చేరు. నీకేం తెలుస్తుంది మా అవస్థ? అసలు పెత్తనమంతా పెండ్లికొడుకు మేనత్తదిట. ఆవిడ పిల్లను చూస్తేనేకాని వాళ్లు విను పించుకోరుట. ఆవిడ ఎక్కడకీ రాదుట. బ్రతిమాలి ఏవో మంచిమాటలు చెప్పి తీసుకొచ్చాం. నీరదను చూస్తే తరువాత సంగతి చూద్దాం.

శా : నీ పిచ్చికాని, నీరదకి పెండ్లి కాదనా నీ భయం? అసలు అటువంటి పిల్ల ఎక్కడ వున్నదా అని పెండ్లి కొడుకు రావాలికాని.

కా : ఓసీ పిచ్చిపిల్లా ఎప్పటిమాటే నీవు మాట్లాడేది. ఈ రోజుల్లో కాదే తల్లీ. ఎంత అవస్థ పడుతున్నామో నీకేం తెలుసు?

శా : అంత అవస్థపడి ఎందుకమ్మా పెళ్లి చెయ్యడం?

కా : ఎందుకేమిటి నీ మొఖం. అయితే పెండ్లి చేసుకోరా ఏమిటి.

శా : అదికాదమ్మా. పెండ్లి చేసుకొనే దెవరమ్మా—పెండ్లి కొడుకు కదా. అట్లాంటప్పుడు పెండ్లి కూతుర్ని పెండ్లి కొడుకు చూచుకోవడం బాగుంటుంది కాని, మధ్య మేనత్త ఏమిటే. నాకు నవ్వొస్తోంది. (నవ్వును)

కా : ఎందుకే అలా నవ్వుతావు? మేనత్త మాత్రం పరాయిదా.

శా : అయ్యో ఎందుకు పరాయిది. పెండ్లి కొడుకు తండ్రి తమ్ముడి మరదలి ఆడబిడ్డ......

కా : ఏమిటే ఆ వరసలు? చప్పున పని కానీయండే తల్లీ.

శా : అదికాదే ఆవిడ మాత్రం చూడక్కర్లేదా?

కా : ఏమోనమ్మా. నీ మాటలకు సమాధానం చెప్పలేను తల్లీ. ఈ కాస్సేపూ నువ్వు నోరు మూసుకుంటే మా పని నెరవేరుతుంది. ఒరే రామం, వాకిట్లో చూడు నాయనా కారు వస్తోందేమో. ఈ మాటలూ, ఈ ధోరణి వింటే వెనక్కు పోతారు.

శా : ఎందుకే వెనక్కి పోవటం. ఏం తప్పుమాటలన్నా రమ్మా? పోనీ ఎవరినన్నా అడుగుదామా.

కా : అదొక్కటే తక్కువ. చాలు చాలు. అక్కయ్య చూడు ఏమన్నా మాట్లాడుతోందేమో.

శా : ఎందుకూ మాట్లాడడం. నన్నన్నట్లే దాన్ని అంటావు. ఏమంటుంది పాపం. ఏమన్నా అన్నా నువ్వు సాగనిస్తావా. అది మొగుణ్ణి చేసుకోవడం దగ్గర్నుంచీ నీ యిష్టమేనయ్యె. ఏమన్నా చెపుదామన్నా మాట్లాడ వద్దంటావు, బెల్లంకొట్టిన రాయిలాగ. నేనైతేనా వాళ్లతో ముఖాముఖీని తేల్చుకొనేదాన్ని.

కా : నువ్వు నోరుమూసుకోవే తల్లీ. చదువులు నా ప్రాణం తీస్తున్నాయి. ప్రతీదానికీ కారణాలు, కథలు, సందేహాలు, ఇష్టాలు. ఎట్లాగయినా నీరద బుద్ధి నీకు రాదు. అయినా నిన్నెవడు చేసుకొంటాడోకాని నీతో వేగలేక, నీకు సమాధానాలు చెప్పలేక చస్తాడు...కారు చప్పుడల్లే వుంది. నోరు కట్టిపెట్టి అవతలికి నడు.

3

కా : రండి వదినగారు. పిన్నిగారు రండి. శారదా, కాళ్లు కడుక్కోడానికి నీళ్లు ఇవ్వమ్మా. (తరువాత) రండి తివాచీమీద కూర్చోండి. వదినగారు రావడం మహా సంతోషం. మీ ఒంట్లో కులాసాగా వుంటోందా.

విశాలక్షమ్మ : ఏదో కొంచెం ఆరోగ్యంగానే వున్నది. కాని ఒంటరిగ రాలేక మా వదినెనుకూడ తీసుకొని మే మిద్దరం వచ్చాం.

# పెండ్లి చూపులు

మీనాక్షమ్మ : పిల్లలంతా ఏరండి వదినగారూ ?

శా : శారద ఇక్కడే వుందికదా. ఇహ కనబడనిది పెండ్లి కూతురేగా. కాస్త విశ్రాంతిగా మీరు ఫలహారం అవీ తీసుకొన్న తరువాత వస్తుంది. అమ్మాయి శారదా కాఫీ ఫలహారం తీసుకొనిరామ్మా. ఫలహారం తీసుకోండి వదిన గారు. (ఫలహారాలు, కాఫీలు అన్నీ జరిగిన తరువాత) శారదా మీ అక్కయ్యను పిలుచుకురా.

(శారద తన అక్క నీరదను చేయిపట్టుకొని తీసుకొని వచ్చును)

శా : రా నీరదా ఇట్లా ఇక్కడ కూర్చో.

మీ : అమ్మాయి స్కూల్లోనే చదువుతోందా.

శా : స్కూల్లోనే స్కూల్ ఫైనల్ చదువుతోంది. తరువాత ఇంటరు మద్రాసులో చదువుతానంటోంది. ఏమౌతుందో మరి చెప్పలేము.

వి : పిల్లలు పరాయి ఊళ్లలో చదువులు కష్టపడి చదవడమే కాని దానివల్ల ప్రయోజనమేమీ లేదండి. అయినా ఆడవాళ్లకు అంత పెద్ద చదువులు దేనికండి? ఏదమ్మా నీరదా ఈ ఇంగ్లీషు పుస్తకం చదువు.

శా : మా అక్కయ్యకు పరీక్షలైపోయా యనుకొన్నాను బాబోయ్. ఇక్కడొక ఇంగ్లీషు పరీక్ష జరుగుతుం దన్నమాట. ఏమేవ్ అక్కయ్యా భయపడక బాగా చదవ్వే.

మీ : మరదలు పిల్ల మహా చెడ్డది. నీకూ జరుగుతుందిలే పరీక్ష. తొందరపడకు.

(నీరద ఇంగ్లీషు పుస్తకములోని 5 లేక 6 వాక్యములు చదివిన తరువాత)

మీ : వీణ వాయిస్తున్నావా.

(అవునని నీరద తల వూపును)

మీ : ఏదీ ఒక్క పాట పాడమ్మా.

నీ : (వీణమీద ఒక పాట పాడును)

వి : (వీపు, జడ సవరిస్తూ). చాలా పెద్ద జడే. సవరం లేదు కదా. అంటే ఈ రోజుల్లో అంతా సవరాలు పెడుతున్నారు లెండి.

శా : లేదండి. మా నీరదకి సవరం అంటె తలనొప్పి. ఇంకా అప్పుడప్పుడు శారద పెట్టుకుంటుంది. ఇది అసలు పెట్టుకోదు. దాని జడ తీరే అంత.

మీ : మా అబ్బాయికి హిందీ పాటలంటే మహా యిష్టం. ఏదన్నా పాట వచ్చునా ?

నీ : నాకేమీ రావండి.

శా : నీకు వచ్చుకదే అదేదో పాట పాడు.

వి : అదేమిటమ్మా. ఈ రోజుల్లో అంతా హిందీ పాటలు, లేకపోతే అదే వరసమీద రాసిన తెలుగుపాటలు. ఇవేకా పాడేది ?

నీ : నాకు రావమ్మా.

శా : వచ్చినంత వరకు పాడు పరవాలేదు.

నీ : నాకు రావంటూవుంటే నువ్వేమిటమ్మా. వస్తే పాడనూ ?

మీ : ఏదో చిన్నది పాడు. మా వాడికి హిందీ పాటలు, భావ గీతాలు అంటే మహా యిష్టం.

నీ : (ఏమీ మాట్లాడదు)

మీ : ఇక వెళ్లొస్తా మండీ.

శా : దయుంచండి. ఏ సంగతీ...

మీ : ఆ. ఏ సంగతీ రెండు మూడు రోజుల్లో వ్రాస్తాను. ఇంకా అబ్బాయి, తండ్రిగారు చూడాలికదా. వారు వచ్చి చూచిన తరువాత మిగత విషయాలు మాట్లాడుకో వచ్చు. అల్లుడ్ని మీరుకూడ చూద్దురుగాని.

వి : వెళ్లొస్తామమ్మా. నీరదా మాతో అందాక రా (నీరద లేచును) పిల్లకూడ అబ్బాయికి తగ్గ పొడవున్నది. గుమ్మందాక రామ్మా.

శా : వెళ్లవే అక్కయ్యా. నీకు నడవడం చేతనవునో కాదో చూడొద్దూ. కుంటో, గుడ్డో తెలియొద్దూ. అందాక వెళ్లి వాళ్ల అనుమానాలు తీర్చు.
అత్తగారూ నమస్కారం! బావగార్ని కూడ పంపండి పరీక్షకి.

మీ : (నవ్వుతూ) అట్లాగేనమ్మా. తప్పకుండా పంపుతాను. నేను కూడా వస్తా. ఏం అల్లరిపిల్ల !

విశా :
మీనా : } వెడతాము వదినగారు. వుంటానమ్మా నీరదా.



# ఆరోహణ

*** శ్రీ ప్రతాపరావు ***

గ్రాండ్ ట్రంకుఎక్స్‌ప్రెస్ పొన్నేరి స్టేషను దాటింది. ఇంకో గంటలో మద్రాసు చేరుతుంది. మద్రాసు దగ్గర కొస్తున్నదనగానే తారకు భయమేస్తున్నది. కంపార్టుమెంటులో అందరూ 'అమ్మయ్య, ఇంకో గంట ఓపిక పట్టాలి' అని అనుకుంటున్నారు. కొత్తగా మద్రాసు వెడుతున్నవాళ్లు మైలాపూరు వెళ్లాలంటే ఎలా వెళ్లాలని తెలిసినవాళ్లను అడుగుతున్నారు. మా బంధువులు స్టేషను కొస్తారని యింకొకరు సంతోషపడుచున్నారు. కొందరు సామాను సర్దుకొని తలుపు దగ్గర పెట్టుకుంటున్నారు, రైలు ఆగగానే దిగి పోదామని. పట్టణం వస్తుందనగానే అందరికీ సంతోషంగానే ఉంది.

తారకు గుండెదడ ఎక్కువైనది. తన దగ్గర నాలుగు రూపాయల చిల్లర మాత్రమే ఉంది. అంత పెద్ద పట్టణంలో అంత కొద్ది డబ్బుతో ఎలా ఉండాలో, ఎక్కడ కెళ్లాలో, ఏం జేయాలో అర్థం కావడం లేదు. అసలు తను ఈ రైలెందు కెక్కినట్లు? పట్టణంలో ఎక్కడకి వెళ్లేట్టు? ఇంత త్వరగా మద్రాసు రాకపోయినా బాగుండును. ఈ రైలు ఇలా ఎల్ల కాలం నడుస్తూంటే ఎంత హాయిగా ఉండును! అని ఆలోచిస్తూ కూర్చుంది. మద్రాసంతా మోసం అంటారు. తనెంత బాధ పడాల్సొస్తుందో అని మనస్సులో ఆ దృశ్యాల్ని చిత్రించుకొనేటప్పటికి వళ్లు గగుర్పొడిచింది తారకు.

వెంటనే తారకు తన గత చరిత్ర గుర్తు కొచ్చింది. క్రిందటి అయిదేళ్లలో తనేం సుఖపడింది?

పదహారో యేట నాటకాలలో వేషాలు వెయ్యడం మొదలు పెట్టింది. తనను పోషించేవాళ్లు లేక, పడుపు వృత్తికి దిగడం యిష్టం లేక హార్మోనిస్టు రామస్వామిని బట్టుకొని, నాటకరంగంలో అవకాశం ఏర్పరచుకొంది. ప్రతీ నాటకంలోనూ తన పాత్రను దిగ్విజయంగా పోషించుకొంది. నాటకం బాగుండక పోయినా తనను మాత్రం "సెబాష్" అన్నారు ప్రేక్షకులు. దానితో తనకు ఏమైనా సరే నటిగా జీవించాలనే కాంక్ష పాతుకు పోయింది. ఆ ఆశతో తెలుగు నాటకరంగానికి అయిదు సంవత్సరాలు తన జీవితాన్ని అర్పించింది. కాని ఎదుగు బొదుగు లేదు. నెలకొక నాటక మయినా పడుతుందనే అవకాశం కనుపించ లేదు. భుక్తి గడవడమే కష్టమయింది రాను రాను. తన తోటి నటి మద్రాసు వెళ్లి సినిమాలో చిన్న చిన్న వేషాలు వేయడం తను ఎరుగును. కనీసం తిండి కయినా లోటుండదు పట్నం వెడితేనని బయలుదేరింది.

అవస్థ ఎక్కడయినా పడాల్సొచ్చే టప్పుడు ఏ వూర యితే నేం! తన వూళ్లో ఉన్నా, ఈ నాలుగు రూపాయి లయిపోయిం తరువాత ఏం చేయాలి? ఆ చేసేది మద్రాసు లోనే చేయవచ్చు. అని గుండె దిటవు చేసుకుని సెంట్రల్ స్టేషను రాకకోసం తనుకూడా ఎదురు చూడడం మొదలు పెట్టింది......

సెంట్రల్ స్టేషనులోకి ఎక్స్‌ప్రెస్ జేరింది. అందరూ దిగిపోయారు. తార కూడా తన సంచి చేత బుచ్చుకుని బండి దిగింది.

ప్లాట్ ఫారమ్ మీద ఎదురుగా ఒక యువకుడు, తెల్లటి షర్టు, పేంటు, తెల్ల ఒక స్కిన్ జోడు, కళ్లకి జోడు తో కనిపించాడు. ఆకారం చూస్తే నిస్సందేహంగా ధనవంతుడనే చెప్పాలి. అతను ఎవరి కోసమో వచ్చి వెతుకు తున్నాడు. వాళ్లెంత అదృష్టవంతులో అనిపించింది తారకు! నిజంగా ఆ యువకుడే తన కోసం ఎదురు రావడానికి తానెంత భాగ్యశాలై యుండాలి! ఒక్కసారి పరికించి చూచి బయలుదేరింది.

బయటి గేటువైపుకు నడుస్తోంది. ఇంకో ఇరవై గజాలలో గేటుంది. ఇంతలో వెనక నుంచి "మహాలక్ష్మమ్మా! మహాలక్ష్మమ్మా!" అని ఎవరో కేక వేస్తున్నట్టు వినిపించింది. తనను ఎవరు పిలుస్తారని ముందుకు సాగి పోతోంది. మళ్లీ కేక వినిపించింది. ఈసారి ఆగి వెనక్కి చూసింది.

ఇందాక తను చూసిన యువకుడే పిలుస్తున్నాడు. పెద్ద పెద్ద అంగవేసుకుంటూ తన దగ్గర కొచ్చాడు.

"నేను మోహన్‌రావుని. మహాలక్ష్మమ్మగారు మీరేనా?" అన్నాడు.

తార కాశ్చర్య మేసింది. సందిగ్ధంలో పడింది. ఏం సమాధానం చెబుదామా అనుకునే లోగానే ఆ యువకుడు తన చేతిలో సంచి అంది పుచ్చుకున్నాడు.

"మా నాన్నగారు వ్రాసిన దాన్ని బట్టి మీరే అనుకున్నాను. ముఖాన మచ్చ, పొడుగు, ఆ పోలికలు చూస్తే మీరే తప్పక అవుతారని అనుకున్నాను.'' అన్నాడు మోహన్‌రావు.

తను మహాలక్ష్మమ్మ కాదని చెబుదామని తార అనుకున్నది, గాని నోట్లో మాట రాలేదు. ఈ యువకుడు తన కోసమే వస్తే అని ఊహించాను గదా, ఈ అవకాశాన్నెందుకు వినియోగించుకో కూడదూ అని, తను బయట పడే దాకా మహాలక్ష్మమ్మ అవుదామని నిశ్చయించుకుంది. కనీసం ఈ రాత్రి ఎక్కడ కెళ్ళాలనే సమస్య తప్పి పోతుంది గదా అని సంతోషించింది. మోహన్ వెంట నడిచింది.

స్టేషను బయటికి రాగానే కాడిల్లాక్ కారొకటి వచ్చి వీళ్ల ముందు ఆగింది. డ్రైవరు దిగి సామాను అంది పుచ్చుకున్నాడు. మోహన్‌రావు వెనుక సీటు తలుపు తెరిచి తారను కూర్చోమని తను కూర్చున్నాడు. కారు బయలుదేరింది. తార సీటు కుషన్లకు చేరగిలబడి, కారు సిమెంటు రోడ్ల మీద అలా శరవేగంగా దొర్లి పోతుంటే, ఆనంద పరవశమై పోయింది.

కారులో మోహనరావు తనవంక చూసినప్పుడల్లా ఒక చిరునవ్వు నవ్వేది.

"స్టేషనులో మీ ప్రవర్తన చూస్తే నన్ను చూడగానే మీరు భయపడ్డారనుకున్నాను. కాని యిప్పుడా అనుమానం తీరిపోయింది,'' అన్నాడు మోహన్‌రావు.

"అదేమీ కాదు. ప్రొద్దుట ఎనిమిది గంటల కెక్కాను రైలు. పగలు ప్రయాణం కావడం వల్ల ఎండదెబ్బ తగిలింది. మధ్యాహ్నం భోజనం లేదు. అలిసిపోయి ఉన్నాను. అంతకంటే ఏమీ లేదు'' అని సమాధాన పరిచింది తార.

"ఇంటికెళ్లి స్నానంజేసి తృప్తిగా భోంచేద్దురు గాని... ఇల్లు కూడా ఎంతో దూరంలేదు. వచ్చేశాము."

ఇంతలో కారు ఒక బంగళాలోకి వెళ్లింది. ఇల్లు పెద్దది గాకపోయినా చక్కగా ఉంది. ముందు వరండాలో సోఫాలు అమర్చి ఉన్నాయి. కారు ఆగగానే యింట్లో నౌకరు వచ్చి తలుపు తీశాడు.

కారు దిగి యిద్దరూ యింట్లోకి వెళ్లారు. "మా యింట్లో ఆడదిక్కు లేదు. ఇదంతా బ్రహ్మచారి కూటమి. అయినా మీకేలోపం రాకుండా చూస్తాను."

"ఏయ్ రామన్నా, అమ్మగారిని మేడమీదికి తీసికెళ్లు. బాత్‌రూమ్‌లో నీళ్లున్నాయో లేవో చూడు. స్నానమవగానే ఆమెకు వడ్డన చెయ్యి" అని నౌకరుతో చెప్పి పంపించాడు.

తన కిచ్చిన గదిలో ఒక స్ప్రింగ్ బెడ్, సోఫాలూ, డ్రెస్సింగ్ టేబిల్, టేబిల్ ఫాన్ అన్నీ ఉన్నాయి.

తార స్నానంజేసి వచ్చింది. తన దగ్గర కట్టుకోడానికి మంచి చీరలుకూడా లేవు. విశ్వామిత్ర నాటకంలో తను మేనక వేషం వేయడానికి కొనుక్కున్న చీర తప్ప, తన దగ్గిర ఖరీదుగల చీరలే లేవు. ఆ చీర కట్టుకుని చక్కగా అలంకరించుకొని క్రిందికి దిగి వచ్చింది.

"నాకు పని ఉంది. మళ్లీ ఒక గంటలో తిరిగి వస్తాను. అప్పుడు అన్ని విషయాలూ మాట్లాడుకుందాం" మని చెప్పి మోహన్ వెళ్లిపోయాడు.

కమ్మని భోజనంచేసి, మేడమీదికి తన గదిలోకి వెళ్లింది. 'ఈ మహాలక్ష్మమ్మ ఎవరు? ఆవిడ వివరాలు తెలియవు. మోహన్‌తో అంత కలివిడిగా మాట్లాడడం ఎలా? సంభాషణలో తను బయటపడిపోతే తనను వెంటనే తరిమేస్తాడు. తన గతేం కావాలి' అని పడుకుని ఆలోచిస్తోంది తార.

కారు హారన్ మ్రోగింది. మోహన్ సరాసరి పైకి వచ్చాడు, ఒక్క చిరునవ్వు నవ్వి.

"ఇందాక రైలు దిగగానే ముప్పై ఏళ్లదానిలాగ కనిపించారు. ఇప్పుడు ఫరవాలా."

"మీరు నన్ను యికనుంచి 'మీరు' అనకూడదు."

"అలాగే. కాని మీరు కూడా నన్ను అన్నయ్యా, అని పిలవాలి. సరేనా?"

తార తలూపింది. నవ్వుకున్నారు.

"నీకు ఎన్నాళ్లనుంచి ఉందా కోరిక సినిమాల్లో చేరాలని?"

తారకేం చెప్పాలో తెలియలా. మహాలక్ష్మమ్మకు కూడా సినిమాలో చేరాలనుందని మాత్రం దాని వల్ల తెలిసింది.

"చాలా కాలం నుంచి." అని సమాధానం చెప్పింది తార.

"నేను మీ నాన్నకు వ్రాసిన ఉత్తరంలో అన్నీ వివరాలు వ్రాశాను. నక్షత్ర ప్రొడక్షన్సులో నాకు పెద్ద వాటా ఉన్న మాట నిజమే. కాని సినిమా నిర్మాణంలో నేనేమీ జోక్యం కలుగజేసుకోను. డైరెక్టరు అర్భక్ కే అన్ని విషయాలు వదిలేస్తాను. నేను చెబితే నీకు వేషం యిస్తాడు. కాని అది నిలబెట్టుకోవడం, పైకి రావడం అన్నీ నీ చేతిలో ఉన్నయి. ఆ సంగతి నీకు ముందుగా తెలియజేద్దామని చెబుతున్నాను."

"ఆ విషయంలో మీరు నిర్భయంగా ఉండవచ్చు. నేను పనికిరాకపోతే మీరేం జేయగలరు."

"మీ నాన్న మా నాన్న ముఖ్య స్నేహితు లవడం మూలంగా నేను ఈ ప్రయత్నం చేస్తున్నాను. మామూలుగా యిలాంటి విషయాలలో నేనేమీ జోక్యం కలుగచేసుకోను. మా నాన్నగారు నాకు మీ విషయంలో ఉత్తరం వ్రాశారు.

కాని ఒక్క సంగతి. డైరెక్టరు అర్భక్—స్క్రీన్ టెస్టు తీసిం తరువాత నువ్వు సినిమాకు పనికిరావంటే తిన్నగా యింటికి వెళ్లి పోతానని హామీ యిస్తేనే నేను ప్రయత్నం జేస్తాను."

"మీరు ఆ విషయంలో నిశ్చింతగా ఉండండి."

"అయితే రేపు ప్రొద్దుట 9 గంటలకు స్టూడియోకు వెళదాము. నేను యిప్పుడు వెళ్లి, అర్భక్‌ని కలుసుకుని విషయమంతా మాట్లాడి వస్తాను."

"అలాగే."

"భోజనం అయిందా?"

"ఆ."

"సరే, విశ్రాంతి తీసుకో. సినిమా స్టార్లకు 'బ్యూటీ స్లీప్' అవసరం. హాయిగా పడుకో. నేను వస్తాను." అని మోహన్ వెళ్లిపోయాడు.

తను మహాలక్ష్మమ్మ కాదని తెలిస్తే, మోసం జేసాననే సాకుమీద పోలీసుల కప్పగిస్తాడేమో. అసలు మహాలక్ష్మమ్మ మరునాడొస్తే విషయం బయటకు బడిపోతుందనే ఆలోచనలతో బాధపడసాగింది తార.

క్రింద టెలిఫోను మ్రోగుతోంది. రెండు నిమిషా లయింది. ఎవరూ తీసుకోలేదు. నౌకరింట్లో లేడేమోనని క్రిందకు దిగి టెలిఫో నందుకుంది.

'ఇది టెలిగ్రాఫ్ ఆఫీసు. మోహనరావుగారికి టెలిగ్రా మొచ్చింది. తీసుకోండి,' అన్న దొక ఆడగొంతుక టెలిఫోనులో. కాగితం తీసి వ్రాసుకుంది తార. తిరిగి మళ్లీ చదువుకుంది టెలిగ్రాముని.

"మహాలక్ష్మమ్మ రావడంలేదు. ఎప్పుడొచ్చేది తెలియజేస్తాను.

—వెంకట్రావు."

వెంటనే ఒక నిట్టూర్పు విడిచింది, ప్రస్తుతానికపాయం తప్పింది గదా అని.

ఒక నెల అయినా కనీసం పడుతుంది మహాలక్ష్మమ్మ వచ్చే టప్పటికి. అంతలో తన సంగతి తేలిపోతుంది. తరువాత మోహన్‌ని క్షమాపణ వేడుకోవచ్చు. టెలిగ్రా మొచ్చినప్పుడు తను అందుకోవడం ఎంత అదృష్టం, అనుకుంది తార.

ఒక గంట దాటింది.

మోహన్ వచ్చాడు. రావడం సరాసరి మేడమీది కొచ్చాడు.

"నువ్వింకా మెలకువగా ఉన్నావా?"

"ఆ."

"అయితే శుభ వార్తొకటి చెబుతాను."

"చెప్పండి."

"నేను అర్భక్ని చూశాను. తాను తీస్తున్న పిక్చరులో ఒకమ్మాయికి కారు ఏక్సిడెంటు జరిగిందట. ఆ అమ్మాయి ఆరు నెలలయినా హాస్పిటలులో ఉండాల్సొస్తుందట. ఇంతవరకు ఆ అమ్మాయితో తీసిన సీనులన్నీ మళ్లీ రీ షూట్ చెయ్యాలంటున్నాడు, ఎవరయినా కొత్తమ్మాయిని తీసుకుని. నేను నిన్ను ప్రస్తుతించాను."

"నన్ను తీసుకుంటా నన్నారా?"

"టెస్టు చేసి పనికొస్తే అలాగే నంటాడు. కాని అది హీరోయిన్ పాత్ర కాదు. హీరోయిన్ చెల్లెలు వేషం."

"ఏదైనా ఫరవా లేదు."

"ఇంకా విశేష మేమంటే, వచ్చే నెలాఖరుకు విడుదల చేయాలని ప్రయత్నం చేస్తున్నాడు. కనుక నువ్వు తారా పథాని కెగిరేదీ లేందీ కూడా త్వరగా తేలిపోతుంది."

"నా సాయ శక్తులా ప్రయత్నిస్తాను."

"ఇందులో ఫెయిలయితే వెంటనే యింటి కెళ్లి పోతానన్న వాగ్దానం మరచి పోబోకు. ఆ మరకు మాడే రేపు నిన్ను స్టూడియోకు తీసికెళ్లేది."

"సరే."

"పడుకో. నే వెళ్లుతున్నాను." అని వెళ్లిపోయాడు మోహన్.

ఏమయినా సరే, తన నాటక రంగ అనుభవం ఉపయోగ పడాలి. ఈ ప్రయత్నంతో సినిమా రంగంలో తను ఒక స్థానం ఏర్పరచుకోవాలి. ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకోవాలని ఆదుర్దా పడసాగింది తార.

* * *

ఒక వారం గడిచింది. తార అనుకున్నంత తేలికగా లేదు సినిమాలో నటించడం. ఎన్నో సార్లు మేకప్ చేసు కోవడం, రిహార్సల్సు; కెమేరాలు, లైట్లు వేడిమి. చేసిన సీనులు మళ్లీ చేయడం, యివన్నీ తారకు బాధనిపించాయి. ఒకోసారి మోహన్కు నిజం చెప్పేసి తన యింట్లో చిన్న ఉద్యోగ మిప్పించమని కోరదా మనుకుంది. కాని మనసులో కోర్కె ఎదురు తిరిగింది. 'నీ జీవితమంతా రంగస్థ లాని కర్పించావు. ఇదికూడా సాధించు అంది.'

షూటింగు హడావుడిలో ఒకే యింట్లో ఉంటున్న మోహన్ని కలుసుకోడానికి వీలులేక పోయింది. సాయంత్రం అయిదయ్యే టప్పటికల్లా తార స్టూడియో కెళ్లాల్సొచ్చేది. తార తిరిగొచ్చే టప్పటికి తెల్లవారుఝామయ్యేది. తార ఉదయం లేచేసరికల్లా మోహన్ బయటి కెళ్లిపోయేవాడు.

ఒక నెల గడిచింది. ఆ రోజు షూటింగు లేదు. మోహన్ కోసం ఎదురు చూచింది.

మోహన్ రాగానే అడిగింది.

"డైరెక్టరుగా రేమంటున్నారు?"

"అర్భక్ ఏమన్నాడో తెలుసా! ఫీల్డులో ఉన్న వాళ్లందరిలోనూ నీ కళ్లు చాలా అందమయినవని. నీ యాక్టింగు కూడా బ్రహ్మాండంగా ఉందన్నాడు."

"నాచేత నయినంతా నటించాను" అంది తార.

"చూస్తూ చూస్తూ నువ్వు పెద్ద తారవయి కూర్చు నేట్టుగా ఉన్నావే. ఆ తరవాత మాతో మాట్లాడు తావా?"

"అలా అనకండి. మిమ్మల్నెప్పుడూ మరచి పోలేను."

"సరేగాని, పబ్లిసిటీకి నీ పేరు బావుండ లేదు. పేరు మారిస్తే బావుండు నన్నాడు అర్భక్. నీ మనసులో ఏమయినా ఉందా" అని అడిగాడు మోహన్.

"మీరే ఆలోచించి ఏదోఒకటి చెప్పండి ఆయనకు."

"తార అంటే ఎలా ఉంటుంది?"

"బాగానే ఉంది."

"చిన్నదిగా ముచ్చటగా ఉంది. ఆ పేరులో పబ్లిసిటీ యివ్వ మంటాను. ప్రివ్యూ యింకో పది రోజులలో ఉంటుంది."

ప్రివ్యూనాడు తార, చక్కగా అలంకరించుకొని థియే టరుకు బయలుదేరింది. మోహన్ని రమ్మంటే ఆ టైముకు అక్కడకు జేరుకుంటానని ముందే వెళ్లి పోయాడు.

థియేటరులో డైరెక్టరు, తార మిగతా నటీమణులు, నటులు బాల్కనీలో నిలబడి ఉన్నారు. సినిమా మొదలు పెట్టారు. కాని మోహన్ రాలేదు. అందరూ వెళ్లి లోపల కూర్చున్నారు.

# ఆరోహణ

సినిమాలో తార నటనను గూర్చి గుసగుసలు బయలుదేరాయి. చెవొగ్గి వింటే అన్నీ ప్రశంసలే. సినిమా పూర్తయింది.

"నీ నటన అమోఘంగా ఉందంటున్నారు తార! పిక్చరంతా నువ్వేనట. నువ్వు ఆంధ్ర సినిమా రంగంలో ఒక ధృవ తారవయినావు" అన్నాడు డైరెక్టరు అగ్భక్.

'ఈ రోజు కోసం ఎన్నాళ్లు ఎదురు చూచాను' అనుకుంది తార తనలో.

మోహన్ రాలేదు గదా అని విచారించింది తనలో.

ఇంతలో మోహన్ హాలులోంచే వచ్చాడు. అతని వెంట ఎవరో స్త్రీ ఉంది. బొద్దుగా అసహ్యంగా ఉంది. అలాంటి ఆడది మోహన్ వెంట ఉండడం తనకు సిగ్గనిపించింది తారకు.

మోహన్ ఆ స్త్రీతో కలిసి తన దగ్గరకొచ్చాడు.

"నీవు అద్భుతంగా నటించావు. నువ్వింత ఘటికురాలవనుకోలేదు" అన్నాడు మోహన్.

(ప్రక్కనున్న స్త్రీతో)

"ఈమె తార. మీరు సినిమాలో చూసినది ఈవిడనే. తారా! ఈమె మహాలక్ష్మమ్మ." అని పరిచయం చేసి ఒక చిరునవ్వు నవ్వాడు.

తార గుండె గతుక్కు మంది. ముఖంలో సంతోషమంతా మాయమయిపోయింది. మహాలక్ష్మమ్మతో తడబడుతూ మాట్లాడింది. ఇంతలో వాళ్లవేపు సినిమా పెద్దలొచ్చారు. వాళ్లు రాగానే తారకు ఎంతో భారం తగ్గినట్లనిపించింది. వాళ్లు మాట్లాడుకుంటున్నారు.

డైరెక్టరుదగ్గర శెలవు తీసుకుని శరవేగంగా యింటికి చేరింది తార. తన సామాను సర్దుకుంది.

మోహన్‌గారూ,

నా సంగతి మీకు తెలిసింది. మిమ్మల్ని చూడడానికి నాకు ముఖం చెల్లడం లేదు. మీరు నాకు సినిమాలో నటించే అవకాశ మిచ్చినందుకు మీ కెంతో కృతజ్ఞురాలిని. నే నెవరినో తెలుసుకుని చాలా బాధ పడతారు. మీ శుభాన్ని సదా కోరుతూ —తార

అని చీటీ వ్రాసి బల్లమీద పెట్టి సూటుకేసు తీసుకుని బయలుదేరింది.

క్రిందికి దిగి వచ్చేసరికి మోహన్ కారు ఆవరణలోకి వచ్చింది.

నిశ్చేష్టురాలై గుమ్మం దగ్గరే నిలబడిపోయింది.

"ఇదేమిటి తారా ఎక్కడికి?"

"ఎక్కడికో తెలియదు. ఇక యిక్కడ ఉండే అర్హత నాకు లేదు."

"ఏం, ఎందుకని?"

"మహాలక్ష్మమ్మగారు......"

"ఆవిడ తన స్నేహితుల వాళ్లతో కలిసొచ్చిందట. వాళ్లంతా కలిసి ఎక్కడో బస చేస్తున్నారు."

"అయినా నేను ఇక్కడ ఉండను. నేను మిమ్మల్ని మోసం చేశాను", అని ఏడ్వడం మొదలుపెట్టింది తార.

"మీ ఆడవాళ్లతో యిదే వచ్చింది గొడవ. తల్చుకుని ఏడుస్తారు."

"నా కిక్కడ స్థానం లేదు. ఇన్నాళ్లు మిమ్మల్ని మోసంచేసి..." చెప్పలేకపోయింది తార.

"నువ్వు నన్ను మోసం చేయలేదు తారా."

"ఎలా?"

"ఫోనులో చెప్పిన టెలిగ్రాముకు ఒక కాపీ ఆఫీసుకి పంపారు టెలిగ్రాఫ్ ఆఫీసువాళ్లు. నువ్వు మహాలక్ష్మమ్మవి కాదని నాకు అప్పుడే తెలుసు."

"తెలిసే ఊరుకున్నారా?"

"ఆ. నిన్ను తారను చేయాలిని బుద్ధి పుట్టింది. అందుకని తెలియనట్లే నటించాను. సరేగాని నీ అసలు పేరేమిటో యిప్పుడయినా చెప్పు."

"తార."

"అరే బలేగా కుదిరిందే!"

యిద్దరు మేడమీది కెళ్లారు.

"నేను యిలా మీతో ఉంటే లోక మేమనుకుంటుంది" అని అడిగింది తార.

"పోనీ యింటిదానివిగా ఉండు నీకేమీ అభ్యంతరం లేకపోతే. చూడగా చూడగా, నే నిన్నాళ్లుగా బ్రహ్మచారిగా ఉంది నీ కోసం లాగా ఉందే!"

సిగ్గుతో తల వంచుకుంది తార.



# కథ అడ్డం తిరిగింది

* "శ్రీ" *

[దాసు 'ప్రణయిని' పత్రికకు సంపాదకుడుగా ఉండి, తన చిత్రకళను అభివృద్ధి చేసుకుంటాడు. తనను చిన్న తనములో పెంచిన మేనత్త చనిపోగా విధవ యైన ఆమె కుమార్తె, మణి, తన దగ్గరకు వచ్చి, తన ఇంటి సంగతంతా చూసుకుంటూ ఉంటుంది. దాసు స్నేహితుడైన విశ్వంతో మణికి క్రమంగా స్నేహమౌతుంది. అజ్ఞానురాలైన మణిని విశ్వం సంస్కరించాలనుకుంటాడు.

ఒక రోజు విశ్వం, సంస్కార మంటే సంఘ పరిస్థితులు తెలిసికోవటమనీ, దానికి నవలలూ, సినిమాలు ఉత్తమ సాధనాలనీ, దాసు మణిని సంస్కరించ లేదనీ, మణికి బోధిస్తూ ఉండగా దాసు వింటాడు. అప్పుడు దాసు తను మణి స్వతంత్రానికి ఎన్నడూ అడ్డు పడడనీ, చేతనైనంత వరకూ విశ్వం మణిని సంస్కరించ వచ్చనీ అంటాడు. మణితో కూడా, దాసు, విశ్వం చాలావరకూ మంచివాడనీ, అతని దగ్గిర భయపడ నవసరం లేదంటాడు.]

## 6

ఆ తరువాత రెండునెలలయి పోయింది. దాసు క్రొత్తగా పెట్టిన పత్రిక బాగానే సాగుతూంది. ఆవేళ రాత్రి భోజనమయాక తన పత్రికకు ఏదో వ్యాసం వ్రాయటం ప్రారంభించాడు దాసు. టౌనులో 2 గంటలు కొట్టారు. దాసు వ్యాసాన్ని ముగించి లైటు ఆర్పి అప్పుడే పండుకున్నాడు. కిటికీలోంచి వెన్నెల అతని మీదుగా మూసుకు పోతుంది. దాసు ఏమిటో ఆలోచిస్తూ అప్పుడే కండ్లు మూశాడు. ఇంతలో ఎవరో పిల్చినట్లుయి త్రుళ్లిపడి లేచి 'ఎవరూ?' అన్నాడు. అతని పాదాలపై చేతులు ఆన్చి మణి కూర్చుని ఉంది. 'ఎవరు! మణీ!' అన్నాడు, పాదాలు విదిలించుకుంటూ లేచి కూర్చుని.

"అవును నేనే బావా" అన్నదామె భయపడుతూన్న కంఠంతో.

'ఎందుకు వచ్చావు. నిద్రపట్టలేదూ?'

"లేదెందుకో భయం వేసింది. నువ్వుకూడా మేల్కొని ఉండు బావా! నా కెందుకో భయం వేస్తూంది." అన్నది, వెక్కి వెక్కి ఏడుస్తూ...

దాసు కామె వైఖరి ఆశ్చర్యం కలిగించింది. ఎన్నడూ ఆమె భయం వేస్తూందని అని ఎరుగదు.

'ఎందుకు భయపడ్డావు. ఏదైనా కల వచ్చిందా?' అన్నాడు జాలిగా—

"నా బ్రతుకంతా కలే—జీవితంలో ఏమీ లేని వాళ్లకి కలకాకపోతే మరేమిటి—కల నిజమౌతుందా బావా" అన్నది.

ఆమె ధోరణి కతడు విస్తుపోయాడు. ఆమె ఈ విధంగా మాట్లాడటం అతడెప్పుడూ వినలేదు. ఈ మాత్రం భావ గర్భితంగా మాట్లాడగలదని కూడా అనుకోలేదు. ఆమె చెప్పిన దానిలో నిజం లేకపోలేదు. కాని అతడేమీ జవాబు చెప్పలేదు.

ఆమె యింకా వెక్కి వెక్కి ఏడుస్తూ "నిజం చెప్పు! నేను విధినిబట్టి విధవను కావచ్చు. కాని నాలో ఏం లోపం ఉంది. ఎందుకు నన్నింత ఉపేక్ష చేస్తావు! నాకుమాత్రం కోరికలుండవా? నేను ఎవ్వరికీ అక్కరలేని దానిలాగ బ్రతకాలా?" అన్నదావేశంతో.

దాసు యింకా చిక్కులో పడ్డాడు. నిజమే మణి అలాగ అనుకోటంలో అర్థం లేకపోలేదు. ఈ భావాలు ఆమెలో అజ్ఞాతంగా ఇదివరకే ఉండి ఉంటాయి. కాని యిప్పుడీమె ఈ ధోరణిలో మాట్లాడగల్గటానికి కారణం, విశ్వం ఆమెకు బోధించిన పాఠాలు అయి ఉండాలి, అనుకున్నాడు.

"మాట్లాడవేం బావా! అయితే నన్ను భరించలేవా?" అన్నదామె, అతని పాదాలమీద పడబోతూ!

దాసు గబుక్కున తప్పించుకొని 'నేను భరించవలసిన విధంగా భరిస్తూనే ఉన్నాను మణీ. ఇంతకన్న ఎక్కువ భారాన్ని తీసుకోలేను. ఇక ఉపేక్ష చేస్తున్నాననుకోవడం చాలా పొరపాటు. నేను ఏ వ్యక్తినీ ఇంతకన్న ఎక్కువ ప్రేమించలేను. నేను నీకొక విధంగా కష్టం కల్గించి ఉండవచ్చు. కాని నిన్ను తృప్తి పరచలేను.' అన్నాడు కిటికీలోంచి బయటికి చూస్తూ.

మణి క్రుద్ధ స్వరంతో "నాలో ఏం లోపం ఉందని?" అన్నది మళ్లీ.

'లోపమున్నదని కాదు నాకు ఒక స్త్రీ అవసరం కల్గిననాడు నీకంటె విలువైన స్త్రీని పొందగలననే ఆశలేదు. కాని...ఇంక నన్ను బాధించకు మణీ' అన్నాడు కొంచెం విసుగుగా!—ఆమె దిగ్గున లేచి వెళ్లిపోయింది. అతడాలోచిస్తూ నిద్రపోయాడు.

## 7

మరునాడు ఉదయమే లేచేసరికి కొంచెం ప్రొద్దెక్కింది. అప్పటికే కాఫీ తయారుచేసి అతడు ముఖం కడుక్కొనగానే టేబిలుమీద పెట్టి వెళ్లిపోయింది మణి. దాసు కాఫీ తాగేసి బట్టలు వేసికొని బయటికి వెళ్లిపోయాడు.

దాసు ఆ దినం మధ్యాహ్నం భోజనానికి కూడా యింటికి రాలేదు. సాయంత్రం 7 గంటలయాక ఇంటికి తిరిగి వచ్చేసరికి వీధి తలుపు తాళం వేసిఉంది. వీధరుగుమీద కిళ్లీ కొట్టువాడు 'బాబూ ఆ యమ్మగారు ఎక్కడికో వెళ్లారండి. తాళం మీ కిమ్మన్నారు.' అని తాళం తెచ్చి యిచ్చాడు.

దాసు మాట్లాడకుండా తాళం తీసి యింట్లోకి వెళ్లి లైటు వెలిగించి 'How to study literature' అనే గ్రంథాన్ని తీసి చదవటం ప్రారంభించాడు.

రాత్రి 10 గంటలయేక మణి వచ్చింది. సరాసరి వంటింట్లోకి వెళ్లి తిరిగివచ్చి "భోజనం చేయలేదేం?" అన్నది.

'ఆకలి వెయ్యటం లేదు. సాయంత్రం ఎవరో పార్టీకి పిలిచారు—వెళ్లాను. తినాలని లేదు' అన్నాడు.

"నన్ను విశ్వం సినిమాకి రమ్మన్నాడు. నీకు భోజనానికి ఆలశ్యం అవుతుందేమో అని వంటచేసి అన్నీ అక్కడ సిద్ధంచేసి వెళ్లాను. ఎందుకు చేయలేదు? మధ్యాహ్నం కూడా భోజనం చెయ్యలేదెందుకని?"

'ఏమీ లేదు ఏదో పని ఉండి ఉండిపోయాను' అన్నాడు ముక్తసరిగా.

"అవును! నీకు తోచినట్లే చేయవచ్చు! ఇకమీద భోజనం ఎన్నిమారులు మానేసినా చేయలేదేమి అనికూడా అడగను" అంటూ వెళ్లిపోయిందామె.

......ఆ తరువాత మణిలో అనేక మార్పులు వచ్చినై. ముఖ్యంగా వేషభావాలలో చాలా మారింది. ఆమె ఈ మధ్య రంగు చీరలు కట్టడం, జడవేసికొనటం ప్రారంభించింది. ఆమె యిప్పుడు తరచుగా విశ్వంతో బీచికి, సినిమాకి వెళ్తూంటుంది. అప్పుడప్పుడు ఊళ్లో జరిగే మీటింగులకు కూడా వెళ్తూంటుంది. ఒకరిద్దరు స్నేహితురాండ్రతో కూడా పరిచయమైనది. విశ్వం రోజూ ఆమెకు ఆంధ్ర పత్రిక తెచ్చి యిస్తూంటాడు. ఆమె అందులోని సినిమా ప్రకటనలు సినిమా విమర్శనలు తరచు పరిశీలిస్తూంటుంది. విశ్వం ఆమెకు క్రొత్తగా వచ్చే ఆధునిక రచయితల నవలా గ్రంథాలు కూడా తెచ్చి యిస్తూంటాడు.

ఇప్పుడు మణి సంస్కారప్రియ. ప్రపంచంలో ఎక్కడ ఏమి జరుగుతుందో పూర్తిగా తెలియకపోయినా తెలుసుననే గర్వమామెకు చాలా ఉన్నది. ఎవరైనా క్రొత్త మనిషి వస్తే రాజకీయాలలో, సాహిత్యంలో తనకున్న ప్రావీణత నంతా చూపాలనే ప్రయత్నం చేస్తూంటుంది.

విశ్వం సహవాసంలో వచ్చిన కొద్ది యింగ్లీషు మాటలు కూడా ఆమె భాషలో తరచు దొర్లుతూంటాయి.

## 8

దాసు అప్పుడే అర్ధనారీశ్వరుని చిత్రం పూర్తి చేశాడు. మణి ఈ మధ్య దాసుతో చాలా తక్కువ మాట్లాడుతుంది. కాఫీ తీసుకుని వచ్చి మణి దాసు వేసిన చిత్రాన్ని తిరస్కారభావంతో చూస్తూ "చిత్రకళ కూడా సంస్కారానికి దారిచూపుతుంది అంటావే! ఇలాంటి పిచ్చి బొమ్మలవల్ల వచ్చే సంస్కారమేమిటో చెప్పు?" అన్నది హేళనగా.

'ఇచ్చట సంస్కారం ప్రధానం కాదు—చిత్రంలోని శిల్పం, అందులోని భావం ప్రధానం' అన్నాడు దాసు, తాను వేసిన బొమ్మనే ఇంకొంచెం దీక్షగా చూస్తూ!

"ఓహో! ప్రపంచంలో ఎక్కడా లేని ఆకారాలను చిత్రించడమే గొప్ప శిల్పం అంటావా? శిల్పం దర్శకులను వాస్తవిక జగత్తుకెంత దగ్గరగా తీసుకువెళితే అంత గొప్పదనిపించుకుంటుంది. అంతేకాని శివునికి లింగ భేధమే లేదని నిరూపించే ఈ చిత్రంలోని ఆదర్శమేమిటి?"

'వాస్తవిక జగత్తున, ఉన్నదున్నట్లూ ఎవ్వరూ చిత్రించలేరు. ప్రతి చిత్రంలోను కొంత ఊహ కొంత కల్పన ఉండనే ఉంటాయి. ప్రకృతిని ప్రకృతిగానే చిత్రించినా అందులో మనకు తెలియని క్రొత్త పోకడలు కన్పిస్తునే ఉంటాయి. కాని వాస్తవిక జగత్తులో లేనట్లు కన్పించే ఒక దృశ్యంలో, ఎంతో వాస్తవికత భావసామీప్యం కనిపింప చేస్తే అప్పుడది గొప్ప శిల్పం కాదూ? అర్ధనారీశ్వర రూపం నిజంగా లేకపోవచ్చు. కాని ఈ చిత్రంలో ఆదర్శంగా ప్రతిఫలించే పార్వతీ పరమేశ్వరుల ప్రణయచరిత్ర; వారిద్దరి దాంపత్యంలో ఉండే ఒక ఉత్కృష్ట ప్రేమ బంధం, గోచరించడం లేదూ?'

"దాంపత్య ధర్మంలో అన్ని పవిత్రాశయాలు ఉన్నాయనే వాడివి నువ్వా ధర్మాన్నెందుకు స్వీకరించ కూడదూ?"

దాసు ఒక్కసారి ముఖం చిట్లించుకున్నాడు. ఆమె ధోరణి మళ్ళీ యిందులోకి దిగిందేమా! అనుకున్నాడు.

చివరికి అన్నాడు. 'అలాంటి విషయాలు వ్యక్తిగత మనోభీష్టాలను బట్టి ఉంటాయి' అని.

ఆమె మాట్లాడకుండ వెళ్లిపోయింది.

..................

..................

సినిమాకి వెళ్లి 10 గంIIలకు తిరిగి వచ్చాడు దాసు. మణి, దాసు వచ్చేసరికి నిద్రపోతూంది. దాసు నెమ్మదిగా వచ్చి కాళ్లు కడుగుకుని తనకు తనే వడ్డించుకుని భోజనం చేస్తున్నాడు. ఇంతలో మణి లేచివచ్చి "వచ్చి లేపితే నేను వచ్చి పెట్టకపోదునా?" అని అలమరలో నున్న పెరుగు తెచ్చి వేసింది.

"దాసూ—విశ్వం విధవా వివాహం చేసికోడంలో తప్పేమీ లేదని చెప్పాడు—దాని గురించి వీరేశలింగంగారి పుస్తకాలు కూడా చదవమనిచ్చాడు. ఆ విషయమై నీ అభిప్రాయమేమిటి?" అన్నది.

దాసునామె 'దాసూ!' అని పిలవడం ఇదే మొదటి సారి.

దాసు కొంచెం చిరాకుగానే 'పెళ్లి చేసికోవాలని తల్చుకున్నప్పుడు చేసికోనేటంత ఉత్తమం మరొకటి లేదు—అది ఎవరైనా సరే!' అన్నాడు.

..................

..................

ఆ తరువాత కొద్ది దినములకే దాసు బయటికి వెళ్లి యింటికి తిరిగివచ్చేసరికి టేబిలుమీద ఒక ఉత్తరం పెట్టి ఉంది.

'దాసూ!

నేను విశ్వాన్ని ప్రేమించాను—మేము పెండ్లి చేసికోబోతున్నాము—కనుక మేం వెళ్తున్నాం! ఇన్నాళ్లు దయతో నీ యింట్లో చోటిచ్చినందుకు కృతజ్ఞురాలిని.

'మణి'

దాసు ముఖంలో ఎక్కువ ఆశ్చర్యమేమీ కనబర్చలేదు. ఇదెలాగా అనుకున్నదే అన్నట్లు ఊరుకొన్నాడు—అతని హృదయంలో ఒక రకమైన బరువు తీరినట్లు కూడా అనిపించింది......

..................

సంవత్సరం తిరగలేదు—మద్రాసునుండి విశ్వం దాసుకొక ఉత్తరం వ్రాశాడు—

"దాసూ!

కథ అడ్డం తిరిగింది. మణి, మణి వంటి పిల్లనుకున్నాను. ఆ మణిని కాస్తా నువ్వు హరించేస్తావేమోనని వీలయినంత వేగంగా ఆమెను నావైపు ఆకర్షించుకున్నాను. మణి నన్ను మనస్ఫూర్తిగా ప్రేమించిందనుకున్నాను. కాని పిట్ట ఎగిరిపోయింది. ఇక్కడికి వచ్చాక ఆమెకు నా మిత్రుడు రమేశ్‌తో పరిచయమయింది. నిన్నను వాళ్లిద్దరూ చెప్పకుండా ఉడాయించారు. మణిని సంస్కరించాలనుకున్నాను. ఆ సంస్కారం నన్ను, తననే కాకుండా ఇంకా ఎంత మందిని చెడుపుతుందో!

సంస్కారం అంటే ఏమిటో నేను సరిగా అర్థం చేసుకోలేదో, ఆమెకు సరిగా వివరించి చెప్పలేక పోయానో, లేక ఆమే దానిని అర్థం చేసుకోలేక తప్పు త్రోవ త్రొక్కిందో?

మిత్రుడు,

విశ్వం."

—: సమాప్తం :—



ప్రబంధ సాహిత్యము :

# మను చరిత్రము

* డాక్టరు వారణాసి యశోదాదేవి, డి.లిట్. *

కవి రసస్రష్ట. కావ్యము రసాత్మకము. కావున ధ్వని, భావము, వ్యంగములకు, రసముతో నైక్యమైనపుడే పరమావధి గల్గును. ప్రాచ్యులును, పాశ్చాత్యులును కావ్యమును శిల్పమనిరి. శిల్ప ప్రయోజనము హృదయామోద మగుట కావ్యము ఆనందదాయకము.

"ప్రబంధపదము భారతాది సర్వ గ్రంథ వాచక మయ్యు నిటీవల మిశ్రోత్పాద్యాన్య తరమగు నితి వృత్తముతో చతుర్దశ వర్ణనల గూర్చి రచింపబడు కావ్యమునకు చేరుగా వాడబడుచున్నది." శ్రీనాథుడు తన రచనల మార్పునందు మార్పు గల్గించి ప్రబంధ రచనకు మార్గ దర్శకుడయ్యెను. పిల్లలమర్రి పినవీరన శృంగార శాకుంతలములో ప్రబంధ రచన గూర్చి చెప్పియున్నాడు. తదనంతరము వెలువడిన అత్యుత్తమ మహా ప్రబంధమే మను చరిత్రము. ప్రబంధమనకు కల్పనా కథ యను అర్థమును కలదు.

మను చరిత్ర కృతి భర్త విద్యానగర చక్రవర్తి శ్రీ కృష్ణ దేవరాయలు. ఇతని పరిపాలనమును రామ రాజ్యముగ వర్ణించి యున్నాడు పెద్దనామాత్యుడు. మను చరిత్రలో వర్ణింపబడిన కృష్ణరాయల విజయములు, కావ్యాంశములు చరిత్రాంశములకెంత చేరువగ నుండవలయునో, అంత దగ్గరగ నున్నవి. ఆంధ్రభోజుని యాస్థానములో కవిత యందును, వయసునందును పెద్దయై, కవితాపితామహ బిరుదాంకితుడు మను చరిత్ర కృతికర్త అల్లసాని పెద్దనామాత్యుడు.

పెద్దన కృష్ణ దేవరాయలచే పొందిన సన్మానమును, గౌరవమును

ఎదురైనచో తన మదకరీంద్రము డిగ్గి,
కేలూత యొసగి యెక్కించు కొనియె !
మను చరిత్రం బందుకొనువేళ పురమేగ,
పల్లకి తనకేల బట్టి యెత్తె !
ఆంధ్ర కవితాపితామహ అల్లసాని,
పెద్దన కవీంద్ర యని నన్ను పిలుచునట్టి !
కృష్ణరాయలతోడ దివికేగ లేక,
బ్రదికియున్నాడ జీవచ్ఛవంబ నగుచు !!

అని కృష్ణరాయల నిర్యాణానంతరము వాపోయెను. ఇతడు హరికథా సారమను ప్రబంధమును గురువు శఠకోపయతికి అంకిత మిచ్చాడు. ఆముక్తమాల్యదకు మను చరిత్రకు గల సామ్యములబట్టి అదియు పెద్దన కృతమనుట గలదు. పెద్దన 1540 ప్రాంతమున స్వర్గస్థుడయ్యెను.

మను చరిత్రము గ్రంథమునందు స్వారోచిష మను సంభవము, స్వారోచిషు చారిత్రము అనియు చెప్పబడినది. కాని మను చరిత్రనామమే లోకమున రూఢియైనది. ఇందు ఆశ్వాసములు ఆరు; చతుర్దశ వర్ణనలు గలవు. ఇతి వృత్తము మార్కండేయ పురాణమునుండి గైకొన బడినది. మారన కృత ఆంధ్ర మార్కండేయ పురాణమున 150 పద్యములలోని కథను పెద్దన 800 పద్యములవరకు పెంచెను. "అల్లసాని వానియల్లిక జిగిబిగి" యను పలుకును మను చరిత్ర సార్థకము చేయుచున్నది. కవి తన సర్వతోముఖ పాండిత్యమును చతుర్విధ కవితా విలాసమును, కూర్పు నేర్పు, భావ వైచిత్ర్యము, లోకజ్ఞానము, మను చరిత్రమున వెల యించెను. సంస్కృతాంధ్రముల చక్కగ కలయగూర్చి నందున "నితని కవనమున సంస్కృత ప్రౌఢియు, తెలుగు నుడికారమును మిసమిసలు దేరుచు జెరలాడు చున్నవి."

ఈ ప్రబంధ మందలి సరస్వతీ ప్రార్థనము మోహానముగ నున్నది. "తావుల్ క్రేవల జల్లు," మృగ మద సౌరభ విభవ," "వాలారుం కొనగోళ్ల" పద్యములందలి శైలి యుత్కృష్టము.

"అట చని కాంచె భూమిసురు డంబర చుంబి
శిరస్సరజ్ఝరీ !

పటుల ముహుర్ముహుర్లుఠద భంగ తరంగ మృదంగ
నిస్స్వన ।
స్ఫుట నట నానుకూల పరిఫుల్ల కలాప కలాపి
జాలమున్ ।
గటక చరత్కరేణుకర కంపిత సాలము శీత
శైలమున్ ॥"

అను పద్యము పెద్దన కవిత్వ కళాకౌశలమును జాటు చున్నది. ఇది చదువునప్పుడు యిందు వర్ణితమైన సెలయేటి చప్పుళ్లు, తదనుకూలముగ నాడు మయూరముల నృత్యము, నా ప్రాంతమున నున్న వృక్షములను తమ తొండములతో నూపు పిల్ల యేనుగుల విలాసము స్ఫురించు చున్నవి. మూడవ యాశ్వాసమందలి "ఏ విహంగము గన్న" పద్యము పెద్దన భాషాంతరీకరణ చాతుర్యమును, "పలుకులు నేర్పు వేళ" పద్యము అతని స్వభావ పరిజ్ఞానమును జూపుచున్నవి.

పెద్దన లోకోక్తులను, పురాణ కథలను, ప్రకృతి చిత్రములను పన్నె వెన్నెలతో చక్కగ రచించెను. మూడవ యాశ్వాసమున "రెంటికిం జెడిన రేవడు," పంచమాశ్వాసమున "గుండ్రాడాచిన బెండ్లి యేమిటికి జిక్కన్" అను లోకోక్తులు ప్రసిద్ధములు. శ్రీనాథుని కాశీ ఖండ మందలి "సనికల్ దాచిన పెండ్లి మానునొకో" అను సామెతను పెద్దన యనుకరించెను. ఛాయాదేవి కథ, శివుని త్రిపుర సంహార కథ, పాము ముదిరిగామగు కథ, శివతాండవ కథ సందర్భానుసారముగ సూచింపబడినవి. పీఠిక యందలి "క్రూర వనేభదంత" అను పద్యము "గిజిగాడులు మిడు గురు బుర్వులను దమ గూండ్లలో వెల్తురునకై కూర్చియుంచు కొను"నను ప్రకృతి చిత్రమునుబట్టి యందముగా బొందు పరుప బడినది. కృతి భర్త వంశ వర్ణనము కవి కల్పనా నైపుణ్యమును బ్రతిబింబించుచున్నది.

పెద్దన వెనుకటి కవుల రచనల బోలు రచనలను యింకను చక్కగ రచించాడు. నాచన సోమన, శ్రీనాథుడు, పిన వీరన, మారన, జక్కనల పద్యముల బోలు రచనలు మను చరిత్రములో గలవు. కులము సాములు, కడుపార గన్నతల్లి మొదలగు పలుకులు కవి సార్వభౌముని వే. స్త్రీల చిత్తములు చంచలములని శృంగార నైషధములోని "బాలికల చిత్తములంబు తరంగ లోలముల్" అను రచనను పెద్దన "క్షణ క్షణముల్ జవరాండ్ర చిత్తముల్" అని మాయా ప్రవరుడు వరూధునితో మాట్లాడు సందర్భమున వచించాడు. అచటనచట సంస్కృత వాక్యములను పద్యములలో నిమిడ్చాడు పెద్దన. "అనాశ్వాశిత దుఃఖితే మనసి సర్వ మసహ్యమ్." అనగా మనస్సు వూరటలేక చింతిలు చుండగా సర్వము నసహ్య మగును అని ప్రవరవేష ధారి యగు గంధర్వ రాజు తన భోగ విరక్తిని సూచించాడు వరూధునికి. "నాచాద ద్యుత్తమాం విద్యాం స్త్రీ రత్నం దుష్కులాదపి" యను ధర్మమును బట్టి "సద్విద్య యెందున్న గొనగ వలయు" నని మనోరమ స్వరోచికి చెప్పెను. "ద్వేష్టి గతాయుశ్చ చికిత్సక" అనగా ఆయువు మూడినవాడు చికిత్సకునితో ద్వేషించు నను లోకోక్తిని పంచమాశ్వాసములో బొందు పర్చాడు పెద్దన.

మను చరిత్ర కథా సంవిధానమున వస్త్వైక్యము లేదు. సంస్కృత భాషలో శ్రవ్య కావ్యములందు వస్త్వైక్యము అసాధారణము. తెల్గు ప్రబంధముల పట్లు నదియుండి తీర వలయునను నిబంధన గానరాదు. ఈ విషయమున మను చరిత్రము రఘువంశాది కావ్యముల బోలియున్నది. ఇందు రస ప్రధానముగా రచింపబడిన వరూధినీ ప్రవర వృత్తాంతము మూడవ ఆశ్వాసముతో ముగిసి, నాల్గవ యాశ్వాసములో ఆరంభింపబడిన స్వరోచి కథ ఆరవ యాశ్వాసములో కొంత వరకు ఆక్రమించి, తర్వాత స్వారోచిష మను వృత్తాంత ముతో కథ ముగియు చున్నది. ఇట్టి విచ్ఛేదము పాఠకులకు నిరుత్సాహము కల్గింపకుండ పెద్దన కథను ఔచితీ సహిత ముగ నడిపించెను.

ఈ ప్రబంధమున సరస సంవిధానము గలదు. ప్రవరుడా శుద్ధ శ్రోత్రియుడు. వరూధిని యా మహా ప్రౌఢ. పెద్దన వీరిద్దర నొక్కచో చేర్చెను. "ఇది కేవల శృంగార రస ప్రకరణము గాదు." పోతనామాత్యుడు భక్తి శృంగారములను వలె, పెద్దన శాంత శృంగారములను బహు నిపుణతతో జోడించెను. హిమాలయము అందొక కాంతారములో నొక సుందర మందిర ప్రాంగణమున వీణ వాయించు చుండిన వరూధిని మకరాంక శశాంక మనోజ్ఞ మూర్తి ప్రవరుని

పూర్వం తెల్లవాడి హస్తంలో మన దేశం చిక్కింది. 'మళ్లీ యీ యుద్ధంలో కొత్త శత్రువెవడన్నా మనమీదికి వస్తే' అని అంతా బేజారెత్తారు. ఉన్న శత్రువుని ఊడగొట్టడం ఉదుకుష్టం అయిపోయింది. ఉండిఉండి దేశంలో అంతా విప్లవోగ్ర కంఠంతో ఫెళ్లున లేచారు. ఊరూవాడా పల్లే పట్నం అన్నీ నిప్పులు కక్కాయి. తెల్లవాళ్ల చేతుల్లో బెల్లం చల్ల చల్లగా కరిగింది. తెల్లవాడికే యెల్లాఅయినా సనిగా గడవక పోయింది. 42 కి బలిగా లేచిన కోటుల ప్రాణుల ధైర్యం చూస్తే, దేశంకోసం, స్వాతంత్ర్యం కోసం ఎంత తీవ్రమైన కోరిక కలిగిందో తెలిసింది. రాయబారములు మొదలెట్టారు. తెల్లవాడు మన పెద్దలతో మెల్లిగ మంతనాలు మొదలెట్టాడు. దేశంనుంచీ దోస్తీతోనే తప్పుకు యింటికి పోయాడు. పోయాడంటే పోయాడంతే. స్వాతంత్ర్యం మనకేదీ? మనవాళ్లంతా పాలిస్తే యేం, మన ప్రాణాలే పోతూంటే? ఏన్నాళ్లైనా స్వాతంత్ర్యం మనకింకా రానేరాలేదు. నువ్వూ నేను దొంగతనంగా సంత కాలు సాగిస్తూంటే, నెహ్రూ పాపం పిరికితనంగా రాక్షసు లని వదిలేస్తుంటే ఎల్లా వస్తుందీ?

స్వాతంత్ర్యంకోసం ఇదివరలో బలి అయ్యాం. ఇప్పుడు స్వాతంత్ర్యం బలి మరిగింది.



# గోపిక - కృష్ణుడు

* శ్రీ చె. శ్రీ వెంకటరామయ్య *

కొంగు పట్టేవేమి కృష్ణయ్యా?
క్రొత్తకోడలినోయి కృష్ణయ్యా.
    క్రొత్తపాతలు నాకు గొల్లమ్మా!
    కొంతైన లేదుగా గొల్లమ్మా.

గుండెధైర్యమెకాని కృష్ణయ్యా!
గుణముకాదిది నీకు కృష్ణయ్యా!
    గుణము నాకెక్కడిదె గొల్లమ్మా!
    నిర్గుణుడ నగుదునే గొల్లమ్మా.

కాలమిది కాదోయి కృష్ణయ్యా!
కాస్త మన్నింపవోయి కృష్ణయ్యా!
    కాలముతో పనిలేదు గొల్లమ్మా!
    కాలాతీతుడనె గొల్లమ్మా!

సాకు జెప్పినాను కృష్ణయ్యా!
సందుచిక్కగ నీవు కృష్ణయ్యా!
    సందెటుల చిక్కనే గొల్లమ్మా?
    సర్వమెరుగుదు నేను గొల్లమ్మా?

మాటలామారివి కృష్ణయ్యా!
మారు పల్కగలేను కృష్ణయ్యా!
    మంచిదానివి నీవు గొల్లమ్మా!
    మాట దక్కించుకో గొల్లమ్మా!



# అంతరంగస్థాయి

* శ్రీ కవికొండల వెంకటరావు *

అరుణిమ అంధస్సుగు దా
రుణ తర బంధములాగున్
బఱగెన్ ప్రపంచమందున్ ;
కరుణ యదెట్టిదో యనుకోఁ
గరగెను కెరటాల్ సురువుల ;
సురుచిర కాంతులు గులికెన్ !

* * *

" వానకోసిన కొండలోయ
గానమేమో ? " అనుచు కూసెన్
గండు కోయిల చెట్టులేని
దెసా !
" ఆనవాలుగ బండిబాట
జ్ఞానమేమో ? " అనుచు వ్రాసెన్
రెండు గీతలు తెట్టతెన్ను
పసా !
ఎపుడు కురిసెనో వాన ?
తెలియదు !
ఎపుడు వెళ్ళెనో బండి ?
తెలియదు !
లోయబాటది
సాయపడె నొక
నాటి సాయంకాల
విహృతి వేడుకై
వెస !

* * *

కొండమీదను వ్రాలె మేఘము
అండదేవాలయ మమోఘము !
పూలుపూచెను చెట్లు సగము,
లేలదోఁచునో ఘుమం ఘుమ ఘుమ ?
పగటిపూటొకటే నిదానము
మొగ్గ విడుపు, మొగులు తడుపు !

నిగమ నాదము పోలెనేదో
నిముసమందొక పక్షిగానము !
అది వసంతోదయము కానగు
మొదటి సంతోషమ్ము కానగు ;
కుదురు కదిపిన కొసల వరకు
విదురుచును పడె విరుల వన్నె !
మేఘములలో దేవళము పయి
దివ్యగానము పాడుపక్షీ !
అవ్యయంబవు నీవు ! నీదే
సవ్యమగు జీవితము చూడ !

* * *

కోయిలా ! నీవువేయు కేకకు
ఉలిక్కి పడ్డాన్ నేడు !
చాలా గాలంబై విన్నా నేమో !
ఉలిక్కి పడ్డాన్ నేడు !
ఈ బొమ్మూరు కొండంకకు
వచ్చి కొన్నాళ్ళయ్యెన్ ;
వచ్చిన నిదివరలో
వసంత మప్పుడు రావే !
నేడో ?
రాతిరి వానకు చల్లన
ప్రీతికరంబై యొప్పెన్,
బయలుదేరి వచ్చానిటు
ఉదయాన్నె ! తొలివేకువనే !
ఈ ప్రశాంత నిశ్శబ్దతలో
ప్రార్థనలా వినిపించెను
నీ గానము ;—
కాని వులిక్కిపడ్డాన్ !
చటుక్కున వినిపించినదో ?
లేదా ? దేవుడు తళుక్కు మనెనా ?
లోలో, నాలో, నీలో ?

* * *

# అంతరంగస్థాయి

పొద్దున వచ్చిన వాన
పోదని సామెత!
అయిన తెలిసినదే!
వేకువనే మొదలు పెట్టి,
వేసవి వింతగ గురిసి,
చలువ నొలిపి, సంతసమిడి,
తెలిసినదే! సూర్యోదయ
మొలసినదే ఎల్లెడ!
మిగిలిన మొయిళ్ల చావే
సాగయించేను నీ రెండ!
మాకులమీదను! మళ్ళను!
టపటప యింకా ఆకుల
చివళ్ళనుండే జారుచు
నీటి బొట్లు పడుచున్నాయి;
నీ రెండను మెరుస్తున్నాయి!
హారతిలా నీరెండ
హారములా నీటి బొంట్లు
ఆనందము చేకూర్చెన్!
బ్రహ్మానందము చేకూర్చెన్!

*　　*　　*

పోసిన క్రొంగట్టున, చెరు
వొసగొనెడు వానకునై;
దిగుబాయడు పంటలేదు,
ఎడబాయను మొలకలేదు,
అంతా కొత్తయిగట్టూ
పుట్టాయేకమ్మయ్యెన్;
కొత్తమట్టి పోతబలిసి!
రయితన్నాడుత్సాహిగ
"ఈ పరి వానలు పడితే
గట్టులోనే నీరంతా!
గట్టుక్రిందే చేనంతా!"
అది వింటూ తలపోసితి
కొత్త గట్టు తడిగొనుటు,
కొత్త చెట్టు అటు మొలచుట!
అతని యూహ పాతయూహ!
నా ఊహలో? కొత్త యూహ!

*　　*

కడుతూ కడుతూ వున్నా
కాలేజీ కట్టడము
ప్రకృతి మధ్య పర్వతమై
పరికింపునరున్ దక్కైను;
ఇటమున్నెన్నో సారులు
ఇచ్చమెయిన్ దిరుగాడితి;
అడ్డులే? ఆకసమును
అరసితి, గొసరితి భావం!
ఇప్పుడో?
ఈ భవన నిర్మాణం
బపురూపము తోపించెన్
అచ్చోటే! ఆకడకే!
ప్రకృతికి మనిషికి
తేడా తోపించని
తెలిగొప్పెన్!

*　　*

సన్నని గోదావరినది
చక్కని లంకల బలిసి,
క్రిక్కిరిసిన పడవలతో
టక్కరి అల పవనములో
మిక్కిలి యింపెసగించెన్;
క్రొన్నవ్వు దాల్చిన చాన
మిన్నుంగల నెలవంక
మక్కువగను గొనరయ్యెన్;
ఇద్దరి అద్దరిచూడన్,
చుక్కల గమితేర్పాటుగ,
ఒక్కడ నేనటు నుంటెన్,
చుక్కల చూపెట్లో కనుకొని
టక్కరి అల బింబించెన్
చుక్కల గమి స్తంభింపన్.



# శాసన సభలు—స్త్రీ అభ్యర్థినులు

శ్రీమతి గుమ్మిడిదల దుర్గాబాయి,
ఎమ్. ఏ., బి. ఎల్., ఎం. పి.

రాజమండ్రి నియోజక వర్గమునుండి కేంద్ర శాసన సభకు పోటీ చేయుచున్న శ్రీమతి గుమ్మిడిదల దుర్గాబాయి ఎం. ఏ., బి. ఎల్., ఎం.పి., గారి అభ్యర్థిత్వాన్ని సమర్థిస్తూ, స్త్రీ జనాభ్యుదయానికి వీరు చిన్ననాటినుండీ సల్పిన సర్వతోముఖ కృషిని అభినందిస్తూ, వివిధ మహిళా సంఘాలవారు సన్మాన పత్రాలు సమర్పించారు.

రాజమండ్రి పురస్త్రీల తరఫున,

1. రాజమహేంద్రపుర స్త్రీల గృహ పరిశ్రమల సహకార సంఘము,
2. వైశ్య సేవా సదనం,
3. అఖిల భారత మహిళాసభ,
4. గౌతమీ దివ్యజ్ఞాన మహిళా సంఘము,
5. సేవా సమాజము,
6. ఆంధ్ర మహిళా గాన సభ,
7. లలిత గాన పారిశ్రామిక కళాశాల,
8. వనితావిహార,
9. ఆదర్శ మహిళా హిందీ విద్యాలయం,
10. మహిళా ఖాదీ శిక్షణ శిబిరము,
11. రాజ్యలక్ష్మి ప్రార్థన సమాజం,
12. దేవత శ్రీరామమూర్తి స్మారక యువతీ పఠనాలయముల వారు సమిష్టిగా సన్మాన పత్రం సమర్పిస్తూ,

"వీరనారీశిరోమణీ, పూజ్య బాపూజీ శంఖారవము నాలించి, మాతృ శృంఖలా బంధ విమోచనమునకై తుపాకి గుండ్లకు గుండెనిచ్చి నిల్చిన నీ సత్యాగ్రహ సమరయాత్ర భారతనారీ జైత్రయాత్ర.

దీక్షానిధీ, ఆలస్యముగ నారంభించిన విద్యయయ్యు ఆది నుండియు నేర్చిన విద్యలనుమించిన యవలీల గడంచి విద్యా వియత్తలమున ధ్రువతారవై మెరయ గల్గిన నీ దీక్షకు మా జోహార్లు.

శక్తి స్వరూపిణీ, అపరదుర్గవై, కేంద్ర ప్రభుత్వ మందిరాంగణములను, కేంద్ర న్యాయస్థానాంతరములను పటిమ మెరపు నీ వాక్కు ఆంధ్ర నారీలోకమున కొరవడి.

ప్రతిభాశాలినీ, "ఆంధ్ర మహిళ"ను, ఆంధ్ర మహిళా సభను అందాలుచింద నరవలమధ్య నిర్మించి పెంపొందించి, పోషించు నీ ప్రతిభ అద్వితీయము, అనన్యము.

వాత్సల్యమయీ, స్నేహార్ద్రమయమై, వాత్సల్య పూరితమై, ప్రేమభాసితమైన నీ హృదయ సుకుమారతయే నీ అనుచరులకు, శిష్యులకు మార్గదర్శిని.

దీనబాంధవీ, ఆర్తరక్షణమే ఆశయముగ నీవు నిర్మించుచున్న ఆసుపత్రియే నీ యుపకారచింతనమున కుపమానము.

విజ్ఞానమయీ, వెలలేని విజ్ఞానమే నీ సొమ్ము. పటుతర గాంభీరమే నీ మూర్తి. దీక్షయే నీ రక్ష. ఆచరణమే నీ యాదర్శము.

తల్లీ, భారతాంబ చల్లని కరుణా కటాక్ష వీక్షణములు సతతము నీకు రక్షగాగ, ఆ పరాశక్తి సదా నీయండగా నుండ, చిరకాలమిట్లే స్వార్థత్యాగినివై, నిరంతర నారీలోక సముద్ధరణకై జీవితము నర్పించి, నీవు ధన్యవై, భారత నారీ లోకమును ధన్య మొనరింతువుగాత!" అని శ్రీమతి దుర్గాబాయిగారిని ప్రశంసించినారు.

రాజమహేంద్రవర స్త్రీల గృహ పారిశ్రామిక సహకార సంఘమువారిమెకు సమర్పించిన సన్మాన పత్రములో,

"కేంద్ర శాసన సభ్యురాలా! సోదరీమణీ!

స్వాగతము—సుస్వాగతము.

అఖిల భారత దేశములో ఆంధ్ర మహిళల మేధాశక్తి, నిరాడంబరమైన జీవితము, సవ్యమైన సమయస్ఫూర్తిగల

ఆవేశం, స్వచ్ఛమైన విశ్రాంతి నెరుంగని అమాయకులై, అసహాయులై పీడింపఁబడు స్త్రీల సేవ మొదలగు సుగుణ సంపత్తులెన్నిటినో ప్రపంచమునకు వెల్లడిచేసిన ఆంధ్ర యువతీ రత్నమా! ప్రకృతిదేవి మీకు ప్రీతిపూర్వకంగా ప్రసాదించిన ఉత్సాహశక్తితో మిక్కిలి సాహస, సామర్థ్యములతో కేంద్రశాసన సభ్యతా కార్యక్రమములో పాల్గొని దేశాభివృద్ధికి స్త్రీల సహాయమెంత అవశ్యకమో ప్రపంచము గ్రహించగలుగునట్లు మీ విధులను నెరవేర్చుచున్నందులకు మా హృదయపూర్వకమైన అభివందనములు.

దేశసేవాతత్పరురాలా! విజ్ఞాన నిధీ! 1923 వ సంవత్సరమునుండి అనగా మీరు పదునాల్గేండ్ల బాలికగా నున్నప్పటి నుండి మీరు చేయుచున్న సేవా వివరములు తెలుపుట "జగమెరిగిన బ్రాహ్మణునకు జందెమేల" అన్నట్లు అనవసరము. అయినను ఆంధ్ర స్త్రీల పురోభివృద్ధికి మదరాసు నగరమున సారస్వతిక, పారిశ్రామిక, లలితకళల నేర్పు విద్యాలయమును అందలి దినదినాభివృద్ధికి మీరు పడినట్టియు, పడుచున్నట్టియు శ్రమను రాష్ట్ర, కేంద్ర ప్రభుత్వములనుండి ఒకే పర్యాయము ఇచ్చునట్టియు, సాలీనా యిచ్చునట్టియు వేలకొలది ధనము సేకరించునట్టి మీ శక్తి సామర్థ్యముల కున్నూ, స్త్రీ విజ్ఞానాభివృద్ధికి 7 సంవత్సరములనుండి ఆంధ్ర మహిళయను పత్రికా ప్రచురణలో మీరు చూపుచున్న శ్రద్ధకున్నూ మా కృతజ్ఞత తెలుపుచున్నాము."

అని తెల్పుతూ, వారి స్వవిషయాన్ని గూర్చి—సంస్థ స్థాపించి ఒక సంవత్సరమైనదనీ, 245 సభ్యురాండ్రు, రూ. 1060/- చెల్లించిన షేరు ధనముతో వ్యవహరిస్తున్న యీ సంస్థలో, నవారు నేత, కుట్టుపని, నూలు వడకుట, అల్లిక పనులలో రూ. 10,042/- విలువైన సరుకు ఈ సంవత్సరములో ఉత్పత్తి అయినదనీ, వలయు తెల్లనూలు కుడ్డ లభించక పోవుటచే, సంస్థ పని కొంతవరకు ఆగుచున్న దనియు చెప్తూ, ఇట్టి గృహ పరిశ్రమలకు కావలసిన ముడి పదార్థములు వారి కందునట్లు కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వముల తోడ్పాటు వారి కందజేయవలసినదిగా ఆమెకు విన్నవించు కున్నారు.

* * *

శ్రీ గౌతమీ విద్యా పీఠపు పరిపాలక వర్గములో సభ్యురాలు, విద్యాపీఠ శాఖలైన 'సరస్వతీ భవన' గ్రంథాలయము 'ఆంధ్రగాన కళా పరిషత్తు' విమర్శ శాఖ మున్నగు వాని కార్యక్రమమును కేంద్ర ప్రభుత్వమువారికి తెలిపి, రికగ్నైజ్ చేయించి, Indian council of cultural Relations లో యీ పీఠానికి సభ్యత్వాన్ని కల్పించిన శ్రీమతి దుర్గాబాయిగారి అభ్యర్థిత్వాన్ని సమర్థిస్తూ, శ్రీ గౌతమీ విద్యా పీఠంవారు ఇట్లు ప్రకటించారు.

"మన విద్యలయందున్నూ కళలయందున్నూ మిక్కిలి అభిమానము కలిగినట్టిన్ని, విజ్ఞాన ధనముయొక్క విలువను గుర్తెరిగినట్టిన్ని, జీవితమును విజ్ఞానాభివృద్ధికై ధార పోయుచున్నట్టిన్ని ప్రతిభావంతురాలైన యీమెను కేంద్ర శాసన సభకు మన ప్రతినిధిగా ఎన్నుకొని పంపుటకు సావకాశము కలుగుట మన అదృష్టమని తప్పక నమ్మతగిన విషయము.

ఢిల్లీలోనున్నూ యింకా యితర రాష్ట్రములయందున్నూ ఆంధ్రుల విద్యాభివృద్ధికై, ఆంధ్రులకు ఆయారాష్ట్రములందు గౌరవాభ్యున్నతులు కలుగునట్లు పాటుపడుచున్నది.

ఢిల్లీ పార్లమెంటు సభలోనున్నూ అంతకు ముందు రాజ్యాంగ పరిషత్తులోనున్నూ నాయకత్వము వహించి ఆమె ప్రజల సౌకర్యములు, హక్కులు, స్వాతంత్ర్యముల కొరకు ప్రతిభతో నడుముకట్టి పని చేసినది.

ఈమెయొక్క విద్య, కార్యనిర్వహణాది గుణ సంపత్తులను గుర్తించి Paris పట్టణములో జరుగుచున్న ప్రపంచ మహాసభకు మన భారతదేశ ప్రతినిధిగా పంపుటకు కేంద్ర ప్రభుత్వము సర్వసిద్ధము చేసినంతలో కేంద్ర నాయకులు రాష్ట్ర నాయకులున్నూ తిరిగి ఆలోచించి శాసన సభా ఎన్నికలు క్రమముగా జరిగించుటకు యీమె తోడ్పాటు అవసరమని యెంచి ఆపియున్నారు.

విద్యా పీఠము ఒక కాలేజీగా మారటం, ప్రభుత్వము ఏర్పాటు చేయుచున్న కర్ణాటక సంగీత ఎకడెమీలో మన సంస్థకూ, ఆంధ్రులకూ స్థానము కల్పించటం, పీఠమునకు వలసిన ముద్రణాలయాది సౌకర్యాలను కలిగించడం, వీరి తోడ్పాటుతో మనకు కలుగవలసి యున్నవి."

* * *



# నేడు మీరు మెక్లీన్‌తో పళ్లు తోముకున్నారా?

నిశ్చయంగా! ఆమె నిత్యం—రెండుసార్లు మెక్లీన్స్ పెరాక్సైడ్ టూత్ పేస్టుతో పళ్లు తోముకుంటుంది. ఆమెపళ్లు ఎంత తెల్లగా, రమ్యంగాఉన్నాయో చూడండి! మెక్లీన్స్ పెరాక్సైడ్ టూత్ పేస్టు మీకు కూడా అట్టి కళకళలాడే చిరునవ్వును ముత్యాలవలె మెరిసే దంత శోభను, పరిమళభరితమైనశ్వాసను సమకూర్చగలదు. మెక్లీన్స్ పెరాక్సైడ్ టూత్‌పేస్టులో సరియైన పాళ్ల లో జాగ్రత్తగా సమ్మిళిత మొనర్చబడిన అనేక పదార్థాలు నోటిలో బయలు దేరే హానికరమైన ఆమ్లాలను విరిచివేసి, దంతక్షయాన్ని నివారించి, పళ్లను నిగనిగలాడునట్లు ఉంచుతాయి. అవి వీటినన్నిటినీ ఏకకాలంలో సమకూర్చుతాయి. మీపళ్లకు సర్వోత్తమమైన టూత్ పేస్టునే వాడాలి కనుక నేటినుంచే మెక్లీన్స్‌తో పళ్లుతోముకోడం ప్రారంభించండి.

“... మీ మెక్లీన్స్ పెరాక్సైడ్ టూత్ పేస్టు అన్నివిధాలా సర్వోత్తమమైనది!”

**నేడే మెక్లీన్స్‌ను కొనండి!**




MTY-2 TEL.

వ్యాపార వివారణకు వీరికి వ్రాయండి :— జె. యల్. మోరిసన్, సన్ అండ్ జోన్స్ (ఇండియా) లిమిటెడ్., మహాలక్ష్మి ఆలయమునకు ఎదురుగా, వార్డెన్ రోడ్, బొంబాయి 26.

మద్రాసు ఆంధ్ర మహిళా సభా సభ్యురాండ్రు, శ్రీమతి దుర్గాబాయమ్మగారి అభ్యర్థిత్వాన్ని సమర్థిస్తూ, సేవా దక్షతా, శక్తి సామర్థ్యమూ, సత్ప్రవర్తనా గల వ్యక్తిని ఎన్నుకొని వారి ఓటింగు హక్కును సార్థ పరచుకో వలసినదిగా మహిళలను హెచ్చరిస్తూ, యీ క్రింది ప్రకటనను గావించినారు.

"పార్లమెంటు స్థానమునకు పోటీ చేయుచున్న శ్రీమతి దుర్గాబాయమ్మగారిని యెన్నుకొనవలసినదని వోటర్లను హెచ్చరించుట మా విధ్యుక్త ధర్మమని ఆంధ్ర మహిళా సభా సభ్యురాండ్ర మగు మేము భావించు చున్నాము.

దేశ స్వాతంత్ర్యమునకై యీమె యొనర్చిన త్యాగమూ, నిర్మాణ కార్య క్షేత్రమునందీమె సల్పిన కృషీ, రాజ్యాంగ, పార్లమెంటు సభలలో నీమె కార్య సాధనా—యీమె యీ స్థానమునకు సర్వ విధములా తగినవారని ఋజువు చేయుచున్నవి. మీ తోడ్పాటువలననే ఇది సాధ్యము.

బ్రిటిషు నిరంకుశత్వమును రూపుమాపు పోరాటములో కారాగృహముల బందియగుచు, చీకటి కొట్లలో నలయుచు, పోలీసుల తుపాకీ గుండ్లకు గుండె నొడ్డుచు, వీరు, కదన రంగమున వెనుదీయని యుద్ధ వీరుని వలె నిల్చిరి.

స్త్రీ విద్యకు పాటుబడ్డ వారిలో ప్రస్తుత చరిత్రయందు వీరిని బోలువారు మరొకరు లేరు. తనతోటి యువతీ మణులతో గూడి మద్రాసు నగరమున వెలకొల్పిన ఆంధ్ర మహిళా సభయే యీమె కార్య నిర్మాణ దక్షత కొక సాక్షి. అభ్యుదయ కళా విజ్ఞానముల కిది యొక పీఠమై యలరారుచున్నది.

ముఖ్యముగా బీద యువతులకై, వీరు స్థాపించిన పారిశ్రామిక విద్యాలయమును మద్రాసు ప్రభుత్వము రికగ్నైజు చేసినది. దీని సేవా నిరతిని గమనించి దీని నింకను విస్తృత మొనర్చుటకు భారతదేశ ప్రభుత్వము రూ. 50,000/ల గ్రాంటు నొసంగినది.

ఆల్ యిండియా నర్సింగు కౌన్సిలువారి సంప్రదింపులతో నీమె మంత్రసానులకు, దాదులకు నీయ రచించిన శిక్షా విధాన పథకమును ఆలిండియా ప్లానింగ్ కమిటీవా రామోదించి రూ. 80,000/- మొత్తము గ్రాంటుగాను రూ. 15,000/-లు సాలీనా రికరింగ్ గ్రాంటుగాను, మంజూరు చేసిరి.

ఇంక నెన్నో విధముల, పదునాల్గేండ్ల పసితనము నుండియు స్త్రీ జనాభివృద్ధికి యీమె యొనర్చిన యుత్కృష్ట సేవా, ఇంతవర కామె కేంద్ర శాసన సభా సభ్యురాలుగానూ, ఉపాధ్యక్షురాలుగానూ, సాధించిన యనన్య సామాన్య విషయములూ అందరెఱింగినవే!

రాబోవు ఎన్నికలలో రాజమండ్రి నియోజక వర్గము నుండి, కేంద్ర పార్లమెంటు సభా సభ్యత్వమునకు పోటీ చేయుచున్న వీరిని, మీ వోటు నిచ్చి సమర్థించినచో, సర్వతోముఖ శక్తి సామర్థ్యము గల్గి, ఆంధ్ర మహిళా భ్యుదయమునకు, యావద్భారత మహిళా సమస్యా పరిష్కారమునకు వీరు తోడ్పడగలరని హెచ్చరించు చున్నాము."

(49వ పేజీ చూడండి)

## కృతజ్ఞత

మదరాసు ప్రొవిన్షియల్ కో ఆపరేటివ్ బ్యాంకు వారు, పారిశ్రామిక విద్యాలయపు విద్యార్థినుల భోజన నిమిత్తము రూ. 200/- లు విరాళముగా నిచ్చిరి. వీరు గత నాల్గు సంవత్సరములనుండి తమ విరాళముతో మమ్ము ప్రోత్సహించుచున్నారు.

శ్రీమతి పి. కె. సుశీలా రాణిగారు, రూ. 100/- చెల్లించి, ఆంధ్ర మహిళా సభ యావజ్జీవ సభ్యురాలైరి.

వీరికి మా కృతజ్ఞత.

ఆంధ్ర మహిళా సభ.




# కిరణ్ - సాహస కృత్యాలు

* వి. కృష్ణమూర్తి *

[జరిగిన కథ :—కిరణ్ అనే ఆతను నానా కష్టాలు పడి తన డబ్బుతో నిండి ఉన్న ఒక లైఫ్ బోట్ (Life Boat) తో సహా, ఒక దీవి చేరుకుంటాడు. అక్కడ ఉన్న వాళ్లల్లో ఇద్దరు ముగ్గురు తనకు తెలిసినవాళ్లే! ఆ దీవికి తను ఎక్కివచ్చిన చేప నిజం చేప కాదనీ, చెక్కతో చెయ్యబడ్డదనీ, ఎవ్వరైనా మునిగిపోతూ ఉంటే ఆ దీవివాళ్లు ఆ చెక్కచేపను పంపి వాళ్లను రక్షిస్తారనీ, వాళ్లు ఏమైనా డబ్బు ఇస్తే ఆ దీవివాళ్లు వాళ్లిష్టము వచ్చిన చోటికి ఆ చేపమీద తీసుకు వెళ్తారనీ, కిరణ్ తన స్నేహితులవల్ల తెలుసుకుంటాడు.

కిరణ్ వాళ్లకి బాగా డబ్బిచ్చి, తనను తన స్నేహితులను ఇండియాకి తీసుకువెళ్ల మంటాడు. తన డబ్బుతో నిండిన పడవను కూడా ఆ చేపమీద పెట్టుకుంటాడు. త్రోవలో ఆ పడవను నడిపే వాళ్లిద్దరు వాళ్లను చంపి డబ్బు తీసుకుందామనుకుంటారు. కాని కిరణ్ ఆతని స్నేహితులూ, వాళ్లని చంపడానికి ఇష్టంలేని ఒకడి సహాయమువల్ల రక్షింపబడ్డారు.

అప్పుడు వింట్, నెల్సన్‌కీ, కిరణ్‌కీ తను అసలు ఆ దీవి ఎలా జేరుకున్నాడో చెప్పడం మొదలు పెట్టాడు.]

## వింట్ కథ

నేను మా యిల్లు విడిచి ఒక సంవత్సరం పైగానే ఐంది. ఒకసారి మా యింటికి (France లో) ఒక జ్యోతిష్కుడు వచ్చాడు. తగిన మర్యాదలు చేశాను. నన్ను చూస్తూనే యిల్లా అన్నాడు.

"ఆహా వింట్! నీ అదృష్టం అంటే అదే అదృష్టం!! అరె! ఏమని చెప్పేది నీ అదృష్టం!!!"

ఇన్ని సార్లు 'అదృష్టం—అదృష్టం' అని అన్న ఆయనతో ఇల్లా అడిగాను!. "అదృష్టం అంటున్నారుకదా! ఏమా అదృష్టం? సెలవిస్తారా?"

"దానికేమి? చెప్తాను విను. నీవు రేపే బయలుదేరి దక్షిణ అమెరికాకు పొయ్యా

వంటే— ఆహా! ఏమని చెప్పేది! ఆ కుబేరుడు కాడు—"

"అబ్బబ్బ! అదేమిటో అల్లా వర్ణించకపోతే చెప్పకూడదూ!"

"విను. అక్కడికి వెళ్లావంటే 'పారా' అనే రేవుంది. అక్కడ దిగి—మఱచాను—నీవు వెళ్లేటప్పుడు 4 బస్తాల బియ్యం తీసుకు పోవాలి—"

"బియ్యం! ఫ్రాంసులోనుంచి—4 బస్తాల—బియ్యం!! ఎల్లా తీసుకువెళ్లేది?"

"పోనీ, అదికాకపోతే రత్నాలు తీసుకెళ్లి—రేపే బయలుదేరాలి — వ్యాపారం చేశావంటే—పెట్టుబడి × పెట్టుబడి అంటే ఎంత పెట్టుబడి పెడ్తావో దానికి వర్గం——అంత లాభం వస్తుంది."

"అదెల్లాగండీ! పెట్టుబడికి అన్నిరెట్లు లాభమా?"

"మధ్యలో అల్లా అనకు. జ్యోతిష్కంలో అలాగ వుంది."

ఎవరికేనా డబ్బంటే ఆశ వుంటుంది కదూ! కాబట్టి మరుసటి రోజే బయల్దేరాలని అనుకొన్నాను. చాల లాభం వస్తుందికదా! అని ఆ జ్యోతిష్కునికి అప్పుడు నా దగ్గర వున్న డబ్బులో సగం ఇచ్చేశాను.

మరుసటి రోజే ప్రయాణం! సామాన్లంతా సిద్ధం చేసుకొన్నాను. రేవుకి వెళ్లి వ్యాపారపు టోడలో కూర్చున్నాను. ఓడ కాస్సేపటికి కదిలింది. నిశ్చలమైన అట్లాంటిక్ ఓషన్‌లో ప్రయాణం సాగిస్తూంది.

అప్పుడే ఓడలో కల్లోలం బయలుదేరింది. ఎవరిదో డబ్బులుంచిన పెట్టె పోయిందట! ఆ డబ్బుల పెట్టెని తీశాడని ఒకడ్ని పట్టుకున్నారు. కాని వాడు తియ్యనే లేదని సాధిస్తూన్నాడు. కాదంటే కాదని ఆ డబ్బును పోగొట్టుకున్న వారు అన్నారు.

"కావలిస్తే నా సామాన్లనంతా తనిఖీ చేసి చూడండి" అన్నాడు. వాని కేబిన్ (అంటే ఓడలో గది)లో దొరకలేదు. వాడు తీయలేదని ఋజువయింది.

"దొంగ నెల్లాగరా కనిపెట్టటం?" అని ఓడ అధికారి యోచిస్తున్నాడు. ప్రతి కేబిన్‌కి వెళ్లి తనిఖీ చేయాలని నిశ్చయించారు.

పిట్స్ అనే ఆయన వున్న కేబిన్‌లో మొట్ట మొదట తనిఖీ చేశారు. అక్కడ ఏమీ దొరకలేదు. ఇంకా అల్లాగే ఒక్కొక్క కేబిన్‌లో తనిఖీ చేస్తున్నారు. ఎక్కడా ఆ డబ్బుల పెట్టె దొరకలేదు. నా కేబిన్‌కి వచ్చారు. మూలలో వొక పెట్టె చూచారు.

"అందులో ఏముంది?" అని అడిగారు.

"రత్నాలున్నాయ్" అన్నాను.

"తాళాలియ్యి?"

"ఎందుకూ? నే నివ్వను."

"అల్లా అయితే ఆ పెట్టెలోనివి రత్నాలు కావన్నమాట"

"సందేహంగా వుంటే ఇదుగో తాళాలు." అని ఆ పెట్టె తాళాలు వాళ్లకిచ్చాను. తెరిచి చూచారు. అందులో రత్నాలున్నాయ్. ఇంకో మూలలో నా బట్టలుంచిన పెట్టె చూచారు. "ఆ పెట్టె తాళాలియ్యి ?" అన్నారు.

"మీతో పెద్ద తొందరగా వుందే! నేను నా కేబిన్ విడిచి, ఎక్కడికీ పోలేదు. నా మీద సందేహ పడొద్దు."

"అదంతా వీలుపడదు. తనిఖీ అంటే అన్నీ చూడాలి."

"సరే తీసుకోండి" అని ఆ తాళాలు వాళ్లకిచ్చేశాను. తెరిచారు. అందులో బట్టలున్నయ్. నా తాళాలిచ్చారు.

"ఇంకేమైనా సామాన్లున్నాయా ?" అన్నారు.

"నా బెడ్డింగ్ వుంది. ఈ కేబిన్‌లో వుండేవన్నీ నావే !"

"నీవేనా ?"

"అక్షరాలా నావే !"

"అదుగో ఆ టేబిల్ కింద వున్న పెట్టెలో ఏముంది ?"



"టేబిల్ కింద ! పెట్టె !! నాది కాదే !!!" అన్నాను ఆశ్చర్యం భయంతో.

ఎవరేనా ఇటువంటప్పుడు కాస్త తప్పు చేసిన వాళ్ల మల్లే కనబడ్తారు.

"ఈ కేబిన్‌లో వుండేవన్నీ నావే అని ఇప్పుడేకదా అన్నావు! ఇప్పుడా పెట్టె నీది కాదంటావే! మంచి దొంగవే! అన్ని రత్నాలుంచుకొని కూడా తృప్తి లేదే నీకు. ఎంత ధనం వున్నా తృప్తి వుండదని అన్నారు పెద్దలు ! అందులో తప్పులేదు ! ఊం ఒరేయ్, ఈయనకు సంకెళ్లు వేయండి అన్నారు.

"నాకు ఈ సంగతి తెలియదే! నే నెక్కడికీ పోలేదే! నా కేబిన్‌లోకి ఎల్లాగ వచ్చింది!"

"ఇది వేరే ఎత్తు ! చాలా నేర్పరి దొంగవే!"

"మీరు చాల అన్యాయంగా నన్ను పట్టుకున్నారు. నేరం ఋజువుకానిదే సంకెళ్లేలా వేస్తారు ?"

"హె-హె-హె-హె ! నేరం ఋజువు కాలేదట ! నీ టేబిల్‌కిందే దొరికింది. వేరే ఋజువేం కావాలి ?"

"నా టేబిల్ కింద దొరికితే నేనా దొంగను? ఇల్లాగే ఇంకెక్కడేనా న్యాయం తీర్పు చేయబోయేరు ! జాగ్రత్త !! నగుబాట్లకి లోనవుతారు !"

"నీ టేబిల్ కింద మరి యెవ్వరుంచుతారు నువ్వు కాకపోతే ! ఓహో ! ఒకవేళ ఆ పెట్టెకి నీ కేబిన్ నచ్చివుంటుంది. అంచేత ఎగురుకుంటూ నీ టేబిల్ కింద నివాసం ఏర్పఱచు

కొంది కాబోలు!" అని వాళ్లు హాస్యంగా మాట్లాడారు.

నా వళ్లు మండింది. "నా టేబిల్ కింద వేరే ఎవరేనా తెచ్చి వుంచకూడదా!" అన్నాను.

"ఎవరేనా వుంచారా? ఆ వుంచింది ఎవరో చెప్పు. అప్పుడు నిన్ను వదులుతాం."

"ఎవ్వరూ నా కేబిన్‌కి వచ్చినట్లు నాకు జ్ఞాపకం లేదు. నేను బాత్రూంకి పోయినప్పు డెవరేనా వుంచేరేమో!"

"నువ్వే వప్పుకున్నావుగా! నీ కేబిన్‌కి ఎవ్వరూ రాలేదని. పైపెచ్చు బాత్‌రూంకి వెళ్లి నప్పుడెవరేనా వచ్చేరేమో అంటున్నావ్! పోనీ అప్పుడైనా ఎవరేనా వచ్చారని ఋజువ్ చేయ్ చూద్దాం."

నాకేమీ తోచలేదు. ఆ రోజు జ్యోతిష్కు డన్నమాట డబ్బుకోసమే నని బోధపడింది. ఎన్నెన్ని తిట్టొచ్చో అన్నన్ని తిట్టేశాను. ఇంతలో ఎవరో వచ్చి సంకెళ్లు వేసేశారు. తల విధిని దాటటం మనకి తరమా?

కొన్ని రోజులయ్యాక నన్నొకరోజు జైలు నుండి డెక్ (అంటే ఓడలో వెలుపలి భాగం) వరకు పోడానికి అనుమతి ఇచ్చారు. హాయిగా ఆ డెక్కుమీదే వుండిపోవాలనుకున్నాను. అక్కడే వుండటానికి అనుమతి అడిగాను.

"డెక్కు దగ్గర చెరసాల లేదే" అన్నారు వాళ్లు.

"నాకోసం ఒకటి ఏర్పాటుచేయండి"

"చెఱసాలకాదు! చెక్క పెట్టెలో నిన్ను పెడ్తాం."

"ఓ రెడీ. డెక్కు దగ్గిర వుండాలి అంతే."

ఒక పెద్ద చెక్క పెట్టెని తీశారు. ఆ పెట్టెకు చుట్టూ గాలికూడా రాకుండా చెక్కలు బిగించి వున్నయ్. పైన మాత్రం తెరిచి వుంది. అదే నా చెఱసాల. పోనీ నా కోసం ఒక పని అయినా చేశారని తృప్తి అయింది.

ఓడ అమెరికాను సమీపిస్తోందన్నారందరూ. నాకు సంతోషమైంది. ఎంచేతంటే అమెరికాకు పొయ్యేవరకే నాకు శిక్ష! తర్వాత వదిలేస్తా మన్నారు. కాస్త సేపటికి ఏదో కల్లోలం బయలు దేరింది. ఈసారి యెవరి పెట్టి పోయిందో! ఎవరు దొరుక్కుంటారో అనుకున్నాను.

ఇంతలో ఎవరో డెక్ వద్దకి వచ్చారు. "ఏమండీ కల్లోలం?" అని అడిగాను. ఆయన బిక్క మొగంతో యిల్లా అన్నాడు.

"ఓడలో ఎక్కడో ఒక అతుకు వీడిపోయిం దట! ఇక నాల్గు గంటల్లో ఓడ మునగ గలద"ని వెల్లడించారు.

నా ప్రాణం పోయింది! నా రత్నాలంతా పోతాయే! నాకంటే రత్నాలెంత పుణ్యం చేశాయి! ఎంచేతంటే అవి యెక్కడ పుట్టాయో అక్కడికే వెళ్తాయి. రత్నాలు సముద్రంలో పుట్టాయ్. సముద్రంలోనే కలియ నున్నాయ్!

గంటగంటకీ కలవరం హెచ్చయింది. ఎంతో మంది రక్షక పడవల (Life Boat) పైన తప్పిం చుకు పోవాలని అనుకొన్నారు. ఓడ మునగ

పోతుంది. ఆ క్షణం ఎన్ని ప్రాణాలు సముద్రుడు మింగేస్తాడో! నా రత్నాలు పోయాయి కాని విపరీతం! నేను చెక్క పెట్టెలో వున్నాను కాబట్టి ఆ చెఅసాలే నాకు లైఫ్-బోట్ అయింది!

"సంసారమనే సముద్రానికి చెఅసాలే లైఫ్-బోట్ కాబోలు" అనుకున్నాను. నీటిలో వింతగా తేలిపోతున్నాను. అమెరికాను చేరిపోతా ననుకున్నాను. కాని పెట్టె ప్రక్క వేపుకి తిరిగి పోసాగింది. సంసారము—అనే సాగరం—ఇదేనేమో అనుకున్నాను. సముద్రాన్ని చూడాలంటే ఆ పెట్టెలో నిల్చుకోవాలి. ఆ పెట్టె ఎత్తు ఎక్కువ. కాబట్టి కూర్చుంటే సముద్రం కనబడదు.

4 రోజులైంది. ఏదేనా దీవి చేరితే బాగుణ్ణని తోచింది. అలా జరిగే సూచనలేవీ లేవు. తిండి లేదు—నీరసంగా వుంది ఒంట్లో!

ఒకరోజు దూరంగా ఏదో తెల్లగా కనబడింది. అది యేమో! అని ఆత్రం బయలుదేరింది. కాస్త సేపయ్యాక బాగా కనబడింది. అది ఒక ఓడ! నా ప్రాణం కుదుటబడింది. ఎల్లాగేనా ఆ ఓడలోకి ఎక్కాలనిపించింది. నా



చొక్కా తీసి ఓడ కొంచెం దూరంలో వుండగా గాలిలో ఊపాను.

ఆ ఓడలోని వాళ్లు నన్ను చూడలేదు. నా గొంతెత్తి చచ్చేవాడిలాగ "హెల్ప్ మీ—హెల్ప్ మీ—" అని అరచాను. వాళ్ల చెవుల్లో ఏముందో! వాళ్లకి నా కేక వినబడలేదు. అల్లాగే కాస్త సేపు అరుస్తూ నిలుచున్నాను. ఈలోగా ఆ ఓడ కొంచెం దగ్గరి కొచ్చింది కాబట్టి నా గొంతు వినపడ్డది వాళ్లకి. నన్ను చూచారు. బదులుకి వాళ్లు కూడా తెల్లగుడ్డ వూపేరు. నా ప్రాణం నిలిచింది. అమ్మయ్యా! అనుకొన్నాను.

"తా నొకటి తలిస్తే దైవం వేరొకటి తలిచిందే!" అరె! ఏమి! నా పెట్టె ప్రక్కకి తిరిగింది! దాన్ని నిలపటం ఎల్లాగ? అయ్యో! వేగంగా పోతూందే! ఛీ! దేవుడా!! ఇల్లా చెయ్యకపోతే నన్నప్పుడే చంపేయకూడదూ!" అనుకొన్నాను. ఇక ఓడయెక్కే ఆశ లేదు.

ఇంతలో దూరంలో చిన్న దీవి కనబడింది. పోనీ ఆ దీవిలో ఐనా దిగుదామంటే దైవ మనుకూలిస్తుందో లేదో! నేనేమీ ఆశ పెట్టుకో లేదు. బ్రతుకు జీవుడా అని పెట్టెలో కూలబడ్డాను. సుమారు ½ గంట అల్లా కదలకుండా కూచున్నాను. ఇంతలో అదురుబాటు కలిగింది. నించున్నాను.

ఓ దీవిని చేరాను. సంతోషంతో పెట్టె లోంచి దూకాను. దీవిలోకి దూకగానే ఆ దీవి కదలసాగింది. అప్పుడు నా కెట్లుండెనో మీరే

వూహించుకోవచ్చు! అది మనముండిన దీవి వద్దకు రాగానే ఆ దీవివాళ్లు వచ్చి ఆ చేపలాంటి పడవను లాగేరు. అప్పుడు బోధపడింది నాకు అది చేపకాదు చెక్కతో చేయబడినదని. ఆ దీవిలో చేరగానే నెల్సన్ కనిపించాడు. అరె! నీ వెల్లా వచ్చావో! అని నా కాశ్చర్యమైంది. అప్పుడే కదా మనం కలుసుకున్నాం. నెల్సన్! ఇక ఇక తన కథ చెప్పాలి! ఈ లోగా పడవ యెక్కడికి చేర్తుందో!"

(నెల్సన్ కథ వచ్చే సంచికలో)

★

# చీకట్లో పాపాయి

* వి. అపర్ణ *

నిన్ను చూచేదాక
నేనిలువలేను
నీవువచ్చేదాక
నేనుండలేను
ఈపొద్దు నీజాడ
లెందుబొయ్యాయి.

కనబడదు నీ వెలుగు
కనబడదు నీ సొగసు
ఈరేయి నీ రాకకై
దురుచూస్తున్నాను
దబ్బున్నరావోయి జాబిల్లీ
ఎప్పుడొస్తావోయి జాబిల్లీ.

నీ వెలుగు నీడల్లో
నిదుర పుచ్చేస్తావు
వెన్నెలల జల్లులో
ఆటలాడిస్తావు
ఈరోజు మారాతలేరాలపాలో
ఈపొద్దు మాకెట్ట తెల్లారుతుందో.

ఒకపొద్దు సన్నగా
ఒకపొద్దు లావుగా
ఒకపొద్దు పెద్దగా
విరగబడిపోతావు
ఈపొద్దు అసలు నీజాడ లేదాయె
ఈపొద్దు నీజాడ లెందుబొయ్యాయీ.

చుక్కలన్నీ నీ కొరకు
బిక్కు బిక్కంటూను
నింగినా నీ కొరకు
ఎదురుచూస్తున్నాయి
దయయుంచు మాపైన జాబిల్లి రేఖా
దబ్బునా రావోయి జాబిల్లి రేఖా.

చిన్నారిపాపాయి
చీకట్లో కూచొని
ఒంటరిగ ఒక్కతే
చుక్కల్లో చూస్తుంది
ఈచింత నీ కెందుకే ఓపాప
ఈ దిగులు నీ కెందుకే.

★

* సా ది సా ది సా ది *




* సా ది సా ది సా ది *

# అమృతాంజనము

గాని,

" యథాయథా.................కాళీధవళత్వ శంకయా."

అమృతాంజనమా ! నీ కీర్తి ముల్లోకములను దెల్పుజేయు పూనికతో పెరుఁగుచున్నప్పుడెల్లను, నా నల్లని ముంగురులు, దెల్లబడునేమోయను భయముచే నా హృదయము మిక్కిలి పరితాపమొందుచున్నది సుమా !!!

# బాలగేయము

శ్రీ బి. వి. నరసింహారావు

తప్పటడుగుల పాప
విప్పినా తెర చాప
ఊగుతూ, తూగుతూ
ఒయ్యార మొలుకుతూ,
సాగిపోయే తీరు
వేగమే కనరండు ॥త॥

కరములే చిరుతెడ్లు
కల కలలె తరగల్లు
చిరుతెడ్లు సాచుతూ
చిరుమాట లాడుతూ,
ఆగకే పయనించు
వేగమే కనరండు ॥త॥

అమ్మ, నాన్న, ప్రేమ
నందులో నాపిరి
అమ్ముటకు ఆ సరుకు
ఆనంద తీరాన
జాగు సేయక రండు
వేగమే కొని పొండు ॥త॥



# చిన్ని పువ్వా

* శ్రీ ఎస్. రాజేశ్వరరావు *

చిన్ని గాలికి తలను వంచి
పిన్న పెద్దలను గౌరవించి
ఎంతో సొగసును విరయబోసి
తుల్కు మంటావో చిన్ని పువ్వా!

నీరు నారు లేక నీవు
నిత్య శోభల పచ్చగుండి
అంత అందం దొరిగలించ
వింత సోయగమో చిన్ని పువ్వా!

తలను దాల్పరు, కన్నెత్తి చూడరు
కాళ్ల క్రింద నలుగుతావు
కంటి కెప్పుడు ఇంపుగాను
జాలి పొందిస్తావో చిన్ని పువ్వా!

నిన్ను చూచి తృప్తి పడిమెదు
ఒక్క నరుడూ ఇందున లేడు
ఎందు కంత హాయలుతోడ
ఒయ్యార మొలకిస్తావో చిన్ని పువ్వా!



# శాసన సభలు—స్త్రీ అభ్యర్థినులు

(40వ పేజీ తరువాయి)

## శ్రీమతి అమ్మన్న రాజా,

బి.ఏ., ఎల్.టి., ఎమ్.ఎల్.ఏ.

ఈమె ఏలూరు నియోజక వర్గమునుండి పార్లమెంటుకు కాంగ్రెసు అభ్యర్థినిగా పోటీ చేయుచున్నారు.

ఈమె ఉపాధ్యాయినిగా మద్రాసు రాష్ట్రంలోను, సికంద్రాబాదులోను పెక్కు బాలికా పాఠశాలలయందు ఉద్యోగము చేసిరి. మహిళా ఉద్యమములోనూ, విద్యా సంస్కరణలోనూ యీమెకు మిక్కిలి శ్రద్ధ—చిన్నప్పటి నుండి కాంగ్రెసువాది, అతిబాల్యమునుండి గాంధీజీ ఆదేశాల ననుసరించి, ఖద్దరే ధరిస్తూ ఉండేవారు. 1937లో ఉపాధ్యాయినీ వృత్తినుండి విరమించి, రాజకీయాల్లో జొరబడ్డారు. ఏలూరు పట్టణ స్త్రీ నియోజక వర్గమునుండి కాంగ్రెసు అభ్యర్థినిగా ఎన్నుకోబడ్డారు. 1940 వ్యక్తి సత్యాగ్రహంలోను, 1942 క్విట్ ఇండియా ఉద్యమంలోనూ పాల్గొని, కారాగార శిక్ష ననుభవించారు. 1946లో తిరిగి, ఏలూరు పట్టణ స్త్రీ నియోజక వర్గమునుండి కాంగ్రెసు అభ్యర్థిగా ఎన్నుకొనబడ్డారు. ఎస్సెంబ్లీకి డిప్యూటీ స్పీకరుగా నియమింప బడ్డారు—అనేక ప్రభుత్వ కమిటీలలో సభ్యురాలుగాను, ఆంధ్ర విశ్వ కళా పరిషత్తు సెనేట్ సభ్యురాలుగాను వ్యవహరిస్తున్నారు. ముక్కుకు సూటిగా పోయే కాంగ్రెసువాది.

యీమె ఏలూరు నియోజకవర్గమునుండి పార్లమెంటు సీటుకు కాంగ్రెసు అభ్యర్థిగా పోటీ చేస్తున్నారు.

## శ్రీమతి ఆదిపూడి శకుంతల బి.ఎస్.సి., బి.టి;

మదరాసు మైలాపూరు నియోజక వర్గమునుండి, రాష్ట్ర శాసన సభకు నిలచుచున్న స్వతంత్ర అభ్యర్థి.

ఈమె స్వర్గీయ ఆదిపూడి సోమనాథరావుగారి కుమార్తె. త్యాగరాయనగరు శారదా విద్యాలయంలో 11 సం॥లుగ ఉపాధ్యాయినిగా నున్నారు. అచటి విద్యా శాఖ తరఫున అనేక నిర్వాహక సంఘములలో నున్నారు. బాలభట సంఘ కార్యక్రమములో లీడర్‌గా, ఆర్గనైజర్‌గా, మిక్కిలి ఉత్సాహముతో పాల్గొనుచూ, బాలబాలికలను ఉత్తమ పౌరులుగా చేసెడి పౌరశిక్షణ కార్యక్రమంలో ఎక్కువగా కృషి చేసినారు. ప్రతి పాఠశాలలోనూ యీ కార్యక్రమము అమలు జరుపు నిమిత్తము, ఊర ఊర కాంపులు ఏర్పాటుచేసి, అచటి ఉపాధ్యాయినీ ఉపాధ్యాయులకు పౌరశిక్షణా కార్యక్రమమును అమలులో పెట్టు పద్ధతులను నేర్పుచూ, శక్తి వంచనలేక పనిచేసిరి. తమ విద్యార్థినుల లోనేగాక, పై కార్యక్రమములవల్ల పట్టణ పౌరులలో ఎక్కువగా పలుకుబడిని సంపాదించుకున్నారు. ఇంతకు పూర్వము రాచకీయాలతో అంత సంబంధము లేకున్నా, కలిగించుకున్న లోకజ్ఞానంతో, సంపాదించుకున్న ప్రజాభిమానంతో, తమలో గల ఆత్మశుద్ధి, కార్యదీక్షలతో, ప్రజా సామాన్యాన్ని, రాచకీయ రంగంనుండి సేవించగలనని ఎక్కువ ఉబలాటపడుతున్నారు. మదరాసునుండి నిలచుచున్న ఆంధ్ర యువతి యీమె ఒక్కరే! ఈమె గుర్తు దీపము.

## శ్రీమతి రాజ్యం సిన్హా

విజయవాడ పార్లమెంటు నియోజకవర్గ కాంగ్రెస్ అభ్యర్థిని. ఈమెను గూర్చి విజయవాడ పార్లమెంటరీ నియోజకవర్గ ఎన్నికల ప్రచార కమిటీవారు యీ క్రింది ప్రకటనను చేసినారు.

శ్రీమతి రాజ్యం సిన్హా ఇంగ్లీషు, హిందీ, బెంగాలీ, తెలుగు భాషలలో ప్రావీణ్యంగల విద్యావతి. ఆంధ్ర దేశంలో స్త్రీ జర్నలిస్టు రాజకీయ వార పత్రికను నడిపే గౌరవం ప్రప్రథమంగా ఆమెకే లభించినదని చెప్పవచ్చును. విజ్ఞానాన్ని కలుగజేసే వ్యాసాలు, నిష్పాక్షికమైన సంపాదకీయాలుగల పత్రికగా 1946—48 సంవత్సరాలలో యీ పత్రిక ప్రసిద్ధికెక్కింది. ఈ కొద్ది కాలంలోనే ఆంధ్ర దేశంలో 42 ఉద్యమము, ఆ ఉద్యమంలో పాల్గొన్న వీరుల చరిత్ర వివరాలన్నింటినీ సేకరించి ఎంతో శ్రమతో 1942 విప్లవ ప్రత్యేక సంచికను ఆమె ప్రచురించింది.

తన ఉన్నత విద్యకై రవీంద్రుని విశ్వభారతికి వెళ్లడంతో ఆమె రాజకీయ జీవితం ప్రారంభమైంది. అక్కడ వున్న నాలుగు సంవత్సరాలలో సంఘ సేవలో ఆమెకు గల ఆసక్తి ద్వారా అచ్చటి పెద్దలందరి అభిమానానికి పాత్రురాలు కాగలిగింది. 1942 ఉద్యమంలో అచట పాల్గొన్నది.

శాంతినికేతనంలో పట్టభద్రురాలయిన తర్వాత ఆంధ్ర దేశానికి తిరిగివచ్చి జాతీయ ఉద్యమంలో చురుకుగా పని ప్రారంభించింది. విద్యార్థి ఉద్యమాన్ని నిర్మించడంలోను, 1946 ఎన్నికల సందర్భంలోను, ఆంధ్రదేశమంతటా, పెద్ద పెద్ద బహిరంగ సభలలో ఉపన్యసిస్తూ సంచారం చేసింది.

స్త్రీ ఉద్యమం విషయంలో ఆమెకు ప్రత్యేక ఆసక్తి కలదు. రాష్ట్రవిద్యార్థి కాంగ్రెసుకు ప్రచారక కార్యదర్శి గాను, ఆంధ్రరాష్ట్ర మహిళా కాంగ్రెసుకు ప్రధాన కార్యదర్శి గాను పని చేసింది. ఈ మహిళా సంఘం యాజమాన్యాన మద్రాసులో ఒక మాసం రోజులు రాజకీయ కళాశాలను ఎంతో సమర్థతతో నిర్వహించింది. 1949 వ సంవత్సరంలో ఆంధ్ర రాష్ట్ర మహిళాసభ శాఖయైన కృష్ణా జిల్లా సంఘ సాంవత్సరిక సమావేశానికి అధ్యక్షత వహించి ఆ సంఘానికి అధ్యక్షురాలయింది. సాంఘిక, రాజకీయ విషయాలలో ఆమెకు అభ్యుదయ భావాలు కలవు. హిందూ కోడ్ బిల్లు చట్టం కావాలనీ తీవ్రంగా వాంఛించే మహిళ.

నిరాడంబరమైన దేశసేవ, త్యాగం చేస్తూ వచ్చిన కుటుంబంలో ఆమె జన్మించింది. కృష్ణా జిల్లాలో ప్రముఖ కాంగ్రెసు నాయకులు శ్రీ అన్నే అంజయ్యగారి కుమార్తె. ఆమె భర్త శ్రీ విజయకుమార్ సిన్హా. వీరు బెంగాలు విప్లవకారులు. స్వర్గీయ భగవత్ సింగ్ సహచరులు. అఖిల భారత ప్రసిద్ధిగాంచిన లాహోరు కుట్ర కేసులో ఆయనకు 20 సంవత్సరాలు శిక్ష విధించబడింది. 15 సంవత్సరాలు జైలు జీవితం గడిపారు.

శ్రీమతి రాజ్యం సిన్హా అభ్యుదయ ఆశయాలతో పార్లమెంటరీ రంగంలో పని చేయుటకు సమర్థురాలు. జాతీయ సమస్యలను చక్కగా అవగాహన చేసుకోవడమే గాక, ఈ విశాల దేశముయొక్క సామాన్య స్త్రీ, పురుషుల అభివృద్ధి కొరకు కృషి చేయాలనేది ఆమె కోరిక.





### మదరాసు డిప్యూటీ మేయరు

## శ్రీమతి అహల్యా సంతానంగారు

కీ. శే. శ్రీ. సి. ఎన్. రామయ్యగారి కుమార్తె, శ్రీ సంతానం, ఎడ్వొకేటుగారి భార్య. వయస్సు 35 సం॥ లే అయినా, నగరంలో సంఘసేవ చేయువారిలో పెద్దలుగానే పరిగణింపబడుతున్నారు.

1947 సం॥ న, మైలాపూరు స్త్రీల ప్రతినిధిగా, పుర పాలక సంఘానికి ఎన్నుకోబడ్డారు. తరువాత, ఆరోగ్య శాఖ స్థాయిసంఘ సభ్యురాలుగా, కృష్ణాంపేట కుష్ఠు రోగుల ఆశ్రమానికి ప్రత్యేక పరిశీలకురాలుగా, నగర రేషనింగు సలహా సంఘ సభ్యురాలుగా, మద్య నిషేధ సభ్యురాలుగా, బహు ముఖంగా సేవచేశారు.

కార్పొరేషనులో, స్త్రీల ప్రాతినిధ్యానికి, నగరంలో, స్త్రీల సౌకర్యాలకీ, చక్కగా కృషి చేసి, తమ పదవీగౌరవాన్ని సార్థకపరచుకుంటారని నమ్ముచున్నాము.

# సభలు, సమావేశాలు

## స్త్రీల కుద్యోగాలు పెండ్లియైన తర్వాతగాదు.

## మద్రాసులో చర్చ

బ్రిటిష్ కౌన్సిలు ఆవరణలో యీ నెల 11వ తేదీని స్త్రీల వైవాహికానంతర జీవిత చర్యను గూర్చి చర్చ జరిగింది. సభకు బ్రిటిషు కౌన్సిలు ఛయిర్మను సర్ రోనాల్డు ఆడముగారు హాజరయ్యారు. యీ చర్చలో కాలేజీ విద్యార్థులు—స్త్రీలు, పురుషులు పాల్గొన్నారు. "తమ కాలము నంతయు బయట గడిపే పనులలో పెండ్లియైన స్త్రీలు ప్రవేశించరాదను నిర్ణయము బహు జనాంగీ కృత మైంది.

మద్రాసులోనున్న క్వీన్ మేరీ కాలేజీ విద్యార్థిని శ్రీమతి వత్సల అప్పదొరై గారు చర్చ ప్రారంభిస్తూ,

స్త్రీలు తమ కాలమునంతా కుటుంబానికీ తమ సంతాన సక్రమ పోషణానికీ వినియోగించవలసి యుంటుం దనీ, అటువంటప్పుడు తాము తమ జీవితాలని యితర వృత్తులలో గడిపితే, గృహ శాంతి కూర్చే వైవాహిక ప్రథమ బాధ్యతనుంచే తొలగి పోయినవారగుతున్నారనీ వాదించారు.

ఇంజనీయరింగు కాలేజీ విద్యార్థి ఇస్మాయిలు సులే మానుగా రామెను బలపఱచారు. పురుషుల ఉద్యోగ క్షేత్రాలలోకి స్త్రీలు చొరబడ్డం విపత్కర మన్నారు.

ఆధునిక ప్రపంచమందు వివిధ శాఖలలోనూ పురుషులతో బాటు స్త్రీలూ సమర్థులగా నున్నారని స్పష్టపడుతో న్నప్పుడు స్త్రీల స్థితిని గూర్చి యింకా ప్రాత పుంతలలో ప్రాకులాడటం యీ నాడు తగదని స్టెల్లా మేరీ కాలేజీ విద్యార్థిని మిస్ తమ్మ రాజాబీ తీర్మానాన్ని వ్యతిరేకించారు. స్త్రీలలోని ఉత్కృష్ట గుణరాశిని వృథా చేయకుండా జాతీయ పురోభి వృద్ధికి తమ సేవల నన్ని మార్గాలా వినియోగించవలె నన్నారు. గృహ సౌఖ్యానికి స్త్రీలు కూడ నేటి ప్రపంచంలో ఆర్జించవలసి యుంటుందన్నారు. ఇల్లు విడచి యితరత్రా పనుల చేయడంవల్ల వారు వారి ధర్మాలను తప్పుటలేదనీ, వారి వారి సంతానాలిని యుపేక్షించుట లేదనీ తెల్పుచు వారి యార్జన కుటుంబ ఆర్థిక స్థితిని చక్క బఱచుచున్న దన్నారు.

లయోలా కాలేజీ విద్యార్థి అల్ఫ్రెడ్డుగారు వారిని బల పఱచారు.

వైవాహిక జీవితము పురుషులతో సమ భాగ జీవిత మవడంచే స్త్రీలు కుటుంబాభి వృద్ధికి ఆర్థికంగా తోడ్పడా లనీ, అందుచే స్త్రీలు తమ జీవికకు ఇళ్లు విడచి యితర తావుల సంపాదించుకోవడము తప్పు గాదని, వుమన్ వెల్ఫేరు డిపార్టుమెంటు డైరక్టరుగారైన శ్రీమతి పారిజాతము నాయుడు గారన్నారు.

తర్వాత తీర్మానమును వోటుకు పెట్టగా నెగ్గింది.

స్త్రీలు ఉద్యోగముల చేయుటవల్ల వారి వారి కుటుంబాల మీద వారికి శ్రద్ధ తగ్గదు. పై పెచ్చు వారి దృక్పథము విశాలమై ప్రపంచములోని విభిన్న విషయాలతో సంబంధము గల్గి వారి గృహాల కాసించి వారి బిడ్డల విద్యావంతులనుగా చేయడానికి తోడ్పడుతుందనీ, నలు ముఖాలా విజ్ఞానాభి వృద్ధి నందే యీ రోజులలో స్త్రీలు మునుపటి వలె యింటి నంటి పెట్టుకొని యుండకయున్న గడవబోదనీ సభాధ్యక్షు రాలైన శ్రీమతి సబర్ పార్థసారథి గారన్నారు. స్త్రీలకు ప్రత్యేక వ్యక్తిత్వమున్నది. వారు కుటుంబ సౌఖ్యా భివృద్ధికేగాక రాచకీయ రంగములోగూడా యెంతో పని చేయవలసి యుంటుంది. కాని అనుకూల జీవిత మెట్టిది యవలంబించవలసి యుంటుందో వారు గమనించవలసి యుంటుందని వారన్నారు.

[విద్యావతులైన స్త్రీలు, గృహిణులై ఉద్యోగముల నిర్వహించుచున్న స్త్రీలు, పై చర్చనాంశమును గూర్చి స్వానుభవముతోగూడిన వారి అభిప్రాయములను పంపిస్తే ప్రచురిస్తాము. ॥సం॥]

* * *

## అఖిల భారత మహిళా సంఘం

మద్రాసు శాఖవారు, మద్రాసు డిప్యూటీ మేయర్ శ్రీమతి అహల్యా సంతానంగారి గౌరవార్థం, 17-12-51 నాడు, సర్వెంట్సు ఆఫ్ ఇండియా సొసైటీ ప్రాంగణములో, ఒక అల్పాహార విందు జరిపినారు. తదనంతరం జరిగిన సమావేశములో, అధ్యక్షులు శ్రీమతి ముత్తు లక్ష్మిరెడ్డిగారు శ్రీమతి అహల్యగారిని అభినందిస్తూ, నర్సరీ స్కూల్సు, స్త్రీల సంస్థలు, గ్రంథాలయాలు మున్నగువానిని గూర్చి తగిన శ్రద్ధ వహించవలసినదిగా కోరినారు. తమ ధర్మాన్ని శాయశక్తులా నిర్వహిస్తానని శ్రీమతి అహల్యగారు బదులు చెప్పినారు.

* * *

## మదరాసులో 100కి 40 మంది ఆంధ్రులు

అయితే ఆంధ్రులకై ప్రత్యేకంగా రెండు స్కూళ్లే ఉన్నాయేం? రాయపేట స్లమ్సులో 10 వేల తెలుగు మంది హరిజనులున్నారు. హరిజన నిధికై వసూలు కాబడ్డ కోట్ల కొలది రూపాయిలేమయ్యాయి? తేనాంపేట ప్రాంతంలో స్వచ్ఛమైన తెలుగు మాట్లాడే జనాభా 4000 మందైనా ఉన్నారు. వీరి పేర్లు ఓటర్ల జాబితాలో కెక్కించటానికి ఏ ఆంధ్రుడైనా పూనుకొన్నాడా?

ఇవి, వై. ఎమ్. సి. ఏ—ఆంధ్ర విజ్ఞాన పరిషత్సభ్యుల ముందుపన్యసిస్తూ, నవంబరు 11వ తేదీన శ్రీ ప్రత్తిపాటి సత్యనారాయణరావుగారు ఆంధ్ర నాయకులకు వేసిన ప్రశ్నలు. పై సమస్యల నన్నింటినీ సమదృష్టితో పరిశీలించి, రాష్ట్రంలోని జనాభా కంతటికీ అన్ని విషయాలలోనూ సమాన న్యాయాన్ని సమకూర్చ గలిగిన దక్షతకల నాయకుల్నీ, స్వార్థానికని ఆంధ్రత్వాన్ని అమ్ముకొనని నాయకుల్నీ, శాసన సభలకు ఎన్నుకోవాలనీ, ఆ విధమైన విజ్ఞానమూ చైతన్యమూ, ఆంధ్రులలో కలిగించే బాధ్యతను యీ పరిషత్తు పూనుకోవాలనీ, శ్రీ సత్యనారాయణగారు హెచ్చరించినారు.

అదే సభలో శ్రీ కల్నల్ శాస్త్రిగారు ప్రసంగిస్తూ, మదరాసుమీద ఆంధ్రులకు గల హక్కు వదులుకోమనటానికి ఏ ఒక్క నాయకునికీ అధికారములేదనీ, 400 సంవత్సరాల నుండి మదరాసులో నివసిస్తూ, అనేక ధర్మ సంస్థలను నిర్మించినది ఆంధ్రులేననీ, రాష్ట్ర విభజన సమస్య ఒకమూల వివాదములో పడియుండగానే, అనేక క్రొత్త క్రొత్త సంస్థలు, పెద్ద పెద్ద భవనాలు, రాష్ట్ర ప్రభుత్వము ఒక ప్రక్క మదరాసులో నిర్మిస్తూ ఉండి, 100 కోట్ల రూపాయలు విలువగల ప్రభుత్వ సంపదగల యీ రాజధాని నగరానికి నష్టపరిహారంగా ఒక కోటి రూపాయలు ఆంధ్ర రాష్ట్ర రాజధాని నిర్మాణానికిచ్చే తీర్పు చరిత్రలో కని విని ఎరుగనిదనీ, కేవలం స్వార్థానికై పెనుగులాడే అల్పబుద్ధి గలవారు అధికారం చెలాయించే దురదృష్టం ఆంధ్రుల తలవ్రాతై కూర్చున్నదనీ, విమర్శిస్తూ, ఆంధ్ర జాతి నశించకుండా, స్వరాష్ట్ర నిర్మాణానికీ, ఆంధ్ర ప్రాచీన కళా పునరుజ్జీవనానికీ, తోడ్పడవలసిన బాధ్యత పరిషత్తు వారిదేనని చెప్పారు.

శ్రీ పందిరి మల్లిఖార్జునరావుగారు ప్రసంగిస్తూ, ప్రస్తుతంలో రాష్ట్ర నిర్మాణం జరిగే భాగ్యమే ఆంధ్రులకు కలిగితే, ఇక గతాన్ని గూర్చి నిరుత్సాహపడకుండా, మన నిర్మాణాన్ని అభ్యుదయకరంగా కొనసాగించుకో గలమని పరిషత్సభ్యులను హెచ్చరించారు.

అధ్యక్షులైన శ్రీ కొంఠి రామమూర్తిగారు స్వేచ్ఛ, సంపద, మానవ జీవితాని కత్యంతావశ్యకములనీ, ఆంధ్ర రాష్ట్ర నిర్మాణమూ తదనంతరం, ప్రాజెక్టుల నిర్మాణమూ, ఆంధ్రుల కట్టి స్వేచ్ఛ సంపదల నొనగూర్చగలవనీ చెప్పినారు.



## ఆంధ్ర మహిళా సభ

మైలాపూరు (రిజిష్టర్డు) మదరాసు-4

### సర్వసభ్య సమావేశము

ఆంధ్ర మహిళాసభ సర్వసభ్య సమావేశము ది 7-1-'52, సోమవారము, సభా భవనములో సరిగా 3-30 గం||లకు జరుగును.

విషయములు

1. సభ్యురాండ్ర ఫోటో.
2. శ్రీమతి దుర్గాబాయమ్మగారికి, పర్సు సమర్పించుట.
3. కార్య నివేదిక.
4. వివిధ శాఖల జమా ఖర్చుల నామోదించుట.
5. నూతన కార్యనిర్వాహక వర్గపు ఎన్నికలు.

అ. చన్నఘంటమ్మ.

జ. జమునాబాయి,

కార్యదర్శినులు.




## ‘నవ భారతేతిహాసము’ అను ‘ఓటు పురాణము’

శ్రీమతి కనుపర్తి వరలక్ష్మమ్మగారిచే రచింపబడినది. రచయిత్రిపేర బాపట్ల వ్రాసిన దీనిని పొందగలరు. వెల రు. 0-6-0 లు మాత్రమే.

ఈ నాటి యెన్నికల సంరంభములో ప్రజా ప్రబోధకము కొఱకు వ్రాయబడ్డ యీ పురాణము నియోజక వర్గమునందలి ప్రతి సీమలోనూ కాలక్షేపము చేయదగ్గది. సమర్థుడగు పౌరాణికుడున్న బుర్ర కథలకన్నను విశేష జనాకర్షణీయములు పురాణ పఠనములు. శ్రీమతి వరలక్ష్మమ్మగారు మన యధునాతనేతిహాసమును సంక్షిప్తముగా చక్కని పురాణ శైలిలో రచించినారు.

భారత దేశము పారతంత్ర్య శృంఖలములలో దగుల్కొన్న హేతువు :—

తే॥గీ॥ గండ్రగొడ్డలి పదునెంత గల్గియున్న,
కొయ్యపిడిలేక కొయ్యను గొట్ట గలదె?
స్వీయ జనులలో కొందరు హేయ భంగి
వైరి పక్షంబు కుటిలులై చేరకున్న
నవని నే దేశమైనను నక్రమముగ
శాత్రవాధీన మగుట సంభవిలునె!

యను సత్యమును చక్కగ వెలువరించిరి. ఇక్కడ సమర్థుడగు పౌరాణికుడు సంయుక్త వివాహ ఘట్టము, మరెన్నియో చరిత్రాంశములగువాని నుపకథలగా జేర్చి రసవంతముగా చేయవచ్చు—వర్తక వ్యాజమున ఆంగ్లేయులీదేశములో కాలిడుట, రాజ్యము సుస్థిరము గావించుకొనుట, శ్రీ తిలకు మొదలగు మహానాయకులు ప్రజలలో స్వాతంత్ర్య వాంఛ రేకెత్త ప్రబోధము చేయుట, మహాత్ముని దివ్యబోధల జాగరితంబైన భారత జాతి స్వాతంత్ర్యము నందుట, పదంపడి దేశములో పోరుపులు పుట్టి నొక మతోన్మాది మహాత్ముని తుద ముట్టించువరకును గల గాథ గలది పూర్వ భాగము.

“కం॥ మన దేవుడు మన యేలిక
మన జనకుడు గురుడు హితుడు మాన్యుడు జగతిన్
మనగాంధి మహాత్ముడకట
మనలను విడనాడి చనియె మనపాపమునన్

కం॥ మన భారతి ప్రియ తనయుడు
మన జాతికి జీవగఱ్ఱ మన నేత యహో
మన పాలి కల్ప వృక్షము
మనలను విడనాడి చనియె మను టెట్లో యికన్॥”

అను పద్యములు భాగవతములో శ్రీకృష్ణ నిర్వాణమును గూర్చి అర్జునుడు చెప్పినవానిని మరుపునకు దెచ్చుచున్నవి.

వోటన నేమొ, అది ప్రజా ప్రభుత్వము నెట్లు సమకూర్చునో, పూర్వ పరిపాలకులు ప్రజాభిప్రాయమునకు భిన్నముగా ప్రవర్తింప లేదన్నది, వోటు సమగ్ర వృత్తాంతము, వోటరుల లక్షణములు, స్త్రీలు గూడ రాజ్యాంగములో పాల్గొనవచ్చునన్న సంగతి, వోటు నర్థించు అభ్యర్థుల మాయా వాగురులకు జిక్కుకొనక, వారు చూపు నాశలకు వశులుగాక, ధైర్యముతో, త్యాగ బుద్ధితో, వోటును దేశ హితార్థము, ప్రజాహితార్థము సమర్పించవలె” నను హెచ్చరిక మొదలగు విషయములు గలది రెండవ భాగము.

యీ చిన్న పుస్తకము 20 పుటల మించియుండక పోయినను, ధీశాలియైన పౌరాణికుడు గంటలకొలది దీనిని పురాణముగా చెప్పగలట్టుగా నెన్నియో ఘట్టముల కల్పించుకొనుట కిందవకాశము నిచ్చిరి.

“దీనా”

Edited and published by G. Durgabai, M.A., B.L., at the Andhra Mahila Sabha, Mylapore, Madras
Printed by M. Satyanarayana at the H. Prachar Press, 12, Thanikachalam Chetty Road, T'Nagar, Madras.



# ఆంధ్ర మహిళా ప్రెస్

ఆంధ్ర మహిళా సభ వారిచే స్వంతంగా స్థాపించబడినది

## ఆంధ్ర మహిళా ప్రెస్

ఇక్కడ

గ్రంథములు, కరపత్రములు, రసీదులు, ఆహ్వాన పత్రికలు మొదలగునవి

తెలుగు, ఇంగ్లీషు భాషలలో ముద్రించబడును

విద్యార్థినులకు ప్రెస్ పనులు నేర్పుటానికి కావలసిన ఏర్పాటు చేయబడినది

*

మీ అచ్చుపనులు ఆంధ్ర మహిళా ప్రెస్‌లో చేయించితే

సంస్థకు సహకరించిన వారవుతారు

○

ఇతర వివరములకు : ప్రెస్ మేనేజరు, ఫోన్ నెం. 86322

14, ద్వారక, మైలాపూరు, మద్రాసు-4

---

# ఆంధ్ర మహిళా సభ

స్త్రీల విద్యా, విజ్ఞాన, సాంస్కృతిక, ఆర్థికోన్నతికై 10 సం॥ పైగా

కృషి చేయుచున్న జాతీయ సంస్థ

ఇందు

| | |
|---|---|
| విద్యాశాఖ | ఆంధ్రమహిళ పత్రిక |
| పారిశ్రామికశాఖ | నర్సింగ్ హోమ్ |
| కళాశాఖ | ముద్రణశాఖ |

సారస్వత, క్రీడా, గ్రంథాలయ, క్లబ్బుశాఖలు

సభ్యురాండ్రుగా చేరి యీ సేవాసంస్థను పోషించండి

—ఆంధ్ర మహిళా సభ

**Wrapper Printed at Andhra Mahila Press, 14, Dwaraka, Mylapore, Madras-4.**





భానుమతి
నాగేశ్వరరావు
శ్రీరంజని (జూ)
రేలంగి
శివరావు
సి.యస్.ఆర్.
&
ముక్కామల
నటించిన

భరణీ వారి

# ప్రేమ

డైరెక్షన్.... రామకృష్ణ

మ్యూజిక్... సుబ్బరామన్.. ఫోటోగ్రఫీ.. కమల్ ఘోష్
రచన...గోపాలరాయ శర్మ....ఆర్టు...కె.నాగేశ్వరరావు

స్టూడియో
వాహిని



ఆంధ్ర, సీడెడ్ అండు నైజాం :
ది పూర్ణా పిక్చర్స్ లిమిటెడ్,
విజయవాడ.



మైసూర్ అండు కూర్గు :
డ్రీమ్ లాండ్ పిక్చర్స్ కార్పొరేషన్,
బెంగుళూరు సిటీ.

ఇతర వివరములకు: భరణీ పిక్చర్స్, మద్రాసు - 17.

# నేడు మీరు మెక్లీన్‌తో పళ్లు తోముకున్నారా?



మెక్లీన్స్ పెరాక్సైడ్ టూత్ పేస్టు మీ పళ్లను తెల్లగాను, చిగుళ్లను ఆరోగ్యవంతంగాను, శ్వాసను పరిమళభరితంగాను ఉంచుతుంది ఇది వీటి నన్నిటినీ ఏకకాలంలోనే సమకూర్చుతుంది.

మెక్లీన్స్ పెరాక్సైడ్ టూత్ పేస్టులో అనేక పదార్థాలు సరియైన పాళ్లలో చక్కగా సమ్మిళితమొనర్చబడినవి గనుక అవి నోటిలో బయలుదేరే హానికరమైన ఆమ్లాలను విరిచివేసి, దంతక్షయాన్ని నివారించి, మీ పళ్లమీద ఏర్పడే అసహ్యకరమైన మరకలను తొలగిస్తాయి. నేడే ఒక మెక్లీన్స్ పెరాక్సైడ్ టూత్ పేస్టు ట్యూబునుకొని మీ పళ్లను నిత్యం – రెండుసార్లు తోముకోండి.

**నేడే మెక్లీన్స్‌ను కొనండి!**

"... ప్రశంస లెవరికి.
చెరాలో నేను చెప్పుకతప్పదు
అనేక సంవత్సరాలుగా మెక్లీ
న్స్‌నం వాడుతున్నాను. అందు
వల్లనే నాం పళ్లు ముత్యాల
వలె రమ్యంగా ఉన్నాయి"




వ్యాపార వివరణకు వీరికి వ్రాయండి :— జె. యల్. మోరిసన్, సన్ అండ్ జోన్స్ (ఇండియా) లిమిటెడ్., మహాలక్ష్మి ఆలయమునకు ఎదురుగా, వార్డెన్ రోడ్, బొంబాయి 26.

ఈమె సిఫారసు



లోధ్ర



నారీమణులకు

దివ్యౌషధము

ఋతుబాధల తొలగించును

గర్భస్రావముల నరికట్టును

వంధ్యత్వము రూపుమాపును

కేసరి కుటీరం లిమిటెడ్.,
మద్రాసు 14

ఒరిస్సా, నైజాము, ఆంధ్ర, తమిళ, జిల్లాల

ఏజంట్లు :

శ్రీ సీతారామ జనరల్ స్టోర్సు

బరంపురం, సికింద్రాబాద్, బెజవాడ,

మధుర.

వారి ఆనందానికి
అసలు కారణం



పండిత డి. గోపాలాచార్యులవారి

జీవామృతం

నిత్య వ్యవహారాలలో

నీరసించిన తండ్రికి

జబ్బునుంచి

కోలుకొంటూఉన్న తల్లికి

దినదిన ప్రవర్ధమానమౌతూవున్న

బాలునకు జీవామృతము

బలోత్సాహాలను యిస్తూవున్నది



ఆయుర్వేదాశ్రమం లిమిటెడ్
మదరాసు 17.

# ఆంధ్రమహిళ

సంపుటి 8 :: ఫిబ్రవరి 1952 :: సంచిక 9

ముఖచిత్రం : కవితా ప్రసన్నం
చిత్రకారుడు : శ్రీ ఎల్. ఎమ్. బాబూ.




సంపాదకురాలు : శ్రీమతి దుర్గాబాయి, యం.యే., బి.యల్.
సహసంపాదకురాలు : శ్రీమతి చన్నఘంటమ్మ, యం.యే., యల్.టి.

ఆంధ్ర మహిళా సభ, మైలాపూర్.

సంవత్సర చందా :: ఆరు రూపాయలు




సంపుటి 8 ఫిబ్రవరి 1952 సంచిక 10

# ఇక మీద

భారత దేశానికి స్వాతంత్ర్యము వచ్చింది. భారతదేశ రాజ్యాంగం రచించుకున్నాము. దాని ప్రకారంగా, మన దేశం ఒక సర్వతంత్ర ప్రజా స్వామ్యంగా అవతరించింది. ఇదంతా ఒక ఐదేళ్లలోగా జరిగిపోయింది.

ప్రస్తుత ప్రపంచ పరిస్థితులలో, క్రొత్తగా బానిస శృంఖలాలు విదుల్చుకొన్న యే రాజ్యం గాని, ఐదేళ్ల స్వల్పకాలంలో నిర్వహించగలిగే కార్యక్రమం అతి స్వల్పం—వైజ్ఞానికంగా, పారిశ్రామికంగా, సర్వవిధములా ఉన్నత స్థితిలోనున్న పెక్కు స్వతంత్ర రాజ్యాలే, వర్తమాన కల్లోలిత ప్రపంచ వాతావరణంలో తల్లడిల్లి పోతున్నై. బ్రతుకు భారమనుకొంటున్నాయి. అటువంటప్పుడు, ఏవిధమైన హంగులూ లేక, 100కి 12 మంది అక్షరాస్యులైన కోట్లకొలది జనాభాతో, ఏ ప్రభుత్వము మాత్రం, యే అభివృద్ధి ప్రణాళికలను యింత స్వల్పకాలంలో నిర్వహించి, ప్రజల అన్నార్తతను తీర్చగలదు, అవిద్యను పోగొట్టగలదు, ఆరోగ్యాన్ని పెంపొందించగలదు ?

స్వరాజ్యమంటే స్వర్గనివాసమేనని అభిప్రాయపడ్డ అమాయికపు ప్రజకు, యీ కరువు కాటకాలు, జీవిత అసౌకర్యాలు, ఒక విధంగా అంతులేని ఆశాభంగం కలిగించాయి. అధికార పదవుల నధిష్ఠించిన పలువుర నావహించిన స్వార్థపరత, అహంభావములు, ప్రజలలో ప్రభుత్వము పట్ల ఒక రకమైన అవిశ్వాసం కలిగించాయి. ఒక్కొక్కచోట నిజంగా అనుభవము చాలక పోవుటవల్ల ప్రభుత్వం అవలంబించిన పంథాలు, కుత్రిమ స్వరూపము కలవిగా ప్రజల విమర్శనకు గురియయ్యాయి. కాలం కర్మం ఏకమైనట్లు, పొరపాట్లను సరిదిద్దాలన్న అభిలాషగల వారిగా, అగ్రనాయకులుగూడా ప్రజలను నమ్మించలేక పోయినారు.

## ఇక మీద

అలా అలా, ఇంతింత అంతంతంతై, కొండంతై విశ్వరూపం దాల్చింది, ముఖ్యంగా ఆంధ్ర ప్రజలలో ప్రభుత్వముపట్ల రేకెత్తిన అసంతృప్తి. ఈ కారణంగా వర్తమాన ప్రభుత్వ పక్షమైన కాంగ్రెసు తట్టుకోలేని దెబ్బతింది ఆంధ్ర ప్రాంతంలో.

అయితే ఉద్రేకము తప్ప విచక్షణ యెరుగని ఆంధ్రప్రజ తమ ప్రవర్తనలో పొరపడ్డారా, గోతినుండి తప్పుకుని నూతిలో ఉరకలేదుగదా, అనే సందేహం కలుగుతుంది ఆలోచించే నిదానస్తులకు. కనపడే దీపాన్ని పండని ఆశతో కరవబోతున్నారా, చేతులు తీరళ్ళా కాలిన తరువాత ఆకులకై గంతులు వేస్తారా అనే ఊహాలు వారి భవిష్యత్తుని గూర్చి శంకలు కలిగిస్తున్నాయి. తానెక్కిన కొమ్మను నరుకుకొన్న అవివేకి అతి మూర్ఖుఁడు కాళీ ప్రసన్నముచే కాళిదాసు మహాకవియై అమరఖ్యాతి గడించాఁడు. అట్టి దేవీ ప్రసన్నము తక్క భావిలో మునకలు వేయుచున్న బహుళాంధ్ర ప్రజను ఒక ఒడ్డునకు తేలేదేమో! ఇకమీద ఏమిగా నున్నదో!!





# రాజకీయాలు

* శ్రీ గొల్లమూడి రామచంద్రరావు *

1952 జనవరి అనేక విధాల ప్రపంచ రాజకీయ చరిత్రలో ముఖ్యస్థానం ఆక్రమిస్తుంది. ఈ నెలలో భారత దేశంలో వయోజన వోటింగు పద్ధతిమీద ఎన్నికలు జరిగి, దేశంలో రాబోతున్న గొప్ప మార్పులను సూచించినవి. కాశ్మీర్ సమస్య ఐక్యరాజ్యసమితి విచారణకు వచ్చిన నాలుగు సంవత్సరములకు మొదటిసారిగా రష్యా ఈ నెలలోనే ఆ సమస్యమీద తన వైఖరిని ప్రకటించింది. ఇండియాకు పొరుగు దేశమయిన నేపాల్ మరొక విప్లవానికి గురి అయింది. విదేశాలకు అమెరికా చేసే ఆర్థికసహాయం ఎంత బూటకమయినదో పర్షియా, ఈజిప్టు, ఇరాక్, బర్మా, ఆఫ్ఘనిస్థాన్, ఐర్లెండులు నిరూపించినవి. దానితో ఈ ప్రాంతాల్లో అమెరికన్ యుద్ధ వ్యూహానికి ప్రాణాంతకమయిన దెబ్బ తగిలింది.

* * *

ఈ తడవ భారత దేశంలో జరిగిన ఎన్నికలకూ, ఇంతకు ముందు ఇక్కడ జరిగిన ఎన్నికలకూ ఎటువంటి సంబంధము లేదు. అంతేకాదు. వయోజన వోటింగు అమల్లో ఉన్న ఇతర దేశాల ఎన్నికలుకూడా ఇట్లా లేవని చెప్పవచ్చు.

1945 ఎన్నికలవరకూ జనాభాలో అతి కొద్దిమంది అభిప్రాయమే ప్రభుత్వ నిర్మాణంలో పాటించ బడేది. అప్పటి వోటర్ల సంఖ్య అసలు జనాభాలో సముద్రంలో కాకిరెట్ట వలె ఉండేది. అప్పుడు టికాణా లేకుండా ఉన్న ప్రజల అభిప్రాయం ఇప్పుడు చెల్లుబాటు అయింది. వయోజన వోటింగు ఉన్న ఇతర దేశాలలో, పారిశ్రామిక, ధనికవర్గాల ప్రాబల్యం అక్కడ స్థిరపడ్డ తరవాతనే, ఆ వోటింగు పద్ధతి అమలు జరిగింది. కాని మన దేశంలో గాంధీజీ పుణ్యామా అని, ఆ వర్గాలు అట్లా తిష్ఠవేసుకోకముందే వయోజన వోటింగు అమలు జరిగింది.

వయోజన వోటింగు ప్రవేశపెట్టటం పొరబాటని చాలామంది కాంగ్రెసు వాదులు ఇప్పుడు నాలిక కొరుక్కుంటున్నారంటే, వారికి అసలు ప్రజలు ఎవరో, వారి అవసరాలు ఏమిటో, వారి ఆశయాలు ఏమిటో, వారి యోగక్షేమాలకు ఏమి చేయాలో తెలియకపోవటం వల్లనే చెప్తున్నారనుకోవలసి వస్తుంది. ఆ నాయకులకు ప్రజలతో సంబంధం లేకుండా పోయిందని చెప్పవలసి వస్తుంది.

నిజంగా ప్రజా ప్రభుత్వమంటే ప్రజలందరికీ అందులో పాలు ఉండాలి. ప్రజల ఆశయాలనూ, అవసరాలనూ పార్టీలు గుర్తించి వారి విశ్వాసాన్ని సంపాదించ కలగాలి. అంతేకాని ప్రజాభిప్రాయానికి భయపడకూడదు.

* * *

ఆంధ్ర ప్రాంతంలో కాంగ్రెసు ఘోరమయిన పరాజయాన్ని పొందింది. కమ్యూనిస్టులు అద్భుత విజయాలను సాధించారు. కాంగ్రెసు విధానాలతో అసంతృప్తి చెందిన కె. ఎం. పి. మొదలైన మితవాద పక్షాలుకూడా ఎన్నో విజయాలను సాధించినవి. 1920 పెదనంది పాడు పన్నుల నిరాకరణ, చీరాల—పేరాల ఉద్యమాలు మొదలుకొని 1945 వరకూ కాంగ్రెసుకు మహా బలిష్ఠ స్థావరంగా ఉన్న ఆంధ్ర దేశంలో ఈ మార్పు ఎందుకు వచ్చింది ?

ఇదే ప్రశ్నను కాంగ్రెసు అధ్యక్షుడు పండిత నెహ్రూ ఆంధ్ర ప్రదేశ కాంగ్రెస్ అధ్యక్షునికి వేశారని తెలుస్తున్నది. సంజీవి రెడ్డిగారి సమాధానం ఎట్లా ఉంటుందో మనం చెప్పలేము కాని, మామూలు ఆంధ్రుడు ఎవరయినా

ఈ కారణాలను చెపుతారు: (1) ఆంధ్ర రాష్ట్రం పట్ల కాంగ్రెసు చూపించిన అనాదరణ. (2) కాంగ్రెసులో ఏర్పడ్డ కుక్షలు. (3) కాంగ్రెసు అధిష్ఠానవర్గం పార్టీలో ఏర్పడ్డ అంతఃకలహాలను న్యాయంగా పరిష్కరించటానికి బదులు పక్షపాతంతో వ్యవహరించి పార్టీని బలహీన పరచటం. (4) తమకు కలిగే కష్టాలకు కారణం ప్రస్తుత ఆర్థిక సాంఘిక వ్యవస్థలేనని ప్రజలు నమ్మి, అవి ఆ విధంగా ఉండటానికి కారణం కాంగ్రెసేనని నిరసించటం.

ఆంధ్ర ప్రజలు అన్ని పార్టీల నాయకుల్ని ఓడించి, పాత నాయకత్వంపట్ల, వారి విధానాలపట్ల అసంతృప్తి వెల్లడించారు.

* * *

నాలుగు సంవత్సరములు కాశ్మీర్ విషయమై మౌనంగా ఉన్న రష్యా జనవరి 17న మొదటిసారిగా తన వైఖరి వెల్లడించింది. బ్రిటన్ అమెరికాలు సమితి ధర్మకర్తృత్వం పేర కాశ్మీరును ఆక్రమించాలని చూస్తున్నవనీ, సమితి నియమించిన మధ్య వర్తులంతా సమాధానం కుదరకుండా చేసి, విదేశీ సేనలను అక్కడ జేర్చ ప్రయత్నిస్తున్నారనీ సోవియట్ ప్రతినిధి మాలిక్ భద్రతా మండలిలో ఆరోపించారు. సమితి ఆధ్వర్యాన జన వాక్య నిర్వహణ అంటే పశ్చిమ రాజ్యాల సేనల ఆధ్వర్యాన జరిపించటమే అవుతుందని హెచ్చరించారు. విదేశీ సేనల ఉనికికోసం పశ్చిమ రాజ్యాలు ప్రతిపాదించిన తీర్మానాన్ని ఇండియా తిరస్కరించి ఉండగా, ఆ ప్రతిపాదన్ను మళ్లీ చేసే అధికారం గ్రాహానికి ఎక్కడిదని ఆయన సవాలు చేశారు. రాజ్యాంగ పరిషత్తు ద్వారానే కాశ్మీర్ భవిష్యత్తు నిర్ణయం కావాలని చెపుతూ దానిని అడ్డగించటానికి అమెరికా బ్రిటన్లు చేసిన కుట్రలను ఉదహరించారు.

మాలిక్ చేసిన వాదం యావత్తూ కాశ్మీర్ రాజ్యాంగ పరిషత్ అధ్యక్షుడు సాదిక్, పండిత నెహ్రూ, షేక్ అబ్దుల్లా మొదలైనవారు మొదటినుంచీ చేస్తున్న వాదనే.

ఈ విధంగా రష్యా ముగ్గులోకి దిగటంవల్ల ఇంక కాశ్మీర్ వ్యవహారం త్వరలో తేలిపోవచ్చు. అంటే జర్మనీ విభజన ఖాయపడినట్లు, పాలస్తీనా విభజన ఖాయపడినట్లు, కాశ్మీరు విభజనకు కూడా సమితి ఆమోదించవచ్చు.

వామ పక్ష వైఖరిని అనుసరిస్తున్న అబ్దుల్లా ప్రభుత్వం అంటే గిట్టని భారతీయ మితవాదులు కాశ్మీర్ విభజనకు అంగీకరించవలసిందని నెహ్రూను ఒత్తిడి చేయగలరు. కాశ్మీర్‌ను విభజించాలని చెప్పిన అంబేద్కర్‌ను దీనికి ఉదాహరణగా తీసుకోవచ్చు. కాశ్మీరును ఇండియా వదులుకుంటే తూర్పు బెంగాల్ సమస్యను పరిష్కారం చేయిస్తామని బ్రిటన్, అమెరికాలు బేరాలు ప్రారంభించే అవకాశం కూడా ఉన్నది.

* * *

మన పొరుగుదేశమయిన నేపాల్ జనవరి 24, 25 తేదీలలో మరొక విప్లవానికి గురిఅయింది. దాని ఫలితంగా కమ్యూనిస్టు పార్టీ నిషేధించబడ్డది. నేపాల్ హోంగార్డులు వెయ్యిమంది అకస్మాత్తుగా తిరుగుబాటుచేసి వామపక్ష నాయకుడు డా॥ కె. ఐ. సింగును జైలునుంచి విడిపించారు. పరిస్థితులు అదుపులోకి వచ్చినట్లు అధికారులు ప్రకటించారు. దేశంలో ప్రమాద పరిస్థితి ఏర్పడినట్లు ప్రకటించబడ్డది. లోగడ రాణా ప్రభుత్వంమీద నేపాలీ ప్రజలు యావన్మందీ నేపాలీ కాంగ్రెస్ ఆధ్వర్యాన తిరుగుబాటు జరపగా, ఇండియా ప్రభుత్వం మధ్యవర్తిత్వం జరిపి రాజీ కుదిర్చింది. ఈ రాజీకి ఫలితంగా కాంగ్రెసులో మితవాదులు అధికారంలోకి వచ్చారు. అతివాదులకూ, మితవాదులకూ వచ్చిన సంఘర్షణలలో భారతసేనలు మితవాదుల తరఫున రెండు సార్లు చర్యలు జరిపినవి. మితవాద ప్రభుత్వానికి భారత ప్రభుత్వం సలహాదార్లనుకూడా పంపింది. దీనివల్ల నేపాలీ ప్రజల్లో ఇండియాపట్ల నిరసన బయలుదేరటంవల్ల, సలహాదార్లు ఉపసంహరించబడ్డారు.

ప్రపంచం అంతటా ముఖ్యంగా ఆసియాలో అంతటా, జరుగుతున్న అతివాద మితవాద సంఘర్షణే నేపాల్‌లో జరుగుతున్నది. అక్కడ ఇండియా పొరబడితే, అది ఆ దేశ ప్రజలతో శాశ్వత వైరానికీ, ఇంకా తీవ్రమయిన పరిణామాలకూ దారితీస్తుంది. ఇండియా అనుసరిస్తున్న తటస్థ విధానం తనకు ప్రత్యక్ష సంబంధంలేని కొరియా, ఇండోచైనాల

(తరువాయి 28 వ పేజీలో)



# బహిరంగ సభ

*  *  *

నాటిక

*  *  *

* శ్రీ అప్పిచర్ల సుబ్బారావు *

వరదయ్య — ఇంటి యజమాని
పార్వతి — వరదయ్యగారి భార్య
కుమారి — సమితి సెక్రెటరి
ప్రసాద్ — సమితి ప్రెసిడెంటు

(వరదయ్య ఇంట్లో)

పా: ఏమండోయ్! మిమ్మల్నే యిలా రండి.

వ: ఆఁ! వస్తున్నా, వస్తున్నా. ఏమిటీ హడావుడి.

పా: హడావుడి లేదు, గందరగోళం లేదు. యిలా రండి. డికాక్షన్ పొర్లిపోతుంది. మూత తియ్యండి. నేను బీరువాలో పాలు తెస్తాను.

వ: వెధవది అరకప్పు కాఫీ కాయటానికి యిద్దరు మనుష్యులు చేతులు చేసుకోవాలి. ఒక్కదానివి కాఫీకూడా చేయ లేకపోతే యీ దేశంలో నువ్వేం పనికొస్తావు చెప్పు.

పా: మీరు పనికొస్తారుగా. మీరే దేశాన్ని వుద్ధరించండి. వంటింట్లో పడివుండేదాన్ని నేనేం వుద్ధరిస్తానూ?

వ: ముద్దులరాణీ! అప్పుడే కోపం వచ్చిందా?

పా: కోపంలేదు, తాపంలేదు. ముందు డికాక్షన్ మీద మూత తియ్యండి తెర్లిపోతుంది.

వ: ఆఁ తీస్తున్నాను. (డికాక్షన్ తెర్లుతున్న చప్పుడు) అబ్బ! కాలుతోందే! పార్వతీ! ఆ గుడ్డిలా అందివ్వు, మూత తీస్తాను.

పా: (నవ్వుతూ) మూత తీయటానికి యిద్దరు మనుష్యులు కావాలేమిటి?

వ: పార్వతీ! నా దుంప తెంచక ఆ గుడ్డిలా తే! చెయ్యి కాలిపోతున్నది. (డికాక్షన్ గిన్నె కుంపటి మీదనుంచి దింపి వేలు చూచుకుంటూ) ఉఫ్...ఉఫ్...

పా: (నవ్వుతూ) వేలు వూదుకుంటున్నారేం?

వ: తర్వాత నవ్వుదుగాని. వేలుచూడు ఎలా కాలి పోయిందో?

పా: అందుకనే మగవాళ్లు మాటలపుట్టలని, క్రియాశూన్యు లని అంటారు.

వ: పార్వతీ! అలాంటి మాటలు అన్నావంటే నాకు కోపం వస్తుంది వూరుకో.

పా: అయితే తాపాన్ని పిలుస్తారెండి. మగవాళ్లచేత ప్రతీ పనీ యింకా చేయించకపోతే యిక మాట వింటారా?

వ: అందుకనేనా ప్రతీ పనికీ నన్ను పిలుస్తావ్. అయితే యిక నువ్వు పిలిచినా పలుకను.

పా: తమరు మార్కెటులో ఆరువేలకు అమ్ముడు పోయారు. అంటే మా నాన్న మిమ్మల్ని ఆరువేలకు కొని పెట్టారు. మిమ్మల్ని వినియోగించుకోవటం నా యిష్టం. కనుక నేను ఎక్కడ నిల్చోమంటే అక్కడ, ఎక్కడ కూచోమంటే అక్కడ, ఏ పని చేయమంటే ఆ పని చేసి తీరాలి. అదిగో కుంపటిమీద పాలు తెర్లి పోతున్నయ్. దింపి పాలు, డికాక్షన్ కలిపి కాఫీ యిటివ్వండి. ఇది నా ఆజ్ఞ.

వ: పార్వతీ! ఏమిటీ వెర్రి.

పా: వెర్రికాదు, వేదాంతంకాదు, బూటకంకాదు, నాటకంకాదు.

వ: ఏమిటీ! ఇవాళ కైకవేషం వేయ దల్చుకున్నావేమిటి?

పా: ఆఁ! దశరధుడిలాగ మీరు వరాలిస్తారనీ.

వ: సరేగాని. ముందు యీ కాఫీతాగు. నీకంటే నేను కాఫీ ఎంత బాగా కాచానో చూడు.

పా: మీ మాయమాటలు తెలుసులెండి. నేను కాఫీ తాగను.

వ: తాగు రాణీ!

(తలుపు గట్టిగా కొట్టిన చప్పుడు)

ప్ర: వరదయ్యగారూ! వరదయ్యగారూ!

వ: ఆ! వస్తున్నా. తలుపు బద్దలు చెయ్యకండి.

పా: మీరు నా ఆజ్ఞలేనిదే తలుపు తియ్యటానికి వీలు లేదు.

వ: అబ్బ నీ కైకవేషం కాసేపు చాలించు. ఎవరో పెద్ద మనుషులొచ్చినట్టున్నారు.

కు: వరదయ్యగారూ! వరదయ్యగారూ! ఇంట్లో వున్నారా లేరా? ఎవరూ జవాబు చెప్పరేం?

వ: వస్తున్నా! వస్తున్నా! తొందరపడితే ఎలా చెప్పండి. (తలుపుతీస్తూ) ఎవరు మీరూ? మీరా! రండి! రండి.

ప్ర: వరదయ్యగారూ నమస్కారం.

వ: నమస్కారం.

కు: ఏమండోయ్! నా నమస్కారాలు కూడా.

వ: ఐతే మీకూ నా నమస్కారాలు. ఇలా కూచోండి.

ప్ర: కూచోవటానికేమిగాని ఒక్క విషయమండి.

కు: మరేమిటోనని భయపడతారేమో! ఈ మధ్య లోకోద్ధరణ సమితి అని ఒకటి స్థాపించాం. అంటే స్త్రీ పురుష లింగ వయస్సు ఆ సమితిలో సభ్యులుగా చేరవచ్చు.

ప్ర: మీకు బహుశా ఆ సమితి ఆశయాలు తెలిసేవుంటయ్. లోకంలో వ్యభిచారం, జూదం, త్రాగుడు మొదలైనవి లేకుండా చేస్తూ—

కు: దేశంలో ప్రతీవారికీ కూడు, గుడ్డ వుండేలా చూస్తూ—

ప్ర: అన్యాయం అబద్ధం—

కు: లేకుండా చూడటమే మా సమితి ముఖ్యాశయం.

ప్ర: పార్కులో ఇవాళ మా సమితి బహిరంగ సభ జరుగబోతూంది. ఆ సభలో మీరు తప్పకుండా రేడియో ప్రసంగమున్నా, మరే అర్జంటు పనివున్నా మానుకొని మాట్లాడి తీరాలి.

కు: మీరు తప్పక మా కోరిక నేరవేరుస్తారని మీ వద్దకు వచ్చాము. మీ శ్రీమతిగారిని కూడా తప్పక తీసుకరావాలి.

వ: నాకు రావాలనే వుంది కాని బొచ్చెడు పనులండీ. రేడియోవాళ్లు వ్యాసం పంపించమని వ్రాశారు. పత్రికలవాళ్లు కథలు పంపించమని జాబు వ్రాశారు. బొత్తిగా తీరుబాటు లేకుండావుంది.

ప్ర: మాకుమాత్రం తెలీదండీ. మీరంత Busy గా వుంటారని. కళోపాసకులు, కళారాధకులు, సాహితీ విమర్శకులు, విఖ్యాత రచయితలు గాబట్టే మీ వుపన్యాసం కావాలని మరీమరీ మనవి చేసుకుంటున్నాం.

వ: అవుననుకోండి. ఐనా ప్రయత్నిస్తాను.

కు: ప్రయత్నిస్తానంటే కాదు మీరు వస్తానని మాటయిచ్చి తీరాలి. అందాకా యిక్కణ్ణుంచి కదలం. సెక్రెటరీని నేను, ప్రెసిడెంటు ప్రసాద్ వచ్చి మిమ్మల్ని కావాలని కోరితే మీరు నిరాకరిస్తే బాగుంటుందా చెప్పండి.

వ: మీరింత బలవంతం చేస్తే నేను రానన్నా బాగుండదు. తప్పక వస్తాను. మీటింగు ఎన్నిగంటల కన్నారూ?

కు: ఖచ్చితంగా ఐదు గంటలకు.

వ: సరే! తప్పక వస్తాను.

ప్ర: ఐతే మేము సెలవు తీసుకొంటాం.

వ: మంచిది.

కు: వరదయ్యగారూ! మరొక్క మాట. మీటింగుకు వచ్చేటప్పుడు, మీ శ్రీమతిని కూడా తప్పక తీసుకురండి. ఇప్పుడే పిలుద్దామంటే మీ శ్రీమతి కనపడదేం?

వ: ఆ! అదెక్కడో వంటింట్లో పనిచేసుకుంటున్నది. దాన్ని పిలిచి పని చెడగొట్టడ మెందుకూ?

కు: ఆ మాట నిజమేగాని వారినికూడా గట్టిగా పిలిచామని చెప్పండి. వెళ్లి వస్తాం. సెలవ్.

వ: అలాగే! వెళ్లిరండి. వెళ్లిరండి... పార్వతీ! పార్వతీ!

పా: వంట యింట్లో వంటదాన్ని, కళోపాసకుల సాన్నిధ్యంలో ఎందుకూ?

వ: పార్వతీ! నువ్వు చూడలేదుగాని ఆ లోకోద్ధరణ సమితి సెక్రెటరీ, కుమారి, ఎంత బాగా మాట్లాడిందనుకున్నావ్. నువ్వు బైటకు ముఖం చూపించితే నీతో గూడా మాట్లాడేదే! నిన్ను గట్టిగా మీటింగుకు రమ్మనమని మరీ మరీ చెప్పింది.

పా: మీ వుపన్యాసం వినటానికేనా?

వ: అబ్బే! కాదు. నీచేతగూడా ఒక వుపన్యాసం యిప్పించటానికి.

పా: ఆ! మహా మీ రిస్తున్నారుగా వుపన్యాసం. నేను గూడా ఎందుకూ? సభల్లో మాట్లాడి మీరే పత్రికల్లో పడండి.

వ: పడితే దెబ్బ తగులుతుంది. పత్రికలో ఫోటో అచ్చు కావటం అను...

పా: ఆ! మీరు నేర్పితే నేర్చుకుంటాను. మీలాటి ప్రసిద్ధ రచయిత భార్యనీ, సాహిత్య విమర్శకుని అర్ధాంగినీ అయితే యింకేం కావాలీ! కడుపు నిండిపోతున్నది.

వ: పార్వతీ! ఏమిటీ వ్యాఖ్యానం?

పా: ఆ! ఏమీ లేదు. స్త్రీ కష్టాల్ని, కూతురి పెళ్లికోసం తల్లిదండ్రులు పడే దురవస్థని వర్ణించి బ్రహ్మాండంగా వ్రాసే కథలు చదివి నిజంగా ఆ రచయితలెంత విశాల హృదయులా అని ఆశ్చర్యపోయేదాన్ని. కుళ్లు సమాజంలో అబల, సాంఘిక వ్యవస్థలో బానిస స్త్రీ అని లెక్చర్లు దంచే ఉపన్యాసకులను చూచి ఎంత దేశోద్ధారకులా అని భ్రాంతి చెందేదాన్ని. కాని...?

వ: ఏమిటి సంగతి?

పా: పేరు పొందిన ఉపన్యాసకులూ, విఖ్యాత రచయితలూ అయిన మీ భార్యనయిన తరువాత రచయిత, వుపన్యాసకుడు అంటే ఏమిటో సరైన అర్థం తెలిసింది.

వ: ఆరువేలు కట్నం తీసుకున్నాననేగా నీ ఎత్తిపొడుపు మాటలు. కావాలంటే ఆరువేలు నువ్వు తీసుకో.

పా: అనంగనే సరా! ఇటు పారెయ్యండి.

వ: పత్రికలవాళ్ల దగ్గరనుంచీ, రేడియోవాళ్ల దగ్గరనుంచీ డబ్బు రానీ, అట్లాగే యిస్తా.

పా: అయితే యింకేం. ఎద్దు యీనినట్టే, గాట్లో కట్టేసినట్టే!

వ: ఓ! మాటల సందర్భంలో మరచిపోయాను. మీటింగుకు ఒక గంట మాత్రమే టైము వుంది. త్వరగా రెడీకా. వెళ్దాం.

పా: నేనుగూడా ఎందుకలే!

వ: ఆడవాళ్లు ఎంత బాగా మాట్లాడుతారో విందువుగాని రా.

పా: అయితే వస్తాను పదండి. మగవాళ్ల అంతు తేల్చాలి.

## పార్కులో సభ ప్రారంభం

కు: మహాజనులారా! చిన్న మాట. పత్రికా రచయితగానూ, రేడియో ప్రసంగములద్వారానూ, సాహిత్య విమర్శకుడిగానూ శ్రీయుత వరదయ్యగారిని మీకు పరిచయంచేయ నవసరంలేదు. ఈ రోజున లోకోద్ధరణ సమితి తరఫున మన ఆహ్వానానికి ఆనందించి దయతో వుపన్యసించుటకు వారు అంగీకరించినందుకు ధన్యవాదాలు. నా సోదితో మిమ్మల్ని విసుగుచెందించక యింతటితో నా మనవిని విరమించుచూ శ్రీ వరదయ్యగారిని వుపన్యసించమని కోరుతున్నాను.

## సభలో శ్రోతల చప్పట్లు

వ: సోదర సోదరీమణులారా!

నన్ను గురించి సెక్రెటరీ కుమారిగారు విపరీతంగా పొగిడేశారు. కాని నిజం ఆలోచిస్తే ఒక్కొక్క మాటు నేనంత గొప్పవాణ్ణా? ఎందుకు కాగూడదూ? అనే అనుమానాలు నాకు కలుగుతూ వుంటయ్. కాని యిది ప్రస్తుత చర్చకు అనవసరమనుకోండి.

ఈనాటి ప్రసంగ విషయం మీ కందరికీ తెలిసే వుంటుంది. సంఘంలో స్త్రీలు, పురుషులు, అనే శీర్షికను గురించి మాట్లాడాలి. నాకీ అవకాసం దొరికినందుకు సంతసించుచున్నాను.

సంఘంలో తెగలు రెండు. వారే స్త్రీలు పురుషులు. పురుషులకంటే చరిత్రలోనూ గ్రంథములలోనూ, స్త్రీకే ప్రాతినిథ్యం జాస్తి.

సభలో స్త్రీలు: హియర్! హియర్.

వ: స్త్రీ అంటే వంటింటి బానిస కాదని, లోకోత్తర పురుషుడి దివ్యజీవనానికి మాతృమూర్తియని భావించాలి. కాని యీనాడు స్త్రీలకు కడగండ్లు దాపురించినయ్. భర్తలు భార్యలను దాసీలుగా భావించి వంటపనిలోనే బ్రతుకమని దండిస్తూ వారి సుఖాలేవీ గమనించటం లేదు. ఇది భర్తల అజ్ఞానాన్ని చాటుతుంది.

పా: (పెద్దగా) నిజం! నిజం!

వ: అదీగాక యీనాడు కూతుర్లు వున్న తల్లిదండ్రుల దురదృష్టం అంతా యింతా అని చెప్ప వీలులేదు. వరకట్నాలతో అల్లుళ్లను మార్కెటులో కొనలేక, ఎదిగిన కూతళ్లకు పెళ్లి చేయలేక తల్లిదండ్రులు కుమిలిపోతున్నారు. కొంతమంది ఆత్మహత్యకూడా చేసుకుంటున్నారు.

కు: హియర్! హియర్.

వ: విద్యావంతులు, నాగరిక యువకులు సంస్కార భావాలతో వినూత్న ఆశయాలతో ముందంజవేసి నాలా వరకట్న విధానాన్ని రూపుమాపాలి.

పా: అబద్ధం. పచ్చి అబద్ధం. మావారు కట్నం తీసుకున్నారు. ఆరువేలు కట్నం తీసుకొని మార్కెటులో అమ్ముడుబోయారు.

వ: నా వుపన్యాసంమీద విమర్శ లేవైనా వుంటే మీటింగు పూర్తయిన తరువాత నాతో కలిసి మాట్లాడాలి. అంతే కాని మధ్యలో ఎవ్వరూ గోలచేసి అభ్యంతరం కలిగించ కూడదు.

పా: మీ వుపన్యాసం చాలు. మీ గుట్టు మట్టు జీవితాన్ని బహిరంగ పరచి మీ పరువు తీయాలి.

ప్ర: ఏమండీ! పార్వతిగారూ! ఇది మీ యిల్లుగాదు పోట్లాడుకొనటానికి. ఇది బహిరంగ సభ. స్టేజీమీదకు మీరు రావటానికి వీలులేదు.

పా: నా కన్ని విషయాలూ తెలుసు. మావారి అసత్య ప్రసంగాన్ని ఖండించటానికి వచ్చాను.

వ: పార్వతీ ఏమిటీ మొరటు ప్రవర్తన. దిగి పో.

పా: నేను దిగను.

ప్ర: ఇది మీటింగు. మీ యిల్లు కాదు.

పా: మీటింగు కనుకనే నేను మాట్లాడుతాను.

ప్ర: అధ్యక్షుడి అనుమతిలేంది మాట్లాడకూడదు.

కు: మాట్లాడొచ్చు. పార్వతిగారూ మాట్లాడండి.

పా: మావారు పత్రికల్లో వ్రాసేది అసత్యాలు. సభల్లో మాట్లాడేది పచ్చి అబద్ధాలు.

మగ సభ్యులు: పార్వతి మాట్లాడటానికి వీలులేదు.

ఆడ సభ్యులు: పార్వతి మాట్లాడి తీరాలి.

వ: అయితే నా వుపన్యాసం ఆపేస్తాను.

ఆడ సభ్యులు: (పెద్దగా) వరదయ్య డౌన్! డౌన్!

మగ సభ్యులు: (పెద్దగా) పార్వతి డౌన్! డౌన్!

ప్ర: మహాజనులారా! సభలో ఆడ, మగ భేదం వచ్చి అలజడి చెలరేగింది గనుక యీ లోకోద్ధరణ సమితి మొదటి మహాసభ యింతటితో ఆపివేయడమైనది.

కు: సోదర సోదరీమణులారా! సభలో చెప్పలేనంత గందరగోళం ప్రారంభమయింది గనుక యింతటితో యీ సభ సమాప్తి చేయుటకు చింతిస్తూ, యీ లోకోద్ధరణ మహా సమితి మీటింగు మరొకసారి జరుపగలమని మీకు హామీ యిస్తూ యీ సభ యింతటితో విరమించుచున్నాము. జై హింద్!



# పశ్చాత్తాపం

* శ్రీమతి కిళాంబి రుక్మిణీదేవి *

కుమార్ తెలుగు ఎం.ఏ., ప్యాసై 5 యేండ్లనుంచీ ఎక్కడైనా వుద్యోగం దొరుకుతుందేమోనని ఊరూరూ తిరిగి విశ్వప్రయత్నం చేశాడు. పెద్ద పెద్ద డిగ్రీలు పొందినవారికే ఈ రోజుల్లో వుద్యోగాలు దొరక్కపోతే మన తెలుగు పండితుడుగారికి అందులో మద్రాసులాంటి మహాపట్నంలో వుద్యోగ మిచ్చే దెవరూ. అతను ఆశ్రయించనివారు లేరు. ఆఖరికి ఎల్లాగో తంటాలుపడి ఒక చిన్న మేష్టరు పని 60 రూపాయలమీద సంపాదించాడు. కాళ్లు అరిగేటట్లు తిరిగి తిరిగి ఒక తుక్కుడు ఇల్లు 8 రూపాయలకి తీసుకొన్నాడు. 'దరిద్రుడికి బిడ్డ లెక్కువ' అనే సామెత వారి పట్ల సార్థకమైంది. రమ కాపరానికి వచ్చిన 7, 8 యేండ్లకల్లా నల్గురు బిడ్డల తల్లి అయింది. పిల్లలు ఎప్పుడూ రోగిష్టిమారి వాళ్లుగానే వుండేవారు. రోజూ డాక్టరింటి చుట్టూ తిరగాల్సిందే. ఒక పిల్లకి చెవిలో పోటూ, ఒక పిల్లకి దగ్గు, మరో పిల్లాడికి కండ్లజబ్బూ, ఇంకొకడికి జ్వరమూ యిల్లా ఇంటిల్లిపాదికీ వైద్యమే. నెల తిరిగిందంటే. డాక్టరుకు సగం జీతం యిచ్చేయాల్సిందే.

కుమార్ సహజంగా చాలా వుత్సాహము గల మనిషే గాని అతని లేమి, పిల్లలూ అతన్ని 30 యేండ్ల లేత వయస్సులోనే వృద్ధుడిగా చేసి నిరుత్సాహవంతుడ్ని చేసాయి. ఎప్పుడూ నవ్వుతో కళకళలాడే అతని ముఖం యిప్పుడు విషాదంతో యూరిపోయింది. రమ స్త్రీజన సహజమైన ఓర్పుతో సంసారాన్ని గడుపుకొస్తోంది. కుమార్‌ని చూస్తే రమకి ఎంతో ప్రేమ. తన జీవితమంతా అతనితోడిదే అనుకొనేది. సర్వజన స్త్రీ సామాన్యంగా వుండే నగలు పిచ్చిగానీ, వివిధములైన చీరలమీద వ్యామోహముగానీ రమకి లేనేలేదు. తన భర్త ఏ జడ్జీయో, మునసబో కాలేదే అనే ఆశ అంతకంటే లేదు. భగవంతుడు తనకిచ్చినదింతే అని తృప్తిపడేది. ఆమె ధనమంతా ఆమె బిడ్డలే. జీవితంలో ఆమె అభిలషించింది భర్త ప్రేమ ఒక్కటి మాత్రమే. కాని కాలక్రమేణ తన భర్తలో కనుపించుతున్న మార్పు ఆమెను భయకంపితురాల్ని చేసింది. కుమార్‌కు విసుగు, కోపమూ, చిరాకు ఎక్కువైపోయాయి. యిదివరకు తన నత్యంత ప్రేమతో చూసుకొనే కుమార్ యిప్పుడు రమ కనుపిస్తేనే ఏదో వంకపెట్టుకొని తిట్టటం మొదలు పెడతాడు. రమ ఏ పని చేసినా తప్పులు పట్టటం పరిపాటైపోయింది. పైగా "నిన్ను పెండ్లాడుట చేతనే నాకీ దరిద్రం దాపరించింది. నీవు పోతేగాని నాకు సుఖం లేద"ని అనే వాడు. పాపం అమాయకురాలైన రమ ఆ తిట్లు భరించలేక పోయేది. కాని భర్తపైగల ప్రేమచేత అన్నిటినీ సహించేది. ఇల్లా రోజులు, నెలలూ, గడిచిపోయినవి.

* * *

కుమార్ కిప్పుడు విసుగుతోపాటు రమ అంటే నిర్దయ, ద్వేషం కూడా పెరిగిపోతున్నాయి. తన ఆనందానికి అంతరాయం రమే అనీ, ఆమెను వివాహ మాడుటచేతనే తనకీ దరిద్రమనీ అపోహపడసాగాడు.

* * *

ఆ రోజు డిశెంబరు ఒకటవ తారీఖు. కుమార్ స్కూలు నుంచి తన అరవై రూపాయల జీతం రాళ్లు జేబులో వేసుకొని వాడిన ముఖంతో యిల్లుచేరాడు. అప్పుడు రాత్రి సుమారు 9 గంటలుంటుంది. అంతవరకూ వీధి గుమ్మములో నిల్చొని భర్త రాకకై ఎదురుచూస్తున్న రమ నవ్వుతో ఎదురుగా వచ్చి చేతిలోని స్కూలు పుస్తకాలు అందుకోబోయింది. కుమార్ విసురుగా రమని త్రోసివేసి మంచంపైన వెళ్లి పడుకొన్నాడు. పాపం రమ చిన్న బుచ్చుకొని పసిపాపకు పాలు పడ్తూ విచారిస్తోంది. తన భర్త అకారణ కోపానికి ఆమె హృదయం దహించుకుపోయింది. కాని ఆమె స్త్రీ, అసహాయురాలు. ఏమి చేయగలదు?

కుమార్ తన దురదృష్టానికంతా ఆమే కారకురాలని తూలనాడసాగాడు. కుమార్ సింహగర్జనలకి రమ గజగజా వణకిపోసాగింది. కళ్ళనీళ్ళు ధారగా కారిపోతున్నాయి.

"ఇదుగో రమా, ఇంక నీకూ నాకూ పొందు కుదరదు. నీ ముఖం నాకు కనుపిస్తున్నన్నాళ్ళు నా మనసుకి శాంతి వుండదు. నీవు నీ పిల్లల్ని తీసుకొని మీ పుట్టింటికి ఈ తక్షణం వెళ్ళిపో." అన్నాడు కుమార్.

రమ వులిక్కిపడింది. "ఏమిటీ అన్నారూ? నా... పిల్లలా? మీ పిల్లలు మాత్రం గాదూ? ఆడది అసహాయురాలుగదా అనే కదూ మాటకు ముందు వెళ్ళిపో అనగల్గుతారు. ఇంతకీ నేను చేసిన అపరాధ మేమిటీ?"

"కారణాలతో నిమిత్తం లేదు. ఇప్పుడు నిన్ను చూస్తేనే అసహ్యం."

రమకి దుఃఖం పొంగి పొర్లి వచ్చింది. ధైర్యం తెచ్చుకొని "మీ కిష్టమున్నన్నాళ్లు వుపయోగించుకొని అవతల త్రోసివేయటానికి ఆడది అంటే వుల్లాకు అనుకున్నారా? 11 యేండ్లు కాపురంచేసి నల్గురు పిల్లల్ని కన్న తర్వాత ఈ రోజు మీకు నేనంటే అసహ్యమా? ఆడదాని బలము, సౌందర్యము అంతా పీల్చి పిప్పిచేసి ఆమెను ఒక పిల్లల్ని కనే యంత్రములాగ ఉపయోగించుకొని యిప్పుడు నేనంటే మీకు అసహ్యం కదూ. నిజమే, స్త్రీకి ఆర్థిక స్వాతంత్ర్యము లేనంత వరకూ పురుషులు స్త్రీలను హీనంగానే చూస్తుంటారు."

కుమార్ కోపం యింకా ఎక్కువైంది. పసిపాపను ఎత్తుకొనివున్న రమని బలంకొద్దీ కాలితో ఒక్క త్రోపు బయటికి త్రోసాడు. రమ వెల్లకిలా పడిపోయింది. ఆమె పిల్లలంతా "అమ్మా! అమ్మా!" అని చుట్టూ మూగారు. కుమార్ వెళ్ళున వీధి తలుపు గడియ పెట్టుకున్నాడు.

రమ కొంతసేపు అల్లాగే పడుండి ఆఖరికి తెప్పరిల్లింది. ఎంతోసేపు కుమార్‌ని తలుపు తీయమని వేడుకొంది. కాని అతని రాక్షస హృదయం ద్రవించలేదు. రమకేమి చేయటానికీ పాలుపోలేదు. భర్తచేత తిరస్కృతయైన స్త్రీ పుట్టింటికి వెళ్తే నాలుగు రోజులపాటు ప్రేమగా గౌరవంగా చూస్తారు. ఎంత కన్నకూతురైనా ఆ తర్వాత వారింటి వంటకత్తెగా వుపయోగించుకుంటారు. తప్పెవరిదైనా లోకం "భర్త వదలివేసిన స్త్రీ" అని ఆడదానినే నిందిస్తారు. ఇంక చేయవలసిన దేమి? తెల్లవారితే నలుగురి నోట్లో తన బ్రతుకు అల్లరిపాలై పోతుందే. ఇట్లా పరిపరి విధాల ఆలోచించి రమ తన నల్గురు పిల్లల్ని తీసుకొని ఆ గాఢాంధకారంలో నడచిపోయింది.

* * *

తెల్లవారింది. కుమార్ తలుపులు తెరచి చూసాడు. రమ కానీ, పిల్లలుకానీ కనుపించక పోయేటప్పటికి నిలువునా క్రుంగిపోయాడు. కోపంలో రమని బయటికి గెంటివేసాడే కాని అబల అవటంచేత రమ ఎక్కడకీ పోలేదనీ తెల్లవారగానే తిరిగి తనే ఆమెను దిక్కుని అనుకున్నాడే కాని, స్త్రీ కూడా ఒక మనిషేననీ, ఆమెకుకూడా ఆత్మాభిమానం వుంటుందని ఆలోచించలేకపోయాడు. ఇంక తనకి స్కూలు టైంకి వంటచేసి పెట్టేదెవరూ. రమ, తన పిల్లలూ ఆ అర్ధరాత్రి ఏమయ్యారో!! ఈ దిగులుతో క్రుంగిపోయాడు. ఈ మహా పట్నంలో ఆమె నెల్లాగ వెతకటం? పిల్లలతో నానా అవస్థా పడ్తుంటే 9 గంటలకల్లా తనకి రెడీగా వంట కాలేదని రోజూ తిట్టేవాడే. ఈ రోజు ఎవరిమీద తన అధికారం చెలాయిస్తాడు. పిల్లలూ, రమా కాసేపు లేకపోతేనే తన యిల్లు యింత చిన్నబోతోందే! వారిని వదలి తనెల్లాగ జీవిత శేషం గడపటం? అన్న సమస్య అతన్ని వెర్రివాని మాదిరిగ మార్చివేసింది. రమ పుట్టింటికి వైరు యిచ్చాడు. కాని ఆమె రాలేదని తెలియటమే గాకుండా, అత్తమామలు అతన్ని చివాట్లు పెడుతూ వుత్తరం వ్రాసారు. ఎక్కడున్నది వారి జాడమాత్రం తెలియలేదు.

* * *

కాలచక్రం గిర్రున తిరిగిపోయింది. రమా కుమారులు విడిపోయి 10 యేండ్లు గడచిపోయాయి. కుమార్ రమ కోసం పిల్లలకోసం దిగులు పెట్టుకొని రోజు రోజుకూ క్షీణించి పోసాగాడు. అల్లాగే పొట్టకూటికి బడి పంతులు పని చేస్తునే వున్నాడు.

* * *

ఆ రోజు సోమవారం. కుమార్ స్కూలునుండి 5 గంటలకి యింటికి వస్తున్నాడు. కుమార్ నడుస్తున్నాడేకాని అతని మనసంతా పిల్లలమీద, రమమీదనే వుంది. కుమార్‌కి రోడ్డు ప్రక్క యింటిలోనుండి రేడియోలో "ఎవరు చేసిన కర్మ వారనుభవింపకా, ఏరికైనను తప్పదన్నా......" అనే పాట వినిపించింది. తన పూర్వ జీవితం ఒక్కమాటు కన్నులకు కట్టినట్లయింది. పశ్చాత్తాపంతో గృహోన్ముఖుడైనాడు. ఇంతలో ఒక మిలిటరీ లారీ అమాంతంగా కుమార్‌కి డాష్ ఇచ్చింది. బలమైన గాయాలు తగిలాయి. స్పృహలేక పడిపోయాడు. ప్రక్కనే వున్న టాక్సీని పిల్చి కుమార్‌ని

అందులో పరుండబెట్టి రాయపేట హాస్పిటల్‌కి చేర్చారు. ఆ రోజు డ్యూటీ మిసెస్ మనోరమా అనే లేడీ డాక్టరుది. నర్సులు వచ్చి చెప్పగానే మనోరమ పేషెంట్ గదిలోకి వచ్చింది. బల్లపై పరుండబెట్టిన వ్యక్తిని చూడగానే మనోరమ "ఆ..." అని కేక పెట్టింది. నర్సులంతా వులిక్కి పడ్డారు. బహుశా పేషెంట్‌కు తగిలినగాయం చాలా ప్రమాదమైనదై వుండుననీ అందుకే ఆ లేడీ డాక్టర్ అరిచిందనీ తలచారు.

కుమార్ చాలా నీరసించి పోయాడు, తన భర్తని యిన్నేండ్లకు తిరిగి చూసానుకదా అని సంతోషము ఒక వైపు, అతని స్థితికి దుఃఖము మరియొకవైపు బాధించుట చేత కొంతసేపటి వరకు అచేతనురాలై మనోరమ బొమ్మ లాగ నిలబడిపోయింది. ఆఖరికి ధైర్యము చిక్కబట్టుకొని గబగబా ఏదో ఇన్‌జక్షన్ చేసింది. తానే స్వయంగా గాయాలకు కట్టు కట్టింది. కొంతసేపటికి కుమార్‌కి స్పృహ వచ్చి కలవరించటం మొదలుపెట్టాడు. "రమా, రమా, ఎక్కడున్నావూ? నామీద ఎందుకూ అంత కోపం. క్షమించవూ."

రమకి దుఃఖం పొంగి పొర్లివచ్చింది. ఒక్క నిమిషం కూడా అక్కడే నిలబడలేక పోయింది. నర్సులతో పేషెంటును జాగ్రత్తగా చూడమని చెప్పి వెళ్లిపోయింది.

మర్నాడు ప్రొద్దున్న 7 గంటలకి వార్డులో పేషెంట్లను చూడటానికి డాక్టర్ బయలుదేరింది. నర్సులు కూడా విడిగా టెంపరేచర్ చూసి, ప్రక్క దులిపి వేస్తున్నారు. కుమార్ ఏదో ఆలోచనలో మునిగిపోయి వున్నాడు. ఇంతలో ముందు ఒక నర్సు వెనక డాక్టర్ రమాదేవి కుమార్ గదిలోకి వచ్చారు. డాక్టరును చూడగానే కుమార్ వులిక్కి పడ్డాడు. తను చూస్తున్నది కలో, నిజమో నమ్మలేక పోయాడు. లేడీ డాక్టర్ మూడు మూర్తులా తన రమలాగానే వుంది. కాని అంతలో నిస్పృహ పడ్డాడు. 10 యేండ్ల క్రిందట వెళ్లిపోయిన తన రమ యింకెక్కడుంటుంది. ప్రపంచంలో మనిషినిబోలిన మనుషులుకూడా వుండవచ్చుననుకున్నాడు. చప్పున గట్టిగా కండ్లు మూసుకొన్నాడు. రమ కుమార్ తనని గుర్తించలేదనుకొంది. శ్రద్ధగా చూడటంవల్ల కుమార్ త్వరలోనే ఆరోగ్యవంతుడయ్యాడు.

* * *

ఆ రోజు ఆదివారం. కుమార్‌ని హాస్పిటల్ నుంచి డిస్‌చార్జ్ చేసేరోజు. తన భర్త తిరిగి తనను విడిచి వెళ్లిపోతాడే అని రమ బాధపడసాగింది. ఇంక తన విషయం దాచక చెప్పేద్దామనుకొంది. కాని మళ్ళీ కొంత అభిమానం వచ్చింది. ఇంతలో గది బయట ఎవరిదో అడుగుల చప్పుడైంది. కుమార్ ప్రత్యక్షమయ్యాడు.

"డాక్టరుగారూ సెలవు తీసుకొంటాను. నేను బీదవాడ్నవటంచేత మీకేమీ యివ్వనసక్తుడను. మీ దయకు నా నమస్కారములే నే నివ్వగలిగింది. మీ ఋణం ఈ జన్మలో తీర్చుకోలేను."

"అదేమి మాట. మీ రివ్వగలిగింది చాలా వుంది."

"నా దగ్గరేమిలేదు. దిగులుచేత కృంగి కృశించిన ఈ క్షీణ శరీరమే నాకున్న ఆస్తి."

"నాకు కావలసినది అదే."

కుమార్ అర్థంగాక తెల్లబోయాడు.

"దయచేసి ఒక్కసారి నాతో మా యింటిదాకా వస్తారా?" కుమార్ జవాబు చెప్పలేక మంత్రముగ్ధుడివలె ఆమె వెనకనే హాస్పటల్ కాంపౌండులోనే వున్న ఆమె యింటికి వెళ్ళాడు. ఇంట్లో అడుగు పెట్టగానే అప్పుడే స్కూలునుంచి వచ్చిన నల్గురు పిల్లలూ "అమ్మా ఇవ్వాళ డ్యూటీ యింత లేటైందే?" అంటూ పరుగెత్తి వచ్చారు. వారిని చూడగానే కుమార్ ఆనందం పట్టలేక పోయాడు. ఇన్నాళ్ళకి తన పిల్లల్ని చూడగలిగినందుకు సంతోషంలో మునిగిపోయాడు. తనచేత అగౌరవింపబడి నిర్దాక్షిణ్యముగా బయటకు తరిమవేయబడిన రమే తన ప్రాణాలను కాపాడిన లేడీ డాక్టరు!!!

ఆ రోజు రాత్రి పండు వెన్నెట్లో రమ తను ఎల్లా డాక్టరు పరీక్షకు చదువుకొన్నదీ, తన వంటిమీది నగలన్నీ అమ్మి ఏ విధంగా పిల్లల్ని పోషించింది, అన్ని విషయాలు కుమార్‌కి వినిపించింది. కుమార్ కళ్ళ నీళ్ళు కార్చసాగాడు. ఆర్థికంగా తన భర్తకు మొదట్లో సహాయం చేయలేనందుకు తప్పంతా తనదేనని నెపం తనమీద వేసుకొంది. తానీ దృశ్యాన్ని చూడలేనన్నట్లు జాబిల్లి మబ్బు తెరలలోకి పోయి దాక్కున్నాడు.



# జిజ్ఞాస

"భాస్కర్"

౧

సుడులు తిరుగుచు నీళ్ళల ముడుల నిడుచు
గంతు వేయుచు, పొంగి కేరింత లిడుచు
పాల నురుగు లుమిసి పరవళ్ళు త్రొక్కు
తరగ చిటిలినం దొలిరూపు దాల్పనగునె ?

౨

మధుర మధు బిందువుల గ్రోల్చి మధుపరాజి
దనుపు కమనీయ శుభ్ర సుందర సుమాలు
కోలుపోయిన తేనెల జాలులంది
నిత్య నూత్నమ్ములౌచు రాణింపగలవె ?

3

వికచవారిజ నిర్గత విమల పరిమ
ళోత్కర మెపుడైన సుమంబు నొందగలదె ?
దివ్యకాంతుల వెలయించు దీపమాల
అంధకారమ్ము నెపుడైన నందగలదె ?

౪

చదల విస్తరించి జలముల కురియించు
నీల జలదమాల నింగినుండి ;
కాని తిరిగి జలము గ్రహియింప నేర్చునే ?
పూర్వ రూపమొంది పొల్పుగనునె ?

౫

మబ్బు ముసుక తెరల మాటున నిల్చుండి
తక్కితారుచుండు దాగుచుండు
మెఱపుతీగ కనుల మెఱయించి వచ్చుచో
తిరిగి వచ్చి నింటి కరుగగలదె ?

౬

గాలి కెరటాలపై తేలి కడలుచన్న
ఘంటికానాద మేనాటికైన తిరిగి
బయలుదేరినచోట సంప్రాప్తమౌనె ?
చేరగలదె గంటల గడియారమందు ?

౭

తరతరాలుగా నిల్చిన ధరణి ధరము
కాలవశమున మట్టిలో కలిసెనేని
ఎన్నడైన తిరిగి తలయెత్తగలదె ?
భావిలోకాన నున్నతి బడయగలదె ?

౮

అగ్నిరాశిలోన ఆహుతియైనట్టి
నిస్తుల ప్రభాచ్ఛ వస్తుచయము
పొందగల్గు నొక్కొ పూర్వశోభాకృతి—
ఎట్టి బాటనేని ? ఎన్నడేని ?

౯

వయసు ముదిరి పండి వాయువశమ్మున
అవని రాలునట్టి యాకులెల్ల
ఎన్నడైన తిరిగి మున్నువోలె చెలగి
సోయగముల గములు చూపగలవె ?

౧౦

కష్ట సంతతి తోడ, ఆకాంక్షతోడ
కూర్చుకొన్నట్టి బంగారు కొండలెల్ల
పిండియై నాశమైపోయె ; ప్రియములై యొ
సంగునే నాకు మరల సాక్షాత్కరించి.



# మదరాసు రాజధానినగరములో

## (26—1—1952)

# రిపబ్లిక్ దినోత్సవము



గవర్నర్ రాకకై నిరీక్షించుచున్న దళాధిపతులు, వివిధ శాఖల అధికారులు



వివిధ దళములను పరిశీలించుచున్న మదరాసు గవర్నర్
శ్రీ భవనగర్ మహారాజాగారు.

★ పతాకావిష్కరణానంతరం పెరేడ్ ప్రారంభం ★



పదాతి దళము.



అశ్వారూఢులైన పోలీసులు.



నావిక దళం

ఆంధ్ర మహిళా ప్రెస్

# శ్రీ త్యాగరాజస్వామి

* శ్రీ కల్లూరి వీరభద్ర శాస్త్రి *

"త్యాగరాజాహ్వయము త్యాగయోగ
సమరసమ్ము సంగీత సాహితీ సంగమేశ
సీమ, శివ కేశవాద్వైత సరణి, తరణి
భవ పయోధికి, పుంభావ భక్తి, ముక్తి
కామినీ కాముకమ్మేక, కళభజింతు"

లోకంలో ఒక మహనీయుని గొప్పతనాన్ని ఆదర్శప్రాయంగా మనం గ్రహించవలెనంటే, గ్రహించేవారి చిత్తంలో నొకవిధమైన పరిశీలనా కౌశలం ముందుగా రూపొంది తీరాలి. దీనినే "రసజ్ఞత" యని సహృదయులు పేర్కొంటారు. ఈ రసజ్ఞత లేనివాడు వ్యర్థుడు. ఈ రసజ్ఞత ఆయా వస్తు భేదములను బట్టి, వేర్వేరు రీతుల్లో వికసించి, సహృదయుని హృదయ పీఠంలో ఏకరూపమైన ఆనందముగా పర్యవసానం పొందుతుంది. అట్టి కేవలానందానుభవాన్నే, మానవ పరమార్థంగా మన భారత తత్త్వవేత్తలందరు ఏకోన్ముఖంగా అంగీకరించారు.

ప్రకృతిలో ఎవరి తాహతను బట్టి వారికి ప్రతీ వస్తువు, ఒక్కొక్క దృక్పథంలో ఆనందమును, లేక సుఖాన్నీ కల్గిస్తూనే ఉంటాయి గాని, యీ అనంత విశ్వంలో వ్యర్థమైన వస్తువేవీ కన్పించదు. అట్లని ప్రతీ వస్తువుయొక్క ఆనందస్థాయికి మనం విలువ ఇవ్వచూలేము. అనుభవించనూ లేము. కావున ఈ ప్రకృతి సౌందర్య సర్వస్వమును, దీనికి విలక్షణమైన భగవంతుని అనంత విభూతులను, మన కన్నులకు కట్టునట్లు సాక్షాత్కరింపచేయగల దివ్యజ్యోతులు "సంగీత సాహిత్యములు." అరవై నాల్గు కళలలోనూ, ఇవే ప్రధానములైనవి.

సర్వ కళామయుడు భగవంతుడు—ఈ ప్రపంచమంతా ఆ తేజోమయుని కళా చిత్రం; మానవుడే కళోపాసి. అసలు కళ అంటే "కం=సుఖమును, లాతి=గ్రహించునది" యని నిర్వచనం—ప్రకృతి, పురుషులు, ఇద్దరూ, కళోపాధులే. యీ జగద్రచన భగవంతుని సాహిత్యం. ఇందు అంతర్లీనమై, సర్వలోకాలకు అనుబంధాన్ని కూర్చగల నాద బ్రహ్మమే సంగీతానికి మాతృక. ఈ కళలు మానవుని ఆత్మోద్ధరణ కొరకు ఉపయోగించాలి. ఇట్టి ఉత్తమ ప్రయోజనాన్ని చూరగొన్న తత్త్వవేత్తలు, రాజయోగులు, కవులు, పండితులు, చిత్రకారులు, శిల్పులు, వాగ్గేయకారులు భారతావనిలో ఎందరో మహానుభావులున్నారు. ఆ వరవడిలో చేరిన రాజయోగి, త్యాగమూర్తి, అమరగాయకుడు, శ్రీ త్యాగరాజస్వామి.

ఈ మహనీయుడు, కర్ణాటక సంగీతమునకు బంగారు చాళ్లతో రాజమార్గము తీర్చి దిద్దినవాడనుటలో సందేహం లేదు. జిలిబిలి తెలుగు పలుకుల నుడికారపు సొంపులతో, పండిత పామర రంజకమైన చక్కని గేయ సాహిత్యాన్ని ప్రసాదించిన మహాకవి. విశేషించి, వేదోపనిషత్తులనుండి కావ్యపురాణేతిహాసములనుండి, ఏన్నో అద్భుత రసపుష్టిగల సారాంశములను, తన చిన్ని కీర్తనల్లో రత్నాలవలె పొదిపినాడు. ఇన్నిటికీ వన్నె తెచ్చిన మరొక గొప్ప అనుభవం, తరతరాలకు, కళోపాసకులకు ఆదర్శంగా నుండదగ్గది కలదు. త్యాగయ్య, తన దైనందిన జీవితంలో, తన ఇష్టదైవమైన శ్రీరాముని ఎదుట నుంచుకొని, తన తాపత్రయమంతా, ఎంతో స్వభావ రమణీయంగా, వానితో వెళ్లబోసుకునేవాడు; ఆ రామచంద్రుని, ఒకప్పుడు, సార్వభౌముడుగా, మరొకపుడు ఆప్తబంధువుగా, నెచ్చెలిగా, ప్రియుడుగా, ముగ్ధ మోహనమూర్తిగా, రాజకీయ నాయకుడిగా, భావిస్తూ మరొక క్షణంలో తనకు, ఇతరులకూ కల్గిన వివాదాలను తీర్చే తగవరి పెద్దగా పెట్టుకొని, మంతనాలాడుతూ, ప్రేమిస్తూ, నిందిస్తూ, తన చిత్తం వచ్చినట్లు ముచ్చటలాడుకొంటాడు.

ఉన్నత యోగమార్గాల్లో, మహా తపోవీధుల్లో, అందని దైవాన్ని ఆతడి మధుర భక్తి భావంలో మెత్తదనం ఏమో

గాని, మన త్యాగయ్య, చేతి మల్లెదండవలె, ఆటలాడి స్తాడు—

దీనినే భక్తిలో జాతీయత అని, మధుర భావమని అంటారు.

ఆనాడు కృష్ణావతారంలో గోపికలు, రామావతారంలో ఆరణ్యక జనం, వానరులు, పొందిన భాగ్యాన్నే, మన త్యాగయ్యకూడా పొందినాడు.

మరియు త్యాగయ్యగారి కాలంలో, మహారాజులు, అష్టైశ్వర్య భోగాలతో తులతూగుతూ ఉన్నారు. కవులు, గాయకులు, పండితులు మొదలైనవారికి, రాజాశ్రయం పెద్ద హోదాగా పరిగణింపఁబడేది; రాజాశ్రయం లేనివాడు, ఎంత విద్యావంతుడైనా, ప్రజానీకంలో గౌరవం తగ్గుదలగా నుండేది; అట్లాంటి సమయంలో, "సుకవితాయద్యస్తి రాజ్యేనకిమ్" అను భర్తృహరి చెప్పినట్లు, ధనమదాంధులకూ, విద్యావంతులకూ మధ్య ఒక విప్లవాన్ని రేకెత్తించినాడు. ఈ విప్లవాన్ని దైవభక్తితో ముడి పెట్టి, "నిధి చాలా సుఖమా? రాముని సన్నిధి సేవ సుఖమా?" అని ప్రశ్నించి, ఉన్నతాదర్శాన్ని పర్యవసింపఁ జేసినారు. లోకంలో ఏదేని విప్లవ భావాన్ని పుట్టించడం సులభమే గాని, దానికి ఉన్నత పర్యవసానం కల్గించడం అంత సులువుగాదు.

ఆ కాలంలో ఎంతో అపురూపమై, కనక వర్షాన్ని కురిపించగల పరుసవేదివంటి మధుర సంగీతకళ తననాశ్రయించియున్నా, త్యాగమూర్తియై, ఆ విద్యను వినియోగించి, ఒక్క కాసైనా ఆర్జించక, నిత్యమూ, ఉంఛ వృత్తితో, శిష్యులు తంబురలు శృతిచేసి, వంత పాడుతూంటే, రాళ్లరగునట్లు విశ్వమనోహరంగా, అశుధారా వాహికంగా రామునిపై, కీర్తనలు పాడుకొంటూ, పరవశుడై, తిరువాది వీధుల్లో బిచ్చమెత్తుకునేవాడు. ఆ తిరువాది వీధుల్లో, ఆ యూరి స్త్రీలు, తెల్లవారకముందే లేచి, తమ వాకిళ్లలో గోమయజలాన్ని చల్లి, రంగవల్లులు తీర్చి, అయ్యగారు ఆయవారానికి వత్తురని ఎదురుచూస్తూ, ఉండేవారట; అంతలో శిష్యపరివారంతో యీ భిక్షుక సార్వభౌముడు, మధురగానంచేస్తూ రాగా, పెద్ద తిరునాళ్లవలె, ఉత్సవంగా ఉండేదని, వారి శిష్యులే చరిత్రలో వ్రాసినారు. ఇక తన సంగీతకళకొక ఉన్నత లక్ష్యాన్ని సూచిస్తూ, "బంగారు మేటి పాన్పుపై భామామణి సీత శృంగారించుకొని, నిన్ను కని పొంగుచు, మల్లెవిరుల పూజించువేళ సంగీతము పాడుమను సామి! త్యాగరాజునితో" నని, తాను పాటకచ్చేరీ చేయుటకొక సుందర సన్నివేశాన్ని కోరుకొనుటలో ఈ మహనీయుని ఉన్నత భావం మనకు గోచరిస్తోంది.

మరొకచోట, రాముడే స్వయంగా భక్తులను దీనులను కాపాడి రక్షించి తీరాలిగాని, మనం రామునికొరకేదటికి పోగలం? అని రాముని రక్షకత్వ బాధ్యతను సోదాహరణంగా పేర్కొంటూ,

"తనయుని బ్రోవను జననివచ్చునొ,
వారిదములకడ పైరులు చనునో"

పసిబిడ్డ ఆకలిని గుర్తించి, తల్లియే వచ్చి వాని ఆకలి తీర్చును. ఇట్లే, పైరులవద్దకే వచ్చి మేఘములు వర్షిస్తాయి కాని, పైరులు పయనించవుగదా! యని, ఎంతో లలితంగా, ముద్దుగా వేడుకొన్నాడు.

వీరి రచనల్లో, సాంఘిక, రాజకీయ ప్రబోధాలెన్నో ఉదాత్తంగా గోచరిస్తాయి. దాంభికుల నడతలను తూర్పారబట్టి, నిశితంగా విమర్శించినాడు. వీరి కీర్తనలను, సంగీతంతో పాడలేకున్నా, భగవద్గీతాదులవలె, నొక ఉపదేశ గ్రంథంగా, నిరంతరం చదువవలసిన అవసరం కన్పిస్తుంది.

శ్రీ త్యాగరాజస్వామి వారి భౌతికదేహం మన కదృశ్యమై, ఇప్పటికి 105 సంవత్సరములైనది. శ్రీ వారి నిర్యాణదినం పుష్య బహుళ పంచమి. యీనాడు, దేశంలో నలుమూలలా, శ్రీ త్యాగరాజ స్వామివారి ఆరాధనా మహోత్సవాలు జర్గుచునే యున్నవి. విశేషించి దక్షిణ భారతంలో ప్రతి పల్లెలోనూ, పట్టణాల్లోనూ శ్రీ త్యాగరాజ స్మృతి రూపములైన ఉత్సవములు విరివిగా జరుగుచున్నవి. ఇందెవ్వరికీ, మత భేదంగాని, జాతి భేదంగాని, పొడసూపుట లేదు.

గాని, యీ సంప్రదాయాల్లో స్త్రీలు ఇంకా హెచ్చు ఉత్సాహాన్నీ ఆసక్తినీ చూపాలని నా అభిప్రాయము. సంగీతమునకు, స్త్రీల శారీర సంపదకు, ప్రకృతి సిద్ధమైన సహజ బాంధవ్యం సుప్రసిద్ధము. ఇంటింటా ప్రతీ ఉత్తమ గృహిణి, ఉదయ సాయం సమయాల్లో, చక్కని రక్త గాత్రాలతో, శ్రీ త్యాగరాజ గేయములను ప్రసారం చేయాలి. ఆ పరిసరాల్లో, యీ గాన వాహిని చల్లగా ప్రసరించి, ఆ వాతావరణాన్నంతా, మార్దవం చేయగల్గుతుంది. దానివలన విశ్వ మాంగళ్యశోభ వెల్లివిరిస్తుంది.

ఎక్కడచూచినా సంగీతాన్ని ద్రవ్యార్జన సాధనంగా పెట్టుకొన్న స్త్రీ పురుషులే సంగీతంలో కొంత ప్రతిభను గడిస్తున్నారు తప్ప, మిగతావారి కళలను బొత్తిగా నిరాదరిస్తున్నారు. మన దురదృష్టంవల్ల ప్రతీ కళకు, క్రియకూ, మాటకుకూడా, మార్కెటు వాల్యూ కట్టడం పరిపాటి అయిపోయింది. దీనివల్ల జనసామాన్యం యొక్క నైతిక, సాంఘిక, ఆధ్యాత్మిక ఔన్నత్యం క్రుంగిపోతుంది. కావున, నగరాల్లోనూ, పల్లెల్లోనూ కూడా సంగీత శిక్షణకు ప్రత్యేక బాలికా కేంద్రాల్ని ఏర్పాటుచేసి, ఇంటింటికీ తిర్గి నిర్బంధంగానైనా, బాలికలకు, యువతులకు కూడా సాముదాయిక సంగీత శిక్షణం ఇవ్వాలి. అంటే, పిల్లలకు చెప్పినట్లు, స్వరావళి, జంటలు, అలంకారాలు గాక, శ్రీ త్యాగరాజస్వామి రచించిన "దివ్యనామ కీర్తనలను" సాముదాయకంగా పాఠం చెప్పాలి. యీ దివ్యనామాలు, అట్టే హెచ్చు సంగీతం, రాగధోరణి లేకుండా, పాడుటకు, వినుటకు ఎంతో హాయిగా నుంటాయి. ఇంతకూ నే చెప్ప వచ్చిన దేమంటే—శ్రీ త్యాగరాజస్వామి తానొక నాయిక నని తలచి, చాలా కీర్తనల్లో, ముదితలార! నెలతలార! యని సంబోధిస్తూ, సీతారాముల నిత్య సేవాకైంకర్యము లందు స్త్రీ సమాజములకెంతో ప్రాధాన్యమిచ్చి, గృహిణీ ధర్మపద్ధతులను తీర్చి దిద్దినాడు.

శృంగారకళ, కేవల కామ్యోపభోగమే పరమావధిగా గలదిగాదు. నిత్య శృంగారంతో, భగవంతుని, అనంతలావణ్య, మోహన స్వరూపమును, భావనచేయాలి. దీనినే రసోదయ మంటారు. ప్రపంచమంతా ఈ రసోదయంచేత, రంజితమైతే, సర్వత్రా శాంతి తాండవిస్తుంది. శాంతి, సామ్యము, సంతోషము, ప్రణాళికలవల్ల, వాగాడంబరంవల్ల సాధించ వీలుగానివి. శ్రీ త్యాగయ్యవంటి మహాపురుషుల జీవితాల్ని, భావన చేయడంవల్ల, వాటిని కొద్దో, గొప్పో అనుసరించడంవల్లా, తుదకు వారిని స్మరించడంవల్లా, శాంతి సౌభాగ్యాలు చేకూరి, శాశ్వత మాంగళ్యం తనకు, లోకానికీ కల్గుతుంది—

"రామునిపై మరుల్గొని, విరాళి తపించి, సరాగమాడి, మా రామొనరించి, కాదని విరాగము, నూపి పరాత్పరా! పరాకేమిర! పల్కవేర! చలమేలర! ఏలర! యంచు గోపికా భామిని వోలు నీ మధుర భక్తికి వే వినతుల్ కళానిధీ!"

"జయతు—రామనామ"



# స్త్రీ హితైషిణీ మండలి

## బాపట్ల.

ఆర్ ధనలక్ష్మమ్మగారి అధ్యక్షతను 10-1-52 తేదీని జరిగిన మండలి సర్వ సభ్య సమావేశములో బాపట్ల స్త్రీ హితైషిణీ మండలి కార్య నిర్వాహక వర్గ సభ్యురాండ్రు ఎన్నుకొనబడిరి.

అధ్యక్షురాలు:
కనుపర్తి వరలక్ష్మమ్మగారు

ఉపాధ్యక్షురాలు:
వెలగపూడి వైదేహీ లింగమూర్తిగారు బి.ఏ.

కార్యదర్శిని:
కోటంరాజు వేంకట సీతాబాయిగారు

సహాయ కార్యదర్శినులు:
కామరాజు వెంకటలక్ష్మమ్మ, కొంపల్లి విజయలక్ష్మమ్మగార్లు

సభ్యురాండ్రు:

కోనా సుభద్రమ్మ — చంద్రమౌళి శాంతావతమ్మ
నోరి శ్యామలాంబ — మల్లాది వెంకటసుబ్బమ్మ
ఆర్. ధనలక్ష్మమ్మ — మద్దిభట్ల నరసమ్మగార్లు.

—కో. వేం. సీతాబాయి

(16వ పేజీ తరువాయి)

లోనేనా, లేక సన్నిహితంగా ఉన్న నేపాల్‌లోకూడా అమలు జరుగుతుందా అన్నది ఇకముందు తేలవలసి ఉన్నది.

* * *

అమెరికా చేసే ఆర్థిక సహాయం మంచిదా లేక చెడ్డదా అని దేశంలో ప్రశ్నోత్తరాలు జరుగుతున్నవి. ఈ సహాయ కార్యక్రమాలన్నీ 'పరస్పర భద్రతా సహాయ చట్టం' అనే చట్టం క్రింద చేయబడుతున్నవి. అయితే ఈ చట్టం క్రింద, అమెరికన్ సహాయం తీసుకునే దేశాలు కొన్ని షరతులను అమలు జరపాలి. ఇవి కమ్యూనిస్టు దేశాలతో ఆ దేశాలకు సంబంధం లేకుండా చేయటానికి ఉద్దేశించబడ్డవి. వాటిని అమలు జరిపితే, తాము అనుసరించదలచిన తటస్థ విధానం భగ్నమయిపోతుందని పర్షియా ప్రధాని మొసాదిక్ విమర్శించారు.

పర్షియాతోపాటుగా ఈజిప్టు, ఇరాక్, బర్మా, ఆఫ్ఘనిస్తాన్, ఐర్లండ్‌లు కూడా అమెరికా షరతులను అమలు జరపటానికి నిరాకరించినవి. దాంతో పాపం, అమెరికన్ దాతృత్వం ఇంకిపోయింది. ఈ ఆరు దేశాలకూ అమెరికన్ సహాయం బందు చేయబడ్డది.

దీని తక్షణ ఫలితం మధ్యప్రాచ్యం, బర్మా ప్రాంతాల్లో అమెరికన్ యుద్ధ వ్యూహాలు భగ్నంకావటమే.

* * *

సూయజ్ ప్రాంతంలో బ్రిటిష్ సేనలకూ, ఈజిప్షన్లకూ నానాటికీ సంఘర్షణలు జోరుగా జరుగుతున్నవి. ఈజిప్టు భారీ పోరాటానికే సిద్ధపడుతున్నట్లు కనిపిస్తున్నది. అమెరికా, ఫ్రాన్స్, టర్కీలుకూడా సూయజ్ ప్రాంతానికి సేనలు పంపాలని బ్రిటిష్ ప్రధాని చర్చిల్ సూచించాడు. దీనిని సహించేది లేదని ఈజిప్టు ఆ దేశాలకు స్పష్టపరిచింది.

పర్షియా ప్రభుత్వం తమ దేశంలో ఉన్న బ్రిటిష్ ఉపరాయబారుల కార్యాలయాలను మూసివేయించింది. సైనిక సహాయం విషయమై పర్షియాతో ఒప్పందం కుదరలేదని అమెరికా విదేశాంగ మంత్రి అంగీకరించాడు. ఇండొనీషియా, లిబియాలు ఈజిప్టురాజును సుడాన్‌రాజుగా గుర్తించినవి.

ఉత్తరాఫ్రికాలో ఫ్రెంచి 'ధర్మకర్తృత్వం' క్రిం[illegible] ఉన్న ట్యునీషియాలో ప్రజలు స్వాతంత్ర్యంకోసం ఉద్య[illegible]మాన్ని ప్రారంభించారు.

* * *

అమెరికా కీలుబొమ్మ అయిన జపాన్ ప్రభుత్వ[illegible] చాంగ్ కై షేక్‌తో ఒప్పందం చేసుకోబోతున్నది. జపాన్‌ను సాయుధం చేయటానికి అమెరికా సన్నాహాలు యథేచ్ఛగా సాగిపోతున్నవి. సయాం ద్వారా కొమింటాంగ్ సేనలు అమెరికన్ల నాయకత్వాన చైనా సరిహద్దులకు జేర్చబడు[illegible]తున్నవి. బర్మాలోని కొమింటాంగ్ సేనలు బర్మాకు ప్రమాదకరమని మాజీ ప్రధాని బామా, పెకింగ్‌లోని బర్మా రాయబారి హెచ్చరించారు. ఈ సంఘటనలూ, అమెరికా సహాయాన్ని బర్మా నిరాకరించటమూ, తూర్పు పాకిస్థాన్ సమీపంలో ఉన్న అరకాన్ ముస్లిములు బర్మా ప్రభుత్వం మీద మళ్లీ తిరుగుబాటు సాగించటమూ చూస్తే, బర్మాలో పరిస్థితులు త్వరలోనే విషమించేట్లు కనిపిస్తున్నది.



## కృతజ్ఞత

శ్రీ విద్యాభిమానులైన తమ తండ్రిగారు కీ. శే. రావుబహదూర్ శ్రీ కల్లి చిట్టి అబ్బాయిగారి దివ్యస్మృతి చిహ్నంగా, శ్రీమతి చన్నఘంటమ్మగారు, ఆంధ్ర మహిళా సభలో, ఎనిమిదవ తరగతి ప్రభుత్వ పరీక్షలకు యువతులకు తర్ఫీదిచ్చు ఏర్పాటులకుగాను, రూ 300/- వార్షిక విరాళాన్ని ఏర్పాటు చేశారు.

శ్రీమతి తోలేటి శేషమ్మగారు, శ్రీమతి వేమవరపు గంగాభవానిగారు, సభకు రూ 100/-లు చందా చెల్లించి, యావజ్జీవ సభ్యురాండ్రైనారు.

వీరికి మా కృతజ్ఞత.

ఆంధ్ర మహిళాసభ.

# మానసిక శాస్త్రం

* శ్రీమతి కె. సుగుణమణి *

## 70 ఏళ్ల క్రితం :

1880వ సంవత్సరం అది. వియన్నాలో డాక్టరు బ్రీయరూ, మెడికల్ ప్రథమ పరీక్ష యిస్తున్న జర్మన్ విద్యార్థి సిగ్‌మండ్‌ఫ్రాడ్డూ కలిసి, మతి భ్రమించిన ఒక అమ్మాయిని పరీక్షిస్తున్నారు. ఆమె వయస్సు 21 సంవత్సరాలు. మంచి తెలివితేటలు కలది. 2 సంవత్సరాల రుగ్మత కాలంలో విపరీతమైన శారీరిక, మానసిక అలజడులకు లోనైంది. కుడిచేయి కుడికాలు పడిపోయినవి. నొప్పి కనబడదు. అప్పుడప్పుడు వామ భాగంలోకూడ యీ చిహ్నాలే కనబడేవి. దృష్టిలో లోపం, తల ఊపు, తిండి సహించకపోవడం, వడ దాహం వేస్తున్నా, వారాల తడబడిగా, పానీయాలేమీ స్వీకరించలేకపోవడం, సంభాషణ శక్తి కుంటుపడ్డం, మాతృభాష (జర్మనీ) మర్చిపోవడం, మాట్లాడలేకపోవడం, క్రమంగా మధ్య మధ్య మతిభ్రమ సంధించడం, కడకు ఆమె వ్యక్తిత్వంలోనే మార్పు, ఇవి రోగ చిహ్నాలు.

## ఏమిటి రోగం ?

ఈ చిహ్నాలు చూస్తే ఎవరైనా ఇదేదో 'మతిభ్రమ' మరి లాభంలేని కేసు అని నిరాశ వెలిబుచ్చుతారు. డాక్టరుకు యీ నిరాశలో ఒక ఆశ కనిపిస్తుంది. రోగి యింకా యుక్తవయస్కురాలు. హృదయం, మూత్ర పిండాలు మొదలైన ముఖ్యాంగాల్లో ఏ రోగ చిహ్నమూ కనిపించదు. మెదడుకుకూడా ఏమీ దెబ్బతగిలి పాడయినట్లు లేదు. పాపం ఆ అమ్మాయి తట్టుకోలేని గొప్ప మానసిక అలజడుల్లో పడ్డంవల్ల వచ్చిన చిహ్నాలివి. వీన్ని గ్రీకు వైద్యులు 'హిస్టీరియా' అంటారు. ఇదే అనేక రోగ చిహ్నాలకు కారణమౌతుంది. ముఖ్యాంగాల్లో రోగచిహ్నాలు లేకపోవడంవల్ల, రోగి మరణించదని, తిరిగి సహజ స్థితికి ప్రకృతి సిద్ధంగా వస్తే రావచ్చునని డాక్టరు తలచేడు. ఈ అమ్మాయి కేసు విచారించి చూడగా తేలింది ఏమిటంటే : 'ఈమె అపరిమితంగా ప్రేమిస్తున్న తండ్రి, రోగగ్రస్తుడైయున్నప్పుడు, ఈమె పరిచర్యలు చేస్తుండగా, పై రోగ చిహ్నాలు ప్రారంభించడం, తదుపరి తండ్రి మరణించగా, తాను నిస్పృహాలో పడిపోయి, ఈ రోగాంకురంవల్ల ఆ విషయమే మర్చిపోవడం.' మెదడుకు, ముఖ్యాంగాలకు ఏమీ రోగంలేదనీ, ఇది 'హిస్టీరియా' అని గుర్తించినంత మాత్రంచేత డాక్టరు అదనంగా చేయగలిగింది ఏమీ అగపడలేదు. పైగా అశ్రద్ధచేయడం సహజం. ఎందుకంటే ఇది తన మందులకేమీ లొంగేదికాదు గనుక ! తతిమా రోగాల్ని గురించి తెలిసి ఉండవచ్చుగాని హిస్టీరియా అనేసరికి డాక్టరుకు ఆ రోజుల్లో ఏమీ తెలిసేదికాదు. ఇలాంటి రోగాలముందు డాక్టరు చేతకానివాడవుతాడు గనుక ఈ రోగుల్ని గురించి అశ్రద్ధ వహించడం సహజం. పైగా పిచ్చి వేషాలు, చిహ్నాలునని పొమ్మనడంకూడ మామూలు !

## బ్రీయర్ ప్రయత్నం :

కాని, డా॥ బ్రీయర్ మాత్రం అలా చెయ్యక, (మొదట్లో ఆమెకు ఎలా సహాయం చేయగలడో తనకు అర్థంకాక పోయినప్పటికీ) చాల ఓపికతోటి, శ్రద్ధతోటి రోగిని గురించి విచారించడం మొదలెట్టేడు. చాల తెలివైన పిల్ల, సత్ప్రవర్తన కలది ; పాపం, ఎందుకో ఇలా అయిపోయింది. అని చాల ఓపిగ్గా కృషిచేసేడు. ఇలా ఓర్పూ, సానుభూతీ చూపించడమే ప్రథమ చికిత్సగా పరిణమించింది. ఆమెకు మతిభ్రమల మధ్యమధ్య కొంచెం తెలివి రావడం, అప్పుడప్పుడు తనలో తానే ఏవో మాట్లాడుకోవడం బ్రీయర్ కనిపెట్టేడు. ఇలా మధ్యమధ్య వచ్చే మాటలు, ఆమె పూర్వపు స్మృతిపథంతో సంబంధించిన ఊహాల్లో ఉత్పత్తియైనట్లు కనబడ్డాయి. డాక్టరు ఆమెను ఒక మాదిరి 'హిప్నాటిక్ స్థితి'లో ఉంచి, ఆ మాటలే మళ్లీ ఆమెవద్ద అంటే, ఆమె పూర్వపు స్మృతిపథానికి సంబంధించిన విషయాలేమైనా జ్ఞప్తికి తెస్తాయేమోనని ప్రయత్నించేడు.

(తరువాయి 31వ పేజీలో)

# ఆషామాషీ

"అవివేక"

### అర్రెర్రెర్రే——

అంతా అయ్యాక అర్రెర్రెర్రే—అని నాలుక కరుచుకుంటున్నారు, ఓడిపోయిన ఒక్కొక్క మంత్రిసత్తములు, ఇతర కాంగ్రెసు అభ్యర్థులుకూడా. కుంభకర్ణ మహావస్థలోనున్న భారత ప్రధానికి ఆంధ్రాలో కలిగిన భూకంపం కుదుపు ఇప్పుడిప్పుడే సోకింది. 'ఆహా, దీనికేదో ప్రబలమైన కారణం ఉండాలి—వివరించండి' అంటూ ప్రాంతీయాధిపతులను మెల్లిగా ఇప్పుడే కోరాడాయనగారు. ఆంధ్రులు కూడ భారత ప్రజలేనని, ఆంధ్రుల సహకార సానుభూతులు భారతదేశ ఐక్యతకు, పటిష్ఠతకూ అత్యంత ఆవశ్యకములనీ, యింత బ్రహ్మాండమైన పిడుగు సోకుతుచేగాని ప్రధాని తలలో ప్రవేశించలేకపోయినాయి.

"కాంగ్రెసుపట్ల ఇంత గాఢమైన అసంతృప్తి ప్రజలకు కలిగిందని నే నిసుమంతైనా అనుకోలేదని" వెఱ్ఱితనాన్ని అతి సహజంగా వెలిబుచ్చారు మదరాసు ప్రధాని రాజాగారు.

కులతత్వాన్ని కూడగట్టుకుంటూ కేంద్ర ప్రభుత్వ ఆదర్శాలనుకూడా ధిక్కరించిన గోపాలరెడ్డిగారు కమ్మ, రెడ్డి, కులతత్వ భేదాలు తమ ఓటమికి చాలా పెద్ద కారణంగా కనబడుతున్నాయని వచించారు. పైగా విద్యాశూన్యతచే అనర్హులైన ప్రజలకు వయోజన ఓటింగు హక్కునీయుట పెద్ద పొరపాటనీ, పిల్ల అధికారుల చిల్లర అల్లరులు ప్రజలలో ప్రబలిన అసంతృప్తికి హేతుభూతాలనీ నీళ్లు నమిలారు.

కంట్రోల్సు, మద్య నిషేధ చట్టం బ్లాకు మార్కెటుకు తప్ప ప్రజల కేవిధంగానూ సహకరించలేదని, కాంగ్రెసు కార్యాలయాలకు వెనుకపక్క దొంగకల్లు తయారీ, ముందు పక్క బియ్యపు గుట్టలూ ప్రత్యక్షంగా నెలకొల్పబడ్డాగాని నాయకులకు తెలియక పోయాయి. 'కల్లుతెచ్చే పెద్దమనిషికే మా ఓటు'ని ప్రజలు బహిరంగ ప్రదర్శనాలు చేసేటంతవరకూ, బ్లాక్ మార్కెటు నరికట్టలేక పోవటంవల్ల తమ కంట్రోల్సు, శాసనాలు, విపరీత ఫలితాలను పొందాయనే ఊహ కాంగ్రెసువాదుల మనసునకు గోచరించలేదు. 'అమాయక ప్రజలమీద పోలీసులు జరిపిన అక్రమాలను యేవిధంగా పరిశీలించారు, ప్రజలకు న్యాయాన్ని ఏవిధంగా సమకూర్చారు, ప్రజలపై మీకు గల బాధ్యత నేవిధంగా నిర్వహించుకున్నార'ని కోట్లకొలది ప్రజలు బహిరంగ సభలలో నిలవేసి అడిగినప్పుడు, తమ అసమర్థతకు క్షమార్పణ కోరుకొనుటకు పైగా, అహంభావ పూరితమైన జవాబులచే వారి మనసులను నొప్పించిన అభ్యర్థులు ఇప్పుడు అర్రెర్రే— అనుకొనిమాత్రం యేమి లాభం?

ఇంకా పైగా,

"వెఱ్ఱి వెధవలు వద్దంటే మాత్రం నేను మానుతానా? నేను పుట్టిందే దేశసేవకు, నేను చేసేదే దేశసేవ. అర్థం తెలియక వ్యర్థులైన ప్రజల అభిప్రాయాలతో నాకు నిమిత్తం లేదు" అని కళావారు హుంకరించారు. కృష్ణానదీ జలాన్ని తమ నట్టింటకు తెచ్చి బంగారు పండిస్తానన్నాగాని వినని మూర్ఖ ప్రజను ఏమనాలా? అని భక్తవత్సలం తలపంకించారు. 6 ఔన్సుల రేషను యిచ్చినా, ప్రజలు నన్నే ఎన్నుకున్నారని ఆహార మంత్రి చప్పట్లు చరుచుకున్నారు.

ఏ కారణంచేతనైతేనేమి ప్రజలలో కాంగ్రెసు పక్షమంటే ఒక అతి హేయ్యభావం కలిగిపోయింది—ఇప్పుడు అర్రెర్రెర్రే—అని తల పంకించుకుంటున్న ఒక్కొక్కరూ యీ సంస్థయొక్క క్షీణదశకు కారకులే. ప్రజల అసమ్మతిని ప్రత్యక్ష ప్రమాణంగా తమ ఓటమిలో గాంచిన వీరు గౌరవంగా తప్పుకుంటే, సంస్థకూ, తమకూ గూడా మేలు చేసుకొన్నవారవుతారు. లేకున్న ఉద్రేకతజెందిన ప్రజలలో ప్రజ్వలించే అగ్ని యే ఆహుతిని గోరగలదో! ఆలోచనలో సంచరించని పక్షాన్న, ఇల్లంటుకున్న తరువాత బావిత్రవ్వ ప్రయత్నించిన చందము కాగలదు.

### తారల వేలం వెఱ్ఱి :

కలరా మశూచీ మొదలైన అంటువ్యాధులకన్నా విపరీతమైన వడితో అంతటా వ్యాపిస్తూ, ప్రజలను చుట్టవేస్తూ ఉన్న క్రొత్త రకమైన మానసిక వ్యాధి యీ తారల వేలం

వెఱ్ఱి. వారు కట్టిన కట్టు, వారు పెట్టిన బొట్టు, వారు చుట్టిన చుట్టు, వారి ఉనికి, వారి మనికి, వారి కులుకు, వారి పలుకు—అన్నీ ఒక కళా ప్రమాణంగా ప్రజా హృదయాలను వెఱ్ఱెత్తిస్తున్నాయి. సినీమా వెఱ్ఱిని మించి పోయింది యీ తారల వేలం వెఱ్ఱి.

దేనికైనా గాని చలామణి కావాలంటే, ఒక తార పేరు తగిలించండి—అంజలీదేవి అంచు, భానుమతి గాజు, కాంచనమాల కుంకుమ, కన్నాంబ కలర్—ఓస్ ఉఫ్న ఊది అంగడి నిమిషంలో ఖాళీ చేస్తారు మన కళా ప్రియులగు స్త్రీలు. రిక్షావాడు తార బొమ్మను తగిలిస్తే కిరాయి దొరుకుతుంది. కాఫీ హోటలువాడు తార బొమ్మను అంటిస్తే, జనం గుమిగూడతారు—త్రివర్ణ ముఖచిత్రం తారదే అయితే, పత్రిక పదిఊళ్లకు అమాంతంగా పరుగులెత్తుంది. ఇక తారల నఖశిఖ పర్యంత వర్ణనలు, కాలకృత్య వివరాలు, అభిరుచులు, అభిభాషణలు, ఆదర్శాలు—యిట్లాంటి విశేషాలు తెలిసికోవటానికి చెవులు కోసుకుంటారు తారా ప్రియులు.

పిల్లల పుస్తకాల్లో తారల బొమ్మలు, రసికుల అంతఃపురాల్లో తారల చిత్రాలు, విద్యార్థుల వినోదాల్లో తారల కబుర్లు, ఒకటేమిటి, అంతా బ్రహ్మమయం అనటం కల్ల, అంతా తారామయం అనటం నిజంగా, ఎక్కడపట్టినా వారి మాటే, వారి పాటే, వారి ఆటే—

ఇక తారల ప్రత్యక్ష సందర్శనం అంటే—ఇంక చెప్పనక్కరలేదు—ఖర్మం చాలక ఏ తారైనా ఫలానా రోజున ఫలానా చోట దర్శన మిస్తుందంటే చాలు, దోవను పోయే ప్రతి కారునూ గభాలున ఆపి తొంగిచూడటానికి వెనుతీయరు మన తారా ప్రియులు.

ఈ మధ్య తారల సంక్రాంతి సంబరాలు, ప్రతివారికీ ప్రత్యేక ముచ్చట గొలిపాయి. యిక వారి క్రికెట్టు ఆట—ఆరి—ఇంక చెప్పనే అక్కరలేదు. ఏమంటే—వేలం వెఱ్ఱి—పోనీ వారి పుణ్యమా అంటూ, క్షయ ఆసుపత్రికి రూ. 20,000 వసూలయ్యింది. పీపుల్సు పార్కులాగా, తారల పార్కు ఒకటి పెట్టేనో! ఆర్థిక మంత్రికి ఎవరూ సలహా చెప్పలేదేమో!

★



(23వ పేజీనుండి)

ప్రయత్నం ఫలించింది :

డాక్టరు ప్రయత్నం ఫలించింది. అతను అందించే మాటలు తీసుకుని ఆమె ఏవేవో చెప్పుకొచ్చేది. తన మతి భ్రమ కాలంలో తన బుర్రలో ఏ ఆలోచనలు పనిచేస్తుండేవో, మధ్యమధ్య జాగ్రదావస్థలో తాను పలికే పాడి మాటలకు అవి ఎలా సంబంధించినవో కూడా ఈ హిప్నాటిక్ స్థితిలో ఆమె చెప్పగలిగేది. ఆమె చెప్పే హంశాలన్నీ యుక్తవయస్కుల వ్యామోహాలు, ఊహా ప్రపంచంలోని పగటి కలలూ, నాజూకు నిగూఢం, విషాదకరం అయిన హంశాలు అయివుండేవి. వీటన్నిటికీ ఉత్పత్తిస్థానం, తాను పూర్వం రోగగ్రస్తుడై పడున్న తండ్రికి ఊడిగాలు చేస్తున్నప్పటి కాలం అన్నట్లు తేలేది. ఇలాంటి ఊహా ప్రపంచంలోని కలలు కొన్ని ఎప్పుడెప్పుడైతే ఏకరువుపెట్టేదో, అప్పుడు కొంత బంధవిముక్తురాలైనట్లూ, ఆరోగ్యమైన మానసిక స్థితిలోనికి వచ్చినట్లూ ఉండేది. మళ్లీ కొన్ని గంటల్లో మళ్లో రకపు మరపు మాటలు ప్రారంభించేది. మళ్ళీ పైవిధంగానే ఈ పాడిపాడి మాటలు అందించి, యీ పిచ్చి కూడా, డాక్టరు ప్రయత్నించి, తగ్గించుకు వచ్చేవాడు.

# ధనపిశాచం

※ శ్రీ వి. సుబ్బారావు ※

"హలో! Good Morning"

"Good Morning"

"ఎప్పుడేమిటి రావటం"

"నిన్ననే వచ్చాను."

"ఎక్కడా కనిపించలేదేం. నిన్నటినుండీ ఆడవాళ్ల లాగ ఇంట్లో కూర్చున్నారన్నమాట."

"ఆ...ప్రయాణ బడలికవల్ల నిన్న బయటికి రాలేదు."

"ఈ సంవత్సరం బి.ఏ. పూర్తవుతుందనుకుంటాను."

"అవును."

"తరువాత ఏమిచేస్తారేమిటి?"

"నిరుద్యోగ డిపార్టుమెంటులో చేర్తాను."

"అదేమిటి! అత్యుణంగా బి.ఏ. చదివి."

"నీదంతా పిచ్చిగాని...ఈ కాలంలో బి.ఏ. అంటే ఒక లెక్కా. ఎం.ఏ. పై చదువులు చదివినవారే చేతులు చచ్చిన దద్దమ్మలలా కూర్చుంటే."

"ఆ...అడగటం మర్చిపోయాను, మీ హైస్కూలు చదువు ఈ యేటితో పూర్తవుతుందనుకుంటాను. కాలేజీలో చేర్తారా?"

"ఆ...ఆడవాళ్లు ఎంత చదివినా ఇంట్లో కూర్చోవలసిందేగా."

"అదేమిటి. ఈనాడు మనదేశం సుభిక్షం కావాలంటే మన దేశంలోని ప్రతి ఒక్కరూ అక్షరజీవి కావాలి. బీచికి వెళ్దాం వస్తారా."

"స్కూలునుంచి ఇదే రావడం. వస్తా పదండి."

* * *

"సంసారం సుఖవంతం కావాలంటే భార్యా భర్తలలో ముఖ్యకారకు లెవరు?"

"ఏమిటిది సంసారం గొడవల్లోకి దిగారు."

"ఏమీలేదు. ఊసుపోక అడుగుతున్నాను."

"సంసారం సుఖవంతం కావాలంటే భార్యా భర్తల మనస్సులు ముఖ్యం. వారి మనస్సులు ఎడమొగము, పెడ మొగములైన ఆ సంసారబాట ముళ్లబాటగా పరిణమిస్తుంది. అట్లుగాక భార్యాభర్తల మనస్సు లేకమైయున్న వారెంత దైన్యావస్థలోనున్నా వారి సంసారబాట పూలబాటగా సాగిపోతుంది. సంసారసాగరం దరి చేరాలంటే వారి మనస్సుల కలయికయే ముఖ్యమని నా ఉద్దేశ్యం."

"ఒక ధనిక స్త్రీ ఉన్నదనుకోండి. ఆమె ఒక బీద వానిని ప్రేమిస్తోంది. అతడుకూడా ఆమె ప్రేమకు అనుయాయుడే. వారిరువురు వివాహం చేసుకుంటే వారి సంసార మెలా జరుగుతుంది?"

"నేను చెప్పేదొక్కటే. ఈ కాలంలో ధనికునికి, పేదవానికి హస్తిమశకాంతర భేదమున్నది. ఒకవేళ వారి మనసు లొకటియైనా వివాహానంతరమైనా ధనగర్వం వారి సంసారంలో ప్రవేశిస్తుంది. అయినా ఈ సంసారం గొడవ మనకెందుకు మనలో ఎవరమును అందులో ప్రవేశింప లేదుగా."

"తిరిగి మీ ప్రయాణమెప్పుడు?"

"బహుశా రేపు సాయంత్రం."

"వీలుకాదు. ఎల్లుండి నా జన్మదిన పండుగ. తప్పక మీరు రావాలి."

"నీ జన్మదిన పండుగకు రావడానికి నేనేమీ జమీందారీ బిడ్డను గాను. మీ నాన్నా కోటీశ్వరుడు. మేమా మధ్య కుటుంబీకులం. కోటీశ్వరులిండ్లకు రావడానికి కోటీశ్వరులే తగుదురుగాని మేము తగం. సరళా! నీ కోర్కెను తిరస్కరించినందుకు క్షమించు. ఇన్ని దినాలనుండి మనం స్నేహంగా మెలగుతున్నాం. ఇక నీవు నా స్నేహం మానడం మంచిది. అలా కాకుంటే నీకు, నాకు చాలా ఇబ్బందులు కలుగుతాయ్. మన స్నేహం ఇప్పటికే చాలా మించిపోయింది."

రమేశ్! నీవు ఇంతవరకు చెప్పింది సావధానంగా విన్నాను. ఇక నా వాక్యాలు విను. ఏనాడు నీవు నన్ను కారు ప్రమాదంనుండి రక్షించావో ఆనాడే నేను నీదాననయాను. ఈ సంగతి ఇన్ని రోజులనుంచి చెప్పుదామనుకుంటున్నాను. కాని సావకాశం చిక్కలేదు...అవును. నేను కోటీశ్వరినే. నేను కోటీశ్వరి కావడం నా పొరపాటా? అంతమాత్రాన నీవు నా ప్రేమను నిరాకరించడం కేవలం నన్ను ఖూనీ చేయడమన్నమాట."

(తరువాయి 49వ పేజీలో)

# నిర్భాగ్యుని జీవితం

* శ్రీ చామర్తి కనకయ్య *

అతను మా అందరి దృష్టినీ బాగా ఆకర్షించాడు. వయస్సుకూడ 30కి తక్కువే వుంటుంది కాని ఎక్కువ వుండదు. అతని లక్షణాలన్నీ బాగానే వున్నాయి. ఎటొచ్చీ కుడికాలు ఎందువల్ల దెబ్బతిన్నదో కుంటి నడుస్తాడు చేతికర్ర ఆధారంతో.

మా ఎదురింట్లో అతను ప్రవేశించి రెండు నెలలు కావస్తున్నది. ఎంతటి కొత్తవాళ్ళయినా మా గ్రూప్‌తో ఇట్టే స్నేహితులైపోతారు. దానికి కారణం అంతర్జాతీయ రాజకీయాల్నుంచి అరుగుమీద అక్కరలేని గొడవలవరకూ మాకు కావాలి కనక. క్రొత్త స్నేహితుల్ని ఆహ్వానించటానికైనా, ఏడిపించటానికైనా మాతో సమానమైనవాళ్లు లేరనే ధృఢమైన నమ్మకం మాకుంది. ఎప్పుడూ అతనింట్లో ఆడవాళ్ళ సందడి కనిపించలేదు. అతనికింకా పెళ్ళి కానట్లు అనధికారవర్గవార్త. మా లెక్క లేకుండా ఎదురింట్లో వుండికూడా తప్పించుకు తిరగటం మాకేమీ బాగా తోచలేదు. ఆ సందర్భంలోనే మా ఆవిడ కూడ అంటుంది, 'బ్రహ్మచారులమీద మన సభలో ఏవిధమైన నిషేధమూ ప్రకటించలేదే' అని. రెండు మూడు పర్యాయాలు 'టీ'కి కూడా ఆహ్వానించాం. కాని అతను తప్పించుకున్నాడు. మా శాస్త్రి అతన్నిగూర్చి 'రిక్షా' వాని దగ్గరనుంచి సమాచారం సేకరించాడు. అతను బ్యాంక్‌లో పనిచేస్తున్నాడట. అతని పేరుకూడా తెలిసింది. మా ఆవిడకూడ షెర్‌లాక్ హోమ్సు, పీటర్ విమ్స్, ఫాదర్ బ్రౌన్, సెక్స్టన్ బ్లేక్ బాగా చదివింది. ఏ విషయమొచ్చినా 'డిటెక్టివ్ ప్రశ్నలు' ప్రారంభం.

మా శాస్త్రి "ఇతరుల విషయాల్లో కలుగజేసికొని వాళ్ళ గొడవలు త్రవ్వి తెలిసికోనటం" ఎందుకంటాడు? 'నీకేం తెలుసులేరా' అంటుంది మా ఆవిడ. శాస్త్రి అందుకు ఒప్పుకోడు. వాదన ప్రారంభం. నిరాఘాటంగా సాగుతుంది. 'సీరియస్'గా వాదన వెడుతూందని తోచటంతోనే ఎవరో ఒకరు అప్రయత్నంగా ఒక హాస్యపుముక్క విసరటంతో ఆఖరు.

నేను ఆ ఎదురింటి ఆయన్నిగూర్చి చాలారోజుల వరకూ మరచిపోయాను. మా శాస్త్రీ, ఆవిడగారు కూడ ఇంకా ఆతనిపై పరిశోధనలు జరుపుతున్నారని తెలిసింది. ఎక్కడికో పనివుండి వెళ్ళి, తిరిగి సాయంకాలానికి వచ్చేటప్పటికి ప్రారంభించింది శ్రీమతి—

'మీరు ఎందు కతన్ని ముఖాముఖి ప్రశ్నించకూడదు,'

'ఎవరిని ప్రశ్నించటం?' నాకు తెలియనట్టే అడిగాను.

'ఎదురింటిలోవుండే ఆయన్ని,' అంది. శాస్త్రి మాత్రం వింటూ కూర్చున్నాడు.

'అతని గొడవ మీకెందుకు. అతనిమానాన అతన్ని బ్రతకనివ్వక.'

'మన ఎదురింటివాడైయుండి అతనెవరో తెలిసికోకుండా వుండటం, ఏమంత మంచిది. అతను బహుశః ఆ కుంటికాలువల్ల మన ఇంటికి రావటానికి సిగ్గుపడవచ్చు. మనిషికూడా ఎప్పుడూ ఏదో చెయ్యిజారవిడుచుకున్నట్టు, దేనికోసమో తిరిగి వెదుకుతున్నట్టు నిరాశగా వుంటాడు, చూశావుగా' అన్నాడు శాస్త్రి, నాకుకూడ తిరిగి ఆ విషయంలో ఉత్సాహం కలిగించాలని. కాకపోతే నాకు మాత్రం అతన్ని గూర్చి తెలిసికోవాలని లేదూ!

ఒక సాయంత్రం నేను ఎక్కడినుండో ఇంటికి తిరిగి వస్తున్నాను. ఆ సమయానికే అతనూ ఆఫీసునుండి తిరిగి వస్తున్నాడు. 'నమస్కారం!' అన్నాను. ఏ విధమైన మార్పు ఆ మనిషిలో లేదు నాకు తిరిగి నమస్కారం పెట్టినప్పుడు.

'మీకు ఇల్లు సదుపాయంగానే వుందనుకుంటాను' అన్నాను. అతను 'బాగానే వుంది,' అని ముక్తసరిగా జవాబిచ్చాడు. కాని అక్కడితో సంభాషణ ఆఖరయిపోతు

జని తోచి, ఎదురు నిలచి "మీరు తప్పక ఈవేళ మా యింట్లో 'టీ' తాగాలి," అని కోరుకున్నాను.

"ఎప్పుడో ఒకప్పుడు తప్పక వస్తాను. నేను ఇంతకు ముందే వచ్చివుండేవాణ్ణి, కాని!" అని అనుమానంగా ఒక నవ్వుతో అనేశాడు. అంతే.

మరునాటినుండీ అతను మా పేకాటలోనూ, మా వాదనలలోనూ చాలా హుషారుగా పాల్గొనేవాడు. కాని అతని కాలు విరగటం గురించే మాకు చాలా విచారంగా వుండేది. 'కాలు ఎందుకు విరిగింది' అని మా ఆవిడ అతన్ని సమయం చూసుకొని ప్రశ్నిద్దామనుకొనేది, కాని అడగబోయేసరికి ధైర్యం చాలేదికాదు. నేనుకూడ అడగలేక పోయాను ధైర్యంచేసి.

అతను మాకు పాతబడిపోయాడు. ఒకరోజు సాయంకాలం వచ్చి, ప్రవేశిస్తూనే 'మీ అందరి దగ్గరా సెలవు తీసుకోటానికి వచ్చాను' అన్నాడు.

'నిజంగానా?' అని మేమంతా ఆశ్చర్యపోయాం.

'నాకు బదిలీ అయింది. రేపు ప్రొద్దున్న రైలుకే వెళ్ళిపోతున్నాను' అన్నాడు.

"ఆం, నువ్వు వెళ్ళటం మా కిష్టంలేదు. ట్రాన్సఫర్ కేన్సిల్ చేయించెయ్, సెలవు పెట్టెయ్" అన్నాను.

అట్లా కుదరదన్నాడు. ఒక్క నిమిషం కూడ ఆలస్యం చేయటానికి వీల్లేదన్నాడు. అయితే కాస్త 'టీ' తాగి పోదువుగాని అని కూర్చోపెట్టా. 'టీ' త్రాగి. "ఇదే నేను మొదటిసారి ఈ ప్రదేశంలో మీ 'టీ' రుచి చూచాను. ఇదే ఆఖరిసారి కూడాను. మీరంత బాగా 'టీ' తయారుచేశారు. ఎవళ్ళయినా మంచి 'టీ' త్రాగదల్చుకునేముందు మీ దగ్గర 'టీ' రుచి చూడాల్సి వుంటుంది" అన్నాడు.

"అంత గొప్పగా పొగడకండి" అంది మా ఆవిడ. తరువాత కాస్సేపు అతను వెళ్ళబోయే వూరు, అతను అక్కడ చేయవలసిన పనులు, మాతో అతని స్నేహం కలిగించిన ఆనందం, గూర్చి మాట్లాడి వెళ్ళిపోతూ, 'మా యింట్లో ఓ పది నిమిషాలు మాట్లాడుకుందాం వస్తారా?' అని నన్ను అడిగాడు. అతను అహ్వానించటంతీరు నన్ను ఆశ్చర్యపరచినా, అతన్ని అనుసరించాను.

గది బయట రెండు కుర్చీలు వేశాడు. ఇద్దరం కూర్చున్నాం. అవతలిగదిలో పనిమనిషి సామాను సర్దుతూంది. కాస్సేపు నిశ్శబ్దం ప్రవహించింది. ఆ నిశ్శబ్దంలో అతను చాలా విచిత్రంగా చూశాడు. ఆ చూపులో చాలా లోతైన, అవ్యక్తమైన కష్టగాథలు అణిగివున్నట్లు తోచింది.

"నేను ఎట్లా కాలు విరగగొట్టుకున్నానో అని మీరంతా చాలా కుతూహల పడుతున్నారు కదూ" అన్నాడు. ఆ ప్రశ్న అతనినుండేనా అని అనుమానంగా చూశాను. మాకు కలిగిన అనుమానమే అతనికీ అవగతమైనట్లు తోచింది. నే నెప్పుడూ ఆ ప్రమాదాన్నిగూర్చి ఆలోచించనైనా లేదని అందామనుకున్నా కాని నాకు ఒక్క వాక్యం మాట్లాడటానికి కూడ టైమివ్వకుండానే ప్రారంభించాడు తిరిగి.

"నేనీ విషయం ఇంతకు ముందెపుడూ ఎవరితోనూ చెప్పలేదు. మీరు ప్రాణసమానమైన స్నేహితులని చెపుతున్నాను." అని నానుంచి సమాధానంకోసం చూస్తున్నట్టు చూశాడు. ఉపోద్ఘాతం ఉత్సాహం కలిగించటంతో తలవూపాను. అతను చెప్పటం మొదలుపెట్టాడు.

"ఇదంతా ఆరు సంవత్సరాల క్రితం జరిగింది. అప్పుడు నేను కాకినాడలో వుంటూండేవాణ్ణి. ప్రొద్దున్న బ్యాంకుకు పోయి, సాయంకాలం తిరిగి వస్తూండేవాణ్ణి. నేనుండే వీధి చివరన ఒక పెద్ద మేడవుంది, ఒక ప్లీడరు గారిది. అతన్ని గూర్చి చెప్పవలసిన అవసరం ఏమంటే వారమ్మాయి ఒకత్తె కాలేజీలో చదువుతుండేది. ప్రతిరోజూ ప్రొద్దున్న నేను బ్యాంకుకు పోయేదారి అదే కనుక, సరిగ్గా ఆ మేడదగ్గరకు వచ్చే సమయానికే ఆ అమ్మాయికూడా బయటకు వచ్చి కారులో కాలేజీకి వెళ్ళేది. ఇదంతా మొదట్లో 'అప్రయత్నంగా' జరుగుతూందనుకునేవాడిని. కాని ప్రతి రోజూ అదే విధానం అవటంవల్ల ఇది ప్రయత్నపూర్వకంగా జరిగే పని అని తోచింది. ఆమె పెద్ద అందమైనదేం కాదు. ఏదో సాధారణమైన అందమైనా, ఆ కళ్లు, అంత అందమైన కళ్లు నా జీవితంలో అంతవరకూ ఎక్కడా చూడలేదు.

ఆ అమ్మాయి నావైపుకూడా ఎప్పుడూ చూడలేదు. కాని నన్ను గురించిన వివరాలు తెలిసికొంటున్నదని మాత్రం గ్రహించాను. ఒకరోజున బ్యాంకుకు ఆలస్యంగా బయలుదేరాలనుకునే బయలుదేరాను. విచిత్రమేమిటంటే బయలుదేరవలసిన కారు యింటిముందే వుంది. ఆ యింటి దగ్గరకు వచ్చేసరికి, కాలేజీకి 'టైము' దాటిపోయినా కాంపౌండులో పచారుచేస్తూ ఆ అమ్మాయి పువ్వులు కోస్తూంది. అది వట్టి నటనగానే అనిపించింది నాకు. నేను పోతూండడంచూసి చరచర కారులోనికి వెళ్ళి కూర్చుంది. ఈ విధంగా ఈ ఆటతో ఏడాది గడిచింది. నాకు ఎందుకో విసుగనిపించలేదు. పైగా నా ఆలోచనా శక్తికి, నా మనస్థితికీ కొన్ని హద్దుల నేర్పరచింది. ఒక్కొక్కసారి ఖాళీగా కూర్చుని ఆలోచిస్తున్నప్పుడు నా గురించి ఆమెకంత శ్రద్ధ ఎందుకనిపించేది. ఆ అనుమానం నా మెదడును మెలికలు త్రిప్పివేసేది. ఆమె ధనవంతురాలు. ఆ గర్వం, పెంకెతనం, ఆ ధనంతోనే వస్తవి. కాని పెంకె మనుష్యులకు కూడా హృదయాలు వుంటాయి. ఆమె హోదాకు సరిపోక పోవచ్చు—కాని నాకున్న గౌరవంకూడ చాలా గొప్పది, అనే ఆలోచనలు వచ్చేవి. ఎన్నో రాత్రులు నిద్ర లేకుండా ఈ విషయమై నాలో నేనే తర్జన భర్జనలు జరిపేవాణ్ణి. కాని ఈ విషయంలో నేనేమీ అనుకున్నంత క్రియారూపంలో చేయలేదు. మా నాన్న అమ్మ కూడా ఏనాడో చనిపోయారు. మా అన్నగారు ఎక్కడో పాట్నాలో వున్నాడు. అతనుకూడా నా అభిప్రాయానికి అడ్డుపెట్టడు. ఈ విషయాలన్నీ ఆలోచించి ప్లీడరుగారి ముందు పెడదామని నిశ్చయించుకున్నా. నాకు నమ్మకం లేని పనులు నే నెప్పుడూ చేయలేదు. ఆ అమ్మాయికికూడా నా విషయంలో తన పాత్ర సవ్యంగా నిర్వహిస్తుందనే నమ్మకంకూడా వుంది.

ఒక ఆదివారం ఆయనకు తీరికగా వున్నప్పుడు ప్రొద్దున్నే వెళ్ళాను. ప్లీడరుగారితో నా మొదటి పరిచయం ఏమంత నాకు నచ్చలేదు. తన కూతురు మాదిరిగనే ఆయనకు కూడ పెంకెతనం ఉన్నట్టు గ్రహించాను. ఆయనతో మాట్లాడటానికి నాకు భయం వేసింది. వణుకుకూడా, సామాన్య విషయంకన్న ఎక్కువగా ఏదో ఎవరూ ఇంతవరకూ అట్లాంటి విషయంలో తలదూర్చని విషయం మాట్లాడ బోతున్నానని భయం. కాని ధైర్యం కూడదీసికొని ఏవేవో చిన్నచిన్నగా కొంతవరకు చెప్పి ఆశతో "ఈ విషయంలో మీ అమ్మాయికికూడ అంగీకారమే అనుకుంటా" అన్నాను—"నిజంగానా! నా కూతురు మిమ్మల్ని ఎరుగునా? పరిచయం వుందా?" అని ఏదో తన కూతురు చెయ్యకూడని పని చేసినట్టు ఆశ్చర్యంగా ప్రశ్నించాడు.

"నాతో పరిచయం లేదు. కాని నన్ను చాలాసార్లు చూచింది. ఆ పరిచయం" అన్నాను. ఆయన కూతుర్ని పిలిచాడు. ఆ అమ్మాయి నన్ను ప్రవేశిస్తూనే చూచి ప్రక్కగా ముఖం పెట్టుకొంది. ఆమె కళ్ళలోనూ, బుగ్గల మీదా "అరెరె! చూశానే" అనే ఎరుపు ఛాయలు ఇంకా కనబడుతూనే వున్నాయి.



"ఈ అబ్బాయి తన్ను వివాహం చేసికోవలసినదిగా నిన్ను కోరుతున్నాడు. ఈ అబ్బాయిని చాలాసార్లు చూశావటగా, ఆ పరిచయం వుందంటున్నాడు. నా

ఉద్దేశమేమిటంటే ఇది సరియైన విధానమేకాదు. నీ వుద్దేశం ఏమిటో చెబితే సమాధానించి పంపిస్తా" నన్నాడు ప్లీడరు గారు. కాస్సేపు మౌనం వహించి 'ఏం చేస్తున్నార'ని ప్రశ్నించింది తండ్రిని. ఆ ప్రశ్నతో నేను తిరిగి వెనుకకు తేబడ్డాను. ఇదే ప్రథమంగా నన్ను గురించి తెలిసికోవటం అని ఆ అమ్మాయి, అనుకోవటం లేదు అంతవరకూ.

"అతనికి బ్యాంకులో పని. నెలకి 150 జీతం" అన్నారు ప్లీడరుగారు. ఆమె ముఖచ్ఛాయ మారింది. నాకు అనుకూలంగానే చెబుతుందా అనే సందిగ్ధ పరిస్థితిలో పడ్డాను.

"మన హోదాకు తక్కువ కాదా!" కఠినంగా అనేసింది.

"అదంతా నువ్వే నిర్ణయించుకోవాలి, నీకే వదిలాను" అన్నారు ప్లీడరుగారు.

"ప్రస్తుత జీతం చూడకూడదు మీరు. ఒక ఏడాది గడిస్తే మంచి పదవి వస్తుంది" అని కూడ చాలా వెర్రిగా, తెలివి తక్కువగా కూడా చెప్పాను. నాకు ఆమెపైగల గౌరవ ప్రేమ భావాన్ని తెలియజేశాను. నా ధనంగూర్చి నా ఉద్యోగం గూర్చి ఆలోచించవద్దని కోరుకున్నాను. పోనీ తండ్రి హీనంగా చూస్తే కూతురుకూడా అట్లా ప్రవర్తించాలా! ఖచ్చితంగా "నేను అతన్ని పెళ్ళాడను" అనేసి వెళ్ళిపోయింది.

చుట్టూ అందరూ ఎగతాళిచేస్తున్నారనిపించింది. సిగ్గూ, కోపం శరీరాన్ని ఆవహించింది. అణువణువూ, ప్రత్యణువూ ఉడుకులెత్తుతున్నట్లు, ఏదో బాధ, ఏడుపు కూడ ధ్వని చేస్తూ వస్తున్నట్లు, వాతావరణం నలుమూలలనుండీ తిరస్కారం విరుచుకుపడుతూంది. ప్లీడరుగారికి క్షమార్పణ చెప్పుకొని ఒక్క నిమిషం ఆలస్యం చేయకుండా బయట పడ్డాను. ఆమె దైనందిన ప్రవర్తనను అపార్థం చేసికొన్నాను. కాని అపార్థం చేసికొన్నట్టు ఋజువైనా ఇంకా అట్లా అనిపించటం లేదు"...తల వాల్చుకున్నాడు.

అతను చెప్పటం ఆపివేశాడు. వీధిలో సాయంకాలపు ఎండ మాత్రం పడుతూంది. అదికూడా చూస్తున్నకొలదీ క్షీణించిపోతూన్నది. అతని కథ నన్ను ఎక్కడికో ముంచింది. కాని ఈ కాలు విరగటానికి ఈ కథకూ గల సంబంధం నాకు తెలియలేదు. తిరిగి అతనితో ఎట్లా సంభాషణకుపక్రమించాలో నాకు తెలియలేదు. కాని అతని 'moods' లో నుండి బయటకు వచ్చి తిరిగి ప్రారంభించాడు. "కొన్నాళ్లకు కాని ఆ బాధ నిమ్మళించలేదు. నా కోపం చాలవరకూ చల్లారిపోయింది. ఆ ఆదివారపు ప్రొద్దున్న నిండు వెలుగులో జరిగిన ఘోరావమానం కొన్ని సమయాల్లో ఆవహించి బాధిస్తూంటుంది. మరి మూడు నెలలలో ఆమెకు ఒక ధనవంతునితో పెళ్లి అయింది. అత్తవారింటికి వెళ్లిపోయింది. నాకు చాలా తృప్తిగా వుండేది. ప్రపంచంలో నాలో నేను ఎంతో ఆనందం అనుభవించాను. మూడేళ్లు గడిచిపోయాయి. ఈలోపుగా చాలాసార్లు పుట్టింటికి వచ్చి వెళ్లింది. కాని నేనెప్పుడూ చూడలేదు. ఆమెకు కొడుకు పుట్టాడన్న వార్తకూడ విన్నాను. కాని నాకేమీ అనిపించలేదు. ఆమె నా జీవితంలో ఒక స్థిరమైన గుర్తుగా, నా ఉత్సాహకరమైన సమయాల్లో ఏదో బాధ కలిగిస్తూంటుంది. నేను నేనుగా ఆరోజు ప్రొద్దున్న ఆమె ముందు నా మంచంమీద ఛాయ కనిపించింది."

చీకటి పేరుకుంటున్నది. ఆ అవస్థలో అతని ముఖ భావాలు మందంగా కనబడుతున్నవి. అతని ముఖం లోనికి చూచాను. అతను కిటికీగుండా రోడ్డుపై పోయే జనంవైపు చూస్తున్నట్టుంది. చాలా విచారకరంగా వుందికూడా. కాని అతనికి రోడ్డుపైన జనం కనిపించటం లేదు. అక్కడ ఎవరూ లేనట్టేవుంది. తన బుఱ్ఱలోనే ఆ అమ్మాయి పిల్లాణ్ణెత్తుకొని ఆనందంగా కిలకిల లాడుతున్నట్టు. తిరిగి ఊహాలనుండి, ఆలోచనలనుండి బయట పడి ప్రారంభించాడు—"సాయంకాలం మామూలుగా ఆఫీసునుండి తిరిగివస్తున్నాను. మా వీధివైపు మలుపు తిరిగాను. ఆమె తన మేడముందు గేటువద్ద నిలబడివుంది. ఆమె కొడుకు, రెండేళ్లవాడు చిన్న బంతితో ఆడుతున్నాడు. ఆమె సరదాగా ఆ ఆట చూస్తున్నది. కొంచెం దూరంగానే ఆమెను చూశాను. ఆగిపోయాను.

ఆమె ఎదుటినుండే ఇంటికి పోబుద్ధికాలేదు. మరో మార్గం గుండా ఇంటికి పోదామనుకుంటూనే సమీపించాను. వెనుకనుండి ఒక కారు హారన్ వినపడ్డది. ఆ సమయానికి కుర్రవాడి బంతి రోడ్డుకు మధ్యగా వెళ్లింది. కుర్రవాడు



వెనకనే పరుగెత్తాడు. ప్రక్కగావున్న నేనుకూడ సరిగా చూడలేదు. దూరానవుండి ఆమె పెద్ద భయంతో కేక పెట్టింది. కాని నా చేతిలో కుర్రవాడు కొద్ది దెబ్బలతో బ్రతికాడు. నా కుడికాలు కారు చక్రం వూపుతో విరిగిపోయింది. నన్ను హాస్పిటల్‌లో జేర్పించారు.

ఒక వారం తర్వాత ఒకసారి నిద్రనుండి లేచేసరికి ఆమె పిల్లవాడి నెత్తుకుని భర్తతో నా మంచం ప్రక్కన నిలబడి వుంది. ఆమె నిండుకన్నీళ్లతో నావైపు చూచింది. పెదవులు వణికాయి. గొంతులో ఏదో చెప్పాలనే ఆతురత. కాని మాటలు పైకి రాలేదు. ఆమె తన బాధను వ్యక్తపరచలేకపోయింది. కన్నీళ్ళే రాల్చింది. ఆమె కళ్ళల్లోకి ఒక నిమిషం ఆనందంగా చూశాను. అప్పుడు తృప్తిగా వుంది. ఆమె భర్తకూడా నా పక్కగా కూర్చుండి తల నిమిరాడు. ఆ విధంగా కుంటితనం,''

ఇక చెప్పలేకపోయినాడు. స్వరంకూడ గద్గదంగా మారినది. కాని అతడు నవ్వుతూ అన్నాడు "అదే ఆమె నన్నుగూర్చి ఆలోచిస్తె''. కాని ఆ నవ్వు నన్నెందుకో బాధ పెట్టింది. బయట చీకటి దట్టంగా పేరుకుంటున్నది. అతని ముఖభావాలు చదువుదామని ప్రయత్నించా. కాని చీకటి. అతనికి ఏదోవిధంగా సమాధానం చెప్పాలని వుంది. "ఆ కుర్రాణ్ణి నేను రక్షించడం ఆమెమీద ప్రేమ వల్లకాదు, అసహ్యంవల్ల. ఆ ఉదయంనుండే ఆమె నాకు అసహ్యం వేసింది. 'నే నతనిని పెళ్ళాడను'—జీతం గూర్చిన విషయాలపైన ప్రేమ. ఆమెచేత తన తప్పును గుర్తింపచేయాలని ఆలోచించాను. కారు ప్రమాదం మంచి అవకాశం చూపింది. ఆ రోజున, నా మంచందగ్గర హాస్పిటల్లో నిలబడి కన్నీరు కార్చినప్పుడే, తన గర్వం, తన అహంకారం తగ్గింపబడినట్లు గుర్తించాను. ఆనంద పడ్డాను. నా కాలు పోవటం నాకు ఈషత్తు బాధకూడ కలిగించటం లేదు. నాకు ఈ జీవితంలో ఇక కోరవలసిందేమీలేదు—

అంతే.'' ఆ గొంతులో జీర పలుకుతూనే వుంది—

"నాకు ఉపశమనంగానే వున్నది. నా బాధ చల్లారింది!'' అని అతను చెప్పేవరకూ అక్కడనుండి నేను కదలలేదు. బయట చీకటి చలిగాలిలోనికి వచ్చాను. మహాకవి 'కోలరిడ్జి', నిద్రపోయేవరకూ జ్ఞాపకం వస్తూనే వున్నాడు.






# కిరణ్ - సాహస కృత్యాలు

* వి. కృష్ణమూర్తి *

[జరిగిన కథ :—కిరణ్ అనే అతను నానా కష్టాలు పడి తన డబ్బుతో నిండి ఉన్న ఒక లైఫ్ బోట్ (Life Boat) తో సహా, ఒక దీవి చేరుకుంటాడు. అక్కడ ఉన్న వాళ్లల్లో ఇద్దరు ముగ్గురు తనకు తెలిసినవాళ్లే! ఆ దీవికి తను ఎక్కివచ్చిన చేప నిజం చేప కాదనీ, చెక్కతో చెయ్యబడ్డదనీ, ఎవ్వరైనా మునిగిపోతూ ఉంటే ఆ దీవివాళ్లు ఆ చెక్కచేపను పంపి వాళ్లను రక్షిస్తారనీ, వాళ్లు ఏమైనా డబ్బు ఇస్తే ఆ దీవివాళ్లు వాళ్లిష్టము వచ్చిన చోటికి ఆ చేపమీద తీసుకు వెల్తారనీ, కిరణ్ తన స్నేహితులవల్ల తెలుసుకుంటాడు.

కిరణ్ వాళ్లకి బాగా డబ్బిచ్చి, తనను తన స్నేహితులను ఇండియాకి తీసుకువెళ్ల మంటాడు. తన డబ్బుతో నిండిన పడవను కూడా ఆ చేపమీద పెట్టుకుంటాడు. త్రోవలో ఆ పడవను నడిపే వాళ్లిద్దరు వాళ్లను చంపి డబ్బు తీసుకుందామనుకుంటూరు. కాని కిరణ్ అతని స్నేహితులూ, వాళ్లని చంపడానికి ఇష్టంలేని ఒకడి సహాయమువల్ల రక్షింపబడ్డారు.

అప్పుడు వింట్, నెల్సన్‌కీ, కిరణ్‌కీ తను అసలు ఆ దీవి ఎలా జేరుకున్నాడో చెపుతాడు. తరువాత నెల్సన్‌ని తనుకూడా ఆ దీవి ఏలా చేరుకున్నాడో చెప్పమంటాడు.

అప్పుడు నెల్సన్ తన కథ చెప్ప మొదలు పెడతాడు. ఇక చదవండి.]

## నెల్సన్ కథ

"నా కథ చెప్పాలంటే చాల పెద్దది. ఐనా చాలా క్లుప్తంగానే చేప్పేస్తాను. నేను మా దేశం—ఇంగ్లండు—వదలి సుమారు 2 సంవత్సరాలౌతున్నాయ్. నాకు దేవునిపైన భక్తీ, విశ్వాసం చాలా వుండేది—ఇది మీకే తెలుసు. నేను బయల్దేరే ముందు ఒక వారానికి మునుపు "కొలంబస్" కథ చదివాను. ఆ కథ చదివినప్పటినుంచీ నేనుకూడా ఒక దీవిని కనిపెట్టాలనుకొన్నాను కొలంబస్ లాగ. నాలుగు రోజు

లయ్యాక ఒక రాత్రి కలలో దేవుడు కనబడి యిల్లా అన్నాడు:

"నెల్సన్! అమెరికాకీ, ఆఫ్రికాకీ మధ్యలో ఒక దీవి వుంది. అది యింకా యెవ్వరూ కనిపెట్టలేదు. నీవు వెంటనే బయలుదేరి ఆ దీవిని చేరు. దానికి "జెఫ్ఫోనా" అని పేరు పెట్టు." నాకు మెలకువ వచ్చింది. నాకీవిధంగా రెండు మార్లు అనుభవం అయింది. కాబట్టి ఆ దీవిని కనిపెట్టాలని నిశ్చయించుకొన్నాను.

ఉదయం లేస్తూనే దేవునికి మ్రొక్కాను. తర్వాత నా స్నేహితులకి చెప్పి వాళ్లనికూడా రమ్మన్నాను నాతో.

"ఏదో దీవిని కనిపెడ్తాడట! మనం సాయం చేయాలట! బాగుంది. పిల్లా గిల్లా, భార్యా గీర్యా వుంటే వాళ్లని వదిలేసి వీడితో పోవాలట! మేం రాం. ఆ దీవి నీవే కనిపెట్టుకో పో!" అన్నారు వాళ్లు.

నాకు నిరుత్సాహం వేసింది. అయినా ఆశ వదలలేదు! పట్టు విడువలేదు. "నాతోబాటు వచ్చారంటె మీకు ఎంత డబ్బయినా ఇస్తాను. వస్తారా?" అన్నాను. డబ్బు పిచ్చిలేని వాళ్లుంటారా? "సరే, వస్తా" మన్నారు.

ఒక చిన్న ఓడ సిద్ధం చేశాం. అందులో ఏమైనా చిల్లులు ఉన్నాయా? అని చూచాము. ఏమీ లేవు. సరే, ఒకనాడు మా ప్రయాణం నిశ్చయించాము. కావలసిన ఆహారమూ, పండ్లూ, నీళ్లూ అంతా ఒక సంవత్సరానికి సరిపోయేలాగు తీసికొని బయలుదేరాం. ఆ ఓడలో జాక్‌విల్స్ అనే స్నేహితుడుకూడా వచ్చాడు. చాలా పొడుగైన మనిషి. వానికున్న బలం ఎవ్వరికీ లేదు. ఆ "జెఫ్ఫోనా" అనే దీవి యెక్కడుంటుందో సుమారుగా వూహించి—మాకు సులభంగా వుండటానికి—ఒక ఛార్ట్ తయారుచేశాం. ఆ ఛార్ట్‌ను జాక్‌విల్స్ తీసికొని జాగ్రత్తగా వుంచాడు. మా ఓడని దక్షిణంగా ప్రయాణం చేయిస్తున్నాం. చాలా రోజులు గడిచాయ్. ఎక్కడా నేల కనబడలేదు. కనబడే సూచనలూ లేవు. క్రమంగా ఓడలో అందరికీ వుత్సాహం తగ్గుతూంది. జాక్‌విల్స్ కూడా క్రమంగా నిరుత్సాహపడ్డాడు. నేల కనబడుతుందని చెప్పి వాళ్లకి వుత్సాహం కల్గజేసాను. ఓక రోజు గడిచింది. రెండు రోజులయ్యాయ్. అంతా నీటిమయంగానే వుందిగాని నేల కనబడలేదు.

అర్ధరాత్రి సమయం. నా పడక గదిలో నిద్రపోతున్నాను. పాదాల చప్పుడు వినిపించింది. కండ్లు తెరిచాను. అమ్మయ్యో!!! నా చుట్టూరా



ఎంతోమంది—నన్ను చంపేవారిలాగ—నించొని వున్నారు. నాకేమీ తోచలేదు. లేచి కూర్చున్నాను—నిద్రమత్తులో.

"దీవి కనిపెడ్తానని చెప్పి మమ్మంతా మోసం చేసి తీసుకొచ్చావ్. పైగా రెండు రోజుల్లో నేల చూపిస్తా నన్నావ్. ఏదీ నేల ? మర్యాదగా వెనక్కి తిరుగుదాం. లేదని అడ్డగించావా— ఇద్గో చూడు చుట్టూ! జాగ్రత్త!" అని ఒక కంఠం గంభీరంగా పలికింది. చిర పరిచయంచేత ఆ కంఠం జాక్‌విల్సన్‌ది అని తెలిసింది. అంతటి స్నేహితుడే ఇల్లా అంటున్నాడే! అన్పించింది. ఇల్లా అన్నాను:

"జాక్! నీవంటి ప్రాణస్నేహితుడే ఇల్లాగ అంటుంటే, చాల దుఃఖంగా వుంది."

"ప్రాణ మిత్రుడైతే మాత్రం! నమ్మించి ద్రోహం చేసేవాళ్లు ప్రాణ శత్రువులు కాని మిత్రులుకారు—"

"ఐతే నేను నమ్మకద్రోహం చేశానం టావా ?"

"సందేహమేమి ? తప్పక నేల వొస్తుంది.... వొస్తుంది అని ఏవో కబుర్లు చెప్పావ్. ఎక్కడా నేల ? చూపించూ!"

"విల్సన్! అవసరపడకు. ఏ నాడో దీవి చేర్తామనే ఇంకా అంటాను. ఓర్పు ఉండాలి."

"మళ్లా అదే అంటున్నావ్. పోనీ, రేపు సాయంత్రందాకా చూస్తాం. నేల కనబడిందా— సరి. లేదా నీ గతి రేపు రాత్రి యిల్లాగే ఔతుంది." నేను తల వూపాను. వాళ్లంతా వాళ్ల వాళ్ల చోట్లకు పొయ్యారు. నాకు నిద్ర రాలేదు. "ఓ దేవా! ఆనాడు నీవు కనబడి పల్కినవి నిజమైతే రేపు ఉదయంలోగా మేమా దీవిని చేరాలి" అని వేడాను. రెండు గంటలు కూడా కాలేదు. పక్షుల కూతలు వినవచ్చాయ్! అమ్మయ్య! దీవిని చేర్తాం! ప్రాణం దక్కుతుంది. అందర్లో వుత్సాహం కల్గింది. అప్పటికి ఇంకా చీకటిగానే వుంది.

బాగా తెల్లవారింది. అంతా ఓడ దిగాం. అదే "డెస్పోనా" అనుకొన్నాం. అక్కడ ఎవ్వరూ లేరు మేం తప్ప. చెట్లు దట్టంగా వున్నాయ్. కాని అక్కడేదో చెడ్డవాసన వేస్తూంది. ఆ వాయువువల్ల ఇద్దరు మరణించారు. ఇది నివాసయోగ్యం కాదు. ఇంగ్లాండుకి వెళ్లిపోదాం అన్నాడు జాక్‌విల్సన్. కాని "యీ దీవినంతా చూచి ఒక ఛార్ట్ సరిగ్గా తయారు చేసి ఇంగ్లాండుకి తీసుకుపోదాం. తర్వాత ఔషధాలు తీసుకొని వద్దాం" అన్నాను. వాళ్లు వినలేదు. నేనూ నా పట్టు విడువలేదు. ఆఖరుకి నే నక్కడంతా చూచిగాని రానని చెప్పేశాను. "సరే, నువ్వెలాగేనా చావు" అని వాళ్లు నన్ను ఆ దీవిలోనే వదిలేసి వెళ్లిపోయారు ఓడమీద. నే నొక్కడ్నే ఆ దీవికంతా! దేవుణ్ణే యిరవై నాలుగు గంటలూ ధ్యానిస్తూండేవాణ్ణి నాకేమీ రోగాలు రాకుండా ఉండాలని. ఎల్లప్పుడూ దైవనామస్మరణవల్ల నా దేహాన్ని ఆ దీవిలోని చెడ్డ వాయువు సమీపించలేకపోయింది. ఆహారము—ఏదో రెండు ఆపిల్స్ ఇచ్చారు. అదే తిన్నా అంతే. ఆ నాడంతా పస్తున్నాను. ఆ నాడు రాత్రి నేనొక చెట్టుక్రింద ఇసుకలో పడుకున్నాను. రాత్రి కలలో దేవుడు కనబడ్డాడు— మీకు నమ్మకం లేక పోవచ్చును—" నెల్సన్!

నీ పట్టుదలకి మెచ్చాను. నీకు అవశ్యం కార్యసిద్ధి కల్గుగాక! కాని, నెల్సన్! ఒక మాట! నీ వనుకొన్నట్లు ఈ దీవి "జెఫ్ఫోనా" కాదు. ఇంకా కొంత దూరంలో వుంది. ఏదో ఒక చెట్టు పట్టని నావగా తయారు చేసికొని రేపు ప్రొద్దున్నే బయలుదేరు." అన్నాడు. లేచి కూర్చున్నాను. ఇది నే ననుకొన్నట్లు "జెఫ్ఫోనా" కాదని దేముడన్నాడు. మరి "జెఫ్ఫోనా" ఎంత దూరమో! ఒక చెట్టు పట్టని చాలా కష్టంతో



తీశాను. ఒక చిన్న నావలా తయారుచేసి నీటిలో వేసి నేను కూచున్నాను—ఆ నావ వెళ్లుతూంది. మధ్యాహ్నం అయ్యేసరికి ఒక రేవు—అదే మన చెక్కచేప—ని చేరింది. అది దీవేనేమో అనే ఆదుర్దాతో దానిపైన యెక్కి కూర్చున్నాను. అది తిన్నగా మనం కలుసుకొన్న దీవిని చేరింది. అదే వొకవేళ "జెఫ్ఫోనా" ఏమో అనుకున్నాను. కాని అక్కడ యెవ్వరూ వుండరు కదా! ఈ దీవిలో ఎవరో వున్నారు. కాబట్టి ఇది "జెఫ్ఫోనా" కాదని నిశ్చయించాను. ఆ దీవివాళ్లు నన్నెంతో చాకిరీ చేయమనేవాళ్లు. ఇక "జెఫ్ఫోనా" వద్దురా దేముడా, ప్రాణాలు దక్కితే చాలు అనుకొన్నాను. కొన్ని రోజులకే వింట్‌కూడా వచ్చాడు. నా కథ ఇంతే ఇంతదాక. ఇకమీద ఎల్లాగో!

"ఈ పడవ యేమి ఇంకా నేలని సమీపించ లేదే!" అని నెల్సన్ తన కథ ముగించాడు.

వాళ్ల పడవ సముద్రంలో పోతూంది. ఏ వేపు—ఏ దేశానికి—పోతుందో వాళ్లకి తెలియదు. ఎల్లాగ తెలియగలదు? ఏవో తమాషాలు చేసుకొంటూ పోతున్నారు. పడవలో ఎక్కేందుకు ముందు ఆ పడవవాళ్లు తెచ్చిన ఆహారం ఇంకా కాస్త మిగిలి వుంది. దానితోనే వాళ్లు ముగ్గురూ రెండురోజులు గడిపారు. ఇక రెండురోజులకి మాత్రమే వుంది ఆహారం. తర్వాత పస్తు పడాల్సిందే! ఏదో పొద్దుపోని మాటలు మాట్లాడుతూ పడవలో పోతున్నారు.

ముగ్గురూ ఒక్కసారి సంతోషంతో పొంగారు. దూరంలో ఒక పెద్ద భూమి కనబడింది. అదే ఇండియానేమో! ఇక భార్యా పిల్లలు తననిచూస్తూనే ఏం మాట్లాడుతారో! అని కిరణ్ అనుకొంటున్నాడు. ఆ దీవిని సమీపించింది వాళ్ల పడవ. ఎన్నిరోజులకి తిరిగి మాతృభూమి చేరగల్గామని కిరణ్ వుప్పొంగాడు.

పడవ ఆ దీవి గట్టున ఆగింది. ముగ్గురూ ఆ పడవని లాగి దీవిలోచేర్చి తాముా దిగారు. ఆ దీవిలో ఎవ్వరూ లేరు....అది ఇండియా కాదు.... ఏదో అయోమయమైన దీవిగా కనబడింది....

ఆ దీవి ఇండియాకాదని తెలుస్తోనే నెల్సన్ ఇల్లా అన్నాడు. "కిరణ్! వింట్!! బహుశా ఈ దీవే "జెఫ్ఫోనా" ఏమో!"

"ఇప్పుడే అలసి వచ్చాం. ఈరోజు విశ్రాంతి తీసుకొందాం" వింట్ అన్నాడు.

సరే అన్నారు కిరణ్, నెల్సన్‌లు.

ఆనాడు రాత్రి అది "డెప్ఫోనా" అని నెల్సన్‌కి తెలిసింది. ఆ సంగతి తన స్నేహితులకి చెప్పాడు.

మర్నాడు వుదయం లేచి వాళ్లు ఆ దీవి ఛార్ట్‌ని గీయాలనుకొన్నారు. కాని కలం-కాయితం?

ఆ దీవిలోని ఒక చెట్టు పట్టపైన ఒక ఆకు రసంతో ఆ దీవి ఛార్ట్ గీచారు.

ఆ దీవి చాలా పెద్దది. ఆ దీవిలో ఎన్నో ఆపిల్ చెట్లు వున్నయ్. కిరణ్, వింట్, నెల్సన్‌లు



ఆపిల్ పండ్లను పొట్టనిండా తిన్నారు. చెట్లు అన్నీ ఎత్తైనవి. ఆ దీవి 22° దక్షిణ 'అక్షాంశ రేఖ (22°S); 41° ప. దీర్ఘాంశ రేఖ (41°N) లలో వుంది.

వాళ్లు ఆ దీవినంతా చూచి "డెప్ఫోనా" అని పేరుపెట్టి మళ్లా ఆ పడవలోకి ఎక్కి నీళ్లలోకి దిగారు. సముద్ర ప్రయాణం! ఈ సారి చాలా ఎక్కువగా ఆపిల్స్ తీసికొని పడవలో వేసికొని కావలసినపుడు తింటున్నారు. ఇల్లాగ 2 రోజులు గడిచాయ్.

మూడవరోజున వాళ్లొక ఓడని చూచారు. తెల్ల గుడ్డని గాలిలో జెండాలాగ ఎగరవేశారు— వింట్ చేసినలాగ. ఆ ఓడ వాళ్లు ఎల్లాగో ఓడ మీద వీళ్లని ఎక్కించుకొన్నారు. మళ్లా ఓడ!! ఆ ఓడ యిండియాకు పోతూందని తెలిపారు. కిరణ్‌కి సంతోషమైంది. నెల్సన్, వింట్‌లుకూడా కిరణ్ వెంట వెళ్లారు.

ఆ ఓడలోని వాళ్లంతా వీళ్ల అనుభవాలు విని ఆశ్చర్యపడ్డారు. కొన్నిరోజుల్లో ఓడ ఏడన్ని చేరింది. తన ప్రాణాలు కాపాడబడ్డందుకు కారణం ఈ రేవేనని కిరణ్ తన స్నేహితులకి చెప్పాడు.

మరికొన్ని దినాలలో ఆ ఓడ బొంబాయిని చేరింది. ఓడనించి కిరణ్ దిగాడు. అతనితో బాటు నెల్సన్, వింట్లుకూడా దిగారు. కిరణ్ తిన్నగా తన యింటికి తీసుకుపోయాడు తన స్నేహితులని.

కిరణ్ వచ్చాడని తెలిసి పాజ్ కిరణ్ ఇంటికి సంతోషంతో వచ్చాడు.

"ఏం కిరణ్! ప్రపంచ ప్రయాణం ఎల్లా గడిచింది?" అని అడిగాడు.

"ఓ, చాలా బాగా ఉండింది." అని కిరణ్ తన కథనంతా చెప్పాడు.

"మరి విందు ఏర్పాటుచేయిరా!"

"ఓ, తప్పక."

మరుసటిరోజే విందు! అందరూ పోవచ్చునట!! వెళ్లండి అందరూ. పంచభక్ష్య పరమాన్నాలు దొరకుతాయి. ఇదే తరుణం అందరూ—ఈ రేషన్ కాలంలో—ఈ విందు ఆరగించండి!

* సమాప్తం *

★

# అందరానిది—అడగరానిది

శ్రీ బి. వి. నరసింహారావు

అమ్మకడుపున ముగ్గురూ
అందగాళ్లు కుమాళ్లూ
'అందు అమ్మకు ఎవనిపై
ఆదరంబది ఎక్కువ ?'
అన్న విషయము తెలుసుకో
నందరానిది, అడగరానిది.

ఒకడు రాతిరి నిద్రపో
తున్న వేళనె మనసులో
"అమ్మకన్నిట సాయమే
నవుసరంబ"ని తలచెనూ
తిరిగి నిద్దుర లేచువేళకు
అరిగె నెటకో వానియోచన.
ఒకడు అమ్మతో మాటగా
ఒప్పుమీరగ ఇట్టులనెనూ
"అమ్మనే నీకన్ని పనులూ
ఆచరింతును పుత్రుడనుగా."
అన్న మాటలు పిదప మరచీ
ఆటలాడగ నరిగె నతడూ !
ఒకడు మాత్రము అమ్మకన్నిట
సకలసాయము చేసె నిజముగ:
మనసుచేతను మాటచేతను
పనులచేతను తనయులట్టుల
సేవచేసిరి అమ్మకందరు
చెప్పుమెవడో అధికుడందున ?
అందు అమ్మకు 'ఎవనిపై
ఆదరంబది ఎక్కువ'న్నది
అడగరానిది అందరానిది:

★

# కల్యాణి

* శ్రీమతి శశిరేఖ *

అప్పల నరశింహానికి కల్యాణి అంటే యిష్టం.

కల్యాణిలోనే ఐక్యమయ్యాడు అప్పల నరశింహం.

ఉదయాది అస్తమయ పర్యంతం రాత్రి రెండు ఝాముల దాకా అతడు కల్యాణి ఆరాధనలోనే కాలం గడిపేవాడు.

అప్పల నరశింహం నోరువిప్పితే కల్యాణి పుట్టిపడేది. అతడు దేవతార్చన చేసేవాడు.

ఆ దేవతార్చనకూడా కల్యాణి పరంగా చేసేవాడు. కల్యాణిని వేరుచేసి అప్పల నరశింహం మరిలేడు.

అప్పల నరశింహం కల్యాణికోసమే జీవిస్తూన్నాడు. కల్యాణికూడా అప్పల నరశింహంతో ఐక్యమైపోయింది.

అప్పల నరశింహంలో ఐక్యమైన కల్యాణి రూపొంది ప్రౌఢయై, జాణయై యావద్మానవలోకాన్ని ఆకర్షించడం మొదలెట్టింది.

అప్పల నరశింహం కల్యాణికి కల్గిన ఆకర్షణశక్తి చూసి సంతోషంతో సగర్వంగా చిరునవ్వు నవ్వుతూండేవాడు.

పరిచయస్తులెవరేనా వచ్చి మీ కల్యాణి యెంత బావుంటుందండి అంటే పున్నమరేయి సముద్రపుటల్లా పొంగిపోయేవాడు అప్పల నరశింహం.

అప్పల నరశింహానికి ఎన్నో రాజాస్థానాలనుంచీ, ధనికవర్గాలనుంచీ ఆహ్వానాలు వచ్చేయి.

అవన్నీ అప్పల నరశింహం కోసం కాదు.

కల్యాణికోసమే.

కల్యాణిని తన కూతురుకి నేర్పమని ఎంతమంది అడిగినా, ఎంత డబ్బిస్తామన్నా కల్యాణినిమట్టుకు నేర్పేవాడు కాదు.

★

# వార్ధక్యాన్నీ మృత్యువునీ వెనక్కి నెట్టగలమా!!

స్టాలిన్ బహుమతి పొందిన ప్రొఫెసర్ ఓ. బి. లెపిషెన్‌స్కాయా, తను రచించిన "జీవకణం పొరలు, వైద్య, జీవశాస్త్రాలలో వాటి ప్రాముఖ్యత" అనే గ్రంథములో, వార్ధక్యాన్నీ, మృత్యువునీ, వెనుకకు నెట్టటంమీద తాను ఇటీవల చేసిన పరిశోధనలను గూర్చి యీ క్రింది విధంగా వ్రాశారు:—

"మన శాస్త్రవేత్తలకు తెలిసినంత మట్టుకు చాలమంది శతవృద్ధులు శారీరకమైన వార్ధక్యంవల్ల చనిపోలేదు; కాని అకస్మాత్తుగా సంభవించిన వివిధ రోగాలవల్ల మరణించేరు. కాబట్టి వార్ధక్యంవల్ల సంభవించే మృత్యువును చాలకాలం వరకూ దూరం చేయవచ్చును."

ప్రాణి ముసలిదైపోకుండా చేయడానికి పద్ధతులేమిటి? మార్గాలేమిటి?

"వార్ధక్యాన్ని తొలగించడానికి ప్రయత్నించడమంటే నిత్యమూ శరీరశక్తి సృష్టిని వృద్ధిచెయ్యడమేనని నా వుద్దేశం. వృద్ధాప్యానికి గల ఒక కారణాన్ని జీవకణం పొరలలో కలిగే మార్పుల్లో వెతికిచూడాలి. సజీవ పదార్థం పెరుగుదల గురించీ అందులోంచి జీవకణాల ఉద్భవం గురించీ నే కనిపెట్టిన సిద్ధాంతాన్నే ఆధారంగా పెట్టుకుని, ప్రాణి యొక్క కార్యకలాపం మాంసకృత్తులు చెదిరి వుండడం మీదనూ, అవి విద్యుద్భరిత మవడం మీదనూ, కాబట్టి శరీర శక్తి సృష్టిమీదనూ ఆధారపడి వుంటుందని సూత్రీకరించేను. మాంసకృత్తు పరమాణ సముదాయం అధికంగా విద్యుద్భరితమైతే శరీర శక్తి సృష్టి అధికమౌతుంది. తత్ఫలితంగా మానవుని శరీర పుష్టి అధికమౌతుంది.

"వృద్ధాప్యాన్ని తొలగించాలంటే మాంసకృత్తులు ముద్దకట్టకుండా అరికట్టాలి. ఎందువల్లనంటే అది శరీరశక్తి నిర్మాణ కార్యానికి అడ్డు తగులుతుంది. జీవకణం పొరలు ముసలి తనంతో కృశించకుండా చూడాలి. త్వరగా వచ్చే వృద్ధాప్యాన్ని తొలగించడానికి సోడియమ్ బైకార్బొనేట్ పదార్థంతో మేము చేసిన పరిశోధనలు మంచి ఫలితాల నిచ్చేయి.

"ఈ పరిశోధనలన్నీ ఆస్పత్రులలో పరీక్షింపబడేగా,



ప్రొఫెసర్ ఓ. బి. లెపిషన్ స్కాయా

సోడియమ్‌బైకార్బొనేట్ స్నానాలు మాంసకృత్తులు విడి విడిగా సర్దుకోవడాన్ని అధికం చేస్తాయనీ, కృశించిపోతూన్న జీవకణం పొరలు పొంది, దశసరిగా తయారవడానికి తోడ్పడతాయనీ స్పష్టమైంది. జీవకణాలు పునర్జీవింపబడ్డ శరీరశక్తి పెంపొందుతుంది. కండరాల అలసట తగ్గిపోతుంది; లైంగిక మాంస గ్రంథుల శక్తి అధికమౌతుంది. క్రొవ్వు తగ్గిపోతుంది; మనిషి ఆరోగ్యం బాగా అభివృద్ధి అవుతుంది.

"నిజమే, ఇది సర్వరోగ నివారిణి కాదు. ప్రాణి పెరుగుదలలో సంభవించే గుణాత్మకమైన మార్పులనుండి పరిశోధకుడు తన పరిశోధనను ముందుకు సాగించాలి. ప్రాణి అభివృద్ధికి అనుకూల పరిస్థితులను సృష్టించడమంటే జీవకణాలనూ ధాతువులనూ పునరుద్ధరించడానికి మార్గం కనిపెట్టడ మన్నమాట. త్వరగా శరీర శక్తి సృష్టి జరు

(తరువాయి 48వ పేజీలో)

# ధర్మన్న తాత

* శ్రీ భమిడిపాటి అనంత శ్రీకృష్ణమూర్తి *

ధర్మన్న తాత ధర్మరాజు. ముడుతలు పడ్డ ముసలి. గాలికి కొట్టుకుపోయే నాల్గు పరవల పిలక—ఎండుగడ్డిలా పండిపోయిన గడ్డం—ప్రశాంత విశాల వదనం. చిరునవ్వులు చెరిగే పెదవులు—ఆ వూళ్ళో అందర్నీ ఆనందింప జేస్తాయి. న్యాయదేవత తాండవిస్తూ వుంటుంది ఆ హృదయ క్షేత్రంలో—అనంత అనురాగ ఆరాధనా జ్యోతి వెల్గుతూ వుంటుంది ఆలోచనల్లో — ముద్దులు మూటకట్టే మాటలు—కరుణారస పూరిత వచనాలు—ఉపదేశ—ఉపకార—ఉపశాంత ఉద్బోధనాలు...తాతకి తల్లి తండ్రులు. అందువల్లనే అతడంటే ఆ వూళ్ళో అందరికీ ఆదరమూ, అభిమానమూ. అతన్ని చిన్నలంతా 'తాత' అని, పెద్దలంతా 'ధర్మన్నా' అని పిలిచేవారు. ధర్మన్న తాత అన్నివిధాలా ధర్మరాజే...పరమాణువు వద్దనుండి బ్రహ్మాండం వరకు తాతని దయగా చూస్తారు. జాలిగా తలుస్తారు. ఆదరంగా మన్నిస్తారు.

తాత ఉదయాన్నే లేచి, ప్రాతఃకాల విధులు తీర్చుకొని, నుదట వీభూది, కుంకుమలు దిద్ది, దేవుడరుగుమీద పాడుతూ కూర్చుంటాడు. ఆ కంఠంలో రామాయణ భారతేతిహాసాలు, పల్నాటి వీరగాథలు, బొబ్బిలి సాహసాలు...అన్నీ అనుసృతంగా, అపశ్రుతులులేని వుపశ్రుతులతో దొర్లిపోతాయి పెద్ద జలపాతంలాగ. పాటలు వింటానికి పసిపిల్ల బాలాది వచ్చేవాళ్లు. ఆ గొంతులో గరుడ గంధర్వ కిన్నెర కింపురుషాదుల కంఠధ్వానులుదయించేవి. ఆ తంబురరావంలో వేణు వీణానిక్వణాలు పలికేవి. ఆ పాటకి శేషులు సైతం తలలూపేవి. పక్షులు వంత పాడేవి. తాత రంగనాథ రామాయణం అతి శ్రావ్యంగా చదివేవాడు. అందలి అంతరార్థాలు అందరికీ అవగాహన అయ్యేలాగు ఆలపించేవాడు. ఇంక భారతం పట్టుపడితే—ఉత్తరగోగ్రహణం, ఘోషయాత్ర, సాగిపోయేవి. దాంతో పిల్లలు కడుపులు చేత్తో పట్టుకొని నవ్వేవారు ఉత్తర కుమార ప్రజ్ఞలు, ధుర్యోధనుని విరాలాపాలు విప్పి చెప్తుంటే. అప్పుడప్పుడు పిల్లలు ఏదన్నా అంటే తాత చెప్పిన వుత్తరుడురా అని తమలో తాము—తాత చెప్పిన వుత్తరుడు కాదురా అని తల్లితండ్రులూ అంటుండేవాళ్లు.

పది పదిన్నరకి గుళ్ళో హారతిస్తూ మ్రోగించే చేగంటు వినబడేది. దాంతో పిల్లలు 'ప్రసాదం' అంటూ ఆలయంల్లోకి అంగలతో పోయేవాళ్లు. "అమాయకులు" అంటూ తాతకూడా లోనికి పోయేవాడు. మిగిలినవాళ్లు తాత ననుసరించేవాళ్లు. హారతి అందరు అద్దుకొని, వడకోప్పురం అందుకొని, ఫలహారాలు తింటూ ఎవరి ఇండ్లకు వాళ్లు పోయేవాళ్లు. అప్పుడు ధర్మన్న తాత చంకన జోలి తగిలించుకుని భగవద్గీతా శ్లోకాలు పఠిస్తూ ఒక వీధి తిరిగేవాడు.

పల్లె ప్రజలు సహజ కరుణశీలు. ఔదార్యం, ధాతృత్వం, వారి సొత్తు. తాతకి పంతాలతో ధర్మం ఇచ్చేవాళ్లు. ఒక వీధికి తిరిగి, తిరిగి గుడి చేరుకునేవాడు. తాను తెచ్చిన వాటిలో కొంత పశుపక్ష్యాదుల కిచ్చి, రాత్రికి కొంత గుప్తపరచి, మిగిలింది భుజించేవాడు. కొంచెంసేపు విశ్రాంతి చెందేవాడు. తిరిగి పశువులను తరలించుకొని వచ్చేవాళ్లు, బళ్లోకి పోయే బొట్టెలు తాతని లేపేవాళ్లు, ఉత్తర కుమార ప్రజ్ఞలు చెప్పమని.

"ఎందుకర్రా తాతకి నిద్రాభంగం కలిగిస్తారు" అనే పరిసర పెద్దలతో, "పాపం, పసి హృదయాలు, వాళ్లకేం తెలుసు. అయినా, వారి హృదయక్షేత్రాలు పరిపాకానికి వచ్చేరోజులు, వాటిని బాగా దున్ని జ్ఞాన బీజాలునాటి, భావి భారత జ్ఞాన క్షామాన్ని నివారించాలి. వారికి ఈ విధంగా కష్టం కలిగించకుండా విజ్ఞానము, భక్తి, అనురాగము, అనురక్తి నేర్పాలి" అని జవాబిచ్చేవాడు. వాళ్లు ఎన్నిసార్లడిగినా విసుగు విరామం లేకుండా, అర్థమయ్యేలాగు బోధించేవాడు. ఇంక సాయంత్రం రాగానే, పొలంనుండి తిరిగివచ్చి, స్నానపానాదులు పూర్తి చేసుకొని పెద్దలంతా అరుగుమీద చేరేవాళ్లు. తాత తంబుర

మీటుతూ భగవద్గీతతో, భాగవత మోపరించేవాడు. ఒకటి రెండు గంటలు కాగానే అందరు లేచి వెళ్లేవారు. ఇంక తాత చూరలో దాచిన చాప, బొంత తెచ్చుకొని ఆ అరుగు మీదనే నిద్రచెందేవాడు. ఆలయాభ్యంతర భాగాలకిపోయి ఎరుగడు తాత. "సదాచార పరాయణుల మనుకునే మాకన్న నీవే వేయిరెట్లధికుడవై యుండికూడ లోనికి రావేమి అని అడిగినవారికి," "ఈ దోషకలుషిత శరీరం లోనికి దేనికి బాబు." అని జవాబిచ్చేవాడు. "మే మెరిగినంత వరకు నీవేమి చేసి యెరుగవు, అల్లాంటి సమయంలో దోషకలుషితం అంటావేమిటి" అని ఎవరైనా అంటే, "నాది భిక్షావృత్తి, ఏనాడు సత్కార్యాలు చేసి ఎరుగను" అని నిర్మమకారం బైటవేసేవాడు. అందరి ఆరాధ్యుడు ఆ పరమశివుడు, భిక్షుకుడే కదా అంటే, తనబోటి పాపిని, ఆయనతో సరిపోల్చకూడద నేవాడు.

ఈ విధంగా గడుపుతున్న తాత ఎక్కడివాడో, ఎవరివాడో, ఆఖరికి ఎప్పటివాడో, అక్కడ పెరిగిన వట వృక్షాలకే తెలియదు. ఏ జాతో, ఏ మతమో, ఏ కులమో...ఎవ్వరికీ తెలియదు. అయినా అతడంటే అందరికీ అభిమానము, ఆదరము. అతని చరిత్ర వినాలని ఎవరూ ప్రయత్నించరు. ఒకవేళ ప్రయత్నించినా "పక్షిలా పెరిగిన నా జీవితానికి చెప్పేందు కేముంటుంద"ని వైరాగ్యం ప్రకటించేవాడు తాత.

ఇంతేకాకుండా, తాత ఎవరికి కష్టమొచ్చినా, సుఖమొచ్చినా, పాలు పంచుకుంటాడు. ఆనందానుభూతులు చూపిస్తాడు. పరితాప పరివర్తనలు పొందుతాడు. ఆజన్మ వైరులు కూడ అతని సమక్షంలో మైత్రితో మెలగుతారు. ఎవరికే అపాయం వచ్చినా ఉపాయంగా తప్పిస్తాడు.

ధర్మన్న తాత ఎందుకలా చేస్తున్నాడో, ఇంత స్వార్థ త్యాగిగా వున్నాడో ఎవరికీ అర్థంకాదు. తాతని అర్థం చేసుకోటానికి వారి జ్ఞానం చాలలేదేమో? అయినా అతడంటే అక్కడ అందరికీ అభిమానమూ, ఆదరమూ.

## 2

ఒకనాటి మధ్యాహ్నం...భిక్షాటనికి వెళ్ళినప్పుడు, ఎప్పుడు వెళ్ళినా, వీధి మొదట్లోనే కేక విని వాకిట్లో వేచివుండే ఒక ఇల్లాలు తలుపు ఓర వాకిలిగావేసి లోన రోదిస్తోంది. తాత సంగతి తెలుసుకుని ఓదార్చాలని అనుకున్నాడు. కాని ధైర్యం చాలలేదు. ఎందుచేతనంటే అది గృహాభ్యంతర భాగం. తొందరపడితే ఏం అపచారం చేసినవాడవుతాడో అని భయపడ్డాడు. మాటాడకుండా కాలు ముందుకువేశాడు, గుమ్మందాటి. కాని మనసు వెనుకకు లాగుతూనే వుంది. ఇంతలో ఏడ్పు ఇనుమడించింది. తాత ఇంక ఆగలేక వెనుతిరిగాడు. తలుపు తీయటానికి ధైర్యం లేదు. చివరకు భారం దైవంమీద వేసి తలుపు తీశాడు. ఆమె తాత జోలికేసి చూస్తూ అలానే కూలబడిపోయింది. పిల్లల్ని కన్న బిడ్డల్లాగు, పెద్దల్ని తల్లి తండ్రుల్లాగు చూసే తాత, ఆమెను లేవదీసి, ఓదారుస్తూ దుఃఖ కారణం అడిగాడు. ఆమె తప్పుచేసినదానిలా తల వంచుకుంది. తాత బుజ్జగిస్తూ కారణం అడిగాడు. చివరికామె చెప్పలేక చెప్పలేక "రోజూ వేసే ఆ కాసిని నూకలు ఈనాడు నిండుకున్నాయి. ఆకలి చంపుకుని ధర్మం చేద్దామంటే అసలు లేనేలేవా నూకలు" అని చెప్తూ తాత చేతుల్లోకి తలపెట్టి ఏడ్చింది. జాలి గుండెగల తాత ధర్మరాజాదులు పడ్డ కష్టాలు అవీ చెప్తూ, "అయితే ఈపూట అన్నం తినలేదన్నమాట" అని అడిగాడు.

"లేదు,"

"మరి బిడ్డలో?"

"వారు తినకుండా, పిల్లలకు ఇచ్చి వెళ్ళారు. అందులోనే ధర్మం చేద్దామంటే, వారి ఆకలే తీరలేదు," అంది బావురుమంటూ.

"పిచ్చిదాన దీనికింతగా ఏడ్వవలసిన పనిలేదు. ఏమీ అనుకోకుండా నా జోలెలోనివి తీసికో" అంటూ బియ్యం అక్కడి చేటలో గుమ్మరించాడు తాత.

"మే మిచ్చేది లేకపోగా, నీ దగ్గరవి తీసుకుంటం, బాగుండదు...వద్దుతాత" అని అంది ఆమె.

"ఎంత అమాయకురాలివమ్మా నీవు. ప్రపంచంలో జీవులు ఒకళ్ళమీద ఒకళ్ళు ఆధారపడి వున్నారు. పరస్పర సహాయం సహజం. నిన్న మీరు మీకున్నదానిలో ఇచ్చారు.

ఇవ్వాళ నాకు కలిగినదానిలో నేనిస్తున్నాను. ప్రపంచం అంతా ఇంతే. ఏదీ శాశ్వతంకాదు తల్లీ. ఇది తెలిసికోలేక ఈ ప్రజ బాధపడుతోంది.” అని అంటూ సాగిపోయాడు తాత.

ఈ చర్యలు దురవగాహ్యాలయ్యాయి, ఇతరులకు. అందుకనే అతడంటే అందరికీ ఆదరమూ అభిమానమూ.

ఇల్లా వుంటుండగా, ఆ వూళ్లో నిప్పంటుకొన్నది. అందరు ఆర్పటానికి ఆరాటంతో, అదుర్దాగా ఆ దిక్కుకు అలముకొన్నారు.

ఇంతలో “అమ్మో...నా పాపడు...నా తండ్రీ... చిట్టినాన్న...అందులో...ఆ మంటలో...బాబూ....” అంటూ వినబడింది. అందరూ అక్కడి కురికారు. ఆమె తన పసిబిడ్డఉన్న చోటు చూపింది. కాని పొగలు చిమ్ముతూ, ఆకాశాన్నంటే అగ్నిని సమీపించటానికి వెరిచారు.

ఆమె మరల మరల రోదిస్తోంది...కాని ఎవరికీ ధైర్యం చాలలేదు.

కొద్ది క్షణాలలో పాపడు, గూటితోసహా దగ్ధం అయిపోతాడు...ఆ తల్లి రోదన మిన్ను ముట్టుతోంది...

ఆ కేక వింటూ తాత ఎక్కడనుండి వచ్చాడు... అమాంతం పద్మవ్యూహంల్లోకి చొరబడ్డ అభిమన్యుడిలాగ, మంటలోకి వురికాడు. అందరూ ఆశ్చర్యపోయారు సాహసానికి. తాత ధైర్యానికి అదిరిపోయారు. “తాతా” అని గొల్లుమన్నారు. తాత తిరిగి వస్తాడో రాడోనని భయపడ్డారు. ఆశలు అరచేతుల్లో ఆల్లాడుతున్నాయి.

ఇంతలో తాత పసిపాపను గుండెల కదుముకొని తూలుతూ వచ్చి పడ్డాడు. నోటమాటలేదు. బిడ్డడు నిరపాయంగా వున్నాడు. కాని తాత అంపశయ్యనెక్కాడు... అనేక వుపచర్యలు చేస్తున్నారు. కాని లాభం శూన్యం... తాత అమరజీవుడయ్యాడు.

ఆ గుడివద్ద అతని ప్రతిమ వెలిసింది...దీపాలవేళ స్త్రీలు, ఉదయాన పురుషులు తాతని తలుచుకునేవాళ్లు. పాపలు ఆడుకునేటప్పుడు—

ధర్మన్న తాత
బంగారుతాత
భారతతాత
ధర్మన్న తాత,
తాత పాడితే
బాధ ఉండవు...
తాతమాటలు
నీతి బోధలు...
ధర్మన్న తాత
బంగారుతాత.

ఎవరికన్నా కొంచెం పడిసెం పడితే తాతవద్దకి గొని పోయి మొక్కుకుంటారు. దాంతో వారికే బాధా వుండదు. ధర్మన్న వారి ఇల వేల్పు...అప్పటికీ...ఇప్పటికీ...ఎప్పటికీ.



# సందేశం

* శ్రీ యస్. టి. ఆచార్య *

(మధుబాల యొక అనాథ, భర్తను కోల్పోయిన నిరాధార నిస్సహాయ : నిరాశానిశిని నింగివైపు చూస్తూ)

నా జీవితమంతా నిశీధమేనా!
విధి వ్రాసిన వ్రాతా పరిశోధనా!
వ్రోడాయెనో యెడద!
గోడాయెనో యొడలు!
తోడేలేని యేకాకిగా!
రాబోకె వసంతమా!
చేరరాకే చైత్రమా!
సుధలీనకో మల్లికా!
మూగవోవో కోయిలా!
మీనవోత్సాహమ్ము
హృదయ జ్వాలా కేల
సెగద్రోసి దిగ్భ్రమింగునో;
రోదసేయకే
వ్యధల బ్రతుకే
దయగనవే! మధుపా!
నావయపంతా, వృధగావలెనా?
నావలపంతా, నాతలపంతా
కలగావలెనా?
ఈ విధి మనవలెనా?
ఇదే నాగతీ, మాతా, భారతీ;
ఇదే నీ మధుబాల, వ్యధలగాధా!
ఈనాటి సంఘమున, నాబోటి విధవకు
ఏనాటికైన, ఆశాతారక లేదా,
నిరాశా జీవితమేనా? మాతా భారతీ!

('భారతీ సందేశం' మధుబాల శూన్యాకాశంలో నుండి ఏదో ఒక దివ్య సందేశాన్ని ఆలకిస్తోంది.)

"ధైర్యమూనవే, నా ముద్దుల మధుబాలా।
ఈ విధి, విధవని, విధి వశమున, నీ తల వ్రాతే।
ఐతే, ఇదే, నీ ప్రభునిక చేకొనవే।
ఇక నీ బ్రతుకే వెలుగులే!
నీ వయసంతా నీ వలపంతా నీ తలపంతా
నీ మనసంతా, నీమనువంతా, నీతనువంతా,
కాంతా!
నీ నవ వరుని యొడిలోన నిలిపి హాయి గడుపవే!
అందాలరాసి సుధలొల్కు మధువు, వలపుల
తూలి పోలించు సృష్టి నీ భర్త!
ఏలుకోవె యిక నీ జీవిత భాగస్థునిగా"



(44వ పేజీ తరువాయి)

డానికీ, నాడీ రోగ విశేషం పెరగకుండా అడ్డుపెట్టడానికీ మార్గం తెలుసుకోవడమన్నమాట. వృద్ధాప్యాన్ని తొలగించడానికి నెత్తురు శరీరంలోకి ఎక్కించడం ఒక మంచి పద్ధతి. మంచి వ్యాయామం, ఆటలు చాల అవసరం.

"బతికున్న ప్రాణి ప్రతీదీ ఎప్పుడూ మారుతూ వుంటుందనీ, "నవయవ్వనంనుండి పండు ముసలి వయసు వరకూ" దాని పెరుగుదలలో అది కొన్నిదశలు దాటి వెళుతుందని మనకు తెలిసిన విషయమే. మనిషి జీవితాన్ని పొడిగించడానికీ, వార్ధక్యాన్నీ, మృత్యువునీ దూరం చెయ్యడానికీ యీ దశలను పరిశీలించడం సోవియట్ శాస్త్ర వేత్తలకు చాల ముఖ్యమైన సమస్య."

—టాస్ వార్తలు.



(33-వ పేజీ తరువాయి)

"సరళా! నీ ప్రేమకు నా సహస్ర ధన్యవాదాలు. నాకు మాత్రం నీమీద ప్రేమ లేదనా. నేను అంత కర్కశ హృదయుణ్ణనుకున్నావా. నేనూ నీకు తెలియజేయలేకే ఇలా ఆవేదన పడుతున్నాను. నీ జన్మదిన పండుగకు రాలే నందుకు క్షమించు. మనసులో బాధపడకు...ఆ...చాలా వేళయింది. వెళ్దాం పద."

సరళ కాలేజీలో చేరింది. రమేశ్ తండ్రిలేక చితికి పోయిన తన సంసారాన్ని ఈదడం కోసరం సరళ తండ్రి దగ్గర గుమాస్తాగా చేరాడు. ఇప్పుడు హైస్కూలు సరళ వేరు, కాలేజీ సరళ వేరు. సెలవులలో ఇంటికి వచ్చిన సరళ రమేశ్‌తో సరిగా మాట్లాడదు. అతడు పలకరిస్తే చికాకుపడుతుంది. ఒక్కొక్కనాడు అతడు అస్వస్థతవల్ల పనికి రాలేకపోతే దుర్భాషలాడుతుంది. సరళ ప్రవర్తనను చూచి రమేశ్ చాలా బాధపడుతూండేవాడు.

"అమ్మగారు! ఈ కవరుపై ఈ అడ్రసు టైపు చేయ మన్నారండి" అన్నాడు పనివాడు. మాట్లాడకుండా అందుకున్నాడు రమేశ్. అందు "ప్రియమైన కుమార్"కు అనుంది. సరళ తనమీద ఎందుకు కోపించుకుంటోందో అప్పుడర్థమైంది రమేశ్‌కు.

ఒకనాడు మరీ అస్వస్థతవల్ల పనిలోకి రాలేకపోయాడు రమేశ్. మరునాడు పోతే "తీసుకునే జీతం నెలయ్యేసరికి మొత్తం ఇవ్వాలి. నెలకు పది రోజులు ఆబ్సెంటు. ఏయ్ రమేశ్! ఇలా ఉద్యోగం చేస్తే దీనికి స్వస్తిచెప్ప వలసి వస్తుంది."

"సరళా! ఒంట్లో అస్వస్థతవల్ల రాలేకపోయాను. క్షమించు."

"మాటిమాటికీ సరళా! సరళా అంటుంటావు. నే నెవరో తెలుసా. ఈ ఇంటి అధికారిణిని. నీ యజమానురాలను."

"క్షమించండి. పూర్వపు మన స్నేహ పురస్కారంగా అలాగన్నాను."

క్షీణించిపోతున్న రమేశ్‌ను సరళ మాటలు, ప్రవర్తన మరీ కృంగదీస్తున్నాయి. ఆఫీసుకు 10 రోజులు సెలవుపెట్టి ఇంటిదగ్గరే మందు పుచ్చుకుంటూ స్వస్థత చిక్కడంవల్ల ఆ రోజు ఆఫీసుకు బయలుదేరాడు రమేశ్. పని చూచుకుం టుంటే ప్యూను కాగితము తెచ్చిచ్చాడు.

"నీ పని మాకు సంతృప్తికరంగా లేనందున నిన్ను పని నుంచి తొలగిస్తున్నాము.

ఇట్లు,
సరళ."

పట్టరాని దుఃఖం వచ్చింది రమేశ్‌కు. ఏకాఏకిని సరళ దగ్గరకు వెళ్లాడు. "క్షమించండి! జ్వరముచే రాలేక పోయాను. అంతమాత్రాన ఉద్యోగంనుంచి తీసివేయడం న్యాయంగాదు."

"మీరు మాకేమీ బోధలుచేయ నవసరంలేదు. బయ టికి నడవండి."

"సరళా! ఆనాడు నీవు నాకు పార్కులో చెప్పిన మాటలన్నీ మరచిపోయావా? అయినా అందులో నీ తప్పే ముంది. పొరపాటు నాది."

"అనవసరంగా వాగకు. బయటికి వెళ్తావా, సెట్టిం చాలా."

"సరళా! నీవేనా మాట్లాడేది. కోటీశ్వరివైనంత మాత్రాన కన్ను మిన్ను తెలియకుండా మాట్లాడుతున్నావు. ప్రశాంతంగా నున్న నా మనస్సును రగుల్కొల్పి నన్ను నాశనము కావించింది చాలక ఈనాడు బయటికి లాగిస్తా నంటున్నావు. నీవే నా స్థితిలో ఉంటే ఎలా ఫీలయే దానివో ఆలోచించుకో. అయినా అదంతా నా భ్రమ. ఇప్పుడు నిన్నిలా పలికిస్తున్నది ధనపిశాచమని నాకు తెలుసు. సాఫీగా నడిచే నా జీవితాన్ని ధర్మోపన్యాసాలు చేసి ముళ్లపొదలా చేశావు. మన బాల్యస్నేహానికి సహస్ర ధన్య వాదాలు. నేటి నీ ప్రవర్తనకూ అంతే. ఇప్పటికైనా తెలు సుకో. వస్తా."

అలా వెళ్లిపోయిన రమేశ్, ఉన్న తన కొద్ది ఆస్తినీ అమ్మి మద్రాసు చేరాడు. అదృష్టదేవత వచ్చి వాని కాళ్ల ముందు పడింది. గొప్ప సినిమా నటుడయ్యాడు. ప్రపంచం లోని ప్రతీ మానవుడిచేత, ప్రతీ పత్రికచేత రమేశ్ గొప్ప నటుడని భావించబడుతున్నాడు, కొనియాడబడుతున్నాడు కూడాను. చిన్న గుమాస్తా ఉద్యోగంలో చీకి విసిగిపోయిన రమేశ్ ప్రఖ్యాత నటునలో ఒకడవటం నాకేగాదు, మీకే గాదు విన్న ప్రతి ఒక్కరికీ శోచనీయమేగా. ఇక సరళ ఆశ్చర్య పడడంలో ఆశ్చర్యమేముంది.

సరళ ఎం.ఏ. చదువుకు మద్రాసు వచ్చింది. గుమస్తా ఉద్యోగంలో ఏహ్యాభావంతో చూచిన రమేశ్‌ను, ప్రఖ్యాత నటుడుగా నున్నపుడు ప్రేమించడం ప్రారంభించింది. ఆ గుడ్డి ప్రేమలో తన్ను వెతుక్కుంటూ వచ్చిన కుమార్‌ను కాలదన్ని అతని ప్రేమను నిరాకరించింది. ఎలాగైనా రమేశ్‌ను కలుసుకోవాలని రెండు మూడు మార్లు వానింటి వద్దకుకూడా వెళ్లింది. కాని కార్యం ఆమెకు వ్యతిరేక మయింది. స్త్రీ ప్రేమ ఎటువంటిదో తెలుసుకొని విరక్తి చెందిన రమేశ్ వివాహానికి విరక్తి చూపుతున్నాడు. మిత్రులెందరో ఇచ్చిన సలహాలనుకూడా వ్యతిరేకిస్తున్నాడు.

ఆ నాడు ప్రఖ్యాత నటుడైన రమేశ్‌కు Welcome. థియేటరులో సాయంత్రం 5 గం||లకు ఆహ్వానమున్నదని తెలిసికొనిన సరళ సరిగా ఆ వేళకు హాజరయింది. స్టేజ్‌కి ముందరనున్న సరళనుచూచి రమేశ్ చూడనట్లూరుకున్నాడు. స్వాగతానంతరం రమేశ్ మిత్రులకు సెలవుచెప్పి ఇంటికి బయలుదేరాడు. కార్లో కూచున్న రమేశ్‌ను ఎవరో పిలిచారు. ఇంకెవరు సరళే.

“Good Morning మేనేజరుగారూ! మీ రిక్కడే ఉంటున్నారా? నా ఉద్దేశ్యం ఇక్కడ చదువుకుంటున్నా రనుకుంటాను. ఆ...చాలా పనులున్నై. వస్తాను.”

అని కారు స్టార్టుచేశాడు రమేశ్. సరళ ఎంత పిలిచినా సమాధానము లేకుండా వెళ్లిపోయాడు.

ఎలాగైతేనేమి మిత్రుల ప్రోత్సాహంవల్ల, బంధువుల ప్రోత్సాహంవల్ల వివాహానికి అంగీకరించాడు రమేశ్.

“ప్రఖ్యాత నటుడైన మిస్టర్ రమేశ్‌కు, ప్రఖ్యాత సినిమానటి మిస్. వనజకు డిసెంబరు 18వ తేదీ రాత్రి 8 గం||లకు వివాహం జరుగుతుంది.”

అని తనకు వచ్చిన శుభలేకను చూచి నాలుగు వేడి కన్నీటిధారలు వదలింది తన మూర్ఖ ప్రవర్తనను నిందించుకుంటూ.





వాహినీవారి ‘మల్లీశ్వరి’లో

రమణ, మల్లిక



భానుమతి

# మదరాసు సంగీత కళాశాల, గోపాలపురం

నిర్వాహకులు :

శ్రీ ద్వారక పార్థసారథిగారు, శ్రీమతి ద్వారకా పార్థసారథిగారు

## చరిత్ర

1943వ సంవత్సరములో ఒక్క విద్యార్థినితో ప్రారంభమైనది. అప్పుడు ఈ పాఠశాలకు పేరేమియు లేదు. 1946లో విద్యార్థినులు పదిమందివరకు చేరియుండిరి. 1946లో ఒక ఆంధ్ర మిత్రుని ప్రోత్సాహముచే తెలుగు పిల్లలకు అందుబాటులోను, సరియైన పద్ధతిలో నేర్పవలెననెడి ఉత్సాహముతోను కేసరి హైస్కూలునందు "మదరాసు సంగీత కళాశాల" అను పేరుతో స్థాపించబడినది. ప్రారంభోత్సవమునకు శ్రీ విస్సా అప్పారావుగారు అధ్యక్షత వహించిరి. ప్రొఫెసర్ పి. సాంబమూర్తిగారు ఉపన్యసించిరి. మొట్టమొదట ఒక నెలవరకు సుమారు 120 విద్యార్థి విద్యార్థినులు చేరిరి. మాతో మా తెలుగు స్నేహితుడుకూడ సంగీత విద్యాబోధనమును చేయుచుండిరి. మూడు నెలలు కాగానే తెలుగు పిల్లలలో ఉత్సాహము తగ్గి, మాకు రాబడికంటె ఖర్చెక్కువాయెను. కేసరి స్కూలునందు ఈ కళాశాలను జరుపుచున్నప్పటికినీ, మా నివాస స్థలమగు గోపాలపురమునందు మొదటి పాఠశాల జరుగుచునే యుండెను. అభివృద్ధియూ పొందెను. కేసరి స్కూలునందు రాబడి తక్కువై, వ్యయ ప్రయాసలు ఎక్కువైనందువల్ల మా మిత్రుని అనుమతిపొంది ఆ కళాశాల పేరును మా స్వంత స్థానమందుండు పాఠశాలకు పెట్టి రెండవ వార్షికోత్సవమును గోపాలపురం గర్ల్స్ హైస్కూలునందు 25-12-1948న ప్రధాన న్యాయపతి శ్రీ పి. వి. రాజమన్నారుగారి అధ్యక్షత క్రింద జయప్రదముగ జరిపితిమి. ఆ సంవత్సరమునందే వేసవి శెలవులలో రాజమహేంద్రవరములో కళాశాల అధ్వర్యమున "Summer school of Indian Music" ప్రప్రథమమున జరుపబడినది. చాల జయప్రదముగ సాగినది. అప్పటినుండియు ఈ కళాశాల దినదిన ప్రవర్థమానమై 19-1-1952లో ఆరవ వార్షికోత్సవము జరుపుకొన్నది. ఒక్కొక్క వార్షికోత్సవమునకు, త్యాగరాజ ఉత్సవమునకు శ్రీ టైగర్ వరదాచారిగారు, సంగీత కళానిధి శ్రీ ముడికొండన్ వెంకట్రామయ్యర్ గారు, త్యాగ సేవాసక్త శ్రీమతి బెంగుళూరు నాగరత్నమ్మగారు, అభినవ సరస్వతి శ్రీమతి సి. సరస్వతీబాయిగారు మొదలగు గొప్ప విద్వాంసులను రప్పించి మెప్పులను బడసినది. ఉన్నత పదవులలోనుండిన ప్రధాన న్యాయమూర్తి శ్రీ పి. వి. రాజమన్నారుగారు, జస్టిస్ ఎ. ఎస్. పి. అయ్యరుగారు, శ్రీ ఆర్. ఎం. సుందరంగారు I.C.S. శ్రీమతి అమ్మన్నరాజాగారు, అధ్యక్షతలను వహించిరి. ఈ నెలలో జరిగిన 6వ వార్షికోత్సవమునకు ఆనరబుల్ జస్టిస్ W. S. కృష్ణస్వామి నాయుడుగారు అధ్యక్షత వహించిరి. సంగీత కళానిధి శ్రీ టి. వి. సుబ్బారావుగారు బి.ఏ. బి.ఎల్. ఉపన్యసించిరి.

## బోధనా పద్ధతి :

ఈ కళాశాలయందు ఒక్కొక్క విద్యార్థికి వేరువేరుగా సంగీతము నేర్పబడును. వీణ, ఫిడేలు, గాత్రము, గోటువాయిద్యము, నాట్యము ఇవన్నియు పై కళాశాలయందు నేర్పబడును. ప్రతి శనివారమును విద్యార్థుల సంగీత జ్ఞానము పెంపొందించుటకొరకు సాధారణ విజ్ఞాన తరగతులు నడుపబడుచున్నవి. ప్రతి ఆదివారము విద్యార్థులందరు కలిసి పాడుటకును, జంత్ర సమ్మేళనము వాయించుటకును అవకాశము ఇవ్వబడుచున్నవి. గాత్రము విద్యార్థులు విధిగా నేర్చుకొనవలసి యున్నది. ప్రతి మాసాంతరమున "Monthly Concerts" అనునవి జరుపబడుచున్నవి. అందు కళాశాలలోని ఒక్కొక్క విద్యార్థియు ఆ నెలలో తాను నేర్చుకున్న పాఠమును ప్రదర్శింపవలసి యున్నది. మరియు గ్రూపులక్రింద కూడ కొన్ని ప్రదర్శనములు జరుగును. పదునైదు దినముల కొకసారి ఉత్తమ శ్రేణికి చెందిన విద్యార్థినులు రెండున్నరగంటలసేపు కచ్చేరి పద్ధతిలో వారివారి గాన నైపుణ్యము ప్రదర్శింపవలసి యున్నది.

## పరీక్షలు :

ప్రతి సంవత్సరము గవర్నమెంటు లోయర్, హయ్యర్ గ్రేడు పరీక్షలకు విద్యార్థినులు హాజరై అందరును మొదటి శ్రేణిలోనే ఉత్తీర్ణులగుచున్నారు.

## మదరాసు సంగీత కళాశాల

మదరాసు నగరమునందు గౌరవమైన చాల స్థలములలో, బహిరంగ సభలలోను కళాశాల ఆర్కెస్ట్రా తమ గాననైపుణ్యమును చూపి, పెద్దల యొక్కయు, ప్రజల యొక్కయు మెప్పు బడసినది. 1951 సంవత్సరమున తిరువయ్యారులో జరిగిన శ్రీ త్యాగరాజు మహోత్సవములలో త్యాగ సేవాసక్త శ్రీమతి బెంగుళూరు నాగరత్నమ్మగారి ప్రోత్సాహముచేత శ్రీ త్యాగరాజు సాన్నిధ్యముననే కళాశాల విద్యార్థినులు తమ గాన నైపుణ్యమును జూపి, పామర పండితుల మెప్పు బడసిరి.

గత సంవత్సరాంతముననే కొంత నేలను కళాశాల కొన్నది. స్వంత భవనమును కట్టుకొనుటకు ఆశించుచున్నది. దయామయులు, ఉదారులు, కళాశాల కృషికి విరాళముల నిచ్చి తోడ్పడుదురని ఆశించుచున్నాము.

—ద్వారకా పార్థసారథి



## ఆంధ్ర మహిళా సభలో

### రిపబ్లిక్ దినము:

ది 26–1–1952 శనివారం సాయంకాలం 4 గంll నుండి 6 గంll వరకు, రిపబ్లికు దినోత్సవము జరిగినది. మదరాసు సంగీత కళాశాల ప్రిన్సిపాల్సు శ్రీ పార్థసార్థిగారు శ్రీమతి ద్వారక పార్థసారథిగారు, తమ విద్యార్థిని బృందముతో వాద్యగోష్ఠిని జరిపించి సభ్యురాండ్రనానందపరచిరి. కృతజ్ఞతాభిమాన సూచకంగా, కళాశాలకు, ఆంధ్రమహిళా సభ తరపున ఒక చిన్న వెండి పళ్లెము సమర్పింపబడినది.

* * *

### సర్వోదయ దినము:

ది 30–1–1952 బుధవారము సాయంకాలము 4 గంll నుండి 6 గంll వరకు, బాపూజీ పవిత్ర స్మృతికిగాను, సభ్యురాండ్రు, విద్యార్థినులు జేరి సూత్రయజ్ఞము, ప్రార్థన జరిపించిరి.

ఈ సందర్భములో, సభ విద్యార్థినులు కాంగ్రెసు సంఘం తరపున రాజాజీ హాలులో జరిగే అఖండ సూత్ర యజ్ఞములో పాల్గొందురు.




## గీతా జయంతి
### ప్రత్యేక సంచిక

అడ్డగల్లు శ్రీ గీతా ప్రచురణ సమితి పక్షాన ప్రకటితమైనది.
ప్రాప్తి స్థానము అడ్డగల్లు, కర్నూలు జిల్లా.
ప్రత్యేక సంచిక వెల : రూపాయి.
గీతావాణి సాలు చందా నాల్గు రూపాయలు.

ఈ సంచిక గీతా ప్రచారమునందు సిద్ధ హస్తులైనవారి వ్యాసములతో నొప్పుతోంది.

గీతా మహాత్మ్యము పదేండ్ల క్రితము తెలుగు జిల్లాలలో వినబడుతూండేది. గాని యీ నాటి ప్రచార వ్యాప్తి అప్పటిలో లేదు. ఉత్తర భారతములో గోరఖ్‌పూరు నందలి గీతా ప్రెస్సువారు కొన్ని భాషలలో గీతా వ్యాఖ్యానముల సర్వజన సులభ సాధ్యమగు వెలలలో ప్రకటించియు, 'కల్యాణి' పత్రికా ముఖానా, ప్రత్యేక సంచికా ప్రచురణ మూలానా గీతావాణిని మ్రోయించారు.

తెలుగునాటు దక్షిణ జిల్లాలలో శ్రీ మళయాళ స్వాముల వారును, ఉత్తర జిల్లాలలో శ్రీ నోముల అప్పారావుగారును, ప్రతి యింటా దీనిని జాతి, మత, కుల, లింగ భేద రహితంగా పారాయణ చేయించే విషయంలో కృతకృత్యు లగుతున్నారు.

బాలగంగాధర తిలకు, మహాత్మా గాంధీ మొదలగు కర్మ వీరులకు దీని బోధ హృద్గతమై, మొలకెత్తి గీతా రహస్యముననూ, అనాసక్తి యోగముననూ సురభిళ పుష్పాల వికసించినది.

యుద్ధ క్షేత్రాన నిల్చి క్షాత్ర ధర్మమును మరచిన అర్జునునకు కర్తవ్యమును దెల్పు వ్యాజాన, శ్రీకృష్ణుడు సర్వ మానవావళికి ఫలాపేక్షలేని ధర్మ నిరతి యెంత ఘనమో బోధించాడు. జీవితంలో "ఏం చెయ్యాలి" అనే కింకర్తవ్యతామూఢత ఎప్పుడో ఒకనాడు ప్రతి వ్యక్తినీ యెదుర్కొంటూనే యుంటుంది. రణ రంగ మధ్యమందు శోక సంవిగ్న మానసుడై శర చాపాల విడచిన వీరుని యుత్తేజుని జేయుట కుద్దేశింపబడిన యీ గీతా బోధ పాలములో, కాడి బట్టుకొని దున్నుకొనే రయితుకే కానిండు, అంగడి కూర్చున్న వర్తకునకే కానిండు, మరెవ్వరికైనా కానిండు జీవిత పథంలో తన్నెదుర్కొన్న సమస్యలలో సందిగ్ధావస్థలో పడ్డప్పుడు, అట్టివానికి శాంతి చేకూరుస్తుందని గీత మనన చేయువారి స్వానుభవ వాక్కులు. మహాత్ముడు తన తల్లిని చిన్నప్పుడే పోగొట్టుకుంటిననీ కాని గీతే తన తల్లియై నిల్చిందని తెల్పారు—ఆర్థిక ఇబ్బందులతో అర్థంలేని అశాంతిలో వుండేవారి సంసారంలో యీ గీతా పారాయణ యెట్టి శాంతిని గూర్చిందో శ్రీమతి బృందాదేవిగారు వారి స్వానుభవమును యీ గీతా జయంతి సంచికలో వ్రాసారు.

గీతా రెండవ అధ్యాయంలో పేర్కొబడ్డ స్థిత ప్రజ్ఞ లక్షణాలు సర్వజనానుష్ఠేయాలు.

గీతా శాస్త్ర తత్వార్థము భక్తి జ్ఞాన సమన్వితము వివిధ మత సామరస్య కీలకము నను శ్రీ చిరంతనానంద స్వాముల వారి పల్కులయందు సత్యము.

అట్టి గీతా బోధలలోని గూఢ తత్వము విపులపరచి తెలుగువారికి తెలుపునట్టి వ్యాసములతో నొప్పు యీ "గీతావాణి" ప్రతివారు విన దగ్గది. సర్వాంగ సౌష్ఠవమైన సంచికల ప్రచురించి ఆస్తికుల మనముల చూరగొనుట గీతా ప్రచురణ సమితివారి కర్తవ్యము.

* * *

## గ్రంథ సమీక్ష

### పుష్ప బాణ విలాసము

కాకరపట్టు లలితకళా సమితివారి ప్రచురణ

వెల 0—4—0

"పుష్ప బాణ విలాస"మను సంస్కృతమునుండి పెక్కుమంది అనువాదముల జేసిరి. కాని మరల దీనిని వీరేల చేయవలెను? కవికుమారుల యానందమే యీ కృతికి కారణమని ప్రచురణకర్తలు తొలిపలుకులో తెల్పిరి. పద్యము సాపు దేరి మృదుపదముల కూర్పుగల్గి చదువ ముచ్చటగ నున్నది.

ప్రచురణ విధానము బాగున్నది. ఇట్టి చక్కని పొత్తముల సులభ వెలలో నందఱ కందజేయుట సంతోషించదగ్గది.

—"దీనా"

* * *

### శ్రీ టంగుటూరి ప్రకాశం పంతులుగారి జీవితము

రచయిత: శ్రీ వావిళ్ల వేంకటేశ్వర్లుగారు,
వలయుచోటు:
వావిళ్ల రామస్వామి శాస్త్రులు అండ్ సన్స్,
ఎస్ప్లనేడ్, మద్రాస్.
వెల 12 అణాలు.

ఆంధ్ర నాయకులలో అగ్రగణ్యులు, హిందూదేశ ప్రఖ్యాత నాయకులలో నొకరు అయిన శ్రీ ప్రకాశం పంతులుగారి త్యాగశీలత, కార్యదక్షత, స్వార్థరాహిత్యత అందరికీ తెలిసినవే.

ఇట్టివారి జీవిత చరిత్ర ఒక గ్రంథముగా వ్రాసిన శ్రీ వావిళ్ల వేంకటేశ్వర్లుగారెంతయో అభినందనీయులు.

శ్రీ ప్రకాశం పంతులుగారు చిన్ననాటినుండియు సాహసవంతులు. ఆత్మ విశ్వాసం, ఆత్మ మర్యాద గలవారు. ఇవే వారిని రాజకీయ రంగంలో నాయకుని చేసినవి. శ్రీ పంతులుగారి పట్టుదల వారి నొక గొప్ప బారిష్టర్‌గా చేసింది. వీరి త్యాగశీలత, మేధాశక్తి దేశ స్వాతంత్ర్యం పోరాటాలలో దక్షిణ భారతమున వారినొక అగ్రనాయకులుగా చేసింది. వీటినన్నిటినీ ఉదాహరణ పూర్వకంగా శ్రీ వేంకటేశ్వరులుగారి గ్రంథం తెలియజేస్తుంది.

అంతే కాకుండా, కాంగ్రెస్ కుళ్లు రాజకీయాలలో స్వార్థపరులైన కొందరు నాయకులు శ్రీ పంతులుగారిపై పన్నిన కుతంత్రాలు—విశాల హృదయులైన శ్రీ పంతులుగారు, కాంగ్రెస్‌లో ఐక్యతకోరకు, క్రమ శిక్షకు బద్ధులై, ఏవిధంగా వారిని మన్నించి, వారికిపదవుల విషయంలో సహాయం చేయుట—విపులంగా ఈ పుస్తకంలో వ్రాశారు.

ఈ గ్రంథం పూర్తిగా శ్రీ పంతులుగారి జీవిత చరిత్రనే గాక, అప్పటి రాజకీయాలను కూడా తెలియజేస్తుంది. రచనా శైలి పూర్వ పోకడలు కలిగియున్నను, చదువుటకు సులభముగానే ఉన్నది. అచ్చు పరిశుభ్రం. పాకెట్ బుక్ సైజ్. వెల అందరికీ అందుబాటులో ఉంది.

—గి. లక్ష్మీకాంతమ్మ

### సౌభాగ్య వార్షిక సంచిక

వెల 0-8-0

మద్రాసు ప్రభుత్వ స్త్రీ జనాభ్యుదయ శాఖవారు ప్రచురించుతున్న 'సౌభాగ్య' పత్రిక వార్షిక సంచిక (జనవరి 1952) వెలువడింది. 96 పుటల తెలుగు రచనలతోను, 4 పుటల హిందీ రచనలతోను సంచిక నిండుగా ఉంది. శ్రీ జయాదేవి, శ్రీ కంఠయ్య బి.ఏ. వ్రాసిన 'నాయనమ్మ—అమ్మమ్మ' కథ చాలా వినోదకరంగా రసవంతంగా వున్నది. శ్రీమతి నాయని కృష్ణకుమారిగారి 'దేవయాని' మాటలు నేర్చిన దిట్ట. అతి సహేతుకంగా సంభాషించ గలగడేసరి. శ్రీమతి మాలతీ చందూర్ గారి 'నేటి పత్రికలు' శ్రీమతి నీలాబాయి శ్రీశగారి 'చిత్రప్రగతి' ప్రయోజనకరంగా, కనపడతాయి. శ్రీ మల్లంపల్లివారి 'రాణి మీనాక్షి' ఆంధ్రుల పూర్వపు ఔన్నత్యం ఒక్కసారి కళ్లకు తోచేట్టు చేస్తుంది. శ్రీ జాషువగారి 'వంచిత' సహానుభూతిని రేకెత్తిస్తున్నది. సమయోచితంగా వున్నది అభినవ తిక్కనగారి 'దీవన.' శ్రీమతి రాధావసంతగారి 'వసంతం' బొమ్మ గీసినట్లు సుస్పష్టంగా వున్నది. శ్రీ బేతుమళ్లవారి 'స్త్రీలు—కుటీర పరిశ్రమలు' శ్రీ రామగోపాల్ గారి 'స్త్రీలు—చిత్రకళ' అనే వ్యాసాలు స్త్రీలు కేవలం చేతకాని దద్దమ్మలుకారని, వాళ్లలో యెంతో నైపుణ్యం, పరిశ్రమ, కళ యిమిడివున్నవని చాటి చెపుతున్నవి. యువ చిత్రకారిణుల చిత్రాలు, రంగవల్లులు, పాకకళ యెన్నో ఇంపుగా ఇమిడి ఉన్నాయి. కొన్ని రంగు చిత్రాలుకూడా వుంటే ఇంకా సంచిక శోభించేది.

—అ. గిరిజ

Edited and published by G. Durgabai, M.A., B.L., at the Andhra Mahila Sabha, Mylapore, Madras
Printed by M. Satyanarayana at the H. Prachar Press, 12, Thanikachalam Chetty Road, T'Nagar, Madras.

# ఆంధ్ర మహిళా సభ నృత్యశాఖ

## పిల్లల నృత్యం

ఈ శాఖలో శాస్త్రయుక్తమైన తంజావూరు భరతనాట్యము నేర్పబడుచున్నది.

జూనియర్—సీనియర్ తరగతులలో 3 సంవత్సరముల వ్యవధిలో
భరతనాట్యము సంపూర్ణముగా నేర్పబడును.

ప్రవేశ రుసుము—రూ. 2—0—0

సభ్యత్వ రుసుముతో కలిపి

జూనియర్ తరగతికి రూ. 6-0-0 .... సీనియర్ తరగతికి రూ. 8-0-0

నృత్యోపాధ్యాయిని
శ్రీమతి ఎస్. సామ్రాజ్యలక్ష్మిగారు.

---

# ఆంధ్ర మహిళా సభ

## సంగీతశాఖ

ఈ శాఖలో గాత్రము, వీణ వాయిద్యము నేర్పబడుచున్నది.

క్లాసులు సాయంకాలం 4 గంటలనుండి 7 గంటలవరకు

ప్రవేశ రుసుము—రూ. 2—0—0

సభ్యత్వ రుసుముతో కలిపి

వీణ జూనియర్ శాఖకి రూ. 8-0-0 .... వీణ సీనియర్ శాఖకి రూ. 13-0-0

గాత్రం జూనియర్ శాఖకి రూ. 7-0-0 .... గాత్రం సీనియర్ శాఖకి రూ. 11-0-0

సంగీతోపాధ్యాయిని
శ్రీమతి జె. సుబ్బలక్ష్మిగారు.